# కరీంనగర్ జిల్లా
# చరిత్ర - సంస్కృతి



జైశెట్టి వారి ప్రచురణ
జగిత్యాల.


ప్రతులు : 1000
ఫిబ్రవరి : 2003

వెల : **350-00**

ముద్రణ :
నాగజ్యోతి గ్రాఫిక్స్
శివవీధి, జగిత్యాల.
ఫోన్ : 221195, 221695.

ప్రతుల కొరకు
1. సాయిగణేశ్ బుక్‌డిపో, శివవీధి, జగిత్యాల. ఫోన్ : 226445.
2. వాసవి బుక్ డిస్ట్రిబ్యూటర్స్, మంకమ్మతోట, కరీంనగర్. ఫోన్ : 2251982.

చిరునామా
డా. జైశెట్టి రమణయ్య
1-5-29, అరవిందనగర్,
జగిత్యాల - 505 327.
జిల్లా. కరీంనగర్. (ఆం.ప్ర.)
ఫోన్ : 222105 (ఇల్లు), 221500 (షాప్)
www.jagtialj ramanaiah historian.com

# కరీంనగరము జిల్లా మండలములు

మల్లాపూర్
రాయికల్
ఇబ్రహీంపట్నం
సారంగాపూర్
ధర్మపురి
కోరుట్ల
మెట్‌పెల్లి
జగిత్యాల
గొల్లపెల్లి
వెల్గటూర్
మేడిపెల్లి
కథలాపూర్
మల్యాల
పెగడపెల్లి
రామగుండం
ధర్మారం
కొడిమ్యాల
రామడుగు
పెద్దపెల్లి
కమాన్‌పూర్
మంథని
కాటారం
మహదేవపూర్
చందుర్తి
జూలపెల్లి
చొప్పదండి
గంగాధర
ముత్తారం
మల్హర్
ముత్తారం
సుల్తానాబాద్
శ్రీరాంపూర్
బోయిన్‌పెల్లి
కోనరావుపేట
వేములవాడ
కరీంనగర్
ఎల్లారెడ్డిపేట
ఓదెల
మానకొండూర్
వీణవంక
బెజ్జంకి
సిరిసిల్ల
ఇల్లంతకుంట
తిమ్మాపూర్
జమ్మికుంట
కేశవపట్నం
గంభీరావుపేట
ముస్తాబాద్
చిగురుమామిడి
సైదాపూర్
హుజురాబాద్
కమలాపూర్
కోహెడ
ఎల్కతుర్తి
హుస్నాబాద్
భీందేవరపల్లి

# రచయిత



డా. జైశెట్టి రమణయ్య M.A., B.Ed., M.Phil., Ph.D.

## దివ్యాశీస్సులతో

పితామహులు



కీ.శే. జైశెట్టి రాజయ్య

**(1842-1921)**

పితృదేవులు



కీ.శే. జైశెట్టి శివానందం

**(1914-1994)**

## శుభాశీస్సులతో

మాతృమూర్తి



శ్రీమతి జైశెట్టి గంగుబాయి

(జననం **1924**)

# అంకితము



అర్ధాంగి

## శ్రీమతి జైశెట్టి వరలక్ష్మి

**(జననం 1943)**

# విషయసూచిక

## III. చారిత్రక స్థలములు (183-368)

డా. వెలమకన్ని సుందరరామశాస్త్రి
ఆచార్యులు, చరిత్ర-పురావస్తుశాస్త్రశాఖ
నాగార్జున విశ్వ విద్యాలయం
నాగార్జున నగరం - గుంటూరు జిల్లా



## తొలిపలుకు

**(Fore word)**

మిత్రులు జైశెట్టి రమణయ్య గారు తను 'కరీంనగర్ జిల్లా చరిత్ర-సంస్కృతి' అనే పేరున సమగ్ర చరిత్ర, సంస్కృతులను గ్రంథస్థం చేస్తున్నట్లు తెలిపి దానికి నన్ను తొలిపలుకును సమకూర్చవలసిందిగా కోరినప్పుడు నాకు అపారమైన సంతోషం కలిగింది. ఆయనతో నా స్నేహం ఇంచుమించు పాతికేండ్ల వయసు కలది. లక్ష్మీపుత్రునిగా జన్మించినా ఆయన సరస్వతీదేవికి పెంపుడు బిడ్డ అయినాడు. విజ్ఞాన సముపార్జనపట్ల ఆయనకున్న అమితమైన శ్రద్ధాసక్తులు, అధ్యయన, అనుశీలనల్లో అత్యంతమైన ఉత్సుకత, అభినివేశం కల్గినవాడు. కనుక ఆయన పూనిక నాకు అమిత సంతోషకారణం అయింది. ఒక బృహత్ప్రయత్నం తగిన సమర్థుని వలన ఫలప్రదమౌతుంది కాని సామాన్యుని చేత కాదు కదా !

రమణయ్యగారు నన్ను తొలిపలుకు వ్రాసి ఇయ్యమనగా నేను ఆయన వ్రాతప్రతినొకసారి సమగ్రంగా చదవాలని కోరాను. అందులో నా స్వార్థం - అందరికంటె ముందుగా ఆయన గ్రంథాన్ని నేనే చదవాలని కోరిక. అందుకు నన్ను పురికొల్పిన ధైర్యము నాపట్ల ఆయనకున్న అభిమానం. నేను కోరినట్లుగా నాకే ఈ అవకాశాన్ని ఆయన కలిగించడం నా సంతోషానికి మరో కారణం.

సాధారణంగా అందరు అనుకొనే విధంగా చరిత్ర-కథల సంపుటం సరదాగా చదువుకొనేది కాదు. అది జాతి పుట్టు పూర్వోత్తరాలను, వేలాది సంవత్సరాలుగా మానవుని నాగరికతా సంస్కృతుల పురోగమన, తిరోగమన ప్రక్రియలను కార్యకారణ సమన్వయంతో వివరించే తాత్త్విక విధానము. ఈ తాత్త్విక చింతన వైజ్ఞానికం, కేవలం గ్రంథ పఠనం వలన అలవడేది కాదు. కార్యకారణ సమన్వయ విధానంలోని ఆలోచన - ఆలోచన అంటే లోనికి చూడడం - వలన సంపన్నమౌతుంది. అయితే అటువంటి విజ్ఞాన సముపార్జనలో కేవలం తాత్త్విక సిద్ధాంతాలు సులువుగా మనసుకెక్కవు. అందుకు ఆ సిద్ధాంతాల సోదాహరణమైన వివరణ కావాలి. అటువంటి ఉదాహరణలను సమకూర్చి, తాత్త్విక జ్ఞానాన్ని సుబోధకం చేసి మానవుని విజ్ఞానయుతుణ్ణి చేసేది చరిత్ర. ఆ వైజ్ఞానిక వికాసంలో గతాన్ని అర్థం చేసుకోగలిగినప్పుడే మానవుడు తనను తాను గుర్తించి తన వర్తమాన స్థితిగతులను అవగాహన చేసుకో గలుగుతాడు.

అప్పుడే అతడు భవిష్యత్తు పట్ల సరైన కార్యాచరణ ప్రణాళికను రూపొందించుకోగలిగి అభివృద్ధి పథంపై అడుగులు వేయగలుగుతాడు.

అందుచేత చరిత్ర రచన సామాన్యమైన పరిశ్రమ కాదు. సాధికారమైన సాక్ష్యాధారాలను సమకూర్చుకొని వాటిని సమగ్రంగా, సమ్యగ్దృష్టితో సమీక్షించి, నిర్ణయాలు చేయగల్గాలి. ఆ నిర్ణయాలతో కూడిన చారిత్రక విజ్ఞానాన్ని సులువుగా గ్రహించగలిగిన రీతిలో, తగిన భాషలో వ్యక్తపరచాలి. అటువంటి చరిత్ర రచన శిష్యులకు దిశా నిర్దేశం చేసే ఉపాధ్యాయుని రీతిలో సత్యాన్ని ప్రదర్శిస్తుంది. పఠితలను వివేకవంతులను చేస్తుంది. గతకాలపు సాంస్కృతిక వైభవాలను మనోఫలకంపై ప్రదర్శించి, జాతిని ఉత్తేజపరుస్తుంది. నాటి పొరపాట్లను ఎత్తి చూపి, వైఫల్యాలకు కారణాలను వివరించి జాగృతులను చేస్తుంది.

రమణయ్య గారి రచన ఈ నిర్వచనాలకు సంపూర్ణమైన లక్ష్యం. ఎక్కడా ఆయన నడకవేగం తగ్గించి, పిట్టకథలతో పఠితలకు ఒకింత మనోల్లాసం కల్గించాలని అనుకోలేదు. ఆద్యంతమూ శ్రద్ధగా చదివి గ్రహించవలసిన అంశాలతో, వాటిని సూక్ష్మంగా విశ్లేషించే చర్చలతో, ఆచర్చల సారాంశమైన చారిత్రక సత్యాల ప్రతిపాదన, వివరణలతో పఠితలను పరుగెత్తించారు. ఆయన ఆలోచనలకు, భావాలకు అనుగుణంగా, తాను ఏ ప్రాంత చరిత్రను వివరిస్తున్నారో ఆ ప్రాంతపు నుడికారంతో కూడిన చక్కని భాషలో ఈ చారిత్రక విజ్ఞానాన్ని అందించారు. ఇక పఠితలు జ్ఞానాసక్తితో ఆయన అందించిన గ్రంథాన్ని ఆస్వాదించడమే మిగిలింది.

చరిత్ర శిలాక్షరంగా నిలిచి ఉండదు. కాలగర్భం నుండి క్రమక్రమంగా క్రొత్త క్రొత్త సాక్ష్యాధారాలు వెలుగులోకి వస్తుంటాయి. కాలానుక్రమంగా ప్రజల మనోభావాల్లో ఆశలు, ఆసక్తులు, ఆశయాల్లో క్రొత్త ధోరణులు ఏర్పడతాయి. వీటికి అనుగుణంగా ఇతఃపూర్వమైన చారిత్రక విజ్ఞానంలోనూ, దాని పట్ల మన అవగాహనలోనూ తప్పని సరిగా మార్పులు సంభవిస్తాయి. అయితే బహుళంగా నేటి చరిత్రకారులు, చరిత్ర అధ్యాపకులు సైతం అటువంటి అవసరాలను గుర్తించక, వందేళ్ల క్రిందటి లేదా మనకు పాఠాలు చెప్పిన అధ్యాపకులు – వారి అధ్యాపకులు వారికి నేర్పింది వారు మనకు నేర్పితే, దానిని మనం మన విద్యార్థులకు బోధిస్తూ – చారిత్రక విజ్ఞానం జరామరణాలకుగురై నశించే విధంగా ఉదాసీన వైఖరిని కల్గి ఉన్నారు. వారు కనుక ఇటువంటి గ్రంథరచనకు పూనుకొంటే తమకు ప్రామాణికమని తోచిన పది పుస్తకాలలోని విషయాలను పొందుపరచిన పదకొండవ పుస్తకం ఒకటి తయారుచేస్తారు. అటువంటి రచనలో జవసత్త్వాలు ఉండవు. నిస్తేజంగా, నిరాసక్తంగా ఉంటుంది. కాని రమణయ్య గారు అందుకు భిన్నంగా, అధునాతనంగా లభిస్తున్న సాక్ష్యాధారాలను సైతం పరిగణనలోనికి తీసుకొని, చారిత్రక విషయంలో తగు మార్పులను అంగీకరించి, ఈ గ్రంథంలో పొందు పరచారు. చరిత్ర పూర్వ (Pre-historic) యుగాల నుండి మానవ జీవన విధానంలోని అభివృద్ధి పరిణామాలను ఈ గ్రంథంలో వివరించిన రీతిలో – ఆయన చదువుకున్న కాలంలో అవగాహన లేదు. అయితే,

ఆయన తదుపరి కాలంలో ఏర్పడిన చారిత్రక అధ్యయన, విశ్లేషణలను, అందుకు అవసరమైన విజ్ఞాన పరికరాలను (tools of investigation) ఉపయోగించే నైపుణ్యాన్ని సంపాదించారు. ఈ విధమైన ఎదుగుదల కొరవడితే చారిత్రక పరిశోధన అసంపూర్ణం అవుతుంది.

లోగడ రెండు దశాబ్దాల క్రితం వరకు చరిత్ర రచనలు ఆంధ్రులు కృష్ణానదీ ముఖద్వారం వద్ద నివసిస్తూ, సామ్రాజ్య నిర్మాణం చేశారని, ధాన్యకటకం వారి తొలి రాజధాని అని పౌనః పున్యంగా వివరించేవి. కోటిలింగాల, ధూళికట్ట, పెద్దబొంకూరు మొదలైన స్థలాల వద్ద బయల్పడిన పురావస్తు అవశేషాలు ఈ సిద్ధాంతాన్ని నిస్సారం చేశాయి. పురాణ, బౌద్ధ వాఙ్మయాలు గోదావరి తీరాన తొలి ఆంధ్ర జనపదాలైన అశ్మక, మూళక ఏర్పడినట్లు చెపుతున్నా, ఆంధ్రుల తొలి నివాసస్థలం తీరాంధ్రలోనే ఉందనే అంధవిశ్వాసం దాన్ని సమర్థించకున్నా, చరిత్రకారులు అదే సిద్ధాంతాన్ని సాంప్రదాయికంగా విశ్వసించి, తెలుగు జాతిని తప్పుదారి పట్టించారు. రమణయ్య గారు ఈ ఆధునికమైన సాక్ష్యాధారాల సాయంతో ఈ అంధ విశ్వాసపు సంకెళ్లను ఛేదించి చారిత్రక జిజ్ఞాసువులకు కనువిప్పు కలిగించారు. ఈ సందర్భంగా ఆయన తగినంత సుదీర్ఘంగా, సాంగోపాంగంగా పటిష్ఠమైన వాదాన్ని నిర్మించారు. నేనిందాక ప్రస్తావించిన – చరిత్రకారుని ఎదుగుదలకు ఇది ఉదాహరణ. అలాగే సాతవాహన యుగం నాటి నాగరికతా సంస్కృతులను, నాటి వృత్తి సంఘాలు, వర్తక శ్రేణులను గూర్చి రమణయ్య గారు వివరించినంత సుసంపన్నంగా లోగడ చరిత్రకారులెవరూ చేయలేదని గట్టిగా చెప్పవచ్చు. అసలు సాతవాహనులకు పూర్వం చరిత్రపూర్వయుగ, ప్రాక్చారిత్రయుగ (Proto-historic) విశేషాలను కూడా ఆయన వలె సమగ్రంగా వివరించే ప్రయత్నం చెప్పుకోదగినంతగా జరగలేదు. ఈ లోటుపాట్లను రమణయ్య గారు కొంతవరకు భర్తీ చేసి, ముందు తరాలు చేపట్టవలసిన పరిశోధనాంశాలను సూచించారని నా అభిప్రాయం.

సాతవాహనుల అనంతరం, ఆంధ్రజాతిగా భావించదగిన ప్రజాసముదాయాలతో కూడిన జన పదాలను రాజకీయంగాను, సాంస్కృతికంగాను సమైక్యం చేసినవారు విష్ణుకుండినులు. లోగడ చరిత్రకారులు ఈ వంశాన్ని కూడ తీరాంధ్ర ప్రాంతీయులు గానే భావించారు. కాని ఇటీవలి కాలంలో వెలుగులోకి వచ్చిన శాసనాధారాలు, నాణాలు వీరు తెలంగాణా ప్రాంతంలోనే తమ పరిపాలన ప్రారంభించి, తదుపరి తీరాంధ్ర ప్రాంతానికి విస్తరించారని రూఢిగా తెలియవస్తుంది. సాతవాహనుల తరువాత ఒక సువిశాల సామ్రాజ్య నిర్మాతలై ఆంధ్రుల ప్రతిభావిశేషాలను చాటిన ఈ వంశాన్ని గూర్చి రమణయ్య గారు వివరించారు. కాని, ఇంకకొంచెం వ్రాసి ఉంటే ఇంక కొంచెం బాగుండేదని నాకు అనిపించింది.

మధ్యయుగం నాటి ఆంధ్రదేశ చరిత్రలో తీరాంధ్ర ప్రాంతానికి, పీఠభూమికి చారిత్రక వైవిధ్యం ఏర్పడింది. బాదామి చాళుక్య, రాష్ట్రకూట సామ్రాజ్యాల అంతర్భాగంగా పీఠభూమి, వేంగీ చాళుక్యుల పాలనలో తీరాంధ్రము చేరినాయి. ఆ సామ్రాజ్యాల సామంతులై, వేములవాడ

చాళుక్యులు కరీంనగర్ జిల్లా ప్రాంతంలో పరిపాలించారు. ఈ రాజ్యాలను గూర్చి రచించిన వారు పూర్వం నేలటూరి వెంకటరమణయ్య గారే గణనీయులు. మొదటి వారు ఆద్యులు కనుక గౌరవనీయులు. కాని ఆయా చారిత్రక విశేషాలను వివరించిన తీరు, అందుకు ఆయన ఉపయోగించిన భాష అంశాన్ని దురవగాహంగా చేశాయి. జైశెట్టి రమణయ్య గారు స్పష్టంగా, సుబోధకంగా వివరించడాన గౌరవనీయులు. రాజకీయ చరిత్రను వివరించిన రెండవ అధ్యాయంలో అనేక సందర్భాల్లో ఆయన చేసిన వాదనలు, తీసుకొన్న నిర్ణయాలు, వాటిని విశదీకరించిన తీరు అత్యంత ప్రశంసనీయంగా ఉన్నాయి. వాటినన్నిటిని ఇక్కడ వివరిస్తే గ్రంథం కంటె తొలిపలుకు పెద్దదవుతుందేమోనని వదిలేస్తూ, ఆ విశేషాలను చదివి గ్రహించ వలసిందిగా పాఠకులను కోరుతున్నాను.

వాస్తవానికి రమణయ్య గారు గ్రంథస్థం చేయ సమకట్టిన రాజకీయ, సాంస్కృతిక చారిత్రక విషయాలు కరీంనగర్ జిల్లాకు పరిమితమైనవి. కాని ఈ జిల్లాలు ఇటీవలి కాలంలో, పరిపాలనా సౌలభ్యం కొరకు ఏర్పడినవి. ప్రాచీన, మధ్యయుగాల్లోని రాజ్య విస్తరణలు, సాంస్కృత పరిణామాలు ఈ జిల్లాలకు పరిమితమైనవి కావు. వాటిని ఈ పరిమితుల్లో ఇముడ్చడం మాంత్రికుడు ఒక భూతాన్ని మాయాదీపంలో ఇమిడ్చినటువంటి ది. అది అటువంటి జానపదగాథల్లో చెల్లుతుంది కాని, శాస్త్రీయమైన విశ్లేషణతో చేసే చరిత్ర రచనలో సాధ్యంకాదు. ఒక వేళ అటువంటి ప్రయత్నం చేసినా, అది చరిత్ర అధ్యయనానికి దోహదం చేయదు. చరిత్రకారుడు తన ఆసక్తి కొలది, అనుకూలత కొలది ఏదో ఒక ప్రాంతాన్ని ఎంచుకొని పరిమితం కావచ్చు కాని, గిరిగీసుకొని అక్కడే నిల్చిపోవడం తగదు.

ఈ దృష్టితో చూసినప్పుడు – ఈ గ్రంథాన్ని కరీంనగర్‌కు చెందినట్లు నామకరణం చేసినా, రమణయ్యగారు సందర్భానుసారంగా తన జిల్లాను దాటి, తెలంగాణమంతటిని, అంతకు మించి సమగ్రంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి, తన అనుశీలన, అధ్యయనమూ విస్తరింపజేశారు. వాస్తవంగా ఈ గ్రంథం సంక్షిప్తంగానైనా, యావదాంధ్రదేశ చరిత్రను సమగ్రంగా వివరిస్తున్నది. ముఖ్యంగా కుత్బ్‌షాహీ, అసఫ్‌జాహీ కాలాలకు సంబంధించిన విశేషాలను ఆయన చెప్పుకోదగినంత సవిస్తరంగా వివరించారు. కనుక ఈ గ్రంథరచన చేత కేవలం కరీంనగర్ జిల్లా వాసులేకాక యావదాంధ్ర ప్రజానీకము రమణయ్య గారికి ఋణపడి ఉన్నారంటే అది మా స్నేహం చేత అంటున్న మాటగా కాక, ఒక చరిత్రకారునిగా అంటున్నట్లు పఠితలు గ్రహిస్తారని విశ్వసిస్తాను. అవసరమైన చోట్ల ఆయన గుప్త సామ్రాజ్యకాలం నాటి గంగాయమునా మైదానాలకు, చోళ చాళుక్య యుగాల నాటి తమిళ కర్ణాటక భూభాగాలకు కూడ తన వివరణలు విస్తరింపజేశారు. ఈ విధమైన సమగ్రతను చేకూర్చడం చేత రమణయ్య గారు తన గ్రంథాన్ని ప్రామాణికమైన చారిత్రక సారస్వతంలో నిలిపారు. స్వార్థపూరితమైన రాజకీయాలు ప్రజల మనసులను కలుషితం చేసి, ప్రమాదకరమైన ప్రాంతీయ ధోరణులను రెచ్చగొడుతున్న నేటి కాలంలో ఇటువంటి సమగ్రత

చారిత్రక రచనలు అత్యవసరం.

మూడో అధ్యాయంలో కరీంనగర్ జిల్లాలోని చారిత్రక స్థలాలను వివరించడంలో సైతం రమణయ్య గారు సర్వసమగ్రమైన విశదీకరణ చేసి ఒక ఒరవడిని ఏర్పరచారని చెప్పకతప్పదు. జిల్లాలోని మారుమూలల్లో అజ్ఞాతంగా ఉండిపోయిన ప్రదేశాలనుకూడా చేర్చి ఆయన ఒక సమగ్రమైన నివేదిక ఇచ్చినట్లుగా ఈ అధ్యాయం రూపుదిద్దుకొంది. అనేక ప్రదేశాల చారిత్రక విశిష్టత, అచటి ఆలయాలు, శిల్పాల అవశేషాలను గూర్చిన స్పష్టమైన వివరణలే కాక అనేక ప్రదేశాల్లో ప్రజలు, ప్రభుత్వము అశ్రద్ధ చేయడము చేత శిథిలమవుతున్న ఆలయాలను గూర్చి, కనుమరుగు అవుతున్న సాంస్కృతిక అవశేషాల అవస్థితుల గూర్చి ఆయన భారమైన హృదయంతో తెలియజేశారు. ఈ అధ్యాయం చదువుతుండగా రెండు దశాబ్దాల క్రిందటి అనుభూతులు నా మనసులో తిరిగి జీవం పోసుకున్నాయి. ఆయన తన డాక్టరేట్ డిగ్రీ కొరకు ఈ ఆలయాల వాస్తు, శిల్పకళల అధ్యయనానికి చేసిన విస్తృత పర్యటనల్లో నాకు కొంత ప్రమేయం కల్పించి, కరీంనగర్ జిల్లాలోని అత్యధికభాగం సందర్శించే అవకాశాన్ని ఇచ్చారు. అప్పుడు మేమిరువురం తిరిగి చూచిన ప్రదేశాలు, అప్పటి మా అనుభవాలు ఈ అధ్యాయం చదువుతుండగా మరోసారి మనసులో మెదిలాయి. ఈ అధ్యాయం కరీంనగర్ జిల్లా ప్రజానీకానికి ప్రభుత్వానికి – అంతరించి పోతున్న ఈ సాంస్కృతిక వారసత్వ సంపదను పరిరక్షించు కోవలసిన ఆవశ్యకతను ఎత్తిచూపే హెచ్చరిక. అంతేకాక, ఈ జిల్లాలోని సాధారణ ప్రజానీకానికి దర్శనీయమైన స్థలాలను వివరించడమేకాక, పురావస్తుశాఖ జరుపవలసిన అన్వేషణలు, అనుశీలనకు యోగ్యమైన ప్రాచీన చారిత్రక ప్రదేశాలను వివరించడం కూడ జరిగింది. ఈ అధ్యాయం ఈ గ్రంథంలోని అత్యంత విలువైన భాగమని నాకు అనిపించింది.

నాలుగో అధ్యాయంలో మతధార్మిక పరిణామాలను గూర్చి, ఐదు,ఆరు అధ్యాయాల్లో సామాజిక, ఆర్థిక పరిణామాలను గూర్చి రమణయ్య గారు చేసిన సమాలోచన, సమీక్ష ఈ గ్రంథానికి సంపూర్ణతను చేకూర్చాయి. చరిత్ర కేవలం రాజ్యాల వృద్ధిక్షయాలు, వీరవరులైన వారి ఘనకార్యాలను వర్ణించడమనే అభిప్రాయాలు ఇటీవలి దశాబ్దాల్లో నిరాకరించబడుతున్నాయి. చరిత్ర ప్రాయికంగా ప్రజలకు సంబంధించింది. వారి జీవన విధానాల్లో ఆలోచనలూ, ఆచరణల్లో కాలానుక్రమంగా ప్రాప్తించే పరిణామాలను కార్యకారణ సమన్వయంతో వివరించేదే చరిత్ర. రమణయ్య గారు ఈ విషయాల్లో తీసుకోవలసినంత శ్రద్ధ తీసుకొని, వివిధ కాలాల్లోని ప్రజాజీవన విధానం–వ్యవసాయం, వర్తక వాణిజ్యాలు, అష్టాదశప్రజలు అవలంబించే వృత్తులు, దేవాలయాల నిర్వహణలో నిమగ్నమైన వివిధ తరగతులకు చెందిన వారు – వీటన్నిటిని వీలైనంత సమగ్రంగా, కరీంనగర్ జిల్లాకు సంబంధించినంత వరకు పొందు పరచారు. అనేక వృత్తి సంఘాలు, శ్రేణి, నిగమ, గోష్ఠి మొదలైనవి, ఆర్థికంగా, సామాజికంగా స్వయం పరిపాలకంగా విలసిల్లిన వైనం ఆయన చక్కగా విశదీకరించారు.

వివిధ ధార్మిక, మత పరిణామాలను గూర్చి వివరించడంలో అవి ప్రజాదరణ పొందడం, పోగొట్టుకొనడం, రమణయ్యగారు నిరపేక్షతాయుతమైన నిష్పాక్షికతను ప్రదర్శించారు. మధ్యయుగంలోని జైన-శైవ మతాల సంఘర్షణలు, మహ్మదీయ దండయాత్రల్లో భగ్నమైన హిందూ ధర్మం - రమణయ్యగారు ఉద్వేగానికి లోనుకాని మనో నిర్భరత్వంతో వివరించారు. గ్రంథం ఒక చిన్నప్రదేశానికి పరిమితం కనుక ఆయాధార్మిక విధానాల్లోని వైరుధ్యాలను గూర్చి చర్చించక, జరిగిన సంఘటనలను మాత్రం ఆయన సవివరంగా తెలియజేశారు. అయితే, సాతవాహనయుగంలో బౌద్ధము, మధ్యయుగంలో జైన ధర్మం ప్రజాదరణ కోల్పోవడానికి సాధారణంగా అనుకునే విధంగా స్పర్థల వలన జరిగిన దాడులు కాక సమాజంలోని కొన్ని పరిణామాలు తెచ్చిపెట్టిన ధార్మిక పరిణామాల కారణంగా జరిగాయి. అయితే ఈ విషయాల గూర్చి మరింత సమగ్ర పరిశోధనలు జరుగవలసిఉంది. ఆ పరిశోధనల ఫలితాలు వెలువడిన తరువాత ఈ అధ్యాయంలో స్వల్పమైన సవరణలు అవసరం కావచ్చు.

ఏడు, ఎనిమిది అధ్యాయాల్లో, కరీంనగర్ జిల్లాలోని ఆలయాల వాస్తువును, ప్రతిమా శిల్ప విన్యాసాన్ని వివరించడంలో రమణయ్య గారు తన పరిశోధనాపాటవాన్ని నిరూపించుకొన్నారు. అనేక ఆలయాలు, శిల్పాలను గూర్చి మూడో అధ్యాయంలో విస్తారంగా వర్ణించడం ఒక ఎత్తు. అది సాధారణ పాఠకులకు సుబోధకం చేసే విధానం. ఆయా ఆలయాల వాస్తు విధానాలను నిశితంగా పరిశీలించి విశ్లేషించడం ద్వారా చాళుక్య, రాష్ట్రకూట, కాకతీయ యుగాలనాటి వాస్తు లక్షణాలను నిరూపించడం పరిశోధకులు పరిశోధకులతో సంభాషించడం. అలాగే ప్రతిమా శిల్ప విశేషాలను శాస్త్ర పద్ధతిలో విశ్లేషించి తన వివరణలకు శాస్త్ర నిబద్ధత కలిగించారు. ఈ రెండు అధ్యాయాల్లో రమణయ్య గారి శాస్త్రవైదుష్యము, శాస్త్రీయ దృక్పథం స్పష్టమైనాయని చెప్పడం అతిశయోక్తి కాబోదు.

ఈ గ్రంథరచనలో రమణయ్య గారు కరీంనగర్ ప్రాంత చారిత్రక, సాంస్కృతిక వైశిష్ట్యాన్ని ప్రదర్శించడంతో ఆ ప్రాంత ప్రజానీకానికి అత్యంత ఆత్మీయులైనారు. వారి గౌరవాభిమానాలను చిరకాలం అనుభవించగల అర్హతను పొందారు. చరిత్రకారుల నడుమ తన కొక సముచిత స్థానాన్ని సంపాదించుకున్నారు. ఈ గ్రంథం ప్రజల అభిమానాన్ని పొంది వారి ప్రాంతాన్ని వారు గర్వంగా భావించుకోగల విజ్ఞానాన్ని అందించి విశేషమైన ఖ్యాతి సంపాదిస్తుందని నా ప్రగాఢ విశ్వాసం.

డా. వెలమకన్ని సుందరరామశాస్త్రి

13-2-41, గుంటూరు వారి తోట
గుంటూరు-522 001. ✆ : 2320760.
తేది 2-1-2003

డా. జైశెట్టి రమణయ్య
M.A.,B.Ed.,M.Phil., Ph.D.
రిటైర్డ్ చరిత్ర రీడర్
1-5-29, అరవిందనగర్,
జగిత్యాల - 505 327. (ఆం.ప్ర.)
www.jagtialjramanaiahhistorian.com



# ధన్యవాదములు

## (Acknowledgements)

కరీంనగర్ జిల్లాలో మొదటిసారిగా 2002 జనవరి 19, 20, 21 మూడురోజులు ఘనంగా నిర్వహింపబడిన శాతవాహన కళోత్సవాల చివరి రోజున ఉత్సవాల కమిటి అధ్యక్షురాలైన కరీంనగర్ జిల్లా కలెక్టర్ శ్రీమతి సుమితాడావ్ర I.A.S. గారి నేతృత్వంలో సన్మానింపబడిన పన్నెండుగురు ప్రముఖులలో ఒక చరిత్రకారునిగా సన్మానింపబడుట నా అదృష్టము. తెలుగులో కరీంనగర్ జిల్లా చరిత్ర రచన గావించుటకు పరోక్షంగా ప్రోత్సహించిన కలెక్టర్ గారికి మరియు జిల్లా యంత్రాంగమునకు నా ధన్యవాదములు.

ఈ గ్రంథము యొక్క వ్రాతప్రతిని ఓపికతో ఆమూలాగ్రంగా చదివి స్ఖాలిత్యములను సవరించుచూ తగిన సూచనలు చేయుచూ తొలిపలుకు వ్రాసిన గుంటూరు నాగార్జున విశ్వవిద్యాలయం సుప్రసిద్ధ ఆచార్యులు ప్రముఖ చరిత్రకారులు డా.వి. సుందరరామశాస్త్రి గారికి నా హృదయ పూర్వక అభివందనములు. అలాగే హైదరాబాద్ పురావస్తుశాఖలో స్థపతిగా నుంటూ అనేక శిథిలాలయముల జీర్ణోద్ధరణ గావించిన సుప్రసిద్ధ చరిత్రకారులు, మిత్రులు డా. ఈమని శివనాగిరెడ్డి గారు వ్రాతప్రతిని సొంతము చదివి, క్రియా రూపములనన్నింటినీ సరళీకృతం చేసి 'ప్రజా చరిత్రకు పట్టాభిషేకము' అను శీర్షికన వారి అభిప్రాయం వ్రాయడం సంతోషదాయకం. జగిత్యాల నుండి హైదరాబాద్‌కు అనేక సార్లు టెలిఫోన్‌లో సంభాషించుచూ ఆలయవాస్తుశిల్పము మరియు ప్రతిమాశిల్పములకు సంబంధించిన సాంకేతిక పదజాలమును వారి నుండి సేకరించడమైంది. వారు చేసిన సూచనలకు, అందించిన ప్రోత్సాహానికి నా హార్దిక కృతజ్ఞతలు.

ఏడువందల పేజీల వ్రాత పత్రములను ప్రథమంగా పఠించి, భాషాపరమైన స్ఖాలిత్యములను తొలగించి పరిపూర్ణ సహకారము నందించిన తెలుగు పండితులు, యువమిత్రులు చీటూరి భాస్కర్‌రావు గారికి హృదయ పూర్వక కృతజ్ఞతలు.

జీవితమంతయు కష్టసుఖాలలో పాలుపంచుకొని అర్థాంగి అనుపదమునకు సార్థకతను చేకూర్చిన శ్రీమతి వరలక్ష్మికి ఈ గ్రంథం అంకితం చేయడం ముదావహం. ప్రూఫ్‌రీడింగ్‌లో సహకరించిన జ్యేష్ఠపుత్రిక ఎన్నాకుల రేవతి, పెద్దకోడలు సీత అభినందనీయులు. ఈ గ్రంథరచనలో సహకరించిన నా సంతానము రేవతి, రాజశేఖర్, ఉమారాణి, రాజేందర్ మరియు కోడళ్లు సీత, అన్నపూర్ణ, అల్లుళ్లు ఎన్నాకుల అశోక్, జిడిగె రాము అందరూ అభినందనీయులే. వీరందరు పట్టభద్రులే గనుక వీరి నుండి నాకు తగిన సహకారం అందింది. 65 ఏండ్ల వయస్సులో పదే పదే సీటు నుండి లేవడానికి ఓపికలేని నాకు అనుక్షణము అవసరమున్న పుస్తకాలు, పెన్నులు, కాగితాలు ఇత్యాదులు అందించిన ఏడేండ్ల మనుమడు శివసాయికి, మనుమరాళ్లు సంకీర్త, స్వాతిలకు శుభాశీస్సులు. అలాగే దౌహిత్రులు ఎన్నాకుల ప్రత్యూష, రాధాప్రణయ, ప్రబంధ మరియు జిడిగె రామకృష్ణ, కేశవ్‌లు చేసిన సేవలకు శుభాశీస్సులు.

ఈ పుస్తక రచనలో, ముద్రణలో చేదోడు వాదోడుగా నిలిచి అన్ని విధాల సహాయ సహకారము లందించిన బంధువులకు, స్నేహితులకు, సన్నిహితులకు, చరిత్రకారులకు మరియు సాహితీ మిత్రులందరికి నా హార్దిక ధన్యవాదములు.

ఈ గ్రంథమును తీర్చిదిద్దిన బండారు సంతోష్‌కుమార్ నాగజ్యోతి గ్రాఫిక్స్, జగిత్యాల గారికి మరియు దీనికి చక్కటి రూపమునిచ్చిన హైదరాబాద్ ముద్రణాధిపతులకు నా కృతజ్ఞతలు.

వసంత పంచమి
6-2-2003.

డా. జైశెట్టి రమణయ్య



ఆంధ్రప్రదేశ్‌లో కరీంనగర్ జిల్లా

"వాస్తు శిల్ప వాచస్పతి"
**డా. ఈమని శివనాగిరెడ్డి**
స్థపతి, పురావస్తు పరిశోధనశాఖ
గన్‌ఫౌండ్రి, హైదరాబాద్ - 1
Ph : 24046936 (R), 23231269 (O)



## ప్రజా చరిత్రకు పట్టాభిషేకం

ఆశు కవిత్వం వ్రాయటం తేలికకాదు. మరలాంటప్పుడు జిల్లా సమగ్ర చరిత్ర రాయటం సులువెలా అవుతుంది? శాసనాలు, రికార్డులున్న చరిత్ర రాయటం ఒక ఎత్తైతే, రాతి పనిముట్లు తప్ప ఇతర ఆధారాలు లేని శిలాయుగం చరిత్ర రాయటం మరో ఎత్తు. చారిత్రక ఆధారాల్ని తడిమిచూచి, నిజాల నిగ్గుతేల్చి, ఏ ఇజంవైపూ మొగ్గు చూపకుండా రచయిత జాగ్రత్తపడాలి. ఇప్పటి వరకూ బయటి కొచ్చిన పుస్తకాల్లో చోటు చేసుకోని చరిత్రను, సేకరించి వాటిని హేతుబద్ధంగా సమీక్షించుకోవాలి. అలా సాగిన చారిత్రక రచన చదువరుల్లో ఆసక్తిని రేకెత్తిస్తుంది. చరిత్రలో నిలిచి పోతుంది. గుహల్లో దాక్కొని బిక్కు బిక్కుమంటు కాలం వెళ్లదీసిన రాతియుగపు రోజుల్నుంచి, మధ్యయుగాల రాజుల చరిత్రతో పాటు ఆధునిక శాస్త్ర సాంకేతిక ప్రగతిని సంతరించుకొని ప్రకృతిని శాసిస్తున్న ఈ నాటి వరకూ మానవజీవన వికాసంలో ఎన్ని మలుపులు! ఎన్ని కొత్త ఆవిష్కరణలు !!

సమత, మమతలను చాటి, కులాల కుంపటిని బద్దలుకొట్టి, సమసమాజాన్ని కోరుకున్న బౌద్ధం తొలినాళ్లలోనే వేళ్లూనుకొన్న నేలగా, చారిత్రక అవసరంగా ఉద్యమాలకు ఊపిరులూదిన జిల్లాగా కరీంనగర్ జిల్లా చరిత్ర అణువణువూ ఆసక్తికరమే. ఊహలకందని రాతియుగపు చరిత్రను, లెక్కకు మించిన శాసనాలు, కాలగర్భం నుంచి పెల్లుబికిన నాణేలు, ఇళ్లు, గుళ్లు, కోటగోడలు, అపురూప శిలాఫలకాలు, ఎక్కడో అభిలేఖాగారంలో కారాగార వాసం చేస్తూ చిరిగిపోతున్న చారిత్రక శకలాల్ని సేకరించి, విడమర్చి విపులీకరించటంలో ఉపాధ్యాయ వృత్తికే వన్నె తెచ్చిన ప్రామాణిక పరిశోధకులు డా. జైశెట్టి రమణయ్యగారు పడిన శ్రమ అంతా, ఇంతా కాదు. కళ్ల ముందు కదలాడుతున్న రాజులు, రాణులు, వందల మంది శిల్పులు, సైనికులు, మతప్రవక్తలు, పరాయి పాలకుల ఆగడాలు, ఎదురు తిరిగిన రైతుబిడ్డలు, ఒక్కొక్కటిగా సాగిపోతున్న భ్రమను కలిగించిన డా.రమణయ్య గారి రచనాపటిమ సాటిలేనిది. చక్కటి కథనంతో సాగిన జిల్లా సమగ్రచరిత్ర రాతప్రతిని చూచే వీలు కల్పించిన డా.రమణయ్య గారికి గౌరవపూర్వక అభివందనాలు. అరుదైన ఈ అద్భుత గ్రంథాన్ని చరిత్రపై అభిమానమున్న వాళ్లంతా సొంతం చేసుకొనటానికి పోటీపడతారని ఆకాంక్షిస్తూ, ఇంతటి పెద్ద పనిని సునాయాసంగా, వినమ్రఫల వృక్షంగా మన కందించిన రచయితను మనసారా మరోసారి అభినందిస్తున్నాను.

హైదరాబాద్
తేది 24-10-2002

శివనాగిరెడ్డి
డా. ఈమని శివనాగిరెడ్డి



డా. జైశెట్టి రమణయ్య
M.A.,B.Ed.,M.Phil., Ph.D.
రిటైర్డ్ చరిత్ర రీడర్
1-5-29, అరవిందనగర్,
జగిత్యాల - 505 327. (ఆం.ప్ర.)
www.jagtial jramanaiah historian.com

# ముందుమాట
## (Preface)

భారతదేశ చరిత్రలో ప్రాంతీయ చరిత్రలు గూడా ప్రాధాన్యతను సంతరించుకున్నాయి. ఆంధ్రదేశమునకు అనాది నుండి ఘనమైన చరిత్ర ఉంది. అందులోనూ గోదావరినది పరీవాహ ప్రాంతమగు ఉత్తర తెలంగాణము చరిత్రపూర్వయుగం నుండి గొప్ప సంస్కృతి, నాగరికతలకు నిలయంగా ఉంది. గోదావరి దక్షిణ తీరమునానుకొని యున్న కరీంనగర్ జిల్లాకు వేల సంవత్సరాల ఉజ్వల చరిత్ర, మహత్తర సంస్కృతి ఉంది. ఈ జిల్లా మధ్యభాగము నుండి మానేరు ఉపనది ప్రవహించుచూ గోదావరిలో కలుస్తుంది. గోదావరి, మానేరు నదుల తీరములందు శిలాయుగపు నాగరికతలు వెలిశాయి. గోదావరినది తీరమందున్న కోటిలింగాల శాతవాహనులకు పూర్వమే స్థానిక పాలకులైన సామగోపుడు, అతని పూర్వీకులకు రాజధానిగా వెలిసినట్లు తెలుస్తుంది. సామగోపుని సేనానిగా నుండిన శాతవాహనుడు అదనుజూచి అధికారము చేజిక్కించుకొని కోటిలింగాలలో శాతవాహన సామ్రాజ్య స్థాపన గావించాడు. పెద్దబొంకూరు, ధూళికట్ట, కోటిలింగాల ప్రాంతములందు జరిపిన త్రవ్వకాలలో శాతవాహనుల చారిత్రక విశేషాలు బయల్పడినాయి.

శాతవాహనుల అనంతరం ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు, బాదామి చాళుక్యలు వరుసగా కరీంనగర్ జిల్లా ప్రాంతమునేలిరి. వేములవాడ చాళుక్యుల (క్రీ.శ. 750-973) కాలంలో ఈ ప్రాంతం సపాదలక్షగా, కోసవలము సవాలఖెగా పేర్కొనబడింది. రాజధాని వేములవాడలో వీరు నిర్మించిన దేవాలయాలు జిల్లాలోనే అతిప్రాచీనమైనవి. వీరి అనంతరం కళ్యాణి చాళుక్యులు (క్రీ.శ. 973-1159) ఈ ప్రాంతం పై అధికారం వహించారు. క్రీ.శ. 1159 నుండి 1323 వరకు ఈ జిల్లా కాకతీయుల ఏలుబడిలో ఉండింది. తదనంతరం ముసునూరి నాయకులు, రేచర్ల పద్మనాయకులు ఆధిపత్యము వహించిరి. క్రీ.శ. 1518 నుండి 1687 వరకు కుతుబ్‌షాహీలు, క్రీ.శ. 1687 నుండి 1724 వరకు మొగలులు, క్రీ.శ. 1724 నుండి 1948 వరకు ఆసఫ్‌జాహి నిజాం నవాబులు ఈ ప్రాంతంను పాలించారు.

కరీంనగర్ జిల్లాలో 80 వరకు లభ్యమైన శాసనాలు సంస్కృతం, కన్నడం, తెలుగు భాషలలో ఉన్నాయి. కొన్ని దేవనాగరి లిపిలో ఉన్నాయి. కళ్యాణి చాళుక్యుల, కాకతీయుల

కాలంలో ఈ ప్రాంతమందు అందమైన, అద్భుతమైన దేవాలయాలు నిర్మింపబడ్డాయి. కాకతీయుల కాలపు త్రికూటాలయములనేకములు వారి శిల్పకళా ఔన్నత్యమును చాటుచున్నాయి.

ఈ గ్రంథంలో ఎనిమిది అధ్యాయాలున్నాయి. మొదటి అధ్యాయంలో జిల్లా పరిచయం మరియు శిలాయుగపు, తొలి చారిత్రక యుగపు స్థావరాలు పేర్కొనబడినాయి. రెండవ అధ్యాయంలో అనాది నుండి నేటి వరకు జిల్లా వైభవోపేత చరిత్ర వివరంగా తెలుపబడింది. మూడవ అధ్యాయంలో జిల్లాలోని 70 చారిత్రకస్థలాల విశేషాలు వివరింపబడినాయి. అంతేగాకుండా ఈ అధ్యాయం చివరలో ప్రాచీన శిథిలాలు, చారిత్రక అవశేషాలు కనిపించు జిల్లాలోని దాదాపు 50 గ్రామనామాలు ఉదహరింపబడినాయి. ఈ గ్రంథంలో రెండవ, మూడవ అధ్యాయాలు అతి ప్రధానమైనవి, కీలకమైనవి. నాలుగవ అధ్యాయంలో మత పరిస్థితులు, ఏదవ, ఆఱవ అధ్యాయాలలో సాంఘిక, ఆర్థిక పరిస్థితులు వివరింపబడినాయి. జిల్లాలోని ఆలయవాస్తు శిల్పము యొక్క అభివృద్ధి క్రమము ఏడవ అధ్యాయంలోనూ శిల్పకళావికాసం ఎనిమిదివ అధ్యాయంలోనూ తెలుపబడ్డాయి. ఈ గ్రంథములోని దేశపటములు పరితల అవగాహనకు మాత్రమే ఉద్దేశింపబడినవి. అనుబంధంలో పర్యాటకుల ప్రయోజనార్థమై జిల్లాలోని పర్యాటక కేంద్రాలు, విందు వనభోజనాదులకు ఉపయుక్తమగు వినోద విహార స్థలాల వివరములివ్వబడినాయి. చివరలో రచయిత పరిచయం మరియు ప్రముఖుల సందేశాలు, అభినందనలు జతపరచబడ్డాయి.

రెండు దశాబ్దాల పూర్వం హైదరబాద్ కేంద్ర విశ్వవిద్యాలయ మందు 1982–83లో M.Phil. మరియు 1983–1986 మధ్యకాలంలో Ph.D. చేసిన సందర్భములో కరీంనగర్ జిల్లాలోని దేవాలయాలను, చారిత్రక స్థలాలను అన్నింటిని దర్శించి, పరిశీలించి, పరిశోధించి విశేష సమాచారం సేకరించడమైంది. డాక్టరేట్ పట్టా పొందిన తరువాత నా పరిశోధనా వ్యాసములు 1989లో *Temples of South India* మరియు *The Chalukya and Kakatiya Temples - A study* యను రెండు గ్రంథముల రూపంలో ఆంగ్లము నందు ఢిల్లీలో ముద్రింపబడినాయి. ఈ రెండు గ్రంథాలు గూడా కరీంనగర్ జిల్లా దేవాలయాల చరిత్రను వివరిస్తాయి. వీటిలోని సమాచారం చాలా మట్టుకు ఈ గ్రంథరచనలో ఉపయోగపడింది. ఇరువై సంవత్సరాల క్రితము జిల్లానంతయు వీలును బట్టి బస్సులు, జీపులు, కార్లు, స్కూటర్ల పైన పర్యటించి చారిత్రకస్థలాల ప్రత్యక్ష పరిశీలన, పరిశోధన చేయడం జరిగింది. కొన్ని చోట్లకు ఎడ్లబండ్ల ప్రయాణం చేయాల్సి వచ్చింది. ఆ రోజులలో రాకపోకల సౌకర్యాలు అంతగా అభివృద్ధి చెందలేదు. ఏ త్రోవలేక కేవలం పిల్లమార్గాలే *(Singleman track)* ఉన్న కొన్ని మారుమూల ప్రాంతాలకు అప్పుడప్పుడు 5 కి.మీ. వరకు కాలినడకన చేరవలసి వచ్చింది. అప్పుడు నా వయస్సు 45 గనుక కష్టం అనిపించలేదు. అడవులు, గుట్టలు, లోయలు, వాగులు, వంకలు దాటుతూ నిర్మానుష్యమైన అనేక ఏకాంత చారిత్రక ప్రదేశాలను చేరుటకు వ్యయప్రయాసలకు ఓర్చి నా వెంట వచ్చిన మిత్రులందరికి ఋణపడి ఉన్నాను. ఆనాడు ఉపన్యాసకునిగా నేడు ఆచార్యునిగా పనిచేయుచున్న మిత్రులు డా.వి. సుందరరామ శాస్త్రి గారు నా వెంట కొన్ని ప్రధాన దేవాలయాలు దర్శించి, వాటిని

వర్ణించు విధానమును తెలిపి మార్గదర్శకులయ్యారు. వారు అందించిన సేవలను నేను మరువజాలను.

కరీంనగర్ జిల్లా అంతటను మొట్టమొదటిసారిగా క్రీ.శ. 2002 జనవరి 19, 20, 21 మూడు రోజులు శాతవాహన కళోత్సవాలు ఘనంగా జరుపబడినాయి. చివరి రోజున కరీంనగర్ జిల్లా చరిత్ర, సంస్కృతి, కళల అభివృద్ధికి తోడ్పడుతూ, వివిధ రంగాలలో సమాజమునకు ఉత్తమ సేవలందించుచున్న జిల్లాలోని 12 మంది ప్రముఖులు కేంద్ర హోంశాఖ సహాయమంత్రి గౌ.చెన్నమనేని విద్యాసాగర్ రావు గారి చేతుల మీదుగా సన్మానింపబడినారు. వారిలో ఒక చరిత్రకారునిగా సన్మానింపబడుట నా అదృష్టము. ఆ తరుణములో జిల్లా అధికారులందరు స్థానిక చరిత్ర గ్రంథ రూపంలో తెలుగులో ఉంటే బాగుండేదని వాంఛించారు. జిల్లా చరిత్ర రచనకై వారు నన్ను ప్రోత్సహించారు. తత్ఫలితంగా వెలువడినదే ఈ గ్రంథము.

మెకంజీ గతంలో ఆంధ్రప్రాంతంలోని కొన్ని గ్రామాల చరిత్రలు వ్రాయించారు. వాటిని మెకంజీ కైఫియత్‌లంటారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఇప్పటి వరకు గ్రామాల చరిత్రను అక్షరబద్ధం చేయలేదని ప్రభుత్వము ఒక ప్రకటనలో (ఈనాడు దినపత్రిక 25 జూన్ 2002 మంగళవారం) తెలిపింది. పంచాయతీరాజ్ శాఖ మొదటిసారిగా గ్రామాల చరిత్రను నిక్షిప్తం చేయాలని సంకల్పించింది. రాష్ట్రంలో నున్న 22 వేల పంచాయతీల చరిత్రను సేకరించనుంది. ఈ పని పంచాయతీరాజ్ కమీషనర్ పర్యవేక్షణలో ప్రముఖ కవి నాగభైరవ కోటేశ్వరరావుకు అప్పగించబడింది. ఈయన నేతృత్వంలోని ఎడిటోరియల్ బోర్డ్ ఒక్కొక్క జిల్లా చరిత్రను గ్రంథస్థం చేయనుంది. ఇలాంటి తరుణంలో కరీంనగర్ జిల్లా సమగ్రచరిత్ర సంస్కృతి గ్రంథం వెలువడడం విశేషం.

క్రీ.శ. 2002 ఫిబ్రవరి 17 వసంత పంచమి రోజున ఇంటిలోనే సరస్వతి దేవతారాధన గావించి, నారికేళము సమర్పించి ఈ గ్రంథ రచన ప్రారంభించాను. మాతా జ్ఞాన సరస్వతి కరుణా కటాక్షమున ఒక్క సంవత్సరములో ఈ గ్రంథ రచన పూర్తి అయి ముద్రణకై హైదరాబాద్‌కు పంపబడింది.

64 సంవత్సరాలు పూర్తి చేసికొని 65వ జన్మదినం రోజున 'ముందుమాట' వ్రాయడం కాకతాళీయం.

చక్కటి కథనంతో సాగిన జిల్లా సమగ్ర చరిత్ర పండిత పామరులకు, సామాన్య పాఠకులకు మిక్కిలి ఉపయోగకరంగా ఉంటుందని ఆశిస్తూ, పాఠకుల అభిప్రాయాలను ఆహ్వానిస్తూ, చరిత్రపై అభిమానమున్న వాళ్లందరుఈ పుస్తక పోషణ గావిస్తారని ఆకాంక్షిస్తూ సెలవు.

జగిత్యాల.
తేది 23-1-2003.

**డా. జైశెట్టి రమణయ్య**
రిటైర్డ్ చరిత్ర రీడర్.

# ABBREVIATIONS

(సంకేతాక్షరములు)

APGKD : Andhra Pradesh Gazetteer, Karimnagar District.

APHC : Andhra Pradesh History Congress Volumes.

ARDAM : Annual Report of the Department of Archaeology and Museums A.P.

ARE : Annual Report on Epigraphy.

ASI : Archaeological Survey of India.

CORPUS : Corpus of Inscriptions in Telingana Districts.

EA : Epigraphia Andhrica.

EHD : Early History of the Deccan, Vol. I & II. (ed) Dr. G. Yazdani.

EHI : Elements of Hindu Iconography, by T.A.Gopinatha Rao.

HAS : Hyderabad Archaeological Series.

HSI : History of South India, by K.A.Nilakanta Sastry.

IAPKD : Inscriptions of Andhra Pradesh, Karimnagar District.

IAPWD : Inscriptions of Andhra Pradesh, Warangal District.

JAHRS : Journal of Andhra Historical Research Society.

RE : Report on Epigraphy.

SII. : South Indian Inscriptions.

## మొదటి అధ్యాయం

# I. జిల్లా పరిచయం - చరిత్ర పూర్వయుగము

ఉత్తర తెలంగాణాలో కరీంనగర్ జిల్లాకు అనాది నుండి ఉజ్వలమైన చరిత్ర ఉంది. గోదావరి నది నానుకొని దక్షిణముగా వ్యాపించి యున్న ఈ జిల్లా చరిత్రారంభకాలము నుండి మహెూన్నతమైన సంస్కృతి, నాగరికతలకు నిలయంగా భాసిల్లింది.

హైద్రాబాద్ రాజధానిగా పాలించిన ఆసఫ్‌జాహీల కాలంలో ఎల్గందుల ఖిలేదారుగా పనిచేసిన సయ్యద్ కరీమొద్దీన్ తన పేరట స్థాపించిన పట్టణమే నేటి జిల్లా కేంద్రమైన కరీంనగర్ పట్టణము[1].

## జిల్లా సరిహద్దులు

కరీంనగర్ జిల్లా $17^0$-50 మరియు $19^0$-05 ఉత్తర అక్షాంశాల మధ్య, $78^0$-29 మరియు $80^0$-22 తూర్పు రేఖాంశాల మధ్య వ్యాపించి ఉంది.[2] ఈ జిల్లాకు ఉత్తరాన ఆదిలాబాద్, పడమట నిజామాబాద్, దక్షిణాన మెదక్, వరంగల్ జిల్లాలు, తూర్పున ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రంలోని బస్తర్ జిల్లా మరియు ఈశాన్యాన మహారాష్ట్రలోని చాందా జిల్లా సరిహద్దులుగా ఉన్నాయి. ఈ జిల్లా విస్తీర్ణము 4582 చ.మై.[3]. కరీంనగరము నుండి హైద్రాబాద్, వరంగల్, నిజామాబాద్ పట్టణాలకు సువిశాలమైన చక్కటి బి.టి.రోడ్ మార్గాలున్నాయి. కాజిపేట నుండి బల్హార్షా రైలుమార్గం ఈ జిల్లా నుండి పోతుంది. ఇటీవలే పెద్దపెల్లి నుండి కరీంనగర్ వరకు 35 కి.మీ. నూతన రైలుమార్గము వేయటానికి ఏడు సంవత్సరములు పట్టింది. 54 కోట్ల వ్యయంతో నిర్మింపబడిన ఈ కొత్త రైలు మార్గానికి కరీంనగర్ రైల్వేస్టేషన్‌లో 22వ ఎప్రిల్ 2000 శనివారము రోజున ప్రారంభోత్సవము జరిగింది[4].

## జిల్లా పాలనా విభాగములలో వచ్చిన మార్పులు

కరీంనగర్ జిల్లాకు మొదట్లో ఎల్గందుల జిల్లాయని పేరు. ఈ ఎల్గందుల నేడు కరీంనగర్

పట్టణానికి పడమటగా 9 కి.మీ. దూరంలో నున్న ఒక చిన్ని గ్రామము. చాలాకాలం ఎల్లందుల సర్కారు (Sarkar) అను పేరు గల పాలనా భాగమునకు కేంద్రముగా ఉంది. 1897లో ఎల్లందుల జిల్లా యందు చెన్నూరు, జగిత్యాల, జమ్మికుంట, కరీంనగర్, లక్షెటిపేట, మహదేవపూర్, సిద్దిపేట, సిరిసిల్ల మరియు సుల్తానాబాద్ అనే 9 తాలూకాలుండేవి[5]. ఆరవ నిజాం కాలంలో 1905 లో హైద్రాబాద్ రాష్ట్రమునందు జరిగిన జిల్లాల పునర్వ్యవస్థీకరణ సమయంలో ఎల్లందుల నుండి జిల్లా కేంద్రము కరీంనగర్‌కు మార్చబడింది. ఈ సందర్భంలో లక్షెటిపేట, చెన్నూరు తాలూకాలు ఆదిలాబాద్ జిల్లాలోను, సిద్దిపేట తాలుకా మెదక్ జిల్లాలోను చేర్చబడినాయి. కాని వరంగల్ జిల్లా నుండి పర్కాల తాలూకా కరీంనగర్ జిల్లాలో కలుపబడుట వలన ఏడు తాలూకాలు అయినాయి. 1913లో జమ్మికుంట నుండి తాలూకా కేంద్రము హుజూరాబాద్‌కు మార్చేంత మట్టుకు ఈ జిల్లాలో ప్రధాన మార్పులేవీ జరుగలేదు[6]. జాగీర్ల విధానము 1950లో రద్దు కాగానే మెటుపెల్లి ఒక స్వతంత్ర ఉపతాలూకాగా రూపొందింది. తత్ఫలితంగా కరీంనగరము జిల్లాలోని తాలూకాల సంఖ్య ఎనిమిదికి పెరిగింది. 1950 వరకు జాగీరుగా నున్న మెటుపెల్లి ఒక సబ్‌తాలూకా కేంద్రంగా మారడంతో జగిత్యాల తాలూకా పరిధి బాగా తగ్గిపోయింది. 1953లో కొత్తగా ఖమ్మం జిల్లా ఆవిర్భవించడంతో కరీంనగరము జిల్లాలోని పరకాల తాలూకా తిరిగి వరంగల్ జిల్లాలో కలుపబడింది. ఈ మార్పుతో కరీంనగర్ జిల్లాలో మెటుపెల్లి, జగిత్యాల, సిరిసిల్ల, కరీంనగర్, హుజూరాబాద్, సుల్తానాబాద్ మరియు మంథనితో ఏడు తాలూకాలు మిగిలినాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1979లో పంచాయతి సమితీలన్నింటికి తాలూకా ప్రతిపత్తి కలిగించడంతో ఈ జిల్లాలోని 14 సమితిలు మెటుపెల్లి, జగిత్యాల, మల్యాల, వేములవాడ, సిరిసిల్ల, గంగాధర, కరీంనగర్, హుస్నాబాద్, భీందేవరపెల్లి, హుజూరాబాద్, సుల్తానాబాద్, పెద్దపెల్లి, మంథని, మహదేవ్‌పూర్‌లు తాలూకా కేంద్రములుగా మారినవి. ఈ 14 తాలూకాలు జగిత్యాల, కరీంనగర్, పెద్దపెల్లి యను మూడు రెవెన్యూ డివిజన్ల అధీనంలో ఉండేవి. కరీంనగరము డివిజన్‌లో గంగాధర, కరీంనగర్, హుస్నాబాద్, భీందేవరపల్లి, హుజూరాబాద్ ఐదు తాలూకాలుండగా, జగిత్యాల రెవెన్యూ డివిజన్‌లో మెటుపెల్లి, జగిత్యాల, మల్యాల, వేములవాడ, సిరిసిల్ల ఐదు తాలూకాలుండేవి. మిగిలిన నాలుగు తాలుకాలు పెద్దపెల్లి, సుల్తానాబాద్, మంథని, మహాదేవపూర్‌లు పెద్దపెల్లి రెవెన్యూ డివిజన్‌లో చేరి ఉండేవి. 1984లో తాలూకాలు రద్దై మండల వ్యవస్థ రాష్ట్రమంతటా అమల్లోకి వచ్చింది. కరీంనగర్ జిల్లా 56 మండలాలుగా విభజింపబడింది. జూన్ 2001 నుండి ఎలిగేడు నూతన మండలంగా ఏర్పడింది. దీనితో మండలాల సంఖ్య 57కు పెరిగింది. ప్రస్తుతం జగిత్యాల, కరీంనగర్, సిరిసిల్ల, పెద్దపెల్లి, మంథని యను ఐదు రెవెన్యూ డివిజన్‌ల క్రింద ఈ మండలాలు పనిచేస్తున్నాయి.

## నైసర్గిక స్వరూపము

ఈ జిల్లా చరిత్రపై భౌగోళిక పరిస్థితులు ఎంతో ప్రభావం చూపాయి. గుట్టలు, అడవులు,

నదులు ప్రజల సంస్కృతిని ప్రభావితం చేశాయి. ఈ జిల్లాలో పర్వతములంటూ లేవు కాని మూడు వరుసల గుట్టలున్నాయి. మొదటి వరుస గుట్టలు గర్రెపెల్లి నుండి జగిత్యాల సమీపము నుండి గోదావరి తీరమున గల వేములకుర్తి వరకు వ్యాపించి ఉండగా, రెండవ వరుస గుట్టలు శనిగరం, మొలంగూర్ ప్రాంతములలోఉన్నాయి. మూడవ వరుస గుట్టలు జిల్లా నైరుతి దిశలో మానేరులోయ నుండి ఆరంభమై తూర్పుదిశగా రామగిరి వరకు వ్యాపించి గోదావరినది వద్ద సమాప్తమౌతున్నాయి.[7]

పైన పేర్కొన్న గుట్టల వరుసలే కాకుండా అక్కడక్కడ జిల్లా అంతటా గుట్టలు, గుట్టబోర్లు ఉన్నాయి. మధ్యయుగంలో ఈ గుట్టలు కోటలు, గుళ్ళు, గోపురముల నిర్మాణానికి ఉపయోగపడ్డాయి. కొన్ని కీలకమైన ప్రాంతాల్లో ఈ గుట్టలపైన బలిష్ఠమైన గిరిదుర్గములు వెలసినాయి. ఎల్గందుల, మొలంగూర్, రామగిరి, ప్రతాపగిరి మధ్యయుగములోని ప్రధాన గిరిదుర్గములు. గుట్టలు, గుట్టబోర్లు గుళ్ల నిర్మాణానికి ప్రోత్సాహకరంగా ఉన్నాయి. రామగిరి, బెజ్జంకి, కొత్తగట్టు, కొత్తకొండ, నాంపెల్లి, నల్లగొండ, బీర్‌పూర్, మల్లాపూర్, వాల్గొండ, వెల్లుల్ల, దుంపెట మున్నగు చోట్ల గల గుట్టలు గుళ్ల నిర్మాణానికి ప్రోత్సాహకముగా నిలిచాయి. గుట్టలపై గుళ్ల నిర్మాణములే గాకుండా జైన బసదులు గూడా వెలిసాయి. కురిక్యాల, గంగాధర మధ్య గల బొమ్మలగుట్టపై నిర్మింపబడిన త్రిభువనతిలకయను జైన బసదియే ఇందుకు తార్కాణము[8]. రామగిరి గుట్టలలో, ధర్మపురి మండలములోని స్తంభంపెల్లి గుట్టలలో, వేములవాడ మండలంలోని ఫాజల్‌నగర్, నాంపెల్లి గుట్టలలో చిన్న చిన్న గుహలున్నాయి.

## నదులు

భారత ద్వీపకల్పంలో అతి పెద్దదైన గోదావరి నది మహారాష్ట్రములోని నాసిక్ దగ్గర గల త్రయంబక్ వద్ద పడమటి కనుమలలో ఆవిర్భవించి తూర్పునకు ప్రవహించుచూ ఆదిలాబాద్ జిల్లాలోని బాసర వద్ద ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రవేశము చేస్తుంది. వేగంగా ప్రవహించు ఈ నది ఇబ్రహీంపట్నం మండలంలోని కందుకుర్తి మరియు కోమటి కొండాపూర్‌ల వద్ద కరీంనగర్ జిల్లా ప్రవేశము చేసి 283 కి.మీ. పొడువున ప్రవహించి ఉత్తరమున ఆదిలాబాద్ జిల్లాను ఈ జిల్లా నుండి వేరుచేస్తుంది. ఈ నది కరీంనగర్ జిల్లాకు ఉత్తర, తూర్పు దిశల యందు సహజ సరిహద్దుగా నిలిచి మహారాష్ట్రలోని చాందా జిల్లాను, ఛత్తీస్‌ఘడ్‌లోని బస్తర్‌జిల్లాను ఈ జిల్లా నుండి వేరుచేస్తుంది[9]. గోదావరికిరువైపులనున్న ఒడ్డులు ఎత్తుగా నుండి నదిలోతుగా ప్రవహించుటచే వ్యవసాయమునకు ఇది ఉపయోగపడలేదు. కాని లోతైన ఈ జీవనది ఏనాడు ప్రజల రాకపోకలకు ఆటంకంగా నిలువలేదు. ఈ నదికి ఇరువైపుల ప్రాక్చరిత్ర (Pre-historic), తొలి చారిత్రక (Early Historic) కాలములకు సంబంధించిన ఒకే రకమైన రాతియుగ పనిముట్లు, బృహత్ శిలా సంస్కృతిని తెలిపే ఆనవాళ్లు బయల్పడినాయి[10]. భారతదేశంలోని ఇతర నదులవలె, గోదావరి దక్కన్‌లోని ప్రజలకు అత్యంత పవిత్రమైన నది. అందుకే ఈ నది దక్షిణ తీరమున

కరీంనగర్ జిల్లాలో అనేక గుళ్ల నిర్మాణము జరిగింది. వాటిలో గోదావరి తీరము నానుకొని యున్న వాల్గొండ, వేంపెల్లి, ధర్మపురి, తిమ్మాపూర్, కోటిలింగాల, గోదావరిఖనిలోని జనగాం, సుందిల్ల, కాసిపేట, మంథని, కాళేశ్వరము మున్నగునవి ముఖ్యమైనవి.

గోదావరికి ఉపనదైన మానేరు కల్వార్‌వద్ద ఆవిర్భవించి గంభీరావుపేట సమీపములో కరీంనగర్ జిల్లా ప్రవేశము చేస్తుంది. మానేరు నది సిరిసిల్ల, కరీంనగర్ పట్టణాల గుండా ప్రవహించుచూ, ఉత్తరదిశకు మరలి మంథని మండలంలోని వెంకటాపూర్, కాటారం మండలంలోని దామెర్లకుంట గ్రామాల వద్ద గోదావరిలో కలుస్తుంది[11]. మానేరునది కరీంనగరము జిల్లాలో పడమటి నుండి తూర్పునకు 230 కి.మీ. ప్రవహించుచూ ఈ ప్రాంతమున వ్యవసాయ నీటిపారుదలకు ఆధారముగా నిలిచింది. మోయతుమ్మెదవాగు, నగునూరు వాగు, మూలవాగు మున్నగు వాగులన్నియు మానేరు నదిలో కలుస్తున్నాయి. మానేరునది ఒడ్డున గంభీరావుపేట, సుల్తానాబాద్ మండలంలోని నీరకుల్ల, మంథని మండలంలోని అడవి సోమనపెల్లి, ముత్తారం మండలంలోని ఖమ్మంపెల్లి హ్యామ్‌లెట్ యైన చెందరెల్లి వద్ద చక్కటి దేవాలయాలున్నాయి.

పెద్దవాగు, చిన్నవాగు మరియు బొక్కలవాగు ఈ జిల్లాలో ప్రవహించి గోదావరిలో కలుస్తున్నాయి. ఈ వాగుల పరీవాహప్రాంతములు అనాది నుండి ప్రాచీన సంస్కృతుల ఆవిర్భావమునకు తోడ్పడినాయి[12]. ఈ జిల్లాలోని కాలువలు, ఒర్రెలు, వాగులు, ఉపనదులు, నదులు, సరస్సులు, చెరువులు గుళ్ల నిర్మాణమునకు ప్రోత్సాహకములుగా నిలిచాయి.

## భూగర్భవిశేషాలు, శిలలు, ఖనిజాలు

మానవాళి చరిత్ర అవగాహన కొరకు మానవుడు నివసించిన భూభాగం, శిలలు, ఖనిజ సంపద ఎంతగానో తోడ్పడుతాయి. కరీంనగర్ జిల్లాలో గ్రానైట్ అనే అగ్నిరాళ్లే కాక, ఇసుకరాళ్లు, క్వార్ట్జ్‌రాళ్లు లభిస్తాయి. ఇక్కడి జనులు జకుముఖి (చెకుముకి) రాళ్లను మాత్రము ఆదిలాబాద్ జిల్లా నుండి తెచ్చుకొని వాడుకునే వారు[13]. ఈ జిల్లాలో లభ్యమగు గ్రానైట్, డొలరైట్, క్వార్ట్జ్, ఇసుకరాళ్లను గృహముల, మందిరముల నిర్మాణములకు వాడినారు. స్థానికంగా లభ్యమైన రాయితోనే గుళ్ల నిర్మాణములు గావించారు. నగునూరులోని గుళ్లన్నియు అక్కడి ఎర్ర ఇసుకరాళ్ల తోనే కట్టబడినాయి. నగునూరులో లభ్యమగు ఎర్ర ఇసుకరాయి నాణ్యతను గమనించిన కొరియా, జపాన్‌లాంటి దేశాలు నేడు అచటి పెద్ద పెద్ద శిలలను దిగుమతి చేసుకుంటున్నాయి. చాళుక్యులు, కాకతీయులు స్థానిక గ్రానైట్, ఇసుకరాళ్లతోనే మందిరముల నిర్మాణము గావించారు. అడవిసోమనపెల్లి వద్ద మానేరు నదికి ఎదురుగా నున్న ఒక గుట్టపై సువిశాలంగా నున్న ఒకే పెద్ద శిలను తొలిచి నాలుగు గుహాలయాలు నిర్మించారు. ఇవి ఏడు, ఎనిమిదవ శతాబ్దములకు సంబంధించినవి. ఇవి విజయవాడకు సమీపమున గల ఉండవల్లి, మొగల్రాజపురం గుహలను పోలి ఉన్నాయని డా.యన్.యస్. రామచంద్రమూర్తి అభిప్రాయపడినారు[14]. గుట్టలపైనున్న

పెద్ద పెద్ద శిలలు దేవతా విగ్రహములు చెక్కడానికి ఉపయోగపడినాయి. నగునూరు, శనిగరం, నాంపెల్లి, బొమ్మలగుట్ట శిలలపై నగ్న జైన విగ్రహములు, బెజ్జంకిగుట్టపై గల పెద్ద గుండుపై చక్కటి భైరవ విగ్రహములు కురిక్యాల సమీపమున గల బొమ్మలగుట్ట శిలపై క్రీ.శ. 945 జినవల్లభుని శాసనము చెక్కబడింది. పునాదుల అవసరము లేకుండానే కొన్ని చోట్ల అవిభాజ్యమైన సువిశాలమైన రాతి ఉపరితలములపై గుళ్లు నిర్మింపబడినాయి. అట్టి గుళ్లు తిమ్మాపూర్, పోత్గల్, నీరకుల్ల, ఎల్కతుర్తిలలో చూడవచ్చు. ఈ జిల్లాలో లభ్యమైన శిలా సంపద అనేక ఆలయాల నిర్మాణానికి, విగ్రహముల రూపకల్పనకు, ఇళ్ల నిర్మాణానికి ఎంతగానో తోడ్పడినదనుటలో సందేహము లేదు.

కరీంనగర్ జిల్లాలో వివిధ రకాల ఖనిజాలు లభిస్తాయి. ముఖ్యంగా సిమెంట్ కుపయోగపడు సున్నపురాళ్లు, బలపపురాళ్లు, ఇనుపరాతి లోహం ఇతర ఖనిజాలు లభిస్తాయి. దక్షిణ భారతదేశములో శిలాయుగానంతరము ఇనుము వాడుకలోనికి వచ్చింది. జగిత్యాల ప్రాంతంలో 35%నుండి 40% ఇనుప ఖనిజము గల మాగ్నెటైట్ క్వార్ట్జ్ రాయి ఎక్కువగా దొరుకుతుంది. ముడి ఇనుము సేకరించబడి జగిత్యాలకు సమీపమున గల రంగపేట, కోనాపురములలో కరగించబడేది. ఇనుపరాతి లోహం పెద్దపల్లి, మంథని, కరీంనగర్ తాలూకాల్లో గూడా లభ్యమయ్యేది. ముల్కనూరు, కల్లూరు, అనంతగిరి మున్నగు ప్రాంతాల్లో ఇనుమును కరగిస్తుండేవారు. మెటుపెల్లికి సమీపమునగల కోనసముద్రము (ఆర్మూర్ తాలూకా) లో కరగించి శుభ్రము చేయబడిన వూట్జ్ (Wootz) రూపములో నున్న ఇనుముకు పర్షియాలో ఎక్కువగా గిరాకీ ఉండేది. ఎల్గందల్, ఇబ్రహీంపట్నంలలో గూడా ఇనుమును కరగించి శుభ్రపరుచు కేంద్రాలుండేవి. తొలి చారిత్రకయుగం (Early Historical Period) లోనే అనగా దాదాపు 2500 సంవత్సరముల పూర్వమే రోమన్, పర్షియన్ వర్తకులు కోనసముద్రము మున్నగు ప్రాంతములకు వూట్జ్ కొనుగోలుకై వచ్చేవారు. ఇక్కడి ఇనుము పశ్చిమాసియాలోని డెమాస్కస్‌కు ఎగుమతి అయ్యేది[15]. రామగుండానికి సమీపంలో గల బసంత్‌నగర్, జగిత్యాల సమీపంలో గల నేరెల్లలో సున్నపురాయి అధికంగా లభ్యమౌతుంది.

కరీంనగర్ జిల్లాలో బొగ్గు అధికముగా లభ్యమయ్యే ప్రాంతానికి నూతనంగా ఇవ్వబడిన పేరు గోదావరిఖని. జనగాం, అందుగులపెల్లి, మల్కాపూర్, సుందిల్ల, జల్లారం, చందనాపూర్, మారెడుబాక, వీర్లపల్లె, వెంకట్రావుపల్లె, అల్లూరు, వకీల్‌పల్లె, నాగెపెల్లి యను పాత గ్రామాల ప్రాంతములే నేడు గోదావరిఖని పట్టణంగా రూపొందింది[16].

## శీతోష్ణస్థితి

కరీంనగర్ జిల్లాలో సంవత్సరానికి సరాసరి వర్షపాతము 1050 మిల్లీమీటర్ల వరకుంటుంది. వేసవికాలము ఎప్రిల్, మే నెలలలో ఉష్ణోగ్రత $47^0$ డిగ్రీల సెల్సియస్ వరకు

పెరుగుతుంది. డిసెంబర్, జనవరి నెలల్లో $8^0$ డిగ్రీల సెల్సియస్ వరకు పడిపోతుంది. కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాల తూర్పు ప్రాంతాలు నేటికిని దట్టమైన అడవులతో కూడుకొని ఉన్నాయి. గోదావరికి ఉత్తరమున ఆదిలాబాద్ జిల్లాలో చెన్నూరు తాలూకాలోని వేమనపెల్లి లేదా యానాంపెల్లి గ్రామపు అడవుల్లో 1974-1980 మధ్యకాలంలో వెలికి తీసిన డైనోసార్స్ (Dinosaurus) రాకాసిబల్లి శిథిలాలను హైద్రాబాద్ మ్యూజియంలో రూపకల్పన చేసి ఇటీవలె జనుల సందర్శనార్థము నిలిపారు[17]. గోదావరికి దక్షిణమున మంథని ప్రాంతంలో మల్హార్ మండలములోని వల్లెంకుంట హ్యామ్లెట్ గ్రామమైన కొయ్యూరులో దాదాపు రెండు దశాబ్దముల పూర్వము వేరొక డైనోసార్ అస్థికలు బయల్పడినాయి. వాటిని వెలికితీసి నేషనల్ జియలాజికల్ రీసెర్చి ఇన్స్టూట్ వారు హైద్రాబాద్‌కు తరలించారని కరీంనగర్ పురావస్తుశాఖ సాంకేతిక నిపుణుడు యం.లక్ష్మినారాయణ తెలిపాడు. గోదావరికి ఉత్తరాన చెన్నూరు దక్షిణాన మంథని అడవులలో రెండుచోట్ల డైనోసార్ అస్థికలు లభ్యమగుట వలన వాటి సంచారము దండకారణ్య ప్రాంతములో అధికముగా నుండెనని తెలుస్తుంది. ఇవి కొన్ని కోట్ల సంవత్సరముల క్రితము సంచరించిన జంతువులు. ఇటీవల తమిళనాడులోని అరియలూరు సమీపములో కల్లాన్ కురిచ్చియను గ్రామములో త్రవ్వుచుండగా ఒక పెద్ద డైనోసార్ గుడ్డు బయల్పడింది. దీనిలోని భాగములను జర్మనీకి చెందిన కోక్రింగ్, హ్యాంబర్గ్‌కు చెందిన కోరెంయను ఐరోపియన్ శాస్త్రవేత్తలు, అరసు సిమెంట్ ఫ్యాక్టరీ పురావస్తు నిపుణుడు పార్థసారథి పరిశోధనలు జరిపి ఈ గుడ్డు 12 కోట్ల సంవత్సరాల క్రితముదని నిర్ధారించారు[18]. దీనిని బట్టి ఈ గోదావరి లోయలోని డైనోసార్‌లు గూడా దాదాపు అదేకాలమునకు చెందినవని నిర్ణయించవచ్చు. క్రమేణ అడవులు క్షీణించినా చెన్నూరు మంథని ప్రాంతాలు నేటికీ దట్టమైన అడవులతో నిండిఉన్నాయి. ఇలాంటి జీవ వృక్ష పరిసరాలలో ఆదిమానవుడు ఈ ప్రాంతపు ప్రత్యేకతను దృష్టిలో పెట్టుకొని జీవించుచూ, రాతి యుగం నుండి పట్టణ సంస్కృతి దశకు వృద్ధి చెందుతూ వచ్చాడు.

## కరీంనగర్ చరిత్రకు ఆధారములు

కరీంనగరము జిల్లా రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక పరిస్థితులను తెలుపుటకు వివిధ కాలములకు చెందిన శాసనములే ప్రధానాధారములు. శిలాశాసనములు, తామ్రపత్రములు వాటి సమకాలీన జీవనాన్ని చక్కగా ప్రతిబింబింపజేయును. చాలా మట్టుకు ఈ శాసనములన్నియు దైవము (deity) నకు దానములిచ్చిన వివరములనే తెలుపుచున్నాయి. ఇవి సాధారణముగా దేవాలయముల ఆవరణలో గాని వాటి చుట్టు గాని నిలుపబడినాయి. వీటిని బట్టి వివిధ గ్రామములు, అచటి దేవాలయములు, కోటలు ఎంత ప్రాచీనమైనవో, ఎవరు వాటి నిర్మాతలో ఆయా దైవములకు ఎవరెవరు ఎట్టి దానములు చేసినారో తెలుస్తుంది. దేవుని అంగరంగ వైభోగమునకు తదితర నివేదనలకు దానము చేయబడిన పన్నుల వివరములను ఈ శాసనములు తెలుపుచున్నాయి.

కరీంనగర్ జిల్లాలో లభ్యమైన మొట్టమొదటి శాసనాలు వేములవాడను పాలించిన రెండవ అరికేసరి (క్రీ.శ. 930-955) కాలానికి చెందినవి[19]. వీటిని బట్టి ఈ ప్రాంతాన్ని సపాదలక్ష లేదా కోసవల సవాలఖె అని పిలిచేవారు. నేటి కరీంనగర్, నిజామాబాద్ జిల్లాల ప్రాంతమే ఆనాటి సపాదలక్ష[20]. వేములవాడ పాలకులశాసనాలు అరడజనుకు పైగా లభ్యమైనాయి. పశ్చిమ కళ్యాణి చాళుక్యుల శాసనాలు ఈ జిల్లాలో 20 ఉన్నాయి. వీరి శాసనాల్లో చొప్పదండిలో గల క్రీ.శ. 992 ఆహవమల్లదేవుని శాసనామే తొలి శాసనం[21]. చాళుక్యుల శాసనాలు కన్నడభాషలో ఉండగా కాకతీయుల శాసనములు తెలుగులో ఉన్నాయి. కాకతీయుల కాలపు శాసనాలు 15 వరకు ఈ జిల్లాలో కలవు. ఇవి గాకుండా పొలవాస (పొలాస) ప్రభువుల (Polavasa Chiefs) వెలమనాయకుల శాసనములు గూడా ఉన్నాయి. విజయనగర రాజులకు సంబంధించిన దేవరాయల 1397 నాటి ఒకే ఒక శాసనం కాళేశ్వరంలో ఉంది.

ఆం.ప్ర. ప్రభుత్వ పురావస్తు శాఖ కరీంనగర్ జిల్లా సర్వేచేసి పదవ శతాబ్దము నుండి ఇప్పటి వరకు లభ్యమైన దాదాపు 80 శాసనాలను సేకరించి పి.వి. పరబ్రహ్మశాస్త్రి సంపాదకులుగా 1974లో ఒక గ్రంథాన్ని ముద్రించింది. ఇవి గాకుండా అముద్రిత శాసనములు (Unpublished inscriptions) గూడా లభ్యమైనాయి. అట్టి అముద్రిత శాసనాల్లో ఒకటి 1305 రాయికల్ త్రికూటాలయ శాసనాన్ని, రెండవది నగునూరు రామలింగాల గుడి వద్ద శిథిలమైన రాతి శాసనమును డా.జైశెట్టి రమణయ్య తన టెంపుల్స్ ఆఫ్ సౌత్ ఇండియా *(Temples of South India)* గ్రంథ అనుబంధములో ముద్రించారు[22].

## రాగి రేకు శాసనాలు (Copper Plates)

శిలాశాసనములే కాకుండా ఈ జిల్లాలో రాగి రేకులు (Copper Plates) గూడా లభ్యమైనాయి. కాకతి గణపతి దేవుని కాలంలో దేవనాగరి లిపి యందు 1246లో తామ్రపత్రములపై చెక్కిన శాసనమును కరీంనగర్ డిగ్రీ కళాశాలలో చరిత్రోపన్యాసకులుగా పనిచేసిన సంజీవరావు నుండి పురావస్తుశాఖ సేకరించి ముద్రించింది[23]. ఇది రెండు రేకులపై చెక్కబడింది. ఒక్కొక్క రేకునకు రెండు వైపుల శాసనాంశములు చెక్కబడినాయి. రాజధానిగా వెలసిన నగునూరుకు సమీపమున గల చామన్‌పెల్లి గ్రామపు గొనుగు కాలువ తగాదా పరిష్కారాంశములు ఈ శాసనమందు పేర్కొనబడినాయి. చామన్‌పెల్లికి సమీపమున గల కుమ్మరికుంట, దేవనపల్లి మరియు కాట్యకోలపల్లి గ్రామపెద్దలు సాక్షులుగా నిలిచినారు. ఆ రోజులలో కరీంనగర్ ప్రాంతానికి అక్షయ చంద్రదేవుడు పాలకుడుగా నుండెనని ఈ శాసనం వల్ల తెలుస్తుంది. ఇటీవల నవంబర్ 2001లో గంగాధర మండలములోని వెంకటాయపల్లెలో ఒక రైతు వ్యవసాయబావి త్రవ్వుచుండగా ఒక కడియముతో చుట్టబడిన ఐదు తామ్రరేకులు బయల్పడినాయి. ఈ రేకులు ఏడున్నర కిలోల బరువున్నాయి[24]. ఒక్కొక్కరేకు 11 అంగుళాల పొడవు 7 అంగుళాల వెడల్పుతో నున్నది. వీటిపై వరాహము, సూర్యచంద్రుల ముద్రలున్నాయి.

ఈ తామ్రపత్రములు గూడా దేవనాగరి లిపిలోనున్నవి. కాకతి గణపతిదేవుని కాలములో ఇవ్వబడిన దానములను పేర్కొను శాసనముగా గుర్తింపబడినది. ఈ ఐదు తామ్రపత్రములు ప్రస్తుతము కరీంనగరము మ్యూజియంలో భద్రపరుచబడినాయి. వీటిలోని వివరములు ఇంకను అధికారికముగా పురావస్తుశాఖచే ముద్రింపబడలేదు.

## చారిత్రక కట్టడాలు (Historical Monuments)

## దేవాలయాలు

కరీంనగరము జిల్లాలోని చారిత్రక కట్టడాలు ప్రధానంగా దేవాలయాలు, కోటలు ఆనాటి సమకాలీన సమాజస్థితిగతులను ప్రతిబింబింపచేస్తున్నాయి. తొలిచారిత్రక యుగంలోని ఆలయాల ఆనవాళ్లులేవు. ఏడవ, ఎనిమిదవ శతాబ్దాలకు చెందిన నాలుగు గుహాలయములు మంథని మండలములోని అడవి సోమనపెల్లి గుట్టపై మానేరునదికి ఎదురుగా చెక్కబడినాయి. నిజానికి దేవాలయముల నిర్మాణము ఈ జిల్లాలో వేములవాడ చాళుక్యులతోనే ఆరంభమైంది. కరీంనగర్ జిల్లాలో నిలిచి ఉన్న అతి ప్రాచీన దేవాలయాలు వేములవాడలోనే ఉన్నాయి. కళ్యాణి చాళుక్యుల, కాకతీయుల కాలంలో అనేక దేవాలయాలు నిర్మింపబడినవి. చాళుక్యుల కళారీతులను వారి తరువాత పాలించిన కాకతీయులు అనుసరించారు. కాకతీయుల కాలపు దేవాలయాలు ఈ జిల్లాలో కొన్ని శిథిలావస్థలోనున్నా వాటి వాస్తు నిర్మాణము, శిల్ప సౌందర్యము నేటికి సందర్శకుల దృష్టినాకర్షించి ఆహ్లాదము కలిగిస్తున్నాయి. హనుమకొండ, పాలంపేట, పిల్లలమర్రి, నాగులపాడు ఆలయాలను బోలిన అందమైన దేవాలయాలు, శిల్పసంపదలను కరీంనగర్ జిల్లాలో అనేక చోట్ల చూడవచ్చు.

కరీంనగర్ జిల్లాలో 1100 లకు పైగా గ్రామములున్నాయి. జిల్లా అంతయు పర్యటించగా ప్రాచీన గుళ్లు ఒక వంద గ్రామాలలో గుర్తింపబడినాయి. అందులో కొన్ని నేటికి భద్రముగా నుండగా మరికొన్ని శిథిలావస్థలో ఉన్నాయి. ఈ దేవాలయములు, వాటిలోని శాసనములు ఆనాటి రాజకీయ, సాంఘిక చరిత్రను రూపొందించుటకు దోహదపడును.

## కోటలు (Forts)

తొలిచారిత్రక యుగములోని ధూళికట్ట, కోటిలింగాలలో బయల్పడినకోటలు మరియు మధ్యయుగములోని రామగిరి, ఎల్గందుల, ప్రతాపగిరి, మొలంగూర్ దుర్గములు, ఆసఫ్‌జాహీల కాలమునాటి జగిత్యాల ఖిలా (కోట) ఈ జిల్లా చరిత్ర రూపకల్పనకు తోడ్పడుచున్నాయి. అంతే గాకుండా ఈ జిల్లాలోని కొన్ని సంస్థానములలో, జాగీర్లలో, గ్రామములలో భూస్వాములు నిర్మించిన గడిలు ఆధునిక చరిత్రకు ఆధారములుగా నిలిచిఉన్నాయి. గడిలు అనగా దొరలుండు భవంతులు. అవి నిజాం రాజ్యకాలం నాటి భూస్వామ్య సంస్కృతిని ప్రదర్శిస్తాయి.

## చారిత్రక స్థలముల ప్రత్యక్ష పరిశీలన

జిల్లాలోని చారిత్రక స్థలముల ప్రత్యక్ష పరిశీలన (An on the spot study of the historical sites) ఈ ప్రాంతపు చరిత్ర అవగాహనకు, రచనకు మిక్కిలి తోడ్పడుతుంది. చారిత్రక స్థలాలలోని మట్టిదిబ్బలు, కుండ పెంకులు, ఇటుకముక్కలు, పూసలు, నాణెములు, శాసనములు, కట్టడములు, కోటలు, దేవాలయములు తదితర చారిత్రక అవశేషాలతో పాటు, స్థానిక వయోవృద్ధులైన ప్రముఖుల నుండి ప్రత్యక్షముగా సేకరించిన సమాచారము మున్నగునవి ఇచ్చటి చరిత్రను క్రమబద్ధంగా, చక్కగా రూపొందించుటకు విలువైన ఆధారాలుగా నిలుస్తాయి. చారిత్రక స్థలాలనన్నింటిని సందర్శించి నిశితమైన సమగ్ర పరిశీలన, పరిశోధన గావించిన తరువాతే చరిత్రకారుడు అతని రచనకు పూనుకొనుట శ్రేయస్కరం. అప్పుడే చరిత్ర రూపకల్పనకు సరియైన సంపూర్ణ న్యాయము చేకూరుతుంది.

## జిల్లా గురించిన రచనలు

కరీంనగర్ జిల్లా చరిత్రను ప్రతిబింబింప జేయుకొన్ని చారిత్రక శీర్షికలు, వ్యాసములు, రచనలు ముద్రింపబడినాయి. 1953లో ప్రముఖచరిత్రకారుడైన నేలటూరి వెంకటరమణయ్య గారి *The Chalukyas of Vemulavada* (వేములవాడ చాళుక్యుల చరిత్ర) ఆంగ్లములో ముద్రింపబడింది. 1972లో డా. యం.రాధాకృష్ణ శర్మ రచించిన *Temples of Telingana* (తెలంగాణా దేవాలయములు) గ్రంథములో ఈ జిల్లాలోని కొన్ని ప్రముఖ దేవాలయముల వివరాలున్నాయి. 1974లో డా. పి.వి. పరబ్రహ్మశాస్త్రి సంపాదకులుగా ఈ జిల్లాలోని 80 శాసనాలతో *Inscriptions of A.P. Karimnagar District* అనే పుస్తకాన్ని పురావస్తు శాఖ వెలువరించింది. 1981లో కరీంనగర్ జిల్లా రచయితల సంఘం మరియు శ్రీ త్యాగరాజ లలిత కళాపరిషత్ సంయుక్తంగా "కరీంనగర్ మండల చరిత్ర" యను పుస్తకమును తెలుగులో ముద్రించినాయి. కాని శాస్త్రీయ దృక్పథము, పరిశోధనాపటిమ, సహేతుకతలు ఈ పుస్తకంలో లేవు. 1983లో డా.వి.వి. కృష్ణశాస్త్రి రచించిన *The Proto and Early Historical Cultures of A.P.* అనే పుస్తకములో కరీంనగర్ జిల్లాలో తాను స్వయంగా జరిపిన త్రవ్వకాల్లో బయల్పడిన రాతియుగపు మరియు తొలి చారిత్రకయుగపు సంస్కృతుల గురించి వివరంగా తెలుపబడింది.

పెద్దపెల్లిలో వృత్తిరీత్యా న్యాయవాది, ప్రవృత్తిరీత్యా పురావస్తు త్రవ్వకాలలో ఆసక్తి గల ఠాకూర్ రాజారాంసింగ్ ఉత్తర తెలంగాణా, ప్రధానంగా ఆదిలాబాద్, కరీంనగర్ జిల్లాల ప్రాక్చరిత్రకు ప్రాణం పోశారు. 1983లో పురావస్తు శాఖ మరియు ఎ.పి. హిస్టరీ కాంగ్రెస్ ముద్రించిన సంచికలలో ఆయన వ్రాసిన శీర్షికలు, వ్యాసములు కరీంనగరము జిల్లా ప్రాక్చరిత్రను గూర్చి తెలుపుతాయి. 1983లో డా.యన్.యస్. రామచంద్రమూర్తి కరీంనగరము పురావస్తు శాఖలో రిజిస్టరింగ్ ఆఫీసర్‌గా పనిచేసినప్పుడు APHC సంచికలో అడవిసోమనపల్లి

గుహాలయములను తనవ్యాసము ద్వారా వెలుగులోనికి తెచ్చారు. 1987లో వి.రామకృష్ణారెడ్డి రచించిన *"Economic History of Hyderabad-Warangal Suba 1911-1950"* పుస్తకములో పాత హైద్రాబాద్ రాష్ట్రములోని వరంగల్ సుబా ఆర్థికచరిత్ర వివరింపబడింది. 20వ శతాబ్దములోని ప్రథమార్ధభాగములో ఈ జిల్లాలో నుండిన ఆర్థిక పరిస్థితుల గూర్చి కొంత సమాచారము ఈ పుస్తకమందిస్తుంది.

1989లో డా. జైశెట్టి రమణయ్య గ్రంథము *Temples of South India* ముద్రింపబడినది. పుస్తకము యొక్క టైటిల్ (Title of the book) పాఠకులను కలవరపరుస్తుంది. ఎందుకనగా నిజమునకు ఈ గ్రంథములో కేవలము కరీంనగరము జిల్లా దేవాలయములు మరియు ఈ ప్రాంతపు చరిత్ర గూర్చియే తెలుపబడింది. అదే 1989లో ముద్రింపబడిన ఈయన వేరొక గ్రంథము *The Chalukya and Kakatiya Temples - A Study*లో జగిత్యాల ప్రాంతపు దేవాలయములు, వాటి చరిత్రను గూర్చి తెలుసుకోవచ్చు. ఇంగ్లీషులో నున్న ఈ రెండు పుస్తకాలు కరీంనగర్ జిల్లా చరిత్ర తెలిసికొనుటకు నేడు జిల్లా అంతట ప్రధానాధార గ్రంథములుగా ఉపయోగపడుతున్నాయి.

1989లోనే వెలువడిన డా.యం. నరసింహాచార్యులు గారి రెండు ఆంగ్ల గ్రంథములు *History of the cult of Narasimha in Telangana* మరియు *History of the cult of Narasimha in A.P.* కరీంనగరము జిల్లాలోని నరసింహ దేవాలయముల చరిత్రను తెలుపుతాయి. 1990లో కృష్ణవేణి వ్రాసిన *Inscriptional Geography of Karimnagar district* ఈ జిల్లా శాసనముల గూర్చి భౌగోళిక సమాచారమునందించు యం.ఫిల్. వ్యాసగ్రంథము ఇంకను ముద్రింపబడినట్లుగా లేదు. డా.కె. నరోత్తమరెడ్డి వ్రాసిన "The Contribution of Karimnagar district to the Social and Political Movements in Telangana" డాక్టరేట్ పరిశోధనావ్యాసములో ఈ జిల్లా యందు నిజాంకు వ్యతిరేకముగా జరిపిన సాంఘిక, రాజకీయ ఉద్యమముల గూర్చి తెలుపబడింది. ఇది కూడా ముద్రింపబడిన సమాచారము లేదు.

హైదరాబాద్ పురావస్తుశాఖలో శాసనపరిశోధనా విభాగములో ఉన్నత స్థానమునలంకరించిన డా.యన్.యస్. రామచంద్రమూర్తి 1996లో వెలువరించిన *Forts of A.P.* ఆంగ్ల గ్రంథములో కరీంనగరము జిల్లాలోని శాతవాహనుల కాలపు కోటిలింగాల, ధూళికట్ట కోటల సమాచారము అందించబడింది. ధర్మపురిలోని శ్రీ లక్ష్మీనరసింహ సంస్కృతాంధ్ర కళాశాలలో సీనియర్ చరిత్రోపన్యాసకులుగా నున్న డా.యస్. జైకిషన్ గారి (A.D. 2001) డాక్టరేట్ పరిశోధనావ్యాస గ్రంథము "War Craft, Arms and Armour in Medieval Deccan 1500-1700 A.D." ముద్రణలో ఉంది. కరీంనగరము జిల్లాలోని మధ్యయుగపు కోటల సమాచారము కొంత మట్టుకు ఈ గ్రంథమందు గోచరిస్తుంది. హైద్రాబాద్‌లో ఆం.ప్ర. ప్రభుత్వ మ్యూజియంలో నున్న సీనియర్ అధికారిణి యు.లక్ష్మి 2002లో డాక్టరేటు పొందిన పరిశోధనా

వ్యాసగ్రంథము (A Study of Inscriptions of Karimnagar District) ముద్రింపబడ వలసి ఉంది.

1997లో డా. మలయశ్రీ రచించిన "కరీంనగరము జిల్లా తెలుగు సాహిత్యచరిత్ర" యను ఉద్గ్రంథము ఈ జిల్లా వెయ్యేండ్ల తెలుగు సాహిత్యచరిత్రను సజీవముగా నుంచుటయే గాక ఇది ఈ ప్రాంతపు సాహితీలోకములో మకుటాయమానముగా నిలిచి ఉంది.

పై రచనలే గాకుండా 1957లో కొరిడె సదాశివశాస్త్రి రచించిన "ధర్మపురి క్షేత్ర మహాత్మ్యము" 1970లో వేములవాడ దేవస్థానము ప్రచురించిన "శ్రీరాజరాజేశ్వర క్షేత్ర మహాత్మ్యము", 1979లో శ్యాంసుందరశాస్త్రి సంపాదకులుగా వెలువడిన "త్రిశతి" గ్రంథము, చొప్పకట్ల చంద్రమౌళి రచించిన "వేములవాడ చరిత్ర", యరబాటి బాబూరావు యొక్క "రామగిరిచరిత్ర", 1991లో బి.యన్.శాస్త్రి రచించిన "వేములవాడ చరిత్ర–శాసనములు" మున్నగు పుస్తకాలన్నీ కరీంనగర్ జిల్లా చరిత్రను పూర్తిగా తెలుసుకోవటానికి బాగా ఉపయోగపడుచున్నాయి. ఇవి గాకుండా దృష్టికి రాని చిన్న, పెద్ద పుస్తకములు, వ్యాసములు, రచనలు జిల్లా అంతటా ఉన్నాయి.

పైన పేర్కొనబడిన గ్రంథములే గాకుండా ఎందరెందరో చరిత్రకారులు ఆం.ప్ర. హిస్టరీ కాంగ్రెస్ గత 25 సంవత్సరముల నుండి ప్రతిఏట ప్రచురించుచున్న సంచికలలో, అలాగే ఆం.ప్ర. పురావస్తు శాఖ ప్రచురించు సంచికలలో తమ వివిధ శీర్షికలు, వ్యాసములు, రచనల ద్వారా ఈ జిల్లాకు సంబంధించిన విశేష చారిత్రక సమాచారము నందిస్తూనే ఉన్నారు. విలువైన వందలాది గ్రంథముల నుండి సేకరించిన సమాచారము ఈ జిల్లా చరిత్ర రచనకు తోడ్పడుతుంది. అట్లు సంప్రదించిన ఉపయుక్త గ్రంథముల పట్టిక (Bibliography) రాబోవు పరిశోధకుల సౌకర్యార్థమై ఈ పుస్తకము చివరలో ఇవ్వబడింది.

ఇంతవరకు కరీంనగర్ జిల్లా పరిపూర్ణమైన చరిత్ర వ్రాయబడలేదు. అందులకే కరీంనగరము జిల్లా పాఠకలోకానికి, సామాన్య ప్రజలకు తెలుగులో సరళ భాషలో ఈ జిల్లా సమగ్ర చరిత్ర, సంస్కృతిని అందజేయు ప్రయత్నమే ఈ చారిత్రక గ్రంథ రూపము. కరీంనగర్ జిల్లా ప్రాక్చరిత్ర, చరిత్ర, చారిత్రక స్థలాలు, దేవాలయాలు, శిల్పసంపద, మత, సాంఘిక, ఆర్థిక పరిస్థితులు, వాణిజ్యము, రాకపోకలు, నాణెములు, కొలతలు మున్నగు అంశాలతో సమగ్ర చరిత్రను సమాజమునకందించు ప్రధాన లక్ష్యముతోనే ఈ గ్రంథరచన గావింపబడింది. ఇది కరీంనగరము జిల్లా గత మూడు వేల సంవత్సరాల వైభవోపేత చరిత్రను పాఠకలోకమునకు అందించాలన్న ఆశయంతో వ్రాయబడింది.

## చరిత్రపూర్వ యుగం (ప్రాక్చరిత్ర–Prehistory)

ఉత్తర తెలంగాణాలో ప్రత్యేకంగా గోదావరిలోయలో గల కరీంనగర్, ఆదిలాబాద్

జిల్లాలలోని రాతియుగపు పెక్కు స్థావరాలను కనుగొని వాటిని పరిశీలించి, పరిశోధించి అచటి రాతి పనిముట్లను, రాతియుగపు సంస్కృతులు వివిధ దశలలో పరిణామము చెందిన క్రమమును, వాటి అభివృద్ధిని వెలుగులోనికి తెచ్చిన ఘనత పెద్దపెల్లి న్యాయవాది ఠాకూర్ రాజారాంసింగ్, పురావస్తుశాఖ డైరెక్టర్‌గా పనిచేసిన డా.వి.వి.కృష్ణశాస్త్రికి దక్కినదనుటలో అతిశయోక్తి లేదు. కరీంనగర్ జిల్లా రాతియుగపు చరిత్రను ఈ దిగువ పేర్కొనిన దశలుగా విభజింపవచ్చు.




## తొలిపాతరాతియుగము Lower Palaeolithic Age

(క్రీ.పూ. 1,50,000 నుండి 50,000 వరకు)

కరీంనగరము జిల్లాలో అనేక ప్రాచీన శిలాయుగపు స్థావరాలు కనుగొనబడినవి. పెద్దపెల్లి ప్రాంతంలోని అల్లూరు, జనగాం గ్రామాలలో తొలిలేదా పూర్వపాతరాతి, మధ్యపాతరాతి యుగములకు చెందిన చేతిగొడ్డళ్లు (Hand axes) మరియు బిచ్చురాళ్లు, గీకుడురాళ్లు (Flake Scrapers) మున్నగు రాతి పనిముట్లు యల్.మున్ (L.Munn) చే కనుగొనబడినాయి[25]. గోదావరి ఒడ్డు ప్రాంతాలైన రామగుండం, జనగాం, గోదావరిఖని, పెద్దపెల్లి, కనగర్తి, మంథని, బసంత్‌నగర్, కాళేశ్వరం పాలితం గుట్టలపైన ఈ యుగానికి సంబంధించిన హ్యాండ్ ఆక్స్‌లు, క్లీవర్లు మున్నగు పనిముట్లు లభించాయి. గోదావరిఖని ప్రాంతంలో రాతిగొడ్డళ్లు, చక్రాల్లాంటి పనిముట్లు లభించాయి[26]. వీరి స్థావరాలపై కమ్మి ఉన్ననేల క్రమముగా క్షయం చెందడం వల్ల ఈ పనిముట్లు బయల్పడినాయి. ఆది మానవుడు ఈ జిల్లాలో లభించే క్వార్ట్‌జైట్ రాయినే తన పనిముట్ల తయారికి వాడుకున్నాడు. ఈ కాలపు మానవుడు ఈ జిల్లాలో క్రీ.పూ. ఒక లక్ష 50 వేల సంవత్సరాల నుండి 50వేల సంవత్సరాల క్రితం వరకు నివసించి ఉంటాడు.

## మధ్యపాతిరాతియుగము Middle Palaeolithic Age

(క్రీ.పూ. 50,000 నుండి 30,000 వరకు)

తొలిలేదా పూర్వపాతరాతి యుగములో మానవుడు రాతి ముడి పదార్థాలలోనే బిచ్చులు లేదా పెచ్చులు విడదీసి పనిముట్లను మలచుకున్నాడు. కాని ఈ మధ్య పాతరాతియుగంలో

విడదీయబడిన బిచ్చురాళ్లతో పనిముట్లు తయారుచేసుకున్నాడు. దీని వలన పనిముట్ల బరువు, పరిమాణం తగ్గింది. ఈ యుగంలో మానవుని స్థావరాలు అధికమైనాయి. ఇలాంటి స్థావరాల నుండి కత్తి ఆకారపు అంచు, ముక్కోణపు ఆకారంలోగల బల్లెపు మొనలు, చర్మపు వస్తువులకు రంధ్రం చేసే పనిముట్లు వందలాదిగా లభించాయి. ఆహారసేకరణకు ఈ పనిముట్లు ఉపయోగపపడినవి. ఈ కాలపు పనిముట్లు గూడా క్వార్ట్జైట్ గులకరాళ్లతో మలుచబడినవే. ఈ కాలపు స్థావరాలు ఈ జిల్లాలో పెద్దంపేట, రామగుండం, మేడిపెల్లి, బుచ్చయ్యపల్లె, మల్కాపూర్, ఖాజీపల్లె, గుండారం, కమాన్‌పూర్, వకీలుపల్లె, లక్ష్మీపూర్, గోదావరిఖని బొగ్గుగని ప్రాంతము, బుగ్గ, బోడగుట్ట, మంథని దక్షిణ ప్రాంతాలు మున్నగు చోట్ల బయల్పడినాయి. ఈ కాలములో మానవుడు ఎక్కువ ప్రాంతాలలో విస్తరించాడని చెప్పవచ్చు. ఎందుకనగా ఈ కాలపు పనిముట్లు వేల సంఖ్యలో లభించడం గమనార్హం. ఈ ప్రాంతంలో ఈ కాలపు మానవుని కాలమానం క్రీ.పూ. 50వేల నుండి 30 వేల సంవత్సరాల క్రితం వరకు ఉండి ఉంటుంది[27].

## తరువాతి పాతరాతియుగము Upper Palaeolithic Age

(B.C. 30,000 నుండి 10,000 వరకు)

ఈ కాలంలో మానవుడు తన పనిముట్లను బ్లేడు ఆకారపు బిచ్చురాళ్లతో తయారుచేసుకున్నాడు. ఈ కాలపు బ్లేడ్లు (పదునైన కొచ్చని పరికరములు) బరువులో పరిమాణంలో మరింత తగ్గినాయి. ఈ కాలపు పనిముట్లు రామగుండం, గోదావరిఖని, కరీంనగర్, జగిత్యాల, మంథని ప్రాంతాల్లో కనుగొనబడినాయి. గోదావరినది నానుకొని ధర్మపురి నుండి మంథని తాలూకాలోని ఖానాపూర్ వరకు వివిధ కాలాలకు చెందిన అనేక రాతి పనిముట్లు కనుగొనబడినాయి.

పెద్దపల్లి ప్రాంతములోని తక్కలపెల్లి గుట్ట సమీపాన గల బుగ్గవద్ద ఊట పరిసరాలలోను (Around the spring), రంగాపూర్ గుట్టల వద్ద, దేవునిపల్లి, దుబ్బపల్లి, గోపయ్యపల్లి, కాసులపల్లి (పాల్డెం యొక్క హ్యామ్లెట్), సుల్తానాబాద్, ఖదీమ్‌కనగర్తి, రచ్చపెల్లి గుట్టలవద్ద, వేమ్నూరు ఏరువద్ద, మరియు గౌరీగుండం జలపాతమునకు ఎదురుగా గల సబ్బితం మున్నగుప్రాంతములు ఉత్తరపాతరాతి యుగపు ప్రధాన స్థావరములు.

గౌరీగుండం స్థావరాన్ని ఠాకూర్‌రాజారాం సింగ్ మరియు డా. వి.వి.కృష్ణశాస్త్రి స్వయంగా పరిశీలించి వందలాది రాతి పనిముట్లను, ముడిపదార్థాలను కనుగొన్నారు. వందలాది బ్లేడ్లు (పదునైన కొచ్చని పనిముట్లు), బ్లేడ్ల పరికరాలు బయల్పడినాయి. వీరిరువురు మేడిపెల్లి హ్యామ్లెట్ గ్రామాలైన బుచ్చయ్యపల్లి, నర్సంపెల్లి మధ్యనున్న స్థావరాలను పరిశీలించి పరిశోధించారు[28]. ఈ కాలపు (Late Stone Age) మానవులు క్రీ.పూ. 30,000 నుండి 10,000 సంవత్సరాల క్రితము వరకు నివసించిఉంటారు.

## సూక్ష్మరాతియుగము Microlithic or Mesolithic Age

(క్రీ.పూ. 10,000 నుండి 3000 వరకు)

ఈ సూక్ష్మరాతియుగంలో కూడా మానవుడు తన పనిముట్లను రాతి బ్లేడ్లపై మలచుకున్నాడు. తక్కువ ముడి పదార్థాల నుండి ఎక్కువ పరికరాలు చేసే ప్రయత్నము చేశాడు. ఈ పరికరాలు నేరుగా వాడేవి కావు. ఇతర వస్తువులతో జతపరిచి వాడేవాడు. కర్రలో గాని, ఎముకలోగాని చిన్న తొలిచేసి, ఆ తొలిలో పరికరాలను అమర్చివాడేవాడు. ఈ లఘురాళ్ల పరిశ్రమలో చెకుముకి రాళ్లను ముడి పదార్థాలుగా మానవుడు ఉపయోగించినాడని ఠాకూర్ రాజారాంసింగ్ వెలిబుచ్చారు. ఈ కాలంలో జనాభా కొంత పెరిగింది. ఈ కాలపు మానవుడు జిల్లాలో అన్ని చోట్ల విస్తృతంగా సంచరించాడు.

సూక్ష్మరాతి యుగపు మానవుడు చర్ట్ (Chert), ఎగేట్ (Agate), చాల్సిడోని (Chalcedoni), జాస్పర్ (Jasper) మొదలగు చాలా గట్టిరాళ్లపై పెచ్చులు తీసి వాటిని పనిముట్లుగా తయారుచేశాడు. ఎముకలు, కర్రపనిముట్లు ఎక్కువగా వాడాడు. సూక్ష్మమైన, అతి చిన్నవైన 2 లేదా 3 సెం.మీ. పొడవు గల పనిముట్లు వాడాడు. ఈ కాలములో లూనేట్స్ (Lunates), ట్రెపిజియంలు (Trepiziums), త్రికోణాలు (Triangulars) , పోయింగ్‌లు (Poings) లాంటి సూక్ష్మపనిముట్లు వాడుకలో నుండెనని తెలుస్తుంది[29]. సూక్ష్మరాతియుగపు మానవులు స్థావరాలేర్పరచుకొని నదీ తీరాలలో, గుహలలో, శైలావాసాల్లో (రాక్‌షెల్టర్స్‌లో), భూమిపై గుంటలు తీసి ఆ గుంటలలో, గుట్టల పైప్రాంతాలలో నివాసముండేవారు. నదీ పరివాహక ప్రాంతాల్లో వర్షాకాలం ఒండ్రుమట్టిలో గింజలు చల్లి పండిన ధాన్యమును భద్రపరుచుకొనేవారు.

ఈ కాలపు పనిముట్లు రామగుండం, గోదావరిఖనిలోనే గాక కరీంనగర్, జగిత్యాల, మంథని తాలూకాల్లో గూడా కనుగొనబడినాయి. వాగులు, ఒర్రెలు, ఊటలు, జలపాతాలు మరియు నీటి ఆధారాలున్న చోట వీరి స్థావరాలు బయల్పడినవి. ఒక్క పెద్దపెల్లి ప్రాంతంలోనే 50కి పైగా వీరి స్థావరాలు గుర్తింపబడినాయి. చింతకుంట, వెలిచాల, మంథని సమీపమున గల గుంజపడిగె, నాగారం, దుబ్బపల్లె మున్నగుచోట్ల వీరి పరికరములు గుర్తింపబడినాయి. మెడిపెల్లి హ్యామ్లెటైన బుచ్చయ్యపల్లి మరియు నర్సంపల్లి మధ్యనున్న తరువాతి పాతరాతి స్థావరానికి కేవలం వంద మీటర్ల దూరంలో ఒక విశాలమైన సూక్ష్మరాతి యుగపు స్థావరం గుర్తింపబడింది. బుగ్గ, గౌరీగుండం, నర్రాశాలపల్లె, వకీలుపల్లె, రామగిరి మున్నగుచోట్ల ఈ కాలపు పనిముట్లు లభ్యమైనాయి. ఈ కాలపు మానవుడు సుమారు 10,000 నుండి 3000 సంవత్సరాల క్రితం వరకు నివసించిఉంటాడు.

## కొత్తరాతి యుగం Neolithic Age (New stone age)

(క్రీ.పూ. 3000 నుండి 1000 వరకు)

భారతదేశంలోని ఇతర ప్రాంతాల వలె కరీంనగర్ జిల్లా గూడా కొత్తరాతి యుగపు మానవుని ఉనికికి సానుకూలముగా ఉండేది. ఇచటి నైసర్గిక, భూగర్భ పరిస్థితులు గూడా వీరి స్థావరము లేర్పడుటకు తోడ్పడినాయి. ఈ యుగపు పనిముట్లకు నల్లసరపు రాళ్లను ముడి పదార్థాలుగా వాడినారు. ఈ పనిముట్లు 6 నుండి 20 సెం.మీ. పొడవు ఉంటాయి. ఈ కాలపు మానవుడు రాతి పరికరాలను పదునుగా, నునుపుగా చేయు పద్ధతినవలంబించాడు. కదంబాపూర్, హుస్నాబాద్‌కు సమీపమున గల రేగొండ, బూడిగపల్లి వద్ద గల కొండచరియ ఆవాసాలు (Rock Shelters) కొత్తరాతి యుగపు మానవుని స్థావరములుగా ఉపయోగపడినాయి. కరీంనగర్‌కు సమీపమున గల రేకుర్తి గుట్టల్లో అల్లంరాజు దొనయను కొండచరియ ఆవాసం (Rock Shelter) అచటి బృహత్‌శిలాయుగపు సమాధుల సమీపాన్నే ఉంది. హుజూరాబాద్ సమీపమున గల రంగనాయకుల గుట్టలో రాక్‌షెల్టర్స్ గలవని తెలుస్తుంది. ఇచ్చట మాతృదేవత లేదా నగ్నకబంధ (Mother Goddess) ప్రతిమ ఒకటి లభ్యము కావడము ఈ స్థల ప్రాచీనతను సూచిస్తుంది[30]. కొన్ని సందర్భాలలో కొత్త రాతియుగపు గొడ్డళ్లు తరువాతి పాతరాతి స్థావరముల మరియు బృహత్‌శిలాసమాధుల సమీపంలో దొరికాయి. కొత్త రాతియుగపు స్థావరాలు సుల్తానాబాద్ సమీపమున మానేరునది ఉత్తరతీరాన గల తొగర్రాయి, కదంబాపూర్, హుస్నాబాద్ సమీపంలో గల బూడిగపల్లి,హుజూరాబాద్ సమీపంలో గల మొలంగూర్ మున్నగుచోట్ల బయల్పడినాయి.

సంవత్సరమంతా జీవనదిగా ప్రవహించుమానేరు నది ఒడ్డున నున్న తొగర్రాయి గ్రామ సమీపమున గల పాండవుల గుట్ట వద్ద నూతన శిలాయుగపు పనిముట్లు తయారుచేయు స్థలమొకటి (A Neolithic Factory site) కనుగొనబడింది[31]. ఇక్కడ ఈ యుగపు మానవుడు తయారు చేసిన పనిముట్లే గాక, ముడిపదార్థపు రాళ్లు, వాటి నుండి తయారుచేసిన పరికరాలు, ముడిరాళ్ల నుండి వెలువడిన అన్నిరకాల బిచ్చురాళ్లు (Pieces) లభించాయి. ఇచట అన్నిరకాల అనేక పూర్తికాని పరికరాలు, పూర్తిగా తయారైన రాతి బాడిశలు (Adzes), గొడ్డళ్లు (Axes) ఎక్కువగా దొరికాయి.



రాతి పనిముట్లు - తొగర్రాయి



రాతి గొడ్డలి - పెద్దబొంకూరు

తొగర్రాయికి 5 కి.మీ. దూరంలో మానేరు ఒడ్డున కదంబాపూర్ వద్ద అనేక బృహత్ శిలా సమాధులున్నాయి. ఇచ్చటి గుట్టల వాలు ప్రాంతాల్లో (Sloping plains of the hills) అనేక కొత్త రాతియుగపు రాళ్ల గొడ్డళ్లు సేకరింపబడినాయి. ఈ యుగపు తొలిమానవుడు ఇక్కడి గుట్టలలో గల శైలావాసాలు (రాక్‌షెల్టర్లు), కొండగుహలు (Rock Shelters and Caverns) తప్పక ఉపయోగించుకొని ఉంటాడు. కదంబాపూర్ వద్ద ఈ కాలపు రాతిగొడ్డళ్లు, బండబాడిశలు, ఉలులు, రాతిగుండ్లు, ధాన్యం దంచే పరికరాలు, నూరేరాళ్లు (Grinding Stones) తదితర పరికరాలు లభించాయి. ఇచ్చటి స్థావరాలలో ఈ కాలపు కొన్ని మృణ్మయపాత్రలు, పెంకులు చేతితో చేసినవి కనుగొనబడినాయి.

పెద్దపెల్లి సమీపమున గల పెద్ద బొంకూర్ త్రవ్వకాలలో కొత్తరాతి యుగపు గొడ్డళ్లు చాల లభ్యమైనాయి. ఈ రాతి పరికరాలు ఇక్కడికి 8 కి.మీ. దూరంలోనున్న తొగర్రాయి, కదంబాపూర్‌ల నుండి దిగుమతి చేసుకొనిఉంటారు. పెద్దబొంకూర్‌లో లభ్యమైన పనిముట్లనుబట్టి ఈ యుగపు మానవుడు కేవలము గుట్టబోరులందే గాక తన వ్యవసాయపు అవసరాలకు మైదానములందు గూడా స్థిరపడినట్లు తెలుస్తుంది. హుస్నాబాద్‌కు 6 కి.మీ. దూరంలో నున్న బూడిగపల్లి యను కుగ్రామము వలసగట్టు, సంజీవరాయని గట్టు, వెంకయగట్టు అను గుట్టలచే చుట్టబడిఉంది. ఈ గుట్టలలో ఆవిర్భవించిన కాలువ, ఇక్కడి రాక్‌షెల్టర్లు (Rock Shelters), కొత్తరాతి యుగపు మానవుని ఉనికికి మిగులతోడ్పడినాయి. ఇచట డొలరైటు రాయి అధికముగా లభ్యమౌతుంది. వలసగట్టుపై ఈ యుగపు రాతి గొడ్డళ్లు, చేతితో తయారుచేసిన మట్టి పాత్ర పెంకులు లభించాయి. మంథని సమీపమున గల గుంజపడిగె, కోహెడ, పర్లపల్లి, శనిగరం, వేములవాడ ప్రాంతాల్లో ఈ కాలపు ముడిపదార్థపురాళ్లు, బిచ్చరాళ్లు, పనిముట్లు (Cores, Flakes, artefacts) కనుగొనబడినాయి[32]. ఈ యుగపు నునుపైన రాతి గొడ్డళ్లు ఇతర పనిముట్లు పెద్దపెల్లి ప్రాంతములోని అల్లూరు, జనగాంలందు గూడా లభ్యమైనాయి[33].

బూడిగపల్లి వద్దనున్న వలసగట్టు గుట్టలపైనున్న కొండచరియ ఆవాసాల కప్పులమీద జాజురంగులో గీసిన వివిధ రకాల చిత్రాలు (Rock Paintings) కనుగొనబడినాయి[34]. ఈ చిత్రములలో వేట దృశ్యములు, జంతువులు, అశ్వారూఢులైన గుర్రపురౌతుల చిత్రాలు (Paintings) అగబడుతాయి[35]. ఇలాంటి రాక్ పేయింటింగ్స్ హుస్నాబాద్ సమీపమున గల బూడిగపల్లి, రేగొండ రాక్‌షెల్టర్‌లలో గూడా అగబడుతాయి[36]. ఈ చిత్రములు కొత్తరాతి యుగము నుండి తొలిచారిత్రక యుగము వరకు వివిధకాలములకు సంబంధించినవి.

## బృహత్‌శిలాయుగము లేక ఇనుపయుగము Megalithic Period

(క్రీ.పూ. 1000 నుండి క్రీ.శ. 200 వరకు)

కొత్తరాతి యుగం తరువాత కరీంనగర్ జిల్లాలో బృహత్ శిలాయుగపు సమాధుల

(రాకాసిగుళ్లు)కు సంబంధించిన మానవుని సంస్కృతి వివరాలు విస్తారంగా లభిస్తున్నాయి. ఈ సమాధులు గుర్తించడం అతిసులభం. గుట్టలలోని రాళ్లలో గుండ్రటి రాళ్లను ఎంపిక చేసి వాటిని సమాధుల చుట్టూ గుండ్రంగా నిలపటం ఈ కాలపుపద్ధతి. మన సరిహద్దు రాష్ట్రమైన కర్ణాటకలోని హల్లూరు వద్ద గల బృహత్ శిలా సమాధుల కాలపు సంస్కృతి క్రీ.పూ. 1000 నుండి క్రీ.శ. 200 వరకుండెనని రేడియోకార్బన్ డేటింగ్‌ల ఆధారంగా తేలింది[37]. మన రాష్ట్రంలో కూడా ప్రధానంగా ఉత్తర తెలంగాణాలో ఈ సంస్కృతి అదే కాలమునకు చెందినదని చెప్పవచ్చు.

బృహత్ శిలాయుగపు స్థావరాలు దక్షిణ భారతదేశమంతటను వ్యాపించిఉన్నాయి. ఉత్తర భారతదేశములో సింధూ రాష్ట్రము నుండి అస్సాం వరకు కాశ్మీరము నుండి విదర్భ వరకు ఈ కాలపు సమాధులున్నాయి. బెలోచిస్థాన్, మెసపటోమియా, ఈజిప్టు, ఉత్తర ఆఫ్రికా, స్పెయిన్, నెదర్లాండ్స్, బ్రిటన్‌లలో గూడా బృహత్ శిలాసమాధులున్నాయి[38].

కరీంనగర్ జిల్లాలో బృహత్ శిలా సమాధులు హుజూరాబాద్ మండలంలోని సింగాపూర్, తుమ్మనపెల్లి, చెల్పూర్, సిరిసిపల్లి, హుస్నాబాద్ మండలములోని బూడిగపల్లి, సుల్తానాబాద్ మండలంలోని కదంబాపూర్, తొగర్రాయి, జమ్మికుంట మండలంలోని బిజిగిరి షరీఫ్, వేములవాడ మండలంలోని నాంపెల్లి, రాయికల్ మండలంలోని వస్తాపూర్, కేశవపట్నం మండలం లోని మొలంగూర్, జగిత్యాల మండలములోని కల్లెడ మున్నగుచోట్ల ఉన్నాయి.

సుల్తానాబాద్ మండలంలో మానేరునది ఉత్తర ఒడ్డున గల కదంబాపూర్ గుట్టల సమీపమున 500లకు పైగా ఈ కాలపు సమాధులున్నాయి. పురావస్తుశాఖ డా. వి.వి.కృష్ణశాస్త్రి నేతృత్వములో (1974–1975) ఇక్కడి 5 సమాధులు త్రవ్వి పరిశోధనలు జరుపగా రెండు రకాల సమాధులు బయల్పడినాయి. మొదటిరకము గోతిసమాధి. భూమిలో ఒక గోతి త్రవ్వి చనిపోయిన వ్యక్తి అస్థికలతోపాటు అతడు వాడిన ఆహార పదార్థాలు, మట్టిపాత్రలు, అతనికి ప్రియమైన వస్తువులు, ఆభరణాలు, చాకులు, కత్తులు, బల్లెములు మున్నగు ఇనుప పనిముట్లు గూడా గోతిలో పూడ్చిపెట్టేవారు. గోతిపైన అండాకారములో మట్టిదిబ్బను సమాధి రూపములో తయారు చేసేవారు. దాని చుట్టు 20 నుండి 30 పెద్ద పెద్ద గుండురాళ్లను (గండశిలలు) గుండ్రంగా పేర్చేవారు. కొన్ని సందర్భాలలో రాకాసి గుండ్లను రెండు వలయాలుగా పేర్చేవారు. ఒక వృత్తము వేరొక దానికంటే పెద్దగా ఉంటుంది. రెండు వృత్తాకారముల మధ్య స్థలము ప్రదక్షిణా పథముగా తోడ్పడింది. ఇదే పద్దతిలో తరువాత కాలంలో బౌద్ధస్థూపముల చుట్టు గూడా ప్రదక్షిణా పథము లేర్పరచి యుందురని చారిత్రకుల అభిప్రాయం[39].

రెండవ రకము పేటిక సమాధి. మొదటి పద్ధతిలాగే గోతి త్రవ్వేవారు. గోతి అడుగుభాగమున పెద్ద శిలాఫలకము నిలిపేవారు. గోతినాలుగు గోడలకు నాలుగు రాతి ఫలకములు నిలిపేవారు. ఉత్తర దిశలోని రాతి ఫలకమునకు ఒక రంధ్రము చేసేవారు. ఆ

రంధ్రము ద్వారా శవ అస్థికలను, అతనికి సంబంధించిన వస్తువులను గోతిలో ఉంచేవారు. ఈ రంధ్రాన్ని మరో రాతి ఫలకముతో మూసేవారు. ఆ తరువాత గోతిని పూడ్చి దాని చుట్టూ చాలా బరువైన గుండ్రాళ్లను (బృహత్‌శిలలు) అమర్చేవారు. ఈ సమాధులలో తలభాగము ఉత్తరము వైపు కాళ్లభాగము దక్షిణము వైపు పెట్టేవారు. దీనిని బట్టి ఈ కాలపు మానవులకు గణిత జ్యోతిశ్శాస్త్రములలో ప్రవేశముండెనని భావింపవచ్చు. గోతి సమాధులు పేటిక సమాధుల కంటే పూర్వకాలమునకు చెందినవని తెలుస్తుంది. కదంబాపూర్‌లోని సమాధులు క్రీ.పూ. 600 నుండి 200 క్రితం వరకు ఏర్పాటు చేయబడినవని చరిత్రకారులైన ఠాకూర్ రాజా రాంసింగ్ అభిప్రాయము[40].

ఈ సమాధులు ఎక్కువగా గుట్టబోర్ల, నీటివనరుల సమీపములో వ్యవసాయ యోగ్యము కాని భూముల్లో ఉన్నాయి. హుజూరాబాద్‌కు 6 కి.మీ. దూరంలో నున్న సింగాపురం వద్ద ప్రభుత్వ రహదారి ప్రక్కనే ఒక గుట్ట సమీపమున 50 సమాధులున్నాయి. ఈ సమాధుల చుట్టూ పేర్చిన వలయములలో 10 నుండి 20 బృహత్ శిలలున్నాయి. హుజూరాబాద్ మండలంలోని సిరిసిపల్లిలో 50, తుమ్మనపల్లిలో 6 మరియు చెల్పూర్‌లో ఒక ఒర్రె ప్రక్కకు గుట్టబోరునందు సగము హెక్టారు భూభాగములో ఈ కాలపు సమాధులున్నాయి[41].

హుస్నాబాద్‌కు 6 కి.మీ. దూరంలో అదే మండలములో నున్న బూడిగపల్లి ఒక కుగ్రామము. ఇది వలాసగట్టు, సంజీవరాయనిగట్టు, వెంకయగట్టు అని పిలువబడు గుట్టలచే చుట్టబడిఉంది. సంజీవరాయని గట్టు దిగువన 50 కి పైగా సిస్ట్ సమాధులు (Cist burials) ఉన్నాయి. కాని వీటిలో చాలా మట్టుకు చెదిరిపోయినాయి. ఇక్కడి సమాధులలో ఒక దాని చుట్టు 16 గుండ్రాళ్లు మరియొక దాని చుట్టు 24 గుండ్రాళ్లు ఉన్నాయి. ఇచటి సమాధుల చుట్టు ఉన్న అన్నింటికంటే పెద్దవలయము 34 గుండ్రాళ్లను కలిగిఉంది[42]. పురావస్తుశాఖవారు ఇచట 20-2-1977 నుండి 29-3-1977 వరకు రూ. 2500 వ్యయముతో చిన్నస్థాయిలో త్రవ్వకాలు (Minor Excavations) జరిపారు. మట్టిపూసలు, మట్టిగాజులు, ఇనుము మరియు రాగి వస్తువులు, ఎరుపు రంగు మట్టిపాత్రలు(Red Polished ware), నల్లని ఎర్రని మట్టిపాత్రలు (Black and Red ware) చేతితో చేసిన కుండ ముక్కలు మున్నగునవి వెలుగులోనికి వచ్చినాయి[43]. బృహత్ శిలా కాలపు రాక్ పేయింటింగ్స్, బూడిగపల్లి, రేగొండ రాక్‌షెల్టర్స్‌లో అగబడుతాయి. అశ్వములు, గుర్రపు రౌతుల చిత్రములున్నాయి. జమ్మికుంట సమీపమున గల మడిపెల్లి రాక్‌షెల్టర్స్‌లో పేయింటింగ్స్ ఉన్నాయని కాశీపాండ్యన్ తెలిపినారని కరీంనగర్ పురావస్తు శాఖలో సాంకేతిక నిపుణునిగా పనిచేయుచున్న యం. లక్ష్మినారాయణ తెలిపాడు. అంతే గాకుండా వారు ఈ జిల్లాలో ఇంకను ఎక్కడెక్కడ బృహత్ శిలా సమాధులున్నాయో వాటిని గూర్చి నూతనమైన అదనపు విశేష సమాచారాన్ని అందించారు[44].

మే నెల 2001లో కరీంనగర్‌కు సమీపాన గల రేకుర్తి వద్ద కాలువ మరమ్మత్తులకై

మట్టి తీయుచుండగా 5 బృహత్ శిలా సమాధులు బయల్పడినాయి. వాటిలో నల్లని ఎర్రని మట్టిపాత్రలు (Black and Red Ware) ఒక ఎముక, ఇనుప ఈటె లభ్యమైనాయి. కాలువ శ్రీరాంపూర్ మండలంలోని మిర్జంపేట, గుంపుల ఊర్ల మధ్య 50, జమ్మికుంట మండలములోని బిజిగిరి షరీఫ్ వద్ద 20, మానకొండూరు మండలంలోని ముంజంపల్లి వద్ద 10, కరీంనగర్ మండలంలోని ముక్దంపూర్ ఆంజనేయ స్వామి దేవాలయము వెనుక గర్రెపెల్లికి పోవుత్రోవలో 5 నుండి 10, చొప్పదండి మండలంలోని ఆర్నకొండ శివారులో 6, హుజూరాబాద్ మండలంలోని బోర్నపెల్లి గుట్ట దిగువన 10, మరియు సింగాపూర్‌కు 3 కి.మీ. దూరంలోగల ఎర్కలగూడెం చెరువుకట్ట మత్తడి సమీపమున 3, పెగడపెల్లి నుండి చొప్పదండికి పోవు రహదారి ప్రక్కకు లక్ష్మీపూర్ సమీపమున 3 సమాధులు బయల్పడినాయి. అలాగే సిరిసిల్ల సమీపాన గల ఇల్లంతకుంట మండలంలోని అడవిదాచారంలో వరదరాజస్వామి గుట్ట వద్ద గల తమ స్వంత భూముల్లో 20 బృహత్ శిలా సమాధులున్నాయని చరిత్రకారులైన యస్. జైకిషన్ తెలిపారు[45]. జగిత్యాల నుండి ధర్మపురికి పోవు నెం. 16 జాతీయ రహదారికి తూర్పు వైపున కల్లెడ మరియు బుగ్గారం అప్రోచ్‌రోడ్ మధ్యలో రోడ్ వెడల్పు కార్యక్రమములో కొన్ని బృహత్ శిలా సమాధులు కనుమరుగు కాగా ఇంకను కొన్ని మిగిలిఉన్నాయి.

## తొలిచారిత్రకయుగము (Early Historical Period)

ఆంధ్రులు అతి ప్రాచీనులు. వీరు దస్యులు లేక అనార్యులని ఐతరేయ బ్రాహ్మణము తెలుపుతుంది. శబరులు, పుళిందులు, మూతిబలు మొదలైన తెగలతో వీరు కలిసి నివసించేవారు. క్రీ.పూ. 600 ప్రాంతములోనే ఆంధ్రులు ఉత్తర భారతదేశ ఆర్యులకు తెలిసినవారు. విదేశీయులైన గ్రీకులు, రోమన్‌లకు గూడా వీరు పరిచితులు. మగధరాజ్యము నేలిన హార్యంక, శిశునాగ, నంద, మౌర్యరాజులకు (B.C. 600-300) వీరు సమకాలీనులు. బౌద్ధ జాతక కథలలో ఆంధ్రుల గురించి చెప్పబడింది. షోడశమహాజనపదాల్లో అస్మక ఒకటని అదియే ఆంధ్ర జనపదమని బౌద్ధ సాహిత్యము తెలుపుతుంది. ఈ షోడశ మహా జనపదాలు క్రీ.పూ. ఆరవ శతాబ్దములో భారతదేశమున వెలసిన 16 రాజ్యములు. నేటి ఉత్తర తెలంగాణాయే నాటి అస్మకరాజ్యము. దీని రాజధాని పోదన అనగా నేటి బోధన్. మెగాస్తనీస్ తన ఇండికా గ్రంథములో ఆంధ్రులకు 30 బలిష్ఠమైన దుర్గములు, అసంఖ్యాక గ్రామములు, ఒక లక్ష కాల్బలము, రెండు వేల అశ్వబలము, ఒక వేయి గజబలము ఉన్నాయని పేర్కొన్నాడు[46]. మౌర్యుల తరువాత ఆంధ్రులదే బలోపేతమైన రాజ్యము. మౌర్యులు రాజ్యాధికారమునకు వచ్చువరకే ఆంధ్రులు లబ్ధ ప్రతిష్ఠులై యుండిరని విదితమగుచున్నది. అశోకుని 13వ శిలాశాసనము (Rock Edict XIII) ఆంధ్రులు అతని సామ్రాజ్యాంతర్గతమైన జాతిగాను, అతని మతబోధనలను ఆదరించినవారని తెలుపుతుంది.

విదర్భ మరియు దక్షిణ కోసలకు దక్షిణమున నున్న ప్రాంతము అస్సక, మూలక జనపదములుగా పేరొందెను. వాయు పురాణములో అస్మక, మూలక రాజ్యముల ప్రసక్తి కలదు.

అస్మక రాజర్షి పోదన పట్టణమును స్థాపించెనని మహాభారతము తెలుపుచున్నది. బౌద్ధ గ్రంథమగు సుత్తనిపాతంలో అస్మక గోదావరి తీర రాజ్యంగా పేర్కొనబడింది. పాణిని (B.C. 800) తన అష్టాధ్యాయిలో దక్షిణా పథములో తూర్పున కళింగమును పడమట గోదావరి జనన ప్రాంతమైన అస్మకను పేర్కొన్నాడు[47]. గోదావరి తీరమున నున్న పైఠన్ యే పోదలి, పోదన అనియు అదియే అస్మకరాజధాని అనియు, కరీంనగర్ ప్రాంతమే మూలకనాడు అయి యుండునని డా. కృష్ణశాస్త్రి తెలిపియున్నారు. కాని రాయచౌధురి పోతలి లేదా పోదనను బోధన్‌గా గుర్తించారు[48]. ఔరంగాబాద్ ప్రాంతమును కొందరు మూలకనాడుగా గుర్తించారు. అస్మక, మూలక రాజ్యములు గోదావరి పరీవాహ ప్రాంతములో వెలసిన రాజ్యములని తేట తెల్లమగుచున్నది.

ఆర్యులచే ప్రభావితం కాని కొన్ని తెగలు గోదావరిలోయలో మిగిలి పోయినవని చెప్పుటకు టాలమి పేర్కొనిన కోండాయిలే ఆధారం. ఈ కోండాయిలే నేటి గోండాయిలు లేదా గోండులు, కోయలు. వీరు ఈ నాటికి అధిక సంఖ్యలో ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్ జిల్లాల్లో గిరిజన తెగలు(Tribals)గా నివసిస్తున్నారు.

ఆంధ్రులు క్రీ.పూ. 500–400 మధ్యకాలములోనే గోదావరిలోయలో చిన్న చిన్న రాజ్యము లేర్పరచుకొనియుందురు. పశ్చిమోత్తర తెలంగాణాలో అనేక తొలి చారిత్రక యుగపు దిబ్బలు (Early Historical Mounds) మరియు శాతవాహనుల స్థావరములు బయల్పడినాయి. ఆం.ప్ర. ప్రభుత్వ పురావస్తుశాఖ 1968–1974 మధ్యకాలములో పెద్దబొంకూరు, ధూళికట్ట, కోటిలింగాలలో త్రవ్వకాలు జరిపింది. కోటిలింగాలలో పరిశోధనలు 1983 వరకు కొనసాగినాయి. ఇచటి త్రవ్వకాలలో శాతవాహనుల కాలము కంటే పూర్వపు స్థరాలు లేదా వరుసలు, పొరలు (Pre-Satavahana Layers) బయల్పడినాయి. వీటిలో వందలాది నొక్కుడు గుర్తులు గల (పంచ్‌మార్క్‌డ్) వెండి నాణెములు (B.C. 600-400) లభ్యమైనవి. వీటి మూసలు (Moulds) ధూళికట్ట త్రవ్వకాలలో దొరికాయి. ఈ మూసల ఆధారంగా పంచ్‌మార్క్‌డ్ నాణేలు స్థానికంగానే ముద్రింపబడినవని అర్థమౌతుంది. భారతదేశములో పంచ్ మార్క్‌డ్ నాణేలు క్రీ.పూ. 600 వరకే చెలామణిలో నున్నవి. కోటిలింగాలలో సమగోప, రాణోగోభద (గోభద్ర) నారన, కనయసి నాణెములు లభ్యమైనాయి. ఈ నాణెములు శాతవాహనుల కాలము కంటే పూర్వము ఈ ప్రాంతమును పాలించిన రాజులవని, సమగోపనాణెము ఆధారంగా ఈ రాజులు ఆంధ్ర గోపవంశజులని ఠాకూర్ రాజారాంసింగ్ నిర్ధారించారు[49]. శాతవాహనులకు పూర్వము గోదావరి లోయలో లభ్యమైన నాణేల ఆధారంగా ఆంధ్రగోప వంశరాజులు పాలించిరను నూతన సిద్ధాంతమును రాజారాం సింగ్‌గారే ప్రతిపాదించారు. శాతవాహనులకు పూర్వమే ఆంధ్రులు రాజకీయంగా, సాంఘికంగా గుర్తింపు పొంది బలపడియున్న జాతియని విదితమగుచున్నది.

క్రీ.పూ. 500 మరియు 400 సం॥ ప్రాంతములో గోదావరిలోయలోని నేటి కరీంనగర్, నిజామాబాద్, మెదక్, ఆదిలాబాద్, నల్గొండ ప్రాంతములే ఆంధ్రుల అసలు రాజ్యమైయుండును.

కరీంనగర్ జిల్లాలోని కోటిలింగాల, ధూళికట్ట, పెద్దబొంకూరు, మెదక్ జిల్లాలోని కొండాపూర్ వద్ద జరిపిన త్రవ్వకాలు పై విషయమును బలపరుస్తుంది. ఈ త్రవ్వకాలలో సిముకుని కంటే పూర్వము పాలించిన సత, సద నాణెములు దొరికాయి. కోటిలింగాలలో తొలి మహాతలవర నాణెములు బయల్పడినాయి. ఈ నాణెములు ఆంధ్రగోపుల నాణెములకు సమకాలీనమైనవి. లోగడ మిరాశి రాజో (రామ్‌నోసె) ఒక నాణెమును కనుగొన్నాడు. ఈ ఒక నాణెము శబరులదై ఉంటుంది. ఈ శబరుల రాజ్యము ఆంధ్రగోపుల సరిహద్దు రాజ్యమై ఉంటుంది.

కోటిలింగాలలో శాతవాహనుల కాలపు స్థరాలలో (పొరలలో) అనేక శాతవాహనుల నాణెములు లభించాయి. తొలి శాతవాహన రాజుల నాణెములు, సమ గోపనాణెములను పోలిఉన్నాయి. లభ్యమైన నాణెములను బట్టి శాతవాహన వంశ మూలపురుషుడైన శాతవాహనుడు ఆంధ్ర గోప వంశజుడగు సమగోపకు సమకాలీనుడై యుండును. శాతవాహనుడు ఆంధ్రగోపులను, శబరులను, మహాతలవరులను, తదితర ఆంధ్ర రాజులనందరిని ఓడించి శాతవాహన సామ్రాజ్యమును స్థాపించాడు[50]. ఈ శాతవాహనులు తొలుత ఆంధ్రుల పాలనలో ఒక భాగమై యుందురు. మొదట ఆంధ్ర భృత్యులుగా నుండి క్రమేణ బలవంతులై శాతవాహన రాజ్యస్థాపనకు పూనుకొనిరి. కోటిలింగాలలో సిముకుని నాణెములు లభ్యమైనవి. ఈ సిముకుడే చివరికాణ్వరాజు నంతమొందించాడు. కాణ్వుల పతనానంతరము సిముకుడు స్వతంత్ర రాజ్యాన్ని ఏర్పరుచుకొని విస్తృతపరిచాడు. తన కుమారునికి రథికుల రాకుమారితో వివాహము చేసి పలుకుబడి పెంచుకొన్నాడు.

కరీంనగర్ జిల్లా కప్పురావుపేట సమీపములో లభ్యమైన చిముకుని (సిముకుని) ఆరు నాణెములను ధర్మపురి వాస్తవ్యుడైన కీ.శే. సంగనభట్ల నరహరి చరిత్రకారులైన పి.వి. పరబ్రహ్మశాస్త్రికి అందజేశాడు. ఈ నాణెములపై నున్న చిముక నామము లిపి నాసిక్ వద్ద నున్న నానాఘాట్ గుహలలోని లేబెల్ శాసనములతో పోలిఉందని, ఇవి క్రీ.పూ. ఒకటవ శతాబ్దమునకు సంబంధించినవని, ఇవి సిముకుని నాణెములేయని పరబ్రహ్మశాస్త్రి ధృవీకరించారు[51].

కోటిలింగాలలో లభ్యమైన గోభద నాణెము శుంగుల 5వ రాజైన భగభద్రునిదని, సమగోప నాణెము 9వ శుంగరాజైన సమభాగుని (భాగవతుని) దని పరబ్రహ్మశాస్త్రి గారి అభిప్రాయం. దీనిని బట్టి విదిశ నేలిన శుంగరాజులకు తొలి శాతవాహనులు సామంతులై యుందురని తెలియుచున్నది. కాని గోభదనాణెము భగభద్రునిదనుటకు సమగోపనాణెము సమభాగునిదనుటకు ఆస్కారములేదు. ఎందుకనగా ఈ నామములలో ఎలాంటి సారూప్యము లేదు. అంతే గాకుండా ఈ నాణెములు త్రవ్వకాలలో శాతవాహనుల కాలపు అడుగు పొరలలో లభ్యమగుట వలన అవి శాతవాహనులకు పూర్వము ఈ ప్రాంతము నేలిన పాలకులవనుటలో సందేహము లేదు. ఈ అడుగు పొరల (Pre-Satavahana Layers) నుండియే కోటిలింగాలలో 59 బంగారు పూసల (Beads) కంఠహారము (Necklace) లభ్యమైంది. ఈ పూసలు కొన్ని

తాబేలు, కప్ప, సూర్యుడు, నందిపాదము, వజ్రము మొదలైన రూపములలో మలచబడియున్నవి. జైన బౌద్ధ సాహిత్యము తాబేలు శనికి, కప్ప బృహస్పతికి చిహ్నములని తెలుపును. అందువలన డా. వి.వి.కృష్ణశాస్త్రి దీనిని గ్రహమాలగా పేర్కొన్నారు[52].

కరీంనగర్ జిల్లాలో తొలిచారిత్రకయుగపు అనేక స్థావరాలు (Early historical sites) మరియు అనేక గ్రామాలలో చిన్న, పెద్ద దిబ్బలు (Mounds) కనబడుతాయి. శాతవాహనుల కంటే పూర్వము నుండియే ఈ ప్రాంత ప్రజలు నాగరికులని తెలుపు ఆధారాలు పెక్కు లభ్యమైనాయి. ఆం.ప్ర. పురావస్తు శాఖ జరిపిన త్రవకాల్లో పెద్దబొంకూరు, ధూళికట్ట, కోటిలింగాలలో శాతవాహనులకు పూర్వము పాలించిన ఆంధ్రుల మరియు పెక్కు శాతవాహనుల కాలపు అవశేషాలు, నాణెములు బయల్పడినాయి. ఈ కాలపు దిబ్బలు ఉప్పట్ల, బూడిగపల్లి, రచ్చపల్లి, పైడిచింతలపల్లి, కాచాపూర్, చిన్నబొంకూరు, వేమ్నూరు, బొంపల్లి, ఖదీమ్‌కనగర్తి, కుదుర్పాకగుట్టవద్ద, కన్నాల్ బోడగుట్ట దిగువన, గౌరెడ్డిపేట, రెబ్బల్ దేవ్‌పల్లి, కదంబాపూర్ మున్నగు చోట్ల బయల్పడినవి. వీటిని బట్టి ఆకాలములో ఈ ప్రాంతమంతయు రాజకీయ, వాణిజ్య ప్రాధాన్యతను సంతరించుకొని జనసమ్మర్దమై యుండెనని తెలుస్తుంది. ఈ దిబ్బల వద్ద తొలి చారిత్రక యుగపు ఎర్రని పాలిష్, నల్లని ఎర్రని మట్టిపాత్రలు, పెంకులు (Red Polished, Black and Red Ware) మరియు అనేక ఇటుకముక్కలు అగబడుతాయి.

## పెద్దబొంకూరు

కరీంనగర్ నుండి పెద్దపెల్లికి బోవు రహదారి ప్రక్కన 30 హెక్టార్ల స్థలములో పెద్దబొంకూరు ప్రాచీన స్థావరము వ్యాపించిఉంది. ఇది పెద్దపెల్లి మండలంలో హుస్సేనిమియావాగుకు 1 కి.మీ. దూరంలో ఉంది. కార్నెలియన్ (Carnelian), జాస్పర్ (Jasper), చాల్సిడోని (Chalcedony), క్వార్ట్జ్ (Quartz) వంటి ముడిసరుకులు ఇచట లభ్యమగుట వలన, అవి రాతియుగపు పనిముట్లకు ఆభరణములకు ఉపయోగపడినాయి[53]. డా.వి.వి.కృష్ణశాస్త్రి 1968-1974 మధ్య ఈ జిల్లాలోని పెద్దబొంకూరు, ధూళికట్ట, కోటిలింగాలలో త్రవ్వకాలు జరిపి అనేక నూతనాంశములను వెలుగులోనికి తెచ్చారు. శాతవాహన సిముకుని నాణెములతోపాటు, శాతవాహనులకు పూర్వము ఈ ప్రాంతమును పాలించిన ఆంధ్రరాజుల నాణేలు గూడా అనేకము వెలుగులోనికి తెచ్చారు. పెద్దబొంకూరులో అనేక ఇటుక కట్టడాలు, బావులు, తొట్టిలు (Cisterns), అండాకారపు రబ్బుల్ నిర్మాణాలు (Elliptical Rubble Structures) బయల్పడినాయి.

అనేక పంచ్‌మార్క్‌డ్ నాణెములు, ఇనుప, రాగి, టెర్రకొట్ట వస్తువులు, శాతవాహనుల, రోమన్‌ల నాణెములు లభ్యమైనాయి. ఒక టెర్రకొట్ట ముద్రికపై విజయ పురహర కస రథస *"Vijayapura Hara Kasa Rathasa"* అని చెక్కబడింది[54]. త్రవ్వకాల్లో దేవాలయంగా భావింపబడిన

ఒక అండాకారపు నిర్మాణము (Oval Structure) 39.5 X 7.65 మీ. బయల్పడింది. రాగి పూసలు, గాజులు, వెండి చెవి ఆభరణాలు, విలువైన రాళ్లపూసలు, గజలక్ష్మి టెర్రకొట్ట ముద్రిక మున్నగునవి లభ్యమైనాయి[55].

పెద్దబొంకూరు శాతవాహనుల కాలపు గ్రామము. దాని చుట్టు ప్రాకారము లేదు. రెండు ఇటుక కట్టడములు 30 X 40మీ. మూడవది 16.80 X 15.30 మీ. గల కట్టడము త్రవ్వకాలలో బయల్పడినాయి. ఇవి ధనికుల కుటుంబాల ఆవరణములై యుండును. ఈ ఆవరణముల (Enclosures) మధ్య ఇండ్లు, బావులు, తొట్టిలు మున్నగునవి బయల్పడినాయి. బండ్ల రాకపోకలకై ప్రవేశములు (Entrances) 3 మీ. వెడల్పుగా నుండేవి. ఒక్కొక్క ఆవరణలో రెండు గాని మూడు గాని బావులు గోడలనానుకొనియే త్రవ్వబడినాయి. ఈ బావులు ఇటుకచే కట్టబడినవి. మురికి నీరు ఒక ఇంకుడు గుంటకు చేరునట్లు వసతి కల్పింపబడింది[56].





బావులు – పెద్దబొంకూరు

## ధూళికట్ట

సుల్తానాబాద్ సమీపంలో హుస్సేనిమియావాగు ఒడ్డున ధూళికట్ట గ్రామము ఉంది. ఇది వడ్కాపురమునకు 1 కి.మీ. పెద్దబొంకూరుకు పడమట 10 కి.మీ. దూరంలో ఉంది. ఆనాటి ధూళికోట లేదా దూళికటకము క్రమేణ ఉచ్చారణలో నేడు ధూళికట్టగా పిలువబడుతుంది. శాతవాహనుల కాలములో వివిధ కోటలను కటకములని పిలిచేవారు. ఆనాటి ధాన్యకటకము వలె ఇది ధూళికటకమై యుండును. ధూళికోటయనగా మట్టికోటయని అర్థము. దీనికి సమీపములో రాజులకుంట, ఏనుగుల చెరువు కలవని గ్రామస్థులు తెలుపుదురు. పెద్దబొంకూరు గ్రామముగా గుర్తింపబడగా, చుట్టు ప్రాకారపు గోడఆతో ధూళికట్ట పట్టణ దుర్గముగా గుర్తింపబడినది. మెగాస్తనీస్ పేర్కొనిన ఆంధ్రుల 30 దుర్గములలో ధూళికట్ట, కోటిలింగాల కోటలు గూడా పరిగణనలోనికి తీసికొనబడి ఉంటాయి.

ధూళికట్టలో తొలిచారిత్రకయుగపు దిబ్బ (Mound) 18 హెక్టార్ల స్థలములో భూమి కంటే 6 మీ. ఎత్తుననున్నది. చుట్టు 3 నుండి 5 మీ. ఎత్తు గల మట్టి ప్రాకారముంది. కోట

మట్టిగోడల చుట్టు గల కందకముల నుండి త్రవ్వబడిన మట్టియే ప్రాకారమునకు ఉపయోగింపబడింది. పెద్దబొంకూరులో వలె ధూళికట్ట చుట్టూ గూడ సారవంతమైన నల్లరేగడి భూములున్నాయి. ఈ కోటకు 1 కి.మీ. ఉత్తరాన థేరవాద (హీనయాన) బౌద్ధస్థూపమొకటి బయల్పడింది.

ధూళికట్టకోటకు నాలుగు దిక్కులయందు నాలుగు ప్రధానద్వారములున్నాయి (Gate Ways). ఇచటి త్రవ్వకాలలో కోట దక్షిణద్వారము బయల్పడింది. ఈ ద్వారానికిరువైపుల కావలిగా నుండు భటులకై గదులు (Guard Rooms) కట్టబడినాయి. కోటచుట్టు ఉన్న కందకములు నేటికి కనబడుతున్నాయి. ఈ దక్షిణ ద్వారానికి ఉత్తరాన కొన్ని రాజభవనాలు (Royal Palaces) ధాన్యాగారములు బయల్పడినాయి. ఈ భవనముల అరుగులు ఇటుకతో నిర్మింపబడినాయి. చుట్టుగోడపై సున్నపు పూత ఉంది. ప్రవేశ ద్వారాలకు ఇటుక మెట్లు కట్టినారు. మట్టి ప్రాకారము నానుకొనియే లోపలి వైపు రబ్బుల్ పునాదులు (Rubble Foundations) బయల్పడినవి. ఇచ్చట భవనాల పునాదులు బయల్పడినవి. ఇచటి భవనాల వలె కోటిలింగాలలో గూడా కొన్ని కట్టడములు కనబడుతాయి. ద్వారమునకు ఇరువైపులనున్న కాపలా గదులు 6.30x3.00 మీ. కలిగి ఉండి ఫ్లోరింగ్ ఇటుకతో చేయబడింది. ఒక్కొక్క ఇటుక 56x27x7 సెం.మీ. ఉంది[57]. ప్రధాన భవనము చతురస్రాకారములో నున్న చతుశ్శాల భవంతి. మధ్యవాకిలి నుండి ఆకాశము కనిపిస్తుంది.

ఒక బావి నుండి మట్టిని వెలికి తీయుచుండగా ఒక అందమైన దంతపు గుండిని పోలిన ముద్రిక (A beautiful ivory Button Seal) బయల్పడింది. దానిపై క్రీ.శ. రెండవశతాబ్దపు లక్షణములలో నున్న బ్రాహ్మీలిపిలో "*అజని సిరియ గామె కుమరియ*" *(Ajani Siriya Game Kumariya)* అని చెక్కబడి ఉంది[58]. ఇచటి త్రవ్వకాలలో ఎత్తైన కుచద్వయముతో మాతృదేవతా (Mother Goddess) టెర్రకొట్ట ప్రతిమ మరియు అనేక పంచ్‌మార్క్‌డ్ నాణెములు బయల్పడినాయి.


మాతృదేవత


బౌద్ధస్థూపము

ధూళికట్ట శాతవాహనులకు పూర్వపు పట్టణము. శాతవాహనుల కాలములో రాజకీయ వ్యవహారములకు కేంద్ర బిందువై (Political nucleus) యుండి శాతవాహనుల అనంతరము విశిష్టతను కోల్పోయింది[59].

ధూళికట్ట త్రవ్వకాలలో వేర్వేరు పొరల (Layers) నుండి వివిధ కాలముల వస్తువులు లభ్యమైనాయి. ఇనుప మొలలు, బాణపు మొనలు, బల్లెపు మొనలు, రివెట్లు (Rivets), ఇనుపతెడ్లు (Iron Ladles), మృణ్మయపాత్రలు, రాగి, ఇనుప, దంతపు, టెర్రకొట్ట వస్తువులు, పూసలు, గాజులు, వేలిఉంగరాలు, చాకులు మున్నగునవి అనేకములు లభ్యమైనాయి. ధూళికట్ట క్రీ.పూ. మూడవ, నాల్గవ శతాబ్దముల సంస్కృతికి అద్దము పడుతుంది.

## కోటిలింగాల

కోటిలింగాల గోదావరినది, పెద్దవాగు సంగమ స్థానమందు ఉంది. ఇది వెల్గటూరు మండలములో మునుల గుట్టకు 5 కి.మీ. దూరంలో ఉంది. ఇచటి చారిత్రక తొలియుగపుదిబ్బ (Early Historical Mound) 50 హెక్టార్ల విస్తీర్ణముతో నేలకు 6 మీ. ఎత్తున ఉంది. రాష్ట్రములో ఇంతవరకు బయల్పడిన దిబ్బలన్నింటిలో ఇది అతి పెద్దది. ఇచట కుండపెంకులు, పూసలు, ఇటుకలు మున్నగునవి చెల్లాచెదరుగా అగబడుతాయి. ధూళికట్టలో వలె కోటిలింగాల చుట్టు మట్టికోట ప్రాకారము ఉంది. ఈ కోటకు అనేక ద్వారములున్నాయి. గోదావరికి ఒడ్డునానుకొని కోటగోడ 300 మీ. వరకు గలదు. ఇక్కడి ఇటుకలు 50 నుండి 55 సెం.మీ పొడవున్నాయి. ఇచటి పెద్ద పెద్ద ఇటుకలన్నియు గ్రామస్థులు ఎత్తుకొనిపోయి ఇండ్ల నిర్మాణమునకు వాడినారు. నిజానికి కోటిలింగాల గృహముల నిర్మాణమంతయు ఈ ఇటుకలతోనే జరిగినదని చెప్పవచ్చు[60]. ఇక్కడి ఇటుకలతోనే పేర్చిన ప్రహరిగోడలు ప్రతి ఇంటి ముందు కనిపిస్తాయి.

కోటిలింగాలలోని మట్టికోట భూమికి 6 నుండి 9మీ. ఎత్తున ఉంది. ఇది ఉత్తరమున గోదావరి తూర్పుదక్షిణ భాగములందు కప్పురావుపేట వాగుచే చుట్టబడి ఉంది. కోట ముఖద్వారము దక్షిణము వైపున ఉంది. గోదావరి వైపు నున్న కోట గోడకట్టడములు వరదలకు చాలా శిథిలమైనాయి. గోదావరినది వైపు ఒక ద్వారము బయల్పడింది. ఇది గోదావరి గుండా సరుకుల రాకపోకలకు అనుకూలముగా నుండిన ద్వారము. అంతే గాకుండా గోదావరి నీటి వాడకమునకు గూడా ఇది సానుకూలముగా నుండేది. కోట అన్నిమూలలందు కట్టబడిన బురుజులు ఇప్పుడు పెద్ద పెద్ద దిబ్బలుగా అగబడుతాయి. కోట యొక్క ఉత్తరభాగమున గోదావరి నీటి వరకు పొడుగాటి వరుసలలో చతురస్ర, దీర్ఘచతురస్రాకారములో ఇటుక కట్టడములున్నాయి. ఇవి ఓడ సరుకుల ఎగుమతి, దిగుమతులకు ఓడరేవుగా (Wharf) ఉపయోగపడియుండును[61].

కోటిలింగాల నుండి మునులగుట్ట వైపు పోవుదారిలో ఒక చేను చుట్టు కంచెగా నిలుపబడిన శిలాఫలకములపై క్రీ.పూ. రెండవ శతాబ్దపు లక్షణాలతో బ్రాహ్మీలిపిలో చిన్న చిన్న

శాసనాలున్నాయి. ఒక పొలములో నున్న ఇసుకరాతి స్తంభము (Sand Stone Pillar) పై క్రీ.శ. ఒకటవ శతాబ్దపు లక్షణములతో బ్రాహ్మీలిపిలో *"నాగగోపినికయ" (Naga Gopinikaya)* అను (Double Lined) చెక్కడము (Label Inscription) ఉంది. హాలుని గాథాసప్తశతిలోని గోదావరి నది వర్ణన ఆధారంగా మరియు ఇచ్చట లభ్యమైన నాణెములను బట్టి కోటిలింగాల శాతవాహనుల బలిష్ఠమైన పట్టణ దుర్గమని విదితమగుచున్నది[62].

## చారిత్రక తొలియుగపు ఇతర స్థావరాలు

పెద్దపెల్లి నుండి చొప్పదండికి పోవు రహదారికి సమీపమున గల కాచాపూర్ గ్రామపు గుట్టబోరుల వద్ద 6 లేదా 7 హెక్టార్లలో ఎత్తుతక్కువ దిబ్బఉంది. నల్లని ఎర్రని పెంకులు, ఎర్రని పాలిష్ పెంకులు (Black and Red Ware, Red Polished and coarseware) మరియు ఇటుకముక్కలు లభ్యమైనాయి. పెద్దపెల్లికి 9 కి.మీ. దూరంలో కమాన్‌పూర్ మండలంలో కన్నాల గ్రామ సమీపపు బోడగుట్ట దిగువన 5 హెక్టార్ల స్థలములో కుండపెంకులు, నీటిని చిలుకరించు పరికరపు ముక్క (A fragment of an elongated neck of a sprinkler) లభ్యమైనాయి[63]. పెద్దపెల్లికి 5 కి.మీ. దూరంలో గల బొంపల్లి గ్రామపు రెండు గుట్టబోరుల నడుమ 7 హెక్టార్ల స్థలములో ఈ కాలపు ఎత్తు తక్కువ దిబ్బ (Low Mound) ఉంది. పెద్దపెల్లికి 15 కి.మీ. దూరంలో రచ్చపల్లి గుట్టల దిగువన 7 లేదా 8 హెక్టార్లలో ఒక దిబ్బఉంది. పైడి చింతలపల్లిలో బండలవాగు కుడి ఒడ్డున గల దిబ్బపై పెంకులు, ఇటుకముక్కలు లభ్యమైనాయి. పెద్దపెల్లికి 9 కి.మీ. దూరంలో గల ఖదీమ్‌కనగర్తిలో 10 హెక్టార్ల వ్యవసాయపు భూములలో ఈ కాలపు కుండ పెంకులు దొరుకుతున్నాయి. ఈ భూములకు దగ్గరలోనే ఒక డజను వర్తులాకారపు బృహత్ శిలాసమాధులుండుట గమనార్హం.

కరీంనగర్ జిల్లాలోని తూర్పు ప్రాంతములో దాదాపు ఒక ఊరు (Almost every alternate Village) తప్పించి మరియొక ఊరు అన్నట్లుగా అనేక చోట్ల తొలిచారిత్రక యుగపు కుండ పెంకులు, ఇటుక ముక్కల్లాంటి అవశేషాలు దొరుకుతున్నాయి. తొలిచారిత్రక యుగములో మానవులు, గ్రామాలను, పట్టణములను, దుర్గములను నిర్మించుకొని చక్కటి నాగరిక జీవితము గడిపారని తెలుస్తుంది. రాజ ప్రాసాదములు, పెద్ద పెద్ద భవనాలు, రహదారులు, నీటి సరఫరా, మురికి నీటి కాలువలను ఇంకుడు గుంటలలోకి కలుపు వ్యవస్థ మున్నగు సౌకర్యములతో జీవించారు. ఈ కాలములో అనేక గ్రామాలు, పట్టణాలు రూపొందాయి. పెద్దబొంకూరు గ్రామము కాగా ధూళికట్ట, కోటిలింగాల పట్టణ దుర్గములుగా గుర్తింపబడినాయి.

## మతపరమైన తొలి నిర్మాణాలు

కరీంనగర్ జిల్లాలో జరిపిన త్రవ్వకాల్లో ఎక్కడా దేవాలయములున్న ఆధారాలు బయల్పడలేదు. ఇటుక కట్టడముతో ఒక చిన్న గది (Cell) 5.30 X 4.90మీ కొలతలతో

బయల్పడింది. అది దేవాలయ గదిగా కనబడింది కాని ఏ దైవమునకు అంకితము చేయబడినదో తెలుపుటకు ఎలాంటి చిహ్నములు లేవు[64]. ఆనాటి ప్రజల్లో మతపరమైన నమ్మకాలు ఎక్కువ. తొలి దేవతారూపములను పూజించి కర్మకాండలు జరిపేవారు. తొలి మానవులు గ్రామ దేవతలను, వృక్షసర్పముల నారాధించుటయే గాక భూత ప్రేత పిశాచములను గూడా పూజించేవారు. పెద్ద బొంకూరు త్రవ్వకాలలో ఇనుముతో చేయబడిన పాము రూప మొకటి లభ్యమగుట వలన నాగదేవతారాధన (Naga Cult) అమలులో ఉండినట్లు తెలుస్తుంది[65]. నాడే కాదు నేటి ఆధునిక యుగములో గూడా వృక్షసర్పముల పూజ కొనసాగుచునే ఉంది. నాగుల పంచమి పండుగ జరుపుకొని పాములకు పాలుపోయు ఆచారము ఇప్పటికీ ఉంది. అంతేగాకుండా పర్వదినములందు తులసి, రావి, మర్రి, ఉసిరిక, మారేడు మున్నగు చెట్లను ఆరాధించు ఆచారము నేటికి అగ్రవర్ణములలో అధికముగా కనిపించును. భూతప్రేత పిశాచముల, దయ్యముల పూజ చేయు ఆచారము గ్రామీణ ప్రాంతాలలో నేటికి ప్రబలిఉంది.

పెద్దబొంకూరు త్రవ్వకాల్లో క్రీ.పూ. ఒకటవ శతాబ్దమునకు చెందిన టెర్రకొట్ట గజలక్ష్మి ముద్రిక బయల్పడింది. తామరలున్న ఒక చెరువులో దేవత ఒక తామర పై నిలబడియుండి రెండు వైపుల గల ఏనుగులు తమ తొండముల చివరగల ముంతలతో (Pails) స్నానమాచరింప చేయుచున్నట్లున్నది[66]. దీనితో పాటు ప్రాచీనమైన టెర్రకొట్ట మాతృదేవతా (Mother Goddess) రూపములు లభ్యమైనవి. అతి ప్రాచీనమైన మాతృదేవతారాధనలో (The Cult of Mother Goddess) దేవత కూర్చొని తన కాళ్లను వెడల్పుగా తెరచి ఉన్న నగ్నరూపములో కనబడుతుంది. జననేంద్రియము సుస్పష్టంగా కనిపిస్తుంది. ఇలాంటి రూపాలు ఏలేశ్వరం, నాగార్జునకొండ, కొండాపూర్ మున్నగుచోట్ల దొరికాయి. గ్రామీణ మరియు పట్టణ ప్రాంత ప్రజలలో గూడా మాతృదేవత పూజ ఎక్కువగా ఉండేది[67].

పెద్దబొంకూరులో బయల్పడిన మాతృదేవతలు లావైన కుచద్వయమును కలిగి చేతితో చేసిన మట్టిబొమ్మలు. ఒక రూపములో దేవత చేతులు పైకి ఎత్తినట్లున్నది. రెండవ రూపములో దేవత ఫలములగుత్తిని కుడిచేతిలో పట్టుకొనగా రామచిలుక ఒకటి ఆమె ఎడమభుజముపై వ్రాలి తన ముక్కుతో దేవత స్తనమును మృదువుగా తాకుచున్నట్లున్నది. మూడవ రూపములో దేవత తన రెండు చేతులతో క్రింది నుండి తన బరువైన వక్షోజములను పట్టుకొనుచున్నట్లున్నది[68]. ఈ మాతృదేవతకు లజ్జగౌరి, రేణుక, నగ్నకబంధ, మస్తి, మస్మాదేవి మున్నగు పేర్లు గలవు. క్రీ.పూ. 3000 సం॥ నుండి మాతృదేవత పూజ జరిపేవారని తెలుస్తుంది.

ధూళికట్ట త్రవ్వకాల్లో అడుగుపొరల (Early Layers) నుండి క్రీ.పూ. 2వ, 3వ శతాబ్దమునకు చెందిన మాతృదేవత కంచుబొమ్మ పీఠము (Pedestal) పై కూర్చొని తన ఎడమచేతిలో ఒక శిశువును పట్టుకొని కుడిచేతిని తన మోకాళ్లపై మోపింది. తల్లి శిశువులతో కూడిన ఈ ప్రతిమ సంతాన సాఫల్యమును కలిగించు అంకధాత్రిమాతను పోలిఉంది[69]. దీనిని

బట్టి తొలిచారిత్రక యుగములో సంతాన సాఫల్యము(Fertility Cult)నకై మానవుడు పూజలు జరిపేవాడని తెలుస్తుంది.

## ధూళికట్ట బౌద్ధ స్థూపము

ధూళికట్టలో జరిపిన త్రవ్వకాల్లో క్రీ.పూ. రెండవ శతాబ్దమునకు చెందిన బౌద్ధస్థూపమొకటి బయల్పడింది. ఇది హుస్సేనివాగు మరియు ఉత్తరము నుండి వచ్చు మరియొక చిన్నవాగు రెండింటి సంగమస్థానమందుంది. ధూళికట్టకోట ఆవరణకు ఉత్తరమున 1 కి.మీ. దూరంలో ఈ స్థూపము నిర్మింపబడినది. రబ్బుల్ బేస్మెంట్ (Rubble Basement) పైన ఇటుకతో కట్టిన గర్భము (Birck Drum) 2 మీ. ఎత్తు కలదు. ఈ గర్భముపైన అండము (dome) 5 మీ. ఎత్తు నిర్మింపబడింది. దీనిపైన హార్మికఛత్రాలున్నాయి. ఎందుకంటె వాటి అవశేషాలు త్రవ్వకాల్లో బయల్పడినాయి. గర్భము (Drum) బలంగా నుండుటకై ఒక చతురస్రాకారపు ఆవరణము (Enclosure) దాని చుట్టు ఇటుకలతో కట్టబడింది. ఇది అండము శిథిలము కాకుండా కాపాడుటయే గాక ప్రదక్షిణాపథముగా గూడా ఉపయోగపడింది. రెండవ విడత నిర్మాణములో గర్భము 36 మీ. వ్యాసముతో విస్తృత పరుచబడింది. దీని నిర్మాణము సాంతము ఇటుకతోనే చేయబడింది. ఇందులో కాల్చిన ఇటుకలు వాడబడినాయి. ఈ ఇటుకలు రాళ్లవలె గట్టిగా ఉన్నాయి. ఇవి కొన్ని 1.5'x1'x3' కొలతలు మరికొన్ని 55సెం.మీ. x 28సెం.మీ. కొలతలు కలిగి ఉన్నాయి. ఈ స్థూపమునకు 2 మీ. దూరంలో వాయువ్యము నందు రెండు వరుసలలో చిన్న చిన్న గదులున్నాయి. ఇవి 3.30మీ x 3.50మీ కొలతలతో ఉన్నాయి[70].

స్థూపము యొక్క గర్భము 47 శిల్పాలంకృత ఫలకాల చేత (ఆయకాఫలకములు) చుట్టూ అలంకరింపబడింది. ఇవి సున్నపు రాతి ఫలకములు (Lime Stone Ayaka Slabs). చాలా మట్టుకు ఫలకములన్నియు భద్రముగానే ఉన్నాయి. వీటిలో కొన్ని కరీంనగర్ మ్యూజియంనకు తరలించబడినాయి. ఈ ఫలకములపై ఐదుపడగల ముచిలింద నాగము, బోధి వృక్షము, మహాభినిష్క్రమణము మున్నగునవి చెక్కబడినాయి.



ముచిలింద నాగసర్పము



స్త్రీ రూపము

బుద్ధునికి జ్ఞానోదయమైన తరువాత అతడు ఏడువారములు ఉరువెల (Uruvela) వద్ద గడిపాడు. 6వ వారము భయంకరమైన వర్షము, తుఫాను సంభవించాయి. అప్పుడు పాతాళము నుండి ముచిలింద నాగుడు వచ్చి తన విశాలమైన ఐదుపడగలను విప్పి బుద్ధునికి ఆశ్రయమిచ్చి వారము రోజులు కాపాడి, శాపవిముక్తి పొంది తిరిగి మానవరూపము ధరించెనని ప్రతీతి. ఇంతటి ప్రాధాన్యతగల ముచిలింద నాగము ధూళికట్ట ఫలకములపై ఐదు పడగలతో బహు అందంగా చెక్కబడింది. ఇలాంటి చెక్కడములే అమరావతి, నాగార్జునకొండ స్థూపముల ఫలకములపై గూడా అగబడును[71]. దక్షిణ భారతములో అమరావతి, నాగార్జునకొండ స్థూపములవలె ధూళికట్ట స్థూపము గూడా ప్రాధాన్యతను సంతరించుకొంది. ఎందుకనగా పైఠన్ నుండి ధూళికట్ట, కోటిలింగాల, పెద్దబొంకూరు, కొండాపూర్, ఫణిగిరి, నేలకొండపల్లి మున్నగు ప్రదేశముల గుండా ధాన్యకటకమునకు చేరు వాణిజ్య మార్గముండెనని తెలుస్తుంది.

ధూళికట్ట స్థూపములోని ఒక ఆయక ఫలకముపై ఐదు పడగల ముచిలింద నాగుడు బుద్ధుని కాపాడుచున్నట్లు చిత్రీకరింపబడింది. కాని ఇచట బుద్ధుని మానవ రూపమునకు బదులు అతని చిహ్నముగా (Symbolic) పాదములు చెక్కబడినాయి. ఈ ఫలకముపై క్రీ.పూ. 2వ శతాబ్దపు లక్షణాలతో బ్రాహ్మీలిపిలో *"గహపతినో పతాలస మతూయదానమ్" (Gahapatino Pathalasa Mathuya Danam)* యను లేబెల్ శాసనము (Label Inscription) ఉంది. దీనిని ఒకానొక గహపతి దానమిచ్చినట్లు తెలుపుతుంది. వేరొక ఫలకముపై పుష్పములనర్పిస్తూ నిలబడి ఉన్న స్త్రీ రూపములు చెక్కబడినాయి. ఈ మగువల చెవులకు పద్మము ముద్రికలు గల దళసరి ఆభరణములు (Ear Ornaments Stamped with Lotus Medallions) మెడకు వెడల్పైన కంఠాభరణము (Broad Necklace) నడుముకట్టు (Waist belt) పూసలచే చుట్టుబడిన ముంజేతి ఆభరణములు (Beaded Wristlets) మున్నగునవి చెక్కబడి ఉన్నాయి. దట్టముగా నున్న వీరి తల వెంద్రుకలు ప్రక్కకు ముడిరూపములో కట్టబడినాయి. (Tied into side knots). ఇచట బుద్ధుడు మానవరూపము (Anthropomorphic form) లో చిత్రీకరింపబడలేదు. గనుక ఈ స్థూపము హీనయాన శాఖకు చెందింది. క్రీ.పూ. 2వ శతాబ్దపు లేబెల్ శాసనములను బట్టి ఇది ఒక గొప్ప స్థూపముగా విరాజిల్లెనని తెలుస్తుంది.

## పాషిగాంవ్ (పాషాయిగాంవ్) బౌద్ధస్థూపము

కరీంనగర్ నుండి లక్షెటిపేటకు పోవు రహదారికి కుడివైపున ఒక గుట్టపై చిన్న బౌద్ధస్థూపముండేది. గోదావరికి 3 కి.మీ. దూరంలో స్తంభంపల్లి గ్రామమునకు సమీపమున గల పాషిగాం గ్రామములో ఈ గుట్ట ఉంది. కాని దురదృష్టవశాత్తు 1999 డిసెంబర్ చివరి వారములో ఇర్కాన్ సంస్థ కాంట్రాక్టర్లు రోడ్ వెడల్పు కార్యక్రమములో పొక్లేన్లతో ఈ గుట్టమట్టిని తీయగా ఇక్కడి స్థూపము సంపూర్ణముగా శిథిలమైంది. క్రీ.పూ. 2వ శతాబ్దము నుండి కాపాడుకొనిన

ఈ స్థూపము 2200 సంవత్సరముల తరువాత ఒక్కసారి నేల మట్టం కావడము విచారకరము. ఈ స్థూపము యొక్క ఆరు సున్నపురాతి ఆయకఫలకములు (Lime Stone Ayaka Slabs) సూర్యకాంతులకు తళతళ మెరియుచు బస్సులోని ప్రయాణీకుల దృష్టినాకర్షించి ఆహ్లాద పరిచేవి. ఈ 6 ఫలకములు ఒకదాని ప్రక్కకొకటి గుండ్రముగా నిలుపబడి యుండేవి. వేరొక ఫలకము ముక్కలై వీటి సమీపములో గుట్టపై పడియుండెను[72]. ఫలకములపై కుడ్యస్తంభములు (Pilasters), పాత్రలు, విరబూసిన పద్మములు (Full blown lotuses) చెక్కబడినాయి. ఈ స్థూపమునకు దక్షిణమున అదే గుట్టపై బౌద్ధ సన్యాసుల కొరకై నిర్మించిన దీర్ఘచతురస్రాకారపు పెద్దగది చిహ్నములున్నాయి. ఈ నిర్మాణపు పై వరుసలలో శాతవాహనుల కాలపు పెద్ద పెద్ద ఇటుకలు కనిపిస్తాయి. స్థూపముల ప్రక్కనే సన్యాసుల నివాసము కొరకు సాధారణముగా విహారాల నిర్మాణము జరుగుచుండేది[73].



పాషిగాంవ్ – బౌద్ధస్థూపము

## మీర్జంపేట బౌద్ధస్థూపము

కరీంనగర్‌కు తూర్పున 56 కి.మీ. దూరంలో శ్రీరాంపూర్ మండలమందు మానేరునది ఒడ్డున నున్న మీర్జంపేట యొక్క హ్యామ్లెట్ పోచంపల్లిలో ఒక దిబ్బ (Mound) వద్ద బావికొరకు అనుమాండ్ల వెంకటయ్య త్రవ్వకము జరుపగా రాతి కట్టడముతో నున్న చిన్న బౌద్ధస్థూపమొకటి 1994లో బయల్పడింది. ఇచట బుద్ధుని అస్థికలు గల బరణి లభించిందని కరీంనగర్ పురావస్తుశాఖ సాంకేతిక నిపుణుడు యం.లక్ష్మినారాయణ తెలిపాడు. ధూళికట్ట, పాషిగాం స్థూపాలలో దొరకని బుద్ధ ధాతువులిచట లభించడం విశేషం.

## ఆధార గ్రంథములు

(References)

1. *APGKD* 1974, P. 61

2. *Census of India, Administrative Atlas A.P.,* 1971, P. 453

3. *Census Hand Book, Karimnagar District,* 1961, P. 1

4. J.Ramanaiah, *Memoirs (An autobiography),* Jagtial. 2001, P.463

5. *APGKD* 1974, P. 2

6. *Ibid*

7. *Census Hand Book, Karimnagar District,* 1961, P. 1

8. *EA,* Vol. II, P.21

9. *APGKD* 1974, P. 3

10. V.V.Krishna Sastry, *The proto and Early Historical cultures of A.P.,* 1983, PP. 11-14.

11. *Ibid,* P. 1

12. *Ibid*

13. ఠాకూర్ రాజారాంసింగ్, ఆంధ్రభూమి దినపత్రిక కరీంనగర్ ఎడిషన్ ప్రారంభ ప్రత్యేక సంచిక, 28-5-2001, P. 77

14. N.S. Ramachandra Murthy, *APHC,* Volume 1983, Section II, PP. 1-8

15. V.V.Krishna Sastry, *Op.cit.* PP. 5 & 152

16. *Ibid,* P. 13

17. Dinosaurus site at vemanapalli is reported in The Hindu daily, D. 13-9-1976

18. ఈనాడు దినపత్రిక 27-4-2002 శనివారము మేన్ ఎడిషన్ P. 7

19. P.Sreenivasachar, *The Archaeological Bulletin No.II,* P. 48

20. B.Rajendra Prasad, *Temple Sculpture of A.P.,* P. 42

21. *IAPKD,* No. 8

22. J.Ramanaiah, *Op.cit,* PP. 270-274

23. *JAHRS,* Vol. XXXV, PP. 183-186

24. ఈనాడు 2001 నవంబర్ 16వ, 26వ, 29వ తేదీల దినపత్రికలలోని సమాచారము.

25. Munn, L. *Annual Report of the Archaeological Dept of H.E.H. The Nizam's Dominions,* 1925-1926, pp. 19,20

26. ఠాకూర్ రాజారాంసింగ్, *Op.cit.,* p. 77

27. *Ibid*

28. V.V.Krishna Sastri, *Op.cit.,* p. 15

29. కె.యస్.బి. కేశవ కరీంనగరము పురావస్తు శాఖ అసిస్టెంట్ డైరెక్టర్ - మా ఉభయుల సంభాషణలో 1-5-2002 రోజున తెలిపినారు.

30. *Ibid*

31. V.V.Krishna Sastri, *Op.cit.,* p. 25

32. *APGKD,* 1974, p. 33

33. *JAHRS,* Vol. XXXII (1-4parts) p. 48

34. R. Subrahmanyam, *"President's Address".,* APHC Vol. II 1977 p. IX

35. *ARDAM,* 1976-1977, p. 35

36. V.V.Krishna Sastri, *Op.cit.,* p. 46

37. B.S.L. Hanumantha Rao, *"President's Address" APHC*, Vol. 1978, p. 5

38. V.V.Krishna Sastri, *Op.cit.*, p. 52

39. కరీంనగర్ మండల చరిత్ర, శ్రీత్యాగరాజలలిత కళా పరిషత్, కరీంనగరము 1981, p. 17

40. *Ibid*, p. 17

41. V.V.Krishna Sastri, *Op.cit.*, p. 81

42. *Ibid.*, p. 79

43. *ARDAM*, 1976-1977 pp. 34,35

44. కరీంనగర్ పురావస్తుశాఖ సాంకేతిక నిపుణుడు యం.లక్ష్మినారాయణ - మా ఉభయుల సంభాషణలో 20-3-2002 రోజున తెలిపినారు.

45. యస్. జైకిషన్ ధర్మపురి చరిత్రోపన్యాసకులు 17-4-2002 రోజున తెలిపినారు.

46. V.V.Krishna Sastri, *Op.cit*, p. 124

47. దక్షిణ భారతదేశ చరిత్ర, తెలుగు అకాడమి, హైద్రాబాద్, 1982. p. 15

48. V.V. Krishna Sastri, *Op.cit*, p. 120

49. Thakur Raja Ram Singh "New light on Early Andhra Satavahana History", APHC, Vol.VII, Warangal,1983, pp.21, 22

50. *Ibid*

51. V.V. Krishna Sastri, *Op.cit*, p. 122

52. *Ibid*, p. 219

53. *Ibid*, p. 124

54. *JAHRS*, Vol. XXV p. 314

55. B.R.Subrahmanyam, *"President's Address" APHC*, Vol. VII, Warangal, 1983. p. 12

56. V.V. Krishna Sastri, *Op.cit*, p. 134

57. *ARDAM*, 1976-1977. p. 13

58. *Ibid*, p. 14

59. *Ibid*, p. 15

60. V.V. Krishna Sastri, *Op.cit*, p. 126

61. *Ibid*

62. *Ibid*

63. *Ibid*, p. 127

64. *Ibid*, p. 143

65. *Ibid*, plate No. 76

66. *Ibid*, plate No. 104

67. B.Rajendra Prasad, *Art of South India*, A.P. p. 55

68. V.V. Krishna Sastri, *Op.cit*, plate Nos. 93,94,95.

69. *Ibid*, plate No. 82

70. G.Chandra Reddy, *"The Stupa of Dhulikatta and its Sculptures" APHC* Vol. XI, 1987. p.38

71. C. Sivaramamurthi, *Early Andhra Art and Iconography*, plates. 14, 22

72. J. Ramanaiah, *Temples of South India*, New Delhi, 1989. p. 12

73. B. Rajendra Prasad, *Op.cit*, p. 26

## రెండవ అధ్యాయము

# II. జిల్లా ప్రాంతీయ చరిత్ర

భారతదేశంలో క్రీ.పూ. 6వ శతాబ్దంలో వెలసిన 16 మహాజనపదాల్లో దక్షిణాదిలో దక్కన్ యందు అస్మక లేదా అస్సక ఒక మహాజనపదంగా పేర్కొనబడింది. ఈ అస్మక రాజధాని పోతలి, పోతన, పోదన లేదా పాదన్యపురముగా మహాభారతములో పేర్కొనబడి నేటి నిజామాబాద్ జిల్లాలోని బోధన్‌గా గుర్తింపబడినది. ఇచట తొలి చారిత్రక దిబ్బలు బయల్పడినవి. ఇది గోదావరి మంజీరానదుల సంగమమునకు దక్షిణముగా వ్యాపించియున్న పట్టణము. ప్లినీ చరిత్రకారుడు పేర్కొనిన అస్మగియే ఈ అస్మక అయి యుండును[1].నిజామాబాద్ జిల్లా ప్రాంతముతో పాటు కరీంనగర్ జిల్లా ప్రాంతం గూడా ఈ అస్మక మహా జనపదంలో ఒక భాగమై ఉండేది.

### నందరాజులు

మగధనేలిన నందవంశపు రాజులు తమ అధికారమును దక్కన్ పై గూడా విస్తరింప జేశారు. గోదావరి ఒడ్డున నందులు నౌనందధేరాయను సైనిక శిబిరమును నిలుపుట వలన అక్కడ వెలసిన పట్టణము నాందేడ్‌గా వ్యవహరింపబడుతుంది. గోదావరిలోయలోని దక్కన్ ప్రాంతము వారి అధీనమందుండుట వలన కరీంనగరము ప్రాంతము గూడా వారి పాలనలో ఒక భాగమై ఉండేది. కరీంనగరము జిల్లాలోని గంగాధరకు సమీపాన గల నందగిరి గ్రామనామము నందులను గుర్తు చేస్తుంది. నందగిరి నానుకొని కోట్ల నరసింహుల పల్లె కలదు. కోటలోని పల్లెయే నేడు కోట్ల నరసింహుల పల్లెగా పిలువబడుచున్నది. నందగిరి, నరసింహుల పల్లె జంటగ్రామాలు. వీటి చుట్టూ ఉండిన మట్టి కోట ప్రాకారపు చిహ్నాములు అగడ్తల గుర్తులు నేటికీ అగబడుచున్నవి. ఇచటి కొండపై ఒక ప్రాచీన నరసింహ దేవాలయమున్నది.

### మౌర్యచక్రవర్తులు

క్రీ.పూ. 323లో మగధయందు నంద రాజుల పాలనను అంత మొందించి మౌర్యచంద్ర గుప్తుడు అధికారానికి వచ్చాడు. భారతదేశమున సువిశాల సామ్రాజ్యమును స్థాపించిన ప్రప్రథమ

చక్రవర్తి మౌర్యచంద్రగుప్తుడే. కర్ణాటక రాష్ట్రములోని శ్రావణ బెల్గోలలో ఈ చంద్రగుప్తుడు తన చివరి రోజులను జైన సంప్రదాయానుసారము గడిపి తనువు చాలించెనని తెలియుచున్నది. తదనంతరము పాలించిన అతని కుమారుడు బిందుసారుడు (క్రీ.పూ. 299-272) దక్కన్‌లోని కొన్ని ప్రాంతములు జయించాడు. ఇతని కాలములోనే మౌర్యసామ్రాజ్యము పెన్నా నది వరకు విస్తరించింది. తత్ఫలితముగా దక్షిణ భారతమునకు ఉత్తర భారతదేశముతో చక్కటి రాజకీయ సాంస్కృతిక సంబంధములేర్పడినవి. కళింగము తప్ప బిందుసారుడు రెండు సముద్రముల మధ్య నున్న (The territory between the Arabian Sea and Bay of Bengal) యావత్తు దక్కన్‌కు అధిపతి ఐనాడు[2]. అశోకుడు క్రీ.పూ. 261లో కళింగను జయించాడు. రాయచూర్ దోబ్ (Doab) ప్రాంతమున గల మస్కి, కోప్‌బాల్ చిన్న శిలాశాసనములు (Minor rock edicts) మరియు కర్నూలు జిల్లాలోని ఎర్ర గుడి శాసనముల వలన దక్కన్‌పై అశోకునికి సంపూర్ణాధికారము ఉండినట్లు విదితమగుచున్నది[3]. కావున దక్కన్‌లోని కరీంనగర్ మండలం గూడా వీరి ఏలుబడిలో ఉండేది. ఇరువదవ శతాబ్దపు తొలి పాతిక సంవత్సరాల కాలములో (In the first quarter of the twentieth century A.D.) కరీంనగర్ జిల్లా నుండి లభ్యమైన 418 పంచ్‌మార్క్‌డ్ నాణెములు ప్రస్తుతము హైద్రాబాద్ మ్యూజియంలో ప్రదర్శింపబడియున్నవి. ఇవి ఈ జిల్లాలో ఎచట లభ్యమైనవో చెప్పబడలేదు. శ్రీనివాస్ ఈ నాణెములను పరిశీలించి పరిశోధించి, ఇవి మౌర్యుల మరియు మౌర్యుల కంటే పూర్వకాలమునకు చెందినవని ధృవపరచినారు[4]. అశోకుని అనంతరము మౌర్యసామ్రాజ్యము పతనమొంది గోదావరి లోయలో ఆంధ్రుల రాజ్యములేర్పడినాయి.

## కొత్తగా వెలుగులోనికి వచ్చిన తొలి ఆంధ్రరాజులు.

ఇంత వరకు కరీంనగర్ ప్రాంతాన్ని పాలించిన తొలిరాజులు శాతవాహనులే యను అభిప్రాయము తారుమారైనది. శాతవాహనులకంటే పూర్వమే గోదావరి లోయలో ఆంధ్రుల రాజ్యము వెలసెనని ఈ జిల్లాలో జరిపిన త్రవ్వకాలలో లభించిన ఆధారాల వలన తెలియుచున్నది. కోటి లింగాలలో జరిపిన త్రవ్వకాలలో శాతవాహనుల కంటే పూర్వీకులైన సమగోప, గోభద, కంపయ, నారన మున్నగు పాలకుల నాణెములు లభ్యమైనవి. ఇచట లభ్యమైన అనేక రాగి మరియు సీసపు నాణెములపై క్రీ.పూ. రెండవ శతాబ్దపు లక్షణములలో ప్రాకృత బ్రాహ్మిలిపిలో రాణోగోభద, రాణోనారన, రాణోసిరికంపయ, రాణో సామగోప పాలకుల పేర్లు చెక్కబడియున్నవి. వీటితో పాటు త్రవ్వకాలలో రాఞో (రాణో) శాతవాహన, రాణో శాతకర్ణి మరియు రాణోచిముక శాతవాహన నాణెములు గూడా లభ్యమైనవి. ఈ నాణెములతో పాటు నల్లని ఎర్రని, ఎర్రని పాలిష్‌డ్ (Black and redware, Polished Red ware, Greyware) మున్నగు పెంకులు లభ్యమగుట వలన ఈ స్థావరము అతి ప్రాచీనమైనదని క్రీ.పూ. 4వ, 3వ శతాబ్దములలోనే ప్రాధాన్యతను సంతరించుకొనిన ప్రాంతమని విదితమగుచున్నది[5]. కోటిలింగాలలో లభ్యమైన నాణెములు ఆంధ్ర ప్రాంతములోనే గాకుండా, దక్షిణ భారతదేశములోనే పేర్లు చెక్కబడిన ప్రప్రథమ

నాణెములని (Inscribed Coins) డా.యన్.యస్. రామచంద్రమూర్తి అభిప్రాయము. ఇచటి త్రవ్వకాలలో వెండి పంచ్‌మార్క్‌డ్ నాణెములు (Silver Punch Marked Coins) మరియు కేవలము చిహ్నములుండి పేర్లు చెక్కబడని నాణెములు (Uninscribed Coins) లభ్యమైనాయి. దేశములో పంచ్‌మార్క్‌డ్ నాణెములు అతిప్రాచీనమైనవి. వీటి తరువాత మరియు శాతవాహనుల పూర్వీకులైన సామగోప, గోభదపేర్లు చెక్కిన నాణెముల (Inscribed Coins) కంటే ముందు అనగా రెండింటి మధ్య సంధికాలమునకు (Between the periods of punch marked coins and inscribed coins) సంబంధించినవి ఈ చిహ్నములు గల నాణెములు (Uninscribed coins). ఇవి క్రీ.పూ. రెండవ శతాబ్దమునకు పూర్వపునాణెములు. వీటిపై ఒక వైపు ఏనుగు, వృషభము, ఒంటె, సింహము, కమానువలెనుండు గుట్ట (Arched hill), అశ్వము, ధనుస్సు, బాణము మున్నగు వాటిలో ఎవైనా గుర్తులుండును. రెండవవైపు సాఫీగా (Blank or Plain) లేదా ఉజ్జయిని స్వస్తిక, ఆరుకమాన్‌ల గుట్ట (Six arched hill) ఉంటుంది[6].

కోటిలింగాల, శాతవాహనుల కంటే పూర్వమే వెలసిన స్థావరము (Pre-Satavahana Site). ఆంధ్రప్రదేశ్‌లోని అన్నింటి కంటే అతి పురాతనమైన స్థావరము కోటిలింగాలయని భావింపబడుచున్నది. ప్రస్తుతము సరియైన తేదీలు నిర్ణయించుట కష్టము గనుక ఈ స్థావరము అశోకుని కంటె పూర్వపుకాలపుదా? లేదా తరువాత కాలముదా? యని చెప్పుటకు వీలుపడదు. కోటిలింగాలలో మొదట గ్రామస్థులు నివాసమేర్పరుచుకొనగా క్రమేణ అభివృద్ధి చెంది పట్టణముగా రూపొందినది[7]. ఇంతవరకు శాతవాహనుల కాలము నుండియే మొట్టమొదట పేర్లు చెక్కిన నాణెములు (Inscribed Coins) చలామణిలోనికి వచ్చినవని భావింపబడేది. కాని కోటిలింగాల త్రవ్వకాలలో శాతవాహనులకంటే పూర్వము పాలించిన రాజుల అనేక రాగి, సీసపు నాణెములు క్రీ.పూ. రెండవ శతాబ్దపు లక్షణములు గల బ్రాహ్మీలిపిలో చెక్కినపేర్లతో బయల్పడినవి. కావున శాతవాహనులకు పూర్వమే ఈ ప్రాంతపు స్థానిక రాజులు బ్రాహ్మీలిపిలో తమపేర్లు చెక్కిన నాణెములను (Inscribed Coins) చలామణిలో ఉంచినారని తెలియుచున్నది. ఇవి చౌక లోహము రాగి, సీసముతో తయారైన నాణెములు గనుక సుదూర ప్రాంతములకు పోకుండా స్థానికంగా, ప్రాంతీయంగానే చలామణిలో నుండెనని ఎ.యమ్.శాస్త్రి అభిప్రాయము[8]. పెద్దబొంకూరు, కోటిలింగాల, మెదక్ జిల్లాలోని కొండాపూర్‌ల వద్ద టంకసాల (Mint Centres) కేంద్రములుండెనని ఆ ప్రదేశములందు లభ్యమైన వందలాది నాణెములను బట్టి, ముద్రికలను (Moulds) బట్టి భావింపబడుచున్నది. పెద్దబొంకూరులో లభ్యమైన టెర్రకొట్ట ముద్రికలు (Terracotta Coin Moulds), వందలాది నాణెములను బట్టి ఐ.కె.శర్మ ఈ నిర్ణయానికి వచ్చినారు[9]. గోదావరి లోయలోని కరీంనగరము జిల్లా మరియు దాని పరిసరప్రాంతము వాణిజ్యపరంగా పడమటి దక్కన్‌కు తూర్పుడెల్టా ప్రాంతములకు మధ్యవారధిగా నుండెనను విషయము తరుచుగా విస్మరింపబడి పరిగణనలోనికి తీసుకొనబడలేదు. మౌర్యుల పతనానంతరము మరియు

శాతవాహనుల పాలనారంభమునకుపూర్వము మధ్యకాలములో ఈ ప్రాంతమునందు స్థానిక పాలకులు (Indigenous Ruling Chieftains) అధికారములో నుండినట్లు కోటిలింగాలలోని నాణెములు తెలుపుచున్నవి[10].

కోటిలింగాల త్రవ్వకాలు 6 పొరలు (Six Layers) కలిగియున్నవి. క్రింది మూడు పొరలలో (Phase I) మట్టి ప్రాకారము (Mud rampart) మరియు అనేక రబ్బుల్ నిర్మాణములు బయల్పడినవి. పై మూడు పొరలలో (Phase II) కోటగోడ నిర్మాణము, బురుజుల కట్టడములు (Bastions) కనబడును. ఈ కోటగోడలు పెద్ద పెద్ద ఇటుకలతో నిర్మింపబడినవి. ఆంధ్రదేశములో కోటగోడల మధ్య బురుజుల (Bastions) నిర్మాణము తొలుత ఇచ్చటనే జరిగినట్లు తెలియుచున్నది[11]. క్రింద నున్న ఐదవ పొరనుండి పై నున్న మొదటి పొరవరకు (Layers from V to I) శాతవాహనుని, మొదటి శాతకర్ణి నాణెములు లభించగా చిముకుని లేదా సిముక శాతవాహనుని నాణెములు క్రింది మూడవ పొర నుండి పై మొదట పొర వరకు (Layers from III to I) లభించినవి. ఈ ఐదింటి క్రింద నున్న చిట్ట చివరి ఆరవపొర (Layer VI) లో సామగోపుని అనేక నాణెములు లభ్యమైనవి. అనగా శాతవాహనుల నాణెములు లభ్యమైన అన్ని పొరల కంటె క్రింది పొర (Sixth Layer) లో ఇతని నాణెములు లభించుట విశేషమే గాకుండా ఈ ప్రాంతపు తొలిచరిత్రనే మార్చివేసింది[12]. మౌర్యుల పతనము నుండి శాతవాహనుల కాలము వరకు ఇచటి ఆరుపొరలు (Six Layers) ఏ మాత్రము చెదరకుండా, స్పష్టముగా (Undisturbed and distinct) పదిలముగా నుండుట విశేషము.

కోటిలింగాలలో మొట్టమొదట పేరు చెక్కబడిన నాణెములు (Inscribed Coins) గోభదునివి. ఎందుకంటే వాటిపై క్రీ.పూ. రెండవ శతాబ్దపు ప్రథమార్థభాగపు బ్రాహ్మీలిపి లక్షణములున్నవి. ఈ లిపి మౌర్యుల అనంతర కాలపు సత్వరలిపిని బోలియున్నది. శాతవాహనులకు పూర్వము ఈ ప్రాంతమును పాలించిన రాజులందరిలో సామగోపుడు చాలా ప్రముఖుడైనట్లు అన్ని పొరలలో (All Layers) లభించిన అతని అనేక నాణెముల వలన తెలియుచున్నది. అతని కంటె పూర్వము ఆయన వంశీయులు కొందరు అర్థశతాబ్దము వరకు క్రీ.పూ. రెండవ శతాబ్దములో ఈ ప్రాంతమును పాలించినట్లు నాణెములు తెలుపుచున్నవి[13].

సామగోపుడు అతని పూర్వీకులు కోటిలింగాలను రాజధానిగా చేసికొని గోదావరిలోయ ప్రాంతమును పాలించిరి. సామగోపుని పాలనలో శాతవాహనుడు అతని సేనానిగా పనిచేసి అదను జూచి అతనిని పదవీచ్యుతుని గావించి అధికారమును చేజిక్కించుకొని ఉంటాడు. సమగోపుని అనంతరమే శాతవాహనుడు అధికారమునకు వచ్చెననుటకు సామగోపుని కొన్ని నాణెములకు ఇంకొకవైపు శాతవాహనుని పేరు గల నాణెములు లభ్యమైనవి. తదనంతరము సామగోపుని నాణెములను బోలిన నాణెములనే కొద్ది మార్పులతో శాతవాహనుడు

ముద్రింపజేయడము గమనార్హము. వీటన్నింటిని బట్టి శాతవాహనుడు అవకాశము జూచి శాంతియుతంగా లేదా బలవంతంగా సామగోపుని నుండి అధికారము చేజిక్కించుకొనినట్లు విదితమగుచున్నది[14]. దీనితో సామగోపుని వంశీయుల పరిపాలన అంతమొంది కోటిలింగాల రాజధానిగా శాతవాహనుని పరిపాలన ప్రారంభమయ్యెను.

## శాతవాహనులు

మౌర్యుల సామ్రాజ్య శిథిలములపై వెలసిన రాజ్యములలో మహోజ్వలమైనది ఆంధ్ర శాతవాహన సామ్రాజ్యము. వీరి విజృంభణతో దక్షిణాపథచరిత్రలో నూతన అధ్యాయము ప్రారంభమైంది. వీరి జన్మస్థలము,కాలము, కులము, రాజధాని మున్నగు విషయముల గూర్చి నిర్దిష్టమైన సమాచారము లేకపోవుటచే అనేక వివాదాలకు దారితీశాయి. ఆంధ్రశబ్దము జాతిపరమైనదని, శాతవాహన శబ్దము వంశనామమని భావింపబడుచున్నది. పురాణముల ఆధారముగా 30 మంది శాతవాహనరాజులు క్రీ.పూ. 230 నుండి క్రీ.శ. 220 వరకు దాదాపు 450 సంవత్సరాలు పాలించిరని కొందరు చరిత్రకారుల అభిప్రాయము. కాని ఇటీవల త్రవ్వకాలలో బయల్పడిన నాణెములను బట్టి శాతవాహనుల కాలము అంత సుదీర్ఘముగా లేదని, వీరి పాలన క్రీ.పూ. ఒకటవ శతాబ్దము కంటె ముందుకు పోవడానికి వీలులేదని మరికొందరు చరిత్రకారుల అభిప్రాయము[15]. ఇంత వరకు చరిత్రకారులు వీరి తొలిరాజధాని ప్రతిష్ఠానపురము (పైఠన్) అనియు తదుపరి ధరణికోట (ధాన్యకటకము) యని భావించారు. కాని కోటిలింగాలలో బయల్పడిన ఆధారములు పై అభిప్రాయమును ప్రక్కకునెట్టినవి. చిముకుడు లేదా సిముకుడు (శ్రీముఖుడు) శాతవాహనుల మొట్ట మొదటిరాజు అను అభిప్రాయము సరియైనది కాదని ఇచటి నాణెములు రుజువు చేశాయి.

శాతవాహన వంశపు మూల పురుషుడు శాతవాహనుడని కొత్తగా వెలుగు చూచిన ఆధారాలు తెలియజేస్తున్నాయి. ఇతని నాణెములు పశ్చిమ మహారాష్ట్రము, విదర్భ, మరట్వాడ, ఆంధ్రప్రదేశ్‌లలో లభ్యమైన తరువాత చరిత్రకారుల అభిప్రాయము మారినది. వీరి రాజ్యస్థాపకుడు సిముకుడు కాదు. శాతవాహనుడే మొట్టమొదటి రాజు గనుక వీరి వంశమునకు శాతవాహనులని పేరు వచ్చినది[16]. కోటిలింగాల త్రవ్వకాలలో పై మూడుపొరల యందు (Layers III to I) మాత్రమే సిముకుని పేరు గల, సిముక శాతవాహన పేరు గల నాణేలు దొరికాయి. మూడవ పొర క్రింది పొరలలో సిముకుని నాణెములు లభించలేదు. సిముకుడు, సిముక శాతవాహన రెండు ఒకే రాజు పేర్లు అనియు, సిముకుడు తన పేరు ప్రక్కకు శాతవాహన పదము జోడించుట తన తాత గౌరవార్థమేయని భావింపబడుచున్నది. తొలిపాలకులైన శాతవాహనుని నాణెములు, మొదటి శాతకర్ణినాణెములు క్రింది ఐదవ పొర నుండి పై నున్న మొదటి పొర వరకు (Layers V to I) లభించాయి. శాతవాహన పేరు గల నాణెములు, సిముకుని పేరు గల నాణెములు

వేర్వేరుగా లభించుట వలన శాతవాహనుడు, సిముకుడు వేర్వేరు రాజులని నిర్ధారింపబడింది. శాతవాహనుని నాణెములు మరియు మొదటి శాతకర్ణి నాణెములు క్రింది ఐదవ, నాలుగవ పొరలలో లభించుట వలన వీరిరువురు సిముకుని కంటే పూర్వీకులని స్పష్టమౌతుంది.[17]

శాతవాహనుడు సామగోపుని సేనానిగా నుండి రాజ్యమును అపహరించినట్లు తెలుస్తుంది. ఈ అపహరణ బలవంతముగానైనను లేదా శాంతియుతంగానైనను జరిగియుండవచ్చు. కోటిలింగాలలోనే శాతవాహనుని అధికారమారంభమైనది గనుక ఇదియే శాతవాహనుల తొలిరాజధానియని రూఢిగా తెలుస్తుంది. శాతవాహనుడు కోటిలింగాల నుండియే తన సేనలను పడమటి వైపు నడిపి మహారాష్ట్రములోని అధిక భాగమును తన అధీనములోనికి తెచ్చుకొన్నాడు. విదర్భ, మరత్వాడ ప్రాంతములలో మరియు నెవాసా త్రవ్వకాలలో లభ్యమైన ఇతని నాణెములే ఇందుకు తార్కాణము. శాతవాహనుని అనంతరము రాజ్యమునకు వచ్చిన మొదటి శాతకర్ణి నాగవంశపు రాకుమారి నాగానికను పెండ్లిచేసికొని రెండు అశ్వమేధయాగములు, ఒక రాజసూయయాగము, 18 ఇతర యాగములు నిర్వహించి తన ప్రాబల్యమును చాటుకొన్నాడు. ఇతని నాణెములనేకములు దక్కన్, మధ్యభారతములో దొరికినవి. ఇతని శాసనమొకటి సాంచిలో ఉంది. ఇతని రాణి నాగానిక నానాఘాట్‌లో వేయించిన శాసనమును బట్టి ఇతడు తన రాజధానిని పడమటి దక్కన్‌లోని నానాఘాట్‌కు సమీపమున గల వాణిజ్యకేంద్రమైన జున్నార్‌కు మార్చినట్లు తెలుస్తుంది. అయినప్పటికిని శాశ్వత రాజధానిగా కోటిలింగాలను వదులుకోలేదు. ఎందుకనగా ఇతని తరువాత పాలించిన సిముకుడు ఇచటి నుండియే రాజ్యమేలాడు[18].

శాతవాహనులలో మూడవ గొప్పరాజు సిముకుడు. ఇతడు తండ్రి నుండి సువిశాల సామ్రాజ్యమును పొందెను. చివరి కాణ్వరాజైన సుశర్మన్ విదీశలో బసచేయుచుండగా సిముకుడు అతనినంత మొందించి గొప్ప విజయాన్ని సాధించాడు. దీనితో శుంగుల, కాణ్వుల ఆధిపత్యము విదీశలో పూర్తిగా అంతరించి ఆ ప్రాంతమంతయు శాతవాహనుల అధీనమైంది. సిముకుని నాణెములు కోటిలింగాల, కొండాపూర్, సంగారెడ్డి, పౌనార్, జున్నార్‌ల వద్ద లభ్యమైనాయి[19]. తొలిరాజులైన శాతవాహనుడు, మొదటిశాతకర్ణి, సిముకుడు కోటిలింగాల రాజధాని నుండియే పాలించారు. ఇచటి నుండియే పడమటి వైపు విస్తరించి పైఠన్‌ను రాజధానిగా చేసికొనినారు. తదనంతరము మలిశాతవాహనులు కృష్ణలోయలోని ధాన్యకటకమును రాజధానిగా చేసికొన్నట్లు స్పష్టమగుచున్నది. శాతవాహనుల కాలములో రాజకీయ కార్యకలాపములకు కోటిలింగాల కీలక కేంద్రముగా (Nucleus of Political activities) వెలుగొందినదనుట నిర్వివాదాంశము. పడమట పైఠన్ తూర్పున ధాన్యకటకము, ఈ రెండింటి మధ్య కోటిలింగాల వారధిగా (Link) నిలిచి రాజధానిగా విరాజిల్లింది.

కరీంనగర్ జిల్లాలో ప్రత్యేకముగా తూర్పు ప్రాంతమున శాతవాహనుల కాలపు స్థావరములనేకములు బయల్పడినవి. కప్పరావుపేట సమీపమున కీ.శే. సంగనభట్ల నరహరి గారికి లభ్యమైన సిముకుని నాణెముల వలన రాజకీయముగా ఈ ప్రాంతము కీలకమైనదని తేలింది[20]. ఈ జిల్లాలో శాతవాహనుల కాలపు 284 పూర్ణనాణెములు (Full Coins) మరియు 116 విరిగిన నాణెములు (Broken Coins) లభ్యమైనాయి[21]. పెద్దబొంకూరు త్రవ్వకాలలో శాతవాహ, మొదటి శాతకర్ణి, గౌతమీపుత్ర శాతకర్ణి, వాశిష్ఠపుత్రపులోమావి, శివశ్రీ పులోమావి, యజ్ఞశాతకర్ణి మరియు రుద్రశాతకర్ణి చక్రవర్తుల నాణెములు లభ్యమైనవి[22].

కరీంనగర్ జిల్లాలో జరిపిన త్రవ్వకములను బట్టి పెద్దబొంకూరు శాతవాహనుల గ్రామముగా, కోటిలింగాల, ధూళికట్ట బలిష్ఠమైన దుర్గములతో పట్టణములుగా గుర్తింపబడినాయి. మౌర్యచంద్రగుప్తుని ఆస్థానమునలంకరించిన గ్రీకురాయబారి మెగాస్థనీస్ తన ఇండికా గ్రంథములో ఆంధ్రులకు 30 బలిష్ఠమైన దుర్గములుండెనని పేర్కొన్నాడు. కోటిలింగాల, ధూళికట్ట రెండు దుర్గములను గూడా మెగాస్థనీస్ పరిగణనలోనికి తీసికొని యుండునని చారిత్రకుల అభిప్రాయము. ఎందుకనగా ఈ దుర్గములలోని రాజభవనముల చిహ్నాములు, చక్కటిరోడ్ల నిర్మాణము, త్రాగునీటివసతి, మురికి కాలువల నిర్మాణము మున్నగు అవశేషములు వీటి ఔన్నత్యమును తెలుపుతున్నాయి.

శాతవాహనుల కాలము

శాతవాహనుల కాలములో ఈ ప్రాంతము వర్తక వాణిజ్యములకు కేంద్రముగా నుండెను. రోమన్‌లతో జరిపిన వాణిజ్యము ఈ ప్రాంత ఆర్థికాభివృద్ధికి తోడ్పడింది. రోమన్ చరిత్రకారుడైన ప్లిని (Pliny) ఇండియాతో విరివిగా జరుపుచున్న వ్యాపారము రోమన్ బొక్కసమును ఖాళీ చేయుచున్నదని బాధపడ్డాడు[23]. కరీంనగర్‌కు 15 కి.మీ. దూరములో నున్న నుస్తులాపూర్ వద్ద 1952లో బయల్పడిన ఒక కుప్ప (Hoard) యందు 39 రోమన్ వెండి నాణెములు మరియు ఇతర 8 వెండినాణెములు లభ్యమైనవి[24]. వీటిలో రోమన్ సామ్రాజ్యము నేలిన ఆగస్టస్ (Augustus B.C.27 to 14 A.D.) మరియు నీరో (Nero 14 A.D. to 37 A.D.) చక్రవర్తుల నాణెములున్నాయి. ఈ ప్రాంతమునకు పాశ్చాత్య దేశములతో విరివిగా వ్యాపార సంబంధములుండెననుటకు ఈ నాణెములే నిదర్శనము. పెద్ద బొంకూరు త్రవ్వకాలలో ఒక కుప్పయందు 168 పంచ్‌మార్క్‌డ్ వెండినాణెములు, మరియొక కుప్ప (Hoard) యందు 30 నాణెములు అటువంటివే లభ్యము కావడము ఈ ప్రాంత వాణిజ్య విశిష్టతను తెలుపుతుంది.[25]

శాతవాహనులు బ్రాహ్మణులగుటచే వైదిక మతమును పోషించారు. మొదటి శాతకర్ణి అనేక యజ్ఞయాగములు చేశాడు. గౌతమీపుత్ర శాతకర్ణి "ద్విజావర కుటుంబ వివర్ధన"యని వర్ణింపబడినాడు[26]. అయినప్పటికిని వీరు పరమత సహనము గలవారై యుండిరి. వీరి రాణులు, వర్తకులు, పాటకజనము బౌద్ధమతస్థులగుటచే శాతవాహనులు బౌద్ధమతమునాదరింపక తప్పలేదు. ఇందుకు ధూళికట్ట, పాషిగాంవ్ స్థూపములే నిదర్శనము. ధూళికట్ట ఆయక ఫలకములపై చెక్కబడిన స్త్రీల చిత్రములు అనేక ఆభరణములు కలిగియుండుట వలన శాతవాహనుల కాలపు ప్రజలు విలాసవంతమైన జీవితము గడిపేవారని తెలియుచున్నది.

శాతవాహనుల కాలములో వ్యవసాయము ముఖ్యవృత్తి. స్వర్ణకార, కమ్మర, వడ్రంగ, కుమ్మరి మున్నగు 17 రకముల వృత్తికారులు వృత్తిసంఘములు లేదా శ్రేణులు (Guilds) ఏర్పరచుకొనిరి. ప్రతిశ్రేణి పెద్దను శ్రేష్ఠియని సంబోధించేవారు. వీరికాలములో ప్రాకృత, సంస్కృత భాషలు పోషింపబడినాయి. హాలుని గాథాసప్తశతి ప్రాకృతమునందే లిఖింపబడింది. ఈ రెండు భాషలు కాకుండా దేశీభాష తెలుగు అమలులో నుండెనని తెలుస్తుంది.[27] శాతవాహనుల కాలములో అంతగా అభివృద్ధి చెందని తెలుగు స్థానిక వ్యవహారభాషగా నుండెనని స్పష్టమౌతుంది. వీరు తమ శాసనములందు నాణెములందు నేటి తెలుగు, కన్నడ భాషలకు మాతృకమైన దేశీభాషను ఉపయోగించినట్లు తెలుస్తుంది. ముఖ్యముగా వీటిలోని దేశీభాష తెలుగు భాషకు సన్నిహితముగా నున్నదని ఆచార్య డి.సి. సర్కార్ మున్నగు చరిత్రకారుల అభిప్రాయము.

కొంతకాలమునకు పశ్చిమ తీరమున గల రేవులు శకులవశమైనవి. తత్ఫలితంగా వర్తకము క్షీణించి శాతవాహనుల అధికారము పతనమొందనారంభించింది. ఆ తరువాత రోమన్ సామ్రాజ్య పునాదులే కదలి దక్కన్‌తో రోమ్ వ్యాపారమంతరించింది. యజ్ఞశ్రీ శాతకర్ణి తదుపరి

వచ్చిన రాజులు బలహీనులగుటచే క్రమముగా శాతవాహన సామ్రాజ్యము క్షీణించి క్రీ.శ. 220 ప్రాంతంలో అంతమైంది.

## ఇక్ష్వాకులు

శాతవాహనుల అనంతరము ఈ ప్రాంతపు చరిత్ర మూడు, నాలుగు శతాబ్దములు అంధకారములో నున్నది. పరిశోధనలు జరుగవలసియున్నది. ఇక్ష్వాకులు కరీంనగర్ జిల్లాను దాని పరిసర ప్రాంతములను పాలించిన ఆధారములు లభించలేదు.

## విష్ణుకుండినులు

ఇక్ష్వాకుల తరువాత ఆంధ్రదేశ చరిత్రలో విష్ణుకుండినులు ప్రధానపాత్ర వహించారు. వీరు మొదట తెలంగాణాలో విస్తరించినారని, కృష్ణా-గోదావరి మధ్యస్థమయిన తీరాంధ్రదేశములో తమ రాజ్యం స్థాపించి, విస్తరించినారని విభిన్నాభిప్రాయములున్నాయి. వీరి రాజధాని వినుకొండ, శ్రీపర్వతం (నాగార్జునకొండ) అమరావతి, వేల్పూర్, ఇంద్రపాలనగరం, కీసరగుట్ట అని అనేక రకములుగా చరిత్రకారులు అభిప్రాయపడుచున్నారు. వీరి రాజధాని ఫలానాయని ఇదమిత్థంగా తేలలేదు. నల్గొండ జిల్లాలోని తుమ్మలగూడెం, మహబూబ్‌నగర్ జిల్లాలోని అమ్రాబాద్, మెదక్ జిల్లాలోని కొండాపూర్ వీరి రాజధానియని వాదనలున్నాయి. నల్గొండ జిల్లాలోని తుమ్మలగూడెం వద్ద లభ్యమైన రెండవ విక్రమేంద్రవర్మకాలము నాటి తామ్రపత్రముల శాసనము వీరి వంశావళిని క్రమబద్ధీకరించుటకు తోడ్పడినది[28].

హైదరాబాద్‌కు 30 కి.మీ. దూరంలో గల కీసరగుట్ట వద్ద జరిపిన త్రవ్వకాలలో లభ్యమైన ఆధారాలను బట్టి ఇదియే విష్ణుకుండినుల రాజధానియని డా.వి.వి.కృష్ణశాస్త్రి ధృవపరచినారు[29]. గోవిందవర్మ తరువాత అధికారములోనికి వచ్చిన రెండవ మాధవవర్మ గొప్ప విజేత. కీసరగుట్టలో బయల్పడిన ఆధారముల మరియు తుమ్మలగూడెం శాసనం వలన ఇతడు పదకొండు అశ్వమేధయాగములు చేసి తన అధికారమును నర్మదానది వరకు విస్తరింపజేసెనని తెలుస్తుంది. గుంటూరు జిల్లాలోని ఇతని వేల్పూరు శాసనము క్రీ.శ. 483లో పల్లవులపై ఇతని విజయములను గూర్చి పేర్కొంటుంది[30].

హైద్రాబాద్‌లోని దిల్‌సుఖ్‌నగర్ ప్రాంతమందు గల చైతన్యపురిలోని కొసగుండ్ల నరసింహస్వామి ఆలయ సమీపమున మూసీనది ఒడ్డున ఒక పెద్ద గుండురౌతుపై చెక్కబడిన గోవిందవర్మ శాసనము కనుగొనబడింది. గోవిందరాజ విహారమును ఆనుకొని ఒక చిన్నగదిని దానముగా ఇచ్చినట్లు ఈ శాసనము తెలుపుతుంది. ఈ శాసనము క్రీ.శ. నాలుగవ, ఐదవ శతాబ్దములందే హైద్రాబాద్ యొక్క ఉనికిని గూర్చి తెలుపుచున్నదని డా.యన్.యస్.రామచంద్రమూర్తి గారు పేర్కొన్నారు. నల్గొండ జిల్లాలోని తుమ్మలగూడెం, హైద్రాబాద్‌కు సమీపమున గల కీసరగుట్ట, దిల్‌సుఖ్‌నగర్‌లోని చైతన్యపురి శాసనం మున్నగు

చారిత్రకాధారములు తెలంగాణము విష్ణు కుండినుల పాలనలో ఉండెనని తెలియజేస్తున్నాయి. కావున కరీంనగర్ జిల్లా గూడా నాలుగవ, ఐదవ శతాబ్దములలో విష్ణు కుండినుల ఏలుబడిలో నుండెనని స్పష్టమగుచున్నది. కరీంనగరమునకు సమీపమున గల తేలికుంటలో వీరి నాణెములు లభ్యమైనవని తెలుపబడినది.

## బాదామి చాళుక్యులు (క్రీ.శ. 543-753)

కర్ణాటకములోని బాదామి (వాతాపి)ని రాజధానిగా చేసికొని సువిశాల సామ్రాజ్యమును స్థాపించిన తొలిపశ్చిమ చాళుక్యులను బాదామి చాళుక్యులంటారు. వీరు క్రీ.శ. 543లో అధికారములోనికి వచ్చి రెండు శతాబ్దములు పాలించారు. రాష్ట్రకూట దంతిదుర్గుడు వీరిని క్రీ.శ. 753లో కూలద్రోసి అధికారమును హస్తగతము చేసికొన్నాడు. బాదామి చాళుక్యులలో సుప్రసిద్ధ పాలకుడైన రెండవ పులకేశి (క్రీ.శ. 610-642) అరేబియా సముద్రము నుండి బంగాళాఖాతము వరకు దక్కన్ ప్రాంతమంతయు జయించి తన సోదరుడైన కుబ్జ విష్ణువర్ధనుని క్రీ.శ. 624లో వేంగియందు రాజప్రతినిధిగా నిలిపాడు. ఇతని వంశీయులే తదనంతరము తూర్పుచాళుక్యులుగా ప్రసిద్ధినొంది వేంగి నుండి పాలించినారు. కరీంనగర్ జిల్లాతో పాటు తెలంగాణ అంతా బాదామి చాళుక్యుల ఏలుబడిలో ఉండేది.

బాదామి చాళుక్యులు చక్కటి దేవాలయముల నిర్మాణము గావించారు. వీరి కళారీతుల ప్రభావము తరువాత కాలములో కరీంనగర్ జిల్లా దేవాలయాల నిర్మాణములో చూడవచ్చు. క్రీ.శ. ఐదవ శతాబ్దపు ఆరంభములో దక్కన్‌లోని అయ్యావోలు లేదా ఐహోలు (Aihole) పట్టణము నందు తొలిదేవాలయముల నిర్మాణమారంభమై మూడు శతాబ్దముల వరకు వర్ధిల్లింది[31]. దక్షిణ భారతదేశములోనే ఇచటి కట్టడములు అతి ప్రాచీనమైనవిగా, తొలిదేవాలయములుగా పరిగణింపబడుచున్నవి. క్రీ.శ. 425-450 కాలమునకు చెందిన ఐహోల్‌లోని లడ్‌ఖాన్ (Ladkhan Temple) దేవాలయమే బాదామి చాళుక్యుల తొలి నిర్మాణముగా భావింపబడుచున్నది[32]. ఐహోల్ పట్టణము తొలి చాళుక్యుల కళారీతులకు పుట్టినిల్లు. ఏడవ శతాబ్దపు ద్వితీయార్థభాగములో బాదామి ప్రాంతము నందు దేవాలయముల నిర్మాణము ముమ్మరంగా సాగి ప్రత్యేక కళారీతులను సంతరించుకొనినదని చెప్పవచ్చు[33]. ఈ వంశపు తొలిరాజులు ఐహోల్, బాదామి, పట్టడకల్ నందు అనేక దేవాలయములు నిర్మించారు. ఇచట ఆవిర్భవించిన తొలి చాళుక్యుల కళారీతులు ఆంధ్రదేశములోని అలంపురము, మహానంది, సత్యవోలు మున్నగు ప్రాంతములకు పయనించి అచటి నిర్మాణములపై ప్రభావము చూపాయి. తదనంతరకాలములో ఈ చాళుక్య కళారీతుల ప్రభావము కరీంనగర్ జిల్లాలోని దేవాలయాల నిర్మాణంలో ప్రస్ఫుటముగా కనిపిస్తుంది.

బాదామి చాళుక్యల కళారీతి (Style) వారి స్వంతము కాదని, వారి రేఖానాగర శిఖరాలు

ఉత్తర భారతశైలిని లేదా దక్షిణ భారత ద్రవిడ పిరమిడ్ శైలిని బోలియున్నవని జేమ్స్‌ఫెర్గుసన్ అభిప్రాయపడినారు[34]. ఈ చాళుక్యుల చాపరేఖాకృతి శిఖరాల (Curvilinear Sikharas) నిర్మాణంలో ఇండో ఆర్యన్ లేదా ఒరిస్సాశైలిని అనుకరించినట్లు ఆయన తెలిపినారు. కాని ఇది సత్యదూరము. చాళుక్యుల మరియు ఒరిస్సా శిఖరములు, వాటిపై నున్న ఆమలకములు మరియు కలశములను బట్టి ఒకే మాదిరిగా అగబడినను వాటి నిర్మాణములో చాలావ్యత్యాసమున్నది. ఒరిస్సాలోని శిఖరములు చాలా ఎత్తైనవిగా నుండి పోనుపోను సన్నగా రూపుదిద్దుకొని ఉత్తర భారతములోని గుప్తరాజుల కాలపు నిర్మాణములను బోలియున్నవి. కాని ఈ తొలిచాళుక్యుల శిఖరములు కొద్దిపాటి రేఖానాగరశైలిలో (Pyramid) పిరమిడ్ రూపములో ఉంటాయి[35]. భువనేశ్వర్‌లోని దేవాలయాలను, అలంపూర్‌లోని నవబ్రహ్మాలయాలను పోల్చి అధ్యయనము చేసినచో వాటి నిర్మాణములలో నున్న వ్యత్యాసము తెలుస్తుంది. ఒరిస్సా శిఖరాలు చాలా ఎత్తుగా పోయిన తరువాత వాటి చివరలో మలుపు, చాపరేఖాకృతిలో వంపురేఖ ఆరంభమౌతుంది. కాని చాళుక్యుల శిఖరములలో ఈ మలుపు లేదా వంపు శిఖరము యొక్క అడుగుభాగము నుండే ప్రారంభమౌతుంది. (The Curvature of the early chalukyan Sikharas Starts at their base, where as it begins only at the top in the elongated narrow sikharas of the orissan tradition). అంతే కాకుండా ఒరిస్సా దేవాలయాలు చాళుక్య దేవాలయాలకు తరువాత కాలానికి చెందినవి. కనుక ఈ శైలిని ఒరిస్సాలో కొంత ప్రాంతీయ శైలికి లోబడి అనుసరించారని భావించడం యుక్తం. బాదామిచాళుక్యులు అటు ఉత్తర శైలిని గాని, ఇటు దక్షిణశైలిని గాని అనుకరించలేదు. వారిలోని ప్రత్యేకమైన సృజనాత్మకమైన శక్తి ఒక నూతన చాళుక్యశైలికి జీవము పోసినది. వారి నుండి ఆవిర్భవించిన కళారీతులు తొలిచాళుక్యుల కళాశైలి పేరుతో అభివృద్ధినొంది తరువాత పాలించిన రాజవంశములకు మార్గదర్శకమైంది[36].

కరీంనగర్ జిల్లాను విభిన్నచాళుక్య రాజవంశములు అనగా బాదామి చాళుక్యులు, వేములవాడ చాళుక్యులు, కళ్యాణి చాళుక్యులు వరుసగా ఏడవ శతాబ్దము నుండి పన్నెండవ శతాబ్దపు ప్రథమార్థభాగము వరకు పాలించుట వలన చాళుక్యుల కళారీతి, వారి నిర్మాణకౌశలము యొక్క ప్రభావము ఈ ప్రాంతపు దేవాలయముల నిర్మాణంలో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. కరీంనగర్ జిల్లాలోని వాల్గొండ, రాయికల్, ధర్మపురి మున్నగు చోట్ల గల దేవాలయాల శిఖరాలు చాపరేఖాకృతిని కలిగి చాళుక్యుల కళారీతికి అతి సన్నిహితంగా ఉండి, ఒరిస్సా కళారీతికి చాలా దూరముగా ఉన్నాయి. అంతే గాకుండా ఈ ప్రాంతపు శిఖరముల ముందు భాగములో శుకనాసములు అంతరాళములపైన నిర్మింపబడినవి. ఇవి చాళుక్యుల కళారీతికి చిహ్నాలు. తొలిచాళుక్యుల కళారీతిలో ఇట్టి శుకనాసముల నిర్మాణము 7-8 శతాబ్దాలకు చెందిన మహబూబ్‌నగర్ జిల్లాలోని అలంపురపు ఆలయాల శిఖరముల ముందు కనబడుతుంది.

కరీంనగర్ జిల్లాలో అనేక గణేశ విగ్రహాలు సహజమైన ఏనుగుతలను బోలి కిరీటములు లేకుండా, రెండు చేతులతో చెక్కబడ్డాయి. ఇలాంటి విగ్రహములు వేములవాడ, ధర్మపురి, పొట్లపల్లి, నగునూరు, జగిత్యాలలోని గాంధినగర్, నూకపెల్లి మున్నగుచోట్ల ఉన్నాయి. ఈ విగ్రహములన్నియు బాదామి చాళుక్యుల కాలమునకు అనగా 7–8 శతాబ్దాలకు చెందినవని చెప్పవచ్చు. ఎందుకంటే ఈ విగ్రహాలన్నీ బాదామి సమీపమున గల మహాకూట్ దేవాలయ పుష్కరిణి వద్ద గల క్రీ.శ. 600 కి చెందిన గణేశ విగ్రహాన్ని బోలిఉన్నాయి[37].

# వేములవాడ చాళుక్యులు

తెలంగాణమున సపాదలక్ష ప్రాంతాన్ని పాలించిన రాజవంశీయులు వేములవాడ చాళుక్యులు. నేటి నిజామాబాద్ జిల్లా మరియు కరీంనగర్ జిల్లా ప్రాంతములే ఆనాటి సపాదలక్షదేశము[38]. దీనిలో అస్మంత, సబ్బినాడులు అంతర్భాగాలు. సపాదలక్షభూమి అనగా లక్షపాతికవేల సువర్ణముల ఆదాయము వచ్చు భూమి అని అర్థము. లక్షాపాతికవేల గ్రామములుండెననుటకు వీలులేదు. ఎందుకనగా నేటికిని నిజామాబాద్, కరీంనగర్ జిల్లాలలోని గ్రామముల సంఖ్య కేవలం రెండువేలు. ఆకాలమున భారతదేశమున నేపాల్, కేదారము, కన్నోజ్, కాశ్మీరము, కళింగము మున్నగు ప్రాంతములు సపాదలక్ష దేశములుగా పిలువబడినవి. పోతన లేదా బోధన్ నగరము రాజధానిగా గల అశ్మకరాష్ట్రము ఆనాడు సపాదలక్ష భూమిగా వ్యవహరింపబడింది.

వేములవాడ చాళుక్యులు మొదట బోధన్‌ను తరువాత వేములవాడను రాజధానిగా చేసికొని క్రీ.శ. 750 నుండి రెండు శతాబ్దములకు పైగా రాష్ట్రకూట వంశీయులకు సమకాలీనులై వారి సామంతులుగా పాలించారు. రాష్ట్రకూటుల పాలన క్రీ.శ. 973లో అంతమొందగానే వారితో పాటు వేములవాడ చాళుక్యులు గూడా తమ అధికారాన్ని కోల్పోయారు. రాష్ట్రకూట రాజ్యావిర్భావముతో వీరి అభ్యుదయ పరంపర ప్రారంభమై కళ్యాణి చాళుక్యుల రాజ్యస్థాపనతో అంతమైంది. వేములవాడ చాళుక్యులు సుమారు 225 సంవత్సరములు అవిచ్ఛిన్నముగా సపాదలక్ష భూభాగమునేలుట వలన ఈ వంశీయుల చరిత్ర ఆంధ్రదేశ చరిత్రలో ప్రముఖస్థానము నాక్రమించింది. వేములవాడను లేంబులవాడ అనేవారు. శాసనాల్లో లేంబులవాటక, లేంబులవాడె, లేంబులవాడ అని పేర్కొనబడింది. గత శతాబ్దము వరకు కవుల రచనలలో లేమలవాడ అనియే పేర్కొనబడింది. జగిత్యాల ఆదికవి, భక్తకవి జైశెట్టి రాజయ్య (క్రీ.శ. 1842–1921) "లేమలవాడ రాజరాజేశ్వర శతకము"ను రచించినాడు[39]. ఇటీవలి ఉచ్చారణలో క్రమంగా ఇది లేములవాడ నుండి ఏములవాడ, ఏండాల, వేములవాడగా మారింది[40]. రాష్ట్రకూట రాజ్యమాపదలో నున్న సమయంలో వేములవాడ చాళుక్యుల ప్రతిభావిశేషములచే ఆ రాజ్యము ఆపదల నుండి ఉద్ధరింపబడింది. రాష్ట్రకూటరాజన్యులు చేసిన అనేక యుద్ధాల్లో ఈ రాజన్యులు పాల్గొని విజయం

సాధించినారు. గొప్ప బలవంతులగుట వలన రాష్ట్రకూట చక్రవర్తులు వేములవాడ చాళుక్యరాజులతో సంబంధ బాంధవ్యము లేర్పరచుకొన్నారు. వైవాహిక బంధము వలన ఈ రెండు రాజవంశములు అన్యోన్యముగ నుండి ఆనాటి దక్షిణాపథ రాజకీయములందు ప్రధానపాత్ర వహించాయి.

వేములవాడ చాళుక్యులు జైన, శైవ మతములనాదరించి అనేక దేవాలయములు నిర్మించారు. అవి చెక్కుచెదరకుండా నేటికిని కరీంనగర్ జిల్లాలో భద్రముగా నిలిచియున్న మొట్టమొదటి దేవాలయములు. వీరు జైన తీర్థంకరులను, శైవాచార్యులను గౌరవించి పోషించారు. వీరు జైన బసదులకు, మఠములకు, శివాలయములకు, జినాలయములకు, కవులకు, పండితులకు, వేదవిదులైన విప్రులకు అగ్రహారములను, భూములను దానము చేసి తమకీర్తి శాశ్వతముగా వెలుగొందునట్లు చేసికొన్నారు. వీరి కాలపు జినాలయములు, జైన బసదులు, వేములవాడ, శనిగరము, నగునూరు, రేపాక, కోరుట్ల, గంగాధర సమీపమున గల బొమ్మలగుట్ట మున్నగు చోట్ల చూడవచ్చు.

వేములవాడ చాళుక్యుల కాలం కన్నడభాషకు స్వర్ణయుగం. ఈ వంశమున గొప్ప వీరుడును, అరివీర భయంకరుడును, యుద్ధవిద్యావిశారదుడునగు రెండవ అరికేసరి పంపమహాకవిని ఆదరించి, గౌరవించి, ధర్మపురి అగ్రహారాన్ని ఇచ్చాడు. పంపకవి విక్రమార్జున విజయమను మహాకావ్యమును, ఆది పురాణమును రచించాడు. వీరి కాలముననే గంగాధర ఉపరాజధానిగా పాలించిన వాగరాజువద్ద ఆశ్రయము పొంది సోమదేవసూరి యశస్తిలక చంపువు అను సంస్కృత గ్రంథము రచించాడు. ఈ రచనలు ఆనాటి చరిత్రకు అద్దము పడతాయి.

వేములవాడ చాళుక్యులకు సంబంధించిన రెండు తామ్రశాసనములున్నాయి. ఒకటి మొదటి అరికేసరి కొల్లిపరతామ్రశాసనం[41]. రెండవది మూడవ అరికేసరి క్రీ.శ. 966 పర్భణితామ్ర శాసనం[42]. ఇవి గాకుండా రెండవ అరికేసరికాలపు వేములవాడ శాసనం, క్రీ.శ. 946 కరీంనగర్ శాసనం, కురిక్యాల జినవల్లభుని శాసనం, క్రీ.శ. 940 చెన్నూరు శాసనం, మూడవ అరికేసరి క్రీ.శ. 968 రేపాకశాసనం, కురువగట్టు శాసనం, రెండవ బద్దెగుని వేములవాడ శాసనం మున్నగునవి వేములవాడ చాళుక్యుల చరిత్ర నిర్మాణానికి ఉపయోగపడతాయి.

వేములవాడ చాళుక్యుల మొట్టమొదటి శాసనము కొల్లి పరతామ్రశాసనం. మొదటి అరికేసరి రామడుగు విషయములోని బెల్మొగ గ్రామమును ముగ్ధశివాచార్యునకు విద్యాదాన నిమిత్తం దానం చేశాడు. ముగ్ధశివాచార్యుడు సద్యశ్శివాచార్యుని శిష్యుడు. కొల్లిపరతామ్రశాసన కల్యబ్దము 1421 అనగా క్రీ.శ. 1019కి సమానము. ఈ శాసనకాలము ఎనిమిదవశతాబ్దపు చివరి పాదానికి చెందిన మొదటి అరికేసరి పాలనాకాలముతో సరిపడుటలేదు. రెండవ అరికేసరి కాలపు చెన్నూరు ఆగస్త్యేశ్వరాలయ శాసనము క్రీ.శ. 940 నాటిది[43]. కావున కొల్లిపర

తామ్రశాసనము అంతకు చాలాకాలము పూర్వమే ఇవ్వబడింది. నల్గొండ జిల్లాలోని నిడుమానూరుకు సమీపమందొక రామడుగు గ్రామము ఉన్నది[44]. ఈ రామడుగు విషయములోని బెల్మొగ ఊరును మొదటి అరికేసరి దానముగా నొసంగెను. కరీంనగర్ జిల్లాలోని గంగాధర సమీపమున గూడా రామడుగు అను ఒక గ్రామముంది. కాని దాని పరిసరాల్లో గాని, ఈ జిల్లాలో గాని బెల్మొగ గ్రామనామము లేదు.

కొల్లిపరతామ్ర శాసన తేదీని, కాలాన్ని విశ్వసింపక పోయినా అందలి కొన్ని అంశాలను విస్మరింపరాదని చరిత్రకారుడైన కొల్లూరు సూర్యనారాయణ అభిప్రాయపడినారు. ఈ తామ్రశాసనం వేములవాడ చాళుక్యుల వంశంలో ఒకరి తరువాత నొకరు పాలించిన ఆరుగురు రాజుల పేర్లు గల వంశావళిని సూచించుచున్నది[45]. సత్యాశ్రయ రణవిక్రముడు, పృథ్వీపతి, మహారాజు, రాజాదిత్యపృథు విక్రముడు, వినయాదిత్యయుద్ధమల్లుడు మరియు మొదటి అరికేసరియను ఆరు తరముల పాలకుల పేర్లు ఈ శాసనములో ఉన్నాయి. ఈ వంశస్థాపకుడు సత్యాశ్రయరణ విక్రముడు అని భావింపబడుతుంది. ఇది మొదటి అరికేసరికాలపు శాసనము గనుక అతని పేరు వరకు వంశావళి పేర్కొనబడింది.

క్రీ.శ. 750లో వినయాదిత్య యుద్ధమల్లుడు అధికారములోనికి రాక పూర్వమే ఈ వంశము నందు నలుగురు తొలిరాజులు ఒకరి తరువాతనొకరు పాలించిరని బి.యన్.శాస్త్రి తెలిపినారు[46]. సత్యాశ్రయబిరుదు గల ఈ వంశపురణవిక్రముడు, సత్యాశ్రయ బిరుదాంకితుడైన మొదటిపులకేశి ఒక్కరుకాదని, వీరు వేర్వేరు కాలములకు చెందినవారని తెలుపబడింది. బాదామిచాళుక్య సుప్రసిద్ధ చక్రవర్తి రెండవ పులకేశి (క్రీ.శ. 610-642) ఈ వంశపు రణవిక్రముని ప్రతాపాతిశయములను గమనించి అతనికి సపాదలక్ష దేశపాలనా బాధ్యతను బోధన్ కేంద్రముగా అప్పగించియుండును. రెండవపులకేశి తరువాత పాలించిన మొదటి విక్రమాదిత్యునకు రణవిక్రముడు, అతని తనయుడు పృథ్వీపతి అనేక యుద్ధములందు తోడ్పడినారు. మూడవ పాలకుడైన మహారాజు బాదామి చక్రవర్తులైన వినయాదిత్యునకు, విజయాదిత్యునకు పల్లవులతో సంభవించిన యుద్ధములందు సహాయ పడినారు. నాలుగవ రాజైన రాజాదిత్య పృథు విక్రముడు తన సార్వభౌములైన విజయాదిత్యునకు, రెండవ విక్రమాదిత్యునకు తోడ్పడి అరబ్బుల దండ యాత్రలు త్రిప్పికొట్టుటలో సహకరించాడు. వేములవాడ చాళుక్య వంశంలో తొలి నలుగురు పాలకుల చరిత్రను బి.యన్.శాస్త్రి తన రచనలో వెలుగులోనికి తెచ్చినారు[47]. రాష్ట్రకూట, చాళుక్య రాజ వంశీయులకు సంబంధించిన శాసనములందు వేములవాడ చాళుక్యుల సమాచారమున్నదనియు, ఈ వంశీయులు వేయించిన శాసనములు, అన్యరాజవంశీయుల శాసనముల ఆధారంగా బి.యన్.శాస్త్రి వేములవాడ చాళుక్య వంశపు తొలి నలుగురు రాజుల కాలనిర్ణయమును ఈ క్రింది విధముగా సూచించారు[48].

సత్యాశ్రయ రణవిక్రముడు (క్రీ.శ. 641-660)

పృథ్వీపతి (క్రీ.శ. 660-695)

మహారాజు (క్రీ.శ. 695-725)

రాజాదిత్యపృథువిక్రముడు (క్రీ.శ. 725-750)

బి.యన్.శాస్త్రి ఇదమిత్థమైన ఆధారములు చూపలేదు గనుక పై సమాచారమును కాలనిర్ణయమును ఊహా జనితంగా అందించినట్లు అతనిరచనలోని భాషను బట్టి గమనింపవచ్చు. ఇంత వరకు వేరే చరిత్రకారులెవరు ఈ తొలి నలుగురు రాజుల పరిపాలనా వివరములు తెలుపలేదు.

కరీంనగర్ జిల్లా నిజమైన చరిత్ర వేములవాడ చాళుక్యుల తోడనే ఆరంభమైంది. రెండవ అరికేసరి కాలపు శాసనాలు, మూడవ అరికేసరి క్రీ.శ. 966 పర్భిణి తామ్రశాసనం మరియు పంప మహాకవి విరచిత విక్రమార్జున విజయము మున్నగు ఆధారాలను బట్టి ప్రముఖ చరిత్రకారులైన నేలటూరి వెంకటరమణయ్య వేములవాడ చాళుక్యుల వంశావళిని ఈ క్రింది విధముగా రూపొందించినారు[49].

**వేములవాడ చాళుక్యుల వంశావళి**



## వినయాదిత్య యుద్ధమల్లుడు (క్రీ.శ. 750-775)

రాజాదిత్య పృథువిక్రముని తనయుడు వినయాదిత్య యుద్ధమల్లుడు తండ్రి యనంతరము క్రీ.శ. 750లో చాళుక్య సామంత రాజ్య సింహాసనమును బోధన్ నగరమున అధిష్ఠించాడు. రాష్ట్రకూట దంతిదుర్గుని సామంతునిగా, సేనానిగా వినయాదిత్య యుద్ధమల్లుడు అతడొనర్చిన యుద్ధములందు పాల్గొని విజయములు సాధించుటలో తోడ్పడినాడు. బాదామి చాళుక్య రాజ్యమును కూల ద్రోయుటలో, రాష్ట్రకూట రాజ్యస్థాపనలోను సామంతుడగు వినయాదిత్య యుద్ధమల్లుడు సహకరించాడు. క్రీ.శ. 755లో బాదామి చాళుక్య చివరి ప్రభువగు రెండవ కీర్తివర్మ పాలననంత మొందించుటలో దంతిదుర్గునికి సహాయపడుట వలన అతడితనికి మహా సామంత పదవితోపాటు సపాదలక్ష భూమిని బోధన్ నగరము రాజధానిగా వేములవాడ రాజ్యాన్నిచ్చాడు.

వినయాదిత్య యుద్ధమల్లునికి అధికముగా గజసైన్యముండెనని పంపకవి రచించిన విక్రమార్జున విజయము వలన తెలియుచున్నది. సపాదలక్ష దేశమును పాలించుచు బోధన్ నగరమున నూనెతో నింపిన వాపీకూపములందు ఏనుగులను స్నానమాడించి దుర్భేద్యమైన చిత్రకూట పర్వత దుర్గమును వినయాదిత్య యుద్ధమల్లుడు జయించినట్లు తెలియుచున్నది[50].

వినయాదిత్యయుద్ధమల్లుడు తురుష్క, యవన, కాంభోజ, కాశ్మీర, నేపాళ, మాళవ, మగధ, కళింగాది దేశములను జయించినట్లు కొల్లిపర తామ్రశాసనమందుంది. ఈ విజయపరంపరలన్నియు అతిశయోక్తులనిపిస్తాయి. నమ్మశక్యము కాదు. ఎందుకంటే రాష్ట్రకూట దంతిదుర్గుడసాధారణ బలసంపన్నుడు. ఇతడు పొందిన విజయములన్నింటిలో వినయాదిత్యయుద్ధమల్లుడు అండగా నిలిచాడు. ఈ విజయములనే వినయాదిత్య యుద్ధమల్లుడు పొందినట్లు అతని తనయుడు మొదటి అరికేసరి తన కొల్లిపర తామ్రశాసనమందు తెలిపాడు. తన తండ్రిని గొప్పగా కీర్తించుటకే అరికేసరి అట్లు శాసనమందు చెక్కించి ఉండవచ్చు.

## మొదటి అరికేసరి (క్రీ.శ. 775-800)

వినయాదిత్యయుద్ధమల్లునికి అరికేసరి, బీరగృహుడు అని ఇరువురు కుమారులు. తండ్రి మరణానంతరము జ్యేష్ఠ కుమారుడు మొదట అరికేసరి క్రీ.శ. 775లో సింహాసనానికి వచ్చాడు. రాష్ట్ర కూట ప్రభువు మొదటి కృష్ణుడు గతించగానే ఆయన కుమారులిరువురు రెండవగోవిందుడు మరియు ధృవుడు సింహాసనమునకై పోరాడారు. రెండవగోవిందుడు వేంగీచాళుక్య రాజగు నాల్గవ విష్ణువర్ధనుని సహాయమున రాష్ట్రకూట సింహాసనము నధిష్ఠించి క్రీ.శ. 780 వరకు పాలించాడు. కాని ధృవుడు తన అన్నను రాజభ్రష్టుని గావించి నిరుపమ బిరుదము వహించి అధికారములోనికి వచ్చాడు. తన అన్న రెండవ గోవిందునికి వేంగిచాళుక్య ప్రభువు నాల్గవ విష్ణువర్ధనుడు సహాయపడినాడను కోపమున నతనిని శిక్షించుటకై ధృవుడు

వేములవాడ చాళుక్య మొదటి అరికేసరికి సైన్యమునిచ్చి పంపాడు. ఆ యుద్ధమున మొదటి అరికేసరి వీరవిహార మొనర్చి వేంగి సైన్యమును చెల్లాచెదరు చేసి విష్ణువర్ధనునోడించి వేంగి, త్రికళింగ ప్రాంతములు జయించాడు. తూర్పుచాళుక్య వేంగీ వల్లభుడు రాష్ట్రకూటులతో సంధి చేసికొని తన కుమార్తె శీలమహాదేవిని నిరుపమ ధృవునికిచ్చి వివాహం చేశాడు.

మొదటి అరికేసరి వేంగిదేశ విజయమును గూర్చి రెండవ అరికేసరి వేములవాడ శాసనము మరియు పంపని విక్రమార్జున విజయము తెలియజేస్తున్నాయి. రాష్ట్రకూట నిరుపమ ధృవుడు (క్రీ.శ. 780-793) ఇతని విజయమునకు సంతసించి మహబూబ్‌నగరము జిల్లాలోని నాగరకందనోలు, జడ్చర్ల మొదలు నల్గొండ మండల మందున్న రామడుగు విషయము వరకు గల భూభాగమును కానుకగా ఇచ్చాడు. మొదటి అరికేసరి పావన కృష్ణానదీ తీరమందున్న ఏలేశ్వర మహాక్షేత్రమును దర్శించి అచటనున్న కాలాముఖ శైవాచార్యుడగు సద్యశ్శివాచార్యుని ఛాత్రుడగు ముగ్ధశివాచార్యునికి రామడుగు విషయములోని బెల్మొగ గ్రామమును విద్యాదానముగా నొసంగుచు కొల్లిపరతామ్ర శాసనము వేయించాడు. మొదటి అరికేసరి సోదరుడు బీరగృహుడు మరియు రాష్ట్రకూట కలివల్లభ బిరుదాంకితుడైన నిరుపమ ధృవుని తనయుడగు మూడో గోవిందుడు మంచి మిత్రులు. వీరిరువురు కలిసి అనేక విజయములు సాధించారు. బీరగృహుని వీరకృత్యములు మహబూబ్‌నగరము జిల్లాలోని నాగరకందనోలు తాలూకా యందు గల కురవగట్టు శిథిలాలయ శిలాఫలకముపై గల శాసనంలో చూడవచ్చు[51].

మొదటి అరికేసరి వ్యాకరణము, తర్కము, గజతంత్రవిద్య, ధనుర్విద్య, ఆయుర్వేద విద్యలను అభ్యసించినాడని, ఇతనికి సమస్తలోకాశ్రయ, త్రిభువనమల్ల, రాజత్రినేత్ర, సాహసరామాది బిరుదములున్నట్లు , ఇతనికాలము నందే బోధన్ నుండి రాజధాని వేములవాడకు మార్చబడినట్లు తెలుస్తుంది[52]. ఎందుకనగా వీరిరాజ్యము బోధన్ నుండి గోదావరినానుకొని దాని ఉత్తర తీరమందున్న ఆదిలాబాద్ జిల్లాలోని చెన్నూరు వరకు వ్యాపించింది. పరిపాలనా సౌలభ్యమునకు రాజధాని రాజ్యము మధ్య ప్రాంతమందుండుట శ్రేయస్కరమని భావించి మొదటి అరికేసరి మూలవాగు ఒడ్డున నున్న వేములవాడకు మార్చి ఉండవచ్చు.

## మొదటి నరసింహుడు (క్రీ.శ. 800-825)

మొదటి అరికేసరికి ఇద్దరు కుమారులు. అందు జ్యేష్ఠుడు మొదటి నరసింహుడు. రెండవవాడు భద్రదేవుడు. తండ్రి మరణానంతరము మొదటి నరసింహుడు సింహాసనమునధిష్ఠించాడు. తండ్రివలె ఇతడు సమర్థుడు కాదు. రాష్ట్రకూట మూడో గోవిందునికి సామంతుడుగా నుండి అతని వేంగీ దండయాత్రలందు పాల్గొనిపోరాడాడు.

## రెండవ యుద్ధమల్లుడు (క్రీ.శ. 825-850)

మొదటి నరసింహుని తరువాత అతని కొడుకు రెండవ యుద్ధమల్లుడు వేములవాడ

చాళుక్య రాజ్యపాలనాబాధ్యతను స్వీకరించాడు. రాష్ట్రకూట ప్రభువగు అమోఘవర్షుడు వేంగీ చాళుక్యులతో చేసిన యుద్ధములందు రెండవ యుద్ధమల్లుడు పాల్గొని పోరాడాడు.

## సోలదగండ బద్దెగుడు (క్రీ.శ. 850-895)

రెండవ యుద్ధమల్లుని తనయుడు బద్దెగ భూపాలుడు తండ్రి యనంతరము వేములవాడ రాజ్యపీఠమును ఎక్కాడు. ఇతనికి 'సోలదగండ' బిరుదుంది. సోలదగండ పదమునకపజయమెరుగని యుద్ధవీరుడని (Unvanquished hero) యర్థము. ఇతడు 42 యుద్ధములందు విజయముగాంచెను[53]. కాని వేంగీచాళుక్య చక్రవర్తియగు గుణగవిజయాదిత్యుడు (క్రీ.శ. 849-892) రాష్ట్రకూట ప్రభువగు రెండవ కృష్ణుని పై జరిపిన భీకరయుద్ధములో వేములవాడ బద్దెగుడు రాష్ట్రకూట ప్రభువు పక్షాన పోరాడి ఘోరపరాజయమును చవిచూచాడు[54]. వేములవాడ బద్దెగుడుగాని, రాష్ట్రకూట రెండవ కృష్ణుడుగాని ఈ ఓటమిని మరువలేదు. వారిలో వేంగీ చాళుక్యులపై ప్రతీకార వాంఛ పెరిగింది.

వేంగీ ప్రభువగు గుణగ విజయాదిత్యుడు క్రీ.శ. 892లో గతించెను. ఇతని తమ్ముని కుమారుడైన చాళుక్యభీముడు వేంగీ సింహాసనమునధిష్ఠించాడు. కాని భీముని దాయాదులతనిని వ్యతిరేకించి రాష్ట్రకూట రెండవ కృష్ణభూపతి నాశ్రయించారు. వేంగీ చాళుక్యుల పై ప్రతీకారము తీర్చుకొనుటకనువైన సమయమాసన్నమైనదని భావించి కృష్ణభూపతి వేంగీపై దండెత్తాడు. ఈ యుద్ధమందు రెండవ కృష్ణుని పక్షాన వేములవాడ చాళుక్యబద్దెగ భూపాలుడు పోరాడాడు. బద్దెగుడు సారథ్యము వహించిన రాష్ట్రకూట సైన్యము వేంగీ పైకి బయలుదేరుటను విని చాళుక్య భీముడు కొల్లేరు సరస్సులోని అభేద్యమైన జలదుర్గమున తలదాచుకొన్నాడు. కాని పాండవ భీమునివలె బలపరాక్రమోపేతుడైన చాళుక్యభీముని వేములవాడ బద్దెగుడవలీలగా బంధించాడు. భయంకరమైనమొసలిని దాని జలమునందే బంధించినట్లు బద్దెగ భూపాలుడు చాళుక్యభీముని బంధించెనని విక్రమార్జున విజయము, మూడవ అరికేసరి పర్భణీ తామ్రశాసనము తెలుపుతుంది[55].

## మూడవ యుద్ధమల్లుడు (క్రీ.శ. 895-915)

బద్దెగుని కుమారుడు మూడవ యుద్ధమల్లుడు క్రీ.శ. 895లో వేములవాడ రాజ్యపాలనాబాధ్యత వహించాడు. ఇతడు తన ప్రభువు రాష్ట్రకూట రెండవ కృష్ణునితో కలిసి లాట, కనోజ్ ప్రభువులనోడించుటలో తోడ్పడినాడు.

## రెండవ నరసింహుడు (క్రీ.శ. 915-930)

మూడవ యుద్ధమల్లుని తనయుడు రెండవ నరసింహుడు తండ్రి మరణానంతరము రాజ్యాధికారానికి వచ్చాడు. ఇతడు తండ్రివలెగాక గొప్ప పరాక్రమవంతుడు. రాజకీయ చతురుడు. యుద్ధవిద్యలందసమాన నేర్పరితనమున్నవాడు. రెండవ నరసింహుడు రాష్ట్రకూట మూడవ

ఇంద్రవల్లభుని మహాసామంతాధిపతిగా వేములవాడ నేలుచు అనేక యుద్ధములందు పాల్గొని విజయము సాధించాడు. రాష్ట్రకూట ఇంద్రవల్లభుడితని ధైర్యసాహసములను, యుద్ధతంత్రజ్ఞతను, విజయపరంపరలను గాంచి తన సోదరి జకవ్వె (జకవ్వ) నిచ్చి వివాహం చేశాడు. ఈ వైవాహిక బంధము వలన రాష్ట్రకూట చక్రవర్తులు, వేములవాడ చాళుక్యులత్యంత సన్నిహితులగుటకు అవకాశమేర్పడినది. రెండవ నరసింహుని కీర్తి ప్రతిష్ఠలినుమడించాయి. రెండవ నరసింహుడు అసాధారణ ప్రజ్ఞావంతుడగుట వలన రాష్ట్రకూట సామ్రాజ్యమున ప్రబలశక్తివంతునిగను, చక్రవర్తి బంధుకోటిలోని వానిగను, సర్వే సర్వత్ర గౌరవాదరములు పొందాడు.

ఇంద్రవల్లభుడు ఘూర్జర ప్రతీహార వంశీయుల రాజధానియగు మహోదయముపై దండెత్తాడు. మహోదయము గంగాతీరమందున్న కనోజినగరం. పంపభారతమున వర్ణించినట్లు నరసింహుడు జయించిన మహీపాలుడు ప్రతీహార వంశీయుడగు మహీపాలుడే. రాష్ట్రకూట మూడవ ఇంద్రవల్లభుని పక్షమున రెండవ నరసింహుడీ దండయాత్రలు నిర్వహించాడు. ఈ సందర్భములో రెండవ నరసింహుడు సప్తమాళవములను, లాటప్రాంతముల జయించి ఆ రాజుల నుండి కప్పము వసూలు చేసి ఉండవచ్చు. రెండవ నరసింహుడు కాళప్రియమున జయస్తంభమును వేయించినట్లు వేములవాడ శాసనము తెలియజేస్తుంది. కాళప్రియము యమునానదీ తీరమందున్న కాల్పి. ఇచట కాళప్రియదేవాలయమున్నది. గంగానది పర్యంతము దండయాత్ర నిర్వహించి విజయములు సాధించి తన తురగములను గంగానదిలో స్నానమాడించినట్లు విక్రమార్జున విజయము పేర్కొంటుంది[56]. రాష్ట్రకూట మూడవ ఇంద్రునికాలములో జైనచౌముఖములు, చౌవ్వీసాలు చెక్కబడినవి. ఈ రెండవ నరసింహుని కాలమునకు చెందిన రెండు జైన చౌముఖములు భీమేశ్వరాలయ ప్రాంగణంలో ఉన్నాయి[57].

## రెండవ అరికేసరి (క్రీ.శ. 930-955)

రెండవ నరసింహుని యనంతరమాతని తనయుడు రెండవ అరికేసరి క్రీ.శ. 930లో వేములవాడ చాళుక్య సింహాసనాన్ని అధిష్ఠించాడు. ఈ వంశమునందితడు గొప్పరాజుగా కీర్తింపబడినాడు. పరాక్రమవంతుడును, యోధుడును, రాజనీతి పరుడును, విద్యావిశారదుడును, కవిపండిత పోషకుడునగు రెండవ అరికేసరి రాష్ట్రకూట మూడవ ఇంద్రవల్లభుని మేనల్లుడు. రెండవ అరికేసరి బాల్యమున మేనమామయగు మూడవ ఇంద్రవర్మ చెంత నుండి విద్యాబుద్ధులు నేర్చి పరిపాలనా వ్యవహారములందును, యుద్ధవిద్యల యందును నిష్ణాతుడయ్యెను. ఇతనికి రాష్ట్రకూట రాజ్య వ్యవహారములన్నియు తెలుసు.

రాష్ట్రకూట మూడవ ఇంద్రవల్లభుడు తన కుమార్తెయగు రేవకనిర్మాడిని రెండవ అరికేసరికిచ్చి వివాహము చేశాడు. అరికేసరి రెండవభార్య రాష్ట్రకూట వంశ సంజాతయగు లోకాంబిక.

రెండవ అరికేసరికి సంబంధించిన మూడు శాసనములు, క్రీ.శ. 946 కరీంనగరము మ్యూజియంలోని శాసనము, తేదీలేని వేములవాడ రాజరాజేశ్వరదేవాలయ ప్రాంగణములోని శాసనము, కురిక్యాల జినవల్లభుని శాసనము కరీంనగర్ జిల్లాలో ఉన్నాయి[58]. నాలుగవ శాసనము క్రీ.శ. 940 ఆదిలాబాద్ జిల్లాలోని చెన్నూరు ఆగస్త్యేశ్వరాలయంలో ఉంది[59]. ఈ శాసనాలతో పాటు పంప మహాకవి రచించిన విక్రమార్జున విజయము రెండవ అరికేసరి విజయములను, ప్రశంసలను తెలుపుతుంది.

రెండవ అరికేసరి క్రీ.శ. 946 శాసనము కరీంనగర్ మ్యూజియంలో భద్రపరుచబడింది. శకసంవత్సరము 869 పరాభవ కార్తీక బహుళ ఏకాదశి సోమవారమునాడు, కౌశిక గోత్రోద్భవుడును, నూతులపాడు గ్రామనివాసియు, విష్ణుభట్టుని పౌత్రుడును, అప్పనయ్య పుత్రుడును నగు ధారపయ్య అను విప్రునకు అరిపనపల్లి గ్రామమున యాభై మర్తుర్ల నీరు నేలను దానమిచ్చు సందర్భమున రెండవ అరికేసరి ఈ శాసనమును కన్నడ భాషలో వేయించాడు. అనగా అరికేసరి 17వ విజయరాజ్య సంవత్సరమున వేయించినట్టిది. అప్పటికే పంప మహాకవి విక్రమార్జున విజయమును పూర్తి చేసి యుండుట వలన ఆ కావ్యమందలి ఐదు పద్యములీ శాసనమున స్థానమాక్రమించినవి. రెండవ అరికేసరికి పంబరాంకుశ, అమ్మన గంధవారణ, ఆరూఢ సర్వజ్ఞ, ఉదాత్త నారాయణ, గుణనిధి, గుణార్ణవ, త్రిభువనమల్ల మొదలైన బిరుదులు కలవని తెలియుచున్నది. శాసనాంతమున 'స్వదత్తం పరదత్తంవా' అనుశ్లోకము తరువాత కన్నడ వచనమున శాసనము రక్షింపనివారికి కలుగు పాపఫలము తెలుపబడింది.

రెండవ అరికేసరి ఆస్థానమున గుణాంకుశుడు మహాసంధి విగ్రహిగా (Minister of war and peace) మరియు పెద్దనార్యుడు తంత్రపాలునిగా (Minister of army) నుండిరి[60]. తంత్రపాలుడైన పెద్దన వేములవాడలో నొక ఆదిత్యాలయాన్ని నిర్మించాడు. ఈ ఆలయమును చూచుటకై వచ్చిన రెండవ అరికేసరి పెద్దన కోరికపై వేములవాడ రాజధానికి ఈశాన్యమునందు శత (100) నివర్తనముల విస్తారమైన భూమిని, ఎనిమిది నివర్తనముల నీరు నేలను అతిథి అభ్యాగతుల నివాసమునకై నిర్మించిన సత్రమును నిర్వహించుటకై ఉత్తరాయణ పుణ్యకాలమందు సంక్రాంతి రోజున దానమొసంగిన సందర్భములో వేములవాడ శిలాశాసనమును సంస్కృత భాషలో వేయించాడు[61]. ఇప్పుడీ శిలాశాసనము రాజరాజేశ్వర దేవాలయ ప్రాంగణమున వాయువ్య మూలయందు కోనేరుకు పోవు ద్వార సమీపానుంది. తంత్రపాలుడగు పెద్దనార్యుడు నాగమార్యుని తనయుడు. రాజరాజేశ్వర, ఆదిత్య, బద్దెగేశ్వర, నగరేశ్వర ఆలయముల స్థానపతులు, మల్లికార్జున, వ్యక్తలింగి, విద్యారాశి, వ్యాఖ్యాని భట్టారకులతో పాటు చంద్రశ్రేష్ఠి ప్రభృతులీదానమునకు సాక్షులుగా తెలుపబడినారు. పై భూముల సిద్ధాయము (Tax) 12 ద్రమ్మములు (Drammas) గా నిర్ణయింపబడింది. ద్రమ్మము ఆనాటి నాణెము పేరు. దాని మూల్యము తెలియదు. వేములవాడ

చాళుక్య వంశ ప్రభువుల ప్రశస్తి వినయాదిత్య యుద్ధమల్లుని నుండి రెండవ అరికేసరి వరకు ఈ శాసనంలో ఉంది.

రెండవ అరికేసరి సాహిత్యాభిమాని కవి పండిత పోషకుడు. పంప మహాకవి ఇతని ఆస్థానము నందున్నాడు. పంప కవి రచించిన విక్రమార్జున విజయము జైన కావ్యమైనను అతడు తన ప్రభువైన రెండవ అరికేసరిని నాయకునిగా, మహాభారతములోని అర్జునుడిగా భావించి మహాప్రబంధముగా దానిని రచించాడు. రెండవ అరికేసరి సంతసించి పంపకవికి ధర్మవురము నగ్రహారముగా ఇచ్చాడు. ఈ ధర్మవురమే గోదావరి తీరమందున్న ధర్మపురి పుణ్యక్షేత్రము. జైన తీర్థంకరులకు, జైనమునులకు సంబంధించిన ఆదిపురాణమును గూడా పంపడు రచించాడు.

పంప మహాకవి సోదరుడు జినవల్లభుడు జైనమతాభివృద్ధికై పాటుపడినాడు. కురిక్యాల గ్రామశివారులో నున్న బొమ్మలగుట్టపై గల గండశిలపై జినవల్లభుడు సంస్కృతాంధ్ర, కన్నడ భాషలలో (Trilingual Inscription) నొక శాసనాన్ని వేయించాడు. ఈ శాసనము దాదాపుగా క్రీ.శ. 945 నాటిదని తెలుపబడింది[62]. ఈ శాసనమందు పంపకవి వంశము గూర్చిన సమాచారముంది. పంపకవి తండ్రి భీమపయ్య లేక భీమన, తల్లి వబ్బనబ్బె, సోదరుడు జినవల్లభుడు. పంపకవి తండ్రి భీమపయ్య వేంగీనాడులోని వంగిపఱ్ఱు కమ్మె బ్రాహ్మణుడు. తల్లి వబ్బనబ్బె తండ్రి అనగా పంపకవి మాతామహుడు సింఘన గొప్ప జ్యోతిష్యుడు. అతడు బెల్వొలలోని అణ్ణిగెరెకు (Anngere in Belvola) చెందినవాడు.

క్రీ.శ. 902లో జన్మించిన పంప మహాకవి తన 39వ ఏట క్రీ.శ. 941లో ఆదిపురాణము రచించాడు. ఆదితీర్థంకరుడైన ఋషభుని కథనమును ఇది బహుఅందమైన భాషలో వర్ణిస్తుంది. పంపకవి విక్రమార్జున విజయము కన్నడ సాహిత్యములో మేటి ఇతిహాస కావ్యము. ఇందులోని భాష, శైలి, పదజాలము పదవిన్యాసము కన్నడ సాహిత్యంలో ఎచటను కానరాదు. పంపకవి రచనలు జైనమత సంబంధమైన వైనను, ఇవి వేములవాడ చాళుక్య వల్లభులనాటి మత రాజకీయ, సామాజిక, ఆర్థిక, విద్యావిషయములను వెల్లడిస్తున్నాయి. ఈ కావ్యము ఉపోద్ఘాతము నందు రెండవ అరికేసరి పూర్వీకుల వంశావళి పొందు పరుచబడినది. రెండవ అరికేసరిని పాండవ మధ్యముడైన అర్జునునితో పోల్చుచు ఆనాటి విషయములన్నింటిని అల్లుచు రచించిన రమ్యమైన పద్యకావ్యమే విక్రమార్జున విజయము[63]. నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగడ తెలుగు కవిత్రయము వలె పంపడు, రన్నడు, పొన్నడు కన్నడ కవిత్రయముగా సుప్రసిద్ధులు. పంప మహాకవి రచించిన విక్రమార్జున విజయము కన్నడ దేశీయులకు పంపభారతముగా విరాజిల్లుచున్నది. పంప మహాకవికి శుభనందియని మరో పేరుంది. ఇతడు తన చివరిరోజులు పోదన లేదా బోధన్ యందున్నాడు. ఇటీవల శుభనంది పేరుతో నొక సమాధి బోధన్ నగరమునందు గుర్తింపబడింది[64].

రెండవ అరికేసరికాలమందు పంపకవి సోదరుడు జినవల్లభుడు కురిక్యాల, గంగాధరల మధ్యనున్న వృషభాద్రియను బొమ్మలగుట్టపై త్రిభువన తిలక జైనబసది నిర్మించి దాని సమీపాన కవితా గుణార్ణవ మను తటాకాన్ని త్రవ్వించాడు. మదన విలాసమను ఉద్యానవనము వేయించాడు. పంపకవికి కవితా గుణార్ణవుడను బిరుదుంది. జినవల్లభుడు తన అన్న పంపకవి యెడల గల ప్రేమ ఆదరాభిమానములను చాటుటకై తాను త్రవ్వించిన తటాకమునకు కవితాగుణార్ణవమని పేరు పెట్టాడు.

వేములవాడ రాజ్యము విశాలమైంది. గోదావరీ పరీవాహక ప్రాంతమందుంది. గోదావరి కిరువైపుల విస్తరించి యున్న రెండవ అరికేసరి రాజ్యము పడమట బోధన్ నుండి తూర్పున చెన్నూరు వరకు ఉంది. ఇతని సామంతుడైన బద్దెగుడు చెన్నూరు అగ్రహారము నందిచ్చిన దానముల గూర్చి క్రీ.శ. 940 చెన్నూరులోని ఆగస్త్యేశ్వరాలయమందున్న శాసనము తెలుపుతుంది[65]. రెండవ అరికేసరి సువిశాల రాజ్యమునకు వేములవాడ రాజధానిగా వెలుగొందగా పడమట బోధన్ నగరము, వేములవాడకు తూర్పున గల గంగాధర ఉపరాజధానులుగా ఉండేవి.




**10వ శతాబ్దపు రాజ్యములు**

రెండవ అరికేసరిగా రాజ్య పీఠమలంకరించిన పిదప రాష్ట్రకూటరాజ్య వ్యవహారాల్లో జోక్యం చేసుకొన్నాడు. బలవంతుడును, మహాసామంతాధిపతియు, ఇంద్రవల్లభుని అల్లుడైన రెండవ అరికేసరి దక్షిణాపథమున ప్రముఖ వ్యక్తిగా కీర్తింపబడినాడు. ఇతడు రాజ్యమునకు

వచ్చువరకే రాష్ట్రకూట మూడవ ఇంద్రుడు మరణించాడు. అతని తనయుడు రెండవ అమోఘ వర్షుడు రాష్ట్రకూట రాజ్యాధినేత ఐనాడు. కాని అతని సోదరుడు నాల్గో గోవిందుడు అన్నను రాజ్యభ్రష్టుని గావించి క్రీ.శ. 930లో సింహాసనమధిష్ఠించాడు. రెండవ అరికేసరికి తన రెండవ బావమరిదియైన నాల్గో గోవిందుని చర్య సహింపరానిదైంది. అతడు గోవిందుని తొలగించుటకు కృతనిశ్చయుడైనాడు. మూడవ ఇంద్రవల్లభుని సవతి సోదరుడు బద్దెగుడు, అతని తనయుడు మూడవ కృష్ణుడు ఇరువురు తండ్రి తనయులు నాల్గవ గోవిందుని పదవీచ్యుతుని గావించు ప్రయత్నంలో నుండిరి. బద్దెగుని మామయు మూడవ కృష్ణుని మాతామహుడునగు కాలచూరి దేవుడు వీరికి సైనిక సహాయము చేశాడు. బద్దెగుడు కాలచూరి సైన్యముతో వేములవాడ చేరాడు. రెండవ అరికేసరి ఈ సదవకాశమును చేజారనివ్వకుండా తన సైన్యమును, కాలచూరి సైన్యమును, ముదిగొండ విజయాదిత్యుని సైన్యమును వెంటబెట్టుకొని నాల్గో గోవిందుని ఎదుర్కొన్నాడు. ఇరువర్గముల మధ్య ఘోరయుద్ధము జరిగింది. నాల్గో గోవిందుడు పరాజితుడై రణరంగము నుండి పారిపోయాడు. రెండవ అరికేసరి సైన్యకూటమికి విజయము లభించింది. రెండవ అరికేసరి బద్దెగుని మూడవ అమోఘవర్షుడను పేర క్రీ.శ. 936లో రాష్ట్ర కూట సింహాసనమున ప్రతిష్ఠించాడు. రెండవ అరికేసరి నాల్గో గోవిందుని దుష్పరిపాలన నుండి రాష్ట్రకూటులకు విముక్తి కలిగించాడు[66].

మూడవ అమోఘవర్షునికి కొందరు సామంతుల బెడద తప్పలేదు. కక్కలుడు అను సామంతుడు అతని సోదరుడు బప్పువన ఇతని రాజ్యాధికారమును వ్యతిరేకించారు. వీరు పంపిన అంకకారుని రెండవ అరికేసరి యుద్ధమునందోడించాడు. అంకకారుదనగా ఒక రాజునకు బదులు యుద్ధము చేయువాడు. బప్పువన అంకకారుడు రాష్ట్రకూట నాల్గోగోవిందుని పక్షాన పోరాడుచు యుద్ధరంగమున మరణించాడు[67].

రాష్ట్రకూటులు, వేంగీచాళుక్యులు బద్ధ విరోధులు. వీరు తరచు యుద్ధాలు చేయుచుండిరి. రాష్ట్రకూటులు వేంగీ దేశముపై దండెత్తవలెనన్న మార్గమధ్యమునగల ముదిగొండ చాళుక్యరాజ్య సీమలనధిగమించాల్సి ఉండేది. ముదిగొండ చాళుక్యులు వేంగీచాళుక్యుల వంశములోని నొక శాఖకు చెందినవారు. కావున వీరు వేంగీచాళుక్య ప్రభువుల అనుయాయులుగా స్వతంత్ర రాజ్యము నేలుచుండేవారు. ముదిగొండ రాజ్యము నేటి ఖమ్మం జిల్లాయందున్న కొఅవి, ఖమ్మం ప్రాంతములందు వ్యాపించి ఉండేది. అనుమకొండ విషయము కొఅవి సీమనంటి యుండేది. వేములవాడ చాళుక్య రాజ్యము అనుమకొండ వరకు విస్తరించియుండేది. ముదిగొండ చాళుక్యులు బలసమన్వితులు. వీరి నెదుర్కొనిన తరువాతయే రాష్ట్రకూట సైన్యము వేంగీవైపు వెళ్ళాలి. ముదిగొండ చాళుక్యులు వేంగీ చాళుక్యులకు సహకరించగా వేములవాడ చాళుక్యులు రాష్ట్రకూటులకు సహకరించేవారు.

వేంగిరాజ్యము వారసత్వ సంక్షోభంలో ఉండింది. రెండవ యుద్ధమల్లుడు వేంగీరాజ్యమునకు రాదగినవాడు కాదని ముదిగొండ చాళుక్య విజయాదిత్యుడు వ్యతిరేకించాడు.

రాష్ట్రకూట నాల్గవ గోవిందుడు వేంగీ రెండవ యుద్ధమల్లుని పక్షము వహించాడు. కొలవి సీమనేలుచున్న విజయాదిత్యుడు వేంగీనందు రెండవ యుద్ధమల్లుని రాజ్యాధికారమును వ్యతిరేకించుట వలన రాష్ట్రకూట నాల్గో గోవిందుడు ముందుగా ముదిగొండ చాళుక్యుల కొలవి సీమపై దండెత్తాడు. ముదిగొండ విజయాదిత్యుడు రాష్ట్రకూట నాల్గో గోవిందుని ఎదిరింపజాలక వేములవాడ రెండవ అరికేసరి నాశ్రయించాడు. అప్పుడు రెండవ అరికేసరి విజయాదిత్యుని ఆదిలాబాద్ జిల్లాలోని చెన్నూరు సీమను పాలించుటకు నియమించాడు. ఈ విషయములు ముదిగొండ చాళుక్య విజయాదిత్యుని కుమారుడైన బద్దెగుడు క్రీ.శ. 940లో చెన్నూరు ఆగస్త్యేశ్వరాలయము నందు వేయించిన శిలాశాసనము వలన తెలియుచున్నవి. రాష్ట్రకూట నాల్గవ గోవింద వల్లభునిచే పంపబడిన సైన్యమునకాధిపత్యము వహించిన పణ్డార్యుని రెండవ అరికేసరి జయించినట్లు వేములవాడ శాసనం వలన విశదమౌతుంది.

రెండవ అరికేసరికాలపు అదే వేములవాడ శాసనమందు పేర్కొనబడిన రాజేశ్వర, ఆదిత్యగృహ, బద్దెగేశ్వర, నగరేశ్వర యను నాలుగు దేవాలయముల గురించి కొంత చర్చించాలి. ఈ శాసనంలో తంత్రపాలుడైన పెద్దనార్యుడు కేవలము ఆదిత్యగృహ దేవాలయమొకటే నిర్మించినట్లుంది. మిగిలిన మూడు దేవాలయములను పెద్దనగాని అతని ప్రభువు రెండవ అరికేసరి గాని నిర్మించినట్లు తెలుపబడలేదు. దీనిని బట్టి రెండవ అరికేసరి ఆదిత్య గృహమునకు పెద్దనార్యుని కోరికపై దానములిచ్చు వరకే ఈ మూడు దేవాలయములు వేములవాడలో ఉన్నాయి. అందొక నగరేశ్వర దేవాలయము నేటి బద్దిపోచమ్మగుడి ముందు నిలిచి ఉంది. ఆదిత్యగృహము ఆనవాళ్లు లేకుండా శిథిలమై ఉంటుంది. కాని నేడు రాజరాజేశ్వర దేవాలయ ప్రవేశ ద్వారము వెనుక గండదీప స్తంభ సమీపమున నిలుపబడిన అందమైన అతిప్రాచీన రెండు చేతుల సూర్యవిగ్రహమొకటి ఉంది. ఈ సూర్యవిగ్రహం ఆనాటి ఆదిత్య గృహ సంబంధితమైనదై యుండును. ఇక మిగిలినవి రెండు దేవాలయాలు. ఒకటి రాజేశ్వరాలయం రెండవది బద్దెగేశ్వరాలయం. వేములవాడలో అనేక రాజేశ్వరాలయాలున్నాయి. ఈ శాసనమందలి రాజేశ్వరాలయమును గుర్తించుట కష్టము. దీనిని నేటి రాజరాజేశ్వరాలయముతో పోల్చలేము. ఎందుకనగా రాజరాజేశ్వర దేవాలయము పదకొండవ శతాబ్దాంతంలో నిర్మింపబడింది. ఈ శాసనములోని ఆలయము పదవ శతాబ్దపు ప్రథమార్థ కాలము వరకే నిలిచియున్నది. కావున ఈ శాసనములోని రాజేశ్వర దేవాలయము శిథిలమై నేడదృశ్యమైనదన వచ్చు. సమగ్ర పరిశోధన చేపట్టినచో మున్ముందు వీటి అవశేషములు బయల్పడు అవకాశములు లేకపోలేదు. ఇక మిగిలినది బద్దెగేశ్వరనామము గల ఆలయము. బద్దెగేశ్వర దేవాలయము పేరు వినగానే దీనిని బద్దెగ వల్లభుడు (క్రీ.శ. 850-895) నిర్మించి యుండునను భావము కలుగును. భీమేశ్వరాలయగర్భ గృహమునకు ఎడమ వైపు నిలుపబడిన శిలాశాసనము దీనిని బద్దెగేశ్వరాలయమని తెలుపుచున్నదని ప్రముఖ చరిత్రకారుడు నేలటూరి వెంకట రమణయ్య అభిప్రాయపడినారు[68].

ఓటమి నెఱుగని బద్దెగుడు జీవితములో 42 యుద్ధములు చేసి సోలదగండడను (Unvanquished hero) బిరుదు ధరించి అతని విజయములకు చిహ్నముగా అతని పరిపాలనా చివరి కాలమందు ఈ ఆలయము నిర్మించి యుండును. ఆనాటి బద్దెగేశ్వరాలయమే నేడు భీమేశ్వరాలయముగా వ్యవహరింపబడుచున్నది. ఇది తొమ్మిదవ శతాబ్దాంతమున నిర్మింపబడిన దేవాలయము. దీని నిర్మాణములోని తొలి పశ్చిమచాళుక్య కళారీతులు, శిల్పసంపద ఈ అంశమునే ధృవపరుచుచున్నవి.

దక్షిణాపథ రాజకీయములందు కీలక పాత్ర వహించి వేములవాడ చాళుక్య వంశ ప్రతిష్ఠ నినుమడింప జేసిన రెండవ అరికేసరి మహారాజు క్రీ.శ. 930-955 వరకు సుమారు పాతిక సంవత్సరములు వైభవోపేతముగా పాలించి నేటి కరీంనగర్ జిల్లా ప్రాంతమునకు వన్నె తెచ్చి చరిత్రపుటల్లో శాశ్వత స్థానము సంపాదించాడు.

## వాగరాజు (క్రీ.శ. 955-965)

రెండవ అరికేసరికి ఇద్దరు పుత్రులు. మొదటిభార్య రేవకనిర్మాడి పుత్రుడు వాగరాజు. రెండవ భార్య లోకాంబిక తనయుడు రెండవ బద్దెగుడు లేదా భద్రదేవుడు. రెండవ అరికేసరి అనంతరము జ్యేష్ఠ కుమారుడు వాగరాజు సింహాసనానికి వచ్చాడు. వాగరాజు రాష్ట్రకూట మూడవ కృష్ణ భూపతి సామంతుడు.

శక సంవత్సరము 881 అనగా క్రీ.శ. 959లో రెండవ అరికేసరి పెద్దకుమారుడు వాగరాజు గంగాధర పట్టణము రాజధానిగా నేలుచు, రాష్ట్రకూట మూడవ కృష్ణ వల్లభునితో దక్షిణ దండయాత్రలకేగి చిత్తూరు జిల్లాలోని మెల్పాడి వద్ద బస చేయుచున్న సమయమున సోమదేవసూరి తన యశస్తిలక చంపూకావ్యమును పూర్తి చేసెనని ఆ గ్రంథంలో ఉంది. ఈ గ్రంథము సంస్కృత భాషలో రచింపబడింది. ఉజ్జయిని యశోధర రాజు చరిత్ర ఇందు ఎనిమిది ఆశ్వాసములలో వ్రాయబడింది. సంస్కృత సాహిత్యములో వ్రాయబడిన తొలిదశ చంపూకావ్యమిది. ఆనాటి సంస్కృతీ చరిత్ర తెలిసికొనుటలోను ప్రజల ఆచార వ్యవహారములు, దేశపరిస్థితులు, పాలనావిధానములు తెలిసికొనుటలోను తోడ్పడు గ్రంథమిది.

సోమదేవసూరి జైనకవి. క్రీ.శ. 950 ప్రాంతములో ఇతడు గంగాధర పట్టణములో నివసించాడు. ఇతడు సంస్కృత భాషాకోవిదుడు. సంస్కృత కవితా విశారదుడు. ఈ మహాకవి రచన శబ్దార్థాలంకారములకు ప్రసిద్ధి. సోమదేవసూరి ఇచటికి ఉత్తరభారతము నుండి వచ్చియుండును. అతడు గౌడ సంఘాధ్యక్షునిగా గొప్ప జైనమత తత్త్వవేత్తగా కీర్తింపబడినాడు. ఇతడు నీతి వాక్యామృతము, శ్యాద్వదోపనిషత్తు మున్నగు గ్రంథములను గూడా రచించాడు. సోమదేవసూరి గంగాధరలో నివసించిన కాలమందు వేములవాడ చాళుక్యల పాలనలో ఆ పట్టణము అమిత సిరిసంపదలతో తులదూగుతుండేది.[69]

వాగరాజుకు పుత్రసంతానము లేదు. అతని సవతితల్లి లోకాంబిక తనయుడు రెండవ బద్దెగుడు రాజ్యమునకు వచ్చాడు.

## రెండవ బద్దెగుడు క్రీ.శ. 966

వాగరాజు అనంతరము అతని సవతిసోదరుడు రెండవ బద్దెగుడు రాజ్యమునకు వచ్చాడు. ఇతడు కొంతకాలమే రాజ్యమేలాడు. ఇతడు వేయించిన నాలుగు పంక్తుల సంస్కృత శాసనమొకటి వేములవాడలో ఉంది. శాసనశిలపై జైన తీర్థంకరుని ప్రతిమ చెక్కబడింది. ఆ ప్రతిమ అడుగున ఈ చిన్నిశాసనము కలదు[70]. సపాద లక్ష దేశమును పాలించు బద్దెగుడు సోమదేవసూరి కొరకు శుభధామ జినాలయము నిర్మించినట్లుంది. మహాకవిగా, జైనమతాచార్యునిగా ప్రసిద్ధి వహించి యున్న సోమదేవసూరి బద్దెగుని గురువై యుంటాడు. గురువు పై గల భక్తి భావమున బద్దెగుడు వేములవాడ యందు శుభధామ జినాలయము నిర్మించి అతనికన్ని సౌకర్యములేర్పరచాడు. ఇప్పుడీ జినాలయము లేదు.

## మూడవ అరికేసరి (క్రీ.శ. 966-973)

రెండవ బద్దెగుని తరువాత అతని కుమారుడు మూడవ అరికేసరి వేములవాడ రాజ్య పాలకుడైనాడు. ఇతడు క్రీ.శ. 966లో పర్భిణి తామ్రశాసనము వేయించాడు. సోమదేవ సూరి కొరకు తన తండ్రి బద్దెగుడు నిర్మించిన శుభధామ జినాలయ వసదికి నవసుధాకర్మబలి నివేద్యార్థము సబ్బి సహస్రములోని రేపాక ద్వాదశాంతర్గత వనికటుపలు అను గ్రామమును దానమిచ్చినట్లు ఈ తామ్రశాసనం తెలుపుతుంది. క్రీ.శ. 968 రేపాక శాసనము మూడవ అరికేసరి ఆ గ్రామము నందొక జినాలయమును నిర్మించినట్లు తెలుపుతుంది[71]. ఇదియే ఖళివుత్తు జినాలయము. శాసనభాగము చాలామట్టుకు అరిగిపోయినందున జినాలయపేరు అస్పష్టముగా నున్నది. శ్రీమద్విట్టకుల వంశీయులు, జైన మతానుయాయులగు కామ, రామ, తుక్కయ రెవట్ల, పుణ్యారామ, కొమ్మయాదులు ఇందు పేర్కొనబడినారు.

క్రీ.శ. 973లో కళ్యాణి చాళుక్య రెండవ తైలపుడు రాష్ట్రకూట వంశమును నిర్మూలించి సింహాసనమాక్రమించాడు. రాష్ట్ర కూటుల పాలనలో నున్న రాజ్యభాగములన్నీ ఇతని ఏలుబడిలోకి వచ్చాయి. క్రీ.శ. 973లో మూడవ అరికేసరి పాలనతో వేములవాడ చాళుక్యుల పాలన అంతరించింది.

# కళ్యాణి చాళుక్యులు

పదవ శతాబ్దపు చివరి చతుర్థ భాగములో రాష్ట్రకూటుల అధికారము పతనమైంది. తొలి పశ్చిమబాదామి చాళుక్య వంశజులు రెండు శతాబ్దములు మఱుగునపడి తిరిగి పశ్చిమ కళ్యాణి చాళుక్యులుగా వెలుగొంది క్రీ.శ. 973లో అధికారములోనికి వచ్చి మరల రెండు

శతాబ్దములకు పైగా తమ పరిపాలన కొనసాగించారు. ఈ కళ్యాణి చాళుక్యులు గొప్పనిర్మాతలు. అనేక దేవాలయముల నిర్మించి ఒక ప్రత్యేకమైన చాళుక్య శైలిని (Later Chalukyan Style) తమ కట్టడములలో ప్రతిబింబంప జేసినారు. ఒక్క కరీంనగర్ జిల్లాలోనే కళ్యాణి చాళుక్యరాజుల కాలపు 20 శాసనములు కన్నడ సంస్కృత భాషలందు లభ్యమైనాయి.

## రెండవ తైలపుడు (క్రీ.శ. 973-997)

కళ్యాణీ చాళుక్య వంశ స్థాపకుడు రెండవ తైలపుడు క్రీ.శ. 973లో ఆహవమల్ల బిరుదుతో మాన్యఖేటము లేదా మాల్ఖేడ్ నందు సింహాసనము నధిష్ఠించి స్వతంత్రపాలన ఆరంభించాడు. అతని కాలపు నాలుగు శాసనములు కరీంనగర్ జిల్లాలో ఉన్నాయి[72]. ఆహవమల్లుడు చోళసైన్యముల విజేతగా పేర్కొనబడినాడు.

వేములవాడ తటాకము వద్ద నున్న తేది లేని శిలాశాసనము పశ్చిమచాళుక్య చక్రవర్తి యగు ఆహవమల్లదేవుని సామంత దండనాయకుడు, మహేశ్వరశక్తి పండితునికి దాన మొసంగు సమయమున చెక్కింపబడింది. ఈ శాసనము కన్నడ భాషలో నున్నది. శాసనాంతమున సంస్కృత శ్లోకముంది. ఆహవమల్ల దేవుడీ శాసనమున వర్ణింపబడినాడు. "సమస్త భువనాశ్రయ, శ్రీ పృథ్వీవల్లభ మహారాజాధి రాజ పరమేశ్వర పరమభట్టారక చాళుక్యాభరణ శ్రీ మదాహవమల్ల దేవర" అని శాసనమందు ఉంది. అట్లే శాసనం వేయించిన ఆహవమల్ల దేవుని సామంత దండనాయకుని వర్ణనమిందున్నది. మహేశ్వరశక్తి పండితుడు తపోధనుడు. అతనికి కాళ్లు గడిగి ధారాపూర్వకముగ దానమొసంగిన విషయమీ శాసనమందున్నది. శాసనము రక్షించువారికి కలుగు పుణ్యము, రక్షింపని వారికి కలుగు పాపము తెలుపబడింది. శాసనమున శక సంవత్సరముగాని, ప్రభవాది సంవత్సరము గాని పేర్కొనబడలేదు.

శకసంవత్సరము 913 ఖరనామ సంవత్సర ఉత్తరాయణ పుణ్యకాలమందు సూర్యగ్రహణ సందర్భములో వేయించిన క్రీ.శ. 992 శాసనమొకటి కరీంనగర్ మ్యూజియంలో ఉంది. ఆహవమల్లుని సేనాని ఒకడు సైన్యసమేతంగా మల్లికార్జున దేవాలయమును దర్శించి, ఆ దేవునికి కొంత నీరు నేలను మరియు ఒక పూదోటను దానము చేశాడు. అక్షరములు చెదరి పోవుట వలన సేనాని పేరు స్పష్టముగా తెలియుటలేదు. ఇది జిల్లాలోని ఆహవమల్లుని రెండవశాసనము. ఇదే సంవత్సరము క్రీ.శ. 992లో చెక్కబడిన ఇతనికాలపు మూడవ శాసనము చొప్పదండి గ్రామ సమీపమున గల మేలకుంట వద్దనున్నది. రాజకుమారుడైన సత్యాశ్రయ ఇర్వబెడంగుని అనుచరగణములోని అనుంగు దుగ్గరాయని పుత్రిక ఆచబ్బె (ఆచవ్వ) పేరట ఆచబ్బెయ సముద్రమును నిర్మించినట్లు ఈ శాసనమందున్నది. అంతే గాకుండా సత్యాశ్రయదేవర దాది (Female Nurse) దేవకబ్బె (దేవకవ్వ) చొప్పదండి మార్తాండదేవునకు 70 ద్రమ్మములను నాణెములతో పాటు భూదానము లొసంగినట్లు ఇందులో పేర్కొనబడింది.

రెండవ తైలపుని చివరి నాల్గవ శాసనము క్రీ.శ. 995 నాటిది పాత జమ్మికుంట గ్రామములో చెరువుకట్ట నానుకొని యున్న పాత శివాలయపు ఆవరణ యందు గల ఎత్తైన ఏక శిలాస్తంభము పై చెక్కబడింది[73]. తన ప్రభువైన ఆహవమల్లుడు ఉత్తరమున గల మాళవరాజ్యముపై దండెత్తి పారమార రాజైన ముంజరాజును యుద్ధమున నిహతుని జేసి విజయము సాధించిన సందర్భములో నాగియగావుండు జమ్మికుంట ఆదిత్యదేవరకు కొన్ని భూములు, రెండు రాటణములు దానముగా నొసంగెనని ఈ శాసనము తెలుపుతుంది. కరీంనగర్ జిల్లాలో వేర్వేరు చోట్ల లభ్యమైన ఇతని నాలుగు శాసనములను బట్టి ఈ జిల్లా అంతయు, రాష్ట్రకూటులతో పతన మొందిన వేములవాడ చాళుక్యుల పాలనానంతరము, రెండవ తైలపుని ఆధీనమయ్యెనని విశదమౌతుంది. రెండవ తైలపుని ఆస్థాన కవి చక్రవర్తి రన్నమహాకవి. కన్నడ కవిత్రయములోని ఈ రన్నుడు అజిత పురాణము, గదాయుద్ధకావ్యములను కన్నడములో రచించాడు.

## సత్యాశ్రయుడు (క్రీ.శ. 997-1008)

రెండవ తైలపుని జ్యేష్ఠ పుత్రుడైన సత్యాశ్రయుడు తండ్రి అనంతరము చాళుక్య సింహాసనము నధిష్ఠించాడు. ఇతనికి ఇర్వబెడంగ యను బిరుదుంది. అనగా అచ్చెరువుగా యుద్ధంలో చొచ్చుకొని పోవువాడని అర్థము. కరీంనగర్ జిల్లాలోని మూడు శాసనాలు ఇతడీ ప్రాంతపు పాలకుడని తెలుపుతున్నాయి[74]. శకసంవత్సరము 927 విశ్వావసు చైత్ర శుద్ధ పంచమి బృహస్పతి వారము తేది17వ మార్చి క్రీ.శ. 1005 కడపర్తిలోని శిథిలశాసనము మరియు హుస్నాబాద్ చెరువుకట్ట పై గల ముక్కలైన (Fragmentary) శాసనము సత్యాశ్రయ ఇర్వబెడంగుని కాలములో దానములిచ్చినట్లు పేర్కొంటున్నాయి. వీటిలోని పూర్తి వివరములు తెలియుట లేదు. ఇతని కాలపు క్రీ.శ. 1008 శాసనము చొప్పదండి శంభుని గుడిలో నిలిచియున్నది. సత్యాశ్రయ ఇర్వబెడంగుని దాది దీవకబ్బె దివకేశ్వర దేవరకు భూదానములిచ్చినట్లు తెలుపుచున్నది. క్రీ.శ.992 చొప్పదండి మేలకుంట శాసనములో నున్న దేవకబ్బె మరియు క్రీ.శ.1008 శంభుని గుడిశాసనములో నున్న దీవకబ్బె ఒక్కరే. ఎందుకనగా ఈ రెండు శాసనములలోను దేవకబ్బె లేదా దీవకబ్బె ఇర్వబెడంగుని దాదిగా పేర్కొనబడింది. ఈ రెండు శాసనముల మధ్యకాలము 16 సంవత్సరములు. దీవకబ్బె రెండు శాసనములందు పేర్కొనబడుట వలన ఆమె ఈ మధ్యకాలమంతయు చొప్పదండిలోనే ఉండి తన పేరట దివకేశ్వరాలయమును కట్టించియుండును. శాసనమందు పేర్కొనబడిన ఆనాటి దివకేశ్వరాలయమే నేడు శంభుని గుడిగా వ్యవహరింపబడుచున్నది.

## ఐదవ విక్రమాదిత్యుడు (క్రీ.శ. 1008-1015)

సత్యాశ్రయుని అనంతరము అతని సోదరుని కుమారుడగు ఐదవ విక్రమాదిత్యుడు

రాజ్యమునకు వచ్చి ఏడు సంవత్సరములు మాత్రమే పాలించాడు. ఇతని కాలపు శాసనములేవీ కరీంనగర్ జిల్లాలో లభ్యము కాలేదు.

## జగదేకమల్ల రెండవ జయసింహుడు (క్రీ.శ. 1015-1042)

నాలుగు ప్రక్కల చెక్కబడిన ఇతని కాలపు శిలాశాసనము వేములవాడ కేదారేశ్వరాలయ ప్రాంగణములో నిలిచియుంది. శక సంవత్సరము 955 శ్రీముఖ పుష్య అమావాస్య ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తమున సరియగు తేది 24వ డిసెంబర్ క్రీ.శ. 1033 రోజున ఈ శాసనము వేయించబడింది[75]. ఈ శాసనభాష కన్నడము. శాసనాంతమున వ్యాస గీతాశ్లోకమున్నది. మండలేశ్వరుడగు గణ్డయ్య కొప్పరకొల సిద్ధాయమును జయసింహ దేవచక్రవర్తి అనుమతిగొని రాజేశ్వర దేవర పరివారమునకు చెందునట్లు ఏర్పాటు గావించినట్లీ శాసనమందున్నది. అట్లే జయసింహదేవ మహారాజు పసాయిత కామనయ్య విన్నపమాలకించి బద్యంకేశ్వర (బద్దెగేశ్వర) రాజేశ్వర దేవరల అఖండ స్ఫుటిత నవకర్మకు జొన్నగ్రామము దానమిచ్చినట్లు శాసనమున పేర్కొనబడింది. శాసనమున ధరామర వంశజుడును, సర్వశాస్త్ర విశారదుడును, వాజి వంశకులోపేతుడును, రాజేశ్వర మఠాధిపతియు, స్థానపతియునగు మహానీయుని వర్ణనమున్నది. ఇందు పసాయిత కామనయ్య పేర్కొనబడినాడు. పసాయితకు అశ్వ సైన్యాధ్యక్షుడను అర్థముంది[76]. జయసింహ వల్లభుడు తన పసాయితతో కలిసి వేములవాడ క్షేత్ర సందర్శనమునకు వచ్చినప్పుడు కామనయ్య విన్నపమాలకించి రాజేశ్వర, బద్దెగేశ్వర దేవరలకు దానమిచ్చు సందర్భము నందీ శాసనమును వేయించి యుండవచ్చు.

వేములవాడలో చికరాజు నెలకొల్పిన రాజేశ్వరాలయ ధూపదీపనైవేద్యములకు, పుష్పములకు, తదితర పూజాదికములకు వెన్నిసాలె-70 లోని జొన్న గ్రామము దానమిచ్చినట్లు ఈ శాసనమందుంది. ఈ వెన్నిసాలె నేటి వెలిశాల గ్రామము కావచ్చు. జగదేకమల్ల బిరుదాంకితుడైన రెండవ జయసింహుని ఈ శాసనమొక్కటియే కరీంనగర్ జిల్లాలోని వేములవాడ కేదారేశ్వరాలయంలో గుర్తింపబడింది.

వేములవాడ శాసనములందనేక రాజేశ్వరాలయాల పేర్లు కానవచ్చును. నిజమునకు ఈ పేర్లన్నీ పాఠకులను కలవర పరుస్తాయి. కాలక్రమేణ కొన్ని దేవాలయముల పేర్లు మారినాయి. మరికొన్ని దేవాలయములు శిథిలమై నామరూపాలు లేకుండా కనుమరుగైనాయి. అందువల్ల శాసనములలోని ఆలయముల నన్నింటిని గుర్తించుట కష్టం. ప్రస్తుతము నిలిచి ఉన్న దేవాలయాలను గుర్తించటానికి పరిశోధనాత్మక దృష్టి అవసరం. వేములవాడలో భీమేశ్వరాలయము, నగరేశ్వరాలయము, కేదారేశ్వరాలయము, రాజరాజేశ్వరాలయములు మాత్రమే దర్శనీయ దేవాలయాలుగా పేరుగాంచాయి.

రెండవ అరికేసరి (క్రీ.శ. 930-955) కాలపు తేదీలేని శాసనములో రాజేశ్వర, ఆదిత్య

గృహ, బద్దెగేశ్వర, నగరేశ్వరయను నాలుగు దేవాలయముల ప్రసక్తి ఉంది[77]. మొదటిసారిగా రాజేశ్వరాలయము పేరు ఈ శాసనమందగబడుచున్నది. ఈ శాసనమందు పేర్కొనిన నాలుగు దేవాలయములలోని ఆదిత్య గృహమును రెండవ అరికేసరి తంత్రపాలుడైన పెద్దనార్యుడు నిర్మించాడు. కాని నేడది కానరాదు. ఆదిత్య గృహము సంపూర్ణముగా శిథిలమై అదృశ్యమైనది. వేములవాడ పట్టణములోని నకరము, వర్తకులు మరియు నాగరికులు నిర్మించిన నగరేశ్వరాలయము నేటికీ పట్టణం మధ్యలో ఉంది. ప్రముఖ చరిత్రకారుడు నేలటూరి వెంకటరమణయ్య తెలిపినట్లుగా మొదటి బద్దెగ వల్లభుడు నిర్మించిన నాటి బద్దెగేశ్వరాలయమే నేడు భీమేశ్వరాలయముగా వ్యవహరింపబడుతుంది. ఇక ఈ శాసనములో మిగిలిన రాజేశ్వరాలయమును గుర్తింపవలసియున్నది. రెండవ అరికేసరి శాసనమందలి రాజేశ్వరాలయాన్ని ఇప్పుడున్న కేదారేశ్వరాలయంతో గాని రాజరాజేశ్వర దేవాలయముతో గాని పోల్చుటకు వీలులేదు. ఎందుకనగా ఈ రెండు దేవాలయాలు తరువాత కాలంలో అనగా 11వ శతాబ్దములో నిర్మింపబడినాయి. అంతే గాకుండా ఈ రెండు దేవాలయాల్లో వాటి నిర్మాతలు వేయించిన శాసనాలు నేటికి నిలిచిఉన్నాయి. అందుచేత రెండవ అరికేసరి శాసనంలో పేర్కొన్న రాజేశ్వరాలయం నేడులేదని చెప్పవచ్చు. అది శిథిలమై అదృశ్యమై యుండును. వేములవాడలో అనేక శైవ, జినాలయములు శిథిలమై అదృశ్యమైనాయి. వాటిని గూర్చి సమగ్రమైన సర్వేగాని, పరిశోధనగాని జరిపినచో వేములవాడ చాళుక్యుల కాలపు నిర్మాణాలు త్రవ్వకాల్లో బయల్పడే అవకాశముంది.

వేములవాడలో లభ్యమైన శాసనాలన్నింటిని పరిశీలించగా, కేదారేశ్వరాలయం పేరు ఏ ఒక్కదానిలోను కానరాదు. నిర్మాణ శైలిని బట్టి ఈ దేవాలయం గూడా 11వ శతాబ్దమునకు చెందిందని విదితమౌతుంది. జగదేకమల్ల రెండవ జయసింహుని క్రీ.శ. 1033 కేదారేశ్వరాలయ శాసనంలో చికరాజు రాజేశ్వర దేవుని ప్రతిష్ఠించినట్లుంది. సాధారణంగా దేవతా విగ్రహాలు ప్రతిష్ఠించినపుడు, దానములిచ్చినపుడు ఆలయాలు నిర్మించినపుడు ఆయా ప్రదేశాల్లో శాసనాలను చెక్కిస్తారు. ఇవి ఆ ప్రదేశముల చారిత్రక ప్రాధాన్యతను తెలియజేస్తాయి. అన్యప్రదేశములందు శాసనముల యొక్క ఉనికిని ఆధారంగా తీసికొనినట్లే ఈ శాసనము యొక్క ఉనికిని గుఱుతుగా (Criterion) లేదా ఆధారంగా భావించినచో చికరాజు ప్రతిష్ఠించిన రాజేశ్వరుడు ఈ కేదారేశ్వరుడై యుంటాడు. చికరాజు నిర్మించిన రాజేశ్వరాలయమే తదనంతర కాలములో కేదారేశ్వరాలయముగా మారి ఉంటుంది.

సుప్రసిద్ధ చక్రవర్తి ఆఱవ విక్రమాదిత్యుని మహామండలేశ్వరుడైన రాజాదిత్యుడు వేములవాడ యందు తన పేరట రాజాదిత్యేశ్వరాలయమును సమున్నత గోపురముతో నిర్మించెనని అతడు క్రీ.శ. 1083లో వేయించిన శాసనం వల్ల తెలుస్తుంది[78]. ఇప్పుడీ శాసనము రాజరాజేశ్వర దేవాలయ ప్రాంగణ వాయువ్య మూలలో కలదు. వేములవాడ చెఱువుకట్టపై నిర్మింపబడిన

మంత్రకూటము రాజ్యముల మధ్య గోదావరినది నానుకొని యున్న రామగుండం ప్రాంతమును పాలించాడు. ఇదివరలో చెప్పినట్లుగా కాకతీయ రెండవప్రోలుడు తన కళ్యాణి చక్రవర్తి రెండవ జగదేకమల్లుని ఎదుట ఏడరాజు యుద్ధరంగములో భయపడి బాలుని వలె పారిపోవునట్లు చేసెనని వెల్లకి గంగాధరుడు అనుమకొండలో వేయించిన శిథిల శాసనము తెలుపుతుంది. ఆ తరువాత ఏడరాజు జాడ తెలియదు. క్రీ.శ.1138లో రామగుండం ప్రాంతము రెండవ ప్రోలుని వశమైంది.

పొలవాసరాజులు, వారి మంత్రులు అనేక జినాలయములను, శివాలయములను నిర్మించి వాటికి ఉదారముగా అనేక దానాలిచ్చారు. చాళుక్యుల కళారీతులలో త్రికూటాలయములను నిర్మించిన అందమైన త్రికూటాలయము ధర్మారం మండలంలోని నంది మేడారం చెఱువు కట్టపై తూర్పుకొన యందున్నది. పొలవాస రాజధానిలో అనేక ఆలయముల శిథిలావశేషాలు ఇప్పటికి ఉన్నాయి. పొలవాస పాలకుల కాలమందు నిర్మింపబడిన పులస్త్యేశ్వరాలయము, వేణుగోపాలాలయము రెండును పొలాస గ్రామమందు భద్రముగా నిలిచియుండి పూజలందుకొంటున్నాయి.

## కాకతీయులు

ఓరుగల్లు సామ్రాజ్యము నేలిన కాకతీయులు కరీంనగర్ జిల్లాలో అనేక అందమైన దేవాలయాలు ప్రధానంగా శివాలయములను నిర్మించారు. కరీంనగర్ సమీపమున గల నగునూరు, కొత్తపెల్లి, తోటపెల్లి, భీందేవరపల్లి మండలంలోని ముత్తారం, కటుకూరు, సైదాపూర్ మండలంలోని గొడిశాల, మంథని మరియు దాని సమీపమున నున్న ఖమ్మంపెల్లి హ్యామ్లెట్ యైన చెందరెల్లి మున్నగుచోట్ల నిర్మింపబడిన అద్భుతమైన, దేవాలయములు ఈ జిల్లాయందు చక్కటి శిల్పకళారీతులను ప్రదర్శిస్తున్నాయి. ఈ ఆలయాల స్తంభాలు, దూలాలు (Lintels), ద్వారములు, పై కప్పులందు చెక్కబడిన అనేక శోభాయమానమైన శిల్పములు కాకతీయ శిల్పకళా సౌందర్యాన్ని చాటుతున్నాయి.

వేములవాడ సమీపాన కోనరావుపేట మండలంలో సుద్దాలలో ఇటీవల బయల్పడిన ఒక కుప్ప (hoard)లో 52 బంగారు నాణెములు బయల్పడినవి[104]. ఆ నాణెములపై దాయగజకేసరి యని చెక్కబడిఉంది. దాయగజకేసరి కాకతీయ రాజులు ధరించిన బిరుదు గనుక ఈ నాణెములు కాకతీయ పాలకుల కాలపువని గుర్తింపబడినవి.

ఈ జిల్లాలో లభ్యమైన కళ్యాణి చక్రవర్తుల కాలపు శనిగరము శాసనములలో కాకతీయ తొలి నలుగురు రాజుల సమాచారముంది. అవిపోగా కాకతీయుల కాలపు శాసనములు 15 వరకు కరీంనగరము జిల్లాలో లభ్యమైనవి. వాటిలో రెండు రుద్రదేవుని కాలపువి కాగా ఏడు గణపతి దేవ చక్రవర్తి కాలమునకు చెందినవి. కరీంనగర్ జిల్లాకు సంబంధించినంత వరకు ఈ

శాసనములు కాకతీయుల చరిత్రను వెలుగులోనికి తెచ్చాయి.

పశ్చిమ కళ్యాణి చాళుక్యుల కాలములో కాకతీయుల తొలిపాలకులు ప్రాధాన్యతను సంతరించుకొన్నారు. ఈ కుటుంబపు తొలిరాజులు మొదటి బేతరాజు, మొదటి ప్రోలరాజు, రెండవ బేతరాజు, రెండవ ప్రోలరాజు నలుగురు కళ్యాణి చాళుక్యులకు విశ్వాసపాత్రులైన సామంతులుగా నుండిరని శనిగరపు శాసనములు విశదపరుస్తున్నాయి.

## మొదటి బేతరాజు (క్రీ.శ. 1000-1052) :-

వరంగల్‌ను పాలించిన కాకతీయుల పుట్టు పూర్వోత్తరాల గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. కకతి దేవతారాధన చేయువారగుటచే వీరికి కాకతీయులని పేరు వచ్చినదని కొందరి అభిప్రాయం. ఖమ్మం జిల్లాలో గల ఇల్లెందు తాలుకాలోని బయ్యారం చెఱువు శాసనం మరియు వేంగీ తూర్పు చాళుక్యదానార్ణవుని క్రీ.శ. 956 మాన్గల్లు శాసనము కాకతీయుల వంశావళిపై వెలుగు ప్రసరింపజేశాయి. తొలుత కాకతీయులు రాష్ట్రకూటులకు సేనానులుగానున్నారు. వారిలో ముఖ్యుడైన కాకర్త్య గుండ్యన లేదా గుండన నతవాటి సీమ (మధిర) పాలకునిగా ఉండెను. నతవాటి సీమ ఖమ్మం జిల్లాలోని నేటి మధిరప్రాంతము. కాకర్త్యపదము కాకతి పదానికి అతి దగ్గరగా నుండటచే కాకర్త్య పదం వాడుకలో కాకతిగా మారియుండునని దాని నుండియే కాకతీయ వంశనామము ఆవిర్భవించియుండునని మరికొందరి అభిప్రాయము. గుండనకుమారుడు మొదటి బేతరాజు కొఱవి సీమ నాక్రమించాడు. ఈ కొఱవి సీమ నేటి మానుకోట (మహబూబాబాద్) ప్రాంతము.

దేవరాజు అను ఎరుకల జాతి వేటగాడొకడు అనుమకొండ సమీపమున గల గుట్టలపై ఆధిపత్యము సంపాదించెనని, అతని కుమారులైన అనుమడు, కొండడు ఇరువురు వారి పేరట అనుమకొండ నగర స్థాపన గావించిరని మారేమండ రామారావు చరిత్రకారుని అభిప్రాయం. వీరిని మొదటి బేతరాజు ఓడించి అనుమకొండ నాక్రమించాడు. ఈ బేతరాజు, గరుడబేతరాజుగా గూడా పిలువబడినాడు. మొదటి బేతరాజు అర్ధ శతాబ్దమునకు పైగా అనుమకొండను ఏలాడు. ఇతని అధికారము కరీంనగర్ జిల్లాలో విస్తరించిన ఆధారాలు లేవు.

## మొదటిప్రోలరాజు (క్రీ.శ. 1052-1076):-

మొదటి బేతరాజు కుమారుడు మొదటి ప్రోలరాజు తండ్రి అనంతరము రాజ్యమునకు వచ్చాడు. ఇతడు కళ్యాణి చక్రవర్తులకు విశ్వాసపాత్రుడైన సామంతునిగా వారికి అనేక యుద్ధాల్లో తోడ్పడినాడు. కళ్యాణి చాళుక్య చక్రవర్తి త్రైలోక్యమల్ల మొదటి సోమేశ్వరుడు (1042-1068) మొదటి ప్రోలుని సైనిక సామర్థ్యము, రాజభక్తి విశ్వాసములకు సంతసించి అనుమకొండ విషయమును అతనికి శాశ్వతముగా నేలుకొమ్మని ఇచ్చినట్లుగా క్రీ.శ.1090 కాజిపేట దర్గాశాసనములో పేర్కొనబడింది. ఆ విధముగా కాకతీయ రాజ్యమునకు మొదటి ప్రోలుడు

తన చక్రవర్తి అనుమతితో గుర్తింపు పొందిన మొదటి పాలకుడైనాడు. ఈ రకంగా ఆవిర్భవించిన కాకతీయ రాజ్యము అతని వారసుల కాలములో క్రమేణ గొప్ప సామ్రాజ్యముగా రూపొంది ఆంధ్రదేశమంతయు ఆధిపత్యము వహించింది. మొదటి ప్రోలరాజు అధికారము కరీంనగరము జిల్లాలో ఇంకను వ్యాప్తి నొందినట్లు ఆధారాలు కనిపించలేదు.

## రెండవ బేతరాజు (క్రీ.శ. 1076-1108) :-

మొదటి ప్రోలరాజు అనంతరము అతని కుమారుడు రెండవ బేతరాజు రాజైనాడు. వైజదండాధీశుడు తన ప్రభువైన రెండవ బేతరాజును కళ్యాణి రాజధానిలోని సుప్రసిద్ధ చక్రవర్తి త్రిభువనమల్ల ఆఱవ విక్రమాదిత్యుని ఆస్థానమునకు తీసికొని పోయి తమ వినయ విధేయతలను విశ్వాసపూర్వకముగా ప్రదర్శింపగా అతడు అనుమకొండ విషయముతో పాటు సబ్బిసహస్రమును గూడా రెండవ బేతరాజునకు ప్రసాదించాడు. దీనితో శనిగరమును కలుపుకొని కరీంనగరము జిల్లాలోని దక్షిణ ప్రాంతమంతయు మొదటిసారిగా కాకతీయుల పాలన క్రిందికి వచ్చింది. అదే కాలములో ఈ జిల్లాలోని ఉత్తర ప్రాంతమును మహామండలేశ్వరులైన రాజాదిత్యుడు వేములవాడ రాజధానిగా, మొదటి మేదరాజు పొలవాస రాజధానిగా పాలించుచుండిరి.

## దుర్గనృపతి (క్రీ.శ. 1108-1116) :-

రెండవ బేతరాజునకు దుర్గనృపతి, రెండవప్రోలుడని ఇరువురు పుత్రులు. తండ్రి మరణానంతరము దుర్గనృపతి రాజ్యమునకు వచ్చి కొద్దికాలమే పాలించాడు. కరీంనగర్ జిల్లాకు సంబంధించినంత వరకు ఇతని వివరములు తెలియవు.

## రెండవ ప్రోలరాజు (క్రీ.శ. 1116-1157) :-

దుర్గనృపతి అనంతరము అతి పరాక్రమవంతుడు, గొప్పయోధుడైన రెండవ ప్రోలుడు రాజ్యమునకు వచ్చాడు. ఇదివరలో తెలిపినట్లుగా రెండవ ప్రోలరాజు పొలవాస రెండవ మేదరాజు నోడించాడు. మంత్రకూట గుండరాజు నోడించి శిరచ్ఛేదము గావించాడు. చక్రవర్తి రెండవ జగదేకమల్లుని ఎదుట రామగుండం ఏడరాజు యుద్ధభూమి నుండి పారిపోవునట్లు జేశాడు. గోదావరి నానుకొని యున్న మంత్రకూట రాజ్యభాగములు, రామగుండం ప్రాంతమంతయు క్రీ.శ. 1138-1140 మధ్యకాములో రెండవ ప్రోలుని రాజ్యములో విలీనమైంది. రెండవ మేదరాజు ఓడిపోయినను, ధైర్య సాహసములతో తిరిగి తన పొలవాస రాజ్యమును స్వాధీన పరుచుకొని కరీంనగరము జిల్లాలోని ఉత్తర భాగమును కాకతి రెండవ ప్రోలునికి సమాంతరంగా, స్వతంత్రంగా క్రీ.శ. 1159 వరకు పాలించాడు.

## కాకతి రుద్రదేవుడు (క్రీ.శ. 1158-1195):-

రెండవ ప్రోలుని అనంతరము అతని కుమారుడు రుద్రదేవుడు సింహాసనానికి

వచ్చాడు. ఇతడు గొప్పసేనాని, పరాక్రమవంతుడు. రుద్రదేవుడు పొలవాస రెండవ మేదరాజు, నగునూరు దొమ్మరాజు, కళ్యాణి నుండి పంపబడిన సేనాని మైలిగి దేవునితో గూడిన ముగ్గురి మిత్రకూటమి నోడించాడు. పొలవాస పట్టణము ధ్వంసము చేసి అక్కడి సంపదంతయు దోచుకొన్నాడు. అచటి ఏనుగులు వశపరచుకొనబడినాయి. పొలవాస రాజ్యము క్రీ.శ. 1159లో శాశ్వతముగా కాకతీయ రాజ్యములో విలీనమైంది. దీనితో కరీంనగర్ జిల్లా ప్రాంతము సాంతము మొదటిసారిగా కాకతీయుల వశమైంది. పశ్చిమకళ్యాణి చాళుక్యుల బలహీనతను గమనించిన రుద్రదేవుడు అనుమకొండ రాజధానిగా స్వతంత్రుడైనాడు. ఇతని కాలములోనే ఓరుగల్లు కోట నిర్మాణమారంభమైంది. క్రీ.శ. 1159 నుండి సబ్బినాడంతయు (కరీంనగరము జిల్లా) అతని అధీనమైంది. కరీంనగర్ జిల్లాలో ఇతని కాలపు శాసనాలు నగునూరు, నంది మేడారం లందున్నాయి.

నగునూరు పాలకుడు (Governor) మరియు అనుమకొండ నేలు కాకతి రుద్రదేవుని మంత్రి వెల్లకి గంగాధరుడు క్రీ.శ. 1171లో నగునూరు నందు వేయించిన శాసనం ప్రస్తుతం కరీంనగర్ జిల్లా కలెక్టర్ నివాస గృహ ఆవరణలో ఉంది[105]. ఈ శిలాస్తంభశాసనం తెలుగుభాషలో నాలుగు ప్రక్కల యందు చెక్కబడింది. కరీంనగర్ జిల్లాలో లభ్యమైన శాసనములన్నింటిలో ఇది ప్రాంతీయ భాషలోని మొదటి తెలుగుశాసనం. శాసనమంతయు పద్యభాగములో ఉంది. చివరకు కొన్ని పంక్తులు గద్యమందున్నాయి. ఇది మొత్తము 172 పంక్తుల శాసనం. మొదటి ప్రక్కలో 1 నుండి 45 వరకు, రెండవ ప్రక్కలో 46 నుండి 89 వరకు, మూడవ ప్రక్కలో 90 నుండి 132 వరకు, నాలుగవ ప్రక్కలో 133 నుండి 172 వరకు మొత్తము 172 పంక్తులు చెక్కబడినవి. శక సంవత్సరము 1092, వికృతిమాఘ శుద్ధ పంచమి బుధవారము సరియగు తేది 13వ జనవరి క్రీ.శ. 1171 రోజున వేయబడిన ఈ శాసనము వెల్లకి గంగాధరుని పూర్వీకులు వేంగీ దేశమందలి వెల్లకి గ్రామస్థులనియు, వారు అత్రి గోత్రములో ఆవిర్భవించిన కొమ్మనార్యునకు నారాయణుడను పుత్రుడు, గోవిందుడను పౌత్రుడు ఉండిరని ఇందులో పేర్కొనబడింది. గోవిందుడు, తురుకమాంబ దంపతులకు జన్మించిన పుత్రరత్నమే గంగాధరుడు. విద్యాభ్యాసానంతరము గంగాధరుడు అనుమకొండలో కాకతి రెండవప్రోలుని కొలువులో జేరి క్రమముగా రుద్రదేవుని కాలములో మంత్రిగా ఎదిగాడు. ఇతడు గొప్పసేనాని మరియు సబ్బినాడంతటికి పాలకునిగా (Governor) నియమింపబడినాడు. గంగాధరుడు విప్రులకు దిండొంట గ్రామము నగ్రహారముగా నొసంగెనని, ఆయన రాజధాని నగునూరునందు శివునికి త్రికూటాలయము నిర్మించెనని ఇంకను అనుమకొండ, హిడింబాచలము, కాళేశ్వరము మున్నగుచోట్ల దేవాలయములు కట్టించెనని ఈ శాసనము తెలుపుచున్నది.

ధర్మారం మండలంలోని నంది మేడారం గ్రామమందు చిన్నకొండాల్‌రావు ఇంటి ముందు పడియున్న శిథిల శిలాశాసనంలో కాకతి రుద్రదేవుని ప్రసక్తి ఉంది.[106] దీనిలో

శకసంవత్సరము 1098, దుర్ముఖియని చెక్కబడింది. ఇది క్రీ.శ. 1175 కు సమానము. ఈ శాసనమందలి వివరములు స్పష్టముగా లేవు.

నగునూరు గ్రామమందు పురావస్తు శాఖ దృష్టికి రాని రామలింగాల గుడి శాసనమొకటి స్థానిక పాఠశాల ప్రధానోపాధ్యాయునిగా పనిచేసిన కె.మల్లయ్య గారి నుండి సేకరింపబడింది.[107] తేదీలేని ఈ శాసనం రామనాథదేవరకు పుష్పహారములు తయారుచేయు మాలాకారులకు వేతనము లిచ్చుటకై నగునూరులోని బ్రాహ్మణగడ్డ సమీపమున గల పొలము దానముగా ఇవ్వబడినదని తెలుపుచున్నది. ఈ శాసనమందు ఊరుపేరు 'నగరూరు' అని చెక్కబడింది. ఆనాటి నగరూరే నేడు నగునూరుగా పిలువబడుచున్నది. ఇందులో కొన్ని చెఱువుల పేర్లున్నాయి. కాని అవి స్పష్టముగా లేవు. కాకతీయ మహారాణి రుద్రమదేవి "రుద్రమహారాజు" బిరుదము ధరించి రాజ్యమును పురుషుని వలె పాలించింది. గనుక ఆమె కాలపు కొన్ని శాసనములందు ఆమె పేరు గూడా రుద్రమదేవికి బదులు 'రుద్రదేవ' యని పురుషుని వలె చెక్కబడెనని తెలుస్తుంది. తేదిలేని అసంపూర్ణ శాసనము గనుక ఇది కాకతి రుద్రదేవుని కాలముదో, రాణి రుద్రమకాలముదో నిర్ణయించుట కష్టము. రుద్రదేవుడు దేవగిరి యాదవులను ఎదుర్కొనుచు యుద్ధభూమిలో వీరస్వర్గమలంకరించాడు.

## కాకతి మహాదేవుడు (క్రీ.శ. 1195-1198):-

కాకతిరుద్రదేవుని అనంతరము అతని తమ్ముడు మహాదేవుడు రాజ్యమునకు వచ్చి స్వల్పకాలము పాలించాడు. ఇతనికాలపు క్రీ.శ. 1197 శిలాశాసనమొకటి గోదావరిఖని సమీపమున నున్న సుందిల్లలో ఉంది. శాసనమందలి పంక్తులు అరిగిపోయినవి గనక వివరములు తెలియుటలేదు. శాసనమందు పింగళ చైత్ర శుద్ధ అష్టమి శుక్రవారము అనే పదాలు మాత్రం అగబడుచున్నవి. ఇవి 28వ మార్చి క్రీ.శ. 1197కు సమానముగా గుర్తింపబడినవి.[108] మహాదేవరాజు ఉద్యోగి (Subordinate) పేరు స్పష్టమగుటలేదు. మహాదేవరాజు దేవగిరినేలు జైత్రపాలుడు లేదా జైతుగితో తలపడగా, జైతుగి చేతిలో యుద్ధరంగమందు చనిపోయాడు. జైతుగి మహాదేవ రాజు కుమారుడైన గణపతిదేవుని బందిగా తీసికొనిపోయి దేవగిరిలో బంధించాడు. తదనంతరము గణపతి దేవుని ప్రజ్ఞావిశేషాలను గమనించిన జైతుగి గణపతి దేవుని విడిచిపెట్టాడు.

## గణపతి దేవచక్రవర్తి (క్రీ.శ. 1199-1261) :-

గణపతి దేవుడు కాకతీయ వంశములోనే గాక, దక్షిణ భారతదేశాన్నేలిన చక్రవర్తులలో అగ్రగణ్యుడు. ఇతని ఆరుదశాబ్దముల సుదీర్ఘపాలనలో ఆంధ్రుల కీర్తి దిగంతాల వరకు వ్యాపించింది. ఇతడు మహాశూరుడు, విజేత, పరిపాలనాదక్షుడు, గొప్ప ప్రజ్ఞాశాలి. క్షీణదశలో నున్న కాకతీయ రాజ్యాన్ని ఉద్ధరించి, విస్తరింపజేసి దాన్ని గొప్ప సామ్రాజ్యంగా మార్చాడు.

కరీంనగర్ జిల్లాలో ఇతని కాలపు ఏడు శిలాస్తంభ శాసనములు మంథని, కటుకూరు, గొడిశాల, ధర్మపురి, కాళేశ్వరము, నంది మేడారం, ఖమ్మంపెల్లి గ్రామాల్లో ఉన్నాయి[109]. ఈ శాసనములే గాకుండా ఈ జిల్లాలో ఇతని కాలపు రెండు తామ్రశాసనాలు దొరికాయి. ఒక తామ్రశాసనము నగునూరు రాజధానికి సమీపమున గల చామన్‌పెల్లి గ్రామపు గొనుగుకాలువ తగాదా పరిష్కారాంశములను తెలుపుచున్నది. చామన్‌పెల్లికి సమీపమున గల కుమ్మరికుంట, దేవనపెల్లి మరియు కాట్యకోలపెల్లి గ్రామపెద్దలు అందు సాక్షులుగా నున్నారు. ఆ రోజులలో కరీంనగరము ప్రాంతమునకు అక్షయ చంద్ర దేవుడు పాలకుడని దేవనాగరిలిపిలో నున్న ఈ తామ్రపత్రముల శాసనము తెలుపుచున్నది. క్రీ.శ.1246 డిసెంబర్ 15వ తేదీన వేయబడిన ఈ శాసనమందు విక్రమ శక 1303, ప్రభవ పుష్య శుద్ధ షష్ఠి శనివారము అని చెక్కబడిఉంది[110]. ఇతని కాలపు రెండవ తామ్రశాసనము ఇటీవల నవంబర్ 2001లో గంగాధర మండలములోని వెంకటాయపల్లెలో ఒక వ్యవసాయ బావి యందు బయల్పడింది.[111] ఒక కడియము (Ring) తో చుట్టబడిన ఐదు తామ్రరేకుల ఈ శాసనము కరీంనగరము మ్యూజియంలో భద్రపరచబడింది. దేవనాగరిలిపిలో గల ఈ శాసనము గణపతి దేవుని కాలములో ఇవ్వబడిన దానముల గూర్చి పేర్కొనుచున్నది. గణపతి దేవుడు తన పెద్దనాన్న రుద్రదేవుడు ప్రారంభించిన ఓరుగల్లు కోట నిర్మాణము పూర్తి చేసి రాజధానిని పూర్తిగా అనుమకొండ నుండి ఓరుగల్లుకు మార్చెను. దీని చుట్టు బలిష్ఠమైన మట్టికోట, రాతికోట, కంచుకోటయను మూడు ప్రాకారములుండెను. ఈ కోటకు 75 బురుజులున్నాయి.




**12వ శతాబ్దపు రాజ్యములు**

## కాకతి రుద్రమదేవి (క్రీ.శ. 1261-1295):-

గణపతి దేవ చక్రవర్తికి పుత్రసంతానము లేనందున అతని జ్యేష్ఠపుత్రిక రుద్రమదేవి 'రుద్రమహారాజు' బిరుదముతో సింహాసనం అధిష్ఠించింది. గణపతిదేవుడు ఈమెకు పాలనా వ్యవహారములందు చక్కటి శిక్షణనిచ్చాడు. తండ్రి చివరిదశలో రాజ్యభారము నామెపై మోపి కొంతకాలము తండ్రి తనయ ఇద్దరు పాలించారు. ఈమె దక్షిణ భారతదేశంలో రాజ్యమేలిన మొట్టమొదటి మహిళ. ఉత్తర భారతదేశంలో ఈమె కంటే పూర్వమే బానిసవంశమునకు చెందిన సుల్తానారజియా 1236లో ఢిల్లి సింహాసనము నధిష్ఠించి 1240 వరకు పాలించింది. రుద్రమదేవి స్త్రీ యైనను రుద్రదేవమహారాజు అను పురుషనామాన్ని ధరించి సమకాలీన చక్రవర్తులందరి కంటే గొప్పగా పాలించిన ధీశాలి, ధైర్యశాలి. ఈమె కాలంలో తెలుగు దేశాన్ని దేశవిదేశీయాత్రికులు సందర్శించి ఈమె గొప్పతనాన్ని ఎంతగానో శ్లాఘించారు. ఈమె కాలంలోనే సుప్రసిద్ధ ఇటలీ యాత్రికుడు మార్కోపోలో ఆంధ్రదేశాన్ని దర్శించి రుద్రమదేవి కీర్తిని దేశదేశాలకు వ్యాపింపజేశాడు.

రుద్రదేవనామముతో తేదీలేని శిలాశాసనమొకటి హుస్నాబాద్ చెఱువు సమీపమున గల భూములందు పడియున్నది[112]. తెలుగులో నున్న ఈ శాసనము రుద్రదేవునిదో, రుద్రమదేవిదో తేల్చుట కష్టము. ముఖుసంటి ఎక్కటీలు (Warriors) రుద్రేశ్వరదేవునకు తాడ్లపయిడి గుద్దలిచిన్నాలు రాటణచేను నాలుగు పుట్లు వడ్లు దానమొసంగినట్లు ఈ శాసనమందున్నది.

## రెండవ ప్రతాప రుద్రచక్రవర్తి (క్రీ.శ. 1295-1323) :-

కాకతీయ చక్రవర్తులలో రెండవ ప్రతాపరుద్రుడు చివరివాడు. రాణిరుద్రమదేవికి ముమ్మడమ్మ, రుయ్యమ్మ అను ఇరువురు కూతురులుండిరి. ముమ్మడమ్మ కుమారుడే ఈ రెండవ ప్రతాపరుద్రుడు. రుద్రమదేవి మరణానంతరము ఇతడు సింహాసనమధిష్ఠించాడు. ఇతడు కదు సమర్థుడు. ఇతడు రాజ్యమును 77 భాగాలుగా విభజించి అంతకు పూర్వం నాయకులుగా నుండిన వారిని తొలగించి వారి స్థానంలో ముఖ్యంగా పద్మనాయక వంశస్థులను నాయకులుగా (సాహిణులు) నియమించాడు. ఈ పద్మనాయకులే గాక, నమ్మకస్థులైన రెడ్లు, బ్రాహ్మణులు పరిపాలనా విషయాలలో ఇతనికి ఎంతగానో సహాయపడినారు.

రెండవ ప్రతాప రుద్రచక్రవర్తి కాలపు మూడు శాసనములు ఎల్గేడు మండల కేంద్రమందు, మల్లాపూర్ మండలంలోని చిట్టాపూర్, హుస్నాబాద్ మండలంలోని రేగొండ గ్రామాల్లో ఉన్నాయి[113]. ఇవి గాకుండా పురావస్తుశాఖచే ముద్రింపబడని క్రీ.శ. 1305 శిథిలశిలాశాసనమొకటి రాయికల్ మండల కేంద్రమందు త్రికూటాలయ ఆవరణలో పడిఉంది[114].

ప్రతాపరుద్రదేవ మహారాజు యొక్క రాణిగా తెలుపబడిన లక్మాదేవి, ఆమె తండ్రి పాల్దేవ నాయినింగారి పుణ్యగతికై కొన్ని సుంకములు రామనాథ దేవరకు దానములుగా ఇచ్చినట్లు

క్రీ.శ. 1301 ఎల్గేడు శాసనము తెలుపుచున్నది. చిట్టాపూర్ గ్రామమందు బైరిశెట్టి ఒక త్రికూటాలయము నిర్మించి, సకల సముద్రమను తటాకమును త్రవ్వించాడు. రాజే స్వయముగా ఇచటికేతించి కొన్ని దానములిచ్చినట్లు చిట్టాపూర్‌లోని హనుమాన్ తోట యందు నిలిచియున్న తేదీలేని ఇతని కాలపు శాసనము తెలుపుచున్నది. తేదిలేని రేగొండ శాసనము సోమనాథ దేవరకు దానములొసంగబడినట్లు పేర్కొనుచున్నది. క్రీ.శ. 1305 నాటి రాయికల్ శాసనం అచటి దేవతలకొసంగిన దానములను పేర్కొంటుంది.

అలాఉద్దీన్ ఖిల్జీ తనమామయైన జలాలుద్దీన్ ఖిల్జీని 1296లో హత్య గావించి ఢిల్లీ సింహాసన మధిష్ఠించాడు. సామ్రాజ్య విస్తరణకాంక్ష గల ఇతని దృష్టి సంపదలతో గూడిన దక్షిణ రాజ్యములపై పడింది. కాకతీయ రెండవ ప్రతాపరుద్రుడు ఢిల్లీ మహ్మదీయసేనల నుండి ఉపద్రవము తప్పదని గమనించి సర్వసన్నద్ధుడై ఓరుగల్లు కోటను పటిష్ఠపరచాడు. ఇతడు మహ్మదీయుల ఏడు దండయాత్రలను సమర్థవంతంగా ఎదురుకొని కొన్ని పరియాయములు సంధిచేసికొని అపారమైన ధనరాశులను, అశ్వములను, ఏనుగులను వదలుకొనవలసివచ్చింది.[115] మొట్టమొదటి సారిగా అలాఉద్దీన్ ఖిల్జీ తన సేనలను క్రీ.శ. 1303లో మాలిక్ ఫక్రొద్దీన్‌జునా, జూనాఖాన్ యను సేనాధిపతుల నాయకత్వములో ఓరుగల్లు పైకి పంపాడు. కరీంనగర్ జిల్లాలోని హుజూరాబాద్‌కు సమీపమున సైదాపూర్ మండలంలో నున్న ఉప్పరపల్లె (గొడిశాల) వద్ద కాకతీయ సైన్యములు అడ్డుకొని ఎదిరించి భీకరపోరు సలిపాయి. కాకతీయ సేనానులు పోతుగంటి మైలి, రేచర్ల వెన్నభూపాలుడు, మానరంగోదిరి రాజుల మంగయ దేవుడు వీరోచితముగా పోరాడి మహ్మదీయుల దండయాత్రను త్రిప్పికొట్టి వారిని కాకతీయ రాజ్యభాగముల నుండి పారద్రోలినారు. వెలుగోటి వారి వంశావళి నందు ఈ దండయాత్ర వివరములు పేర్కొనబడినవి. వెలమసేనానులు ప్రధానంగా పోతుగంటి మైలి, రేచర్ల వెన్న అద్భుతమైన ధైర్యసాహసములు ప్రదర్శించారు. పేరును బట్టి గమనించినచో పోతుగంటి మైలి కరీంనగరము జిల్లాలోని సిరిసిల్ల సమీపమునగల ముస్తాబాద్ మండలంలోని పోతుగంటి గ్రామమునకు చెందిన వెలమ వంశజుడై యుండును. ఒక సందర్భములో కప్పము చెల్లించుటకై ఢిల్లీ వెళ్ళిన పోతుగంటి మైలి మరియు తెలుగు బిజ్జన అలాఉద్దీన్ ఖిల్జీ ఆస్థానములో తమ ఖడ్గ నైపుణ్యమును ప్రదర్శించగా సుల్తాన్ ఆశ్చర్యపోయాడు[116]. తెలుగు వీరులు కత్తిసాములో వారికి వారేసాటి. కాకతీయులకు అపారమైన సైనిక సంపద ఉండెను. కాని ఏమిలాభము? ఎన్నడు సంఖ్యాబలములో మించని ముస్లింసేనల చేతిలో తెలుగువారి సేనలు అనేక మారులు పరాజయాన్ని చవిచూశాయి. ముస్లింసేనలలోని పట్టుదల, వడిగా పరిగెత్తు అశ్వబలము, అధునాతనయుద్ధపద్ధతులు, పదునైన ఆయుధములు వారి విజయములకు కారణమయ్యాయి. అపారమైన ధనసంపదల్ని కలిగిన కాకతీయ రాజ్యమును కొల్లగొట్టుటకై అలాఉద్దీన్ ఖిల్జీ మలిక్కాపూర్ సేనానిని పంపాడు. ఇతడు 30-10-1309

తేదిన ఢిల్లీ నుండి బయలుదేరి దేవగిరి గుండా ఓరుగల్లు వైపు బయలుదేరాడు. రెండవ ప్రతాపరుద్రుడు తన 77 మంది నాయకుల నుండి దాదాపు 9 లక్షల విలుకాండ్రు (archers) 20 వేల అశ్వబలము, 100 గజబలము సేకరించి తురుష్కుల నెదిరించాడు. మలిక్కాపూర్ క్రీ.శ. 1310 జనవరి 19వ తేదిన ఓరుగల్లు కోటను ముట్టడించినాడు. ఇరువర్గములు 25 రోజులు హెూరాహెూరీగా పోరాడినాయి. ఫిబ్రవరి 12వ తేదిన మహ్మదీయులు మట్టి ప్రాకారములోని కొంతభాగమును కూల్చి రెండవ రాతి ప్రాకారమును ముట్టడించినారు. ప్రతాపరుద్రుడు సంధి చేసికొని ధనరాశులను, ఏనుగులను, తురగములను మలిక్కాపూర్ నకివ్వగా అతడు వేయిఒంటెల మీద ఈ ధనాన్ని గొనిపోయి క్రీ.శ. 1310 జూన్ 10 వ తేదిన ఢిల్లీ చేరాడు[117].

క్రీ.శ. 1316లో అలాఉద్దీన్ మరణించగానే తరువాత వచ్చిన ఢిల్లీసుల్తాన్ ముబారక్‌షాఖిల్జీ తన సేనాని ఖుస్రూఖాన్‌ను ఓరుగల్లు పైకి పంపగా ప్రతాపరుద్రుడు సంధి చేసికొన్నాడు. క్రీ.శ. 1320లో ఖిల్జీ వంశమునంతమొందించి తుగ్లక్ వంశీయుడైన ఘియాసుద్దీన్ తుగ్లక్ ఢిల్లీ సుల్తానయ్యాడు. రెండవ ప్రతాపరుద్రుడు కప్పము నిలిపి వేయగా ఢిల్లీ సుల్తాన్ తన కుమారుడైన ఉలగ్‌ఖాన్ (తరువాత కాలములో మొహ్మద్ బిన్ తుగ్లక్)ను ఓరుగల్లు పైకి పంపెను. కొన్ని మాసములు జరిగిన యుద్ధములో కాకతీయ సేనానులైన బెండపూడి అన్నయ్య, కొలనిరుద్రదేవుల ధాటికి నిలువలేక మహ్మదీయసేనలు దేవగిరికి పలాయనం చిత్తగించగా, కాకతీయ సేనాని రేవళ్ళ వంశీయుడు ఢిల్లీ రాకుమారుని తరిమికొట్టాడు. కాని ఢిల్లీ నుండి అదనపు బలగాలను వెంటబెట్టుకొని మరల ఉలగ్‌ఖాన్ క్రీ.శ. 1323లో ఓరుగల్లుపై దండెత్తాడు. ముట్టడి దాదాపు ఐదుమాసములు సాగింది. చివరకు ప్రతాపరుద్రుడు ఓడిపోయి సకుటుంబముతో ఢిల్లీ సేనలకు లొంగిపోయాడు. ఉలగ్‌ఖాన్ ప్రతాపరుద్రుని ఢిల్లీకి పంపగా మార్గమధ్యములో నర్మదానదిలో దూకి ఆత్మహత్య చేసుకొన్నాడు. దీనితో కాకతీయ సామ్రాజ్యము అస్తమించింది.

ఢిల్లీ సుల్తానులు జరిపిన అనేక దండయాత్రల్లో కరీంనగర్ జిల్లాలోని కొన్ని దేవాలయములు కొల్లగొట్టబడినాయి. శిల్పసంపద ఛిన్నాభిన్నమైంది. అనేక విగ్రహముల అంగములు ఖండించబడి శిథిలమైనాయి.

కాకతీయ యుగం ఆంధ్రుల చరిత్రలోనే గాక దక్షిణ దేశ చరిత్రలోనే ఒక దివ్యఘట్టము. వీరి కాలంలో తెలుగు వారందరూ ఒక్కటై ఒకే ప్రభుత్వ పరిపాలనలో ఉండుట చేత ప్రజలయందు సమైక్యతాభావం ఏర్పడి తమజాతి యొక్క పురోభివృద్ధికెంతో కృషిచేయడం జరిగింది.

## కాకతీయుల వంశావళి




## ముసునూరి నాయకులు

1323లో కాకతీయ సామ్రాజ్య పతనానంతరమే మొదటిసారిగా తెలుగుదేశము ముస్లిముల ఏలుబడిలోకి వచ్చి ఢిల్లీ నుండి పాలించు మహ్మద్‌బిన్‌తుగ్లక్ సామ్రాజ్యంలో భాగమయింది. మహ్మదీయులు ఓరుగల్లు నామమును సుల్తాన్‌పూర్ అని మార్చిరి. దౌలతాబాద్ (దేవగిరి)లోని వజీరు తెలుగు దేశపాలనను గావించాడు. మహ్మదీయ సేనలు హిందువులనన్ని విధములుగా పీడించి దోచుకొన్నాయి. వారి ధనమాన ప్రాణములకు రక్షణ లేకుండా పోయింది.

ఇట్టి పరిస్థితులలో ముస్లింలకు వ్యతిరేకముగా ముసునూరి ప్రోలయనాయకుడు, అతని పిన తండ్రి కుమారుడైన కాపయనాయకుడు, ఇతర నాయకులందరి సహకారముతో స్వాతంత్ర్యోద్యమానికి నాయకత్వము వహించారు. ఈ ఉద్యమములో కాకతీయుల కాలంలో నియమింపబడిన 75 నాయకులు పాల్గొనిరని క్రీ.శ. 1423 కలువచెరువు శాసనము తెలుపుచున్నది[118]. ప్రోలయనాయకుడు వేంగీ విషయవాసి అయిన పోచినాయకుని పుత్రుడు.

వీరి పూర్వీకులు ముసునూరు గ్రామవాసులై ఉందురు. ప్రోలయనాయకునికి కొలనిరుద్రదేవుని, అన్నమంత్రి అండదండలుండెను. ప్రోలయ నాయకుని రాజధాని భద్రాచలం తాలుకాలోని రేకపల్లి. ఇతనికి అద్దంకి రెడ్డి రాజ్యస్థాపకుడైన ప్రోలయవేమారెడ్డి, తెలుగు చోద భక్తి రాజు తోడ్పడినారు. ప్రోలయనాయకుడు స్వాతంత్ర్యోద్యమము నడుచుచుండగానే గతించాడు. క్రీ.శ.1332 ప్రాంతం నుంచి కాపయనాయకుడు ఈ ఉద్యమమునకు నాయకత్వము వహించాడు.

కాపయనాయకుడు 1336లో ఓరుగల్లు కోటను ముట్టడించాడు. అచట జరిగిన ఘోర సంగ్రామములో ఓరుగల్లు ఖిలేదారుగా నున్న నాయబ్ వజీరు మలిక్ మక్బూల్ ఓడిపోయి పలాయనము చిత్తగించాడు. ఇలా ముస్లింల పాలన నుండి క్రీ.శ. 1336లో అఖిలాంధ్రదేశమును విముక్త పరిచిన ముసునూరి కాపయనాయకుడు 'ఆంధ్రదేశాధీశ్వర, ఆంధ్రసురత్రాణ' బిరుదులు ధరించాడు. ఇదే సంవత్సరము క్రీ.శ. 1336లో హరిహర బుక్కరాయలు ఢిల్లీ సుల్తాన్ అధికారము ధిక్కరించి స్వతంత్ర విజయనగర రాజ్యమును స్థాపించారు. కాపయనాయకుడు మూడు దశాబ్దములకు పైగా ఓరుగల్లు నుండి ఆంధ్రదేశమును పాలించాడు. ఓరుగల్లు రాజ్యాంతర్భాగమైన కరీంనగర్ జిల్లాను గూడా ముసునూరి నాయకులే పాలించారు.

కాపయనాయకుడు ఢిల్లీసుల్తాన్ మహ్మద్ బిన్ తుగ్లక్‌కు వ్యతిరేకముగా అలాఉద్దీన్ హసన్ గంగూబహమనీకి క్రీ.శ. 1347లో గుల్బర్గా రాజధానిగా బహమనీ రాజ్యస్థాపన చేయుటలో తోడ్పడినాడు. కాని రాజ్యవిస్తరణ కాంక్షతో పొందిన ఉపకారమును మరచి అలాఉద్దీన్ హసన్‌షా దండెత్తి ఓరుగల్లు రాజ్యమునకు పడమట నున్న నిజామాబాద్ జిల్లాలోని బలిష్ఠమైన కౌలస్ గిరిదుర్గమును వశపరచుకొన్నాడు. కౌలస్ పిట్లంకు చాలా సమీపముగా నున్న దుర్భేద్యమైన గిరిదుర్గము. మరల తదనంతర కాలములో దండెత్తగా కాపయనాయకుడు 1350లో త్రిభువనగిరి (Bhongir) ని వదులుకొన్నాడు. హసన్‌షా తరువాత సుల్తానైన మహ్మద్‌షా (1358-1375) ఓరుగల్లు రాజ్యముపై దండెత్తి కాపయనాయకుని కుమారుడైన వినాయక దేవుని మట్టుపెట్టాడు. కాపయనాయకుడు 1363లో గోలకొండ దుర్గమును వదలుకొని సంధిచేసి కొని ఆభరణములను, నవరత్నములను, స్వర్ణరజతములను, వజ్ర వైడూర్యములు పొదిగిన సింహాసనమును కానుకలుగా ఇచ్చాడు. చివరకు ఓరుగల్లు ఒక సామంత రాజ్యముగా తయారై గుల్బర్గా రాజధానిగా పాలించు బహమనీలకు కప్పము కట్టుటకంగీకరించింది[119].

బహమనీ సుల్తానులతో ఓటమి చవిచూచిన కాపయనాయకుని అధికారమును ధిక్కరించి తీరస్థాంధ్రమందు అద్దంకిలో ప్రోలయ వేమారెడ్డి, రెడ్డిరాజ్యమును స్థాపించి స్వతంత్రుడైనాడు. కవిత్రయములోని ఎర్రాప్రెగ్గడ ఇతని ఆస్థానకవిగా నుండెను.

రాచకొండ రాజ్యనిర్మాత అనపోతనాయకుడు, దేవరకొండ నేలిన అతని తమ్ముడు మాదా నాయకుడు కాపయనాయకుని లెక్కచేయక ఓరుగల్లుపై క్రీ.శ. 1368లో దండెత్తారు.

భీమవరము వద్ద జరిగిన భయంకర యుద్ధములో కాపయనాయకుడు చనిపోయాడు. దీనితో ముసునూరి నాయకుల పాలన అంతరించి ఓరుగల్లు రాచకొండనేలు రేచర్ల పద్మనాయకుల వశమైంది. ఈ కాలము నందు ముప్పభూపాలుడు సబ్బిమండలం పాలకునిగా నున్నాడు. ఇతని మంత్రి కేసన మిగుల సమర్థుడు. కేసన సోదరుడైన వెలిగందుల (ఎల్గందల్) కందనకు మడికి సింగన తానువ్రాసిన పుద్మపురాణోత్తర ఖండమును అంకితమిచ్చాడు. ఈ మడికి సింగన కవిత్రయములోని తిక్కన సోమయాజి వంశములో నాలుగవ తరమువాడు. ఎల్గందుల పాలకునిగా కందనామాత్యుడుండినట్లు మడికి సింగనకావ్యములో పేర్కొనబడింది.

## రేచర్ల వెలమరాజులు

రేచర్ల పద్మనాయకులు కాకతీయ యుగమందు రాజకీయంగా ప్రధానపాత్ర వహించారు. రేచర్ల వెలమల జన్మస్థానం పిల్లలమర్రి, అనుమనగల్లు (అమనగల్లు) ప్రాంతమే. వీరినే పద్మవెలమలంటారు. వీరు రెండు శాఖలుగా నల్గొండ జిల్లాలోని రాచకొండ, దేవరకొండ రాజధానులుగా పాలించారు. వెలుగోటివారి వంశావళి చరిత్ర ఆధారంగా బేతాళరెడ్డి రేచర్ల వంశ మూలపురుషుడు. ఆ రోజులలో గ్రామపాలనాధికారిని 'రడ్డి లేదా రెడ్డి' యని పిలిచెడివారు. వెలమ వంశజుడైన భేతాళ నామము చివర రెడ్డి పదము అలాగే వచ్చి ఉంటుంది. కావున బేతాళ రెడ్డిని నేటి గుడేటి, మొటాటి మొదలగు కాపురెడ్లతో పోల్చుటకు వీల్లేదు. ఈ రేచర్ల భేతాళరెడ్డి కులోద్భవులైన వెలమనాయకులు దామానాయుడు, ప్రసాదిత్యనాయుడు, రేచర్ల రుద్రనాయకుడు గణపతి దేవచక్రవర్తి సేనానులుగా నుండిరి. వీరిలోని రేచర్ల రుద్రనాయకుడే క్రీ.శ. 1213లో పాలంపేట రామప్ప దేవాలయమును నిర్మించాడు. రెండవ ప్రతాపరుద్రుడు తన రాజ్యమును 77 భాగాలుగా విభజించి అంతకు పూర్వమున్న నాయకులను తొలగించి వారి స్థానంలో పద్మనాయక వంశస్థులను నాయకులుగా నియమించినాడు. ఓరుగల్లు కోట బురుజుల సంరక్షణకు, పర్యవేక్షణకు వెలమలే నియమింపబడినారు. దేశంలోని ఒక్కొక్క స్థలం (నాడు) ఒక్కొక్కనాయకుని క్రింద ఉండేది. ఈ నాయకులందరూ వెలమలే యని చెప్పలేము. కాని చాలామట్టుకు ప్రతాపరుద్రుడు వారికే ప్రాధాన్యత ఇచ్చినట్లు తెలియుచున్నది. స్థానిక చరిత్రలు నాయకుల సంఖ్య 77 కాదని 75 నాయకులు మాత్రమే అని తెలుపుచున్నాయి[120].

రేచర్ల దామానాయుని కుమారుడు వెన్నమనాయకుడు సబ్బిమండల నాయకుడు (ruler of Karimnagar region) గా ఉండెను[121]. అలాఉద్దీన్ ఖిల్జీ సైన్యములు తెలంగాణముపై దండెత్తగా రేచర్ల వెన్నమనాయకుడు, పోతుగంటిమైలి మున్నగు సేనానులు వీరోచితముగా పోరాడి ఢిల్లీ తురుష్క సైన్యములను ఓడించి పారద్రోలారు. ఈ యుద్ధము 1303లో హుజూరాబాద్‌కు సమీపమున సైదాపూర్ మండలమందున్న ఉప్పరపల్లి (గొడిశాల) వద్ద జరిగింది.

వెన్నమనాయకుని కుమారుడు ఎరదాచానాయకుడు. ఈ ఎరదాచానాయకుని

కుమారులు సింగము, వెన్నమ మరియు పచమనాయకులు. దాచానాయకుడు, అతని కుమారుడు సింగమ నాయకుడు కాకతి ప్రతాపరుద్రుని సేనానులుగా (Generals) ఉండిరి. సింగమనాయకుడు ఓరుగల్లు కాపయనాయకుని ఆధిపత్యమును వ్యతిరేకించాడు. సింగమనేడు తన అధికార విస్తరణప్రయత్నములో జిల్లపల్లి కోటను ముట్టడించి సోమవంశ క్షత్రియుల చేతిలో మరణించాడు.

సింగమనాయకునికి అనపోతానాయకుడు, మాదానాయకుడని ఇరువురు కుమారులు. వీరిరువురు తమ తండ్రిని చంపిన వారిపై పగ సాధించుటకై క్రీ.శ. 1361లో జిల్లపల్లి కోటను ముట్టడించి పరశురామునివలె అందలి సోమక్షత్రియులను హతమార్చి అనుమనగంటికి తిరిగి చేరుకొనిరి. ఈ ముట్టడి సందర్భములో కొందరు సోమక్షత్రియులు పారిపోయి కరీంనగర్ జిల్లాలోని హుజురాబాద్‌కు సమీపమున కేశవపట్నం మండలమందున్న మొలంగూరు కోటనాశ్రయించి తలదాచుకొన్నారు. ఈ పటిష్ఠమైన గిరి దుర్గములో తలదాచుకొనిన క్షత్రియులు చుట్టు ప్రక్కల గల మాండలీకుల సహాయమర్థించారు. ఎల్గందుల, రామగిరి, పొలాస దుర్గాధీశులు తమ సైన్యములను సోమక్షత్రియుల సహాయార్థమై పంపారు ఈ సైన్యములను అన్నింటిని శార్వరి సంవత్సర కార్తీక శుద్ధమందు క్రీ.శ. 1361లో మానకొండూరు మండలములోని చెంజర్ల గ్రామ సమీపమున జరిగిన యుద్ధములో రేచర్ల అనపోతానాయకుడు, మాదానాయకుడు భీకరంగా పోరాడి కనిపించిన ప్రతిక్షత్రియుని సంహరించి పితృఋణము దీర్చుకొన్నారు.[122] సహాయపడిన దుర్గాధీశులు ఓడిపోయి పారిపోయారు. పొలవాస దుర్గాధీశుడెవరో చెప్పలేము. క్రీ.శ.1159 లో పొలాస ఓరుగల్లు రాజ్యము క్రిందికి పోయింది.

అనపోతానాయకుడు రాచకొండ రాజ్యనిర్మాత. తన రాజధానిని అనుమనగంటి నుండి రాచకొండకు మార్చాడు. రాచకొండ రాజ్యములోని దక్షిణ భాగాన్ని పరిపాలించుటకై తన సోదరుడు మాదానాయకుని దేవరకొండలో నిలిపి అతనికి పట్టము గట్టాడు. అప్పటి నుండి అనపోతానాయకుని సంతతివారు రాచకొండ నుండి, మాదానాయకుని సంతతి వారు దేవరకొండ నుండి రాజ్యమేలారు. ఎల్లప్పుడు రెండు రాజ్యములు అన్యోన్యముగా ఉండేవి. రాచకొండ రాజ్యము ప్రధానమైనదిగా నుండి దేవరకొండ రాజ్యము దానికి లోబడియుండేది. అనపోతానాయకుడు రాచకొండ దుర్గమును పటిష్ఠపరచి తనరాజ్యమందు తటాకములు నిర్మించి ప్రజానురంజకముగా పాలించాడు.

అనపోతానాయకుడు ఓరుగల్లునేలు మునునూరి కాపయనాయకుని అధికారము ధిక్కరించి క్రీ.శ. 1368లో అతనిపై దండెత్తాడు. కాపయనాయకుడు సైన్యసమేతుడై అనుమకొండ సమీపమున నున్న భీమవరము వద్ద రేచర్ల పద్మనాయకుల నెదరించాడు. ఈ భీకరయుద్ధములో ఇరువైపుల సైనికులలో నధికులు మరణించారు. అనపోతానాయకుడు యుద్ధరంగములో సూర్యతేజసంపన్నుడై తనతో పోరాడుచున్న కాపయనాయకుని సంహరించాడు. ఇంతటితో మునునూరి నాయకుల పరిపాలన మంతరించింది. అనపోతానాయకుడు ఓరుగల్లు నాక్రమించి

ఐనవోలు మైలారదేవుని దర్శించి తనవిజయ సూచకముగా 1369లో ఒక శాసనాన్ని వేయించి దేవునకగ్రహారం ఇచ్చాడు. త్రిభువనగిరిని జయించి అనపోతానాయకుడు త్రిభువనరాయరావు బిరుదు ధరించాడు[123].

రేచర్ల పద్మనాయకుల రాజ్యము ఉత్తరానగోదావరినది నుండి దక్షిణాన కృష్ణానది వరకు వ్యాపించినందున, ఈ రెండింటి మధ్యనున్న సబ్బినాడు ప్రాంతమంతయు (కరీంనగరము జిల్లా) వారి ఏలుబడిలో ఉండేది. కరీంనగర్ జిల్లాలోనున్న శనిగరం గ్రామశివాలయము ముందున్న శిలాస్తంభముపై నాలుగుప్రక్కల చెక్కబడియున్న శాసనమందు రేచర్లకులోద్భవుడైన వెన్నమనాయకుని, అనపోతానాయకుని పేర్లు పేర్కొనబడినవి. శాసనమందు నాలుగు ప్రక్కల మొత్తము 60 పంక్తులున్నవి. కాని అక్షరములు చెదరిపోవుట వలన శాసన విషయము స్పష్టమగుటలేదు. రేచర్ల వెలమ ప్రభువులకు కరీంనగరము జిల్లాపై ఆధిపత్యముండెననుటకు ఈ శనిగర శాసనమే తార్కాణము[124].

క్రీ.శ. 1397లో ఫిరోజ్ షా బహమనీసుల్తాన్ అయ్యే మట్టుకు రేచర్ల పద్మనాయకులు గుల్బర్గాతో సత్సంబంధములనే కలిగి ఉండి కాపయ నాయకుని కాలములో ఒప్పుకొనిన కప్పము ఏటేట చెల్లిస్తూనే ఉండిరి. ఫిరోజ్‌షా (1397-1422) అనంతరం అతని సోదరుడు మొదటి అహ్మద్‌షా (క్రీ.శ. 1422-1436) సుల్తానయ్యాడు. ఇతడు క్రీ.శ.1424 లో బహమనీల రాజధానిని గుల్బర్గా నుండి బీదర్‌నకు మార్చెను. తత్ఫలితంగా ఓరుగల్లు కొంత దగ్గరయ్యెను. ఇతడు తన సేనాని అజీమ్‌ఖాన్‌ను క్రీ.శ. 1425లో ఓరుగల్లుకోట ముట్టడికై పంపాడు. రెండవ అనపోతానాయకుడు యుద్ధంలో చనిపోయాడు. మొదటి అహ్మద్‌షా స్వయముగా ఓరుగల్లునకు వచ్చి అచటి భాండాగారమున నున్న ద్రవ్యమునంతయు దోచుకొన్నాడు. ఈ దండ యాత్రలో కోటలోని దేవాలయములన్నియు ధ్వంసమైనాయి. అహ్మద్‌షా అజీమ్‌ఖాన్‌ను తెలంగాణములోని ఇతర దుర్గముల నన్నింటిని జయించుటకై పంపాడు. అజీమ్‌ఖాన్ అనేక చోట్ల దేవాలయములను ధ్వంసము చేశాడు. ఈ సందర్భములోనే ధర్మపురి దేవాలయములు క్రీ.శ. 1425లో ధ్వంసము చేయబడినట్లు తెలియుచున్నది[125]. అనేక చోట్ల శిల్పములు ఛిన్నాభిన్నము చేయబడినవి. రాచకొండ రాజ్యము కొల్లగొట్టబడింది. తెలంగాణా ప్రాంతమునంతయు కొల్లగొట్టి నాలుగుమాసముల తరువాత అజీమ్‌ఖాన్ తిరిగి ఓరుగల్లు చేరుకొన్నాడు. రాచకొండ, దేవరకొండ వెలమలు అహ్మద్‌షాతో సంధి చేసికొన్నారు. అహ్మద్‌షా అజీమ్‌ఖాన్‌ను ఓరుగల్లు పాలకునిగా నియమించి బీదర్‌కు మరలిపోయాడు. కొందరు వెలమలు చుట్టుప్రక్కల ప్రాంతములకు పోయి చిన్న చిన్న ప్రాంతములపై ఆధిపత్యము సంపాదించారు. కొంతకాలమునకు వెలమరాజులు అజీంఖాన్ పై దండెత్తి, అతని నోడించి ఓరుగల్లును తిరిగి వశపరచుకొన్నారు. ఇది సహింపలేని సుల్తాన్ మొదటి అహ్మద్‌షా క్రీ.శ. 1433లో మరల తెలంగాణముపై దండెత్తి తిరుగుబాటు నణచి వేశాడు. కరీంనగర్ జిల్లాలోని రామగిరి దుర్గము అహ్మద్‌షా వశమైంది. అతడు సేనాని

సంజర్‌ఖాన్‌ను సర్‌లష్కర్‌గా నియమించి త్రిభువనగిరి లేదా భువనగిరిలో ఉంచాడు. రేచర్ల మూడవ లింగమనేడు మరియు స్థానిక వెలమనాయకులు సబ్బినాడు (కరీంనగర్ జిల్లా) నేలు సికిందర్‌ఖాన్ తన సుల్తాన్ పై తిరుగబడగా అతనిని ఈ ప్రాంతము నుండి తరిమి వేయుటకు అహ్మద్‌షాతో సహకరించారు[126].

రాచకొండ, దేవరకొండ వెలమరాజులు ఒకప్పుడు బహమనీ సుల్తానుల పక్షములోను, మరొకప్పుడు విజయనగరాధీశుల పక్షములోను, ఇంకొకప్పుడు ఒరిస్సా గజపతుల పక్షములోను అవసరమును బట్టి, అవకాశమును బట్టి చేతులు కలిపి వారి వారి శత్రువులతో పోరాడేవారు. బహమనీ సుల్తాన్ హుమాయూన్ (1458-1461) ఓరుగల్లుపై దండెత్తగా లింగమనేడు గజపతుల సహాయం కోరాడు. కపిలేశ్వరగజపతి తన తనయుడైన హంవీర గజపతిని, రఘుదేవ గజపతిని వెలమలకు సహాయముగా సైన్యమునిచ్చి పంపాడు. 1461లో జరిగిన యుద్ధములో వీరు ఓరుగల్లు, దేవరకొండ దుర్గములను ముస్లింలనుండి విముక్తం చేశారు[127]. కపిలేశ్వర గజపతి క్రీ.శ. 1470లో మరణించగానే అతని కుమారులు హంవీరుడు, ప్రతాపరుద్రగజపతి సింహాసనమునకై తగవులాడుకోగా అంతర్యుద్ధములో హంవీరుడు బహమనీ సుల్తాన్ మూడవ మహ్మద్‌షా (క్రీ.శ. 1463-1482) సహాయముతో ప్రతాపరుద్ర గజపతి నోడించి తాను గజపతి అయినాడు. ఈ సహాయానికి ప్రత్యామ్నాయంగా హంవీరుడు తెలంగాణము నంతయు బహమనీ సుల్తాన్‌లకు వదలుకొన్నాడు. క్రీ.శ.1475 నాటికి బహమనీలు తెలంగాణము నంతయు వశపరచుకొన్నారు. ఆ తరువాత వెలమరాజులుగాని, గజపతులుగాని తెలంగాణా రాజకీయాలలో తిరిగి కనిపించలేదు.

వెలమప్రభువులు ఓరుగల్లును ఒక శతాబ్దమునకు పైగా ఏలారు. బహమనీలతో జరిగిన యుద్ధములందు ఓరుగల్లు అప్పుడప్పుడు ముస్లింల స్వాధీనమైనప్పుడు వెలమనాయకులు కొందరు చుట్టుప్రక్కల ప్రాంతములకు పోయి చిన్న చిన్న సంస్థానములను ఏర్పరచుకొన్నారు. వరంగల్ జిల్లా నానుకొని ఉత్తరమునందున్న సబ్బినాడు (కరీంనగర్ జిల్లా)లో గూడా ప్రవేశించారు. తెలంగాణములోని ఇతర జిల్లాల కంటే కరీంనగర్ జిల్లాలో వెలమల ప్రాబల్యము, వారి సంఖ్య అధికముగా నున్నది. వీరి నామముల చివర నాయుడు, నేడు, నాయకుడను పదములకు బదులు వీరందరికి రాయడు, రావు అను పదములు చోటుచేసికొన్నాయి. ఓరుగల్లు రాజ్యపతనానంతరము, వెలమలు కొందరు చిన్న చిన్న నాయకులుగా సబ్బినాడు నందు స్థిరపడి తమ ప్రాబల్యమును పెంచుకొన్నారు. జువ్వాడి, జూపూడి, ఇనుగంటి, జూపల్లి వెలమ వంశస్థులు వేయించిన నాలుగు శాసనములు కరీంనగరము జిల్లాలో గుర్తింపబడినవి[128]. ఈ జిల్లాలోని వెలమ దొరలు దేవాలయముల పునరుద్ధరించి, నూతనముగా కొన్నింటిని కట్టించి వాటి పోషణకై దానములిచ్చారు.

క్రీ.శ.1613 ఎప్రిల్ 15వ తేదిన వేయించిన వెలమల శాసనమొకటి మెటుపెల్లి మండలములోని వెల్లుల్ల గ్రామమందున్నది. శాలివాహన శక 1535, ప్రమాది, వైశాఖ శుద్ధ

పంచమి గురువారము రోజున పద్మనాయక శిఖామణి రాజ ఇనుంగంటి తిమ్మజగదేవరాయని కుమారుడు శ్రీ వెంగళజగదేవుని ముతాలికుడు వెలమకుల వార్ధి చంద్రుండగు శ్రీ జువ్వాడి మాధవరాయుని కుమారుడు దళపతిరాయదు నాగుల తటాకము యొక్క తూమును పుప్పాల అంకయ్య కుమారుడు మిన్నయ్యచే స్థానిక నృసింహస్వామి ప్రీత్యర్థము కట్టించినాడని ఈ శాసనము తెలుపుచున్నది. ఈ శాసనమందు ఇనుంగంటి మరియు జువ్వాడి వెలమ వంశస్థుల ప్రసక్తి కలదు. నేటికిని జగిత్యాల మండలంలోని చలిగంటి లేదా చల్‌గల్, ధర్మపురి మండలంలోని తిమ్మాపురం, కరీంనగర్ మండలములోని ఇరుకుల్ల మున్నగుచోట్ల జువ్వాడి వెలమ వంశస్థులున్నారు. ఆం.ప్ర. రాష్ట్రమంత్రిగా, పార్లమెంటు సభ్యునిగా నుండిన కీ.శే. జువ్వాడి చొక్కారావు, కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ సాన్నిహిత్యములో నుండి వారి రామాయణ కల్పవృక్షములోని ఘట్టములను మధురంగా, శ్రావ్యంగా గానము చేయుచు రసజ్ఞులకు వినిపించుచున్న గౌతమరావు, బుగ్గారం శాసనసభ్యులుగా నున్న రత్నాకర్‌రావు మాజీ పార్లమెంట్ సభ్యులు రమాపతిరావు మున్నగు వారందరు జువ్వాడి వెలమ వంశజులే యగుట గమనార్హము.

వీరి రెండవ శాసనము ధర్మపురి బ్రహ్మపుష్కరిణి మధ్యనున్న మంటప స్తంభముపై క్రీ.శ. 1644లో చెక్కబడింది. శాలివాహనశక 1566, పార్థివ, వైశాఖ శుద్ధ త్రయోదశి సోమవారము రోజున వేయబడిన ఈ శాసనము, జూపల్లి ధర్మారాయదు బ్రహ్మపుష్కరిణి చుట్టు సోపానములు కట్టించి, పుష్కరిణి మధ్యలో వేదిక నిర్మాణము గావించగా దానిపై చింతల నరుసాబోయిని కుమారుడు తిర్మలయ్య భోగమంటపము కట్టించి, పుష్కరిణి చుట్టు ప్రాకారము (పిట్టగోడ) నిర్మించెనని తెలుపుచున్నది.

వెలమల మూడవశాసనము జగిత్యాల సమీపమున, గొల్లపెల్లి మండలములోని తిర్మలాపురం హ్యామ్లెట్ మల్లన్నపేటలో క్రీ.శ. 1753లో వేయబడింది. శాలివాహన శక 1675, భవనామ, మాఘశుద్ధ విదియ గురువారము జూపూడి ధర్మారావు దేశ్‌ముఖ్ తిర్మలాపురం (మల్లన్నపేట) మల్లన్న దేవుని పూజ చేయుటకు పూలవనము వేసి, ఆ పూలతో దేవుని అర్చించుటకు ఫర్గణా పొలాస నివాసి తమ్మడి వెన్నజియ్యకు 12 కుంచాల వద్ద పడుబాటు పొలమును దానముగా నొసంగెను. పూజారి తిర్మలాపురం నందే ఉండవలెనని కట్టడి చేసినట్లు ఈ శాసనంలో ఉంది.

వెలమల నాలుగవ చిన్న శాసనము హుజూరాబాద్ సమీపముననున్న కమలాపురము నందు గల రామాలయములో నున్నది. రౌద్రి మాఘ బహుళ షష్ఠి గురువారము నాడు జూపల్లి రంగపతి ధర్మారాయనింగారి దానశాసనమిది. ఇందులో శకసంవత్సర సంఖ్యగాని ఇతర వివరములు గానీ లేవు.

పై నాలుగు శాసనములను బట్టి కరీంనగరము జిల్లాలో వెలమదొరలు దేవాలయముల పోషణగావించినట్లు స్పష్టమగుచున్నది. నిజాం నవాబుల పాలనలో మొన్నమొన్నటి వరకు అనేక

మంది వెలమలు జాగీర్దారులుగా, మక్తేదారులుగా, దేశ్‌ముఖ్‌లుగా, వతందారులుగా గ్రామాలను పాలించారు.




## ఏది తెలంగాణము?

హైద్రాబాద్ జిల్లాతో కలిపి పదిజిల్లాలను కలిగి ఉన్న ప్రాంతమునే నేడు తెలంగాణమని పిలుచుచున్నాము. నిజాం నవాబుల కాలములో పాత హైద్రాబాద్ రాష్ట్రములో తెలంగాణము, మరఠ్వాడ యని రెండు ప్రధాన భాగములుండెను. చివరి ఏడవ నిజాం నవాబు మీర్ ఉస్మాన్ అలిఖాన్ పరిపాలనా కాలములో (క్రీ.శ. 1911–1948) పాత హైద్రాబాద్ రాష్ట్రమునందు 16 జిల్లాలు, మూడు భాషా ప్రాంతములుండెను. వరంగల్, కరీంనగర్, ఆదిలాబాద్, నిజామాబాద్,

మెదక్, మహబూబ్‌నగర్, నల్గొండ మరియు హైద్రాబాద్ 8 జిల్లాల ప్రాంతమును తెలంగాణమనేవారు, నాందేడ్, పర్భని, ఔరంగాబాద్, బీడ్, ఉస్మానాబాద్, ఐదు జిల్లాలను మరత్వాడా అనియు, బీదర్, గుల్బర్గా, రాయచూరు మూడు జిల్లాలను కర్ణాటక ప్రాంతమనియు పిలిచేవారు. 1953లో ఖమ్మంజిల్లా మరియు డా. మర్రిచెన్నారెడ్డి ముఖ్యమంత్రిగా నున్నకాలములో రంగారెడ్డి జిల్లా, నూతనంగా ఏర్పడినాయి. నేడు పదిజిల్లాలతో కూడుకొని యున్న ప్రాంతమును తెలంగాణ అంటున్నాము. కాని మధ్యయుగములో తెలంగాణమను పధమును విస్తృతార్థములో ఉపయోగించినారు.

ఢిల్లీసుల్తాన్ అలాఉద్దీన్ ఖిల్జీ (క్రీ.శ. 1296–1316) కాలములో, మొహ్మద్ బిన్ తుగ్లక్ (క్రీ.శ. 1325–1351) కాలములో, బహమనీసుల్తాన్‌ల కాలములో (క్రీ.శ. 1347–1538) తెలుగు వారిపై దండెత్తిన ప్రతిసారి వారు తిలింగ (Tilinga) లేదా తెలంగాణము పై దండెత్తినట్లుగా పేర్కొన్నారు. మధ్యయుగపు చరిత్రలు వ్రాసిన రచయితలు మరియు హెచ్.కె. షేర్వాని లాంటి చరిత్రకారులు గూడా ఆనాటి తెలుగునాడును, తెలుగుదేశమును, తెలుగుభాషా ప్రాంతమునంతయు విస్తృతార్థములో తెలంగాణమనియే వాడినారు. ఆనాటి తెలుగు ప్రాంతమునకు కేంద్రము ఓరుగల్లు. ఆనాటి తెలంగాణ మందు నేటి కోస్తాంధ్ర ప్రాంతము గూడా ఉండేది. రాయలసీమ జిల్లాలు మాత్రము విజయనగర రాయల అధీనములో ఉండేవి. విస్తృతార్థములో తెలుగుబాష మాట్లాడు వారి ప్రాంతమునంతయు తెలంగాణమనియే భావించారు. ఆనాటి తెలంగాణము నందు కొండవీడు, రాజమహేంద్రవరము రాజ్యములు గూడా అంతర్భాగములై ఉన్నాయి. బహమనీసుల్తాన్ మూడవ మహ్మద్‌షా కాలములో (క్రీ.శ. 1463–1482) ప్రధానమంత్రిగా నున్న మహమూద్‌గావాన్ పరిపాలనా సౌలభ్యమునకై సువిశాల బహమనీ సామ్రాజ్యమును 8 సర్‌లష్కర్‌లుగా (Eight administrative Units) పునర్వ్యవస్థీకరించాడు. మధ్యయుగములోని తెలంగాణమును ఓరుగల్లు, రాజమహేంద్రవరము కేంద్రములుగా రెండు విభాగముల క్రింద మహమూద్ గావాన్ విభజించాడు[129]. దీనిని బట్టి ఈ విభజనకు పూర్వము తెలంగాణమందు రాజమండ్రి అంతర్భాగమై యుండెనని తెలియుచున్నది.

క్రీ.శ. 1518లో కుతుబుల్ ముల్క్ సుల్తాన్‌కులీ గోలకొండలో కుతుబ్‌షాహీల స్వతంత్ర రాజ్యస్థాపన చేసినప్పటి నుండి తెలుగు ప్రాంతమునకు గోలకొండ రాజ్యమని పేరొచ్చింది. కావున మధ్యయుగంలో విస్తృతార్థమున్న తెలంగాణాకు, నేడు పది జిల్లాలతో కూడుకొని యున్న తెలంగాణాకు మధ్య గల వ్యత్యాసాన్ని గమనించాలి.

## విజయనగర రాజులు

ఢిల్లీ సుల్తాన్ మొహ్మద్ బిన్ తుగ్లక్ అధికారమును ధిక్కరించి సోదరులు హరిహరరాయలు, బుక్కరాయలు క్రీ.శ. 1336లో స్వాతంత్ర్యము ప్రకటించి విజయనగర రాజ్యము స్థాపించారు.

క్రీ.శ. 1336 ఏప్రిల్ 18 రోజున వైదిక ధర్మానుసారంగా మొదటి హరిహరరాయలు పట్టాభిషిక్తుడైనాడు. విద్యారణ్యస్వామి సలహా మేరకు క్రీ.శ. 1336లో తుంగభద్రానది తీరమున ప్రారంభించిన నూతన పట్టణ నిర్మాణము క్రీ.శ. 1344 లో పూర్తి గావింపబడెను. అదియే రాజధాని విజయనగరము (City of Victory) మరియు విద్యానగరము (City of Learning) మొదటి హరిహరరాయలు (క్రీ.శ.1336–1356) మొదటి బుక్కరాయలు (క్రీ.శ.1356–1377) ఒకరి తరువాత నొకరు విజయనగర రాజ్యాన్నేలారు. తరువాత రాజ్యమునకు వచ్చిన రెండవ హరిహరరాయలు (క్రీ.శ.1377–1404) పెక్కు యుద్ధములు చేసి, విజయములు సాధించి విజయనగర రాజ్యమును విస్తరింపజేశాడు.

ప్రప్రథమము నుండి విజయనగరరాజులు, బహమనీ సుల్తానులు బద్ధ విరోధులు. ఓరుగల్లు, రాచకొండ, దేవరకొండ నేలు రేచర్ల వెలమలు బహమనీ సుల్తానులతో ఒడంబడిక చేసికొని ఏటేటా కప్పము చెల్లించుచు వారితో సఖ్యతగా నుండుట విజయనగరాధీశులకు గిట్టలేదు. అందువలన రెండవ హరిహరరాయలు తన కుమారుడైన మొదటి దేవరాయలను సైన్యముతో తెలంగాణముపై దండెత్తుటకు పంపాడు. ఈ యుద్ధములో రాచకొండ, దేవరకొండ రేచర్ల వెలమలనోడించి దేవరాయలు తన సైన్యముతో ఉత్తరముననున్న గోదావరి తీరము వరకు చేరాడు. ఈ సందర్భములో అతడు క్రీ.శ. 1397 ఫిబ్రవరి 28వ రోజున కాళేశ్వరములోని ముక్తేశ్వరాలయములో తానుపొందిన విజయములకు సూచకముగా సంస్కృతము నందు ఆరుపంక్తుల శాసనమొకటి వేయించాడు[130]. శకసంవత్సరము 1319, ఈశ్వర చైత్ర శుద్ధ పాడ్యమి బుధవారము నూతన వత్సరాది పర్వదినమున గౌతమీ తటమున (గోదావరి నది తీరమున) నున్న కాళేశ్వర దేవరకు విజయనగరాధీశుడైన రెండవ హరిహరరాయల తనయుడు మొదటి దేవరాయలు తులాపురుషదానమిచ్చాడు. హిందూ ధర్మ శాస్త్రములు తెలుపునట్లుగా పదహారు మహాదానములలో తులాపురుషదానమొకటి. సాధారణంగా దీనిని రాజన్యులు, ప్రభువులు మాత్రమే నిర్వహించి తమ బరువును తూకము వేసి దానికి సమానమైన బంగారాన్ని దానం చేస్తారు. ఈ దానము సామాన్యులకు అసాధ్యము. దీనికి ప్రత్యామ్నాయముగా సామాన్యులు చక్కెర, బెల్లము, ధాన్యములతో తులాభారపు మొక్కుబడులు నేటికి నిర్వహించుచునేయున్నారు.

జగిత్యాలకు సమీపమున గల గుట్టరాజపల్లి గ్రామమందు క్రీ.శ. 1972లో ఒక కుప్ప (hoard) యందు విజయనగర రాజుల కాలపు 31 బంగారు నాణెములు దొరికాయి[131]. విజయనగర ప్రభువులకు కొంతకాలము ఈ ప్రాంతముపై అధికారముండెననుటకు లభ్యమైన వీరి కాలపు నాణెములే ఆధారములు.

ఓరుగల్లు రాజ్యమునకు పడమట బహమనీ రాజ్యము, తూర్పున గజపతులరాజ్యము, దక్షిణమున విజయనగర రాజ్యము సరిహద్దు రాజ్యములుగా ఉండేవి. రాజకీయముగా వీటి మధ్య పోటీ ఉండేది. బహమనీ సుల్తాన్‌లు తరచుగా ఓరుగల్లు రాజ్యముపై దండెత్తి, అక్కడి

ప్రాంతములను కొల్లగొట్టి దేవాలయములను ధ్వంసము చేసి, సంపదనంతయు దోచుకొని తిరుగుముఖం పట్టేవారు. అలాంటి బహమనీలకు ఓరుగల్లు రాజ్యముతో నున్న సంబంధమును క్లుప్తముగా కొంత అధ్యయనము చేయుట అవసరము. ఎందుకనగా కరీంనగర్ జిల్లా ఓరుగల్లు రాజ్యాంతర్భాగమగుటచే, దానిపై జరిగిన దండయాత్రల, ఓటమి గెలుపుల ప్రభావము ఈ ప్రాంతముపై కూడా పడినదనుటలో సందేహము లేదు.

## బహమనీ సుల్తాన్‌లు

ఢిల్లీ సుల్తాన్ మొహ్మద్ బిన్ తుగ్లక్ అధికారమును ధిక్కరించి, దౌలతాబాద్ నుండి అతని సేనలను త్రిప్పికొట్టి అలాఉద్దీన్ హసన్ గంగూబహమనీ క్రీ.శ. 1347 ఆగస్టు 3 శుక్రవారము రోజున పట్టాభిషిక్తుడై స్వతంత్ర బహమనీ రాజ్యాన్ని స్థాపించాడు. గుల్బర్గాను తన రాజధానిగా చేసి నూతన భవనముల నిర్మాణము గావించి, నగరాన్ని సర్వాంగ సుందరంగా దిద్దాడు. బహమనీ రాజ్యస్థాపన కాలములో ఓరుగల్లు నేలు ముసునూరి కాపయనాయకుడు అలాఉద్దీన్ హసన్‌షా కు తోడ్పడినాడని ఇసామి వ్రాశాడు. ఈ ఉపకారమును మరచి రాజ్య విస్తరణ కాంక్షతో అలాఉద్దీన్ హసన్‌షా తెలంగాణముపై దండెత్తాడు. అతడు బహమనీ రాజ్యమునకు తూర్పు సరిహద్దున నున్న బలిష్ఠమైన కౌలస్ గిరిదుర్గమును మరియు ఇందూరు గిరిదుర్గమును (నిజామాబాద్) వశపరచుకొన్నాడు. కౌలస్ నిజామాబాద్ జిల్లాలోని బాన్సువాడా, పిట్లం గ్రామములకు సమీపమున నున్న ఎత్తైన గిరిదుర్గము. క్రీ.శ. 1350లో మరల కాపయనాయకునిపై దండెత్తగా అతడు అలాఉద్దీన్ హసన్ షా తో సంధి చేసికొని త్రిభువనగిరి లేదా భువనగిరి గిరిదుర్గమును వదులుకొన్నాడు.

అలాఉద్దీన్ హసన్ గంగూ బహమనీ (క్రీ.శ.1347-1358) అనంతరము అతని కుమారుడు మొదటి ముహ్మద్‌షా (క్రీ.శ.1358-1375) సుల్తానయ్యాడు. ముసునూరి కాపయనాయకుడు విజయనగర బుక్కరాయలతో ఏకమై తాను గోల్పోయిన కౌలస్ దుర్గమును తిరిగి వశపరచుకొనుటకు ప్రయత్నించాడు. ఈ సంగతి తెలిసిన ముహ్మద్‌షా ఓరుగల్లుపై దండెత్తాడు. కాపయనాయకుని కుమారుడు వినాయకదేవుడు సుల్తాన్‌కు పట్టుబడి అతడి దూకుడుచర్యల ఫలితంగా వధింపబడినాడు. కాపయనాయకుడు ముహ్మద్‌షాకు వ్యతిరేకముగా దౌలతాబాద్ తరఫ్‌దార్‌నుండి, ఢిల్లీ సుల్తానైన ఫిరోజ్‌షా తుగ్లక్ నుండి సైనిక సహాయమర్థించి విఫలుడైనాడు. దీనితో బహమనీ సుల్తాన్ మండిపడి ఓరుగల్లు, గోలకొండ దుర్గములను ముట్టడించాడు. చేయునది లేక కాపయనాయకుడు క్రీ.శ. 1363లో ముహ్మద్‌షా తో సంధి చేసికొని అపారమైన ధనరాశులను, వజ్రవైడూర్యములతో పొదిగిన సింహాసనం (Turquoise throne) తో పాటు గోలకొండ దుర్గాన్ని కూడా వదులుకొన్నాడు. గోలకొండ దుర్గము మొదటిసారిగా బహమనీల వశమైంది.

మొదటి ముహ్మద్‌షా సమర్థుడైన పాలకుడు. 20వేల మంది దోపిడి దొంగలను వధించి శాంతి భద్రతలు నెలకొలిపాడు. గుల్బర్గాలోని పెద్ద మసీదును కట్టించాడు. ఇతని తరువాత వరుసగా సుల్తానులైన ముజాహిద్‌షా (క్రీ.శ. 1375-1378) రెండవ ముహ్మద్‌షా (క్రీ.శ. 1378-1397) ఫిరోజ్‌షా (క్రీ.శ. 1397-1422)లకు ఓరుగల్లు పాలకులైన రేచర్ల వెలమ రాజులు ఏటేట కప్పము కడుతూనే ఉండిరి.

బహుమనీ సుల్తాన్ మొదటి అహ్మద్‌షా (క్రీ.శ.1422-1436) తన రాజధానిని 1424లో గుల్బర్గా నుండి బీదర్‌కు మార్చాడు. విజయనగరము సరిహద్దుకు సమీపముగా నుండుటచే గుల్బర్గాకు భద్రత తక్కువయని దూరాననున్న బీదర్‌కు రాజధానిని మార్చియుండును. ఇతడు తన సేనాని అజీమ్‌ఖాన్‌ను 1425లో ఓరుగల్లుపై దండెత్తుటకు పంపాడు. రేచర్ల వెలమరాజు రెండవ అనపోతానాయకుడు యుద్ధమునందు ప్రాణాలు వదిలాడు. సుల్తాన్ అహ్మద్‌షా స్వయముగా ఓరుగల్లునకు వచ్చి ధనాగారములో నున్న ద్రవ్యమునంతయు వశపరచుకొన్నాడు. అజీమ్‌ఖాన్‌ను తెలంగాణాలోని ఇతర దుర్గములను జయించుటకై పంపాడు. అతడు తెలంగాణాము నంతయు కొల్లగొట్టి నాలుగు మాసముల తరువాత ఓరుగల్లు చేరుకొన్నాడు. ఈ సందర్భములోనే 1425లో ధర్మపురి దేవాలయములు ధ్వంసమైనాయి. రేచర్ల వెలమరాజులు మొదటి అహ్మద్‌షా సుల్తాన్‌తో సంధి చేసికొన్నారు. అతడు అజీమ్‌ఖాన్‌ను ఓరుగల్లు పాలకునిగా నియమించి బీదర్‌కు తిరిగి పోయాడు. కొంతకాలమునకు వెలమ రాజులు అజీమ్‌ఖాన్‌పై తిరుగబడి, ఓరుగల్లును తిరిగి వశపరచుకొన్నారు. ఇది సహించని అహ్మద్‌షా మరల క్రీ.శ. 1433లో తెలంగాణముపై దండెత్తి కరీంనగర్ జిల్లాలోని పెద్దపల్లికి సమీపమున నున్న రామగిరి దుర్గమును వశపరచుకొన్నాడు. అహ్మద్‌షా తన సేనాని సంజర్‌ఖాన్‌ను సర్ లష్కర్‌గా త్రిభువనగిరిలో నిలిపాడు. రేచర్ల లింగమనేడు మరియు స్థానిక వెలమనాయకులు సబ్బినాడు (కరీంనగర్ జిల్లా) నేలు సికిందర్‌ఖాన్‌ను ఈ ప్రాంతము నుండి తరుమగొట్టుటకు ప్రయత్నించారు[132]. ఈ సికందర్‌ఖాన్ తండ్రి జలాల్‌ఖాన్ సుల్తాన్‌పై తిరుగబడ్డాడు. కాని సుల్తాన్ తండ్రి కొడుకు లిద్దరి తిరుగుబాటును అణచివేశాడు. మొదటి అహ్మద్‌షా అనంతరము రెండో అహ్మద్‌షా (క్రీ.శ. 1436-1458), హుమాయూన్ (క్రీ.శ. 1458-1461) వరుసగా బహమనీ సుల్తానులైనారు.

హుమాయూన్ బహుక్రూరుడు గనుక అతని సోదరులు, సర్దారులు తిరుగబడ్డారు. ఇతని విరోధియైన జలాల్‌ఖాన్‌కు వెలమరాజు లింగమనేడు సహాయపడినాడు. హుమాయూన్ వెలమ రాజుల దేవరకొండను ముట్టడించినాడు. లింగమనేడు కపిలేశ్వర గజపతి సహాయము పొంది బహమనీ సైన్యములను చెల్లా చెదరుచేసి ఓడించాడు. రేచర్ల వెలమరాజులు గజపతుల సహాయముతో క్రీ.శ. 1461లో ఓరుగల్లు, రాచకొండ, దేవరకొండ దుర్గములను ముస్లింల నుండి తిరిగి వశపరచుకొన్నారు. హుమాయూన్ తరువాత మూడవ అహ్మద్‌షా (క్రీ.శ. 1461-1463) సుల్తానయ్యాడు.

సుల్తాన్ మూడవ మహ్మద్‌షా కాలములో (క్రీ.శ. 1463-1482) కపిలేశ్వర గజపతి క్రీ.శ.1470లో మరణించాడు. అతని కుమారులు హంవీరుడు, పురుషోత్తమ గజపతి సింహాసనమునకై తగాదా పడ్డారు. హంవీరుడు బహమనీ సుల్తాన్ మూడవ ముహ్మద్‌షా సైనిక సహాయమును పొంది పురుషోత్తమ గజపతినోడించి తానే గజపతిగా సింహాసనము నధిష్ఠించాడు. ఈ సహాయమునకు ప్రత్యామ్నాయముగా హంవీరుడు తీరాంధ్రదేశముతో పాటు యావత్తు తెలంగాణమును బహమనీలకు అర్పించాడు. ఓరుగల్లు, రాజమహేంద్రవరము, కొండవీడు, కొండపల్లి బహమనీల వశమైనాయి.

మూడవ ముహ్మద్‌షా ప్రధానమంత్రి మహమూద్ గావాన్ గొప్ప పరిపాలనాదక్షుడు. బహమనీ రాజ్యము 1.బెరార్ 2. దౌలతాబాద్ 3.. గుల్బర్గా 4. తెలంగాణాయని నాలుగు తరఫ్‌లుగా విభజింపబడి ఉండేది. పరిపాలనా సౌలభ్యమునకై గావాన్ ఈ నాలుగు తరఫ్‌లను ఎనిమిది తరఫ్‌లుగా విభజించాడు. ఈ విభజనలో తెలంగాణము ఓరుగల్లు, రాజమహేంద్రవరము అను రెండు తరఫ్‌లుగా రూపొందింది. రాజమహేంద్ర వరమునకు నిజాముల్ ముల్క్‌మలిక్ హసన్ భైరి సర్‌లష్కర్ (Governor) గా, అజీమ్‌ఖాన్ ఓరుగల్లునకు సర్‌లష్కర్‌గా నియమింపబడినారు.

ఒక్కొక్క తరఫ్ కొన్ని సర్కారులుగా, ఒక్కొక్క సర్కారు కొన్ని ఫర్గణాలుగా, ఒక్కొక్క ఫర్గణా కొన్ని గ్రామాలుగా విభజింపబడ్డాయి. ఓరుగల్లు తరఫ్ నందు కరీంనగరము జిల్లాలోని ఎల్గందల్, మొలంగూర్ దుర్గములు సర్కారులుగా నుండెను. ఈ సర్కారులు ఫర్గణాలుగా విభజింపబడ్డాయి.

ఆనాటి ఫర్గణాలలో పొలాస గూడా ఒక ఫర్గణా కేంద్రము. క్రీ.శ. 1480 వరకు తెలంగాణ మంతయు, తీరాంధ్ర ప్రాంతమంతయు బహమనీసుల్తానుల పాలన క్రిందికి వచ్చింది. బహమనీ సుల్తానుల వంశావళి బదులు మొదటి నుండి చివర వరకు వరుసగా పాలించిన బహమని సుల్తానుల పట్టిక ఇవ్వబడింది.

| | |
|---|---|
| 1. అలాఉద్దీన్‌హసన్ గంగూబహమనీషా | (క్రీ.శ. 1347-1358) |
| 2. మొదటి ముహ్మద్ షా | (క్రీ.శ. 1358-1375) |
| 3. ముజాహిద్ షా | (క్రీ.శ. 1375-1378) |
| 4. దావూద్ I | (క్రీ.శ. 1378) |
| 5. రెండవ ముహ్మద్ షా | (క్రీ.శ. 1378-1397) |
| 6. తహమతన్ షా | (క్రీ.శ. 1397) |
| 7. దావూద్ II | (క్రీ.శ. 1397) |
| 8. ఫిరోజ్‌షా | (క్రీ.శ. 1397-1422) |

9. మొదటి అహ్మద్‌షా (క్రీ.శ. 1422-1436)
10. రెండవ అహ్మద్‌షా (క్రీ.శ. 1436-1458)
11. హుమాయూన్‌షా (క్రీ.శ. 1458-1461)
12. మూడవ అహ్మద్‌షా (క్రీ.శ. 1461-1463)
13. మూడవ ముహ్మద్‌షా (క్రీ.శ. 1463-1482)
14. మహమూద్‌షా (క్రీ.శ. 1482-1518)
15. నాలుగవ అహ్మద్‌షా (క్రీ.శ. 1518-1520)
16. అలాఉద్దీన్‌షా (క్రీ.శ. 1520-1523)
17. వలీయుల్లాషా (క్రీ.శ. 1523-1526)
18. కలీముల్లాషా (క్రీ.శ. 1526-1538)

మూడవ ముహ్మద్‌షా కాలములో దక్కనీలు కుట్రచేసి మహమూద్‌గావాన్ ప్రధానమంత్రిపై చాడీలు చెప్పి త్రాగిన మైకములో నున్న సుల్తాన్‌చే అతనిని చంపించారు. వాస్తవాన్ని తెలిసికొనిన సుల్తాన్ బాధపడి, కృంగి, కృశించి క్రీ.శ. 1482లో మరణించాడు. తరువాత పాలించిన బహమనీ సుల్తాన్‌లు బలహీనులగుటచే బహమనీ సామ్రాజ్యము రాజ్యపంచకము పేరుతో ఐదు భాగములుగా విడిపోయి స్వతంత్రించాయి. బెరార్‌లో ఫాతుల్లాఇమాద్‌షా 1484లో స్వతంత్రించి ఇమాద్ షాహీ వంశ స్థాపన గావించాడు. క్రీ.శ.1498లో మలిక్ అహ్మద్ నిజాంషా స్వతంత్రుడై అహ్మద్‌నగర్‌లో నిజాంషాహి వంశస్థాపన గావించాడు. అతని అడుగుజాడల్లో బీజాపూర్ నందు యూసుఫ్ ఆదిల్‌ఖాన్ స్వతంత్రుడై ఆదిల్‌షాహి వంశస్థాపన క్రీ.శ. 1501లో గావించాడు. క్రీ.శ. 1518లో కుతుబుల్ ముల్క్ సుల్తాన్‌కులి స్వతంత్రుడై కుతుబ్‌షాహి వంశ స్థాపన చేశాడు. చివరగా బీదర్‌లో కాసింబరీదు కుమారుడైన అమీర్ బరీద్ క్రీ.శ. 1526లో స్వతంత్ర బరీద్‌షాహి రాజ్యస్థాపన చేశాడు[133].

## గోలకొండ కుతుబ్‌షాహి సుల్తాన్‌లు (క్రీ.శ. 1518-1687)

మధ్యయుగపు చరిత్రకారులు తెలుగుభాషా ప్రాంతములను తిలంగ్ (Tilang), తెలంగాణా యను పేర్లతో పిలిచారు. ఈ తెలుగు ప్రాంతమును కుతుబ్‌షాహీలు తొలుత గోలకొండకోట నుండి తదనంతరము హైద్రాబాద్ పట్టణము నుండి పాలించారు. సుల్తాన్ కులీకుతుబుల్ ముల్క్ ఈ వంశస్థాపకుడు. ఇతని వంశీయులు ఎనిమిది మంది సుల్తాన్‌లు 170 సంవత్సరములు రాజ్యమేలారు. వీరు ప్రాజ్ఞులైన పాలకులు, షియామతస్థులు. మహ్మదీయులైనను పరమత సహనము కలిగి హిందువులనాదరించి ఉన్నత పదవులలో నియమించిన ఉదారులు. సాహిత్య కళారంగాలను పోషించి, అందమైన కట్టడములను, సుందరమైన భవనములను నిర్మించి ఆంధ్రుల సంస్కృతిని ఇనుమడింప జేశారు. కరీంనగర్

జిల్లాలోని ఎల్గందల్, మొలంగూర్, రామగిరి దుర్గములు గోలకొండ రాజ్యములో కీలక పాత్ర వహించాయి. గోలకొండ సుల్తానులు కరీంనగరము జిల్లాకు గూడా ప్రభువులే గనుక వారిని గురించి కొంత అధ్యయనము చేయు అవసరముంది. గోలకొండ రాజ్యమును వరుసగా పాలించిన సుల్తానుల పట్టిక.

| | | |
|---|---|---|
| 1. సుల్తాన్ కులీ కుతుబుల్ ముల్క్ | --1518 | 2-9-1543 |
| 2. జమ్షీద్ కుతుబ్ షా | 2-9-1543 | 22-1-1550 |
| 3. సుభాన్ కుతుబ్ షా | 22-1-1550 | 27-7-1550 |
| 4. ఇబ్రహీం కుతుబ్షా | 27-07-1550 | 05-06-1580 |
| 5. మహ్మద్ కులీ కుతుబ్షా | 05-06-1580 | 11-01-1612 |
| 6. సుల్తాన్ మహ్మద్ కుతుబ్షా | 11-01-1612 | 31-01-1626 |
| 7. అబ్దుల్లాకుతుబ్షా | 01-02-1626 | 21-04-1672 |
| 8. అబుల్హసన్ కుతుబ్షా (తానీషా) | 21-04-1672 | 21-09-1687 |

## సుల్తాన్ కులీకుతుబుల్ ముల్క్ (క్రీ.శ. 1518-1543)

సుల్తాన్ కులీ ఇరాన్లోని హందాన్ ప్రాంతమునకు చెందిన తురుష్కుడు. అతడు, అతని పినతండ్రి అల్లాకులీ ఇరువురు ఇండియాకు వచ్చి బీదర్ నందు మూడవ మహ్మద్షా కొలువులో జేరారు. క్రీ.శ. 1482లో మహ్మద్షా మరణించగానే మహమూద్ సుల్తానైనాడు. క్రీ.శ. 1487లో మహమూద్ (Mahmud) సుల్తాన్ను ఒక అపాయము నుండి ప్రాణములు కాపాడి సుల్తాన్ కులి అతని మెప్పుపొందాడు. గోవా ఠానేదార్గా నున్న బహాదూర్ జిలాని బహమనీ సుల్తాన్పై తిరుగుబాటు చేశాడు. క్రీ.శ. 1494లో జరిగిన పన్హాలా (Panhala) యుద్ధములో సుల్తాన్కులీ బహాదూర్ జిలానీనోడించి తిరుగుబాటు నణచి వేశాడు. మహమూద్ సుల్తాన్ సంతసించి కులీని కుతుబుల్ముల్క్ (Qutubul-Mulk) బిరుదుతో గౌరవించాడు[134]. తెలంగాణా పరిస్థితులను చక్కదిద్దుటకై క్రీ.శ. 1496లో కుతుబుల్ ముల్క్ గోలకొండ తరఫ్దార్గా(Tarafdar or Governor) నియమింపబడినాడు. రెండు దశాబ్దములకు పైగా విశ్వాసపాత్రుడైన పాలకునిగా అపార అనుభవము గడించి బహమనీ సుల్తాన్లకు లోబడి యున్నాడు. బీదర్లో పతనమగుచున్న బహమనీరాజ్యాధికారమును గమనించిన కుతుబుల్ ముల్క్ క్రీ.శ.1518లో స్వతంత్రుడై గోలకొండ కోటలో కుతుబ్షాహి రాజ్యస్థాపన గావించాడు. గోలకొండ దుర్గమును పటిష్ఠపరచి అందమైన భవనములు, మసీదులు, సుందరమైన ఉద్యానవనములతో శోభాయమానంగా తీర్చిదిద్ది దానికి మహ్మద్నగరమని పేరు పెట్టుకొన్నాడు.

కుతుబుల్ ముల్క్ రాజ్యవిస్తరణకై అనేక యుద్ధాలు చేశాడు. తీరాంధ్ర ప్రాంతమును జయించుటకై ప్రయత్నించి, తనకంటే అతి బలవంతుడైన శ్రీ కృష్ణదేవరాయల చేతిలో

పరాజితుడైనాడు. శ్రీ కృష్ణ దేవరాయలున్నంత మట్టుకు అతని జోలికి పోలేదు. అతని అనంతరము రాచకొండ, దేవరకొండ, పానుగల్లు, ఘనపూర్ దుర్గాలను సుల్తాన్‌కులీ ఆక్రమించినాడు. కంభంమెట్టు (Khammam) దుర్గాధిపతి సీతాపతితో, కరీంనగర్ జిల్లాపై అధికారము సంపాదించిన ఖివాముల్‌ముల్క్ (Quiwamul-Mulk) తో సుల్తాన్ కులీ కుతుబుల్ ముల్క్ చేసిన యుద్ధములు ఈ ప్రాంతపు స్థానిక చరిత్రకు సంబంధించినవి గనుక కొన్ని వివరములు తెలిసికొనుట అవసరము.



గోలకొండ కోట

## ఖివాముల్ ముల్క్‌తో ఎల్గందుల యుద్ధము :-

బహమనీ రాజ్యపుపాత సర్దారులలో ఒకడైన ఖివాముల్ ముల్క్ (Quiwamul-Mulk) కరీంనగర్ జిల్లాలోని ఎల్గందల్, మొలంగూర్ దుర్గములను వశపరచుకొని తెలంగాణములోని కొన్ని ప్రాంతములను కొల్లగొట్టడం మొదలుపెట్టాడు. ఖివాముల్ ముల్క్ తన పాతమిత్రుడైనందున ఇట్టి చర్యలను విరమించుకొమ్మని కుతుబుల్ ముల్క్ వర్తమానము పంపాడు. కాని అతడు దానిని పెడచెవినపెట్టగా కుతుబుల్‌ముల్క్ సుల్తానే స్వయముగా ఎల్గందులపై దండెత్తాడు. కోట బయట ఇరువర్గముల మధ్య యుద్ధము మధ్యాహ్నము వరకు జరిగింది. కుతుబుల్‌ముల్క్‌లాంటి గొప్ప శత్రువును జయించుట కష్టమని భావించిన ఖివాముల్ ముల్క్ యుద్ధ మైదానము నుండి పారిపోయి ఎల్గందల్ కోటలో తలదాచుకొన్నాడు. శత్రు సైన్యములు కోటను ముట్టడించగా ఖివాముల్‌ముల్క్ రహస్యముగా ఎల్గందల్‌కోట నుండి పారిపోయి ఉత్తరమున బెరార్‌ను పాలించు దరియా ఇమాదుల్‌ముల్క్ (క్రీ.శ. 1530–1561) సహాయాన్నికోరాడు. కుతుబుల్‌ముల్క్ సర్దారులు ఎల్గందల్,మొలంగూర్ కోటలను కైవసము చేసికొన్నారు.

బెరార్‌లో ఆశ్రయమిచ్చిన ఖివాముల్ ముల్క్‌ను వెంటనే ఆ రాజ్యమునుండి తరిమి వేయవలెనని కుతుబుల్‌ముల్క్ దరియా ఇమాదుల్ ముల్క్‌ను కోరాడు. అంతే గాకుండా బెరార్ అధీనములో నున్న హఫ్తటప్పా (Haft-Tappa) యను జిల్లాను బహమనీ సుల్తాన్ ఒకనాడు

గోలకొండ రాజ్యమునకు అప్పగించెనని, దానిని బెరార్ అక్రమంగా ఆక్రమించినదనియు, అట్టిప్రాంతమును తిరిగి గోలకొండకు అప్పగించవలెనని కుతుబుల్ ముల్క్ రాయబారిని పంపాడు. బెరార్ పాలకుడైన దరియా ఇమాదుల్ ముల్క్ ఈ రాయబారిని సగౌరవంగా ఆహ్వానించకుండా చివాట్లు పెట్టి తిరిగి పంపాడు. ఇది తెలిసిన కుతుబుల్‌ముల్క్ తన సైన్యములను ఉత్తరము వైపు నడిపి రామగిరి దుర్గము వద్ద బెరారీ సైన్యములనెదరించాడు. ఎప్పటి మాదిరిగా కుతుబుల్ ముల్క్ తన రెండు వేల అశ్వబలమును రిజర్వులో (Reserve) పెట్టి యుద్ధముచేశాడు. ఇరువర్గముల సైన్యములు సమానస్థాయిలో పోరాడుతున్న సమయములో అదనంగా ఉంచిన ఈ రెండువేల రిజర్వు అశ్వబలమును ఒక్కసారిగా కదనరంగంలో దించాడు. ఈ రిజర్వు అశ్వబలముతో సమతుల్యత తలక్రిందులై శత్రుసైన్యము పలాయనము చిత్తగించింది. దరియా ఇమాదుల్‌ముల్క్ బెరార్‌నకు పారిపోయాడు. కుతుబుల్ ముల్క్ రామగిరి దుర్గముతో పాటు హప్తటప్పా ప్రాంతమును కూడా వశపరచుకొన్నాడు[135].

## సీతాపతి (షితాబ్‌ఖాన్) తో యుద్ధము :-

సీతాపతి లేదా షితాబ్‌ఖాన్‌యను సేనాని ఓరుగల్లు దుర్గమును క్రీ.శ. 1504, జనవరి 21 రోజున వశపరచుకొనెనని వరంగల్ శాసనము తెలుపుచున్నది[136]. ఓరుగల్లులో చివరగా హిందూరాజ్య స్థాపనకు అనేక సాహసకృత్యములు చేసిన వ్యక్తి సీతాపతి లేదా సితాడు. ఇతడు భోగికుల వంశజుడు. మానయ, గౌరాంబల పుత్రుడు. తొలుత ముస్లింల కొలువులో నున్నప్పుడు, వారు అతని పేరుకు చివర 'ఖాన్' పదమును జోడించి సీతాపతిని షితాబ్‌ఖాన్ బిరుదుతో గౌరవించిరి. ఇతుడు 1504లో ఓరుగల్లు నుండి తురుష్కులను తరుమగొట్టి కోటను వశపరచుకొన్నాడు. తురుష్కులు ధ్వంసము చేసిన అనేక దేవతావిగ్రహములను దేవాలయములందు తిరిగి ప్రతిష్ఠింపజేశాడు. ధ్వంసమైన దేవాలయములను పునరుద్ధరించి హిందూ ధర్మోద్ధరణకై పాటుపడిన చిట్టచివరి రాజు సీతాపతి లేదా షితాబ్‌ఖాన్. ఖంబంమెట్టు (Khammam) బెల్లంకొండ దుర్గములు అతని అధీనములో ఉండినాయి.

సుల్తాన్ కులీకుతుబుల్ ముల్క్ దుర్భేద్యమైన బెల్లంకొండ దుర్గమును ముట్టడించాడు. పటిష్ఠమైన దుర్గమగుటచే ముట్టడి చాలారోజులు జరుగునని గ్రహించి, కోటగోడలకు నిచ్చెనలు వేయించి (Escalade) లోనికి ప్రవేశించుటకు ప్రయత్నించాడు. కుతుబుల్‌ముల్క్ స్వయముగా ఈ దండయాత్రలో పాల్గొని చివరకు బెల్లంకొండ దుర్గమును వశపరచుకొన్నాడు. బెల్లంకొండను గోల్పోయిన సీతాపతి తన సైన్యముతో కుతుబుల్ ముల్క్ ఉన్న చోటుకు వచ్చి యుద్ధము చేశాడు. కాని ఓడిపోయి తిరుగుముఖము పట్టాడు. పారిపోయిన షితాబ్‌ఖాన్ లేదా సీతాపతిని వెంబడించకుండా కుతుబుల్‌ముల్క్ గోలకొండకు తిరిగిపోయాడు. ఓరుగల్లు కోట ఇంకను సీతాపతి అధీనములోనే ఉండింది.

ఇంతలో సమయము చిక్కిన సీతాపతి వెంటనే కొండపల్లి, ఇంద్రకొండ, ఆరాపల్లి, ఎత్గీర్ దుర్గాధిపతులకు సహాయమునర్థించుచు వర్తమానమును పంపాడు. లేనిచో కుతుబుల్‌ముల్క్ వారి దుర్గములు కూడా ముట్టడించునని బెదరించాడు. దీనితో వారందరు తమ సేనలను సీతాపతికి అండగా పంపారు. వేల సంఖ్యలో నున్న తన సైన్యముతో అశ్వగజబలములతో మరియు తీరాంధ్రమిత్రులు పంపిన సైన్యములతో ఖమ్మంమెట్టు ఊరి బయట కుతుబుల్ ముల్క్ సైన్యములనెదుర్కొనుటకు సిద్ధపడ్డాడు. ఇరువర్గముల మధ్య భయంకర యుద్ధము జరిగింది. కుతుబుల్ ముల్క్ సీతాపతి సైన్యమును ఎడమ నుండి కుడి నుండి రెండు వైపుల ముట్టడించాడు. సీతాపతి సైన్యమందు మధ్యలో అగాధమేర్పడింది. గోలకొండ సైన్యములు ఈ మధ్యలో చొరబడి బీభత్సము సృష్టించాయి. దీనితో సీతాపతి సేనలు వెనుకంజ వేయగా ఎత్గీర్, ఇంద్రకొండ, నెక్కొండపల్లి దుర్గములు కుతుబుల్ ముల్క్ వశమైనాయి.

ఖంబంమెట్టు గిరిదుర్గము ఇంకను సీతాపతి అధీనములోనే ఉండెను. అతని ధనాగారమంతయు ఈ దుర్భేద్యమైన కోట యందే ఉంది. శతఘ్నులతో గూడా ఈ బలిష్ఠమైన కోటను పేల్చుట కష్టతరము. సీతాపతి కూటమిలోని మిత్రులందరు ఓడిపోయి పారిపోయారు. ఖమ్మంమెట్టు దుర్గమును అప్పగించి లొంగిపోవలసినదిగా కుతుబుల్ ముల్క్ సీతాపతికి వర్తమానము పంపాడు. కాని ప్రయోజనము లేక ముట్టడికి ఉపక్రమించాడు. ఖమ్మంమెట్టు కోట ముట్టడి చాలా రోజులు కొనసాగింది. ఇరువైపుల పేరుగాంచిన సేనానులు మరియు వందలాది సైనికులు చనిపోయారు. చివరకు కుతుబుల్ ముల్క్ సామాన్యప్రజలను విచక్షణారహితంగా (General Assault) హతమార్చుటకు ఆజ్ఞాపించాడు. ఈ ఎత్తుగడ లోగడ ఇతర యుద్ధములందు గూడా ప్రయోగించాడు. పట్టణములో అల్లకల్లోలము సృష్టించాడు. చివరకు కోట గోడలకు నిచ్చెనలు వేయించి సైన్యమును ముఖాముఖీ పోరాటమునకు దించాడు. ఖమ్మంమెట్టు కోట కుతుబుల్‌ముల్క్ వశము క్కాగానే సీతాపతి ప్రోగు చేసిన ధనరాశులన్నింటిని తన వశము చేసికొన్నాడు.

సీతాపతి ఖమ్మంమెట్టు కోట నుండి పారిపోయి కొండపల్లి రామచంద్రుని వద్దకు చేరి గజపతుల రాజ్యమునకు కుతుబుల్ ముల్క్ ముస్లిం సేనలతో ముప్పు వాటిల్లనున్నదని తెలిపాడు. రామచంద్రుడు ప్రతాపరుద్రగజపతి తనయుడు. ఇది తెలిసిన ప్రతాపరుద్ర గజపతి మూడు లక్షల కాల్బలము, 30వేల అశ్వబలము ప్రోగుచేశాడు. ఈ సైన్యముతో రామచంద్రుడు, సీతాపతి ఇరువురు కుతుబుల్‌ముల్క్ సైన్యము నెదురు కొనుటకు బయలుదేరారు. విద్యాధర్, హరిచంద్ మున్నగు సేనానులు వీరికి బాసటగా నిలిచారు. సుల్తాన్ కుతుబుల్ ముల్క్ వద్ద 5000 అశ్వబలము మాత్రమే ఉండెనని తెలియుచున్నది. ఒక నది ఒడ్డున నున్న పలంక్చిపూర్ వద్దకు ఇరువర్గముల సేనలు చేరాయి. రామచంద్రుడు ఒక లక్షకాల్బలము, 10వేల అశ్వబలము, 300 గజబలముతో కుడివైపున నాయకత్వము వహించగా, సీతాపతి, హరిచంద్‌లు అంతే సైన్యముతో ఎడమవైపు

నాయకత్వము వహించారు. కుతుబుల్ ముల్క్ సైన్యము సంఖ్యలో అతి తక్కువగా ఉంది. కాని వారు సుశిక్షితులై ఉన్నారు. కుతుబుల్ ముల్క్ తన కుమారుడైన హైదర్‌ఖాన్ రాకుమారుని కుడివైపు, ఫతేఖాన్‌ను ఎడమవైపు నిలిపి యుద్ధము చేశాడు. ఈ భీకరయుద్ధములో గోలకొండ సైన్యములు విజయము సాధించగా శత్రుసైన్యములు చెల్లాచెదరైనాయి. దీనితో తెలంగాణము, తీరాంధ్రప్రాంతముల పై కుతుబుల్ ముల్క్ అధికారము పూర్తిగా విస్తరించింది[137].

ఇతర తెలుగు ప్రాంతములతో పాటు కరీంనగర్ జిల్లా సాంతము గోలకొండ కుతుబుల్ ముల్క్ పాలన క్రిందికి వచ్చింది. సుల్తాన్ కులీ కుతుబుల్‌ముల్క్ దక్షుడైన పాలకునిగా, గొప్ప విజేతగా, సేనానిగా కీర్తి గడించాడు. షియామతమునకు చెందిన కుతుబుల్‌ముల్క్ పరమత సహనం ప్రదర్శించాడు. గోలకొండ కోట వెలుపల జామెమసీదు కట్టించాడు. కుతుబుల్ ముల్క్ తన కుమారుడైన జమ్షీద్ చే క్రీ.శ. 1543 ఆగస్టు 3వ తేదిన హత్యగావింపబడ్డాడు[138]. అప్పుడతని వయస్సు 99 సంవత్సరములు.

## 2. జంషీద్ కుతుబ్ షా (క్రీ.శ. 1543-1550)

సుల్తాన్ కులీకుతుబుల్ ముల్క్ పుత్రులలో మూడవవాడు, క్రూరుడు, స్వార్థపరుడు, పితృహంతకుడైన జంషీద్ ఏడేండ్ల పాటు రాజ్యమేలాడు. పెద్దన్న అప్పటికే మరణించాడు. రెండవ అన్నను అంధుని గావించాడు. తమ్ముడు దౌలత్‌ఖాన్‌ను భోనగిరి దుర్గములో బంధించాడు. కనిష్ఠుడైన ఇబ్రహీమ్ దేవరకొండ దుర్గాధిపతిగా ఉండేవాడు. జంషీద్ రాజ్యానికి రాగానే ఇబ్రహీమ్ ప్రాణభయముతో బీదర్‌కు, అక్కడి నుండి విజయనగరమునకు పారిపోయి ఏడు సంవత్సరములు అక్కడి రాయల ఆతిథ్యములో నున్నాడు.

ఇబ్రహీంనకు తొలుత ఆశ్రయమిచ్చిన బీదర్ సుల్తాన్ అలీబరీద్‌పై జంషీద్ దండెత్తాడు. అలీబరీద్ కౌలస్ దుర్గమును గోలకొండకు వదలుకొన్నాడు. జగదేవరావు కౌలస్ దుర్గాధిపతిగా నియమింపబడినాడు. జంషీద్ క్రీ.శ. 1550 జనవరి 22న క్యాన్సర్‌వ్యాధితో మరణించాడు[139].

## 3. సుభాన్‌అలీ (క్రీ.శ.22-1-1550 నుండి 27-7-1550)

జంషీద్ మరణానంతరము అతని కుమారుడైన సుభాన్‌కులీ ఏడు సంవత్సరముల బాలుని సర్దారులైన ముస్తఫాఖాన్, సలాబత్‌ఖాన్‌లు సింహాసనముపై నిలిపారు. ఈ సర్దారులపై నమ్మకము లేని రాణి సయిఫ్‌ఖాన్ ఐనుల్ ముల్క్‌ను అహ్మద్‌నగరము నుండి పిలిపించి పాలనాబాధ్యతలప్పగించింది. బాలుని చేతిలో రాజ్యము దృఢముగా నుండ జాలదని సర్దారులలో ప్రజలలో అసంతృప్తి పెరిగింది.

అపారమైన ధనరాశులను నిలిపి ఉంచిన దుర్భేద్యమైన కౌలస్ దుర్గమునకు జగదేవరావు నాయక్‌వారి దుర్గాధిపతిగా ఉన్నాడు. గోలకొండ రాజ్యములో మిక్కిలి పలుకుబడిగలిగిన వ్యక్తిగా

ఆయనకు పేరుంది. అతడు భోనగిరి కోటలో బంధింపబడిన దౌలత్‌ఖాన్ రాకుమారుని గోలకొండ గద్దెపై నిలుపుటకు ప్రయత్నించాడు. బహరీఖాన్, జగపత్‌రావు, జుమ్లతుల్‌ముల్క్ మున్నగు సర్దారులు ఐనుల్‌ముల్క్ ఆధిపత్యమును వ్యతిరేకించారు. ఐనుల్‌ముల్క్ సుభాన్‌అలీకి రక్షకుడుగా నుండి ఇబ్రహీంకులీకి ఉన్న మంచిపేరు, జగదేవరావుకున్న బలమును గూర్చి గాని సరిగా అంచనా వేయలేదు. దౌలత్‌ఖాన్ చపలచిత్తుడగుటచే ప్రజలు, సర్దారులందరు విజయనగరములో ఆశ్రయము పొందిన ఇబ్రహీంనే రాజు కావలెనని కోరుచుండిరి.

## శనిగరము యుద్ధము

దౌలత్‌ఖాన్ రాకుమారునికి పట్టము కట్టవలెనని నాయక్‌వారీల సహాయముతో జగదేవరావు భోనగిరికోటను ముట్టడించి, దౌలత్‌కులీని విడిపించి చుట్టుప్రక్కలనున్న దుర్గములను వశపరచుకొన్నాడు. గోలకొండలో నున్న ఐనుల్‌ముల్క్ తనపై చర్య తీసికొనగలడని గ్రహించిన జగదేవరావు బెరార్ ప్రధానమంత్రిగా నున్న తుఫల్‌ఖాన్ సహాయం కోరాడు. అతడు వెంటనే జగదేవరావుకు సహాయపడుటకై మూడువేల సైన్యమును భోనగిరి వైపు పంపాడు. ఈ బెరారీ సైన్యములు భోనగిరికి చేరకముందే మార్గమధ్యములో కరీంనగర్ జిల్లాలోని శనిగరం వద్ద ఐనుల్‌ముల్క్ తన సేనలతో అడ్డగించాడు. జగదేవరావు తన సైన్యముతో బెరారీ సైన్యమును కలిపాడు. ఐనుల్‌ముల్క్ మరియు జగదేవరావు సైన్యముల మధ్య భీకరయుద్ధము శనిగరము వద్ద జరిగింది. ఈ యుద్ధములో జగదేవరావు ఓడిపోయి, వెనుదిరిగి భోనగిరి దుర్గములోనే తలదాచుకొన్నాడు.

ఐనుల్‌ముల్క్ భోనగిరి దుర్గమును మూడురోజులపాటు ముట్టడించాడు. జగదేవరావును లొంగిపొమ్మని కోరగా అతడు తన పథకమును మార్చి తన విశ్వసనీయతను విధేయతను ఇబ్రహీం యెడల ప్రకటించి అతని కొరకై యుద్ధము చేయుచున్నానని తెలిపాడు. ఐనుల్ ముల్క్ కోటలోనికి తినుబండారములు చేరకుండా అడ్డుకొన్నాడు. చివరకు కోటను జయించి దౌలత్‌ఖాన్‌ను భోనగిరి కోటలోనే ఎప్పటిమాదిరిగా బంధించాడు. జగదేవరావు గోలకొండకు తరలింపబడి కోటపై నున్న బాలాహిసర్‌లో బంధింపబడినాడు[140].

గోలకొండలోని ఐనుల్‌ముల్క్ వ్యతిరేకులు విజయనగరమందున్న ఇబ్రహీంను రాజ్యభారము వహింపవలసినదిగా ఆహ్వానించారు. ఇబ్రహీం తెలంగాణమును ప్రవేశించి కోయిల్‌కొండ దుర్గమును చేరుకోగానే సర్దారులు, ప్రజలు ఘనస్వాగతము పలికారు. ఇబ్రహీం కోయిలకొండలో మూడు రోజులు ఉన్నాడు. ఈ విషయము తెలిసిన ఐనుల్‌ముల్క్ ఇబ్రహీంను అడ్డుకొనుటకై సైన్యముతో కోయిల్‌కొండ వైపు బయలుదేరాడు. ఇంతలో గోలకొండలో అల్లర్లు ప్రారంభమైనాయి. జగదేవరావు కోట బురుజులపై నుండి అగబడగానే ప్రజలు అతనిని విడిపించి ఇబ్రహీంరాజు కావలెనని కోరారు. గోలకొండ వద్ద జరిగిన పోరులో ఠానేదార్ ఖుదవంద్‌ఖాన్

చనిపోయాడు. జగదేవరావు గోలకొండలో ఇబ్రహీంను రాజుగా ప్రకటించాడు. గోలకొండ ప్రజానీకమంతయు ఆనందోత్సాహాలతో ఇబ్రహీంనకు పట్టం గట్టారు. సుభాన్‌అలీ బాలుని పాలన ఏడుమాసములతో ముగిసెను. ఐనుల్‌ముల్క్ తిరిగి అహ్మదనగర్ వెళ్ళిపోయాడు.

## 4. ఇబ్రహీం కుతుబ్‌షా (క్రీ.శ. 1550-1580)

ఇబ్రహీంకుతుబ్‌షా విజయనగరము నందు ఏడు సంవత్సరములు గడిపి, తిరిగి వచ్చి గోలకొండ రాజ్యమును మూడు దశాబ్దముల పాటు సుభిక్షముగా పాలించాడు. ఇతడు రసిక చక్రవర్తి. విజయనగరములో ప్రవాసిగా నున్న కాలములో భాగీరథీదేవి యను హైందవ స్త్రీని ప్రేమించి, పెళ్ళాడి ఆమె పేరట గోలకొండను భాగీరథి నగరమని వ్యవహరించినాడని తెలియుచున్నది. తెలుగుభాష పై మక్కువ ఎక్కువగనుకనే అనేకమంది తెలుగు కవులను పోషించినాడు. వారు ఇతనిని 'మల్కిభరాము'ని గా కీర్తించినారు. ఇతనికాలములో ఫారసీ, తెలుగు, దక్కని ఉర్దూ భాషలు అభివృద్ధి చెందాయి. హిందువులను ఉన్నతోద్యోగములలో నియమించిన మత సహనశీలి.

జనాభాపెరుగుట వలన గోలకొండ నగరమును పడమటి దిశయందు విస్తృతపరచు పథకము రూపొందించి మూసీనదిపై క్రీ.శ. 1578లో పురానాపూల్ కట్టించాడు. దీని పొడవు 600 అడుగులు, వెడల్పు 36 అడుగులు, ఎత్తు 42 నుండి 56 అడుగులు. దీని క్రింద 23 కమాన్‌లు కట్టబడినాయి. ఇతని పేరట ఇబ్రహీంబాగ్ వేయించబడింది. ఇతని పేరట స్థాపింపబడిన ఇబ్రహీంపట్నంలో ఒక కృత్రిమ తటాకము నిర్మింపబడింది. ఈ ఇబ్రహీం పట్నం హైద్రాబాద్‌కు 32 కి.మీ. దూరంలో ఉంది. ఇబ్రహీం కుతుబ్‌షా కాలములోనే నేడు హైద్రాబాద్, సికింద్రాబాద్ జంట నగరాలను కలుపుతూ పగటిపూట తళతళ మెరుపులతో ధగధగకాంతులను వెదజల్లుచు, వేసవి కాలములో మందమారుతము, చల్లని పిల్ల వాయువులను అందించుచున్న శోభాయమానమైన హుస్సేన్‌సాగర్ కృత్రిమ చెఱువు క్రీ.శ. 1562లో నిర్మింపబడింది. రెండు లక్షల 50వేల వ్యయముతో 3 సంవత్సరముల ఆరుమాసములలో ఇది పూర్తి అయింది[141]. 440 సంవత్సరాల పూర్వము ఈ తటాకము ఇబ్రహీంకుతుబ్‌షా అల్లుడు మరియు గుల్బర్గాఖాజా బందెనవాజ్‌షావలి మనుమడైన హుస్సేన్‌షావలి నేతృత్వములో నిర్మింపబడుట వలన అతని పేరటనే హుస్సేన్‌సాగర్ అని పిలువబడుతుంది. ఇటీవల దీనిచుట్టు వలయాకారములో నిర్మించిన నెక్లెస్‌రోడ్ ఈ తటాకము శోభను ఇనుమడింప జేసింది. క్రీ.శ. 1992 డిసెంబర్ 12 శనివారము రోజున ఈ తటాకములోని జిబ్రాల్టర్ రాక్ పైన 320 టన్నుల బరువు గల 60 అడుగుల ఎత్తు ఏకశిల బుద్ధ విగ్రహము వేదికపై నిలుపబడింది. ఇది ప్రపంచములోనే ఎత్తైన విగ్రహముగా సందర్శకుల దృష్టి నాకర్షించుచున్నది. జంట నగరాలకు ఈ చెఱువు ఒక వరముగా నిలిచిఉంది.

ఇబ్రహీం కుతుబ్‌షా తన రాజ్యములో అరాజకమును సృష్టించిన దోపిడి దొంగలను

నిర్దాక్షిణ్యముగా అణచివేసి శాంతి భద్రతల నెలకొల్పాడు. ఇతడు గోలకొండ కోట ప్రాకార శ్రేణులను తిరిగి నిర్మింపజేశాడు. కరీంనగర్ జిల్లాలో ఇతని కాలమందు జరిగిన సంఘటనలను అధ్యయనము చేయు అవసరమున్నది.

## ఎల్గందల్‌కోటను జగదేవరావు వశపరచుకొనుట :-

విజయనగరము నుండి తిరిగివచ్చిన ఇబ్రహీంను తానే సింహాసనముపై నిలిపిన జగదేవరావులో కొంతకాలమునకు మార్పువచ్చింది. అతడు రాజస్రష్ఠ (King Maker) గా మారి దౌలత్‌ఖాన్‌కులీని మరల సింహాసనముపై నిలుపు ఆలోచనలో ఉండెను. మందమతి, చపలచిత్తుడైన దౌలత్‌ఖాన్ తానే స్వయంగా అతనికంటే ఇబ్రహీంయే సమర్థుడైన పాలకుడని చెప్పేవాడు. దౌలత్‌ఖాన్‌ను సింహాసనముపై నిలిపినచో యథేచ్ఛగా తమ ఆటలుసాగునని జగదేవరావు, అతని అభిప్రాయముతో ఏకీభవించు విజయనగర రామరాయలు భావించి ఉంటారు.

గోలకొండ రాజ్యములో జగదేవరావు ఒక కీలకమైన వ్యక్తి. అతనిని ఎవరు ఎదురించలేరు. మోసగించలేరు. క్రమముగా తన అధికారమును తోటి సర్దారులైన ముస్తఫాఖాన్ హమీద్‌ఖాన్‌లపై చూపించ ప్రయత్నించాడు. క్రమశిక్షణ కలిగిన ఇబ్రహీంకుతుబ్‌షాకు ఇది మింగుడు పడలేదు. అంతే గాకుండా దౌలత్‌ఖాన్‌ను సింహాసనముపై నిలుపు ప్రయత్నములు జరుగుచున్నవని తెలిసిన సుల్తాన్ కుట్రదారులపై కఠినచర్య తీసికొన్నాడు. దీనితో భయపడిన జగదేవరావు పారిపోయి కరీంనగర్ జిల్లాలోని ఎల్గందల్ గిరిదుర్గమును వశపరచుకొని అక్కడి నుండి సుల్తాన్‌కు వ్యతిరేక కార్యకలాపములను ఆరంభించాడు. తగిన సహాయము పొందుటకై జగదేవరావు బెరార్ నేలు దరియా ఇమాద్‌షా వద్దకు పోయాడు. బెరార్ సుల్తాన్ తన రాజధాని ఎలిచ్‌పూర్‌లో జగదేవరావుకు ఆశ్రయమిచ్చుటయే గాక అతనికి కొన్ని జాగీర్లు మంజూరు చేసి ఉన్నతపదవిలో నిలిపాడు. ఖాందేశ్‌తో జరిగిన యుద్ధములలో బెరార్ సుల్తాన్‌కు జగదేవరావు విజయము సాధించుటయేగాక ఎందరో రాజులను బెరార్ సుల్తాన్ అధీనములోనికి తెచ్చాడు. గోలకొండలో మాదిరిగా జగదేవరావు బెరార్ సుల్తాన్‌ను గూడా మార్చుటకు ప్రయత్నించాడు. ఇది తెలిసిన దరియా ఇమాద్‌షా సత్వరమే అతనిని బెరార్ రాజ్యము నుండి తరిమేశాడు.

## ఎల్గందల్ కోటముట్టడి :-

బెరార్ నుండి తిరిగివచ్చిన జగదేవరావు మరల ఎల్గందులకు చేరుకొని పెద్ద సైన్యము ప్రోగుచేశాడు. ఇది తెలిసిన ఇబ్రహీం కుతుబ్‌షా తన సేనానులైన ముస్తఫాఖాన్ మరియు ముజాహిద్ ఖాన్‌లను ఎల్గందల్ పై దండెత్తుటకు పంపాడు. ముస్తఫాఖాన్ మొదట జగదేవరావును లొంగిపోయి ఎల్గందల్ కోటను సుల్తాన్‌కు అప్పగించవలసినదిగా కోరాడు. కాని జగదేవరావు ఆ మాటలు పెడచెవిన బెట్టి సుల్తాన్ సైన్యములపై విరుచుకపడ్డాడు. ఎల్గందల్ వద్ద జరిగినపోరులో ఇరువైపుల వందలాది సైనికులు చనిపోయారు. జగదేవరావు పక్షమున పోరాడిన సర్దారులు

షేక్‌ఫాజిల్ అరబ్, షేక్‌అలీ జిల్వాని, షేక్ అబ్దుర్‌రహమాన్, షేక్ ఇబ్రహీం మున్నగువారు యుద్ధరంగములో ప్రాణాలు కోల్పోయారు. జగదేవరావు సోదరుడు వెంకటరావు వీరమరణము పొందాడు. జగదేవరావు ఓడిపోయి విజయనగరము రామరాయల వద్దకుపారిపోయాడు. ఎల్గందల్‌లోని ధనాగారమంతయు కుతుబ్‌షాహీ సేనల వశమైంది.[142] గోలకొండకు తిరిగి వచ్చిన ముస్తఫాఖాన్, ముజాహిద్‌ఖాన్ మున్నగు సేనానులకు ఉన్నత పదవులిచ్చి సుల్తాన్ గౌరవించాడు.

## తాళికోటయుద్ధము :- (క్రీ.శ. 1565)

ఇబ్రహీం కుతుబ్‌షా కాలములో దక్షిణ భారతదేశచరిత్రలో జరిగిన ప్రధానఘట్టము బాణహట్టి లేదా తాళికోట యుద్ధము. అహ్మద్‌నగర్ సుల్తాన్ హుస్సేన్ నిజాంషా, బీజాపూర్ సుల్తాన్ అలీ ఆదిల్‌షా, గోలకొండ సుల్తాన్ ఇబ్రహీంకుతుబ్‌షా, బీదర్ సుల్తాన్ అలీ బరీద్‌షా నలుగురి మిత్రకూటమి సైన్యములు కృష్ణానదికి దక్షిణమున 15 మైళ్ళ దూరములో నున్న బాణహట్టి లేదా రాక్షసతంగడి వద్ద విజయనగర సైన్యములనెదిరించాయి. రామరాయలు తన 96వ ఏట యుద్ధమునకు నాయకత్వము వహించాడు. సోదరులైన వెంకటాద్రి, తిరుమలరాయలు ఇతని వెంటనున్నారు. ఇరువైపుల జరిగిన ఘోరయుద్ధములో క్రీ.శ. 1565, జనవరి 23న రామరాయలు హుస్సేన్ నిజాంషా చేతిలో చనిపోయాడు. వెంకటాద్రి కూడా ప్రాణములు గోల్పోయాడు. మిగిలిన తిరుమలరాయలు సదాశివరాయలను వెంటపెట్టుకొని విజయనగరము నుండి అపార ధనరాశులను 550 ఏనుగులపై మోసుకొని పెనుగొండకు పారిపోయాడు. ముస్లింల సంయుక్త సైన్యములు విజయనగరమును ప్రవేశించి కొన్ని మాసాలపాటు దోచుకొని, కట్టడములనన్నింటిని ధ్వంసముచేసి నేలమట్టము గావించాయి. ఈ యుద్ధములో అహ్మద్‌నగర్, బీజాపూర్ ప్రధానపాత్ర పోషించగా గోలకొండ, బీదర్ ద్వితీయ పాత్ర వహించాయి. గోలకొండలోని హిందువుల నుండి ఇబ్రహీంకుతుబ్‌షా ఎలాంటి వ్యతిరేకతను చవిచూడలేదు.

ఇబ్రహీం కుతుబ్‌షా హిందువులను విశ్వసించి వారిని ఉన్నత పదవుల్లో ఉంచాడు. విజయనగర రామరాయలు తన తమ్ముడైన వెంకటాద్రిని మరియు ఎల్గందుల కోట నుండి పారిపోయి వచ్చిన జగదేవరావును గోలకొండ రాజ్యములోని భాగములను కొల్లగొట్టుటకై పంపాడు. ఇబ్రహీంకుతుబ్‌షా ముస్తఫాఖాన్, ఆజంఖాన్, యాకూబ్‌ఖాన్ సేనానులతో పాటు చింతగుంట ధర్మారావు నాయకత్వములో సైన్యమును కొండవీడుకు పంపాడు. పెనుగొండ నుండి పాలించుచున్న విజయనగర రాజ్య భాగమైన కర్నూలు ప్రాంతముపై దండెత్తుటకు ఇబ్రహీంషా మురహర్‌రావు సేనానితో పాటు మలకప్ప, కదంబరాయలను పంపాడు. మురహరరావు మహారాష్ట్ర బ్రాహ్మణుడు. ఇతడు ఇబ్రహీం కుతుబ్‌షా ఆస్థానమందు ద్వితీయ స్థానమలంకరించాడు[143].

క్రీ.శ. 1565లో గోలకొండ టంకసాలలో ముద్రింపబడిన ఇతని కాలపు ఆరు నాణెములు లభ్యమైనాయి. జమ్షీద్‌కుతుబ్‌షా కాలపు నాలుగు నాణెములు, సుభాన్‌అలీ కాలపు ఒక నాణెము ప్రభుత్వ మ్యూజియంలో భద్రపరచబడినవి[144]. ఇబ్రహీం కుతుబ్‌షా క్రీ.శ.1580 జూన్ 5న చనిపోయాడు.

## 5.మహ్మద్ కులీ కుతుబ్‌షా (క్రీ.శ. 1580-1612):-

ఇబ్రహీం కుతుబ్‌షా మరణానంతరము అతని కుమారుడు మహ్మద్ కులీ కుతుబ్ షా పదిహేనవ ఏట సింహాసనమునధిష్ఠించి ముప్పై రెండేండ్లు ప్రజానురంజకముగా పాలించాడు. తండ్రివలె ఇతడు గూడా రాజనీతి కుశలుడు, రసికుడు. ఇతడు భాగ్‌మతి లేదా భాగ్యమతి అనే సుందరిని ప్రేమించి పరిణయం చేసుకొన్నాడు. రాజ్యాధికారము రాగానే ఆమెను పట్టపురాణిగా చేయ సంకల్పించాడు. ఇది దర్బార్‌లోని ఛాందసవాదులకు నచ్చలేదు. మూసీనది ఒడ్డున వెలసిన నూతన నగరమును ప్రియురాలి పేరట భాగ్‌నగరమని లేదా భాగ్యనగరమని వ్యవహరించేవాడని తెలియుచున్నది. భాగ్‌మతికి హైదర్‌మహల్ బిరుదునిచ్చుటచే దీనిని హైదరాబాద్ పేరుతో పిలువడమైనది. అయితే ఆనాటి చరిత్రలలో ఈ ప్రణయకథ ప్రస్తావన కనిపించదు. కాని సమకాలీన చరిత్రకారుడు ఫెరిష్టా మాత్రము మహ్మద్‌కులీ భాగ్‌మతి ప్రేమలో పడి మూసీనది తీరమున స్థాపించిన క్రొత్త నగరాన్ని భాగ్‌నగరమని పేరుపెట్టి తరువాత హైదరాబాద్‌గా మార్చినాడని తెలిపినాడు[145]. ఎల్గందల్ మొలంగూరు, రామగిరి కోటలతో పాటు కరీంనగర్ జిల్లాకు గూడా హైదరాబాద్ రాజధానిగా ఉంది గనుక అచటి ఆనాటి సుందరకట్టడముల గురించి ఈ క్రింద వివరించబడింది.



మహ్మద్ కులీ కుతుబ్‌షా

## హైద్రాబాద్ పట్టణ నిర్మాణము (క్రీ.శ. 1591)

కుతుబ్‌షాహీల రాజ్యమునకు గోలకొండనగరము రాజధాని. గోలకొండ కోట ఒక గుట్టపై కాకతీయుల కాలంలో క్రీ.శ. 1143లో కట్టబడింది. ఓరుగల్లు నేలిన ప్రభువు కృష్ణదేవ్ దీనిని క్రీ.శ.1363 లో బహమనీ సుల్తాన్ మొదటి ముహ్మద్‌షాకు అప్పగించాడు. క్రీ.శ. 1496లో సుల్తాన్ కులీకుతుబుల్‌ముల్క్ గోలకొండకు తరఫ్‌దార్‌గా నియమింపబడెను. బహమనీ రాజ్యం పతనమొందుతున్న కాలంలో సుల్తాన్‌కులీ క్రీ.శ. 1518లో స్వతంత్రుడై గోలకొండను రాజధానిగా చేసికొని అచటనే పట్టాభిషిక్తుడైనాడు. సుల్తాన్‌కులీ ఇదివరలో హిందూరాజులు నిర్మించిన మట్టి ప్రాకారము స్థానములో బలిష్ఠమైన రాతి కోటను నిర్మించాడు. ఇబ్రహీంకుతుబ్‌షా కాలము వరకు జనాభా పెరిగింది. పట్టణమును విస్తృతపరచుటకై అతడు క్రీ.శ. 1578లో మూసీనదిపై పురానాపూల్ (Old Bridge) నిర్మించాడు.

మహ్మూద్‌కులీ కుతుబ్‌షాకు మూసీనది ఆవలి ప్రాంతము తెలుసు. ఎందుకనగా అది వరకే పాతబ్రిడ్జ్ నిర్మాణము జరిగింది. అతడు నూతన పట్టణ నిర్మాణమునకై ఒక బృహత్ ప్రణాళికను సిద్ధము చేయించి క్రీ.శ. 1591లో మూసీనది ఒడ్డున నూతన పట్టణ నిర్మాణమునకు పునాదులు వేశాడు. ఈ పట్టణ నిర్మాణమునకు కారణము గోలకొండలో జనాభా పెరిగింది. నీటి వసతి సరిగా లేకుండా అంటు వ్యాధులు ప్రబలాయి. అందుకే మూసీనది ఒడ్డున నున్న సువిశాల ప్రాంతము నూతన పట్టణ ఆవిర్భావమునకు ప్రోత్సాహానిచ్చింది. ఈ నూతన నగరమే భాగ్యనగర్‌గా, హైద్రాబాద్‌గా పిలువబడుచున్నది. సుల్తాన్‌మహ్మూద్ కులీ స్వయంగా వ్రాసిన 'కుతుబ్ ముష్తరీ'లోని ఒక పద్యము (Couplet) సుల్తానే తన ప్రియురాలి పేరట ఈ నగరమును భాగ్‌నగర్ అని పిలిచేవాడని తెలుపుచున్నది[146]. సుల్తాన్ మహ్మూద్ కులీ కుతుబ్‌షా గతించిన తరువాత వచ్చిన టావెర్నియర్, థెవెనాట్ (1666) విదేశీయులు గూడా తమ రచనలలో భాగ్‌నగర్ అనియే పేర్కొన్నారు. క్రీ.శ.1667లో ఈ పట్టణానికి వచ్చిన బెర్నియర్ గూడా భాగ్‌నగర్ అనియే పిలిచినాడు.

## చార్‌మినార్ నిర్మాణము (1592) :-

నాలుగు గోపురములు లేదా టవర్స్ (Towers) తో కూడిన అందమైన చార్‌మినార్ భవనము క్రీ.శ. 1592లో పూర్తిగావింపబడింది. ఈ భవన నిర్మాణము పట్టణ నిర్మాణము తోడనే ఆరంభమైంది. పట్టణ మధ్యభాగమున ఈ బృహత్ నిర్మాణము అందమును చేకూర్చుననియు, దీని నుండియే నాలుగు వైపుల రోడ్ల నిర్మాణము పట్టణ విస్తరణకై జరుగవలెనని ప్రణాళిక రూపొందింపబడింది. ఇది చతురస్రాకార నిర్మాణము. ప్రతి ప్రక్క 60 అడుగుల పొడవు ఉంది. నాలుగువైపుల ఈ భవనమునకు ఎత్తైన కమాన్‌లు (Arches) నిర్మించబడినాయి. ఒక్కొక్క కమాన్ వెడల్పు 24 అడుగులు ఎత్తు 30 అడుగులు. నాలుగుమూలలందున్న మినార్‌లు

చార్‌మినార్ పైకప్పు (Roof) నుండి 80 అడుగులు, మరియు నేల (Plinth) నుండి 160 అడుగుల ఎత్తును కలిగియున్నవి. మినార్‌లోని పైభాగము చేరుటకు 146మెట్లు ఎక్కవలయును.[147] చార్‌మినార్‌కు నాలుగువైపుల రోడ్ల నిర్మాణము జరిగింది. ఈ రోడ్లుకు ఇరువైపుల 14000 దుకాణములు మదరసాలు, మసీదులు, కారవాన్ సరాయిల నిర్మాణమునకు సుల్తాన్ ఆజ్ఞాపించాడు. నూతనముగా నిర్మించు నగరమునకు అందము చేకూర్చుటకై పట్టణ కేంద్ర బిందువునందు (Central Point) చార్‌మినార్ భవనము నిర్మింపబడింది.


చార్‌మినార్


చార్‌కమాన్

## చార్‌కమాన్ నిర్మాణము (క్రీ.శ. 1594)

చార్‌మినార్‌కు ఉత్తరమున 250 అడుగుల దూరములో నాలుగు అద్భుతమైన ఎత్తైన కమాన్‌లు నాలుగు దిశలందు క్రీ.శ. 1594లో నిర్మింపబడినవి. దీనినే చార్‌కమాన్ ప్రాంతమంటారు. మధ్యనున్న నీటి ఫౌంటేన్ (Fountain) నుండి ఒక్కొక్క కమాన్ 375 అడుగుల దూరముననున్నది. అనగా ఎదురెదురుగా నిలబడియున్న రెండు కమాన్‌ల మధ్యదూరము 750 అడుగులు. ఒక్కొక్కకమాన్ వెడల్పు 36 అడుగులు, ఎత్తు 60 అడుగులున్నది. కమాన్ కట్టడపు మందము ఆరు అడుగులు[148]. వీటి పైకి మెట్లద్వారా ఎక్కి పట్టణ అందాన్ని చూడొచ్చు. హైదరాబాద్ పట్టణ నిర్మాణము కంటే పూర్వమే అందమైన అద్భుతమైన కమాన్‌లు నిర్మించు ఆచారము దేశమునందుండెను. అక్బరు చక్రవర్తి దక్కన్ విజయములకు చిహ్నముగా క్రీ.శ. 1575లో ఫతేపూర్ సిక్రీలో బులంద్ దర్వాజా యను ఎత్తైన కమాన్‌లాంటి ద్వారమును నిర్మించాడు. ఈ ద్వారము ఎత్తు 176 అడుగులు.

మహ్మద్‌కులీ కుతుబ్‌షా చార్‌మినార్, చార్‌కమాన్ కట్టడములే కాకుండా అనేక ఇతర ప్రజోపయోగ నిర్మాణముల గావించాడు. 1595లో దారుష్ షిఫా (Darush-Shifa) యను రెండంతస్తుల జనరల్ ఆసుపత్రిని కట్టించాడు. ఇందులో యునాని వైద్యకళాశాల నడుపబడేది. అనుభవజ్ఞులైన హకీమ్‌లను (Doctors) గ్రీసు, ఇటలి, పర్షియన్ గల్ఫ్ దేశముల నుండి పిలిపించి

## హైద్రాబాద్ పట్టణ నిర్మాణము (క్రీ.శ. 1591)

కుతుబ్‌షాహీల రాజ్యమునకు గోలకొండనగరము రాజధాని. గోలకొండ కోట ఒక గుట్టపై కాకతీయుల కాలంలో క్రీ.శ. 1143లో కట్టబడింది. ఓరుగల్లు నేలిన ప్రభువు కృష్ణదేవ్ దీనిని క్రీ.శ.1363 లో బహమనీ సుల్తాన్ మొదటి ముహ్మద్‌షాకు అప్పగించాడు. క్రీ.శ. 1496లో సుల్తాన్ కులీకుతుబుల్‌ముల్క్ గోలకొండకు తరఫ్‌దార్‌గా నియమింపబడెను. బహమనీ రాజ్యం పతనమొందుతున్న కాలంలో సుల్తాన్‌కులీ క్రీ.శ. 1518లో స్వతంత్రుడై గోలకొండను రాజధానిగా చేసికొని అచటనే పట్టాభిషిక్తుడైనాడు. సుల్తాన్‌కులీ ఇదివరలో హిందూరాజులు నిర్మించిన మట్టి ప్రాకారము స్థానములో బలిష్ఠమైన రాతి కోటను నిర్మించాడు. ఇబ్రహీంకుతుబ్‌షా కాలము వరకు జనాభా పెరిగింది. పట్టణమును విస్తృతపరచుటకై అతడు క్రీ.శ. 1578లో మూసీనదిపై పురానాపూల్ (Old Bridge) నిర్మించాడు.

మహ్మద్‌కులీ కుతుబ్‌షాకు మూసీనది ఆవలి ప్రాంతము తెలుసు. ఎందుకనగా అది వరకే పాతబ్రిడ్జ్ నిర్మాణము జరిగింది. అతడు నూతన పట్టణ నిర్మాణమునకై ఒక బృహత్ ప్రణాళికను సిద్ధము చేయించి క్రీ.శ. 1591లో మూసీనది ఒడ్డున నూతన పట్టణ నిర్మాణమునకు పునాదులు వేశాడు. ఈ పట్టణ నిర్మాణమునకు కారణము గోలకొండలో జనాభా పెరిగింది. నీటి వసతి సరిగా లేకుండా అంటు వ్యాధులు ప్రబలాయి. అందుకే మూసీనది ఒడ్డున నున్న సువిశాల ప్రాంతము నూతన పట్టణ ఆవిర్భావమునకు ప్రోత్సాహానిచ్చింది. ఈ నూతన నగరమే భాగ్యనగర్‌గా, హైద్రాబాద్‌గా పిలువబడుచున్నది. సుల్తాన్‌మహ్మద్ కులీ స్వయంగా వ్రాసిన 'కుతుబ్ ముష్తరీ'లోని ఒక పద్యము (Couplet) సుల్తానే తన ప్రియురాలి పేరట ఈ నగరమును భాగ్‌నగర్ అని పిలిచేవాడని తెలుపుచున్నది[146]. సుల్తాన్ మహ్మద్ కులీ కుతుబ్‌షా గతించిన తరువాత వచ్చిన టావెర్నియర్, థెవెనాట్ (1666) విదేశీయులు గూడా తమ రచనలలో భాగ్‌నగర్ అనియే పేర్కొన్నారు. క్రీ.శ.1667లో ఈ పట్టణానికి వచ్చిన బెర్నియర్ గూడా భాగ్‌నగర్ అనియే పిలిచినాడు.

## చార్‌మినార్ నిర్మాణము (1592) :-

నాలుగు గోపురములు లేదా టవర్స్ (Towers) తో కూడిన అందమైన చార్‌మినార్ భవనము క్రీ.శ. 1592లో పూర్తిగావింపబడింది. ఈ భవన నిర్మాణము పట్టణ నిర్మాణము తోడనే ఆరంభమైంది. పట్టణ మధ్యభాగమున ఈ బృహత్ నిర్మాణము అందమును చేకూర్చుననియు, దీని నుండియే నాలుగు వైపుల రోడ్ల నిర్మాణము పట్టణ విస్తరణకై జరుగవలెనని ప్రణాళిక రూపొందింపబడింది. ఇది చతురస్రాకార నిర్మాణము. ప్రతి ప్రక్క 60 అడుగుల పొడవు ఉంది. నాలుగువైపుల ఈ భవనమునకు ఎత్తైన కమాన్‌లు (Arches) నిర్మించబడినాయి. ఒక్కొక్క కమాన్ వెడల్పు 24 అడుగులు ఎత్తు 30 అడుగులు. నాలుగుమూలలందున్న మినార్‌లు

చార్‌మినార్ పైకప్పు (Roof) నుండి 80 అడుగులు, మరియు నేల (Plinth) నుండి 160 అడుగుల ఎత్తును కలిగియున్నవి. మినార్‌లోని పైభాగము చేరుటకు 146మెట్లు ఎక్కవలయును.[147] చార్‌మినార్‌కు నాలుగువైపుల రోడ్ల నిర్మాణము జరిగింది. ఈ రోడ్లుకు ఇరువైపుల 14000 దుకాణములు మదరసాలు, మసీదులు, కారవాన్ సరాయిల నిర్మాణమునకు సుల్తాన్ ఆజ్ఞాపించాడు. నూతనముగా నిర్మించు నగరమునకు అందము చేకూర్చుటకై పట్టణ కేంద్ర బిందువునందు (Central Point) చార్‌మినార్ భవనము నిర్మింపబడింది.



చార్‌మినార్



చార్‌కమాన్

## చార్‌కమాన్ నిర్మాణము (క్రీ.శ. 1594)

చార్‌మినార్‌కు ఉత్తరమున 250 అడుగుల దూరములో నాలుగు అద్భుతమైన ఎత్తైన కమాన్‌లు నాలుగు దిశలందు క్రీ.శ. 1594లో నిర్మింపబడినవి. దీనినే చార్‌కమాన్ ప్రాంతమంటారు. మధ్యనున్న నీటి ఫౌంటేన్ (Fountain) నుండి ఒక్కొక్క కమాన్ 375 అడుగుల దూరముననున్నది. అనగా ఎదురెదురుగా నిలబడియున్న రెండు కమాన్‌ల మధ్యదూరము 750 అడుగులు. ఒక్కొక్కకమాన్ వెడల్పు 36 అడుగులు, ఎత్తు 60 అడుగులున్నది. కమాన్ కట్టడపు మందము ఆరు అడుగులు[148]. వీటి పైకి మెట్లద్వారా ఎక్కి పట్టణ అందాన్ని చూడొచ్చు. హైదరాబాద్ పట్టణ నిర్మాణము కంటే పూర్వమే అందమైన అద్భుతమైన కమాన్‌లు నిర్మించు ఆచారము దేశమునందుండెను. అక్బరు చక్రవర్తి దక్కన్ విజయములకు చిహ్నముగా క్రీ.శ. 1575లో ఫతేపూర్ సిక్రీలో బులంద్ దర్వాజా యను ఎత్తైన కమాన్‌లాంటి ద్వారమును నిర్మించాడు. ఈ ద్వారము ఎత్తు 176 అడుగులు.

మహ్మద్‌కులీ కుతుబ్‌షా చార్‌మినార్, చార్‌కమాన్ కట్టడములే కాకుండా అనేక ఇతర ప్రజోపయోగ నిర్మాణముల గావించాడు. 1595లో దారుష్ షిఫా (Darush-Shifa) యను రెండంతస్తుల జనరల్ ఆసుపత్రిని కట్టించాడు. ఇందులో యునాని వైద్యకళాశాల నడుపబడేది. అనుభవజ్ఞులైన హకీమ్‌లను (Doctors) గ్రీసు, ఇటలి, పర్షియన్ గల్ఫ్ దేశముల నుండి పిలిపించి

రోగులకు వైద్యము చేయించాడు. వారు వైద్యము చేయుటయే గాక వైద్యకళాశాలలో విద్యార్థులకు వైద్యశాస్త్ర బోధన గావించేవారు[149]. 1596లో బాదుషాహి అషూర్‌ఖానా, 1597లో చార్‌మినార్ సమీపమున జామె మసీదు కట్టింపబడినాయి. మహ్మద్‌కులీ భవనముల నిర్మాతయే గాక సాహిత్యము నందు అమితాసక్తి కలిగియుండెను. ఇతని కాలములో ఫారసీ, ఉర్దూ, తెలుగు భాషలు పోషింపబడినాయి. స్వయముగా ఉర్దూలో, చక్కటిగీతాలను వ్రాశాడు. వాటన్నింటికి 'కులియాత్‌కులీ' పేరట గ్రంథ రూపాన్నిచ్చాడు.

మహ్మద్ కులీ కాలములో వర్తక వాణిజ్యములు అభివృద్ధి చెందాయి. ఇతని కాలములో గోలకొండ టంకసాల యందు క్రీ.శ. 1583లో ముద్రించిన చౌకపు, గుండ్రని నాణెములు, క్రీ.శ. 1603లో మరియు క్రీ.శ. 1608లో హైదరాబాద్ మింట్ నుండి వెలువడిన నాణెములు ఆం.ప్ర. ప్రభుత్వ మ్యూజియంలో ఉన్నాయి[150]. ఇతని అనుమతితోనే ఆంగ్లేయులు క్రీ.శ.1611లో మచిలీపట్నం నందు వర్తక స్థావరమేర్పరచుకొన్నారు.

మహ్మద్‌కులీకుతుబ్‌షా ఎన్నో దానములు చేసిన ఉదార హృదయుడు. రాజనీతి కుశలత, రసికత, పాండిత్య ప్రజ్ఞమూర్తీభవించిన గొప్ప సుల్తాన్. కుతుబ్‌షాహీల 170 సంవత్సరముల పాలనలో ఇతని పరిపాలనా కాలము మహెూజ్వలమైనదని చెప్పవచ్చు.

## 6. మహ్మద్ కుతుబ్‌షా క్రీ.శ. 1612-1626

మహ్మద్ కులీ కుతుబ్‌షాకు మగ సంతానం లేదు. అతనికి ఒకే ఒక కూతురు. ఆమె అతని ప్రియురాలైన భాగ్‌మతి కూతురై యుండును. ఆమె వివాహము మహ్మద్‌కులీ కుతుబ్‌షా తన సోదరుని పుత్రుడైన మహమ్మద్‌తో క్రీ.శ. 1607లో జరిపించాడు. ఈమెయే మహ్మద్‌కుతుబ్‌షా పట్టపురాణి హయాత్ బక్షీబేగమ్. మహమ్మద్ కులీ అల్లుడు మహమ్మద్ కుతుబ్‌షా పేరుతో గోలకొండ సుల్తానయ్యాడు. ఇతడు విద్వాంసుడు, పాలనాదక్షుడు, సారస్వత పోషకుడు. హైద్రాబాద్ నగరాన్ని ప్రాగ్దిశగా విస్తరింపజేసి సుల్తాన్‌నగర్ అని పిలుచుకొన్నాడు. ఎందరో కవులను గాయకులను ఆదరించాడు. ఇతడు తన మతమందు అమిత విశ్వాసము గలవాడై దినమునకైదు సార్లు తన 12వ ఏట నుండి తప్పకుండా నమాజ్ చేసిన సుల్తాన్.

మహ్మద్‌కుతుబ్‌షా మక్కా మసీదు నమూనాను సిద్ధపరచి, క్రీ.శ.1617లో చార్‌మినార్‌కు సమీపమున దక్షిణ దిశయందు నిర్మాణమును ప్రారంభించాడు. దీని నిర్మాణ సమయములో జీవితములో ఏనాడు ఒక్క పూట గూడా తప్పకుండా నమాజ్ చేసిన వ్యక్తి ఎవరైనా సరే పునాదిరాయి వేయవచ్చునని ప్రకటించాడు. ఉపస్థితులైన వేలాదిమందిలో ఏ ఒక్కరు ముందుకురాలేదు. అప్పుడు తానే ఏనాడు మధ్యరాత్రి నమాజ్‌ను గూడా తప్పకుండా చేసిన వ్యక్తిగా ముందుకు వచ్చి మక్కా మసీదుకు పునాదిరాయి వేసి నిర్మాణమును స్వహస్తములతో ప్రారంభించాడు. తరువాత వచ్చిన అబ్దుల్లాకుతుబ్‌షా, అబుల్‌హసన్ తానీషా సుల్తాన్‌ల కాలములో గూడా దీని

నిర్మాణము కొనసాగింది. చివరకు 77 సంవత్సరముల తరువాత ఔరంగజేబు క్రీ.శ. 1694లో మక్కామసీదు నిర్మాణము పూర్తి చేశాడు. ఈ మసీదులోని హాల్ పొడవు 67 మీ. వెడల్పు 54మీ. ఎత్తు 23మీ. భారతదేశములోని పెద్ద మసీదులలో ఇది ఒకటి. ఇందులో పదివేల మంది ఒకే సమయములో ప్రార్థన చేయవచ్చు. మేస్త్రి రంగయ్య తాపీపని వాడు మరియు ఫైజుల్లాబేగ్ ఇంజనీర్ అధ్వర్యములో దీని నిర్మాణము ప్రారంభింపబడింది.



మక్కా మసీదు

మహమ్మద్ కుతుబ్‌షా మక్కా (Mecca) నుండి తెచ్చిన మట్టితో చేసిన కొన్ని ఇటుకలను మధ్యనున్న కమాన్ పైకట్టడములో నిలిపాడు. పవిత్రమైన మక్కా మట్టి ఇటుకలు కొన్ని నామమాత్రముగా పవిత్రత కొరకు ఉంచబడినవి గనుకనే ఇది మక్కామసీదుగా ప్రసిద్ధిపొందింది. ఈ మసీదుకు దక్షిణమందు ఆసఫ్‌జాహీ నిజాంనవాబుల సమాధులు పాలరాయి (Marble)తో కట్టబడినాయి.

మహ్మద్ కుతుబ్‌షా పట్టపురాణి హయాత్ బక్షీబేగమ్ ఐదవ సుల్తాన్ మహమ్మద్ కులీ కుతుబ్‌షా తనయగా, ఆరవ సుల్తాన్ మహ్మద్ కుతుబ్‌షా భార్యగా, ఏడవ సుల్తాన్ అబ్దుల్లా కుతుబ్‌షా తల్లిగా ముగ్గురు సుల్తాన్‌ల కాలములో రాజకీయములందు ప్రధానపాత్ర వహించింది. హైద్రాబాద్‌కు తూర్పున 16 కి.మీ. దూరంలో ఆమె పేరట క్రీ.శ. 1626లో హయాత్‌నగర్‌ను సుల్తాన్ స్థాపించాడు. హయాత్‌నగర్‌లోని రాజభవనము, మసీదు చూడదగినవి. ఆమె తన 76వ ఏట క్రీ.శ. 1666లో మరణించింది. ఆమెను ప్రజలు గౌరవంగా మాసాహెబ్ (Ma Saheb or Revered Mother) అని పిలిచేవారు. ఆమెపేరట నిర్మించిన మాసాహెబ్ చెరువు నేడు మాసాబ్‌ట్యాంక్ (Masab Tank) అని పిలువబడుచున్నది. ఈ చెరువంతయు నేడు నగరముగా రూపొందింది. హుస్సేనిఆలమ్, బీబీకాచష్మా, లంగర్, హయాత్‌నగర్ మసీదు ఈమె పేరును నేటికి గుర్తుచేయుచున్నాయి.

క్రీ.శ. 1616లో ముద్రింపబడిన ఇతనికాలపు ఏడు రాగి నాణెములు లభ్యమైనాయి. వాటిపై మహమ్మద్ కుతుబ్‌షా పేరుతో పాటు రాజధాని హైదరాబాద్ పేరు గూడా చెక్కబడి ఉంది[151]. మత విశ్వాసము మిక్కుటంగా ఉన్న ఈ సుల్తాన్ మరణశయ్యపై గూడా ఖురాన్ పఠనం వింటూ శాశ్వతంగా కన్నుమూశాడు.

## 7. సుల్తాన్ అబ్దుల్లా కుతుబ్‌షా (క్రీ.శ. 1626-1672)

మహమ్మద్ కుతుబ్‌షా మరణానంతరము అతని కుమారుడు అబ్దుల్లా కుతుబ్‌షా సుల్తానయ్యాడు. ఇతుడు బాలుడైనందున తల్లి హయాత్ బక్షీ బేగం సర్దారుల సహాయముతో పరిపాలనా వ్యవహారములు చూస్తుండేది.

అబ్దుల్లా కుతుబ్‌షా కాలపు శిలాశాసనమొకటి కరీంనగర్ జిల్లాలోని కోహెడ మండలమందలి శనిగరం పెద్దచెఱువు అలుగు ప్రక్కన కట్ట మైసమ్మ గుడికి ఎదురుగా నిలిచిఉంది. ఇది రెండుప్రక్కల చెక్కబడిన 34 పంక్తుల తెలుగుశాసనం. శనిగరం పెద్ద చెఱువు (Anant Sagar) పొర్లు మత్తడి కట్టించిన సందర్భములో శక సంవత్సరము 1586 ప్లవంగ శ్రావణమాసమందు అనగా క్రీ.శ. 1664లో ఈ శాసనము వేయబడింది. అబ్దుల్లా కుతుబ్‌షా ఆజ్ఞానుసారము సైదుముజఫర్ సరిఖేలు అను అధికారి 540 హొన్నులు (Hon Gold Coins) మంజూరుచేయగా హవల్దార్ మెనవిబేగ్ వెంకటపతితో ఈ చెఱువు మత్తడి కట్టించాడు. నరసింహ క్షేత్రమున కివ్వబడిన దేవబ్రాహ్మణ వృత్తులన్నియు ఎవరు ప్రభుత్వము నడిపినను, అవి ఎప్పటిలాగే కొనసాగునని ఈ శాసనమందు చెక్కబడినది[152]. శనిగరములో శివాలయములున్నను నేడు గూడా అది ఒక నరసింహ క్షేత్రము. ఈ గ్రామములో ఒక నరసింహ దేవాలయము మరియు గుట్టపైన ఇంకొక నరసింహాలయము పూజలందుకుంటున్నాయి. అబ్దుల్లా కుతుబ్‌షా క్రీ.శ. 1626 నుండి 1672 వరకు పాలించాడు. ఈ శాసనమందు పొరపాటున శక సంవత్సరము 1586 బదులుగా 1786 అని చెక్కబడింది. సరిగా రెండు శతాబ్దముల అంతరము కనిపించుచున్నది. శక సంవత్సరము 1586 క్రీ.శ. 1664నకు సమానము గనుక అబ్దుల్లా కుతుబ్‌షా పరిపాలనా కాలమునకు సరిపోవును.

మహమ్మద్ కుతుబ్‌షా పుత్రిక మరియు అబ్దుల్లా కుతుబ్‌షా సోదరి ఖైరాతున్నిస్సా బేగం (Khairat-un-nissa Begum) ఆమె గురువు గౌరవార్థమై ఆమె పేరట మూడు కమాన్‌ల (Arches) మసీదు కట్టించింది. ఈ మసీదు చుట్టు పెరిగిన ప్రాంతమే నేడు ఖైరతాబాద్‌గా పిలువబడుచున్నది.

అబ్దులా కుతుబ్‌షా బాల్యదశయందునప్పుడే దక్షిణ భారతరాజకీయాలలో చాలా మార్పులు చోటు చేసుకొన్నాయి. శివాజీ నేతృత్వములో స్వతంత్ర హిందూ రాజ్యస్థాపనకై ప్రయత్నాలు జరిగాయి. అతని తండ్రి షాజీ గూడా మొగలుల అధికారమును వ్యతిరేకించాడు.

మొగలాయి చక్రవర్తులు దక్షిణమున తమ సార్వభౌమాధికారమును విస్తరింపజేయుటకు యుద్ధములనారంభించారు. మొగలులు క్రీ.శ. 1636 మరియు 1656లో గోలకొండపై దండెత్తారు.

## క్రీ.శ. 1636 గోలకొండ ముట్టడి :-

మొగలు చక్రవర్తి షాజహాన్ 1636లో గోలకొండ పై దండెత్తాడు. అబ్దుల్లాకుతుబ్‌షా దాడిని త్రిప్పికొట్టుటకు బదులు అవమానకరమైన సంధి షరతులకు ఒప్పుకొన్నాడు. షాజహాన్ చక్రవర్తి పేరట కుత్బా (Qutuba) చదువుటకును, అతని పేరటనే నాణెములు ముద్రించుటకును, ఆరు లక్షల కప్పము కట్టుటకును అబ్దుల్లా కుతుబ్‌షా ఒప్పుకొన్నాడు. దీనితో గోలకొండ రాజ్య సార్వభౌమాధికారము అంతరించి మొగలులకు దాసోహమైంది.

## గోలకొండపై మొగలుల దండయాత్ర (క్రీ.శ. 1656) :-

ఔరంగజేబు రాకుమారుడు రెండవసారి దక్కన్ రాజప్రతినిధిగా (క్రీ.శ. 1653-1657) వచ్చాడు. గోలకొండ రాజ్యము కప్పము బకాయలు చెల్లింప వలసియున్నదను నెపముతో క్రీ.శ.1656లో ఔరంగజేబు తన కుమారుడైన ముహమ్మద్‌ను గోలకొండ పైకి పంపాడు. ముహమ్మద్ రాకుమారుడు సైన్యముతో జనవరి 22న హుస్సేన్‌సాగర్ ఉత్తరకొనను చేరుకొన్నాడు. మొగలు సైన్యములు హైదరాబాద్ కు 5 మైళ్ళ దూరములో ఉన్నాయి. అబ్దుల్లా కుతుబ్‌షా తన రక్షణకై హైదరాబాద్ నుండి గోలకొండ కోటలో ప్రవేశించాడు. మరుసటి రోజు ముహమ్మద్ మొగలు సైన్యముతో హైదరాబాద్ నగరమును వశపరచుకొన్నాడు. ఆ తరువాత మొగలు సేనలు కోటను ముట్టడించాయి. అబ్దుల్లా కుతుబ్‌షా ముహమ్మద్‌తో రాజీపడుటకు 200 బరణీలు లేదా డబ్బీల (Caskets) నిండా వజ్ర వైడూర్యములను కానుకగా పంపాడు. ఇంతలో ఔరంగజేబు స్వయముగా ఔరంగాబాద్ నుండి బయలుదేరి జనవరి 28న గోలకొండ చేరుకొని ఏడువారములు కోటముట్టడి కొనసాగించాడు. అబ్దుల్లా కుతుబ్‌షా నాలుగు పెట్టెల నిండా విలువైన రాళ్ళు, రత్నములు, వజ్రములు మరియు ఏనుగులు, అశ్వములను ఔరంగజేబునకు కానుకగా పంపి తన తల్లి హయాత్ బక్షీ బేగం అతనితో సంప్రదించుటకు అనుమతి కోరాడు. ఔరంగజేబు వినకపోగా అబ్దుల్లా ఢిల్లీలోని షాజహాన్ చక్రవర్తితో మొరపెట్టుకొన్నాడు. అబ్దుల్లా యెడల సానుభూతి కలిగిన చక్రవర్తి తన కుమారుడైన ఔరంగజేబును గోలకొండతో సంధి చేసికొమ్మని ఆజ్ఞాపించాడు. ఔరంగజేబు తండ్రి ఉత్తర్వులను కొంతకాలము దాచి ఉంచి ముట్టడి కొనసాగించాడు. అబ్దుల్లా కుతుబ్‌షా తన అల్లుడైన నిజామొద్దీన్ అహ్మద్‌ను మొగలుల శిబిరమునకు రాయబారమునకై పంపాడు. తన రెండవ కూతురును ముహమ్మద్‌నకిచ్చి వివాహము చేయుటకై సిద్ధపడ్డాడు. మార్చి 8న హయాత్ బక్షీ బేగమ్ ముఖాముఖి ఔరంగజేబుతో చర్చలు జరిపింది. ఔరంగజేబు కోటి రూపాయలను మూడు వాయిదాల క్రింద చెల్లింపవలెనని బేగమ్‌ను కోరాడు. ముహమ్మద్

వివాహమునకు ఒప్పుకొని అబ్దుల్లాకుతుబ్‌షా తరువాత తన కుమారుడే గోలకొండ సుల్తాన్ కావలెనని ఔరంగజేబు షరతు పెట్టాడు. వీటన్నింటికి ఒప్పుకొనిన పిదప 1656 ఏప్రిల్ 4న అబ్దుల్లా రెండవ కూతురు వివాహము ముహమ్మద్‌తో జరిగింది. రాకుమారి వివాహానంతరము తన వెంట పదిలక్షల విలువైన వజ్రవైడూర్యములను కానుకగా తీసికొని పోయింది. అయినప్పటికి రెండున్నర లక్షల హొన్నులు కావలెనని కట్నము క్రింద కోరుటయే గాక రామగిరి కోటను కూడా ఔరంగజేబు కోరాడు[153]. ఆనాటి హొన్ను బంగారు నాణెము విలువ మొగలుల నాలుగు రూపాయలకు సమానము.

## రామగిరి కోట మొగలుల వశమగుట :- క్రీ.శ. 1656

ముహమ్మద్‌తో జరిగిన వివాహపు కట్నము క్రింద కరీంనగర్ జిల్లాలోని రామగిరి దుర్గము మొగలులకివ్వబడింది. ప్రశాంతవాతావరణములో నున్న ఎత్తైన రామగిరి దుర్గమును ఆనాడు విశ్రాంతి స్థలముగా ఆరామ్‌గిరిగా పిలిచేవారు. ఆనాటి రాంగిర్ జిల్లా నేటి కరీంనగర్ జిల్లా తూర్పు ప్రాంతమే కాకుండా గోదావరి, పైన్ గంగా నదుల మధ్యనున్న నేటి ఆదిలాబాద్ జిల్లా తూర్పు ప్రాంతము తాండూర్, సిర్పూర్-కాగజ్‌నగర్‌లను కలుపుకొని ఉండేది. రామగిరి దుర్గముతో పాటు దాని పాలన క్రిందనున్న ఈ ప్రాంతమంతయు 1656లోనే మొగలుల అధీనములోనికి వచ్చింది.

కుతుబ్‌షాహీల కాలములో గోలకొండ రాజ్యము వజ్రముల వ్యాపారమునకు జగద్విఖ్యాతమై యుండెను. అబ్దుల్లా కుతుబ్‌షా కాలములో ఫ్రెంచి వర్తకుడు టెవర్నియర్ (Tavernier) క్రీ.శ. 1645లో గోలకొండను దర్శించి ఆనాటి స్థితిగతులు వ్రాసి పెట్టాడు. గోలకొండ కోటకు దగ్గరలో నున్న కారవాన్ (Caravan) గ్రామములో వజ్రములకోత మరియు పాలిష్ (Polish) పని విరివిగా జరుగుతుండేది. కృష్ణానది ఒడ్డున ఒక్క కొల్లూరు నందే 6000 ఆరువేల మంది కార్మికులు ప్రతిరోజు వజ్రముల గనులలో పనిచేయుచుండిరని స్వయముగా చూచిన వజ్రాల వర్తకుడు టెవర్నియర్ పేర్కొన్నాడు. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన కోహినూర్ వజ్రము ఇచటనే లభించింది. అబ్దుల్లా కుతుబ్‌షా కాలములోనే అతని మీర్‌జుమ్లా ఈ వజ్రమును షాజహాన్ మెప్పుపొందుటకు అతనికి బహూకరించాడు. క్రీ.శ.1665లో టెవర్నియర్ దీనిని ఔరంగజేబు కోశాగారమున జూశాడు.(Travels in India by Tavernier, Page 343) క్రీ.శ. 1739లో నాదిర్షా ఢిల్లీపై దండెత్తినప్పుడు దీనిని పర్షియాకు తీసికొని పోయాడు. క్రీ.శ. 1747లో నాదిర్షామనుమడైన షారుక్ (Shahrukh) చేతిలోనికి పోయింది. క్రీ.శ. 1751లో అఫ్ఘానిస్థాన్ పాలకుడైన అహ్మద్‌షా అబ్దాలి వశమైంది. అతని నుండి వరుసగా అతని కుమారులైన షాజహాన్, షాషుజాల హస్తగతమైంది. అఫ్ఘనులు కాబుల్ నుండి ఈ వజ్రమును క్రీ.శ. 1812లో పంజాబ్ సింహమని పేరు గాంచిన మహారాణా రంజీత్‌సింగ్‌కు బహూకరించారు. క్రీ.శ.1839లో

రంజీత్‌సింగ్ చనిపోయాడు. అప్పుడు ఈ కోహినూర్ విలువ ఒక మిలియన్ స్టెర్లింగ్‌లు (One Million Sterling). క్రీ.శ. 1849లో ఆంగ్లేయులు శిక్కుల నోడించి పంజాబ్‌ను వశపరచుకొన్నారు. అప్పుడు ఈ వజ్రము లార్డ్ లారెన్స్ (Lord Lawrence) చేజిక్కింది. ఆంగ్లేయులు ఈ విలువైన వజ్రాన్ని ఇంగ్లాండ్ మహారాణి విక్టోరియాకు ఇచ్చారు. కోహినూర్‌ను కోసి శుభ్రపరచిన తరువాత దాని బరువు 106 క్యారట్లకు తగ్గింది. ఇప్పుడది బ్రిటిష్ పాలకుల కిరీటమందు అలంకరింపబడి ఉంది. షాజహాన్ కాలములో వజ్ర వైడూర్యములతో పొదగబడిన బంగారు నెమలి సింహాసనము ప్రస్తుతము బ్రిటిష్ మ్యూజియంలో నున్నది. భారతదేశము స్వతంత్రించిన తరువాత కోహినూర్ వజ్రమును, నెమలి సింహాసనమును తిరిగి ఇండియాకు అప్పగించవలసినదిగా భారత ప్రభుత్వము విఫలప్రయత్నము చేసింది.

అబ్దుల్లాకుతుబ్‌షా కాలములో వెలికి తీసిన కొన్ని వజ్రములు ఫ్రాన్స్ మ్యూజియంలో ఉన్నాయి. ఫ్రెంచి వజ్రాల వర్తకుడు టెవర్నియర్ 67 క్యారెట్ల బరువున్న ఇక్కడి హోప్ వజ్రమును (Hope Diamond) ఫ్రాన్స్ సుప్రసిద్ధ చక్రవర్తి పదునాల్గో లూయికి అమ్మెనని తెలియుచున్నది[154].

అబ్దుల్లా కుతుబ్‌షా కాలములో గోలకొండ కోటకు ఈశాన్యమందు ఒక గుట్టపై నయాఖిలా యను క్రొత్తకోట నిర్మింపబడింది. ఇతడు ఉన్నటువంటి కోట గోడను అక్కడి వరకు పొడిగించి బలిష్ఠమైన బురుజులు కట్టించాడు. కోటలోని బలమైన మూసాబురుజు మూసాఖాన్‌చే నిర్మింపబడింది. ఇతడు సుల్తాన్ యొక్క సేనాని. క్రీ.శ. 1671లో తోలి మసీదు (Toli Masjid) నిర్మింపబడింది. దీని ముందరి రెండు అందమైన మినార్‌ల ఎత్తు 20మీ. గోలకొండకు ఒక మైలు దూరములో బారాదరి రెండంతస్తుల అందమైన తారామతి భవనము ఆమె నాట్య సంగీతములకు కేంద్రముగా ఉండేది. పేమమతి (ప్రేమామతి) మసీదు దర్శనీయము. తారామతి, ప్రేమామతి ఇరువురు సుప్రసిద్ధ నర్తకీమణులు మరియు మధురగాయకులు. అబ్దుల్లా కుతుబ్‌షా మరియు అబుల్‌హసన్ తానీషా కాలములో ఈ ఇరువురు నర్తకీమణులు తమ అద్వితీయ కళా నైపుణ్యముతో ప్రేక్షకులనుర్రూతలూగించే వారు.

కుతుబ్‌షాహీ సుల్తాన్‌ల మరియు ఆసఫ్‌జాహీ నవాబుల కాలములో నౌబత్ పహాడ్‌పై నగారాలు వాయించి రాచఫర్మానాలు ప్రజలకు చదివి వినిపించేవారు. నౌబత్ అనగా డ్రమ్ (Drum), డోలు లేదా నగారా, పహాడ్ అనగా గుట్ట. నగారావాయించి ఫర్మానాలు లేదా రాజాజ్ఞలు చదివి వినిపించే గుట్ట కనుక దీనికి నౌబత్ పహాడ్ అని పేరు వచ్చింది. ఈ గుట్ట 300 అడుగుల ఎత్తున్నది. దీనికి దక్షిణమున ఫతేమైదాన్ ఉంది. గోలకొండ విజయము తరువాత ఔరంగజేబు తన సైన్యాన్ని ఇక్కడ విడిది చేశాడు. క్రీ.శ. 1853 నుండి నిజాం నవాబులు దీనిని సైనిక పరేడ్లకుపయోగించారు. ఇప్పుడీ మైదానమున లాల్‌బహాద్దూర్ స్టేడియం నిర్మింపబడింది. క్రికెట్ మ్యాచ్‌లకు రాజకీయ సమావేశములకిది ఉపయోగపడుచున్నది.

అబ్దుల్లా కుతుబ్‌షా కాలము భాష, సారస్వతము, సంగీతం, కళారంగాలలో విఖ్యాతి నార్జించింది. ఇతని కాలము ఉర్దూ సాహిత్య స్వర్ణయుగంగా కీర్తింపబడింది. ఇతని ఆస్థానమును దర్శించిన మహనీయుడు క్షేత్రయ్య గౌరవమర్యాదలు పొందినాడు. క్షేత్రయ్య 1500 పద్యాలతో కూడిన రచననొక దానిని అబ్దుల్లా కుతుబ్‌షాకు అంకితమిచ్చినట్లు తెలియుచున్నది. ఈ సుల్తాన్ కాలములోనే వరంగల్ నివాసి మాదన్న పేష్కార్ (Peshkar)గా నియమింపబడినాడు. తరువాత కాలములో అబుల్ హసన్ తానీషా ఇతనిని దివాన్ (1674-1686) గా నియమించాడు. అబ్దుల్లా కుతుబ్‌షా క్రీ.శ.1672లో చనిపోయాడు. ఇతని కంటె ముందే ఇతని అల్లుడు అనగా ఔరంగజేబు కుమారుడు ముహమ్మద్ గూడా గతించాడు. కావున వేరొక అల్లుడు అబుల్‌హసన్ తానీషా సుల్తానయ్యాడు.



కుతుబ్‌షాహి సమాధులు

## 8. అబుల్ హసన్ కుతుబ్‌షా (తానీషా) (క్రీ.శ.1672-1687)

అబ్దుల్లా కుతుబ్‌షా అనంతరము అతని అల్లుడు అబుల్‌హసన్ కుతుబ్‌షా సుల్తానయ్యాడు. నేటి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రముతో పాటు మద్రాసు వరకు ఇతని రాజ్యము విస్తరించింది. ఈ సుల్తాన్ భోగలాలసుడు, విలాసపురుషుడు, సున్నిత మనస్కుడు. ఈ పదాలకు పర్యాయ పదంగా అతడు తానీషా (The Fastidious Prince) యని పిలువబడినాడు. ఇతడు రాజకీయ వ్యవహారములలో ఏనాడు ఉదాసీనత వహించలేదు. ప్రభుత్వ పాలనా వ్యవస్థను చక్కదిద్దాడు. తరుచుగా దేశపర్యటనగావించి స్థితిగతులు తెలిసికొనేవాడు. తిరుగుబాట్లు జరుగకుండా చక్కటి గూఢచారవ్యవస్థ నేర్పరచినాడు. ఇతడు సమర్థుడైన పాలకుడు గనుకనే తీరాంధ్రమందు స్థావరములేర్పరచుకొనిన ఆంగ్లేయులు గూడా తన ఫర్మానాలు కచ్చితంగా పాటించునట్లు చూచాడు. మత వివక్ష చూపకుండా సమర్థులైన వారికి ఉద్యోగములిచ్చాడు. హిందువులను మంత్రులుగా ఉన్నత పదవులందునియమించాడు. అట్టి వారిలో అక్కన్న మాదన్న

సోదరులు విశిష్టులు. వీరు పింగళి వంశీయులైన నియోగి సోదరులు[155]. వీరు హిందూ మహమ్మదీయులను భేదభావము లేకుండా సక్రమ పాలన జరిపి శ్లాఘనీయులైనారు.

మాదన్న (మాదోభానుజి సూర్యప్రకాశరావు) హన్మకొండలోని విద్వత్కుటుంబములో ఆవిర్భవించి అంచెలంచెలుగా ఎదిగినవ్యక్తి. ప్రప్రథమములో ఇతుడు పదిరూపాయల వేతనముపై ష్రాఫ్ లేదా సర్రాఫ్ (Shroff or Sarraf i.e. Money Changer) ఉద్యోగములో ప్రవేశించెను. అవిరళకృషి, అకుంఠిత దీక్షా దక్షతలతో ఉన్నతోద్యోగములు పొందాడు. అబ్దుల్లా కుతుబ్‌షా కాలములోనే పేష్కార్‌గా నియమింపబడ్డాడు. ఇతని విశ్వసనీయతకు ముగ్ధుడైన అబుల్‌హసన్ ఇతనికి దివాన్‌గా పదోన్నతి కలిగించాడు. ప్రతిష్ఠాత్మకమైన దివాన్ పదవిని (క్రీ.శ. 1674-1686) కడు సమర్థతతో నిర్వహించాడు. సుల్తాన్ తరువాత పరమోన్నత అధికారి దివాన్ అనగా ప్రధానమంత్రి గనుక ఈ పదవి సాధారణంగా రాజ కుటుంబీకులకు లేదా రాజు సన్నిహితులకు దొరికేది. కాని హిందువైన మాదన్నను దివాన్‌గా నియమించుట అబుల్‌హసన్ కుతుబ్‌షాకు హిందువులపై నున్న అచంచలమైన విశ్వాసమునకు తార్కాణమని చెప్పవచ్చు.

మాదన్న సోదరుడు (Younger brother) అక్కన్న సేనానాయకునిగా నియమింపబడినాడు. తరువాత బీజాపూర్ పాలకునిగను ఆ తరువాత కర్ణాటకమునకు గవర్నర్‌గా పనిచేశాడు. మాదన్న మేనల్లుండ్లలో ఒకడైన పొదిలి లింగన్న పూనమలీపాలకునిగా క్రీ.శ. 1682లో నియమింపబడువరకు అక్కన్న కర్ణాటకమందే ఉన్నాడు. పూనమలీ జిల్లాలో సేయింట్ జార్జికోట (Fort St. George) ఉండేది. అక్కడి ఆంగ్లేయులు సుల్తాన్ ఆజ్ఞలు పాటించేట్లు చేశాడు.

మాదన్న మేనల్లుడొకడు భద్రాచలం ప్రాంతపు తహసీల్దార్ (Revenue Officer)గా నియమింపబడెను. అతడే నేలకొండ పల్లెనివాసియైన కంచర్ల గోపన్న. ఇతడు రెవెన్యూ ద్వారా వసూలైన ప్రభుత్వ ధనమునంతయు భద్రాద్రి దేవాలయ నిర్మాణమునకై వినియోగించాడు. ఇది తెలిసిన సుల్తాన్ అతనిని గోలకొండ కోటలో కారాగృహమునందుంచాడు. గోపన్న అవతారపురుషుడైన శ్రీరామచంద్రుని గొప్పభక్తుడు. కారాగృహము నందే అనేక కీర్తనలు రచించాడు. ఇతడు రామదాసుగా, భద్రాచల రామదాసుగా కీర్తింపబడినాడు. భద్రాచల రామదాసు కీర్తనలు మిగుల ప్రాచుర్యమును పొంది నేటికిని ఆంధ్రదేశమున ఇంటింట ఆబాలగోపాలము భక్తి శ్రద్ధలతో గానము చేయుచునే ఉన్నారు. ఒకనాటి రాత్రి సుల్తాన్ స్వప్నములో రాముడు, లక్ష్మణుడు అను పేర్లు గల ఇద్దరు వ్యక్తులు వచ్చి రామదాసు బాకీపడ్డ డబ్బునంతయు చెల్లించి రసీదు తీసికొని పోయినారని కృష్ణస్వామి అయ్యంగార్ తమ రచనలలో తెలిపారు. సుల్తాన్ మేలుకొని చూచే వరకు అతని వద్ద డబ్బు కనిపించింది. గోపన్నను గొప్ప రామభక్తునిగా నెంచి అతనిని విడుదల చేశాడు. భద్రాచలంతో పాటు ఇంకను రెండు గ్రామములను శ్రీరాముని దేవాలయ నిర్వహణకై అగ్రహారములుగా ఇచ్చాడు. రామదాసు దాశరథీ శతకము జగద్విఖ్యాతము.

మాదన్న క్రీ.శ. 1676లో కరీంనగర్ జిల్లాలో గోదావరి తీరమందున్న ధర్మపురి లక్ష్మీనరసింహస్వామి ఉత్సవములకు మరియు నిత్యపూజలకై అక్కడి బ్రాహ్మణులకు భూమిని దానం చేశాడు. మాదన్నకాలపు ప్రభుత్వ ముద్రతో గూడిన సనదు పత్రములు (Manuscript documents with the official seal of Madanna) నేడు మునగాల చిద్రూపయ్య పంతులు వారి మరియు వజ్జల వారి పత్రములు అను పేరట పిలువబడుచున్నవి. ఈ పత్రములు (Documents) ధర్మపురి నివాసి ఆం.ప్ర. ప్రభుత్వ పురావస్తు శాఖలో శాసన పరిశోధన విభాగము నందు పనిచేసిన కీ.శే. సంగనభట్ల నరహరి గారి వారసుల వద్ద భద్రముగా నున్నవి.[156]

మాదన్న అక్కన్నల చొరవతో అబుల్‌హసన్ కుతుబ్‌షా మహారాష్ట్రులతో స్నేహపూర్వకముగా ఉండేవాడు. క్రీ.శ. 1677లో శివాజీ హైదరాబాద్‌ను సందర్శించాడు. మొగలులకు వ్యతిరేకముగా జరుపు పోరాటములో శివాజీకి ప్రతి ఏట ఒక లక్ష హొన్నులు బంగారు నాణెములు (Hons) సహాయమందించుటకు (Subsidy) ఒప్పుకొన్నాడు. శివాజీ గోల్పోయిన కోటలను మొగలుల నుండి తిరిగి వశపరచుకొనుటకు సుల్తాన్ సహకరించాడు. క్రీ.శ. 1680లో శివాజీ మరణించిన తరువాత అతని కుమారుడైన శంభాజీ మొగలులకు వ్యతిరేకముగా పోరాడుటకై ఒక లక్ష పగోడాలు పంపాడు. పగోడాలనగా బంగారు నాణెములు.

మాదన్న అక్కన్నల అద్వితీయమైన శక్తి సామర్థ్యములకు ఓర్వలేని అసూయపరులు కుట్రలు పన్ననారంభించారు. క్రీ.శ. 1686 మార్చ్ 16వ రోజున సాయంకాల సమయమందు అక్కన్న మాదన్న లిరువురు సోదరులు రాజభవనము నుండి తమ నివాసగృహములకు తిరిగి వెళ్ళుచుండగా గోలకొండ నగర వీధులలోనే దారుణహత్యకు గురైనారు. గోలకొండ రాజ్యము పతనమగుటకు ఒకటిన్నర సంవత్సరముల పూర్వమే సుల్తాన్ సన్నిహితులైన ఈ ఇరువురు సోదరులు చనిపోయారు. తెగిన మాదన్న తలను షోలాపూర్‌లో బసచేసిన ఔరంగజేబు వద్దకు పంపగా అక్కన్న తల ఏనుగుకాలు క్రింద త్రొక్కించబడింది[157]. దేశభక్తులైన, స్వామిభక్తులైన ఈ ఇరువురి సోదరుల మరణము గోలకొండ రాజ్య పతనమునకు కారణమైంది.

ఔరంగజేబు మొగలు చక్రవర్తి క్రీ.శ. 1686లో బీజాపూర్‌ను జయించిన తరువాత మరుసటి సంవత్సరము తన దృష్టిని గోలకొండ రాజ్యము పైకి మరల్చాడు. చక్రవర్తి సామ్రాజ్య విస్తరణ కాంక్షతో పాటు, గోలకొండ సుల్తాన్ మహారాష్ట్రులకు తోడ్పడుట, అక్కన్న మాదన్నలకు, హిందువులకు ఉన్నతోద్యోగము లిచ్చుట, సుల్తాన్ షియా మతస్థుడగుట మరియు గోలకొండ కోటలోని ధనరాశులు ఆకర్షించుట మున్నగు కారణముల వలన ఔరంగజేబు గోలకొండపై దండెత్తాడు.

## గోలకొండ పతనము (క్రీ.శ. 1687)

మొగలు చక్రవర్తి ఔరంగజేబు స్వయముగా సైన్యములతో క్రీ.శ. 1687 జనవరి 28

రోజున బలిష్ఠమైన గోలకొండ కోటను ముట్టడించాడు. ముట్టడి 8 మాసములు కొనసాగింది. అబుల్ హసన్ కుతుబ్‌షా ఇదివరకే అక్కన్న మాదన్నలను గోల్పోయాడు. అతని సేనాని ఖలీలుల్లాఖాన్ మొగలుల పక్షమున జేరి 6 వేల మనసబ్‌దార్‌గా నియమింపబడినాడు. షేక్‌నాజిమ్ లాంటి ఇతర సేనానులు గూడా ఒకరి తరువాత నొకరు మొగలుల పక్షము జేరి మనసబ్‌దారులైనారు. అయినప్పటికిని అబుల్‌హసన్ కుతుబ్‌షా కృతనిశ్చయుడై కోటలో నుండి పోరును సాగించాడు. మొగలు సైన్యము కోటచుట్టూ కందకములు, (Trenches) సొరంగములు త్రవ్వి ప్రేలుడు పదార్థములను వాడినను ప్రయోజనము లేకపోయింది. మొగలు సేనాని ఖాజా ఆబిద్ మందు గుండు దెబ్బతగిలి మరణించాడు. ఔరంగజేబు బెరార్ నుండి దూది నింపిన సంచులు (Cotton Bags) 50వేలు తెప్పించి కందకము లేదా అగడ్త (Moat or Ditch) ను పూడ్చుటకు, కోటగోడలకు నిచ్చెనలు వేయుటకు (Escalade) త్రాళ్ళు కట్టిలోనికి ప్రవేశించుటకు విఫల ప్రయత్నము చేశాడు. రేయింబవళ్లు ఫిరంగుల మోతతో (Bombardment) కోట ప్రాంతమంతయు దద్దరిల్లింది. జూన్ నెలలో వర్షఋతువు ప్రారంభమైంది. అగడ్తలన్ని జలమయమై మొగలలు దాటుటకు వీలులేకుండెను. భారత దేశమంతటి నేలిన మొగలు చక్రవర్తి ఔరంగజేబు జనవరి నుండి సెప్టెంబర్ వరకు 8 మాసములు ముట్టడించినను, దుర్భేద్యమైన కోట ముందు అతని శక్తి సామర్థ్యములు వృథా అయినాయి. చివరకు కోటలోని అఫ్ఘన్ ఉద్యోగి అబ్దుల్లాఖాన్ పన్నికి లంచమిచ్చి క్రీ.శ. 1687, సెప్టెంబర్ 28 రోజున అర్ధరాత్రి దాటిన తరువాత (3 a.m.) కోట వెనుకవైపు నున్న ద్వారము (Fatah darwaza) ను రహస్యముగా తెరిపించాడు. సేనాని అబ్దుర్‌రజాక్ లారీ తన వెంట ఒక దజను సైనికులను నిలుపుకొని కనివిని ఎరుగని అద్భుతమైన పోరు సలిపి మొగలు సైన్యమునకు తీవ్రమైన నష్టము కలిగించాడు. ఆపాదమస్తకము అతని శరీరమంతయు 70 గాయములతో నిండి పోయింది. ఒక కన్ను పోయింది. ఒక్క ముఖము పైననే 12 గాయములైనాయి. పాలభాగమున నున్న చర్మము నేత్రములపై ముక్కుపై వ్రేలాడుతూ ఉండింది. అతని ధైర్యసాహసములకు ఔరంగజేబే ఆశ్చర్యపోయాడు. వైద్యులచే చికిత్స చేయించి అతనిని మొగలు సైన్యములో ప్రవేశింపమని కోరాడు. కాని లారీ దానిని తిరస్కరించి గోలకొండ సుల్తాన్ యెడల తనకున్న అపారమైన స్వామి భక్తిని ప్రకటించిన విశ్వాసపాత్రుడు.

మొగలు సేనాని రూహుల్లాఖాన్ 400 అడుగుల ఎత్తున్న గోలకొండ కోటకొనపై నున్న బాలాహిసార్ భవనాన్ని చేరాడు. పట్టుబడుటకు సిద్ధముగా ఎదురు చూచుచున్న అబుల్‌హసన్ సుల్తాన్‌ను అతడు బందీగా గైకొని చక్రవర్తి ముందు నిలిపాడు. ఔరంగజేబు దౌలతాబాద్ కోటలోని కాలాభవన్‌లో సుల్తాన్‌ను బందీగా నుంచి ఏట 50 వేల భరణమిచ్చాడు. అబుల్‌హసన్ క్రీ.శ.1700లో మరణించాడు. ఇంతటితో కుతుబ్‌షాహీ వంశపాలన అంతమైంది. గోలకొండలోని ధనరాశులు మొగలుల వశమైనాయి. 68 లక్షల 51వేల హొన్నులను బంగారునాణెములు, రెండు కోట్ల 53వేల రూపాయలు, 15 కోట్ల 13 లక్షల దామ్‌నాణెములు (Dams) మరియు

లెక్కకందని వజ్రవైడూర్యములు, బంగారు వెండి ఆభరణములు, పాత్రలు మున్నగునవన్నియు మొగలులు వశపరచుకొన్నారు[158]. గోలకొండను, హైదరాబాద్ నగరమును విచ్చలవిడిగా దోచుకొనిరని ఖాఫీఖాన్ (Khafi Khan) చరిత్రకారుడు వ్రాశాడు. 170 సంవత్సరములకు పైగా వైభవోపేతముగా పాలించిన కుతుబ్‌షాహీల పాలన అంతమొంది గోలకొండ రాజ్యమంతయు మొగలుల పాలన క్రిందికి వచ్చింది. ఈ రాజ్య అంతర్భాగమైన కరీంనగరము జిల్లా గూడా మొగలుల ఆధిపత్యములోనికి వచ్చింది.

గోలకొండ రాజ్యము సర్కారులుగను, ఫర్గణాలుగను విభజింపబడింది. మొలంగూరు సర్కారు నందు మూడు ఫర్గణాలుండినాయి. మొలంగూరు సర్కారు వార్షిక ఆదాయము 68 వేలు. ఎల్గందుల సర్కారు నందు 21 ఫర్గణాలుండేవి. ఎల్గందుల సర్కారు వార్షిక ఆదాయము 12 లక్షల 20 వేలు[159]. గోలకొండ రాజ్యములో హొన్నుల విలువ 3 నుండి నాలుగు రూపాయలుండేది. పగోడా విలువ 4 నుండి 5 రూపాయల వరకు ఉండేది. ఆ రోజులలో ఒక ఎద్దు ధర 5 రూపాయలు మేక ధర 5 నుండి 10 అణాలు ఉండేది[160].

## మొగలుల పరిపాలన (క్రీ.శ. 1687-1724)

షాజహాన్ చక్రవర్తిగా నున్నప్పుడే కరీంనగర్ జిల్లాలోని రామ్‌గీర్ దుర్గమును గోలకొండ అబ్దుల్లా కుతుబ్‌షా తన రెండవ కూతురును దక్కన్ రాజప్రతినిధిగా నుండిన ఔరంగజేబు కుమారుడగు ముహమ్మద్‌న కిచ్చి వివాహము చేసిన సందర్భములో క్రీ.శ. 1656లోనే మొగలులకు వరకట్నము క్రింద ఇచ్చిన విషయము విదితమే. గోలకొండ రాజ్యము క్రీ.శ. 1687లో పతనము కావడానికి మూడు దశాబ్దముల ముందే రామగిరి దుర్గము అనగా నేటి కరీంనగర్ జిల్లా తూర్పు ప్రాంతము మొగలుల వశమైంది. నాందేడ్ సర్కారు క్రిందనున్న రామగిరి ఫర్గణాను మరియు సేరమ్ (Serum) ప్రాంతములను అబుల్‌హసన్ కుతుబ్‌షా తిరిగి స్వాధీనము చేసికొనినట్లు తెలియుచున్నది. అందుచే ఔరంగజేబు మండిపడి అబుల్‌హసన్ కుతుబ్‌షాను హెచ్చరించుచు వాటిని తిరిగి మొగలులకు అప్పగించవలసినదిగా ఆజ్ఞాపించాడు[161]. రామగిరి ఫర్గణా మరియు సేరమ్ ప్రాంతము కొంత కాలము మొగలుల అధీనములోని నాందేడ్ సర్కారు నందుండినట్లు తెలియుచున్నది. సర్కారు అనగా నేటి జిల్లాలాంటి ఒక పాలనావిభాగము.

క్రీ.శ. 1687లో గోలకొండ రాజ్య పతనానంతరము దక్కన్ మొగలుల సార్వభౌమాధికారము క్రిందికి వచ్చింది. గోలకొండ రాజ్యములోని అన్ని దుర్గములవలె ఎల్గందల్, మొలంగూర్ దుర్గములు గూడా మొగలుల వశమైనాయి. కరీంనగర్ జిల్లా దాదాపు నాలుగు దశాబ్దములు మొగలుల పాలన క్రింద ఉంది. కరీంనగర్ జిల్లాలోని మంథని డివిజన్ నందు గల మహదేవ్‌పూర్ పాత తాలుకాలోని కాళేశ్వరము నందు మరియు సోనిపేట్ నందు ఔరంగజేబు మసీదులు కట్టించాడు[162]. కాళేశ్వరము దేవాలయము వెనుక నున్న మసీదులో ఔరంగజేబు

నమాజు చేసేవాడని తెలియుచున్నది. ఔరంగజేబు మొదట ముహమ్మద్ ఇబ్రహీం ఖలీలుల్లాఖాన్‌ను తరువాత రూహుల్లాఖాన్‌ను హైదరాబాద్ సుబేదార్‌లుగా నియమించాడు. ఎల్గందల్‌లోని ఔరంగజేబు కాలపు అముద్రిత శాసనము (Unpublished Inscription) లో రాయ్‌బింద్రబాన్ (Rai Bindraban) ప్రసక్తి ఉంది. అతడు లుబ్బుత్-తారీఖ్ (Lubbu-t-Twarikh) యను భారతదేశచరిత్రను షాహబుద్దీన్ ఘోరి నుండి క్రీ.శ. 1689 వరకు రాశాడు. ఔరంగజేబు అతనిని గౌరవించి రాయ్ (Rai) బిరుదునిచ్చి మొజమ్ రాకుమారుని వద్ద దివాన్‌గా నియమించాడు. కాని క్రీ.శ. 1686లో జరిగిన బీజాపూర్ యుద్ధ సమయమందు తొలగింపబడినాడు[163].

ఔరంగజేబు పాలనలో రుస్తుమ్ దిల్‌ఖాన్ క్రీ.శ. 1687-1707 మధ్యకాలమందు హైదరాబాద్ సుబేదార్‌గా ఉన్నాడు. అతడు ఔరంగజేబు 35వ రాజ్యవర్షమున 5వ రబ్బీవుల్ అవ్వల్ నాడు అనగా క్రీ.శ. 1693లో ధర్మపురిలోని ప్రాచీన నృసింహదేవాలయమును మసీదుగా మార్చి అబుల్‌హసన్ ఫారస్ (Abul Hasan Faras) ను మౌజన్‌గా నియమించి మసీదు నిర్వహణకై వంద బిగాల నేలనిచ్చాడు. ఒక బిగకు 30 గుంటలు అనగా ఎకరములో మూడు పాళ్లు. వంద బిగాల స్థలమనగా 75 ఎకరములకు సమానము. సుబేదార్ ఇచ్చిన ఫర్మానాను సయ్యద్ ఫతే అలి పత్రములంటారు. ఈ వ్రాతపత్రములు (Manuscript documents) ధర్మపురి సంగనభట్ల నరహరి వద్ద నుండినట్లు తెలియుచున్నది[164]. ఈ మసీదులో నేటికిని ఆనాటి దేవాలయ చిహ్నములనేకములు కనిపిస్తూనేఉన్నాయి. రెండు దశాబ్దముల పూర్వము మసీదు ప్రవేశద్వారముపై అడుగున ద్వారపాలకుల విగ్రహములు కనబడ్డాయి. కాని అవి అదృశ్యమగునట్లు ద్వారము మరమ్మతు చేయబడింది. మసీదుగా మార్చుటకు ముందు అది ఒక త్రికూటాలయము. అధిష్ఠానముపై నాలుగు పత్రములతో కూడిన కమలములు వరుసగా కనిపించేవి.

ఔరంగజేబు చక్రవర్తి అర్ధశతాబ్దము క్రీ.శ. 1658 నుండి 1707 వరకు పాలించాడు. కాని కరీంనగర్ జిల్లా ప్రాంతము గోలకొండ రాజ్యములోని ఇతర ప్రాంతముల వలె క్రీ.శ. 1687 నుండి 1707 వరకు అతని అధీనమందుండేది. క్రీ.శ. 1724లో ఆసఫ్‌జాహీ వంశస్థాపన జరుగు వరకు ఈ ప్రాంతము మొగలుల స్వాధీనమై ఉండేది. ఇతర ప్రాంతములతో పాటు కరీంనగరము జిల్లాను పాలించిన మొగలు చక్రవర్తుల జాబితా క్రీ.శ. 1687 నుండి 1724 వరకు ఈ క్రింద నివ్వబడినది.

| | |
|---|---|
| ఔరంగజేబు | క్రీ.శ. 1687-1707 |
| బహాద్దూర్‌షా | క్రీ.శ. 1707-1712 |
| జహాందార్‌షా | క్రీ.శ. 1712-1713 |
| ఫర్రూక్ సయ్యర్ | క్రీ.శ. 1713-1719 |

| | |
|---|---|
| రఫీయుద్దరాజత్ | క్రీ.శ. 1719 - ...... |
| రఫీయుద్దౌలా | క్రీ.శ. 1719 - ...... |
| ముహమ్మద్‌షా | క్రీ.శ. 1719-1724 |

ఔరంగజేబు క్రీ.శ. 1707లో చనిపోయాడు. అతని తరువాత సింహాసనమునకు వచ్చిన చక్రవర్తులు బలహీనులు. మంత్రులచేతిలో కీలుబొమ్మలు. ఔరంగజేబు మరణానంతరము కేవలము 12 సంవత్సరములలోనే ఆరుగురు చక్రవర్తులు రాజ్యాన్నేలారు. దీనిని బట్టి వారి బలహీనత స్పష్టమగుచున్నది. ఔరంగజేబు తరువాత వచ్చిన చక్రవర్తి బహాదూర్‌షా కాలములో పాప్రాయను (సర్వాయి పాపడు) బందిపోటు దొంగను పట్టుకొనుటకై యూసుఫ్‌ఖాన్ రుజ్‌బిహన్ సేనాని వెంబడించాడు. ఆ బంది పోటు దొంగ కరీంనగర్ జిల్లాలోని హుస్నాబాద్ వద్ద పట్టుబడి ఉరితీయ బడ్డాడు[165]. బహాదూర్‌షా, జహందార్‌షాల కాలములో జుల్ఫికర్‌ఖాన్ దక్కన్ సుబేదార్‌గా ఉన్నాడు. ఫర్రూక్ సయర్ చక్రవర్తి కాగానే క్రీ.శ. 1713లో నిజాముల్‌ముల్క్‌ను కొంతకాలము దక్కన్ సుబేదార్‌గా ఉంచాడు. అతని తరువాత సుబేదార్‌గా నియమింపబడిన హుస్సేన్ అలీఖాన్ మహారాష్ట్ర రాజు సాహుజీతో (శివాజి మనుమడు మరియు శంభాజీకొడుకు) అవమానకరమైన సంధి చేసికొని చౌత్, సర్దేశ్‌ముఖి పన్నులు వసూలు చేసికొనుటకు అనుమతించాడు. చౌత్‌పన్ను అనగా పంటలో నాలుగవ(1/4) వంతు మరియు సర్దేశ్‌ముఖి అనగా పంటలో పదవ(1/10) వంతు పన్ను మహారాష్ట్రులకు చెల్లించాలి. దానికి ప్రత్యామ్నాయముగా వారు శత్రువుల నుండి కాపాడుతారు. పూనాలో సమర్థుడైన బాలాజీ విశ్వనాథుడు (క్రీ.శ. 1713-1720) పీష్వాగా ఉన్నాడు. ఈ పన్నులు వసూలు చేయుటకు మహారాష్ట్ర అధికారులు అన్ని జిల్లాలలో నియమింపబడ్డారు. బలహీనుడైన ఫర్రూక్‌సయర్ చౌత్, సర్దేశ్‌ముఖి పన్నులు వసూలు చేసికొనుటకు మహారాష్ట్రులకు అధికారమునొసంగుచు క్రీ.శ. 1719లో ఫర్మానాజారీ చేశాడు[166]. ఈ సందర్భములో పన్నులు వసూలు చేయుటకై మహారాష్ట్ర అధికారులనేకులు ఈ జిల్లాకు గూడా వచ్చి కొందరు ఇచటనే స్థిరపడినారు. మహారాష్ట్ర బ్రాహ్మణులు కొందరు ధర్మపురి క్షేత్రమున గూడా స్థిరపడియుండవచ్చు.

మొగలు చక్రవర్తి ఫర్రూక్ సయర్ కాలములో (క్రీ.శ. 1713-1719) హైదరాబాద్ సుబేదార్‌గా నుండిన ముబారిజ్‌ఖాన్ ఎల్గందల్ సర్కారులోని పొలాస, దీవకొండ ఫర్గణాలకు జువ్వాడి చొక్కారావును దేశ్‌ముఖ్‌గా నియమించుచు జారీచేసిన ఫర్మానా (Manuscript Document) ధర్మపురి సంగనభట్ల నరహరి వద్ద నుండినది. జువ్వాడి చొక్కారావు ధర్మపురి నరసింహస్వామికి పూజలు జరిపి భూదానములిచ్చాడు[167].

క్రీ.శ. 1724లో నిజాముల్‌ముల్క్ ఆసఫ్‌జా దక్కన్ సుబేదారైన ముబారిజ్‌ఖాన్‌ను షక్కర్‌ఖేడ్ యుద్ధములో ఓడించి, స్వతంత్రుడై ఆసఫ్‌జాహీల పాలన ప్రారంభించాడు.

# ఆసఫ్‌జాహి నవాబుల పాలన (క్రీ.శ. 1724-1948)

ఆసఫ్‌జాహీలు హైదరాబాద్ రాష్ట్రమును క్రీ.శ.1724 నుండి 1948 వరకు దాదాపు 225 సంవత్సరములు ఏడుగురు నవాబులు వైభవోపేతముగా పాలించారు. వీరి పూర్వీకులు మధ్య ఆసియాలోని సమర్ఖంద్ సమీపము నుండి భారతదేశమునకు వచ్చి మొదట మొగలుల ఆస్థానములో స్థిరపడినారు. ఆసఫ్‌జాహీ వంశస్థాపకుడు నిజాముల్ ముల్క్, ఇతని అసలు పేరు మీర్‌ఖమ్రొద్దీన్. ఇతని తాత ఖాజా ఆబిద్, బుఖారా రాజ్యములోని సమర్ఖంద్‌నకు సమీపమున గల అలియాబాద్‌లో జన్మించాడు. ఇండియాకు వచ్చి ఔరంగజేబు కొలువులో జేరాడు. ఇతని తండ్రి షాహబుద్దీన్‌ఖాన్ షాజహాన్ ప్రధానమంత్రి యొక్క కూతురైన సఫియాఖానూమ్‌ను వివాహమాడాడు. ఈ దంపతులకు క్రీ.శ.1671లో జన్మించిన పుత్రుడే మీర్ ఖమ్రొద్దీన్.

## నిజాముల్ ముల్క్ ఆసఫ్‌జా I (క్రీ.శ. 1724-1748)

ఔరంగజేబు మీర్‌ఖమ్రొద్దీన్‌ను 20వ ఏట చిన్‌ఖిలిచ్‌ఖాన్ (Boy Swordsman) బిరుదుతో సత్కరించి బీజాపూర్‌కు గవర్నర్‌గా పంపాడు. క్రీ.శ.1707లో ఔరంగజేబు తరువాత వచ్చిన బహాదూర్‌షా ఇతనిని అయోధ్య (Oudh) గవర్నర్‌గా మరియు లఖ్నో ఫౌజ్‌దార్‌గా నియమించాడు. క్రీ.శ. 1713లో చక్రవర్తి ఫర్రూక్‌సయర్, మీర్ ఖమ్రొద్దీన్‌కు 'నిజాముల్ ముల్క్' బిరుదము నిచ్చి దక్కన్‌లోని ఆరు రాష్ట్రములకు (Provinces) సుబేదార్‌గా నియమించాడు. ఇతనికి సయ్యద్ సోదరులు (King Makers) అను రాజస్రష్ఠల కుతంత్రములు గిట్టలేదు. చక్రవర్తి ముహమ్మద్‌షా ఇతనిని ఢిల్లీ వజీరుగా నియమించాడు. కాని ఢిల్లీ పతనావస్థ పరిస్థితులు గమనించి దక్కన్‌కు తిరిగి వచ్చాడు. ఔరంగాబాద్‌కు 80 మైళ్ల దూరమున బెరార్‌లో నున్న షక్కర్‌ఖేడా యుద్ధములో దక్కన్ సుబేదారైన ముబారిజ్‌ఖాన్‌ను క్రీ.శ. 1724 అక్టోబర్ 11 రోజున ఓడించి హతమార్చాడు. నిజాముల్‌ముల్క్ ఔరంగాబాద్‌లో స్థిరపడగానే మొగలు చక్రవర్తి ముహమ్మద్‌షా ఇతనికి 'ఆసఫజా' బిరుదునిచ్చి దక్కన్ సుబేదార్‌గా నియమించుచు ఫర్మానా పంపాడు. మొగలు చక్రవర్తికి లోబడి పరిపాలన గావించెదనని వినమ్రపూర్వకముగా తెలిపినను ఇతడు స్వతంత్రముగానే పాలించాడు. 1738లో నాదిర్షా ఢిల్లీపై దండెత్తినప్పుడు చక్రవర్తికి అండగా నిలిచి మధ్యవర్తిత్వము వహించి నాదిర్షాచే ఢిల్లీ ప్రజల ఊచకోత మాన్పించి ఇరువురి మధ్య సంధి కుదిర్చాడు. ఢిల్లీలో పరిస్థితులు చక్కబడువరకుండి దక్కన్‌కు తిరిగి వచ్చాడు. మొదటి ఆసఫ్‌జా నిజాముల్ ముల్క్ క్రీ.శ. 1748 మే 22 రోజున తన 78వ ఏట గతించాడు. ఇతడు ఏడుగురు మొగలు చక్రవర్తుల పాలన చూచాడు. 87 యుద్ధములు చేశాడు. ఫారసీ, టర్కీ భాషలలో పండితుడు. మహారాష్ట్రుల పాలకుడు సాహూజీని ఛత్రపతిగా అంగీకరించి చౌత్, సర్దేశ్‌ముఖి పన్నులు వసూలు చేసికొనుటకు అనుమతించాడు.

నిజాముల్ ముల్క్ ఢిల్లీ నుండి మాళవ నుండి తీసికొని వచ్చిన ముసల్మానులను,

హిందువులను ఉద్యోగాలలో నియమించాడు. ఆనాటి నుంచి దక్కన్ ఉద్యోగాలలో ఉత్తర భారతీయుల ప్రవేశము మొదలైంది. ఇతనికి ఇస్లాం మతములో విశ్వాసమున్ననూ, పరమత సహనము కలవాడు.

క్రీ.శ. 1724-1750 మధ్యకాలములో ధర్మపురి వాసులు తిరిగి లక్ష్మీనరసింహాలయము (పాత నరసింహాలయము) ను నిర్మించిరి[168].

మొగలుల అధికారము పతనదశలో నుండినందున కరీంనగర్ జిల్లా గూడా నిజాముల్ ముల్క్ ఆసఫ్‌జా అధీనములోనికి వచ్చింది. ఇతని కాలములో నవాబ్ అమీన్‌ఖాన్ ఎల్గందల్ జాగీర్దారుగా ఉన్నాడు. నవాబ్ అమీన్‌ఖాన్ మరణానంతరము అతని కుమారుడు ముఖర్రబ్‌ఖాన్ ఎల్గందల్ జాగీర్దారైనాడు[169].

## నాసర్ జంగ్ (క్రీ.శ. 1748-1750)

నిజాముల్ ముల్క్‌కు ఆరుగురు కుమారులు, ఆరుగురు కుమార్తెలు. నిజాముల్‌ముల్క్ గతించగానే రెండవ కుమారుడు నాసర్‌జంగ్ సుబేదార్‌గా ప్రకటించుకొన్నాడు. పెద్దకుమారుడు ఘాజియొద్దీన్ ఢిల్లీ ఆస్థానమందు కొలువులో నున్నాడు. కాని నిజాముల్‌ముల్క్ పెద్దకూతురు యొక్క కుమారుడైన ముజఫర్‌జంగ్ తాను సుబేదార్ కావలెనని పోటీ పడ్డాడు. నాసర్‌జంగ్ మేనల్లుడు ముజఫర్‌జంగ్ ఫ్రెంచిడూప్లే సహాయమర్థించాడు. నాసర్‌జంగ్ ఆంగ్లేయుల సహాయముతో తన మేనల్లుని శిక్షించుటకై కర్ణాటకమునకు బయలుదేరాడు. కాని కడప పఠాన్ నవాబులు కుట్ర చేసి నాసర్‌జంగ్‌ను క్రీ.శ. 1750 డిసెంబర్ 25న హత్య చేశారు.

నాసర్‌జంగ్ మరణించగానే తొందరగా ఫ్రెంచివారు పాండిచెరీలో ముజఫర్‌జంగ్‌ను దక్కన్ సుబేదార్‌గా ప్రకటించి పట్టము కట్టారు. డూప్లే ఫ్రెంచి సేనాని బుస్సీ ఆధ్వర్యములో ముజఫర్‌జంగ్‌ను ఔరంగాబాద్‌నకు పంపాడు. కాని మార్గమధ్యములో కడప, కర్నూలు పఠాన్ నవాబులు కడపకు 35 కి.మీ. దూరములోనున్న లక్కిరెడ్డిపల్లె వద్ద క్రీ.శ. 1751 ఫిబ్రవరి 3న హత్యచేశారు. బుస్సీ వెంటనే నిజాముల్‌ముల్క్ మూడవకుమారుడైన సలాబత్‌జంగ్‌ను దక్కన్ సుబేదార్‌గా ప్రకటించాడు. మొగలు చక్రవర్తి గూడా సలాబత్‌జంగ్‌ను దక్కన్ సుబేదార్‌గా ఆమోదించుచు ఫర్మానా జారిచేశాడు.

## సలాబత్‌జంగ్ (క్రీ.శ. 1751-1761)

ఫ్రెంచిసేనాని బుస్సీ ప్రభావము సలాబత్ జంగ్ పై ప్రబలముగా ఉండేది. నవాబు రాజ్యములో హైదరాబాద్ నందు ఫ్రెంచి సేనలు నిలిపినందుకు గాను 24 లక్షలు బాకీపడ్డాడు. దీని క్రింద సలాబత్‌జంగ్ ముస్తఫానగర్, ఏలూరు, రాజమండ్రి, చీకాకోల్ (శ్రీకాకుళము) ప్రాంతముల నిచ్చి క్రీ.శ. 1753లో ఫ్రెంచి వారితో సంధి చేసికొన్నాడు. కర్ణాటకము నందు

ఆంగ్లేయుల కు ఫ్రెంచి వారికి యుద్ధములు జరుగుచుండగా ఫ్రెంచి జనరల్ లాలీ పిలుపుననుసరించి బుస్సీ క్రీ.శ.1758 జులై 18న హైదరాబాద్ వదలి లాలీ సహాయార్థమై వెళ్లాడు. హైదరాబాద్ ఒక దశాబ్దముకు పైగా ఫ్రెంచి వారి ప్రాబల్యంలో ఉంది.

కర్ణాటక యుద్ధములలో ఫ్రెంచి వారు ఓడిపోవుచున్న తరుణములో సలాబత్‌జంగ్ క్రీ.శ.1759లో ఆంగ్లేయులతో సంధి చేసికొని వారికి ఉత్తర సర్కారులు ఇచ్చేశాడు. మహారాష్ట్రులతో ఓడిపోయి క్రీ.శ. 1761లో వారితో సంధి చేసికొన్నాడు. సలాబత్‌జంగ్ బలహీనతను గమనించిన తమ్ముడు నిజాం అలీఖాన్ అతనిని క్రీ.శ. 1762 జులై 8న బీదర్‌లో బంధించి తానే సుబేదార్‌గా ప్రకటించుకొన్నాడు. మరుసటి సంవత్సరమే సలాబత్‌జంగ్ మరణించాడు. ఢిల్లీలోని మొగలు చక్రవర్తి రెండవ షాఆలమ్ నిజామ్ అలీఖాన్‌కు నిజాముల్ ముల్క్ ఆసఫ్‌జా II యను బిరుదుతో సత్కరించి అతనిని దక్కన్ సుబేదార్‌గా నియమించుచు ఫర్మానా జారిచేశాడు. మొగలు చక్రవర్తుల అధికారము నిజానికి నామమాత్రమే. ఇక్కడి నవాబులు స్వతంత్రంగానే వ్యవహరిస్తూ ఉండేవారు.

నాసర్‌జంగ్, ముజఫర్‌జంగ్, సలాబత్‌జంగ్ ముగ్గురు దక్కన్ సుబేదారులుగా 14 సంవత్సరములు పాలించారు. వీరికి మొగలు చక్రవర్తి నిజాముల్‌ముల్క్‌యని గాని ఆసఫ్‌జా యని గాని బిరుదులివ్వలేదు గనుక వీరు నిజాం ప్రభువులుగా, ఆసఫ్‌జాలుగా పేర్కొనబడలేదు. మొదటి ఆసఫ్‌జా మరియు రెండవ ఆసఫ్‌జా బిరుదుగల నిజాం అలీఖాన్ మధ్యనున్న అగాధకాలమును పూరించు సుబేదారులుగానే చరిత్రలో నిలిచారు.

సలాబత్‌జంగ్ నవాబుగా నున్న కాలములో ఎల్లందల్ జాగీర్దారుగా నుండిన ముఖ్రబ్‌ఖాన్ మరణించాడు. అతని తరువాత అతని సోదరుడు జాగీర్దారగుటకు పోరాడాడు. చనిపోయిన జాగీర్దార్ ముఖ్రబ్‌ఖాన్ భార్య తనకుమారుడు ఎల్లందల్ జాగీర్‌నకు నిజమైన వారసుడని నవాబు సలాబత్‌జంగ్‌తో మొరపెట్టుకొన్నది. సలాబత్‌జంగ్ విధవరాలు ఎడల దయతలంచి తిరుగబడిన జాగీర్దార్‌ను శిక్షించుటకై సైన్యముతో బయలుదేరాడు. కాని తిరుగుబాటు దారుడు నిజామాబాద్ జిల్లాలోని బాల్కొండ కోటలో తలదాచుకొన్నాడు. సలాబత్‌జంగ్ బాల్కొండకు సైన్యము నడిపి తిరుగుబాటు నణచివేశాడు. సరియైన వారసుడగు ఫకీర్ మునవ్వర్‌ఖాన్‌కు ఎల్లందల్ పాలనను అప్పగించి న్యాయము చేశాడు[170].

ఎల్లందల్‌లో సమర్థవంతమైన పాలన కొనసాగించుటకై ముబారిజుల్‌ముల్క్ జఫరుద్దౌలా బహాదూర్ మిర్జా ఇబ్రహీంఖాన్ ధంసా నియమింపబడినాడు. అతడు ఎల్లందల్ స్థితిగతులను మెరుగుపరచాడు. తన ఏలుబడిలో నున్న ప్రాంతమందు నూతన కోటలను నిర్మించాడు. ఆ విధముగా జగిత్యాలలోని స్థలదుర్గము క్రీ.శ. 1747లో కట్టబడినట్లు తెలియుచున్నది. అలాగే ఎల్లందల్‌కోటను నూతన నిర్మాణములతో 1754లో పటిష్ఠపరచి దృఢమైన దుర్గముగా రూపొందించాడు[171]. ఆకాలములో ఆదిలాబాద్ జిల్లాలోని నిర్మల్, లక్షెటిపేట ప్రాంతములు

ఎల్గందల్ సర్కారులో ఉన్నాయి. కావున ఇబ్రహీంఖాన్ ధంసాయే నిర్మల్ గుట్టలపైన రాతి దుర్గములను నిర్మించాడు. జగిత్యాల, నిర్మల్ కోటల కట్టడములు దాదాపు ఏకకాలములో ఎల్గందల్ పాలకుల అధ్వర్యంలో జరిగాయి. మిర్జా కుటుంబమునకు చెందిన ఇబ్రహీంఖాన్ ధంసా మొట్టమొదట చికాకోల్(శ్రీకాకుళం) కలెక్టర్‌గా నుండిన షౌకత్‌జంగ్ బహాదూర్ అధీనములో ఉద్యోగిగా ఉండేవాడు. క్రమంగా ప్రతిభాప్రజ్ఞలతో ఉన్నత పదవులు పొందాడు. నవాబు అతనికి ఖమ్మం, వరంగల్, ఎల్గందల్ ప్రాంతముల పాలనా బాధ్యతను అప్పగించెనని తెలియుచున్నది[172].

నిజాముల్‌ముల్క్ ఆసఫ్‌జా నుండి చివరి నవాబు మీర్‌ఉస్మాన్ అలీఖాన్ వరకు అనగా పోలీసు చర్య జరిగి హైదరాబాద్ రాష్ట్రము భారత యూనియన్ ప్రభుత్వములో విలీనమగువరకు పరిపాలించిన రాజుల కాలము, తేదీల వివరములు రజాఅలీఖాన్ క్రీ.శ. 1990లో వెలువరించిన నాలుగు శతాబ్దముల హైదరాబాద్ యను ఆంగ్ల గ్రంథము ఆధారంగా ఈ క్రింద పేర్కొనబడినవి.

### ఆసఫ్‌జాహి ప్రభువులు

| | |
|---|---|
| 1. నిజాముల్ ముల్క్ ఆసఫ్ జా I | 11-10-1724 నుండి 22-05-1748 |
| నాసర్‌జంగ్ | 23-05-1748 నుండి 25-12-1750 |
| ముజఫర్ జంగ్ | 25-12-1750 నుండి 03-02-1751 |
| సలాబత్‌జంగ్ | 03-02-1751 నుండి 08-07-1762 |
| 2. నిజాం అలీఖాన్ ఆసఫ్‌జా II | 08-07-1762 నుండి 06-08-1803 |
| 3. సికిందర్‌జా ఆసఫ్ జా III | 11-08-1803 నుండి 21-05-1829 |
| 4. నాసిరుద్దౌలా ఆసఫ్‌జా IV | 23-05-1829 నుండి 16-05-1857 |
| 5. అఫ్జలుద్దౌలా ఆసఫ్‌జా V | 18-05-1857 నుండి 26-02-1869 |
| 6. మీర్ మహబూబ్ అలీఖాన్ ఆసఫ్‌జా VI | 29-02-1869 నుండి 29-08-1911 |
| 7. మీర్ ఉస్మాన్‌అలీఖాన్ ఆసఫ్ జా VII | 29-08-1911 నుండి 17-09-1948 |

(పోలీసు చర్య తరువాత 18-09-1948 రోజున హైదరాబాద్ రాష్ట్రము జనరల్ జె.యన్.చౌదరి వశమైంది.)

## నిజాం అలీఖాన్ ఆసఫ్‌జా II (క్రీ.శ. 1762-1803)

నిజాం అలీఖాన్ నిజాముల్ ముల్క్ మొదటి ఆసఫ్‌జా యొక్క నాలుగవ పుత్రుడు క్రీ.శ. 1762 జూలై 8న తన 28వ ఏట సుబేదారై రెండవ ఆసఫ్‌జా బిరుదముతో 42 సంవత్సరములు హైదరాబాదు నుండి పాలించాడు. ఇతని కాలము నుండి హైదరాబాద్ ప్రభువులకు నిజాం నవాబులనే నామము ఏర్పడింది. క్రీ.శ. 1763లో రాజధానిని ఔరంగాబాద్ నుండి హైదరాబాద్‌నకు మార్చాడు. ఇతడు విఠల్‌సుందర్ అను బ్రాహ్మణుని రాజాప్రతాపవంత్ బిరుదుతో

దివాన్‌గా నియమించాడు. అతడు క్రీ.శ. 1765లో మరణించగానే మూసాఖాన్ దివానయ్యాడు. క్రీ.శ. 1790–1792 మధ్య జరిగిన మూడో ఆంగ్లో మైసూర్ యుద్ధములో నిజాం, మహారాష్ట్రులు ఆంగ్లేయుల పక్షము వహించారు. టిప్పుసుల్తాన్ ఓడిపోయి క్రీ.శ. 1792లో శ్రీరంగపట్టణము వద్ద సంధి చేసికొన్నాడు. నిజాం ఆంగ్లేయులకు సహాయపడినందులకు గవర్నర్ జనరల్ లార్డ్ కారన్ వాలీస్ కడప, బళ్లారి ప్రాంతములను నిజాం కిచ్చాడు. ఇంతలో మహారాష్ట్రులు నిజాం నుండి చౌత్, సర్దేశ్‌ముఖీ పన్నుల వసూలు గురించి ఒత్తిడి చేశారు. నిజాంకు మహారాష్ట్రులకు క్రీ.శ. 1795 మార్చి 11న ఖార్దా (Kharda) వద్ద జరిగిన యుద్ధములో నిజాం చిత్తుగా ఓడిపోయినాడు. ఒప్పందము ప్రకారము ఆంగ్లేయులు నిజాంనకు సహాయము చేయలేదు గనుక ఆగ్రహించి సికింద్రాబాద్ నుండి వారి రెండు పటాలముల (Batallions) సైన్యమును తొలగించాడు.

క్రీ.శ. 1798లో గవర్నర్ జనరల్ లార్డ్ వెల్లస్లీ ప్రవేశపెట్టిన సైన్య సహకార పద్ధతిని (Subsidiary Alliance) మహారాష్ట్రులతో బెడద ఉన్నందున నిజాం ఒప్పుకొన్నాడు. బొల్లారంలో ఆంగ్లేయులు ఆరు పటాలముల (Six Batallions) సైన్యాన్ని ఉంచారు. వాటి ఖర్చుల క్రింద బాకీ పడగా నిజాం కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురం జిల్లాలను ఆంగ్లేయులకు దత్తం చేశాడు. అందుకే వీటికి దత్తమండలములని పేరు. రెండవ నిజాం కాలములో అతని రాజ్యము ఖాల్సా, పైగా, జాగీర్లు అని మూడు భాగములుగా విభజింపబడి సర్ఫెఖాస్ ప్రాంతము లేర్పడ్డాయి.

## ఎల్గందల్, జగిత్యాల, నిర్మల్ కోటల ముట్టడి (క్రీ.శ. 1791)

రెండవ నిజాం కాలములో ఎల్గందల్ కోట అధ్వర్యములో జగిత్యాల, నిర్మల్ దుర్గముల నిర్వహణ ఉండేది. ఎల్గందల్ పాలకుడైన జఫరుద్దౌలా క్రీ.శ. 1789లో మరణించాడు. అతని సమాధి నిర్మల్‌లోని ఇబ్రహీంబాగ్‌నందున్నదని తెలియుచున్నది. ఇతని పెద్దకుమారుడు ఫారూక్ మిర్జా ఎహతెషామ్‌జంగ్ (Ehtesham Jung) బిరుదుతో ఎల్గందల్ పాలకుడైనాడు. అతని వద్ద బక్షీగా పనిచేయుచున్న వలీ మహమ్మద్ దుర్బోధతో అతని తండ్రి సమీప బంధువులైన భియ్యా మిర్జా, ఫరీద్ మిర్జాలను చంపాడు. తరువాత తనకు తప్పుడు ప్రోత్సాహమిచ్చిన వలీమహ్మద్‌ను గూడా చంపాడు. ఇతని క్రూరత్వము వలన ప్రజలు నానా ఇబ్బందుల పాలైనారు. నిజాం ఎన్ని తాకీదులు పంపినా లెక్క చేయలేదు. అప్పుడు రెండవ నిజాం రాజాపద్మాసింగ్, కన్వర్‌బోదాసింగ్ అధ్వర్యములో క్రీ.శ. 1791లో ఎల్గందల్ దుర్గముపైకి సైన్యాన్ని పంపాడు. ఎహతెషామ్ జంగ్ తిరుగుబాటును నిజాం సైన్యాలు అణచివేశాయి. అతడు పారిపోయి జగిత్యాల ఆ తరువాత నిర్మల్ దుర్గములందు తలదాచుకొన్నాడు. నిజాం సేనలు ఎల్గందల్ నుండి జగిత్యాల కోటకు చేరిచుట్టుముట్టాయి. జగిత్యాల ఖిలేదార్ జఫర్‌ఆలమ్ నిజాం సైన్యాల్ని ఎదిరించాడు. కాని ఓడిపోయి కోటను నిజాం సైన్యములకు అప్పగించాడు. ఆ తరువాత నిజామ్ సేనలు శత్రువువేటలో ముందుకుసాగి నిర్మల్‌పై దండెత్తాయి. అచట ఎహతెషామ్ జంగ్ ఓడిపోయి బందీగా

పట్టుబడ్డాడు[173]. కాని రెండవ నిజాం అతనిని క్షమించి, అతని తల్లి విన్నపమును గౌరవించి అతనిని బెరార్‌కు సుబేదార్‌గా ఎలిచ్‌పూర్‌కు పంపాడు[174].

రెండవ నిజాం మత సహనము పాటించుట వలన దేవాలయముల అభివృద్ధి పనులకు అంతరాయము కలుగలేదు. పొలాస, దీవకొండ, అర్షకోట, వెల్లుల్ల, వేంపెల్లి, ఫర్గణాలపై అమీశీ అధికారము పొందిన చెన్నమనేని జోగారాయడు క్రీ.శ. 1794లో ధర్మపురి లక్ష్మీనరసింహ దేవాలయ ప్రాంగణములో రాయి పరిపించాడు. దేవునికి వెండి ఆభరాణాల్ని సమర్పించాడు[175]. వెలిగందుల, రామగిరి సర్కారుల మన్నే వారగు గందెవారు, పొలాస, దీవకొండ ఫర్గణాల దేశ్‌ముఖ్‌లగు జువ్వాడి వారు దేవుని కళ్యాణోత్సవాదులకు దానములు చేశారు. మన్నే వారనగా కొన్ని షరతులపై జాగీర్లు ఇవ్వబడేవారు (Jagirs given on certain conditions).

అన్నదానపరులగు పంతులు నారాయణ దీక్షితులు శాలివాహన శకము 1725 అనగా క్రీ.శ. 1803లో (కొత్తగుడి) నిర్మించి అందు యోగానంద లక్ష్మీనృసింహుని ప్రతిష్ఠించాడు. జువ్వాడి దేశ్‌ముఖ్ ధర్మజగపతిరావు దేవునికి కానుకలర్పించి దానధర్మములు చేశాడు[176].

రెండవ ఆసఫ్‌జా నిజాం అలీఖాన్ క్రీ.శ. 1803 ఆగస్టు 6న తన 69వ ఏట మరణించాడు. ఇతని సమాధి మక్కా మసీదునందున్నది.

## సికందర్‌జా ఆసఫ్‌జా III (క్రీ.శ. 1803-1829)

సికందర్‌జా రెండవ మహారాష్ట్ర యుద్ధములో ఆంగ్లేయులకు సహకరించాడు. మహారాష్ట్రులోడిపోయి ఔరంగాబాద్, బెరార్ ప్రాంతములను నిజాంనకు వదలు కొన్నారు. మునీరుల్‌ముల్క్ ఇతని దివాన్‌గా నియమింపబడినాడు. బ్రిటిష్ వారి ప్రోద్బలముతో వారికి అనుకూలుడైన చందూలాల్ పేష్కార్‌గా నియమింపబడినాడు. అధికారములన్ని చందూలాల్ హస్తగతమైనాయి. హైదరాబాద్‌లోని గన్‌ఫౌండ్రిలో ఆంగ్లేయులు ఏడువేల సైన్యమును నిజాం రక్షణకై నిలిపి వాటి ఖర్చులు నిజాం ప్రభుత్వముపై రుద్దారు. తత్ఫలితంగా మూడవనిజాం అప్పులపాలయ్యాడు. చందూలాల్ అప్పులు చేయుచు బ్రిటిష్ వారికి బకాయలు చెల్లించేవాడు. ఈ నవాబు కాలములోనే మీర్‌ఆలం ట్యాంక్ 1804-1806 మధ్య నిర్మింపబడింది. సికందర్‌జా క్రీ.శ. 1829 మే 21న మరణించాడు. అతనికి తొమ్మిది మంది కుమారులు పదిమంది కుమార్తెలు. పెద్దకుమారుడు ఫర్ఖుందా అలీఖాన్ నాసిరుద్దౌలా బిరుదుతో రాజైనాడు. సికిందర్‌జా నవాబు పేరటనే క్రీ.శ. 1806 నుండి సికింద్రాబాద్ పట్టణము పిలువబడుచున్నది.

నవాబు సికిందర్ జా కాలములో ఎల్గందల్ ఖిలేదార్‌గా బహాదూర్‌ఖాన్ నియమింపబడ్డాడు. తరువాత వచ్చిన సయ్యద్‌కరీమొద్దీన్ అనే ఖిలేదార్ ఎల్గందల్‌కు 10 కి.మీ. దూరములో మానేరునది ఒడ్డున ఒక కొత్త గ్రామాన్ని నిర్మించాడు. అతని పేరట ఇప్పుడది కరీంనగర్‌గా పిలువబడుతుంది.

కరీమొద్దీన్‌షావలిదర్గా (సమాధి) కరీంనగర్‌లోని పాతబజారులో ఉంది[177].

## నసీరుద్దౌలా ఆసఫ్‌జా IV (క్రీ.శ. 1829-1857)

సికిందర్‌జా పెద్దకుమారుడు ఫర్ఖుందా అలీఖాన్ నసీరుద్దౌలా క్రీ.శ. 1829 మే 23న రాజ్యానికి వచ్చాడు. ఇతని దివాన్ మునీరుల్ ముల్క్ క్రీ.శ. 1832లో చనిపోగానే ఆంగ్లేయులకు అనుకూలుడైన చందూలాల్ అతని స్థానములో నియమింపబడినాడు. ఆంగ్లేయులు హైదరాబాద్‌లో నిలిపిన సైనిక దళాల ఖర్చు భారము అమితంగా పెరిగి నిజాం ప్రభుత్వము అప్పులపాలై దివాలా తీసింది. 1843లో చందూలాల్ రాజీనామా చేయగా రాజారాంబక్ష్ దివానయ్యాడు. అతడు గూడా 1846లో రాజీనామా చేయగా సిరాజుల్ ముల్క్ దివానయ్యాడు. ఇతడు అనేక సంస్కరణలు ప్రవేశపెట్టాడు. రాజ్యమును జిల్లాలుగా విభజించి తాలుక్‌దారులను (Collectors) నియమించాడు. సతీసహగమనమును నిషేధించాడు. ప్రభుత్వపు అప్పులు పెరుగుట వలన నిజాం నగలు గూడా తాకట్టు పెట్టడం జరిగింది. ఆంగ్లేయుల సైన్యపు ఖర్చుల క్రింద నిజాం బెరార్‌ను వదులుకొన్నాడు. క్రీ.శ. 1853లో యోగ్యుడైన యువకుడైన మీర్ తురాబ్ అలీఖాన్ సాలార్‌జంగ్ I అతని 24వ ఏట దివాన్‌గా నియమింపబడ్డాడు. ఇతడు 1853 నుండి 1883 వరకు మూడు దశాబ్దములు దివాన్‌గా ముగ్గురు నిజాం ప్రభువులకు తన సేవలందించి ప్రభువుల, ప్రజల, ఆంగ్లేయుల మన్ననలు పొందాడు. క్రీ.శ. 1853-1854 సంవత్సరములో దారుల్‌ఉల్మ్ (Dar-ul-uloom) కళాశాలను స్థాపించాడు. ఇందులో ఆంగ్లమును గూడా బోధించేవారు. సాలార్‌జంగ్ 1855లో కేంద్ర ట్రెజరి (Central Treasury) మరియు 1856లో స్టాంపు కాగితముల కార్యాలయములను (Stamp Paper Office) ఏర్పాటుచేశాడు.

ఎల్గందల్ జిల్లా పాలన గూడా ఒక తాలుక్‌దార్ అనగా కలెక్టర్ కిందకు వచ్చింది.

## అఫ్జలుద్దౌలా ఆసఫ్‌జా V (క్రీ.శ. 1857-1869)

అఫ్జలుద్దౌలా క్రీ.శ. 1857 మే 18న సింహాసనాన్ని అధిష్ఠించాడు. ఆ సంవత్సరమే జులైలో భారత ప్రథమ స్వాతంత్ర సంగ్రామము (Mutiny) లేదా సిపాయిల విప్లవము ఆరంభమైంది. ఈ విప్లవము హైదరాబాద్, ఔరంగాబాద్, షోలాపూర్‌లకు గూడా వ్యాపించింది. హైదరాబాద్‌లో ఆంగ్లేయులకు వ్యతిరేకముగా రోహిల్లాలు తిరుగుబాటు చేసి కోఠీలోని రెసిడెన్సీ (Residency) పై దాడి చేశారు. కాని దివాన్ సాలార్‌జంగ్ I ఈ తిరుగుబాటును అరబ్బుల సహాయముతో కఠినముగా అణచివేశాడు. తిరుగుబాటు చేసిన తుర్రేబాజ్‌ఖాన్‌ను ఆంగ్లేయులు కాల్చి చంపారు. ఢిల్లీలో జరిగిన సిపాయిల తిరుగుబాటును ఆంగ్లేయులు అణచివేసి మొగలు చక్రవర్తి బహాదూర్‌షాను ఓడించి, బంధించి రంగూన్ జైలుకు పంపారు. ఈ బహాదూర్‌షా పేరును నాణెములపై నుండి తొలగించవలసిందిగా ఆంగ్లేయులు అఫ్జలుద్దౌలా నవాబును కోరారు. అందువలన సాలార్‌జంగ్ I అఫ్జలుద్దౌలా పేరట 1858లో హాలీ సిక్కా నాణెములు ముద్రించాడు.

మొగలుల పేరట గల నాణెముల చలామణి ఆగిపోయింది. మొగలు చక్రవర్తి పేరట గాకుండా అఫ్జలుద్దౌలా రాజు పేరట కుత్బా చదువుట ఆరంభమైంది. 1857లో మొగలు వంశపాలన పూర్తిగా అంతరించింది గనుక నిజాం నవాబు మొగలుల సుబేదార్‌గా కాకుండా హైదరాబాద్ నిజాం రాజుగా వ్యవహరించాడు.



రెసెడెన్సి భవనము

దివాన్ సాలార్‌జంగ్ I నిజాం రాజ్యమును 5 సుబాలుగా 16 జిల్లాలుగా విభజించాడు. ప్రతి సుబాకు సుబేదార్‌ను ప్రతి జిల్లాకు తాలుక్‌దార్ (Collector)ను నియమించాడు. క్రీ.శ. 1860లో నిజాం బొంబాయి–మద్రాసు రైల్వేలైన్ తన రాజ్యము గుండా వాడి గుల్బర్గాల మీదుగా వేయుటకు అనుమతించాడు. తరువాత వాడి, హైదరాబాద్‌లకు రైల్వే లైన్ విస్తరించాడు. నిజాంస్టేట్ రైల్వేశాఖ ఒకటి ఏర్పాటైంది. క్రీ.శ. 1863లో హైదరాబాద్ రాష్ట్రము తీవ్రమైన కరువుకు గురైంది. కరువుకాటకములతో ప్రజలు అనేక బాధలకు గురైనారు. సాలార్‌జంగ్ ఆంగ్లేయుల నుండి రెండు కోట్లు అప్పు తీసికొని ప్రజలను ఆదుకొన్నాడు.

అఫ్జలుద్దౌలా కాలములో అఫ్జల్‌గంజ్ మసీదు, అఫ్జల్ గంజ్ బజారు, అఫ్జల్ గంజ్ బ్రిడ్జిల నిర్మాణము జరిగింది. దివాన్ సాలర్ జంగ్ I ఛాదర్‌ఘాట్ బ్రిడ్జి నిర్మాణము గావించాడు.

నిజాం నవాబు అఫ్జలుద్దౌలాకాలములో క్రీ.శ. 1858 కాళయుక్తి కార్తీక బహుళ దశమి మంగళవారము నాడు ధర్మపురిలో రోహిల్లాలు బీభత్సము సృష్టించి స్వైరవిహారము చేశారు. ఇళ్లను దోచుకొన్నారు. నాటి ప్రజల ఆక్రందనలను, స్థితిగతులను నృసింహదాసు కవి 'రోహిల్లాల పాట' యందు నిక్షిప్తము చేశాడు. మధ్యాహ్నం తరువాత రోహిల్లాలు ధర్మపురిని విడిచి వెళ్ళిపోయారు. ఆ సంవత్సరమే పుష్య బహుళ ఏకాదశినాడు ధర్మపురిలోని ఉభయ నరసింహదేవాలయములందు సంప్రోక్షణ క్రతువు జరుపబడింది[178]. పై ఉదాహరణను బట్టి గ్రామీణ ప్రాంతాలలో తగిన భద్రత కరువైనదని చెప్పవచ్చు.

సిపాయిల విప్లవము సందర్భములో ఆంగ్లేయులకు అండగా నిలిచి నిజాం రాష్ట్రములోని

తిరుగుబాటులను అణచివేయుట వలన బ్రిటిష్‌వారు, నిజాంప్రభువుకు, దివాన్ సాలార్ జంగ్ I కు బిరుదులిచ్చి సత్కరించినారు.

## నిజాంల కాలపు హైదరాబాద్ రాష్ట్రము

**(Erst-while Hyderabad State)**




అఫ్జలుద్దౌలా నవాబు క్రీ.శ. 1869 ఫిబ్రవరి 26 శుక్రవారము రోజున 42వ ఏట మరణించాడు. ఇతని భౌతికకాయము మక్కామసీదులో సమాధి చేయబడింది. అతని వారసుడు ఏకైక కుమారుడు, మూడు సంవత్సరముల బాలుడైన మీర్ మహబూబ్ అలీఖాన్‌ను సింహాసనమున నిలిపారు.

### మీర్ మహబూబ్ అలీఖాన్ ఆసఫ్‌జా VI (క్రీ.శ. 1869-1911)

బాలుడైన మీర్ మహబూబ్ అలీఖాన్‌ను సాలార్‌జంగ్ I సింహాసనముపై నిలిపాడు. క్రీ.శ.1883లో సాలార్‌జంగ్ I చనిపోగానే ఆయన కుమారుడు మీర్‌లాయిక్ అలీ సాలర్‌జంగ్ II దివానయ్యాడు. కాని దర్బార్‌లోని కుట్రల ఫలితంగా అతడు క్రీ.శ. 1887లో రాజీనామా చేశాడు. రెండవ సాలార్‌జంగ్ గతించునప్పుడు అతని కుమారుడు యూసుఫ్‌అలీఖాన్ బాలుడు. నవాబు ఈ బాలునికి విద్యాబుద్ధులు నేర్పించి సాలార్‌జంగ్ III అని బిరుదునిచ్చి గౌరవించాడు.

మూడవ సాలార్‌జంగ్ ఆరవ నిజాం కుమారుడైన మీర్ ఉస్మాన్ అలీఖాన్ కాలములో దివాన్‌గా నియమింపబడినాడు.



మీర్ మహబూబ్ అలీఖాన్

క్రీ.శ. 1885లో ఫిబ్రవరి 5 రోజున బ్రిటిష్ గవర్నర్‌జనరల్ లార్డ్‌రిప్పన్ హైదరాబాద్‌నకు వచ్చి ఆరవ నిజాంను గద్దెపై నిలిపి అతనికి సంపూర్ణ పాలనాధికారాలనిచ్చాడు. మీర్ మహబూబ్ అలీఖాన్ తన రాజ్యములోని ఒక్కకోటి ప్రజలందరికి సుఖశాంతుల పాలనను అందజేయుదునని ప్రకటించాడు. 1902లో జరిగిన సంధి ప్రకారము ఆంగ్లేయులు బెరార్ క్రింద నిజాంకు ఏట 25 లక్షలిచ్చుటకు ఒప్పుకొన్నారు. కాని బెరార్‌పై సార్వభౌమాధికారము ఆరవ నిజాంకే ఉండేది. క్రీ.శ. 1893లో ఒక చిన్న మంత్రి మండలి (Cabinet Council) మరియు చట్టములు రూపొందించుటకై ఒక మండలి (Legislative Council) స్థాపించబడినాయి.

మీర్ మహబూబ్ అలీఖాన్ నవాబుకు గుఱ్ఱాలపై మక్కువ ఎక్కువ. అతడు గుర్రపుస్వారీలో దిట్ట. 1879లో మలక్‌పేట యందు అశ్వశాల (Horse Race Course) ఏర్పాటు చేశాడు. వరంగల్ జిల్లాలోని పాఖాల సరస్సు చుట్టూ గల అడవులకు పెద్దపులుల వేటకై వెళ్ళేవాడు. రాత్రులందు మారు వేషములలో తిరుగుచు ప్రజల మనోభావాలు స్థితిగతులు తెలిసికొనేవాడు. ఆరవ నిజాం ఔదార్యమునకు మారుపేరుగా నిలిచి ప్రజలను కన్నబిడ్డల వలె చూచాడు. ఇతనిని జనులు మహబూబ్‌అలీపాషా అనియు, బాబూ సాహెబనియు పిలిచేవారు. ప్రత్తి పండించు రైతుల ప్రయోజనమునకై హైదరాబాద్, ఔరంగాబాద్, గుల్బర్గాల యందు నూలు మిల్లులు (Cotton Mills) స్థాపించాడు. అనేక సంస్కరణల ఫలితంగా బడ్జెట్‌లో మిగులు కనిపించింది.

ఇతనికాలములో మొదట దివాన్‌గా నుండిన సాలార్‌జంగ్ I అనేక సంస్కరణల్ని ప్రవేశపెట్టాడు. 1869లో నిజాంస్టేట్ రైల్వేశాఖ స్థాపించబడింది. 1874లో నూతన రైల్వేలైన్ సౌకర్యములు ప్రజలకు కలిగాయి. 1878లో హైదరాబాద్–వాడి రైల్వేలైన్ పూర్తైంది. కొత్త రోడ్ల నిర్మాణముతో రవాణా సౌకర్యములు పెరిగాయి. విద్యావ్యాప్తికై కృషి జరిగింది. 1870లో ఒక

ఇంజనీరింగ్ కళాశాల స్థాపించబడింది. 1870లోనే సిటీ హైస్కూల్ (Now City College) 1872లో ఛాదర్‌ఘాట్ హైస్కూల్, 1878లో మదరసెఆలియా (Madrasa-i-Aliya), 1887లో నిజాం కళాశాల, 1908లో మహబూబియా బాలికల పాఠశాల స్థాపించబడ్డాయి. 1880లో తపాలశాఖ (Postal Department) ఏర్పాటుచేయబడింది. 1890లో పాల్మూరు జిల్లా ఆరవ నిజాం పేరట మహబూబ్‌నగర్ జిల్లాగా మారింది. 1891లో ఆసఫియా లైబ్రరీ ఏర్పాటుచేయబడింది. 1897లో బేగంపేటలో రోనాల్డ్‌రాస్ (Sir Ronald Ross) యను శాస్త్రజ్ఞుడు తన ప్రయోగశాలలో పరిశోధన జరుపుచు మలేరియాకు కారణభూతమైన క్రిములను కనుగొన్నాడు. ఆయన పేరట నున్న భవనము నేటికి సికింద్రాబాద్‌లోని బేగంపేటయందున్నది. దివాన్ వికారుల్ ఉమ్రా 1893లో అందమైన ఫలక్‌నుమా ప్యాలెస్ రాజభవనమును నిర్మించాడు. దానిని 1897లో ఆరవ నిజాం అతని నుండి కొన్నాడు. సాలార్‌జంగ్ I సలహాపై ఐదవ నిజాం 1864లోనే పబ్లిక్ గార్డెన్ స్థలాన్ని సేకరించాడు. దానిలో మీర్ మహబూబ్ అలీఖాన్ ప్రభువు 1905లో తన 40వ జన్మదిన సందర్భములో టౌన్‌హాల్ (Town-hall) నిర్మాణమునకై శంకుస్థాపన చేయగా అందమైన భవనము 1913లో పూర్తి చేయబడింది. అదియే నేటి శాసన సభాభవనము (అసెంబ్లీ). సరూర్‌నగర్‌లో 1905లోనే విక్టోరియా మెమోరియల్ ఆర్ఫనేజ్ (Victoria Memorial Orphange) స్థాపించబడింది. క్రీ.శ. 1876లో సతీసహగమన దురాచారము నిషేధించబడింది.



అసెంబ్లీ భవనము

ఆరవ నిజాం కాలములో అతని కొలువులో ఉన్నతోద్యోగిగా నుండిన అబ్దుల్‌హక్ క్రీ.శ. 1883లో సికింద్రాబాద్ బోట్‌క్లబ్‌కు ఎదురుగా అతని తల్లి కొరకై చతురస్రాకారపు అద్భుతమైన కట్టడమును ఆమె సమాధిపై నిర్మించాడు. దీనినే అబ్దుల్ హక్ దిలేర్ ముల్క్ తల్లి సమాధియందురు. ఒక్కొక్కవైపు ఐదు కమానులు నాలుగు దిశల యందు ఈ నిర్మాణములో ఉన్నాయి. దీని జాలి

పని చూడదగింది. 1910లో హైదరాబాద్ విద్యుచ్ఛక్తి శాఖ (Hyderabad Electricity Dept.) ఏర్పాటు చేయబడింది. జనరేటర్ల ద్వార విద్యుద్దీపములు జంట నగరాలలో వెలిగింపబడినాయి.



అబ్దుల్‌హక్ దిలేర్ ముల్క్ తల్లి సమాధి

ఆఱవ నిజాం కాలములో మొదటి సాలార్‌జంగ్ దివాన్‌గా నున్నప్పుడే అనగా 1883లో అతడు చనిపోక పూర్వమే ఎల్గందల్ జాగీర్దార్‌గా నుండిన మునవర్‌ఖాన్ హైదరాబాద్‌లోని మొగల్‌పురలో నివసించేవాడు. నవాబు మునవర్‌ఖాన్‌కు మగపిల్లల్లేరు. ఆయన గతించిన తరువాత ఆయన భార్య జాగీరు వ్యవహారములను చూచుకొను పరిస్థితుల్లో లేదు. అందుకని ఆమె ఎల్గందల్ జాగీర్‌ను మొదటి సాలార్‌జంగ్‌కు అప్పగించగా, అతడు దానిని నిజాం ఖాల్సాలో చేర్చాడు[179]. మునవర్‌ఖాన్ కుటుంబము జీవించి ఉన్నంతకాలము భరణము ఇవ్వబడింది. ఇంతటితో ఎల్గందల్‌లో జాగీర్‌దారుల పాలన అంతమైంది. ఆరవ నిజాం కాలములో జిల్లాల పునర్వ్యవస్థీకరణ జరిగినప్పుడు 1905లో ఎల్గందల్ నుండి జిల్లా కేంద్రం కరీంనగర్‌కు మార్చబడింది.

## కరవుకాటకాలు (క్రీ.శ. 1897)

మీర్ మహబూబ్ అలీఖాన్ రాజు కాలములో సంభవించిన కరవుపై జగిత్యాల ఆదికవిగా పేరొందిన వైశ్యపుంగవుడు జైశెట్టి రాజయ్య (క్రీ.శ. 1842-1921) రచించిన రెండు దీర్ఘ సీసమాలికల నుండి కొన్ని పంక్తులు ఈ క్రింద నుదహరింపబడినవి. ఈ సీసమాలికలు రాజయ్య విరచితమైన "శ్రీ లేమలవాడ రాజరాజేశ్వర శతకము మరియు మనస్సంబోధన కీర్తనలు" అను గ్రంథము నుండి సేకరింపబడినాయి[180] (ప్రథమ ముద్రణ 1933, ద్వితీయ ముద్రణ 1992). ఆనాటి ప్రజలు కరవు కాలములో ఎదుర్కొనిన ఇబ్బందులు ధాన్యపుధరలు మున్నగునవి రాజయ్య గారు తమ రచనలలో పేర్కొన్నారు.

## కరవుపై చెప్పిన సీసమాలికలు (క్రీ.శ. 1897)



కీ.శే. జైశెట్టి రాజయ్య (1842-1921)

సీ॥మా॥ నమ్మించి దుర్ముఖినామవత్సరమున
విదిత శ్రావణ కృష్ణ విదియ నుంచి
కార్తులనెగబెట్టి కాలమునదువక
దినుసు బండక ప్రజల్ దీనులైరి
ఆబితాబీరబ్బులన్ని ధాన్యంబులు
ఇద్దుమయ్యేటి గింజలిరుసబండె
హేవళంబియనెడునీ వత్సరంబున
కేవలంబు కరువు దాపురించె
జ్యేష్ఠ శుద్ధా షష్ఠి శ్రేష్ఠంబు రవిదినం
మృగశిర రవి జేరమిగులవేద్క
చందుచౌతి తురుక తేదైన మొహరము
పదమూడు నూర్ల పదైదు హిజరి
ఆర్ద్రయు మృగశిరలవి రెండు నెగబెట్టె
దండిదండిగ ఎండ దగడు గొట్టె
ఎక్కడదగినను ఒక్క రూపాయికి
జొన్నలారే శేర్లు ఉన్నచోట
బియ్యపు నూకల కిక్కట్టు లావయ్యె
నానాస్థలంబుల నాల్గుశేర్లు
ఒక్క రూపాయికి నొనరంగధరయిట్లు
సొమ్ము చిక్కకనరుల్ దిమ్మరైరి.

పండిలేవగలేక పడినారు కొందరు
మొదటి కన్నము లేక మూర్ఛనొంద్రి
తవుడు పిడ్కెడు బుక్కి తండ్లాడి కొందరు
నీళ్లతో ప్రాణము నిలుపుకొనిరి
కన్నపు దొంగలు కలవర పెట్టిరి
ఉన్న సంసారాలు సన్నమయ్యె
ఎడ్లుగొడ్లును బర్లు ఎనుబోతులన్నియు
మేతలేకను గూలె భూతలమున
కరవుగత్తరలచే కడుబీదజనులకు
ఉన్నకంచము ముంతలూసిపాయె
భీకరంబైనట్టి బిరుదు గల్గినవారు
భిక్ష మెత్తుకునిరి బిడియపడక

తే.గీ. ధరణిలోన జగితియాల పురమునందు
వాంఛతో జెప్పె పద్యంబు వైశ్యుడిట్లు
రచన కవనంబు జైశెట్టి రాజయాఖ్య
సిద్ధ సద్భక్త చరణాబ్జ సేవకుండు

సీ॥మా॥ నరులు హేవాళంబినామ వత్సరమున
తగని కష్టములకు తడబడైరి
కరువుచే కొందరు కడుపెండి సగమైరి
మారి దగిలి కొంత మరణమైరి
గొడ్లుజచ్చుట కొంత గోలుకోకుండిరి
అప్పు బుట్టక కొందరదిలినారు
మానంబు ప్రాణంబు మరి దక్కకుంటైరి
పిరికితో కొందరు బీరిపొయిరి
కరుణించి జైశెట్టి కవి రాజయాఖ్యుని
మరియు రక్షించుమా మదనవైరి

తే.గీ. దండి కఠినంబు దినమిది ధరణియందు
సర్వకాలంబు రక్షించు సాక్షిరూప ।
పుడమిలోపల జగ్త్యాల పురనివాస ।
ప్రజల శ్రమలన్ని దప్పించు పార్వతీశ ।

## మూసీవరదలు - మహబూబ్‌పాషా సహాయక చర్యలు (క్రీ.శ. 1908)

మూసీనది వరదలు క్రీ.శ. 1908 సెప్టెంబర్ 28 మంగళవారము రోజున హైదరాబాద్ నగరములో బీభత్సము సృష్టించి అపార జన ధననష్టము కలిగించాయి. 20వేల ఇండ్లు కొట్టుకొని పోయాయి. వేలమంది ప్రాణములు గోల్పోయారు. నదికి ఇరువైపుల ఒడ్డులందు కూలిన ఇండ్లు తప్ప ఏమి మిగల్లేదు. అన్ని చోటులందు మనుష్యుల జంతువుల మృతదేహములు పడిఉన్నాయి. అనేక వేలమంది నిరాశ్రయులైనారు. ఒకే రోజున 17 అంగుళముల వర్షము కురిసింది. అఫ్జల్‌గంజ్ బాజార్లన్నియు పదకొండు అడుగుల ఎత్తు వరకు నీటితో నిండినాయి. ఇండ్లన్నియు నీటితో మునిగిపోయాయి. వరద బాధితులకు ఉచిత భోజన సౌకర్యమును కలిపించుటకై పది కేంద్రము లేర్పాటు చేయబడ్డాయి. నవాబు మహబూబ్‌పాషా మరియు అతని ప్రధానమంత్రి మహారాజాసర్‌కిషన్ ప్రసాద్ స్వయముగా వరద తాకిడి ప్రాంతములందు పర్యటించి సత్వర సహాయకచర్యలు తీసుకొన్నారు. వరద బాధితులకు శిబిరము లేర్పరచుటకై నవాబు తన రాజభవన ద్వారములను తెరపించాడు. 40 వేల మంది నిరాశ్రయులకు రోజు మూడు పూటల భోజనము చాలా రోజుల మట్టుకు ఉచితముగా పెట్టించాడు. మూసీనదిని ముచుకుందనది యని గూడా వ్యవహరించేవారు. జగిత్యాల ఆదికవి జైశెట్టి రాజయ్య "ముచికుందనది ప్రళయ తాండవము" అను శీర్షికన రచించిన అనేక గేయములలోని కొన్నింటిని పాఠకుల ముందుంచడమైనది. ఈ వరదలు క్రీ.శ. 1908 (1317 Fasli) సెప్టెంబర్‌లో సంభవించెననియు, ఏడవనిజాంను బాబూ సాహెబు, హుజూరు అను పదములతో సంబోధించుచు అతడు వరదబాధితులను నిరాశ్రయులను తన కన్న బిడ్డలవలె ఆదుకొనెనని సమకాలీన కవి జైశెట్టి రాజయ్య (1842-1921) తన గేయములలో పేర్కొన్నాడు[181].



మూసీనది వరదలు

## ముచికుందనది ప్రళయతాండవం (క్రీ.శ. 1908-ఫస్లీ 1317)

ముచికుందనది వచ్చెనయ్యయ్యో
పట్నమును ముంచి చెడగొట్టెనయ్యయ్యో
ముచుకుందనది వచ్చె మునిగె పట్నము సగము
నశియించిజనులంత నదిలోగొట్టుక పోయిరి ॥ముచి॥

కొందరికి మహిలాయీ తారీఖూ
ఇట్లు చందు బాబీస్మీ ఆబానూ
పొందు పదమున్నూట పదిఏడో ఫస్లీలో
హిందూలు ముసల్మాండ్లందరూ జూడంగ ॥ముచి॥

కీలకనామ సంవత్సరం
జనులకీడొంద జేసెరా మచ్చరం
శూలించి ఆశ్వీజ శుద్ధ తృతీయయందు
వలపోత చంద్రూని వారంబునాడిట్లు ॥ముచి॥

సకలంబు బాజార్లు మునిగెరా
చూస్తే ఒక బాజారని ఎంచరాదురా
ఇక బేగంబజార్లొ ఇండ్లు మిద్దెలు గూలె
ఆకుబర్జ బజార్లో సకలంబిండ్లు గూలె ॥ముచి॥

మహరాజు గంజంత మునిగెరా
ఇంక మహబూబు గంజంత మునిగెరా
ఇరవూగ సగమంత ఇసమియ్యాబాజారు
అరదూగ పూరాగా అఫ్జల్‌గంజ్ మునిగె ॥ముచి॥

ములుకపేటయు సగము మునిగెరా
మునిగె మ్యాకాల మండి బాజారురా
దూలిపేటయుసగము దూరితంబు మునిగెరా
జలము మెండైనంక జనులాతోటెమౌరా ॥ముచి॥

పరగ్రామముల నుంచి కోరిరా
ఎన్నోపనులుండి వచ్చిన వారురా
మరి ఆరోజున కొందరు మరణంబు జెందిరి
నరహరి కృప దప్పినరులిట్లు మృతులైరి ॥ముచి॥

వనములెక్కన చెట్లు విరిగెరా
లెక్క వ్రాసిన దస్త్రాలు మునిగెరా
మునిగి చచ్చిన జనులు ఎనుభై తొంభైవేలు
అనరాదు వినరాదు అగణితంబందాజా ॥ముచి॥

కనబడ్డా పీనుగులా జూచిరీ
అడవికట్టె మండెల రీతి మోసిరీ
దినమూలు మూన్నాల్గు దినమూలు మొయ్యంగ
పీనుగులు ఏడు వేలెనుభై మూడెదొరికె ॥ముచి॥

భగవత్ తంత్రంబిట్లు జేసెరా
జనుల పాపంబు భరియించలేదురా
నగరంబు మునిగే పోయి నరులంత జచ్చుటకూ
తగరాని ఫికరొంది తండ్లాడె హుజూరు ॥ముచి॥

రాజాధి మహెబూబు రాజురా
మనల రక్షించె ధైర్యంబు రాజురా
యజమాని మనరాజు ఎంతో ధర్మాత్ముడై
సుజనూడై పాలించి ప్రజలాకన్నము బెట్టె ॥ముచి॥

పరమాత్మునికి వచ్చె కోపంబూ
ధూర్తునరులు జేసుట లావే పాపంబూ
సరుదారుబాబు సాహెబొక్కని పుణ్యం
మరి మంచిదయ యుండి మానవుల రక్షించె ॥ముచి॥

ధరణిశ్రీ జగిత్యాల వైశ్యుడూ
బుద్ధి పరమాసద్భక్తి విచారుడూ
కరుణించి జైశెట్టి కవితారాజాఖ్యుండు
నిరతంబు ఆర్యులా శరణాగతుడై యుండె ॥ముచి॥

ఇట్లు మూసీనది వరదల సమయంలో ఆఱవ నిజాం ప్రభువు మీర్ మహబూబ్ అలీఖాన్ నిరాశ్రయులైన వరద బాధితులను కన్నబిడ్డల వలె ఆదుకొనినాడని జైశెట్టి రాజయ్య గేయములు తెలియజేస్తున్నాయి.

క్రీ.శ. 1911 ఆగస్టు 29న పగలు గం. 2-30 ని.లకు ఆకస్మికముగా వచ్చిన పక్షవాత రోగముతో ఆఱవ నిజాం మీర్ మహబూబ్అలీఖాన్ ప్రభువు కన్నుమూశాడు. అతని

రాజ్యప్రజలందరు శోకసముద్రమున మునిగిపోయిరి. అతని భౌతికకాయము మక్కా మసీదులో తండ్రి ప్రక్కనే సమాధి చేయబడింది.



సంస్థానాధీశులతో మహబూబ్అలీఖాన్ నవాబు

## మీర్ ఉస్మాన్ అలీఖాన్ ఆసఫ్జా VII (క్రీ.శ. 1911-1948)

ఆఱవ నిజాం మీర్ మహబూబ్ అలీఖాన్ మరణించగానే అతని కుమారుడు మీర్ ఉస్మాన్ అలీఖాన్ క్రీ.శ. 1911 ఆగస్టు 29న ఏడవ నిజాంగా ప్రకటింపబడినాడు. అతని పట్టాభిషేకము లాడ్ బజారు సమీపమున గల చౌమహల్లా రాజభవనములో క్రీ.శ. 1911 సెప్టెంబర్ 12న మహావైభవముగా జరిగింది. ఆ సందర్భములో ఏడవ నిజాం తన హైదరాబాద్ రాజ్యమును ప్రపంచములోని అధునాతన రాజ్యములవలె అభివృద్ధి పరచగలనని ప్రకటించాడు. తండ్రి కాలము నుండి ప్రధానమంత్రిగా నున్న మహారాజా సర్ కిషన్ ప్రసాద్ క్రీ.శ. 1912లో తన పదవికి రాజీనామా చేయగానే యూసుఫ్ అలీఖాన్ సాలార్ జంగ్ III ప్రధానమంత్రిగా నియమింపబడినాడు. అతడు గూడా క్రీ.శ. 1914లో రాజీనామ చేసి నాలుగు దశాబ్దములు ప్రపంచములోని విలువైన, అందమైన, అద్భుతమైన వస్తువుల సేకరణలో కాలము గడిపి ప్రపంచ విఖ్యాతమైన సాలార్‌జంగ్ మ్యూజియంను తన నివాస గృహమగు దివాన్ దేవుడీలో ఏర్పాటుచేశాడు. అతడు బ్రహ్మచారిగానే జీవితము గడిపి తన 60వ ఏట 1949లో చనిపోయాడు. అతని పేరట వెలసిన సాలార్‌జంగ్ మ్యూజియం నూతనముగా నిర్మించిన ప్రస్తుత భవనములోనికి 1968లో మార్చబడింది.

మూడవ సాలార్‌జంగ్ 1914లో రాజీనామా చేసిన తరువాత ఏడవ నిజాం పరిపాలనా బాధ్యతను తానే స్వీకరించాడు. మొదటి ప్రపంచ యుద్ధ (1914-1918) సమయంలో ఆంగ్లేయులకు సైనిక, ఆర్థిక, వస్తురూపేణ సహాయమందించాడు. 1918లో యుద్ధము ముగియగానే ఐదవ జార్జి చక్రవర్తి ఘనత వహించిన (His Highness) ఏడవ నిజాంకు మహాఘనత వహించిన (His Exalted Highness) బిరుదమును మరియు బ్రిటిష్ ప్రభుత్వ విశ్వాసపాత్రుడైన సహాయకుడు (Faithful Ally of the British Government) అను బిరుదును ప్రకటించి సత్కరించాడు.



మీర్ ఉస్మాన్ అలీఖాన్ నవాబు

ఏడవ నిజాం కాలములోనే హైదరాబాద్ రాజ్యము సర్వతోముఖాభివృద్ధి సాధించింది. దానికి ఆనాటి ఆర్థిక సుస్థిరత (Financial Stability) యే కారణము. రాజ్యము ఆర్థికంగా సుభిక్షముగా ఉండింది. ప్రపంచములోని అతి ధనవంతులలో నిజాం ఒకడుగా పరిగణింపబడ్డాడు. బహుశః మూడవస్థానములో ఉండేవాడు. అయినప్పటికిని అతడు అతి నిరాడంబరుడు. దంబములకు దర్పములకు అతీతుడు. అతి సాధారణ జీవితము గడిపాడు. 1919లో సర్‌అలీ

ఇమాం, అతని తరువాత మహారాజా కిషన్‌ప్రసాద్ 1925 నుండి 1937 వరకు ప్రధానులుగా ఉన్నారు. కిషన్ ప్రసాద్ దయార్ద్ర హృదయుడు మరియు దానశీలి. అతడు పర్యటనకై హైదరాబాద్ పట్టణ వీధులలోకి వెళ్ళినప్పుడు ఆ చేత ఈ చేత అనకుండా రెండు చేతుల వెండి, రాగి నాణెములు పేద ప్రజానీకానికై వెదజల్లెడి వాడని ప్రతీతి. సర్ అక్బర్ హైదరి, నవాబు ఛతారి, సర్‌మిర్జాఇస్మాయిల్, మెహదియార్‌జంగ్, లాయఖ్ అలీలు వరుసగా ప్రధానులైనారు.

## ప్రజోపయోగ సంస్కరణలు

ఏడవ నిజాం కాలములో అనేక సంస్కరణలు ప్రవేశపెట్టబడినాయి. 1914లో పురావస్తుశాఖ (Archaeological Department) ఏర్పాటు చేయబడింది. 1919లో నూతన రాజ్యాంగమును ప్రవేశపెట్టి ఒక కార్యనిర్వాహక మండలి (Executive Council) ఏర్పరచటమైంది. 1922లో న్యాయశాఖను ఇతర శాఖల నుండి వేరుచేశాడు. 1923లో ఆసఫ్‌జాహీ వంశస్థాపన జరిగి 200 సంవత్సరములు పూర్తి అయిన సందర్భములో రాజ్యమంతట ద్విశతాబ్ది ఉత్సవములను ఘనముగా జరిపించాడు. 1927లో ఉస్మానియా మెడికల్ కళాశాల, 1929లో ఉస్మానియా ఇంజనీరింగ్ కళాశాల ప్రారంభించాడు. 1930లో రాష్ట్ర పురావస్తు ప్రదర్శనశాల (State Archaeological Museum) స్థాపించబడింది. 1932లో విమాన సర్వీసుల బోర్డ్ (An Aviation Board) స్థాపించబడింది. 1935లో విమానాశ్రయమేర్పడగా కరాచీ నుండి మద్రాసుకు పోవు విమానము హైదరాబాద్‌లో ఆగుటకు వీలుకలిగింది.

1933లో రెసిడెన్సీ (Residency) ని ఆంగ్లేయులు తిరిగి నిజాం ప్రభుత్వానికి అప్పగించారు. అప్పటి నుండి రెసిడెన్సీబజార్ పేరు సుల్తాన్ బజార్‌గా మారింది. 1935లో హైదరాబాద్ నందు ఆకాశవాణి కేంద్రము (Boardcasting Station) ఏర్పడింది. 1936 అక్టోబర్ 24న బ్రిటిష్‌వారు బెరార్‌పై నిజాం సార్వభౌమాధికారమును ఒప్పుకొని, అదనంగా వచ్చిన రెవెన్యూను అతనికిచ్చుటకై నొక ఒడంబడిక చేసికొన్నారు. ఏడవ నిజాం కుమారుడు ఆజంజా బహాదూర్ బెరార్ రాకుమారునిగా (Prince of Berar) బిరుదు పొందాడు. 1936నకు బదులు 1937లో నిజాం తన పరిపాలన రజతోత్సవములను (Silver Jubilee Celebrations) రాజ్యమంతటా జరిపించాడు. ఆ సందర్భములోనే జ్ఞాపక చిహ్నములుగా అనేక చోట్ల కమాన్లను (gateways) నిర్మించారు. ఇట్టి కమాన్‌లు కరీంనగర్, పెద్దపెల్లి, జగిత్యాలలో కూడా 1937లో నిజాం గౌరవార్థము నిర్మింపబడినాయి. కాని జగిత్యాలలోని కమాన్ కూలిపోయి అదృశ్యమైంది. రజతోత్సవముల సందర్భములో చల్‌గల్ (చలిగంటి) రాజా జువ్వాడి ధర్మజలపతిరావు జగిత్యాల నడిబొడ్డున అందమైన, అద్భుతమైన జగిత్యాల టవర్ (Tower) నిర్మించాడు.

రెండవ ప్రపంచ యుద్ధ (1939–1945) కాలంలో బ్రిటిష్ వారికి ఏడవనిజాం 25 మిలియన్ పౌండ్ల ద్రవ్యమునిచ్చి సహాయపడ్డాడు. విద్యుచ్ఛక్తి శాఖ, రోడ్లు, రైల్వే, విమాన సర్వీసుల

శాఖలు అభివృద్ధి చెందాయి. అతి సామాన్యమైన జీవితము గడుపుట వలన ఏడవ నిజాంను పిసినారి అని భావించేవారు. 1939లో చలికాలము ఒక రోజున నిజాం ప్రభువు తన ఉద్యోగికి 25 రూపాయలిచ్చి బజారులో ఒక బ్లాంకెట్ (Blanket) కొనుటకై పంపాడు. అతడు అంగడిలో తిరిగి నవాబు వద్దకు వచ్చి 35 రూపాయలు లేనిదే బ్లాంకెట్ దొరకదని తెలిపాడు. 10 రూపాయలు ఎక్కువ ఖర్చు చేయుటకు ఇష్టపడక ఉన్నటువంటి పాత బ్లాంకెట్ తోనే సరిపెట్టుకుందునని సమాధానమిచ్చాడు. ఇది అతని నిరాడంబరతకు తార్కాణం. అదే సంవత్సరము బికనేర్ మహారాజు అభ్యర్థన మేరకు బెనారస్ హిందూ విశ్వవిద్యాలయమునకై సహాయమునర్థించగా ఒక లక్ష రూపాయల విరాళము పంపాడు. ఇది అతని ఉదారతకు, విశాల హృదయమునకు తార్కాణము. అలాగే అలీఘర్ ముస్లిం యునివర్సిటీ, శాంతినికేతన్ యునివర్సిటీ, అమృత్‌సర్‌లోని స్వర్ణ దేవాలయము మున్నగు సంస్థలకు విరివిగా విరాళము లిచ్చుట అతని లౌకిక దృక్పథము (Secular Outlook) నకు నిదర్శనములు.



హైకోర్టు భవనము

## ప్రజోపయోగ కట్టడములు

ఏడవ నిజాం క్రీ.శ. 1919 ఆగస్టు 7న ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని స్థాపించాడు. తదనంతరము అడికిమెట్ట (Adikimet) వద్ద 1400 ఎకరముల స్థలము సేకరించాడు. 1934లో ఉస్మానియా విశ్వవిద్యాలయ నిర్మాణమారంభమయింది. వేల మంది కార్మికులు నియోగింపబడిరి. 36 లక్షల వ్యయముతో దీని నిర్మాణము పూర్తికాగానే 1939లో నిజాం ప్రభువు తన హస్తములతో దీని ప్రారంభోత్సవము జరిపాడు. భారతదేశములోని విశ్వవిద్యాలయములన్నింటిలో ఇది ఒక

అందమైన, అద్భుతమైన కట్టడము. దీనికి అనుబంధంగా ప్రస్తుతము 167 కళాశాలలున్నాయి. (Affliated Colleges) ఈ విశ్వవిద్యాలయ విద్యార్థుల సంఖ్య ఒక లక్షకు మించి ఉంది. మూసీనది ఒడ్డున ఉన్నత న్యాయస్థాన భవనము (High Court Building) యొక్క నిర్మాణము 1915లో ఆరంభమైంది. 1920 ఏప్రిల్ 20న నిజాంప్రభువు తానే ఈ భవనమును ప్రారంభించాడు. మూసీనది వరదలు ఆరికట్టుటకై మోక్షగుండం విశ్వేశ్వరయ్య సలహాపై 1914లో గండిపేట చెఱువు (Osman Sagar) మరియు హిమాయత్‌సాగర్‌ల నిర్మాణము ప్రారంభమైంది. 1920లో ఉస్మాన్‌సాగర్ 54 లక్షల వ్యయముతో, 1927లో హిమాయత్‌సాగర్ 92 లక్షల వ్యయముతో పూర్తైనాయి. 1933లో ఢిల్లీలో అందమైన హైదరాబాద్ హౌజ్ (Hyderabad House) నిర్మించబడింది. అదే సంవత్సరము బ్రిటిషు వారి కేంద్ర రాజధాని పాతఢిల్లీ నుండి కొత్త ఢిల్లీకి మార్చబడింది. అందమైన గ్రానైట్‌తో మోజంజాహీ మార్కెట్ 1935లో నిర్మింపబడింది. 1936లో మూసీనది ఒడ్డున స్టేట్ సెంట్రల్ లైబ్రరీ (State Central Library Building) భవనము, 1937లో జుబిలీహాల్ నిర్మింపబడినాయి. ఉస్మానియా జనరల్ ఆసుపత్రి, యునాని దవాఖానా, పబ్లిక్‌గార్డెన్‌లోని రాష్ట్ర పురావస్తు మ్యూజియం, హెల్త్ మ్యూజియం, బాల్‌భవన్ మున్నగు భవనములన్నియు ఏడవ నిజాం కాలములోనే నిర్మించబడినవి. ప్రభువు పారిశ్రామికాభివృద్ధికై పాటుబడ్డాడు. సిర్పూర్ కాగజ్‌నగర్ పేపర్‌మిల్, బోధన్‌లో నిజాం సుగర్ ఫ్యాక్టరీ, వరంగల్‌లో ఆజంజాహి బట్టల మిల్లు మున్నగునవి స్థాపించబడినాయి.



ఉస్మానియా విశ్వవిద్యాలయము

## రజాకార్ ఉద్యమము

1927లో హైదరాబాద్ నందు "ఇత్తెహాద్-ఉల్-ముసల్మాన్" సంస్థ నవాబు సదర్ యార్‌జంగ్ అధ్యక్షులుగా స్థాపించబడింది. ఇది ఒక దశాబ్దము నామమాత్రంగా పనిచేసింది. 1939లో నవాబు బహాదూర్‌యార్‌జంగ్ అధ్యక్షులు కావడంతో ఈ సంస్థ బలపడింది. 1940 నుండే ఈ సంస్థ హైదరాబాద్ రాజ్య కాంగ్రెస్‌ను వ్యతిరేకిస్తూ వచ్చింది. 1940లోనే ఈ సంస్థ

కొందరు వాలంటీర్లను సమకూర్చుకుంది. వీరినే రజాకార్‌లని అంటారు. 30 మంది రజాకార్లకు 'సలార్' అనే పేరున దళనాయకుడుంటాడు. రజాకార్లు ఖాకీ యునిఫారం, నల్లటోపి ధరిస్తారు. వారికి సైనిక శిక్షణ ఇచ్చారు. కత్తి, బాకు వారి ఆయుధాలు. 1940 అక్టోబర్ నెలలో రజాకార్ వ్యవస్థను బహదూర్ అలీజంగ్ ఆవిష్కరించాడు.

## కాశింరజ్వీ

1946లో కాశింరజ్వీ రజాకార్ల సంస్థకు అధ్యక్షుడైనాడు. ఆయన అధ్వర్యంలో రజాకార్లు ఒక సైనికశక్తిగా రూపొందారు. 1947 జులై నెలలో వారికి తుపాకులిచ్చారు. వారు వీధులలో కవాతులు జరిపి ప్రజలను భయ భ్రాంతులను చేసేవారు. రజాకార్ల సంఖ్య 50వేలకు పెరిగింది. అనతికాలములోనే ఐదు లక్షల మంది రజాకారులను తయారుచేయగలనని రజ్వీ ప్రకటించినాడు. ప్రజలకు రజాకార్లు ఎవరో, నిజాం పోలీసులెవరో తెలియని స్థితి ఏర్పడింది. రజాకార్లు పెద్ద ఎత్తున దౌర్జన్యకాండలు ప్రారంభించారు. శాంతి భద్రతలు కరవైనాయి. భీతావహవాతావరణము ఏర్పడింది. ప్రజలకు ఎటువంటి రక్షణలేదు. దోపిడీలు, హత్యలు, మానభంగాలు నిత్యకృత్యాలైనాయి. రజాకార్లు నిజాం అధికారమునే ఎదురించే స్థితికి వచ్చినారు. ప్రజల నుండి ధనము వసూలు చేసినారు. ప్రజా జీవితం దుర్భరమైంది. రజాకార్లు పగటిపూట, కమ్యూనిస్టులు రాత్రి పూట గ్రామాలపై దాడులు చేసేవారు. నిజాం ప్రభుత్వానికి రజాకార్లు, కమ్యూనిస్టుల ఉద్యమం పెద్ద సవాళ్లుగా పరిణమించాయి.

## యథాతథస్థితి ఒప్పందము 1947 (Stand still Agreement)

భారతదేశము ఆంగ్లేయుల పాలన నుండి 1947 ఆగస్టు 15న విముక్తి నొంది స్వతంత్రదేశంగా అవతరించింది. కాని పాకిస్థాన్ ఇండియా నుండి విడిపోయింది. ఏడవనిజాం తన రాజ్యమును అటు పాకిస్థాన్‌లో గాని ఇటు ఇండియన్ యూనియన్‌లో గాని విలీనము చేయకుండా స్వతంత్రంగా పాలించుటకు నిర్ణయించుకున్నాడు. అతడు 1947 నవంబర్‌లో ఇండియన్ యూనియన్‌తో యథాతథస్థితి ఒప్పందం కుదుర్చుకున్నాడు. దానినసుసరించి హైద్రాబాద్ రాజ్య రక్షణ, విదేశీ వ్యవహారములు భారత యూనియన్ ప్రభుత్వానికి సంక్రమించినాయి. కాని నిజాం ఈ ఒడంబడికను ఉల్లంఘించి పాకిస్థాన్ నుండి ఆయుధములు దిగుమతి చేసికొనుటకు ప్రయత్నించాడు.

రజాకార్ల ఉద్యమము నానా బీభత్సం సృష్టించింది. ఇట్టి పరిస్థితులలో భారత ప్రభుత్వము కె.యం. మున్షీని హైదరాబాద్‌లో తన ప్రతినిధిగా నియమించింది. స్వామి రామానందతీర్థ నిజాం రాజ్యము ఇండియన్ యూనియన్‌లో కలవటానికి ప్రజాభిప్రాయ సేకరణ జరుగవలెనని కోరాడు. కె.యం. మున్షీ రజాకార్ల ఉదమ్యాన్ని నిషేధించవలెనని భారత ప్రభుత్వానికి ఒక నివేదిక పంపినాడు. హైదరాబాద్ రాజ్యము పెద్ద ఎత్తున ఆయుధాలు సమీకరించుకోవడం

తగదని భారత ప్రభుత్వము హెచ్చరించింది. రజాకార్లు రైళ్ళపై దాడులు జరిపారు. బీబీనగర్ స్టేషన్ ధ్వంసం చేసినారు. నల్గొండ, ఖమ్మం జిల్లాలో వారి అత్యాచారాలు మితిమీరినాయి. ప్రజలు రజాకార్లను ఎదురించడానికి దళాలుగా ఏర్పడినారు. కరీంనగరములోని మందపురం కొండల వద్ద, ఖమ్మంలోని మీనబోలువద్ద, నల్గొండలోని రేనికుంటవద్ద, సూర్యాపేట సమీపపు పాతర్ల పహాడ్ వద్ద రజాకార్లకు ప్రజలకు మధ్య సాయుధ సంఘర్షణలు జరిగినాయి. రజాకార్లు వరంగల్‌లోని కూటిగల్‌లో 23 మందిని కాల్చి చంపినారు. బెహ్రాంపెల్లి (బైరాన్‌పల్లి) గ్రామములో 76 మందిని చంపినారు.

## పోలీసుచర్య 1948

ఇత్తెహాదుల్ ముసల్మాన్ 1948 మార్చి 31న నిర్వహించిన కార్యక్రమములో కాశింరజ్వీ ఉపన్యసించుచు ఎర్రకోటపై తమ జండాను ఎగురవేయుదమని ప్రగల్భాలు పలికాడు. రజాకార్లు "చలోఢిల్లీ" నినాదము చేశారు. నిజాం ప్రభువు తాను స్వతంత్ర అధిపతినని భారత ప్రభుత్వము తనపై దురాక్రమణకు దిగుతున్నదని ఐక్యరాజ్యసమితికి ఫిర్యాదు పంపాడు. కాశింరజ్వీ భారతప్రభుత్వము పై జిహద్ (పవిత్రయుద్ధం) జరిపే సమయమాసన్నమైనదని ప్రకటించాడు. నిజాం రజాకార్ల ఉద్యమాన్ని నిషేధించడానికి అంగీకరించలేదు. వర్తకులు, న్యాయవాదులు, మేధావులందరు తమకు భద్రతలేదని భారత ప్రభుత్వముతో మొరపెట్టుకొన్నారు.

సర్దార్‌పటేల్ దేశవ్యవహారాల మంత్రి (Home Minister) ఆదేశానుసారము ఇండియన్ యూనియన్ సైన్యములు 1948 సెప్టెంబర్ 13న హైదరాబాద్ రాజ్యమును అన్ని వైపులనుండి ముట్టడించినాయి. పెద్దగా రజాకార్ల ప్రతిఘటన జరుగలేదు. మూడురోజుల ముట్టడిలో రజాకార్లు భీతిల్లారు. సెప్టెంబర్ 17న నిజాం లొంగిపోయినాడు. ప్రధానమంత్రి లాయక్ అలీ పాకిస్థాన్‌కు పారిపోయినాడు. కాశిం రజ్వీపట్టుబడగా పది సంవత్సరముల జైలు శిక్ష విధించారు. సెప్టెంబర్ 17న మధ్యాహ్నము ఒంటిగంటకు నిజాం యుద్ధవిరమణను ప్రకటించి రజాకార్లను నిషేధించాడు. ఐక్యరాజ్యసమితి నుండి తన ఫిర్యాదును ఉపసంహరించుకొన్నాడు. మేజర్ జనరల్ జె.యన్.చౌదరి హైదరాబాదు ప్రవేశించి సెప్టెంబర్ 18న హైదరాబాద్ సంస్థానపు మిలిటరీ గవర్నర్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించాడు. అతడు 1949 డిసెంబర్ వరకు ఆ పదవిలో కొనసాగాడు. 1950 జనవరిలో పౌరసివిల్ పరిపాలనా శాఖకు చెందిన యం.కె. వెల్లోడి I.C.S. ముఖ్యమంత్రిగా నియమింపబడినాడు. నిజాం రాజ్యములో మొదటిసారిగా పౌర ప్రభుత్వమేర్పడింది. ఏడవ నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ రాజప్రముఖ్ (Governor)గా నియమింపబడ్డాడు. 1952లో ప్రథమసార్వత్రిక ఎన్నికలు జరిగాయి. బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రిగా ప్రజలకు బాధ్యతాయుతమైన మొదటి మంత్రి వర్గమేర్పడింది.

మీర్ ఉస్మాన్ అలీఖాన్ 1950 జనవరి 26 నుండి 1956 అక్టోబర్ 31 వరకు

రాజప్రముఖ్‌గా పనిచేశాడు. 1956లో భాషారాష్ట్రము లేర్పడినవి. 1956 నవంబర్ ఒకటవ తేదిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము అవతరించింది. పండిత్ జవహర్‌లాల్ నెహ్రూ ఏడవ నిజాంను గవర్నర్‌గా నుండుటకై కోరినాడు. కాని ఏడవ నిజాం వినమ్రంగా దానిని తిరస్కరించి ప్రజాపాలనా జీవితమునకు స్వస్తి చెప్పి విశ్రాంత జీవితము గడుపుటకు నిర్ణయించుకొన్నాడు.

మీర్ ఉస్మాన్ అలీఖాన్ 1967 ఫిబ్రవరి 24 శుక్రవారం రోజున పగలు గం. 1-22ని.లకు తుదిశ్వాస విడిచాడు. రాజు అభిమానులు పదిలక్షల మంది శ్రద్ధాపూర్వక నివాళులర్పించారు. రాజలాంఛనాలతో సైనిక వందనములతో అతని భౌతికకాయము అతని తల్లి ప్రక్కనె జుడీ మసీదులో సమాధి చేయబడింది. ఏడవ నిజాంను తప్పుత్రోవ పట్టించిన రజాకార్లనాయకుడు కాశింరజ్వీ పది సంవత్సరములు జైలు శిక్షననుభవించి 1957 సెప్టెంబర్ 10న విడుదలై తన శేషజీవితమును గడుపుటకై పాకిస్థాన్ వెళ్ళి అక్కడే చనిపోయాడు.

## కరవుకాటకాలు క్రీ.శ. 1921 (1331 ఫస్లీ ఆజూరుదూస్రీ)

ఏడవ నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ కాలములో ఆర్థిక సుస్థిరత ఉన్నప్పటికిని సామాన్య ప్రజలు మాత్రము నాలుగు సంవత్సరములు వరుసగా వర్షములు లేక కరవుకాటకములతో, అధికధరలతో నానా ఇబ్బందుల పాలైనారు. జగిత్యాల ఆదికవి జైశెట్టి రాజయ్య (1842-1921) తన అవసానదశలో తాను మరణించడానికి కొన్ని రోజుల ముందే క్రీ.శ. 1921 (1331 ఫస్లీ ఆజూరు దూస్రీ రోజున)లో ప్రజలు అనుభవించిన కరవు గత్తర, జ్వరాలు అధిక ధరలను గూర్చి అల్లిన గేయములలో కొన్ని ఈ క్రింద నుదహరించబడినవి. ఒక్క రూపాయికి వడ్లు 5 సేర్లు, మక్కలు, జొన్నలు 3 సేర్లు, గిర్నిబియ్యం 2 సేర్లు, అనుములు, మినుములు, శనిగలు, గోధుమలు 2.5 సేర్లు లభించేవని వారి పద్యములలో తెలిపినారు. ఒక్క రూపాయికి చింతపండు 2.5 తక్కెళ్లు, పసుపు కొమ్ములు 2 తక్కెళ్లు అమ్మబడేవి. ఒక్కొక్క మడుముకు (11.250 K.G.) బెల్లం మరియు అల్లం రూ.8, ఉల్లిగడ్డలు, ఎల్లిగడ్డలు రూ.11, నూనె మరియు ఆముదం రూ.12, మిరుపకాయలు రూ.10, చెక్కెర రూ.16, కొబ్బరి రూ.10, నెయ్యి రూ.32 మడుము ఒక్కంటికి ధరలుండెనని, అవి ఆనాటి ప్రజలకు భారంగా ఉండెనని రాజయ్య తన పద్యములలో తెలిపినాడు. ఏడవనిజాం ప్రభువును కవి తన రచనలలో బాబూసాహెబు, మహారాజు, సర్కారు, హుజూరు అని సంబోధించినాడు.[182]

### కరవుపై కవనము (1921)

స్వామి నీ మహిమ దెలియదురా
కరువు భూమంతటను జేసితివిరా
స్వామి గరీబులకు సకల కష్టములయ్యో
భూమిలో కొందరికి శ్రీమంతమిచ్చితివి ॥స్వామి॥

మోతాజు కాన మొకరారు
చేసి బ్రతికించి సాదె సర్కారూ
బ్రతికించె నబాబు సాహేబు మహరాజు
సతతంబు అంతటికి సర్కారు తలిదండ్రి ॥స్వామి॥

కరువు లోపల గత్తరయ్యే
ఇట్లు నరులు కొందరు మరణమయ్యే
కరువుగత్తర రెండు దొరలకైనదప్పవు
పురజనుల ముంచుటకు దొరలు గుర్తెరుగరు ॥స్వామి॥

ఈ కటువుదండి పెద్దదిరా
ఇంక ఇదిగాకలోకమంతటరా
సకల జనులందరికి సలి జ్వరంబులు వచ్చి
మకరి పట్టె జ్వరము మానవుల పీడించె ॥స్వామి॥

కాలమెత్తర తత్తరాయె
వానకాలమెత్తర తత్తరాయె
నాలుగైదేండ్లిట్లు భూలోకమంతట
కాలంబునడువక కరువాయె ॥స్వామి॥

మక్కపెరండ్లన్ని ఎండె
మఘుల ఒక్క చినుకైన బడకుండె
మొక్కలంబుగ మక్క బీజాలు గడ్డలు
ఒక్క పావుల బండె తక్కినవి మరి ఎండె ॥స్వామి॥

మెండైన దండి కరువాయె
పంటబండకను చేండ్లెండిపాయె
దండి నూతులు చెరువు లెండి పోయికొన్నాండ్లు
పండేటి తోటల్ల దినుసుబండకపాయె ॥స్వామి॥

నమ్మించి కార్తు లెగబెట్టె
నరుల పాతగింజలు అమ్మబట్టె
అమ్ముదురు రూపాయికైదు శేర్లును వడ్లు
పొమ్మనక కొలిచిసై పొల్లు వడ్లేగతియు ॥స్వామి॥

కొన్ని కొన్ని దినుసులన్నా
నిత్యము కొని కొని మిడికిరన్నా
జొన్నలు మక్కలు ఉన్న వారిండ్లల్లో
అన్ని దిక్కుల మూడుశేర్లు అమ్మిరాఖరుకు ॥స్వామి॥

ఘనమైనదినుసు కొనబడితె
లావు అనుమాన పడికొందరయితె
అనుములు, మినుములు, శెనిగలు, గోధుమలు
ధనికులమ్మితె కొనిరి ధర రెండు శేర్లనర ॥స్వామి॥

ధరలు దినమొక్క తీరైతె
దొరల వద్దకు ఫిర్యాదు పోయితె
గిర్ని బియ్యము కరువుకున్న దిక్కుల యందూ
అరుదుగా మూడు శేర్లమ్ముమని దొరలాజ్ఞ ॥స్వామి॥

తప్ప మిరియపు కాయలైనా
దొరలు జెప్పినట్లుగ అమ్మిరైనా
ఉప్పుతో తొమ్మిది పప్పుతో పదితీర్లు
తిప్పలాబడి కొంటె చెప్పరాదు ధరలు ॥స్వామి॥

బెల్లమెన్మిది చొప్పు నుండె
మద్దుమకల్ల ఎన్మిది తొమ్మిదుండె
ఉల్లిగడ్డలు పుట్టికి యాబయొక్కటి రెండు
యెల్లిగడ్డలు మదుముకెట్లైన పదకొండు ॥స్వామి॥

నెయ్యి నూనామిదం మూడూ
ధరలు నెలకొక్క తీరుండు చూడూ
నెయ్యి ముప్పై రెండు సవ్వాశేరమ్ముకం
నూనామిదం రెండు మదుముకు పన్నెండు ॥స్వామి॥

మరి మిరుపకాయలెట్లున్నా
మంచి వరుగైతె పదిమద్దుమ కన్నా
మరి మంచి శర్కర మదుముకు పదహారు
మరి కొబ్బరికి పది మద్దుమనొక్కంటికిని ॥స్వామి॥

ఏరీతి బ్రతికెదామనుచూ
పిల్లగాండ్లు బ్రతుకుటెట్లనియూ
మరువక చాటుకు మరి గిర్ని బియ్యంబు
ఇరువుగా రెండు శేర్లిస్తె తీసుకపోయిరి. ॥స్వామి॥

వెండి బంగారంబు రెండూ
ధరలు రెండు మూడు తీర్లనుండూ
రెండు తక్కల్లనర చింతపండును ధర
బండారి కొమ్ములును రెండు తక్కల్లుండె ॥స్వామి॥

ఎంతదండి కరువు ముప్పు
లోకులెట్లెట్లు దీర్తు రోయప్పు
ముంతలు కంచములు ముందటి కటువులో
అంతలోపల కొందరమ్ముకొని బ్రతికిరి ॥స్వామి॥

ధరణిలో దారిద్రులంతా
వాండ్లు దక్కేది దుర్లభం కొంతా
ఇరువుగా ఈ కరువు కింట్లేమి లేకుంట
సరిపడెను నాల్గు సంవత్సరంబుల నుండి ॥స్వామి॥

దినమెంత కఠినంబు దినమూ
ఒక్క ధనికునికి లేదు పామరమూ
ఎనయంగ తురక లంతెగ బడితె
ధనవంతులిండ్లల్లో దాగుండిరయ్యయ్యో ॥స్వామి॥

ఉదరంబుకొందరికి ఎండె
లెస్సఉదరంబు కొందరికి నిండె
సదరు పింగళనామ సంవత్సరము నుంచి
నదులు నిండక ఎండె నాలుగేండ్లిది వరకు ॥స్వామి॥

అదరి బెదరిపోయిరి నరులూ
చాల ఇది వరకే జరిగె యాపదలూ
ముదము పదమున్నూట ముప్పయొక్కటి ఫసిలి
ఆజూరు దూస్రీ వరకన్ని తీర్లిట్లు జరిగె ॥స్వామి॥

నరులకెంతెంత ఫికరున్నా
స్వామి కృప గలిగితే ఫికరుసున్నా
కరుణించి జైశెట్టి కవి రాజాఖ్యుని
ధరణిలో జగిత్యాల పురములో రక్షించు ॥స్వామి॥

## తెలంగాణాలో జాతీయోద్యమము

నిజాం పాత హైదరాబాద్ రాష్ట్రమును (Erst-while Hyderabad State) భాషాపరంగా తెలంగాణా, మరత్వాడా, కర్ణాటక ప్రాంతాలుగా విభజించవచ్చు. తెలుగు ప్రాంతము 49వేల చ.మై. కాగా తెలుగు మాట్లాడే ప్రజలు ఒక కోటి ఉండేవారు[183]. "కోటి రత్నాల వీణ నా తెలంగాణా" అని దాశరథి పలికినాడు. నిజాం రాజ్యములో అక్షరాస్యత 5 శాతము మాత్రమే. అధికారభాష ఉర్దూ క్రీ.శ. 1884 నుండి అమలులోనికి వచ్చింది. 1884కు పూర్వము ఫారసీ అధికార భాషగా ఉండేది. ఆరవనిజాం కాలములో ఉర్దూ అధికార భాషగా ప్రవేశపెట్టబడింది. ఉన్నతోద్యోగాలలో మరత్వాడా మరియు ఉత్తర భారత ప్రాంతానికి చెందినవారు ఉండేవారు. తెలంగాణా ప్రజలస్థితి నికృష్టంగా ఉండేది. తెలుగు భాషకుగాని, తెలుగు సంస్కృతికి గాని ఎటువంటి ఆదరణ లేకుండేది.

1885లో భారత జాతీయ కాంగ్రెసు (Indian National Congress) స్థాపితమైంది. దీనిచే నిజాం రాజ్యములో అనేకమంది ప్రభావితులైనారు. డా.అఘోరనాథచటోపాధ్యాయ, ముల్లాఅబ్దుల్ ఖయ్యూంలాటి ప్రముఖులు దీనిలో చేరినారు. 'హిందూ పయనీర్' లాంటి పత్రికలలో నిజాం పాలనలోని లోపాలు బహిర్గత పరిచారు. 1892లో హైదరాబాద్ నందు ఆర్య సమాజశాఖ ఏర్పడింది. కేశవరావు కరోట్కర్ మున్నగు వారు దీనిలో చేరారు.

మునగాల జమీందారు నాయని వెంకటరంగారావు ప్రాజ్ఞులు, ఉదారస్వభావులు. ఆయన వద్ద దివాన్‌గా నుండిన కొమర్రాజు లక్ష్మణరావు కృషి వలన హైదరాబాద్‌లో "శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం" అను తొలి తెలుగు గ్రంథాలయము 1901లో స్థాపించబడింది. 1906లో విజ్ఞాన చంద్రికామండలి ఏర్పడి తెలుగులో పుస్తకాలను ప్రచురించింది. మహారాష్ట్రులు వివేకవర్ధిని విద్యాసంస్థను ప్రారంభించారు. 1919లో ఉస్మానియా విశ్వవిద్యాలయము స్థాపించబడింది.

### రాజకీయ చైతన్య ప్రారంభము

నీలగిరి పత్రిక, తెలుగు పత్రిక ప్రజలలో రాజకీయ సాంఘిక చైతన్యమును కలిగించాయి. 1918లో హైదరాబాద్ నందు వామన్‌నాయక్ అధ్యక్షతన కాంగ్రెస్ కమిటీ ప్రథమంగా ఏర్పడింది. మహాత్మాగాంధీ ప్రారంభించిన సహాయ నిరాకరణోద్యమము (Non Co-operation Movement) మరియు ముసల్మానులు టర్కీ ఖలీఫాను బలపరుస్తూ బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా ప్రారంభించిన

ఖిలాఫత్ ఉద్యమము యావద్భారతాన్ని జాగృతం చేసినాయి. ఈ ఉద్యమ ప్రభావము నిజాం రాజ్య నిరంకుశ కవాటాలను కూడా ఛేదించుకొని తెలంగాణా ప్రజలను గూడా చైతన్య పరచింది. 1920 మార్చి, ఏప్రిల్ మాసములలో అన్ని జిల్లాలలో వలె కరీంనగర్ జిల్లాలో గూడా ఖిలాఫత్ ఉద్యమము ఊపందుకొంది. కరీంనగర్ పట్టణములో ఈద్‌గా (Idgah) వద్ద జరిగిన సమావేశమునకు హైదరాబాద్ నుండి వచ్చిన షాహబీబుల్లా అధ్యక్షత వహించాడు. అన్ని వర్గముల ప్రజలు సమావేశములో పాల్గొన్నారు. ఈ సమావేశమందు సయ్యద్ మెయినొద్దీన్ అలీఖాన్ అవ్వల్‌తాలుక్దార్ (First Taluqdar or District Collector) మరియు రాయ్‌రతన్‌చంద్ జాయింట్ మెజిస్ట్రేట్ పాల్గొన్నారు. స్థానిక న్యాయవాదులు ఈ ఉద్యమములో పాల్గొన్నారు. బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా నిరసన తెలుపుతూ వర్తకులు తమ దుకాణములను మూసి వేయవలసినదిగా తీర్మానింపబడింది. ఈ సమావేశమునకు పోలీస్ ఆజ్ఞ ముందుగా పొందినట్లు ప్రభుత్వ రికార్డుల్లో లేదు. ఉద్యమము యొక్క ప్రభావము ప్రజలపై అధికారులపై ప్రబలముగా ఉందని సమావేశము తెలిపింది[184].

1920లో జరిగిన సహాయ నిరాకరణోద్యమ ప్రభావానికి లోనై కొందరు తమ చదువులను చాలించారు. డా. జయసూర్య తన వైద్యవిద్యకు స్వస్తి చెప్పినాడు. ఆకాలంలో చదువుకు స్వస్తి చెప్పిన వారిలో, కరీంనగర్‌కు చెందిన మీర్‌మహ్మద్ హుస్సేన్, అక్బర్ అలీఖాన్, మక్బూల్‌అలీ, సయ్యద్ మహ్మద్ అన్సారీ ఉన్నారు. వీరిలో మీర్‌మహ్మద్ హుస్సేన్ నెల్లూరు జైలులో ఆరునెలలు శిక్షను కూడా అనుభవించినారు. తరువాత కాలములో అతడు హైదరాబాద్‌లోని సెంట్రల్ రికార్డ్ ఆఫీసులో డైరక్టర్‌గా నియమితుడైనాడు. అక్బర్ అలీఖాన్ అనంతరకాలంలో సుప్రసిద్ధ బారిస్టర్‌గా పేరునార్జించినాడు. మక్బూల్ అలీ సివిల్ సర్జన్ అయినాడు. సయ్యద్ మహ్మద్ అన్సారీ క్రమంగా వకీలు అయినాడు. రాజకీయ చైతన్యం కలిగిన విద్యార్థులను మేధావులను స్వదేశీ ఉద్యమము చాలా ఆకర్షించింది. పైజామాలను ధరించే పద్ధతిని త్యజించి ఖాదీధోవతులను, గాంధీ టోపీలను బద్రుల్ హసన్, జాఫర్ హసన్ ధరించినారు.[185] బద్రుల్‌హసన్ ఉస్మానియా విశ్వవిద్యాలయములో సమాజశాస్త్ర ఆచార్యులుగా (Professor of Sociology) ఉండేవాడు. ఖాదీ ఉద్యమములో భాగంగా అనేక గృహాలలో చరఖాలు, రాట్నాలు వెలశాయి. మహిళలు రాట్నం వడికి ఖద్దరు గుడ్డను తయారు చేయుటకు తోడ్పడగా, సాంఘిక కార్యకర్తలు వాటిని అమ్మేవాళ్లు. ఆచార్య బద్రుల్ హసన్ బొంబాయి నుండి చరఖాలు తెప్పించి ఇచ్చినాడు. వరంగల్‌లో చరఖాల తయారి కార్ఖాగారము ఏర్పడింది. కరీంనగర్ జిల్లాలోని మెటుపెల్లిలో గాంధీజీ పేరట ఖాదీ కార్ఖానా స్థాపించబడింది. అనేక మంది రాట్నాలు వడికి నూలు అందులో విక్రయించగా, అచట తయారైన ఖాదీ వస్త్రాలు దూర దూర ప్రాంతాలలో అమ్మబడేవి. ఈ ఖాదీ కార్ఖానాలో బోగ పాపయ్య పంతులు అమోఘముగా తమ సేవలందించారు. వారు 1941లో రెండవ ప్రపంచ యుద్ధకాలములో పూనాకు వెళ్ళి పురందరకోటలో

స్వాతంత్ర్యోద్యమ శిక్షణ పొందినారు. మెటుపల్లికి తిరిగి వచ్చి ఉద్యమమును ఉద్ధృతపరచినారు. మహాత్మాగాంధి ఆశయాలైన ఖద్దరు వినియోగం, మద్యపాన నిషేధం, కరీంనగర్ జిల్లాలోని మారుమూలప్రాంతాలకు ప్రాకినాయి. జిల్లాలో పలుచోట్ల చరఖాకేంద్రాలు ఏర్పడ్డాయి. ఆ రోజులలో ఖాదీబట్టలను ధరించిన వారిని కాంగ్రెస్‌వారని భావించేవారు. ఖద్దరు ధరించిన వారిపై పోలీస్‌నిఘా పెరిగింది.

## ఆంధ్ర జన సంఘం ఆవిర్భావము

మహర్షికార్వే అధ్యక్షతన 1921 నవంబర్ 11, 12 తేదీలలో నిజాం రాజ్య "సాంఘిక సంస్కరణల సమావేశము" హైదరాబాద్‌లో జరిగింది. ఈ సమావేశకార్యక్రమాలు ఆంగ్లం, మరాఠీ, ఉర్దూ భాషలలో కొనసాగాయి. ప్రతినిధులలో ఒకరైన న్యాయవాది ఆలంపెల్లి వెంకటరామారావు తెలుగులో తన ప్రసంగాన్ని ప్రారంభించగానే మహారాష్ట్ర సభ్యులు అల్లరిచేసి ఆయన తెలుగు ప్రసంగాన్ని సాగనివ్వలేదు. తెలుగుభాష ఎంత నికృష్టస్థితిలో ఉన్నదో, తెలుగువారు ఎటువంటి దైన్య స్థితిలో ఉన్నారో తేటతెల్లమైనది. తెలుగువారికి కనువిప్పు కలిగింది. అదే రోజు రాత్రి పదకొండు మంది సభ్యులతో తెలుగు ప్రతినిధులు "ఆంధ్రజనసంఘం" అనే నూతన సంస్థను స్థాపించినారు. 1922 ఫిబ్రవరి 14వ తేదీన ఆంధ్రజనసంఘం మొదటి సమావేశము కొండా వెంకట రంగారెడ్డి అధ్యక్షతన హైదరాబాద్‌లో జరిగింది. ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు కార్యదర్శిగా ఎన్నికైనారు. 1924 ఏప్రిల్ 1న హనుమకొండలో జరిగిన ఆంధ్రజనసంఘ సమావేశమునకు హుజూరాబాద్ ప్రజలు చాలా మంది హాజరైనారు.

ఆంధ్ర జన సంఘం అధ్వర్యములో అనేక తెలుగు గ్రంథాలయాలు, విద్యాలయాలు, పఠనామందిరాలు స్థాపించబడ్డాయి. హనుమకొండలో రాజరాజనరేంద్ర భాషానిలయము, ఖమ్మం జిల్లాలోని ఎర్రు పాలెంలో మహబూబియా గ్రంథాలయము లేర్పడినాయి. తెలుగు ప్రజలలో సాంఘిక, సాంస్కృతిక పునరుజ్జీవం కొఱకు కొమర్రాజు లక్ష్మణరావు ప్రభృతులు కృషి చేశారు. కాకతీయ చరిత్రను వెలుగులోనికి తెచ్చు గోష్ఠి ఒకటి 1930లో వరంగల్ నందు జరిగింది. అందులో కాకతీయ సంచిక వెలువడింది. జనసంఘం చిన్న చిన్న పుస్తకాలను గూడా ప్రచురించింది. వీటిలో 'వర్తకస్వాతంత్ర్యం' పుస్తకము ఎన్నదగినది. ప్రభుత్వోద్యోగుల పర్యటన సందర్భాలలో వర్తకులు ఉచితంగా వస్తువులను, సరుకులను సరఫరా చేసే ఆచారముండేది. పటేల్ పట్వారీలు చిన్న చిన్న వ్యాపారుల నుండి గ్రామాలలో బియ్యం మొదలైన తిండి వస్తువులు ఉచితంగా తెప్పించుకొనేవారు. వర్తకులు విధిలేక 'వంతుపద్ధతి' ఏర్పాటు చేసికునేవారు. ఈ పద్ధతి ప్రకారం వారంలో ఒకరోజు, ఒక నిర్ణయింపబడిన వర్తకుడు వస్తువులను ఉద్యోగులకు ఉచితంగా సరఫరా చేసేవాడు. ఇది ద్వాపర యుగములో నుండిన బకాసురుని రాక్షస పద్ధతిని ఈ వంతులవారి పద్ధతి స్ఫురింపజేస్తుంది. ఒక్కొక్క రోజు ఒక్కొక్క వర్తకుని వంతు వచ్చేది.

ప్రభుత్వోద్యోగుల దోపిడి నుండి కాపాడుకోవడానికి ఆంధ్ర జన సంఘం వర్తక సంఘముల స్థాపనకై ప్రోత్సహించింది. 1923 ఫిబ్రవరి 19న సూర్యాపేట వర్తకసంఘం, 1924 ఆగస్టు 8న ఖమ్మం వర్తక సంఘం స్థాపించబడినవి. ఈ వర్తక సంఘముల కార్యవర్గ సభ్యులను అరెస్టు చేసి నిజాం ప్రభుత్వము హింసించేది. కాని వర్తకులు హైకోర్టుకు పోయి వారి పక్షమున న్యాయము జరుగునట్లు విజయము సాధించారు. "వర్తక స్వాతంత్ర్యం" పుస్తకమును వర్తకులు ఆదరించగా నాలుగుసార్లు పునర్ముద్రణ పొందింది. వర్తకులలో వచ్చిన చైతన్యముతో పెద్ద గ్రామాలలో ప్రభుత్వోద్యోగుల దోపిడి కొంత తగ్గినది. కాని చిన్న గ్రామాలలో వర్తకుల దుస్థితి పోలీసుచర్య జరుగుమట్టుకు బాగుపడలేదు.

ఆంధ్ర జన సంఘం కార్యకలాపాలను ప్రజాబాహుళ్యంలో ప్రచారం చేయడానికై నీలగిరి పత్రిక, తెలుగు పత్రిక, గోలకొండ పత్రికలు పూనుకున్నాయి. 1928లో హైదరాబాద్‌లో ఆంధ్ర బాలికా పాఠశాల స్థాపించబడింది. తెలుగు బోధనాభాషగా ప్రవేశపెట్టడం జరిగింది. ఆంధ్రజనసంఘంపై నిజాం ప్రభుత్వము అనేక ఆంక్షలు విధించింది. 1930 నాటికి ఆంధ్ర జన సంఘం తెలంగాణాలో ఒక గొప్ప రాజకీయశక్తిగా రూపొందింది. క్రమేణ ఆంధ్ర జన సంఘం ఆంధ్రమహాసభగా మారింది.

## ఆంధ్రమహాసభ

ఆంధ్ర జన సంఘం 1930 నాటికి ఆంధ్రమహాసభగా అవతరించింది. ఆంధ్రమహాసభ విద్యావ్యాప్తి కొరకు, సాంస్కృతిక వికాసము కొరకు, ప్రాంతీయ భాష తెలుగు అభివృద్ధికొరకు, సంస్కరణ వాద దృక్పథంతో హక్కుల సాధనకు కృషి చేసింది. ఆంధ్ర మహాసభ మొదటి సమావేశము 1930లో మెదక్ జిల్లా జోగిపేటలో సురవరం ప్రతాపరెడ్డి అధ్యక్షతన జరిగింది. ప్రప్రథమంగా ఆంధ్ర మహిళా సభ గూడా నడింపల్లి సుందరమ్మ అధ్యక్షతన జరిగింది. ఈ మహాసభలలో జాగీరు భూములు, మహిళావిద్య, హరిజనోద్ధరణ, విద్య, స్థానిక సంస్థల ఎన్నికలు మున్నగు వివిధ విషయాల పై తీర్మానాలు జరిగాయి. 1931లో రెండవ ఆంధ్ర మహాసభ నల్గొండలోని దేవరకొండలో బూర్గుల రామకృష్ణారావు అధ్యక్షతన జరిగింది.

రాజకీయ ఉపన్యాసములు చేయుట వలన నిజాం ప్రభుత్వము ఈ మహాసభను మూడు సంవత్సరాలపాటు సస్పెండ్ చేసింది. అందువలన 1934లో ప్రభుత్వ ఆజ్ఞను పొంది మూడవ ఆంధ్ర మహాసభను ఖమ్మంలో పులిజాల వెంకటరంగారావు అధ్యక్షతన నిర్వహించారు.

## సిరిసిల్లలో నాలుగవ ఆంధ్ర మహాసభ (క్రీ.శ. 1935)

కరీంనగర్ జిల్లాలోని సిరిసిల్లలో నాలుగవ ఆంధ్ర మహాసభ 1935లో మాడపాటి హనుమంతరావు అధ్యక్షతన నిర్వహించబడింది. మహిళా ఆంధ్ర మహాసభకు మాడపాటి

హనుమంతరావు సతీమణి మాణిక్యమ్మ అధ్యక్షత వహించినారు. భార్యాభర్తలు ఒకే సమయంలో మహాసభకు, మహిళాసభకు అధ్యక్షత వహించడము విశేషం. సిరిసిల్ల, ఆంధ్రమహాసభలోనే ఆంధ్రమహాసభ నియమావళి సూత్రీకరింపబడింది. ఈ సభ నుండియే మహాసభ ప్రజా ఉద్యమంగా మారింది. సభలో తెలుగులో ఉపన్యసించడం ప్రారంభమైంది. అంతకుముందు హైదరాబాద్‌లో జరిగిన సభలలో ఉర్దూ, ఇంగ్లీషు, మరాఠీ భాషలలోనే ఉపన్యసించు సంప్రదాయముండేది. ఆ సంప్రదాయమునకు స్వస్తి చెప్పబడినది. సిరిసిల్ల ఆంధ్రమహాసభలో అనేక తీర్మానాలు ప్రవేశపెట్టబడినవి.

1. విద్యను పునర్వ్యవస్థీకరించాలి.
2. నిర్బంధ ప్రాథమిక విద్యను అమలు పరచాలి.
3. మాతృభాషలో విద్యాబోధన జరుగాలి.
4. జాగీర్లలో ప్రజాహక్కుల పరిరక్షణ జరుగాలి.
5. బాల్య వివాహాలను వ్యతిరేకించాలి.
6. స్థానిక స్వపరిపాలన అమలు పరచాలి.
7. అంటరాని వారి ఉద్ధరణకై పాటుపడాలి.

పైన పేర్కొనిన స్థిరమైన తీర్మానాలు (Stereotyped Resolutions) యువకులకు నచ్చలేదు. వారు సమూలమైన మార్పులను (Radical Changes) కోరిరి. ఈ తీర్మానాలు ప్రభుత్వ వైఖరిలో ఎలాంటి మార్పుతేలేదు[186]. తెలంగాణాలోని ఉద్యమకారులు బద్దం ఎల్లారెడ్డి, అనభేరి ప్రభాకర్‌రావు, సింగిరెడ్డి భూపతిరెడ్డి, సంఘ సంస్కర్త భూమయ్య వకీలు సిరిసిల్లలో ఈ మహాసభ నిర్వహణలో ప్రధానపాత్ర వహించారు. జిల్లాలోని అన్ని తాలుకాల నుండి ప్రతినిధులు, ప్రజలు ఈ మహాసభకు హాజరైనారు. జగిత్యాల నుండి కాసం శివరాజగుప్త, జైశెట్టి లక్ష్మిరాజం గుప్త, సిద్దంశెట్టి సంగయ్య మున్నగు సంస్కారవాదులు ఈ మహాసభకు హాజరైరి. వీరు జగిత్యాలలో కాసం శివరాజగుప్త నేతృత్వములో ఆంధ్రమహాసభశాఖ నేర్పరచిరి. సిరిసిల్ల మహాసభకు హాజరైన రఘునాథ్‌కాచే మంథనిలో ఆంధ్ర మహాసభశాఖను ఏర్పాటుచేశాడు. సిరిసిల్ల మహాసభ అనంతరము కరీంనగర్‌లోని బోయివాడలో ఆంధ్రమహాసభ కార్యాలయము ఏర్పాటైంది. జిల్లా అధ్యక్షులుగా బద్దం ఎల్లారెడ్డి, కార్యదర్శిగా అనభేరి ప్రభాకర్‌రావు, కార్యాలయ కార్యదర్శిగా కె.వి. దామోదర్ రావు పనిచేశారు. ఆంధ్ర మహాసభశాఖలు సిరిసిల్ల, జగిత్యాల, మంథని, పెద్దపల్లి, మెటుపల్లి, కోరుట్ల, చొప్పదండి, సుల్తానాబాద్, హుజూరాబాద్ మున్నగు చోట్ల స్థాపింపబడినాయి.

1935 సెప్టెంబర్ 6న సిరిసిల్లలో జరిగిన ఆంధ్రమహాసభకు కె.వి.రంగారెడ్డి, జె.వి.నర్సింగరావు, సురవరం ప్రతాపరెడ్డి, రావినారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి లాంటి రాష్ట్ర

నాయకులు పాల్గొన్నారు. ఈ మహాసభ అమృత్‌లాల్ శుక్లా వంటి యువకులకు ఎందరికో స్ఫూర్తి నిచ్చింది. ఈ మహాసభ నిర్వహణలో పోల్కంపెల్లి వెంకటరామారావు లాంటి నాయకులు విశేషసేవలు అందించినారు. ఈ వెంకటరామారావు గారి పూర్వీకులు దేవరకొండ నుండి ఈ ప్రాంతమునకు వచ్చారని తెలుస్తుంది. వీరు సిరిసిల్ల ప్రాంతపు ప్రస్తుత నాయకులైన చెన్నమనేని రాజేశ్వరరావు, మరియు కేంద్ర హోంశాఖ సహాయమంత్రి చెన్నమనేని విద్యాసాగర్‌రావు గార్లకు స్వయాన బావ. సిరిసిల్ల ఆంధ్రమహాసభలో కోడిరామకృష్ణ బలప్రదర్శన ఏర్పాటు చేయబడింది.

కరీంనగర్ జిల్లాలో ఏర్పడిన ఆంధ్రమహాసభ కార్యాలయాలు నిజాం రాజ్యములో భూస్వాములు, పెత్తందార్ల దోపిడి, రైతుకూలీలపై దౌర్జన్యాలకు వ్యతిరేకంగా పనిచేశాయి. నిర్బంధలెవీ వసూలు, వెట్టిచాకిరికి వ్యతిరేకంగా ప్రచారం సాగించాయి. ఆనాడు నూలుపై కంట్రోలు విధించడంతో చేనేత కార్మికులకు అనేక ఇబ్బందులు ఏర్పడినవి. ఆంధ్రమహాసభశాఖలు చేనేత పనివారికి గిట్టుబాటు ధరలకు ప్రభుత్వము నుండి నూలు లభించేటట్లు చేసినవి. కార్యకర్తలు నూలు కంట్రోలు దుకాణముల వద్ద ఉంటూ గుర్తింపుకార్డులు ఉన్న కార్మికులకు నూలు అందేలాగా కృషి చేసినారు.

## తదనంతరపు ఆంధ్ర మహాసభలు

ఐదవ ఆంధ్రమహాసభ 1936లో జాగీర్ గ్రామమైన షాద్‌నగర్‌లో కొండా వెంకటరంగారెడ్డి అధ్యక్షతన జరిగింది. 1937లో మందముల నర్సింగరావు అధ్యక్షతన ఆరవ సమావేశము నిజామాబాద్‌లో జరిగింది. ఏడవ సమావేశము మందముల రాంచందర్‌రావు అధ్యక్షతన మల్కాపురంలో జరిగినప్పుడు నల్గొండ నుండి రావినారాయణరెడ్డి, వరంగల్ నుండి కాళోజీ నారాయణరావు, కరీంనగర్ నుండి పోల్కంపెల్లి వెంకటరామారావు మున్నగు ప్రతినిధులు నిజాం ప్రభుత్వము తలపెట్టిన రాజ్యాంగ సంస్కరణలను బహిష్కరించవలెనని తీర్మానం ప్రవేశపెట్టారు. కాని అగ్రనాయకులైన మాడపాటి హనుమంతరావు, కొండా వెంకటరంగారెడ్డి, పులిజాల వెంకటరంగారావు ఈ తీర్మానమును వ్యతిరేకించారు. అయినప్పటికిని తీర్మానము నెగ్గడం సీనియర్ నాయకులను విస్మయపరచింది. ఆంధ్ర మహాసభ మితవాదుల చేతుల నుండి అతివాదుల ప్రాబల్యములోనికి రావడం ఆరంభమైంది. కరీంనగర్ నుండి ప్రాతినిధ్యము వహించిన పోల్కంపెల్లి వెంకటరామారావు ఏడవ ఆంధ్ర మహాసభలో కీలకపాత్ర వహించారు.

ఎనిమిదవ ఆంధ్రమహాసభ 1941లో నల్గొండ జిల్లాలోని హుజూర్‌నగర్ సమీపమున గల చిలుకూరునందు రావినారాయణరెడ్డి అధ్యక్షతన జరిగింది. మహిళా సమస్యలకు, రైతాంగ సమస్యలకు ప్రాధాన్యతనిచ్చినారు. తొమ్మిదవ మహాసభ 1942లో వరంగల్ జిల్లాలోని ధర్మవరంలో మాదిరాజు రామకోటేశ్వరరావు అధ్యక్షతన జరిగింది. పదవ ఆంధ్రమహాసభ 1943లో హైదరాబాద్‌లో జరిగింది. మితవాది కొండా వెంకటరంగారెడ్డి కరీంనగర్ జిల్లాలోని సిరిసిల్ల

ప్రాంతమునకు చెందిన అతివాదుల అభ్యర్థి అయిన బద్దం ఎల్లారెడ్డిని ఓడించి అధ్యక్షుడైనాడు. రాయచూరు జిల్లాలోని గద్వాల, అలంపురంలను తెలంగాణాలో కలుపవలెనని ఈ సమావేశంలో తీర్మానింపబడింది. 1944లో పదకొండవ మహాసభ రావి నారాయణరెడ్డి అధ్యక్షతన భువనగిరిలో జరిగింది. ఆంధ్రమహాసభ కమ్యూనిస్టుల అధీనమైంది. చంద్రరాజేశ్వరావు ఈ సమావేశములో పాల్గొన్నారు. సుమారు పదివేల మంది ఈ మహాసభకు హాజరు కావడం ఇదే ప్రథమం. మితవాదులైన కొండా వెంకటరంగారెడ్డి, మందముల రాంచందర్‌రావు ఈ సభ నుండి వెళ్లిపోయి పోటీ ఆంధ్రమహాసభ పెట్టినారు. దీనినే జాతీయ ఆంధ్ర మహాసభగా వ్యవహరించగా ఇది 1945 మరియు 1946లో రెండు సమావేశములు జరిపి హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌లో విలీనమైంది. ఆంధ్రమహాసభ పన్నెండవ సమావేశం 1945లో రావి నారాయణరెడ్డి అధ్యక్షతన ఖమ్మంలో జరిగింది. ఈ సమావేశంలో 40వేల మంది పాల్గొన్నారు. నిజాం ప్రభుత్వము 1946 డిసెంబర్ 3న కమ్యూనిస్టుపార్టీని నిషేధించింది. దీంతో ఆంధ్ర మహాసభ కార్యకలాపాలు అంతమైనవి. జాతీయ ఆంధ్రమహాసభ చివరి సమావేశము 1946లో మెదక్ జిల్లా కంది గ్రామములో జమలాపురం కేశవరావు అధ్యక్షతన జరిగింది.

## మతమార్పిడులు (Proselytisation)

1926లో మంథనిలోని రాజన్న ఇస్లాం మతము లోనికి మార్చబడినాడు. అతనిపేరు మౌల్విరఫీయొద్దీన్‌గా మార్చబడింది. పెద్దపెల్లి నియోగి బ్రాహ్మణుడు రాజేశ్వరరావు ముస్లింగా మార్చబడి జలీల్ పేరుతో పిలువబడినాడు. మంథని తాలుకాలోని ఆదివారంపేట వైశ్యుడు చిటుకేసి వీరయ్య భార్య రాంబాయిని ఆమె ఎనిమిది సంవత్సరముల పుత్రుడు రాంచంద్రంను జైనోద్దీన్ అనునతడు బలవంతంగా ఎత్తుకొని పోయి (Kidnap) మహదేవ్‌పూర్ ఖాజీ ఎదుట ఇస్లాంలోనికి మార్చాడు. రాంబాయి పేరును హనీషాబీగా మార్చి జైనొద్దీన్ వివాహమాడెను. బాలుడైన రాంచంద్రం పేరు అబ్దుల్లాగా మార్చబడింది[187]. దృష్టికిరాని సంఘటనలు ఇలాంటివి ఎన్నో జరిగినవి. బీదవారైన హరిజనులనేకులు ముస్లింలుగా మార్చబడినారు.

1937 మే నెలలో ఇత్తెహాదుల్ ముసల్మాన్ నాయకుడైన బహాదూర్ యార్ జంగ్ మత మార్పిడులను ప్రోత్సహించు ఉద్దేశముతోనే కరీంనగర్, హుజూరాబాద్, పర్కాల, జగిత్యాల మున్నగు ప్రాంతములను పర్యటించాడు. ఇస్లాంను స్వీకరించిన బీదవారికి ప్రతి ఒక్కరికి 20 రూపాయలు ఇస్తానన్నాడు. సిరిసిల్ల, ఎల్లారెడ్డి ప్రాంతాలలో చాలామంది హరిజనులు ఇస్లాం మతమును స్వీకరించారు. 1941లో జరిగిన జనాభా లెక్కల పట్టికలో (Census) హరిజనులను హిందువులుగా పేర్కొనలేదు. దీనిని నిరసించుచు ఇరుకుల్ల జువ్వాడి చొక్కారావు 1941లో గోలకొండ పత్రికకు ఒక లేఖ వ్రాశాడు. 1947లో డా. అంబేద్కర్ గూడా హరిజనుల మత మార్పిడిని ఆక్షేపించాడు[188].

హిందువులను మహ్మదీయులుగా మార్చు ప్రయత్నములే గాకుండా, క్రైస్తవులుగా మార్చుటకు గూడా ముమ్మరంగా ప్రయత్నములు జరిగాయి. కరీంనగర్ జిల్లాలోనికి క్రైస్తవ మిషనరీలు 1882లో ప్రవేశించాయి. 1887 వరకు అవి తమకేంద్రములను జిల్లాలోని పలుచోట్ల స్థాపించాయి. 1897లో ఋతుపవనములు లేక భరింపలేని క్షామమేర్పడింది. ధరలు పెరిగాయి. ఒక్క రూపాయికి మానెడు అనగా నాలుగు సేర్ల బియ్యము అమ్మారు. ఆనాడు ఒక మానుక బియ్యము ధర ఒక రూపాయి. అది ఆనాటి కరవుధర. ఈనాడు ఒక మానుక బియ్యము ధర రూ. 75. కొత్తపెల్లిలో క్రైస్తవ మిషనరీకి చెందిన వెస్లీ (Wesley) ఎందరికో అన్నము పెట్టి ఆదుకొన్నాడు. కరీంనగర్ జిల్లాలో 152 ఆకలిచావులు నమోదైనాయి. ఆకలితో అలమటించే పేదప్రజలు భుక్తి కొరకై క్రైస్తవ మతమును స్వీకరించారు. అందుకే కరీంనగర్ జిల్లాలో క్రైస్తవుల సంఖ్య గణనీయంగా పెరిగింది.[189] 1905 నుండి క్రైస్తవమత ప్రచారము పెరిగింది. కరీంనగర్, సిరిసిల్ల, జగిత్యాల, పెద్దపెల్లి ప్రాంతాల్లో విద్య, వైద్య సౌకర్యములందించి చాలా మంది హిందువులను ప్రధానంగా హరిజనులను మిషనరీలు క్రైస్తవులుగా మార్చాయి. పెద్దపెల్లి ప్రాంతమున మాదిగవారు, మన్నెపువారు అధిక సంఖ్యలో క్రైస్తవులుగా మార్చబడినారు. 1921లో కరీంనగర్ జిల్లాలో 1581 క్రైస్తవులుండగా వారి సంఖ్య రెండు దశాబ్దములలో 1941 వరకు 21,900కు పెరిగింది.[190]

## హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ స్థాపన 1938

స్వామి రామానంద తీర్థ ఈ సంస్థ స్థాపనకు ముఖ్య కారకులు. 1938 జనవరి 29న హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ స్థాపించబడింది. దీనిలో 1200 సభ్యులు చేర్చబడినారు. ఇది ఒక మతపరమైన సంస్థయను సాకుతో నిజాం ప్రభుత్వము దీనిని నిషేధించింది. మందముల నర్సింగరావు, బూర్గుల రామకృష్ణారావు ముసల్మానునాయకులతో చర్చలు జరిపి విఫలులైనారు. దీనిపై నిషేధం తొలగించాలని 1938 అక్టోబర్ 24 నుండి సత్యాగ్రహం ప్రారంభమైంది. బాధ్యతాయుత ప్రభుత్వము (Responsible Government) కావలెనని స్టేట్ కాంగ్రెస్ కోరింది. ఒక జట్టు (Batch) తరువాత ఇంకొక జట్టు మొత్తము 400 మంది 18 జట్లుగా (Batches) ఏర్పడి సత్యాగ్రహమును డిసెంబర్ 24 వరకు రెండు మాసములు జరిపినారు. 12 వ జట్టులో కరీంనగర్ జిల్లాకు చెందిన బద్దం ఎల్లారెడ్డి మున్నగు ప్రముఖులు ఉన్నారు. మహాత్మాగాంధి సలహా మేరకు చివరి జట్టుకు నాయకత్వం వహించిన కాశీనాథవైద్య ఈ సత్యాగ్రహమును నిలుపుదల చేసినారు.

## ఉస్మానియా విశ్వవిద్యాలయములో వందేమాతరం ఉదంతము (1938)

ఆర్యసమాజం, హిందూ మహాసభ, హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహం మొదలు పెట్టి స్థానిక ప్రజల ప్రాథమిక హక్కులకై పోరాటం జరిపాయి. 1938లో దసరా ఉత్సవముల

సందర్భములో ఉస్మానియా విశ్వవిద్యాలయములోని హాస్టల్‌లో ప్రార్థనామందిరమందు విద్యార్థులు వందేమాతరం గీతం ఆలపించారు. హాస్టల్ అధికారులు ప్రార్థనా మందిరాన్ని మూసి వేసినారు. విద్యార్థులు వరండాలలోనే పాడడము ప్రారంభించారు. విద్యార్థులు పైజామ, నీలిరంగు షేర్వాని వదలి చొక్కాలు, ధోవతులు ధరించి కాలేజీలకు వెళ్లనారంభించినారు. అధికారులు దీనిని ఆక్షేపించినారు. విశ్వవిద్యాలయ ఆవరణలోనే వందేమాతరం గీతం పాడగూడదని నిషేధించినారు. నిషేధాజ్ఞలను ఉల్లంఘించగా 1938 నవంబర్ 29న రాత్రికి రాత్రే హిందూ విద్యార్థులను బయటకు గెంటి వేసి హాస్టళ్లు మూసి వేశారు. హైదరాబాద్ నగరంలో జిల్లాలలో గూడా వేలమంది విద్యార్థులు సమ్మెకు దిగారు. ఈ సమ్మె 1938 నవంబర్ 29 నుండి డిసెంబర్ 10 వరకు నిరంతరాయంగా కొనసాగింది. ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి 350, సిటీ కాలేజి నుండి 70, గుల్బర్గా కాలేజి నుండి 310 విద్యార్థులు, మహబూబ్‌నగర్ హైస్కూల్ నుండి 120 మంది తదితర జిల్లాలలో గూడా, అనేక మంది విద్యార్థులు విద్యాలయాల నుండి తొలగింపబడినారు.[191] వారి పేర్లు హాజరు పట్టిక నుండి తొలగించబడినవి. తొలగింపబడిన విద్యార్థులు ఇంకను ఏ కళాశాలలో చేరకుండా కక్ష సాధింపు ఆజ్ఞలు జారీ చేయబడినవి. చివరకు నాగపూర్ విశ్వవిద్యాలయము ముందుకు వచ్చి తొలగింపబడిన విద్యార్థులు తమ విద్యా సంవత్సరమును నష్టపోకుండా ఉండుటకై ప్రవేశములను కల్పించినది. నూకల రాంచంద్రారెడ్డి, అచ్యుతరెడ్డి, వరంగల్‌కు చెందిన టి. హయగ్రీవాచారి, కరీంనగర్ జిల్లాకు చెందిన పి.వి.నరసింహారావు వందేమాతరం ఉద్యమంలో చురుకుగా పాల్గొనుట వలన విశ్వవిద్యాలయము నుండి తొలగింపబడినవారిలో ఉన్నారు. వీరు నాగపూర్ విశ్వవిద్యాలయములో చేరినారు. జగిత్యాలలో నివసించుచున్న సిరికొండ వతందారు కుటుంబమునకు చెందిన వైశ్యప్రముఖుడు బట్టుగోపాల్ మల్లేశం న్యాయవాది గూడా ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి బహిష్కరింపబడిన వారిలో ఉన్నారు. వీరు గూడా నాగపూర్‌లో ప్రవేశము పొందినారు. ఇలా ఎందరో విద్యార్థులు అసౌకర్యముల పాలైనారు. జవహర్‌లాల్ నెహ్రూ, సుభాష్ చంద్రబోస్, సవార్కర్ వంటి ప్రముఖులు విద్యార్థుల పోరాటాన్ని ప్రోత్సహించారు. విద్యార్థులకు వందేమాతరం ప్రార్థనాగీతాన్ని ఆలపించే హక్కు ఉందని మహాత్మాగాంధి తమ మద్దతు ప్రకటించినారు.

## కరీంనగర్ జిల్లాలోని గడులు, జాగీర్దారులు, వతందారులు

గడి అనగా గ్రామములోని భూస్వామి నివసించు అతిపెద్ద అందమైన గృహము లేదా భవనము. 20వ శతాబ్దపు ప్రథమార్థ భాగములో కరీంనగర్ జిల్లాలో జాగీర్దారులు, మక్తేదారులు, సంస్థానాలు, ఇనాందారులు, అగ్రహారాలు, దేశ్‌ముఖ్‌లు, దేశాయిలు, వతందారులు, భూస్వాములు మరియు పెత్తందారుల పాలనలో సామాన్యప్రజలు నలిగిపోయి దుస్థితి పాలైనారు. కరీంనగర్ జిల్లాలోని కొన్ని ముఖ్యమైన గడులు మరియు ప్రముఖ జాగీర్దారులు, దేశాయిలు, దేశ్‌ముఖ్‌లు, వతందారుల గూర్చిన వివరములు కొన్ని లభ్యమైనంత మట్టుకు ఈ క్రింద నుదహరింపబడినాయి.

కరీంనగర్ జిల్లాలోని ప్రజలు నాటి తరాలలో విభిన్నమైన పాలనను చవిచూశారు. మెటుపెల్లి ఒక జాగీరు పాలనాకేంద్రముగా ఉండేది. దీనికి నవాబు ఫక్రుల్ ముల్క్ జాగీర్దారు. అతడు తరచుగా హైదరాబాద్‌లోనే ఉండి జాగీరు పాలనను చూసేవాడు. మెటుపెల్లి జాగీరు పరిధిలో 5 తాలుకాలు, 118 గ్రామాలుండేవని తెలియుచున్నది. నిజామాబాద్ జిల్లాలోని బిలోలి, కర్ణాటకములోని సిరిసాల, ఖండాల, మహరాష్ట్రలోని బోరిలతో పాటు మెటుపెల్లి పట్టణము తాలూకాలుగా నుండేవి. ఈ విభిన్న ప్రాంతముల పాలనాకేంద్రముగా మెటుపల్లి జాగీరుండేది. మెటుపెల్లిలో జాగీర్దార్ ఫక్రుల్ ముల్క్ అధ్వర్యములో అవ్వల్‌తాలుక్దార్ (Collector), పోలీస్ మొహత్మీమ్ (Superintendent of Police) అధికారులు నియమింపబడేవారు. వీరు జాగీరు క్రిందనున్న పైన పేర్కొనబడిన ఐదు తాలూకాల పాలన మెటుపెల్లి నుండియే చేసేవారు. ప్రజలను పీడిస్తూ కొనసాగిన నిజాం పాలన పంథాలోనే ఈ జాగీరు పాలన గూడా కొనసాగింది. ప్రప్రథమంగా 1912లో మార్కెట్‌లోకి విడుదలైన సైకిల్ పై మెటుపెల్లి జాగీర్దార్ ఫక్రుల్ ముల్క్ స్వారి చేయడం ఆనాటి ప్రజలకు ఒక వింతగా ఉండేది. గాంధీజీ ఆశయాలకు అనుగుణంగా మెటుపెల్లిలో స్థాపించబడిన ఖాదీ ఖార్ఖానా ఈ ప్రాంత ప్రజలలో చైతన్యము కలిగించి స్వాతంత్ర్య స్ఫూర్తి నిచ్చింది.

నిజాం ప్రభువు వద్ద శివరాజ్ బహదూర్ వజీరుగా ఉండేవాడు. కరీంనగర్ జిల్లాలోని బందలింగాపురం, పెద్దపెల్లి అతని సంస్థానములు లేదా జాగీర్లు. శివరాజ్ బహాదూర్‌కు ధరమ్‌కరణ్, ఇంద్రకరణ్ యని ఇరువురు కుమారులు. తండ్రికొడుకులు హైదరాబాద్‌లోనే ఉంటూ తమ సంస్థానములకు వెలమలను కాంట్రాక్టు పద్ధతిపై పాలకులుగా నియమించారు. ఈ పాలన ఏడు తరములుగా కొనసాగినట్లు తెలియుచున్నది. బందలింగాపురం సంస్థానమునకు నిజామాబాద్ ప్రాంతము నుండి పెంపకము వచ్చిన రాజాలింగాల అనంత కిషన్‌రావు చివరి పాలకుడు. యెల్లాపికులమునకు చెందిన జమేదార్ వెంకన్న ఇతని దివాన్. రాయికల్ గ్రామమునకు చెందిన పెగ్గెర్ల రాజన్న ఇతని కొలువులో ఉన్నాడు. రాజా అనంత కిషన్‌రావు భోగలాలసుడు, స్త్రీలోలుడు. బందలింగాపురంలో వాటర్ ట్యాంక్ నిర్మాణము గావించి ప్రజలకు నీటి సరఫరా (Tap System) చేశాడు. జనరేటర్ ద్వారా తన గ్రామము నందు విద్యుద్దీపములను వెలిగించాడు. ఆ రోజులలో నీటి సరఫరా, విద్యుచ్ఛక్తి సరఫరా ప్రజల సౌకర్యమునకై చేయడం అద్భుతమైన అరుదైన ఘట్టములు. వెల్లుల్ల ప్రాంతపు శివారు భూములపై ఆధిపత్యము కొరకు ఇతడు తరచుగా మెటుపెల్లి జాగీర్దారుతో తగాదా పడేవాడు. ఇరు వర్గముల మధ్య అప్పుడప్పుడు బందూకులు (తుపాకులు) లేచేవి. ఇరువురు హైకోర్టు నాశ్రయించగా వెల్లుల్ల శివారు భూములపై తీర్పు మెటుపెల్లి జాగీర్దారుకు అనుకూలముగా వచ్చింది. మెటుపెల్లి పోలీస్ మొహత్మీమ్ వెల్లుల్ల ప్రాంత భూముల ఆక్రమణకై బయలుదేరగా బందలింగాపురం సంస్థానము పక్షాన వందమంది సిపాయిలతో జమేదార్ వెంకన్న బందూకు పట్టుకొని ఎదురు తిరిగాడు. దానితో మెటుపల్లి

పోలీసులు వెనుదిరిగిరని స్థానికులు కథలుగా చెప్పుకుంటారు. అనంతకిషన్‌రావు దారుణమైన మరణమునకు గురి అయినాడు. అతని సేవకుడు మందు సీసాకు బదులు తేజాబ్‌సీసా (Acid Bottle)ను అందివ్వగా అది త్రాగి ప్రాణములు విలవిల కొట్టుకొనుచు వదలెనని స్థానికుల వలన తెలియుచున్నది. బండలింగాపురం సంస్థానము క్రింద ఐలాపురం, రాయికల్ గడులుండేవి. అనంతకిషన్‌రావుకు ఇరువురు కుమారులు. పెద్దకుమారుడు గజసింహారావుకు ఐలాపురంగడి చిన్న కుమారుడు నరసింహారావు వాటా క్రిందికి రాయికల్ గడి వచ్చినాయి. వీరిరువురు బాబులు హైదరాబాద్‌లో ఉంటున్నారు.



బండలింగాపూర్ గడి ప్రవేశద్వారము



భీమారం గడి

జగిత్యాల సమీపమున చలిగంటి (చల్‌గల్) గడికి అధిపతి జువ్వాడి ధర్మజలపతిరావు. ఇతడు బండలింగాపురం ఆడపడుచును వివాహమాడాడు. చల్‌గల్‌లో రెండంతస్తుల అందమైన భవనమును నిర్మించాడు. నేటికి ఈ గడిభవనము చెక్కు చెదరలేదు. ఈ భవనము యొక్క మొదటి అంతస్తు కమాన్‌లు చాలా దూరము వరకు శోభాయమానముగా అగపడుతుంటాయి. ఈ ధర్మజలపతిరావు ఏడవ నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ పరిపాలన రజతోత్సవముల చిహ్నముగా 1937లో జగిత్యాల నడిబొడ్డున ఎత్తైన క్లాక్ టవర్ (Clock Tower) నిర్మించాడు. అదే సమయములో జగిత్యాల వేణుగోపాలస్వామి ఆలయమునకుత్తరమున ఒకగడి భవనమును గూడా నిర్మించాడు. ఇప్పుడది ఆబాదిగా మారినది. ధర్మజలపతిరావు ఇరువురు కుమారులు బాబూ కృష్ణభూపాల్‌రావు మరియు రాంభూపాల్‌రావు హైదరాబాద్‌నకు తరలి వెళ్ళారు. డా.రాంభూపాల్ రావు సిటీలో సత్యాకిడ్నీసెంటర్ ఆసుపత్రి నడిపి చనిపోయాడు. ఇతని భార్య వెంకటగిరి సంస్థానము నుండి వచ్చింది.

మేడిపెల్లి మండలంలోని భీమారం గడిగొప్పది. దీని అధిపతి జువ్వాడి ధర్మచొక్కారావు. పీఠాపురం సంస్థానమునకు చెందిన ఆడపడుచు ఇతని రెండవభార్య. ధర్మపురికి సమీపమున గల రాజారం గడి గూడా ఇతని ఆధిపత్యంలో ఉండేది. జగిత్యాల ప్రభుత్వ ఏరియా ఆసుపత్రికి ఉత్తరమున భీమారం చొక్కారావు గడి ఉండేది. అందులో చాలాకాలము వరకు జగిత్యాల దువ్వంతాలుక్‌దారులు (Deputy Collectors) నివసించేవారు. ఇప్పుడు అతని గడి అంతయు

ఆబాదిగా మారి సంతోష్‌నగర్‌గా ఏర్పడింది. జువ్వాడి చొక్కారావు పెద్ద కుమారుడు రాంకృష్ణారావు వంతుకు భీమారంగడి రాగా, చిన్న కుమారుడు శరత్ చంద్రరావుకు రాజారం గడి వచ్చింది. వీరిరువురు బాబులు హైదరాబాద్‌లోనే స్థిరపడినారు.

కోరుట్ల, యూసుఫ్‌నగర్‌ల వతందారుగా చందామియా కుమారుడు నిజామొద్దీన్ ఉండేవాడు. నిజామొద్దీన్ అలీఘర్ విశ్వవిద్యాలయము నుండి పట్టభద్రుడైనాడు. ఇతని తమ్ముడు మొహిదిన్‌పాషా. వీరు మల్యాలలో గూడా భూస్వాములు. ప్రప్రథమంగా జగిత్యాల ప్రాంతములో నిజామొద్దీన్ ప్రైవేటు బసు సర్వీసులు నడిపాడు. అతడు నడిపించిన బస్‌ల వలన ప్రజల రాకపోకల సౌకర్యములు పెరిగాయి. రోడ్‌ట్రాన్స్‌పోర్ట్ కార్పోరేషన్ బస్సులు ప్రారంభము కావడానికి పూర్వము నిజామొద్దీన్ బసుసర్వీసులే ఆధారము. అంతకు పూర్వము ఎడ్లబండ్లు, సైకిళ్లు, కాలినడకయేగతి. పోలీసుచర్య 1948లో జరుగుమట్టుకు దాదాపు ఇదే పరిస్థితి కొనసాగింది. ఆ రోజులలో కోరుట్ల దొడ్డు కాగతముల తయారి పరిశ్రమకు కేంద్రము. బీడీ పరిశ్రమ గూడా కోరుట్ల యందు దినదినాభివృద్ధి చెందింది. నిజామొద్దీన్ కుమారులు జాఫర్ నిజాం మరియు అన్వర్ నిజాం. పెద్దకుమారుడు జాఫర్‌నిజాం ఉస్మానియా విశ్వవిద్యాలయములో ప్రొఫెసర్‌గా పనిచేసి కాకతీయ విశ్వవిద్యాలయమునకు వైస్‌ఛాన్స్‌లర్‌గా పనిచేశాడు. ప్రస్తుతము హైదరాబాద్‌లో స్థిరపడినారు.

సిరికొండ, పోతారం, కట్కాపురం, తాటిపెల్లి గ్రామాలకు సిరికొండలోని వైశ్య కుటుంబమునకు చెందిన బట్టు లచ్చన్న వతందారుగా ఉండెను. ఇతడు ఈ నాలుగు గ్రామాల పాలనావ్యవహారములు సిరికొండ కేంద్రంగా నిర్వహించాడు. ఈ సిరికొండ కోరుట్ల సమీపపు కథలాపురం మండలంలో ఉంది. బట్టు లచ్చన్న వెలమదొరలవలె తన అధికారాన్ని నడిపాడు. ఇతనికి కోరుట్ల వతందారు నిజామొద్దీన్‌తో తగాదాలుండేవి. బట్టు లచ్చన్న సవారి కచ్చడము లేదా బండిలో (A Small cart drawn by bulls) ప్రయాణించుచుండగా నిజామొద్దీన్ అనుచరులు బందూకుతో కాల్పులు జరుపగా తూటా దూసుకొని పోయి ఇతడు గాయపడినప్పటికిని బ్రతికి బయటపడ్డాడు.

రాయికల్ మండలంలోని ఇటిక్యాల సంస్థానం వెలమల మక్తాగా ఉండేది. ఇటిక్యాల మక్తేదార్ గడి భవనము కట్టించాడు. ఇటిక్యాల సత్యనారాయణరావు తరువాత కాలములో శాసనసభ్యులుగా నుండిరి. ఇటిక్యాల సంస్థానము క్రిందనే రుద్రంగి గడి ఉండేది. వెల్లుల్ల సమీపమున నున్న విట్టంపేట కరణం బ్రాహ్మణుడైన కిషన్‌రావు మక్తాను ప్రభుత్వము గైకొని అతనికి జీవితాంతము భరణమిచ్చింది. రాయికల్ మండలంలో రామాజిపేట వతందారు వేంకటేశ్వరరావు ప్రజలను పీడించాడు. అతడు సవారి కచ్చడములో ప్రయాణించుచుండగా ప్రజలే అతనిని హతమార్చినారు. వేంకటేశ్వరరావు పెద్ద కుమారుడు విజయ రంగారావు మెటుపెల్లి దేశ్‌ముఖ్ వెంకట నర్సింగరావు గడికి పెంపకముగా ఇవ్వబడినాడు. తదనంతర కాలములో ఈ

విజయ రంగారావు శాసన సభ్యునిగా, కరీంనగర్ జిల్లా పరిషత్ చేర్మెన్‌గా గూడా పనిచేశాడు. వెంకటేశ్వరరావు ఇతర కుమారులలో యశ్వంతరావు కోరుట్ల గడికి పెంపకముపోగా రాజగోపాల్‌రావుకు గుండంపెల్లి, విద్యాసాగర్‌రావుకు రామాజిపేట వతన్‌లు మిగిలాయి.

ధర్మపురి సమీపమున గల నేరెల్ల గడికి గోవిందరావు అధిపతిగా నుండేవాడు. తదనంతర కాలములో అతని కుమారుడు యస్.జనార్ధన్‌రావు జగిత్యాల సమితి అధ్యక్షునిగా పనిచేశాడు. బుగ్గారంకు సమీపమున నున్న మద్దునూరు వతందారు జువ్వాడి రాజేశ్వరరావు తీవ్రవాదుల భయానికి హైదరాబాద్‌లో స్థిరపడినాడు. మేడిపెల్లి సమీపమున నున్న గోవిందారం గడి రాజేశ్వరరావు ఆధిపత్యములో ఉండేది. అతని కుమారుడు రాజగోపాల్‌రావు జగిత్యాలలో స్థిరపడినాడు. పుణ్యక్షేత్రమైన ధర్మపురి మరియు పొలాస గ్రామములు బ్రాహ్మణుల అగ్రహారములుగా ఉండేవి.

జగిత్యాల ప్రాంతమున 60 గ్రామాలకు కరణం బ్రాహ్మణుడైన చాకుంట కిషన్‌రావు దేశ్‌పాండేగా ఉండేవాడు. దేశ్‌పాండేలకు, దేశాయిలకు పన్నులు వసూలు చేయు బాధ్యతలుండేవి. దేశ్‌ముఖ్, సర్దేశ్‌ముఖ్‌లకు మాలి, కోత్వాల్ పాలనా బాధ్యతలుండేవి. చాకుంట కిషన్‌రావు దేవిడి (కచేరి) జగిత్యాల బ్రాహ్మణవాడకు సమీపమున నుండేది. ఇతని వద్ద పాంపట్టి బుచ్చిరాజం వైశ్యుడు తహసీల్దార్‌గా నుండేవాడు. ప్రప్రథమంగా జగిత్యాల ప్రాంతానికి చాకుంట కిషన్‌రావు దేశాయి కొని తెచ్చిన టూరింగ్ (Car)ను చూచుటకై ప్రజలు ఆసక్తితో వచ్చేవారు. ఆ కాలములో చిన్నకారును టూరింగ్ అనేవారు. ఇతనికి కోరుట్ల నిజాముద్దీన్ వతందారుకు ప్రచ్ఛన్న వైరములుండేవి. చాకుంట కిషన్‌రావు మద్యమునకు బానిసయని ఎటిగిన విరోధులు ఆయనకు మద్యములో విషప్రయోగము చేసి తుదముట్టించారని తెలుస్తుంది. చాకుంట కిషన్‌రావుకు ముగ్గురు సోదరీమణులు. ఒకరు మానకొండూరు దేశాయి సదాశివరావు తల్లి, మరియొకరు జగిత్యాల విష్ణుదాసుగోపాల్‌రావు భార్య. విష్ణుదాస్ గోపాల్‌రావు జగిత్యాల సమీపమున గల తిప్పన్నపేట, గోపాల్‌రావుపేటల భూస్వామి. ఇంకొకరు చాకుంట గంగాధర్ తల్లి. చాకుంట కిషన్‌రావు కీర్తి ప్రతిష్ఠలు నలుదిశల వ్యాపించాయి.

ధర్మపురి మండలంలోని బుగ్గారం కరణం బ్రాహ్మణుడైన నమిలెశంకర్రావు 40 గ్రామాలకు దేశాయిగా ఉండేవాడు. ఇతని ఆస్తి గూడా చాకుంట కిషన్ రావునకే సంక్రమించింది.

పెద్దపెల్లి ఆరవ నిజాం వజీరైన రాజా శివరాజ్ బహాదూర్ జాగీరుగా ఉండేది. బండలింగాపురం వలె దీనిని గూడా వెలమలకు కాంట్రాక్టు పద్ధతిపై ఇచ్చేశాడు. నస్పూర్ ముత్యంరావు పెద్దపెల్లిలో గొప్ప భూస్వామి. మంథని ప్రాంతపు తాడిచెర్ల గడి గూడా వెలమదొరల ఆధీనంలో ఉండేది. వేములవాడ, సిరిసిల్ల దేశ్‌ముఖ్‌ల పాలనలో ఉండేవి. సిరిసిల్ల ప్రాంతములోని నేరెల్ల గడి సర్దెన గోపాల్‌రావు, గజ సింగారం గడి కోరుకంటి రాజేశ్వరరావు, నిమ్మపెల్లి గడి నేటి భాస్కరరావు పూర్వీకుల అధీనములో ఉండేది.

1903లో మెటుపెల్లి ప్రాంతమును కలుపుకొని పాత జగిత్యాల తాలుకాలో 221 గ్రామములుండెనని, ఇవి గాక ఇంకను మదిరెలుండెనని జైశెట్టి రాజయ్య (1842-1921) తన కవితలలో పేర్కొన్నాడు[192]. యెల్లాపికులమునకు చెందిన గందె వారికి చిలువాకోదూరు, ఇసరాజపల్లె, వెంగళాపురం, గుల్లకోట నాలుగు జాగీర్లు జగిత్యాల తాలుకాలోను, ఇతర తాలుకాలలో పైడిపెల్లి, ముంజంపెల్లి యని మరి రెండు జాగీర్లుండెనని జైశెట్టి రాజయ్య 1903లో తెలిపినాడు. గందె వంశమునకు చెందిన వెంగళాపురం ధర్మారావు జగిత్యాలలో స్థిరపడినాడు.

పూర్వము పల్లెల్లో కచేరీలుగా, న్యాయస్థానాలుగా వెలుగొందిన గడులు నేడు శిథిలావస్థలో ఉన్నాయి. ఎందరో అమాయక ప్రజల కష్టంతో నిర్మించిన గడులు నేడు నిర్మానుష్యమై, కళావిహీనమై వెలవెల బోతున్నాయి. బండలింగాపురం, ఐలాపురం, రాయికల్, ఇటిక్యాల, రుద్రంగి, చల్‌గల్, భీమారం, రాజారం, నేరెల్ల, వేములవాడ, సిరిసిల్ల, ఇల్లంతకుంట, రాచర్ల బొప్పాపురం, నిమ్మపెల్లి, పెద్దపెల్లి, తాడిచెర్ల, నేరెళ్ల, గజసింగారం మున్నగు ప్రాంతములలోని గడులన్నియు నాటి నిరంకుశ పాలనకు నిదర్శనాలుగా నిలిచిఉన్నాయి.

## నిజాం కాలములో భూస్వాముల ప్రజాపీడన

నిజాం నిరంకుశపాలనలో సంస్థానాలు, జాగీర్దారులు, మక్తేదారులు, ఇనాందారులు, వతందారులు, దేశ్‌ముఖ్‌లు, దేశాయిలు, అగ్రహారీకులు అను పేర్లతో భూస్వాములు (Feudal Lords) పెత్తందారులు ప్రజలను దోచుకొని పీల్చి పిప్పి చేశారు. ఈ దోపిడి దారులంతా నిజాం సర్కారుకు తాబేదార్లుగా, తొత్తులుగా వ్యవహరించారు. పన్నులు వసూలు చేసే దేశ్‌ముఖ్‌లు, దేశ్‌పాండేలు, వతందారులు, జాగీర్దారులు, దొరలు సృష్టించిన అరాచకాలు హృదయ విదారకరమైనవి. దేశ్‌ముఖ్‌ల దౌర్జన్యానికి గురైన రైతులు కౌలుదారులుగా మారారు. సాగులో ఉన్న అతి సారవంతమైన వేలాది, వందలాది ఎకరాల భూములను కబళించి భూస్వాములు తమ స్వంత ఆస్తులుగా మార్చుకున్నారు. అప్పులు తీర్చలేని రైతుల భూములు లాక్కునేవారు. పన్నులు చెల్లించలేని రైతులను తీవ్రంగా హింసించేవారు. వంశ పారంపర్య హక్కులతో గ్రామాధికారులుగా మారిన మాలిపటేల్, పట్వారీలు చదువురాని ప్రజలను నానారకాల అవస్థలపాలు జేసినారు. ఆనాటి ప్రజలు పడిన వేదనలు, పీడనలు వర్ణనాతీతం.

దొరలు అన్నివర్గాల ప్రజలను తమకు సేవలు చేసే బానిసలుగా భావించేవారు. పల్లకీలు, మేనాలు మోయటం, దొరలు ప్రయాణించే ఎడ్లబండ్ల ముందు వెనకాల చాకలి మంగలులు పరుగెత్తటం సర్వ సాధారణ విషయం. కుమ్మరి, కమ్మరి, వడ్రంగి మున్నగువారు ఉచితంగా పనులు చేయటం సాధారణ విధులుగా మారినాయి. అన్ని గ్రామాలలో అన్ని కులాల వారికి వెట్టి చాకిరి తప్పలేదు. దోపిడి, వెట్టిచాకిరి, బానిసవిధానం సర్వత్రావ్యాపించింది. దొరగారి భూములలో విత్తనాలు నాటిన తరువాత గాని రైతులు తమ భూములలో నాటుకొనుటకు

వీలులేని దైన్యస్థితి ఉండేది. వ్యవసాయ కార్మికులు, మహిళా కూలీలు నాట్లు, కలుపులు, కోతలు వంటి వ్యవసాయ పనులన్నీ ఉచితంగా చేసేవారు. స్త్రీలు, వృద్ధులు, బాలలకు గూడా మినహాయింపులేదు. పచ్చి బాలెంతలైనా వెట్టి చాకిరికి వెళ్లేవారు. కొన్ని చోట్ల ఏడ్చుచున్న శిశువులకు గూడా తల్లులు పాలివ్వకుండా పని చేయించుచూ భూస్వాములు అతి క్రూరంగా ప్రవర్తించేవారు. దొరల ఇళ్లు ఊడ్వటము, అలుకుచల్లడము, బోళ్లు శుభ్రపరచడం, బట్టలు ఉతకటం, పిండి విసరటము, వడ్లు దంచడము, పాలుపితకటం, అడవిలో గడ్డికోసి మోపులుగా కట్టి తేవడం, కాళ్లు వత్తడం, స్నానాలు చేయించడం ఒక్కటేమిటి అన్నిపనులు అమాయక పేద ప్రజలే కిక్కురు మనకుండా కుక్కిన పేనులవలె చచ్చినట్లు చేసేవారు. వారి పట్ల ఏ మాత్రం జాలి, కరుణ, కనికరం చూపేవారు కాదు. గడుల ముందు ఎవరైనా దొరలు కూర్చొని ఉంటే అటువైపు వెళ్లే ప్రజలు చెప్పులు చేతపట్టుకొని "నీ బాంచెన్ దొర" అని దండం పెడుతూ పొయ్యేవారు. దొరలకు "నీ బానిసన్ దొర"యని పలుకు పదములే క్రమేపి "నీ బాంచెన్‌దొర" గా మారినాయి. తెలంగాణా సాయుధ పోరాట సమయము (1946-1951) లో కమ్యూనిస్టుల భయానికి దొరలందరు తమ గడులను వదలిపెట్టి పట్టణాలకు పారి పోయినారు. వారి స్థానములో ఆముక్త్యారాంయను గుమాస్తాలను నియమించినారు. ఈ గుమాస్తాల పాలన గూడా ప్రజలపై తీవ్ర ప్రభావము చూపింది. కొందరు గుమాస్తాలు అసలు దొరలకంటే అధికంగా అధికారము చెలాయించి సామాన్య ప్రజలను దోచుకొన్నారు. రాయికల్ గడి గుమాస్తా లక్ష్మారెడ్డి ముందు ఎవరు చెప్పులు వేసికొని నడిచేవారు కాదట. అట్లు చేయని వారిని కొరడాతో కొట్టి చిత్రహింసలు పెట్టేవారట. ఇలాంటి దోపిడి దౌర్జన్యాలకు గురైన బాధితుల నుండే దొరలకు వ్యతిరేకంగా, నిజాం నిరంకుశపాలనకు వ్యతిరేకంగా తెలంగాణ సాయుధ పోరాటము ఆవిర్భవించింది.

ప్రజల పీడన అంతయు 20వ శతాబ్దపు ప్రథమార్ధములో జరిగింది. కాని గత రెండు మూడు దశాబ్దముల నుండి పరిస్థితులు పూర్తిగా తారుమారైనాయి. ఏ పని చేయుటకు అలవాటు పడని చాలా మంది దొరలు పనిపాటాలేకుండా దీనావస్థలో జీవించుచున్నారనుటలో అతిశయోక్తి లేదు.

## తెలంగాణా సాయుధ పోరాటము (Armed Struggle in Telangana) (1946-1951)

తెలంగాణాలో 1946 అక్టోబర్‌లో రైతాంగ సాయుధ పోరాటము ఆరంభమైంది. నిజాం నిరంకుశపాలనకు వ్యతిరేకంగా సాగిన తెలంగాణా సాయుధ పోరాటమునకు ఆంధ్ర మహాసభ బీజం వేసింది. నిజాం పాలనను, రజాకార్ల దురాగతాలను ఎదుర్కోవడము ప్రధాన లక్ష్యమైనను, వారి సత్వర శత్రువులు మాత్రము పల్లెలలోని భూస్వాములే. భూస్వాముల అరాచకాలు రైతాంగ ఉద్యమానికి ఆజ్యము పోసినవి[193]. 1948లో పోలీసు చర్య జరిగిన తరువాత గూడా మూడు సంవత్సరాలు రైతాంగవిముక్తికై సాయుధ పోరాటము కొనసాగడము ఈ విషయమును ధృవపరచుచున్నది. తెలంగాణలో "బగేల" పద్ధతి కొనసాగింది. పేదవారికి, తక్కువ కులాల

వారికి భూస్వాములు వడ్డీపై అప్పులిచ్చేవారు. అప్పు తీరే మట్టుకు ఆ వ్యక్తి, అతని భార్య భూస్వామి పొలాలలో పని చేయవలె. వారికిచ్చే కూలి వడ్డీ క్రింద పోయేది. వడ్డీ కన్న కూలి తక్కువ. జీవితాంతము కాయకష్టము చేసినను వడ్డీ గూడా తీరకుండెను. అప్పుతీరే ప్రసక్తే లేదు. వారి సంతానం ఇదే పద్ధతిలో "బగేలా"గా మారుతుంది[194]. అదే రీతిగా పేదరైతాంగముతో వెట్టి చాకిరి చేయించేవారు. ఈ పేదల బానిసబ్రతుకులు నికృష్టమైనవి. హీనాతిహీనమైనవి. అందులకే అనేక మంది యువకులు అజ్ఞాతములోకి వెళ్ళి ఆయుధాలను చేతబూని భూస్వాములపై, వారి గుమాస్తాలపై ప్రతీకారము తీర్చుకొన్నారు.

కరీంనగర్ జిల్లాలోని సిరిసిల్ల తాలుకాలో గల గాలిపల్లి గ్రామము సాయుధపోరాటానికి స్ఫూర్తి నిచ్చింది. బద్దం ఎల్లారెడ్డి, బద్దం మల్లారెడ్డి, బద్దం బలరాంరెడ్డి వంటి ఎందరో వీరపుత్రులను గన్న జన్మభూమి గాలిపెల్లి. 1947 సెప్టెంబర్‌లో గాలిపెల్లి ప్రజలు నిజాం పోలీసులను ఎదురించి వారిని ఊరి పొలిమేరలకు తరిమినారు. తదనంతరము అదనపు బలగాలతో వచ్చిన పోలీసులు గాలిపల్లి పై తూటాల వర్షము కురిపించగా అనేకులు ప్రాణాలు గోల్పోయిరి. బుల్లెట్ తగిలి బ్రతికి బయటపడిన వారిలో సింగిరెడ్డి, అంజిరెడ్డిలున్నారు. 300 మంది పోలీసుల శిబిరము గాలిపల్లిలో విడిది చేసింది. వారు రైతాంగమును ముప్పుతిప్పలు పెట్టినారు. గాలిపల్లికి చెందిన బద్దం ఎల్లారెడ్డి తదనంతరకాలములో పి.వి. నరసింహారావును ఓడించి 1952 సాధారణ ఎన్నికలలో పార్లమెంట్ సభ్యునిగా మరియు బద్దం మల్లారెడ్డి జగిత్యాల నియోజకవర్గ శాసనసభ్యునిగా ఎన్నికైనారు.

కరీంనగర్ జిల్లాలోని తిమ్మాపురం మండలమందు గల పోలంపల్లి గ్రామములో 1910 ఆగస్టు 15న యెల్లాపు పెద్దింటి బిడ్డగా పుట్టి నిజాం ప్రభుత్వముపై రణభేరి మ్రోగించిన అనభేరి ప్రభాకర్‌రావు తెలంగాణా వీరుడు. నిజాం కాలేజిలో చదువుచూ గాంధీజీ ఆశయాలకు ఉత్తేజితుడై ఉద్యమంలోనికి దిగినాడు. 1947 సెప్టెంబర్ 13న బద్దం ఎల్లారెడ్డి తదితర నాయకులు సాయుధ పోరాటమునకై పిలుపు నిచ్చారు. కరీంనగర్ జిల్లాలో అనభేరి ప్రభాకర్‌రావు నాయకత్వంలో తొలిదళం ఏర్పడింది. వీరు 1948 జనవరి, ఫిబ్రవరిలలో 40 గ్రామాల పటేల్, పట్వారీల దస్తరాలను (Records) దహనం చేసినారు. 1948 మార్చిలో హుస్నాబాద్‌కు సమీపమున గల మాందాపురం గుట్టలలో పోలీసులతో, రజాకార్లతోను వీరోచితంగా దళసభ్యులు పోరాడి ఎదురు కాల్పులు జరిపినారు. అనభేరి ప్రభాకర్‌రావు, సింగిరెడ్డి భూపతిరెడ్డితో పాటు ఎనిమిది మంది వీరమరణము పొందినారు[195]. నిజాం పాలనను, రజాకార్లను ధైర్యంగా ఎదురించి కరీంనగర్ జిల్లాలో చైతన్యము తెచ్చిన అనభేరి ప్రభాకర్‌రావు చిరస్మరణీయుడు.

పేదప్రజలు ఈ ఉద్యమమును బలపరచినారు. భూస్వాముల పీడన వలన వారికి తిండి గింజలే లభ్యమగుట కష్టముగా ఉండేది. మక్కలను రవ్వ రూపంలో విసరుకొని (Maize Crushed into small pieces) గట్కా వండేవారు. దానికి తోడుగా కారం కలుపుకునేవారు. ఈ

మక్క గట్కాయే రెండు పూటలు దొరికితే మహాభాగ్యంగా ఉండేది. చుట్టం వస్తేగాని, పండుగ రోజులలో గాని అన్నం వండుకునే అవకాశం లభించేది. కడు బీదలు జొన్న అంబలి త్రాగేవారు. ఒక్క జొన్నరొట్టెకై రోజంతా పనిచేసిన ఉదంతాలున్నాయి. దాదాపు రెండు దశాబ్దముల క్రింది వరకు గట్కా తిన్నకుటుంబాలున్నాయి. ఈ దైన్యస్థితి భూస్వాముల వ్యతిరేక పోరాటానికి చేయూత నిచ్చింది.

తెలంగాణా సాయుధ పోరాటంలో కీలకపాత్ర పోషించిన వేరొక నాయకుడు అమృత్‌లాల్ శుక్లా. ఇతడు సిరిసిల్ల ప్రాంతమునకు చెందినవాడు. ఉపాధ్యాయునిగా తొలుత పనిచేసినాడు. పెన్‌ను వదలి గన్‌ను చేత బూని సాయుధ పోరాటము సాగించాడు. యువకులైన గన్నేరువరం దామోదర్‌రావు, గట్టపెల్లి మురళి లేదా మురహర్‌రావు. ఠాకూర్ శ్యాంసుందర్‌సింగ్ మున్నగు వారు కరీంనగర్ జిల్లాలో తీవ్ర సంచలనము సృష్టించారు. కమ్యూనిస్టులు పట్టపగలే గడులపై దాడులు జరిపి ప్రజానీకమును పీడించిన దొరలను గుమాస్తాలను గూడా కాల్చిచంపారు. 1949–1950 మధ్యకాలములో చందుర్తి మండలంలోని రుద్రంగి పై సాయుధ కమ్యూనిస్టులు దాడి చేసి గడిని ధ్వంసం చేశారు. పటేల్ పట్వారీల దస్త్రాలను ఫైళ్లను, రిజిస్టర్లను బజార్లో వేసి నిప్పంటించినారు. ప్రజలను పీడిస్తూ రాజభోగాలు అనుభవించిన జమీందారులు, దేశ్‌ముఖ్‌లు, భూస్వాములు మరియు వారి గుమాస్తాలు సాగించిన నిరంకుశ పాలనకు కమ్యూనిస్టుల రాకతో కాలం చెల్లిపోయింది.

ఠాకూర్ శ్యాంసుందర్ సింగ్ జగిత్యాల, కరీంనగర్ ఉన్నత పాఠశాలలో చదివినాడు. 1946లో అతడు విద్యార్థులకు నాయకత్వము వహించగా పాఠశాల నుండి బహిష్కరింపబడినాడు. కమ్యూనిస్టు ఉద్యమములో పాల్గొని గట్టపెల్లి మురహర్‌రావుతో కలిసి పోరాటము సాగించినాడు. శ్యాంసుందర్‌సింగ్ పెద్దపెల్లిలో ప్రస్తుతము న్యాయవాదిగా నున్న ఠాకూర్ రాజారాంసింగ్ యొక్క సోదరుడు. గట్టపెల్లి మురహర్‌రావు, శ్యాంసుందర్‌సింగ్, గన్నేరువరం దామోదర్‌రావులను నిజాం పోలీసులు తరుముతూ వెంబడించగా వారు నంది మేడారం చెరువులో దూకి కమలపు మొక్కకాడలకు (Sticks of Lotus buds) రంధ్రములు చేసి నోట్లో పెట్టుకొని గాలిని పీలిస్తూ నీటియందే మునిగి ఈదుకుంటూ పోలీసుల కన్నులు కప్పి బ్రతికి బయట పడ్డారని తెలియుచున్నది. 1951 అక్టోబర్‌లో అధికారికంగా కమ్యూనిస్టుల పోరాటము విరమింపబడినది. 1952 సాధారణ ఎన్నికల యందు వారు పాల్గొన్నారు.

## సామాజిక చైతన్యము

సిరిసిల్లలో 1935లో జరిగిన ఆంధ్ర మహాసభ వలన కరీంనగరము జిల్లాలో సామాజిక చైతన్యము పెరిగింది. తాలుకా కేంద్రాలలో ఆంధ్రమహాసభ శాఖ లేర్పడి ప్రజలను విజ్ఞానవంతులను చేయుటకై గ్రంథాలయముల స్థాపనగావించి, సాంఘిక దురాచారములను మాన్పుటకై అమితంగా

కృషి సలిపినవి. జగిత్యాలలో 1935లోనే ఆంధ్రమహాసభ శాఖను కాసం శివరాజగుప్త, జైశెట్టి లక్ష్మిరాజం గుప్త, సిద్ధంశెట్టి వీరసంగయ్య మున్నగు వారు ఏర్పరచి సంఘ సంస్కరణలకై శ్రీకారము చుట్టారు. బాల్యవివాహములను నిరుత్సాహపరచి వితంతు వివాహములను ప్రోత్సహించారు.

వరంగల్‌లోని చందాకాంతయ్య సేటు దానశీలి, ఉదార స్వభావము గల సౌజన్యమూర్తి. అతని పేరట స్థాపించబడిన కళాశాల నేటికిని వరంగల్‌లో నడుచుచున్నది. 1945లో చందాకాంతయ్య మరియు ప్రొద్దుటూరి వీరేశం గారలు జగిత్యాలలో సిద్ధంశెట్టి వీరసంగయ్య గృహము నందు సమాజములో మార్పులు తెచ్చుటకై జరిగిన సభలో పాల్గొన్నారు. 300 సభ్యులు పాల్గొనిన ఈ సభలో రాయంచ లక్ష్మికాంతం సార్, మందిరం చంద్రమౌళిశాస్త్రి, జగన్నాథాచార్యులు ఉపన్యసించినట్లు తెలియుచున్నది.[196] వారు బాలికలకు 14 సంవత్సరములు బాలునికి 18 సంవత్సరములు కనీస వయస్సు వివాహమునకై ఉండవలెనని తీర్మానించారు. 1943లో కాసం శివరాజగుప్త అనేక పల్లెలలో తిరిగి వితంతువులు మరల వివాహము చేసికొనవలెనని ప్రబోధించారు. మెటుపెల్లిలో అతడు కొంతకాలము ఉపాధ్యాయునిగా పనిచేశాడు. ఒక పరియాయము ఒక వితంతువుకు కాళ్లు కడిగి కన్యాదానము చేయుటకు ఎవరు ముందుకు రాకపోగా తానే ధైర్యంగా ముందుకు వచ్చి వితంతువు కాళ్లు కడిగి కన్యాదానము చేసిన ధీరుడు ధీమంతుడు కాసం శివరాజగుప్త. స్త్రీ విద్యావ్యాప్తికై అతడు ఆంధ్రప్రాంతము నుండి నాగమణి యను పంతులమ్మను తీసికొని వచ్చి ఆంధ్ర బాలికా పాఠశాలను జగిత్యాలలో స్థాపించాడు. జగిత్యాల ప్రాంతమునకు ప్రప్రథమ న్యూస్ ఏజెంట్‌గా నుండి అనేక వార్తా పత్రికలను వార పత్రికలను తెప్పించి ప్రజల విజ్ఞానాభివృద్ధికై పాటుపడెను. హిందీ ప్రచార సభ పక్షమున ప్రథమ నుండి విద్వాన్ వరకు పరీక్షల నిర్వహణకై తోడ్పడినాడు. వారికాలములో హిందీ అర్హతాపత్రములతో నియమింపబడిన ఉపాధ్యాయులనేకులు ఇప్పుడు రిటైరగుచున్నారు.

1939లో వరంగల్ జిల్లా యందు ఐదు గ్రంథాలయములుండగా కరీంనగర్ జిల్లాలో కేవలము ఒక గ్రంథాలయముండెను. శివరాజగుప్త జగిత్యాలలో 1944లో ఆంధ్ర గ్రంథాలయ స్థాపనకై తోడ్పడెను. ఈ గ్రంథాలయ స్థాపనలో అర్వపెల్లి లచ్చయ్య, కాసం శంకరయ్య మున్నగు వారి కృషి బహుళముగా నుండెనని తెలియుచున్నది. ఇన్ని విధముల సంఘ సంస్కరణలకై తోడ్పడిన కాసం శివరాజగుప్త గారిని "జగిత్యాల కందుకూరి వీరేశలింగం"అని అభివర్ణించుటలో అతిశయోక్తి లేదు.

గాంధీజీ ప్రబోధములను ఆదర్శంగా తీసుకొని జగిత్యాల వైశ్యుడు రాగెల్ల లచ్చయ్య హరిజనోద్ధరణకై పాటుపడ్డాడు. ప్రతి దినము హరిజనవాడకు వెల్లి వారికి వయోజనవిద్య, పారిశుద్ధ్యము మున్నగు రంగములలో సేవలందించుచు అంటరానితనమును రూపు మాపుటకై బహుళముగా కృషి చేసిన రాగెల్ల లచ్చయ్యను "జగిత్యాల గాంధి"గా ప్రజలు పిలిచేవారు. రాఘవపట్నం రామసింహం కవి సాంఘిక దురాచారములను తొలగించుటకై 'బాలవివాహఖండన'

పునర్వివాహమండన' మున్నగు పుస్తకములను రచించి తన పద్యములను మిగుల ప్రాచుర్యములోనికి తెచ్చాడు.

జాతిపిత మహాత్మాగాంధి తెలంగాణములో అడుగిడిన సందర్భములో ఎందరో యువకులు స్ఫూర్తి పొందారు. 1929లో గాంధీజీ ఖమ్మం వచ్చినప్పుడు వేలాది మంది అతన్ని దర్శించుకొన్నారు[197]. జమలాపురం కేశవరావులాంటి యువకులెందరో వారి బోధనలతో ప్రభావితులైనారు. గాంధీజీ మద్రాసు నుండి వార్ధా వెళుతుండగా 1946 మార్చి 5న ఆనాటి యువకులు వరంగల్‌లో కొద్ది సమయము కొఱకు ఆపినారు. యం.యస్.రాజలింగం, చందా కాంతయ్య, టి.హయగ్రీవాచారి, చంద్రమౌళీశ్వర్‌రావు, నాగభూషణ్‌రావు మున్నగు వారు ప్లాట్‌ఫారం ప్రక్కనే బహిరంగ సభనేర్పాటు చేశారు. దాదాపు ఐదు లక్షల మంది హాజరైనారు[198]. సభలో పాల్గొనిన గాంధీజీ ఒక గంట విరామం తీసికునే సమయములో యువకులు రెండు లక్షల రూపాయల విరాళాలు వసూలు చేసి గాంధీజీకి అందించినారు. స్త్రీలు తమపై నున్న బంగారు ఆభరణములను సమర్పించారు. చందా కాంతయ్య కోరగానే అతని భార్య తనపై అలంకరించుకొనిన బంగారమంతయు గాంధీజీకి విరాళంగా సమర్పించెనని ప్రతీతి. కరీంనగర్ జిల్లా నుండి గూడా వేల సంఖ్యలో గాంధీజీ సభలో పాల్గొని స్ఫూర్తి పొందారు.

## సంలీనోద్యమము Join Indian Union Movement (1947-1948)

1947 మే నెలలో హైదరాబాద్ కాంగ్రెస్ సభలు జరిగాయి. ఆనాటి కాంగ్రెస్‌లో స్వామి రామానంద తీర్థ, బూర్గుల రామకృష్ణారావుల నాయకత్వంలో రెండు వర్గములేర్పడినాయి. ఈ సభలో రామానంద తీర్థ అధ్యక్షులుగా ఎన్నికైనారు. ఆయన 1947 ఆగస్టు 7న హైదరాబాద్ రాష్ట్రము భారత యూనియన్‌లో చేరవలె (Join Indian Union Movement) అనే ఉద్యమముతో సత్యాగ్రహాన్ని ఆరంభింపవలసినదిగా పిలుపు నిచ్చాడు. రాష్ట్రమంతట కార్యకర్తలు ఊరేగింపులు చేశారు. నిజాంకు వ్యతిరేకంగా సరిహద్దు శిబిరాలు నిర్వహింపబడినాయి. విజయవాడ క్యాంపుకు టి.హయగ్రీవాచారి, పరిటాలకు కోదాటి నారాయణరావు ఉద్యమ నిర్వహణ బాధ్యత వహించినారు. చాందాను తమ ముఖ్యస్థావరంగా చేసికొని కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాల్లో అజ్ఞాత యోధులు సాగించే పోరాటాన్ని నడిపే బాధ్యతను పి.వి. నరసింహారావు, కె.వి.నర్సింగరావులు వహించినారు.

భీందేవరపల్లి మండలంలోని వంగర గ్రామములో 1921లో కరణం బ్రాహ్మణుల కుటుంబములో రంగారావు రుక్మిణీ దంపతులకు పాములపర్తి వెంకట నరసింహారావు జన్మించారు. వంగరలోను, కరీంనగర్ ఉన్నత పాఠశాలలోను అతని విద్యాభ్యాసం జరిగింది. వరంగల్‌లో పాత ఇంటర్మీడియెట్ (Old Inter Course of two years, after which the Degree Course was of only two years in O.U.) చదువుచుండగా వందేమాతరం ఉద్యమంలో పాలు పంచుకున్నారు. నిజాం నిరంకుశాన్ని ఎదురించటంతో హైదరాబాద్ ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి

పి.వి. బహిష్కరింపబడినాడు. మహారాష్ట్రలోని చంద్రాపూర్ క్యాంపు పెట్టి నాగపూర్ కేంద్రంగా నిజాంకు వ్యతిరేకంగా పోరాడినాడు. 1947లోనే కాంగ్రెస్‌లో చేరి అంచెలంచెలుగా ఎదిగి చివరకు ప్రధానమంత్రిగా ఐదేళ్లపాటు 1991-1996 వరకు ప్రభుత్వమును నడిపిన ఘనత కరీంనగర్ జిల్లా ముద్దుబిడ్డయైన పి.వి.కే దక్కింది. ఇతని కుమారులే పి.వి. రంగారావు, పి.వి.రాజేశ్వరరావులు.

రామడుగు కరణం బ్రాహ్మణుల కుటుంబములో జన్మించిన కల్వకోట వెంకటనర్సింగరావు (కె.వి) స్వయాన పి.వి.కి వియ్యంకుడు. పి.వి. కూతురు సరస్వతి వివాహము కె.వి. పెద్దకుమారుడైన డా. శరత్‌తో జరిగింది. అలాగే హుస్నాబాద్ లక్ష్మీకాంతరావు గూడా పి.వి.కి వియ్యంకుడే. లక్ష్మీకాంతరావు కూతురు వివాహము పి.వి.కుమారుడైన రాజేశ్వర్‌రావుతో జరిగింది. వియ్యంకులు ముగ్గురు నిజాంకు వ్యతిరేకంగా పోరాడిన ధీరులే. కరీంనగర్ జిల్లాలో ఇరువురు మేధావులైన పి.వి. మరియు కె.వి. నిజాంకు వ్యతిరేకంగా జరిపిన పోరాటము చిరస్మరణీయం. కె.వి.నర్సింగరావు సరిహద్దులోని బెజవాడ జోనల్ కార్యాలయం సూచనలననుసరించి 300 మంది కార్యకర్తలతో చాందా సరిహద్దుక్యాంపు నడుపుతూ విజయవంతంగా హైదరాబాద్ విమోచన పోరాటం సాగించాడు. 1947లో బల్హార్షా ఉపశిబిరమును కె.వి. కేశవులు నడిపారు.

కరీంనగర్ జిల్లాలోని మంథని నివాసి రఘునాథరావు కాచే సత్యాగ్రహము చేసిన వారిలో ప్రథముడు. కరీంనగర్ జిల్లాలోని జువ్వాడి వంశస్థులు నిజాం వ్యతిరేకపోరాటములో చురుకుగా పాల్గొన్నారు. ఇరుకుల్ల గ్రామమునకు చెందిన జువ్వాడి గౌతమరావు, జువ్వాడి రామేశ్వరరావు, జువ్వాడి హనుమంతరావు, జువ్వాడి మురళీధర్‌రావు ఈ ఉద్యమంలో పాల్గొన్నారు. గౌతమరావు 1929లో ఇరుకుల్ల పద్మనాయక కుటుంబములో జన్మించాడు. విద్యార్థి దశ నుండియే నిజాం వ్యతిరేక పోరాటంలో పాల్గొని నిజాం ప్రభుత్వముచే నిర్బంధింపబడినాడు. 1947 అక్టోబర్‌లో ఔరంగాబాద్ జైలులో బందీగా ఉన్నాడు. 1947 డిసెంబర్‌లో ఔరంగాబాద్ జైలు నుండి తప్పించుకొని, అజ్ఞాతవాసంలో నున్న తన సాటి వారితో కలిసి పోరాటం మరల సాగించాడు. గౌతమరావు ఎంతటి స్వాతంత్ర్య సమరయోధుడో అంతటి సాహితీపిపాసి. 1946 నుండియే కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ సాహిత్యముతో ఆకర్షితుడైనాడు. 1953లో వారితో పరిచయమేర్పడింది. కవిసామ్రాట్ కరీంనగర్ ప్రభుత్వ యస్.ఆర్.ఆర్. డిగ్రీ కళాశాలకు ప్రిన్సిపాల్‌గా నున్న రోజుల్లో సాన్నిహిత్యమేర్పడింది. విశ్వనాథగారు చెబుతూ పోతుంటే వారి సరసన కూర్చొని దాదాపు 20 మాసాలలో 10 నవలలు లిఖించిన మహద్భాగ్యము గౌతమరావు గారికి దక్కింది. మోయు తుమ్మెద, ఏకవీర, సముద్రపు దిబ్బ మున్నగు నవలలు అప్పుడు వెలువడినవే. విశ్వనాథగారి రామాయణ కల్పవృక్షాన్ని శ్రావ్యంగా గానము చేయగలిగిన ఖ్యాతి కేవలం గౌతమరావునకే దక్కినదనుటలో అతిశయోక్తి లేదు.

మంథనిలో గణపతిరావు, సిరిసిల్ల ప్రాంతములో అమృతలాల్, జె.ఆర్.గోపాల్‌రావు,

చెన్నమనేని రాజేశ్వర్‌రావు, మురళీధర్‌రావు, హనుమంతరావు, గాలిపల్లి బద్దం ఎల్లారెడ్డి, పరకాల నివాసి కేశవరెడ్డి మున్నగువారు నిజాం వ్యతిరేకపోరాటములో చురుకుగా పాల్గొన్నారు. ఇరుకుల్ల జువ్వాడి చొక్కారావు మరియు కరీంనగర్‌లోని జువ్వాడి రమాపతిరావు, అతని అన్నకుమారుడు జువ్వాడి మధుసూదనరావు, ముల్కనూరు నుండి కిషన్‌రెడ్డి జగిత్యాల ప్రాంతములో దాసరి రాఘవులు, వెల్గొండ కె.సంజీవరావు, యస్వంతరావుపేట వేంకటేశ్వరరావు, వెలకటూరు లింగాల సత్యనారాయణరావు, చిలువాకోడూరు గండె జగన్మాధవరావు, జోగినపెల్లి నారాయణరెడ్డి మున్నగు వారు రజాకార్లకు వ్యతిరేకపోరాటము సాగించారు. తరువాత కాలములో జువ్వాడి రమాపతిరావు, జువ్వాడి చొక్కారావులు పార్లమెంటు సభ్యులుగా కరీంనగర్ నుండి ఎన్నికైనారు.

కరీంనగరము జిల్లా వాసి యైన గొప్పకవి, రచయిత దాశరథి కృష్ణమాచార్యులు తమ రచనలతో, పాటలతో, పద్యాలతో ఉద్యమకారులను ఉత్తేజపరిచేవారు. "మా నిజాం రాజు జన్మ జన్మాల బూజు" అని దాశరథి ఉద్వేగంతో పలికాడు. ఆరోజులలో నిజాం అధికారులను, రజాకార్లను, పోలీసులను సర్కిల్ ఇన్‌స్పెక్టర్లను, అమీన్‌లను చూడగానే రెచ్చిపోయి పాడిన పాటలలోని రెండు పంక్తులు నేటికి ఈ ప్రాంత ప్రజలస్మృతి పథంలో స్థిరముగా నిలిచి పోయినవి. ఆ పంక్తులు ఈ క్రింద పేర్కొనబడినవి.

**"బండెనుక బండి కట్టి, పదహారు బండ్లు కట్టి**
**ఏ బండిలున్నవురో, నిజాం సర్కిలోడా"**

హుజురాబాద్‌కు చెందిన ధ్రువసింగ్, సీతారామానాయుడు ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నారు. ధ్రువసింగ్ క్విట్ ఇండియా ఉద్యమములో పాల్గొని జైలు పాలైనాడు. 1946లో తాలుకా కాంగ్రెస్ స్థాపించి తరువాత అజ్ఞాతంలోకి పోయి పోరాటం సాగించాడు. కరీంనగర్ వకీలు ముకుందులాల్ మిశ్రా, బోయినపెల్లి వెంకటరామారావు మున్నగువారు అరెస్టు అయినవారిలో నున్నారు. తోటపెల్లి గ్రామమునకు చెందిన బోయినపెల్లి వెంకటరామారావు హైదరాబాద్ రాష్ట్రము ఇండియన్ యూనియన్‌లో సంలీనము కావాలని గర్జించి అరెస్టయినారు. సర్వోదయ, భూదానోద్యమ, గ్రంథాలయోద్యమములకు అంకితమైనారు. బెజ్జంకి గ్రామములో నిజాం అధికారులు పోలీసుల సహాయముతో బలవంతంగా లేవీ గల్లాధాన్యము వసూలు చేసినారు. వెంకటరామారావు దీనిని నిరసించుచు బెజ్జంకిలో ఏర్పాటుచేసిన బహిరంగసభలో టి.హయగ్రీవాచారి, బూర్గుల రామకృష్ణారావు ప్రభృతులు ప్రసంగించినారు. కరీంనగర్ జిల్లా వాసులు వీరిని తోటపల్లి గాంధియని నేటికిని పిలుచుచున్నారు.

మెటుపెల్లిలో రాజకీయ చైతన్యస్ఫూర్తి నిచ్చిన వ్యక్తులు మెటుపెల్లి ఖాదీ కార్ఖానాలో నుండిన బోగపాపయ్య పంతులు మరియు బట్టు లక్ష్మీనారాయణ రాజు. 1947లో మెటుపెల్లి గ్రామము నందు ఒకేసారి 22 మందిని అరెస్టు చేసి రెండు మాసములకు పైగా కరీంనగర్ జైలులో నిర్బంధించినారు. నిర్బంధింపబడిన వారిలో మెటుపెల్లి దేశ్‌ముఖ్ వెంకటనర్సింగరావు,

అతని గడిలో పనిచేసే చిన్నయ్య గూడా ఉన్నారు. అరెస్టయిన వారిలో చాలా మంది వైశ్య వర్తకులున్నారు. చకినం వెంకన్న, కటుకం గంగారాం, రాగెల్ల సోమయ్య, దొంతుల నారాయణ (రేగుంట నారాయణ), వల్లకొండ రాజం, పాంపట్టి బుచ్చిరాజం, సామ బుచ్చిరాజం, చేపూరి భూమయ్య, చౌటుపెల్లి కొటికె కిష్టయ్య, మున్నగు వైశ్యులందరు కారాగృహశిక్షననుభవించినారు. వీరే గాకుండా గుంటుక రాజగంగారాం, గుంటుక బుచ్చయ్య, బూస గంగారాం, కటుకం లక్ష్మయ్య, బట్టు బుచ్చయ్య, హోటల్ నారాయణ, డా.రాంచంద్రం, చిట్టాపురం గంగారెడ్డి మరియు కల్లూరు నారాయణరావు మున్నగువారు గూడా కరీంనగర్ జైలులో రెండు మాసాలకు పైగా నిర్బంధింపబడినారు. ఈ విధముగా నిజాం నిరంకుశపాలనతో, రజాకార్ల దౌర్జన్యముతో కరీంనగర్ జిల్లా అంతయు అట్టుడికింది. సత్వరమే నిజాం రాజ్యమును భారత యూనియన్‌లో సంలీనము చేయవలెనని సర్వత్రా ప్రజలందరు కేంద్ర ప్రభుత్వముతో మొరబెట్టుకొన్నారు.

1948 సెప్టెంబర్ 13న భారతసైన్యములు నిజాం రాష్ట్రమును అన్ని వైపుల ముట్టడించాయి. సెప్టెంబర్ 17న నిజాం ప్రభువు లొంగిపోయాడు. సెప్టెంబర్ 18 నుండి నిజాం నిరంకుశపాలన అంతరించి ప్రజలు స్వేచ్ఛా వాయువును పీల్చుకొన్నారు. నిజాం రాజ్యము భారత ప్రభుత్వములో సంలీనము చేయబడింది.

## మన ముఖ్యమంత్రులు

ఆంధ్రప్రదేశ్‌లోని కోస్తా, రాయలసీమ జిల్లాలు మద్రాసు ప్రెసిడెన్సీ (Madras Presidency) అంతర్భాగముగా ఉండేవి. త్యాగధనుడైన పొట్టి శ్రీరాములు చేసిన సత్యాగ్రహము, ప్రాణత్యాగము ఫలితంగా ఆంధ్రరాష్ట్రము మద్రాసు రాష్ట్రము నుండి వేరుచేయబడింది. 1953 నుండి 1956 వరకు కర్నూలు రాజధానిగా ఉంది. 1-10-1953 నుండి 15-11-1954 వరకు టంగుటూరి ప్రకాశం గారు ముఖ్యమంత్రిగా ఉన్నాడు. ఆ తరువాత అధ్యక్షపాలన కొనసాగింది. మరల 28-3-1955 నుండి 31-10-1956 వరకు బెజవాడ గోపాలరెడ్డి ముఖ్యమంత్రిగా ఆంధ్రరాష్ట్రాన్ని పాలించాడు.

నిజాం రాష్ట్రము (Erst-while Hyderabad State) నకు 1952లో జరిగిన సాధారణ ఎన్నికల తరువాత నుండి 31-10-1956 వరకు బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రిగా ఉన్నాడు. తెలంగాణా జిల్లాలన్నియు నిజాం డొమీనియన్‌లోని పాలనాభాగములే.

తేది 1-11-1956 రోజున భాషా రాష్ట్రాల ప్రాతిపదికన కోస్తా, రాయలసీమ, తెలంగాణా మూడు ప్రాంతములు కలిసి నూతనముగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము అవతరించింది. ఈ రాష్ట్రములోని జిల్లాలలో కరీంనగర్ జిల్లా ఒకటి. 1956 నుండి ఈ జిల్లాను మరియు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమును పాలించిన ముఖ్యమంత్రుల జాబిత పాఠకులకు పునరావృతము చేయబడింది. అలాగే ప్రధానమంత్రుల, భారత అధ్యక్షుల పట్టికలు ఇవ్వబడినాయి.

## ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రులు

| | | | | |
|---|---|---|---|---|
| 1) | 01-11-1956 | నుండి | 10-1-1960 | నీలం సంజీవరెడ్డి |
| 2) | 11-01-1960 | నుండి | 11-3-1962 | దామోదరం సంజీవయ్య |
| 3) | 12-03-1962 | నుండి | 28-2-1964 | నీలం సంజీవరెడ్డి |
| 4) | 29-02-1964 | నుండి | 29-9-1971 | కాసు బ్రహ్మానందరెడ్డి |
| 5) | 30-09-1971 | నుండి | 17-1-1973 | పి.వి. నరసింహారావు |
| 6) | 18-01-1973 | నుండి | 09-12-1973 | అధ్యక్షపాలన |
| 7) | 10-12-1973 | నుండి | 05-03-1978 | జలగం వెంగళరావు |
| 8) | 06-03-1978 | నుండి | 10-10-1980 | మర్రి చెన్నారెడ్డి |
| 9) | 11-10-1980 | నుండి | 23-02-1982 | టి. అంజయ్య |
| 10) | 24-02-1982 | నుండి | 19-09-1982 | భవనం వెంకట్రామ్ |
| 11) | 20-09-1982 | నుండి | 08-01-1983 | కోట్ల విజయభాస్కర్‌రెడ్డి |
| 12) | 09-01-1983 | నుండి | 15-08-1984 | నందమూరి తారకరామారావు |
| 13) | 16-08-1984 | నుండి | 15-09-1984 | నాదెండ్ల భాస్కర్‌రావు |
| 14) | 16-09-1984 | నుండి | 02-12-1989 | నందమూరి తారకరామారావు |
| 15) | 03-12-1989 | నుండి | 16-12-1990 | మర్రిచెన్నారెడ్డి |
| 16) | 17-12-1990 | నుండి | 08-10-1992 | నేదురుమల్లి జనార్ధనరెడ్డి |
| 17) | 09-10-1992 | నుండి | 11-12-1994 | కోట్ల విజయభాస్కర్‌రెడ్డి |
| 18) | 12-12-1994 | నుండి | 31-08-1995 | నందమూరి తారకరామారావు |
| 19) | 01-09-1995 | నుండి | నేటి వరకు | నారా చంద్రబాబునాయుడు |

## మన ప్రధానమంత్రులు

| | | | | |
|---|---|---|---|---|
| 1) | 15-08-1947 | నుండి | 27-05-1964 | జవహర్‌లాల్ నెహ్రూ |
| 2) | 27-05-1964 | నుండి | 09-06-1964 | గుల్జారిలాల్ నందా |
| 3) | 09-06-1964 | నుండి | 11-01-1966 | లాల్ బహాదూర్ శాస్త్రి |
| 4) | 11-01-1966 | నుండి | 24-01-1966 | గుల్జారిలాల్‌నందా |
| 5) | 24-01-1966 | నుండి | 24-03-1977 | ఇందిరాగాంధి |
| 6) | 24-03-1977 | నుండి | 28-07-1979 | మొరార్జీదేశాయి |
| 7) | 28-07-1979 | నుండి | 14-01-1980 | చరణ్‌సింగ్ |
| 8) | 14-01-1980 | నుండి | 31-10-1984 | ఇందిరాగాంధి |
| 9) | 31-10-1984 | నుండి | 01-12-1989 | రాజీవ్‌గాంధి |

| | | | |
|---|---|---|---|
| 10) 02-12-1989 | నుండి | 10-11-1990 | వి.పి.సింగ్ |
| 11) 10-11-1990 | నుండి | 21-06-1991 | చంద్రశేఖర్ |
| 12) 22-06-1991 | నుండి | 15-05-1996 | పి.వి. నరసింహారావు |
| 13) 16-05-1996 | నుండి | 31-05-1996 | అటల్ బిహారి వాజ్‌పాయి |
| 14) 01-06-1996 | నుండి | 20-04-1997 | హెచ్.డి. దేవగౌడ |
| 15) 21-04-1997 | నుండి | 18-03-1998 | ఇంద్రకరణ్ గుజరాల్ |
| 16) 19-03-1998 | నుండి | నేటివరకు | అటల్ బిహారి వాజ్‌పాయి |

## మన భారత అధ్యక్షులు

| | | | |
|---|---|---|---|
| 1) 26-01-1950 | నుండి | 13-05-1962 | డా. రాజేంద్రప్రసాద్ |
| 2) 13-05-1962 | నుండి | 13-05-1967 | డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ |
| 3) 13-05-1967 | నుండి | 03-05-1969 | డా. జాకీర్ హుస్సేన్ |
| 4) 24-08-1969 | నుండి | 24-08-1974 | వి.వి.గిరి |
| 5) 24-08-1974 | నుండి | 11-02-1977 | ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ |
| 6) 25-07-1977 | నుండి | 25-07-1982 | డా.నీలం సంజీవరెడ్డి |
| 7) 25-07-1982 | నుండి | 25-07-1987 | జ్ఞాని జైల్‌సింగ్ |
| 8) 25-07-1987 | నుండి | 25-07-1992 | ఆర్. వెంకటరామన్ |
| 9) 25-07-1992 | నుండి | 25-07-1997 | డా. శంకరదయాల్‌శర్మ |
| 10) 25-07-1997 | నుండి | 25-07-2002 | కె.ఆర్.నారాయణన్ |
| 11) 25-07-2002 | నుండి | నేటి వరకు | డా.ఎ.పి.జె. అబ్దుల్ కలామ్. |

### ఆధార గ్రంథములు

**(References)**


1. Hemachandra Rayachaudhuri, *"Geography of the Deccan"* ,*EHD*. p. 26
2. K.A.Nilakanta Sastri & G. Srinivasachary, *Advanced History of India*, p. 8
3. ఆర్. సుబ్రహ్మణ్యం, అశోకుని ఎర్రగుడిశాసనములు, నెం.1 నుండి 13 వరకు
4. Parameshwarilal Gupta, punchmarked coins in A.P. Museum. pp. 4,5
5. N.S. Ramachandra Murthy, "Presidential Address" *APHC* Vol.XXIV, 2000, p. 22
6. *Ibid*, p. 25
7. N.S.Ramachandra Murthy, "Kotilingala an early historical site" *APHC*, Vol. XVI, 1992, p. 34
8. A.M.Sastry, "President's Address", *APHC*, Vol. V, 1980. p.s-1
9. Aloka parashar, "Trade in Mid-Godavari valley 200 B.C. to A.D." *APHC* Vol. X, 1986, p. 29
10. *Ibid*, p. 30
11. N.S.Ramachandra Murthy, "Presidential Address" *APHC* Vol.XXIV, 2000 p. 22

12. S.J. Mangalam, "Presidential Address" *APHC* Vol. XXIII, 1999. p.14,15.

13. *Ibid*, p.15

14. *Ibid*

15. N.S.Ramchandra Murthy, *Op.cit.* p. 25

16. S.J.Mangalam. "Presidential Address" *APHC* Vol. XXIII, 1999 P. 14

17. *Ibid*

18. *Ibid* pp. 15,16

19. *Ibid*, p.16

20. *ARDAM*, 1977-1978, p. 26

21. *Ibid*, pp. 39 & 43.

22. M.Rama Rao, *Satavahana Coins in A.P. Govt. Museum*, p. 9

23. Romila Thaper, *The Past and Prejudice*. p. 63

24. Parameshwarilal Gupta, *Op.cit.* p.27

25. V.V.Krishna Sastri, *Op.cit*, p. 200

26. B.S.L. Hanumantha Rao, "Presidential Address" *APHC* Vol. III 1978, p. 7

27. *Ibid*, p. 8

28. A.M.Sastry, Op.cit. *APHC* Vol. V, 1980. p. 5

29. B.R.Subrahmanyam "Presidential Address" *APHC* Vol. VII, 1983. p. 13

30. V.Sundararama Sastry, "Early pallava-vishnukundin Relations" *APHC* Vol. III, 1978, p. 16

31. M.Rama Rao, *Select Andhra Temples.*, p. 1

32. Roy C. Craven, *A Concise history of Indian Art*, p. 133

33. Percy Brown, *Indian Architecture*, p. 62

34. James Fergusson, *History of Indian and Eastern Architecture*, p. 421.

35. Abdul Waheed khan, "Introduction", *Early chalukyan Temples of Andhra Desa*, p. I

36. *Ibid.*, p. II

37. Stella Kramrisch, *The Art of India*, Plate. 57.

38. కుందూరి ఈశ్వర్‌దత్, ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, pp. 316-317

39. జైశెట్టి రాజయ్య, లేములవాడ రాజరాజేశ్వర శతకము మరియు మనస్సంబోధన కీర్తనలు, ప్రథమముద్రణ 1933, ద్వితీయముద్రణ 1992

40. *APGKD*, 1974, p. 252

41. Kolluru Suryanarayana, "Kollipara plates of Arikesari I", *APHC*. *Vol. VIII*, 1984. Medieval section, pp. 10-14.

42. N. Venkataramanaiah, *Chalukyas of Vemulawada.*, pp. 92-94.

43. *ARE*, 1967, No.1. pp. 22,23

44. బి.యన్.శాస్త్రి, వేములవాడ చరిత్ర - శాసనములు, 1991, p. 55

45. Kolluru Suryanarayana, *Op.cit*, pp. 10-14

46. బి.యన్.శాస్త్రి, *Op.cit*, pp. 46-52

47. *Ibid*

48. *Ibid*, pp. 43 & 46

49. N.Venkataramanaiah, *Op.cit*, pp. 9-12.

50. *Ibid*, p. 14

51. బి.యన్.శాస్రి, *Op.cit*, pp. 45 & 56

52. *EHD*, p. 508

53. నేలటూరి వెంకటరమణయ్య, పల్లవులు-చాళుక్యులు, p. 187

54. D.C.Sircar, "The Eastern chalukyas" Chapter VI, *Bharatiya Vidya Bhavan*, Vol. IV p. 135

55. బి.యన్.శాస్రి, *Op.cit.*, p. 58

56. R.C. Majumdar, "Rise and fall of the Partihara Empire" Chapter II, *Bharatiya Vidya Bhavan*, Vol. IV, p. 36

57. J.Ramanaiah, *Temples of South India*, 1989. p. 24

58. *IAPKD*. Nos. 1,2,3. pp. 2-11
59. *ARE*, 1967, No.1, pp. 22,23
60. *RE*, 1966, No. 170, pp. 42,43
61. *IAPKD*, 1974, No.2, pp. 5-10
62. *EA*, Vol. II, pp 21-28
63. *EHD*, p. 504
64. *EA*, Vol.II, pp. 31-35
65. *ARE*, 1967, No.1, pp. 22,23
66. A.S.Altekar, "The Rashtrakutas" *EHD*, pp. 290, 291
67. N.Venkataramanaiah, *Op-cit.*, p. 38,39
68. *Ibid*, pp. 44,45&82.
69. *EHD*, p. 511
70. *IAPKD*, No. 4 p.12
71. *Ibid*, No.5 pp. 12-17
72. *IAPKD*, Nos. 6,7,8,9. pp. 17-26
73. *EA*, Vol. II, pp. 36, 37.
74. *IAPKD*, Nos. 10,11,12. pp. 26-32.
75. *Ibid*, No. 13, pp. 32-36.
76. బి.యన్.శాస్త్రి, *Op.cit*, శాసనము నెం.7, p.116
77. తెలంగాణా శాసనములు, Vol. I, No.21, pp. 173-177.
78. P. Sreenivasachar (ed), *Op.cit.* pp. 48,49.
79. K.A.Nilakanta Sastry, "The Chalukyas of Kalyani" *EHD*, p. 330.
80. *IAPKD*, Nos. 14,15,16,17 pp. 36-47.
81. *EA*, Vol. IV, p.68
82. Paul G.Hiebert,"A Brief History of Patancheru or potttalakere"*JAHRS*,Vol. XXVI, (II to IV parts), p.3
83. *A Catalogue of Inscriptions copied upto 1964*, Nos. 187,188,189.
84. *EA*, Vol. IV, pp. 74-78.
85. *Ibid*, pp. 81-84.
86. *IAPKD*, No.23, pp. 58-60
87. *EA*, Vol.IV, pp. 84-89
88. *JAHRS*. Vol. XXXVI, Part I, pp. 33-43.
89. P.V. Parabrahma Sastry, *The Kakatiyas*, pp. 60-62
90. *EA*, Vol. I, pp 111-113
91. *IAPKD*, No. 75, pp. 139-141
92. *RE*, 1965, No. 308, p.71
93. *IAPWD*, Nos. 44 & 45
94. *JAHRS*, XXXVI, Part I, pp. 58 - 62.
95. *Ibid*, pp. 63 & 64
96. *Ibid*, pp. 1-24
97. *EHD*. p.582
98. *IAPKD*, No. 77
99. *Ibid*, No. 74, pp. 137-139.
100. *EHD*, p. 586
101. డా. పి.వి.పరబ్రహ్మశాస్త్రి, కాకతీయ శాసన సాహిత్యము, pp.21,22.
102. *IAPKD*, No.23, pp. 58-60
103. *IAPWD*, No. 31, p. 87
104. P.V.Parabrahma Sastry, *Kakatiya Coins and Measures.*, pp. 9,10
105. *IAPKD*, No. 25, pp. 64-71.

106. *Ibid*, No.26, pp. 71-73.
107. J.Ramanaiah, *Temples of South India*, 1989, pp. 109, 270 & 271.
108. *IAPKD*, No.27, pp. 73 & 74
109. *Ibid.*, Nos. 28-34, pp. 75-103
110. *JAHARS*, Vol. XXXV, pp. 183-186 & *IAPKD*, Appendix, pp. 146,147.
111. ఈనాడు, 2001 నవంబర్ 16, 26, 29వ తేదీల దినపత్రికలలోని సమాచారము.
112. *IAPKD*, No.36, pp. 103,104.
113. *Ibid*, Nos. 37-39, pp. 104-112.
114. J.Ramanaiah, *Op.cit.*, p. 43-44 & 272-274.
115. P.V.Parabrahma Sastry, *The Kakatiyas*, p. 132
116. *EHD*, pp. 644-647
117. దక్షిణ భారతదేశ చరిత్ర, తెలుగు అకాడమి, 1982. p. 246
118. *Ibid*, p. 320
119. H.K.Sherwani & P.M. Joshi, *History of Medieval Deccan*, Vol. I, p. 12
120. ఆంధ్రదేశ చరిత్ర – సంస్కృతి, తెలుగు అకాడమి, 1986, p. 168
121. దక్షిణ భారతదేశ చరిత్ర, 1982, p. 286
122. బి.యన్.శాస్త్రి, రేచర్ల పద్మనాయకులు, 1991, pp. 21-24
124. *Ibid*, శాసనము సంఖ్య 21
125. యం.శ్యాంసుందర శాస్త్రి, (ed), త్రిశతి pp. 17-23
126. *APGKD*, 1974, p. 52
127. *IAPWD*, Nos. 104, 108
128. *IAPKD*, 1974, Nos. 48,49,53,57
129. *APGKD*, 1974, p. 53
130. *IAPKD*, No. 45, p. 117
131. *ARDAM*, 1976-1977, pp. 53&61
132. *APGKD*, 1974, p. 52
133. S.K.Sinha, *Mediaeval History of the Deccan*, Bahamanids, 1964, pp. 166-172
134. H.K.Sherwani, *Muhammad Quli Qutub Shah*, 1967, p. 5
135. H.K.Sherwani, *History of Qutub Shahi dynasty*, 1974, pp. 24&25
136. *IAPWD*, No. III, p. 291
137. H.K.Sherwani, *Op-cit.*, pp. 25-27
138. H.K.Sherwani, *Muhammad Quli Qutub Shah*, 1967, p. 5
139. *Ibid*, p. 7
140. H.K. Sherwani, *History of Qutub Shahi dynasty*, 1974, pp. 99-104
141. Raza Alikhan, *Hyderabad 400 years*, 1591-1991, pp. 65 & 66
142. H.K.Sherwani, *Op.cit.*, pp. 125-127
143. *Ibid*, p. 198
144. Md.Abdul Wali khan, *Qutub Shahi Coins A.P. Govt. Museum*, 1961, pp. 17 & 18.
145. H.K.Sherwani, *Op.cit.*, Appendix II, p. 136.
146. Md.Abdul Wali khan, *Op.cit.* p. 7
147. H.K.Sherwani, *Muhammad Quli Qutubshah*, 1967, p.14-16
148. *Ibid*, P. 20
149. *Ibid*, p. 28-32
150. Md.Abdul Wali khan, *Op.cit.* pp. 18&19
151. *Ibid*, p.19.
152. *IAPKD*, No.54, pp. 126 & 127
153. H.K.Sherwani, *History of Qutub Shahi dynasty*, pp. 442-445.
154. Raza Ali Khan, *Op.cit.*, pp. 47 & 48.

155. యరబాటి బాబురావు, రామగిరి చరిత్ర, 1982, p.37
156. M.Narasimhacharya, *History of cult of Narasimha in Telangana*, 1989, pp. 123,124.
157. H.K.Sherwani, *Op.cit.* p. 645
158. *Ibid*, pp. 652 & 653.
159. *Ibid*, pp. 654-657.
160. *Ibid*, p.479.
161. H.K.Sherwani, *Op.cit.* p.642
162. *Census Handbook, Karimnagar district*, 1961, p.VI.
163. *APGKD*, 1974, p. 59.
164. M.Narasimhacharya, *Op.cit*, p. 124.
165. *APGKD*, 1974, p. 60
166. *Ibid*.
167. M.Narasimhacharya, *Op.cit.* p. 124.
168. *Ibid*, pp. 124 & 303
169. *APGKD*, p. 61
170. *Ibid*
171. *Ibid*
172. A.Nagabhooshanam, *"The Greatness of Jagtial Fort"*,
Published in English daily Newpaper, dated. 22-10-1972.
173. *Ibid*.
174. *APGKD*, 1974, p. 61
175. సంగనభట్ల నరహరి, "కాలస్రవంతిలో ధర్మపురి" త్రిశతి, 1979, p.23,24.
176. *Ibid*
177. కోల రాంచంద్రారెడ్డి, "ఎలగందులఖిలా" శాతవాహన కళోత్సవాల సంచిక, 2002. pp.22,23
178. సంగనభట్ల నరహరి, *Op.cit*, p. 24.
179. కోల రాంచంద్రారెడ్డి, *Op.cit*, p. 23.
180. జైశెట్టి రాజయ్య, శ్రీలేమలవాడ రాజరాజేశ్వర శతకము మరియు మనస్సంబోధన కీర్తనలు, జగిత్యాల.
ప్రథమముద్రణ 1933 & ద్వితియముద్రణ 1992, pp.204-207. (ఈ గ్రంధ రచయిత డా.జైశెట్టి రమణయ్య పితామహులే
జైశెట్టి రాజయ్యగారు (క్రీ.శ.1842-1921)
181. *Ibid*, pp. 195-199
182. *Ibid*, pp. 212-217.
183. ఎ.వి.కోటిరెడ్డి, ఆధునిక ఆంధ్రదేశచరిత్ర, తెలుగు అకాడమి, 1982, p. 148
184. V.RamaKrishna Reddy, *Economic History of Hyd. State- Warangal Suba*, 1911-1950. Delhi. 1987,p.71.
185. సరోజనిరేగాని, ఆంధ్రలో స్వాతంత్ర్యోద్యమచరిత్ర, తెలుగు అకాడమి, 1986, p. 191
186. G.Arun Kumar, *'Andhra Mahasaba - Telangana Movement' APHC*, X 1986, pp 186-188
187. K.Narotham Reddy, "Prolestyrisation in Nizam State" *APHC*, XV Volume, 1991. pp. 210 - 214
188. *Ibid*
189. K. Rama Krishna, "Famine Relief works in Karimnagar District" *APHC*, IX volume, 1985, pp. 140-142.
190. K.Narotham Reddy, *Op.cit.*, p. 213
191. సరోజనిరేగాని, *Op.cit.*, pp. 200-202
192. జైశెట్టి రాజయ్య, *Op.cit.*, pp. 236-240
193. Vasant K. Bawa, "Presidential address" *APHC*, Vol. XIII, 1989. p. 138
194. ఎ.వి.కోటిరెడ్డి, ఆధునిక ఆంధ్రదేశచరిత్ర, 1982. pp. 203
195. సరోజనిరేగాని, *Op.cit.*, pp. 235
196. K.Natotham Reddy, "Social Movements in Telangana" *APHC.*, vol. VIII, 1984. pp. 20-23.
197. J.Laxminarayana, "The role of J.Keshava Rao" *APHC*, Vol. XI, 1987, p. 106
198. ఆంధ్రభూమి మే 28, 2001, కరీంనగరము ఎడిషన్ ప్రత్యేక ప్రారంభ సంచిక "రత్నాలవీణ". p. 129


కరీంనగర్ జిల్లాలోని చారిత్రకస్థలములు
N
వాల్గొండ
రాయికల్
ధర్మపురి
పొలవాస
కోరుట్ల
జగిత్యాల
కోటిలింగాల
రామగుండం
కాళేశ్వరం
మహదేవపూర్
మంథని
రామడుగు
పెద్దపెల్లి
చొప్పదండి
గంగాధర
వేములవాడ
నగునూరు
కరీంనగర్
ఓదెల
సిరిసిల్ల
గంభీరావుపేట
బెజ్జెంకి
జమ్మికుంట
హుజురాబాద్
కోహెడ
హుస్నాబాద్

## మూడవ అధ్యాయం

# III. చారిత్రక స్థలములు

అతిప్రాచీనకాలం నుండి సారవంతమైన నదీ మైదానాలపై విలసిల్లిన జనావాసాలతో రాజకీయ ప్రాధాన్యత కల్గిన పరిపాలనా వ్యవస్థలతో నేటి కరీంనగర్ జిల్లా విశిష్టమైన చారిత్రక విశేషాలతో కూడి ఉంది. కనుక కాలానుక్రమ పరిణామాలతో మహత్తరమైన నాగరికతా సంస్కృతుల వికాసాలకు కూడా ఈ ప్రాంతం ప్రఖ్యాతమైందని సులువుగా గ్రహింపవచ్చు. మతధార్మిక పరిణామాల వలన, వాస్తుశిల్పాల అభివృద్ధి క్రమంచేత పరిపాలకులు ధనాఢ్యులైన ప్రజలచేత అనాదికాలం నుండి బౌద్ధ, జైన, హిందూ ధర్మాలకు చెందిన ఆలయాల నిర్మాణం జరిగిందని నేటికీ నిలిచి ఉన్న అవశేషాల వలన స్పష్టమౌతుంది. ఈ అవశేషాలు నిలిచి ఉన్న స్థలాలు నాటి చారిత్రక పరిణామాలకు సాక్ష్యాలు, ఈనాటి వారికి దర్శనీయమైన క్షేత్రాలు. ఈ చారిత్రక స్థలాల్లో నిలిచి ఉన్న అవశేషాలు వివిధమైనవి. కొన్ని కొండచరియల్లోని గండశిలలను మలచి ఏర్పరచిన గుహాలయాలు మరికొన్ని జనావాసాల నడుమ నిర్మించిన ఆలయాలు. గుహాలయాల కంటె దేవాలయముల సంఖ్య ఎక్కువ. శైలావాసాల (Rock-shelters) నుండి జనావాసాలను ఏర్పరచుకొని చారిత్రక పరిణామములో ప్రజలు సాగించిన జీవనక్రమములో వివిధ రాజవంశముల పాలనలో నిర్మింపబడిన కోటలు, కట్టడములు, ఆలయములు మున్నగువాటి గురించిన వివరణ ఈ అధ్యాయంలో పొందుపరచడం జరిగింది.

## 1. అడవి సోమనపెల్లి గుహాలయములు

కరీంనగర్ జిల్లాలో మంథనికి 22 కి.మీ. దూరమున అడవి సోమనపెల్లి గుట్టపై నున్న శిలను తొలిచి నిర్మించిన నాలుగు గుహాలయములు (Rock Cut Temples) ప్రాచీన భారతీయ వాస్తు శిల్పమునకు తొలి చిహ్నాములుగా నిలిచి ఉన్నాయి. తాడిచెర్ల వద్ద బసు దిగగానే అడవి జంతువులతో కూడుకొనిన దట్టమైన అరణ్యము గుండా 4 కి.మీ. కాలినడకన పోయినచో ఈ ప్రాంతమును చేరవచ్చు. వర్షాకాలములో బురదనేల గనుక ప్రయాణము కష్టము. కొండ పై నున్న ఒకే పెద్ద శిలను తొలుచగా ఏర్పడిన ఈ నాలుగు గుహాలయములు పడమటి ముఖమును

గలిగి మానేరు నదికి ఎదురుగా నిలిచి ఉన్నాయి. ఇచటి నుండి తిలకించినచో పరిసర ప్రకృతి దృశ్యములు ఎంతో రమణీయముగా, మనోహరముగా అగబడుతాయి. స్థానికముగా నైనగుళ్లు అని పిలువబడు ఈ శివాలయముల కొలతలు ఒక్కరీతిగా లేవు. నాసిరకపు శిల యగుటచే శతాబ్దముల తరబడి ప్రకృతి వాతావరణమునకు మరియు మానేరునది నుండి వీచు చల్లని గాలులకు తట్టుకోలేక ఈ గుహాలయములు కొంత చెదరిపోయి శిథిలమగుచున్నవి. విజయవాడకు సమీపమున మొగల్రాజపురములో చెక్కబడిన విష్ణుకుండినుల కాలపు గుహాలయములవలె ఇచటి గుహాలయములు గూడా గర్భగృహము మరియు దాని ముందు మంటపముందునట్లు తొలుచబడినాయి. ఇచటి స్తంభములు మొగల్రాజపురము నాలుగవ గుహాలయ స్తంభములను పోలి సామాన్యముగా (Plain) చెక్కబడినాయి[1].



మొదటి గుహాలయ మంటపము



గర్భగృహము

## మొదటి గుహాలయము (Rock-cut Temple No. I)

ఈ ఆలయమందు గర్భగృహము, దాని ముందు అర్ధ మంటపము నిలిచి ఉన్నాయి. మంటప ప్రవేశము నందే రెండు పెద్దసైజు స్తంభములు (Heavy Pillars) వాటికెదురుగా గర్భగృహ ద్వారానికిరువైపుల రెండు కుడ్య స్తంభములు (Pilasters) చెక్కబడిఉన్నాయి. స్తంభములు మోటుగా మలుచబడి యుండి అశ్వపాదం (Base) స్తంభము (Shaft) మరియు లింటెల్‌ను ఆనుకొని ద్విముఖ బ్రాకెట్ (Bracket extending only two sides along the lintel) ను కలిగి ఉన్నాయి. స్తంభభాగములో రెండు చతురస్రాకారపు విభాగముల మధ్య అష్టాస్రమైన 6 అంగుళముల పట్టిక (Octogonal member of about 6" height) ఉంది. మంటపము 13'-10" x 12'-4" కొలతలతో 7'-6" ఎత్తు వరకు తొలుచబడింది. ఈ మంటప కుడ్యములు (Walls) ఎలాంటి అలంకారములు లేకుండా సాదాగా ఉన్నాయి. చాలా ఆసక్తికరమైన అద్భుతమైన విషయమేమన మంటపము యొక్క లోకప్పు (Ceiling) సన్నని సున్నపు పొరతో చదును చేయబడి, దానిపై (Colour Paintings) వర్ణచిత్రములున్నాయి. కాని దురదృష్టవశాత్తు ఈ వర్ణ చిత్రముల పొరలు

కాలప్రవాహములో ఊడిపోయి ప్రస్తుతము నల్లని, ఎర్రని, నీలి, పసుపుపచ్చని మున్నగు వివిధ రంగులలో కొన్ని అస్పష్టమైన గుర్తులు మిగిలిఉన్నాయి. ఈ చిత్తర్వులలో అర్ధోరుకము మరియు ఊర్ధ్వ వస్త్రము ధరించిన స్త్రీ,పురుష రూపములు కొన్ని అగబడుచున్నవి. వీరు కిరీటమకుటములు, కంఠహారములు, పత్రకుండలములు, దండ కడియములు, యజ్ఞోపవీతము మున్నగునవి ధరించినట్లు అగబడుచున్నారు. అచ్చటచ్చట మిగిలియున్న వర్ణచిత్రములలో నర్తకీలు, యుద్ధదృశ్యములు, అశ్వములచే లాగబడు రథములు, విలుకాండ్రు, రాచభవనములు మున్నగు అంశములు చూపరుల దృష్టినాకర్షిస్తాయి.

మంటపము నుండి 5'-6" ఎత్తు 2'-3" వెడల్పు గల ద్వారము గుండా గర్భగృహము లోనికి ప్రవేశింపవచ్చు. గర్భగృహము 10'-10" x 10'-1" కొలతలతో 7'-3" ఎత్తును కలిగిఉంది. ఇందులో 2'-5" ఎత్తుగల పీఠము (Pedestal) పై లింగము చెక్కబడిఉంది. ఈ లింగరూపము మోటు (Crude) గా నుండి 1'-7" ఎత్తు 4'-1" చుట్టుకొలతతో నున్నది. తల విరిగిన నంది విగ్రహమొకటి అచట విడిగా పడి ఉంది.

## రెండవ గుహాలయము (Rock-cut Temple No. II)

రెండవ రాతి గుహాలయము నందు గర్భగృహము మరియు దాని ముందు అర్ధ మంటపముంది. మంటపమునకు ముందు రెండు స్తంభములు లేకుండా గర్భగృహము ముందర రెండు కుడ్య స్తంభములు (Pilasters) మలచబడినవి. మంటపము 8'-7"x4'-7" కొలతలతో 7 అడుగుల ఎత్తుతో ఉంది. గర్భగృహము 5'-2"x 4'-3" కొలతలతో 6'-10" ఎత్తును కలిగి ఉంది. మొదటి గుహాలయములో వలె మంటపము నుండి గర్భగృహమునకు ప్రవేశద్వారమున్నది. గర్భగృహపు వెనుక గోడ నానుకొని ఒక పీఠముంది. దానిపై నల్లరాతితో మలచబడిన ద్విభంగములో నున్న మహిషాసురమర్దని ప్రతిమ విరిగిన తలతో నిలుపబడిఉంది. దేవి కుడికాలును నేలపై నిలుపగా ఎడమకాలు మహిష రూపమున నున్న అసురుని మెడపై ఉంచింది. ఆమె చతుర్భుజములలో పైనున్న ఎడమచేయి విరిగిపోగా, కుడిచేతిలోని త్రిశూలముతో అసురుని శరీరమును గ్రుచ్చుచున్నది. (Piercing the trisula into the body of the demon) క్రింది ఎడమచేతితో మహిషుని తోకను పట్టుకొని కుడి చేత ఖడ్గముతో పొడుచుచున్నది. గ్రైవేయకములు, కేయూరములు, కటిబంధము, యజ్ఞోపవీతము, ముంజేతి కడియములు మున్నగు ఆభరణములతో దేవి అలంకరింపబడిఉంది. ఆమె చేతికి గాజులు, అన్ని వ్రేళ్లకు ఉంగరములున్నాయి. ఆమె ధరించిన వస్త్రపు చెంగులు మోకాళ్ల వరకు వ్రేలాడుతున్నాయి.

## మూడవ గుహాలయము (Rock-cut Temple No. III)

మూడవ గుహ రెండు స్తంభములపై ఆనియున్న కేవలము అర్ధమంటపము మాత్రమే. ఈ మంటపము 12'-5"x12'-2" కొలతలతో 7'-6" ఎత్తును కలిగి ఉంది. మంటపము మధ్యనున్న

వేదికపై నాలుగు అడుగుల చుట్టుకొలత గల శిథిలమైన లింగమున్నది. రెండవ మూడవగుహలకు మధ్యనున్న బాహ్య రౌతు కుడ్యము పై రెండు గూడులున్నాయి (Niches). ఒకదానిలో గణపతి రెండవ దానిలో ద్వారపాలక శిల్పాలున్నాయి.



మూడవ గుహాలయము

## నాలుగవ గుహాలయము (Rock-Cut Temple No. IV)

ఇది గూడా రెండు స్తంభములపై నిలిచియున్న అర్ధమంటపముతో గూడిన గుహామాత్రమే. మంటపము 14'-0"x8'-4" కొలతలతో 7 అడుగుల ఎత్తుతో ఖాళీగా ఉంది. ఈ మంటపమునకు ఎడమ ప్రక్కన రెండు గూడులున్నాయి. ఒకటి ఖాళీగా నుండగా రెండవ దానిలో అస్పష్టమైన ప్రతిమ చెక్కబడిఉంది.

ఈ గుహలకు ముందున్న కుడ్యముపై పదవ, పదకొండవ శతాబ్దపు తెలుగులిపి లక్షణములతో రెండు చిన్న శాసనములు (Label inscriptions in the characters of 10th or 11th Century A.D. in Telugu) ఉన్నాయి[2]. మొదటి అసంపూర్ణ శాసనము నందు ఎక్కటె విముని యనునతడు రామేశ్వర దేవుని ప్రతిష్ఠించగా కెంపెన యనునతడు రాతిని తొలిచినట్లు తెలుపబడింది. పెనుకంటి ముచ్చిరెడ్డి రామేశ్వరదేవునకు ముగ్గు (Lime Linings) దీప నైవేద్యములకై పన్నస భూదానమిచ్చినట్లు రెండవ శాసనము తెలుపుతుంది.

బాహ్యముగా ఈ గుహాలయములు విజయవాడకు సమీపమున గల ఉండవల్లి కొండలపై నున్న గుహాలయములను పోలిఉన్నాయి. కాని వీటిని ఉండవల్లిలోని ఐదు అంతస్తుల అనంతశయన గుడితో పోల్చలేము. కళారీతులను బట్టి ఈ గుహలు క్రీ.శ. ఏడవ, ఎనిమిదవ శతాబ్దములకు చెందినవని డా.యన్.యస్.రామచంద్రమూర్తి అభిప్రాయము[3].

# 2. వేములవాడ

కరీంనగర్‌కు పడమట 35 కి.మీ. దూరములో మూలవాగు ఒడ్డుననున్న ఒక మండల కేంద్రము వేములవాడ. ఇది క్రీ.శ. 750 నుండి 973 వరకు పాలించిన వేములవాడ చాళుక్యులకు రాజధానిగా వెలసింది. ఇచటనున్న అనేక శిల్పప్రతిమలు, శిథిలమైన ఆలయములను బట్టి వారు గొప్ప నిర్మాతలని సుబోధకమగుచున్నది. అనేక దేవాలయములకు నిలయమైన వేములవాడ పూర్వ వైభవము దాదాపు పదిశాసనములలో పేర్కొనబడింది[4]. శాసనములందు ఈ పట్టణము లేంబుళవాటక, లేంబులవాడె, లేంబులవాడ యని పేర్కొనబడింది. ఉచ్చారణలో క్రమముగా ఇది లేములవాడ, ఏములవాడ, వేములవాడగా మారింది. కరీంనగర్ జిల్లాలో అతి ప్రాచీనమైన దేవాలయములు వేములవాడలోనే ఉన్నాయి.



వేములవాడ దేవాలయముల సముదాయము

## భీమేశ్వర దేవాలయము

శైవమత ప్రభావము అధికముగా నుండుటచే దక్షిణ భారతదేశములో రాతితో నిర్మించిన దేవాలయములు క్రీ.శ. ఏడవ శతాబ్దము నుండి అగబడుచున్నవి. వేములవాడలో నున్న అతి సుందరమైన భీమేశ్వరాలయము తొమ్మిదవ శతాబ్దమునకు చెందింది. వేములవాడను పాలించిన చాళుక్యరాజు బద్దెగుడు (క్రీ.శ. 850-895) దీనిని నిర్మించినందున ప్రప్రథమములో ఇది బద్దెగేశ్వరాలయముగా వ్యవహరింపబడింది[5]. ఈ దేవాలయము చుట్టు రాతి ప్రాకారముంది. వేములవాడలో నున్న దేవాలయము లన్నింటిలో కంటే ఈ దేవాలయము ఆనాటి శిల్పకళా వైభవాన్ని తెలియచేస్తుంది.

భీమేశ్వరాలయమునందు గర్భగృహము, అంతరాళము, ముఖమంటపము మరియు దాని ముందు రెండు దిశల సోపానములున్న ఎత్తైన వేదిక ఉన్నాయి. ఉపపీఠముపై నున్న ప్రతిబంధరీతి అధిష్ఠానము అష్టాస్రకుముదమును కలిగి ఉంది. ఇట్టి నిర్మాణరీతులు హేమవతి,

వెల్దుర్తి మున్నగు దేవాలయములలో గోచరిస్తాయి. అనేక విభాగములుగా విభజింపబడిన ఉపపీఠమునందు దశావతారములు, మొసలి మరియు మర్కటము లాంటి పంచ తంత్ర గాథలున్నాయి. గర్భగృహపు గోడలు సాదాగా (Plain) నుండి మంటపగోడలు కుడ్య స్తంభములతో (Pilasters) విభజింపబడి ఉన్నాయి. ప్రస్తర భాగము నందు హంసమాల, కపోతములు బహుఅందముగా చెక్కబడినాయి. మందిరము ముందున్న వేదిక అధిష్ఠాన కంఠ భాగమునందు చిన్నచిన్న గదులలో రెండు మాతృదేవతా (Mother Goddess) రూపములు చెక్కబడినవి. ఈ దేవతలు కూర్చొని తమ కాళ్లను వెడల్పుగా తెరచి నగ్న రూపములో కనబడుదురు. జననేంద్రియములు స్పష్టముగా కనిపిస్తున్నాయి. వీటిని బట్టి ఆనాటి ప్రజలు సంతానసాఫల్య పూజలు (Fertility Cult) జరిపే వారని తెలియుచున్నది. పిల్లలు లేని తల్లులు సంతానమునకై ఆంధ్ర ప్రాంతములో నేటికి ఈ మాతృదేవతా పూజలు చేస్తారు[6].



భీమేశ్వరాలయము



లింగం




వేములవాడ భీమేశ్వర దేవాలయము-గ్రౌండ్‌ప్లాన్



వేములవాడ భీమేశ్వర దేవాలయము ముందు నుండి బాహ్యారూపము (Front Elevation)




వేములవాడ భీమేశ్వర దేవాలయము ప్రక్కనుండి బాహ్యారూపము (Side Elevation)

ముఖమంటప ప్రవేశ ద్వారము త్రిశాఖలతో లింటెల్ వద్ద మకరతోరణము, లలాటమున గజలక్ష్మి మరియు అడుగున ఒక హస్తము నందు గద, రెండవది అభయ ముద్రతో గల ద్వారపాలకుల మరియు చామరగ్రాహిణుల శిల్పాలున్నాయి. ముఖమంటపములోని నాలుగు మధ్య స్తంభములు (Central Pillars) అత్యంత ఎత్తుగా నుండి చుట్టు వాటికి జతగానిలుచు స్తంభములు (The other Corresponding Pillars) కుఱుచగా నుండుటచే కప్పు ఏటవాలుగా (Slopy pent roof) ఉంది. మధ్య స్తంభములు చిత్ర ఖండ రూపాలంకరణతో ఉన్నాయి. మంటపము యొక్క లోకప్పు (Ceiling) త్రికోణ శిలలతో లుపవితాన (కదలికా కరణ) పద్ధతిలో వేయబడింది. మధ్యశిల విరబూసిన పద్మముద్రికను కలిగిఉంది.

అంతరాళభాగము నందు ఉత్తర దిశయందున్న వాతాయనములో గల మహిషాసురమర్దని విగ్రహము చూపరుల దృష్టి నాకర్షిస్తుంది. ఎనిమిది హస్తములతో గూడిన దేవత మహిషుని తలను కాళ్లతో త్రొక్కుతుంది. అతి సుందరముగా మలచబడిన ఈ శిల్పము అలంపురము, ఎల్లోరలలో రాష్ట్ర కూటుల కాలములో మలచబడిన విగ్రహములను పోలిఉంది[7]. గర్భగృహప్రవేశ ద్వారముపై ముందుకు పొడుచుకొని వచ్చిన చూరు (Projecting cornice over the lintel) ఉంది. లలాటమందు గజలక్ష్మి చెక్కబడింది. ద్వారపు శాఖల అడుగున చతుర్భుజ ద్వారపాలకులు చెక్కబడినారు. క్రింది హస్తమొకటి అభయముద్రలో నుండగా మిగిలిన మూడు చేతులందు త్రిశూలము, గద, నాగసర్పములున్నాయి. గర్భగృహము లోపల తొలి చాళుక్యుల కళా సంప్రదాయానుసారము నాలుగు స్తంభములు గలవు. వీటి మధ్యలో నున్న ఎత్తైన పీఠము (Pedestal) పై మూడు అడుగుల చుట్టు కొలత గల బృహత్ లింగముంది. శంఖనిధి, పద్మనిధితో గూడిన నున్నని (Smooth) చంద్రశిల అంతరాళము ముందున్నది. గర్భగృహము లోపల నాలుగు స్తంభములుండు తొలిచాళుక్యుల కళా సంప్రదాయము అలంపురము, సత్యవోలు, మహానంది ఆలయముల గర్భగృహములందు గూడా చూడవచ్చును[8]. చాళుక్యుల కళారీతులలో భీమేశ్వరాలయ గోపురమునకు తూర్పు ముఖమున శుకనాసముంది.



మహిషాసురమర్దని



జైన చౌముఖము

## నగరేశ్వరాలయం

వేములవాడ ఏలిక రెండవ అరికేసరి (క్రీ.శ. 930-955) కాలపు తేది లేని శాసనమందు పేర్కొనబడిన నాలుగు దేవాలయములలో నగరేశ్వరాలయమొకటి[9]. ఇది వేములవాడ నకరము అను వర్తక సమాజముచే నిర్మించబడిన ఆలయము[10]. పదవ శతాబ్దపు ఈ ఆలయము చుట్టు ప్రాకారముండి తూర్పు ముఖమును కలిగిఉంది.

నగరేశ్వరాలయ అధిష్ఠానమందు ఉపానము, విశాలపట్టిక, జగతి అగబడుచున్నాయి. కుడ్య స్తంభములతో గూడిన భిత్తి (Wall with Pilasters) మరియు గోపురము మధ్యన మోటైన చూరు (Cornice in crude form) ఉంది. హంసమాల ప్రస్తరభాగమునలంకరించింది. శిఖరము మెట్లు గల పిరమిడ్ ఆకారములో (Stepped pyramidal form) ఉంది. మంటపము మధ్యన నాలుగు స్తంభాలున్నాయి. మంటపం ముందు ఉప మంటపము (Porch) ఉంది. మంటపము యొక్క లోకప్పు చదును (Flat)గా ఉంది. ఆలయస్తంభములు మోటుగా పెద్దగా (Heavy and crude in form) ఉన్నాయి. శివలింగముతో కూడిన గర్భగృహము ముందు గల అర్ధమంటపములో కుడి వైపు గణపతి ఎడమవైపు అమ్మవారు పార్వతి ప్రతిమలున్నాయి.

## బద్ది పోచమ్మ ఆలయం

నగరేశ్వరాలయం ఎదురుగానే బద్దిపోచమ్మ ఆలయముంది. బహుశః ఇది బద్దెగరాజు కాలమునకు చెందినదై యుండును. గర్భగృహము నందు గల చతుర్భుజ భద్రకాళిమాత పైనున్న కుడి హస్తములో త్రిశూలము, ఎడమ హస్తములో డమరుకము, క్రింది కుడి హస్తములో ఖడ్గము, ఎడమ హస్తములో తెగిన అసురుని తల ఉన్నాయి. మంటపములో పురాతన పోచమ్మ ప్రతిమ పడిఉంది. ఈ ఆలయ ఆవరణలో రెండు అడుగుల ఎత్తుగల కాయోత్సర్గరీతిలో నిలబడియున్న దిగంబర జైన విగ్రహముంది. ఇటీవల ఈ ఆలయ పునర్నిర్మాణము జరిగింది.

## కేదారేశ్వరాలయము

రాతి ప్రాకారములోపల గల ఈ ఆలయము ముందు క్రీ.శ. 1033 నాటి శిలా స్తంభ శాసనమొకటి ఉంది. చీకరాజుచే ప్రతిష్ఠింపబడిన రాజేశ్వర దేవరకు అతని అధికారి ఒకరు పూజ నైవేద్యాదులకై భూదానములిచ్చినట్లు ఈ శాసనము తెలుపుతుంది. ఈ రాజేశ్వరదేవుడే నేడు కేదారేశ్వరునిగా పూజలందుకొనుచున్నాడు. ఈ దేవాలయమందు గర్భగృహము ముఖమంటపములను కలుపుతూ అర్ధమంటపముంది.

కేదారేశ్వరదేవాలయ అధిష్ఠానమందు ఉపానము, పట్టిక మరియు అనేక దేవతా, పుష్పాకృతులతో అలంకరింపబడిన వేదిక ఉన్నాయి. జననేంద్రియమును ప్రదర్శించుచున్న తొలికాలపు మాతృదేవతా రూపము చూపరులనాకర్షించును. కుడ్య స్తంభములతో

అలంకరింపబడిన గోడలకు దేవతా విగ్రహముల శాలలు చెక్కబడినాయి. మొదటి శాలలో పద్మము పై ఆసీనుడైన గణపతి, రెండవ దానిలో 3' ఎత్తున్న బ్రహ్మ, మూడవ దానిలో శివుడు నాలుగవ దానిలో విష్ణువు అంతే ఎత్తు తో చెక్కబడియున్నారు. అచటచట గజారూఢులు (Elephant riders) బహుఅందంగా గోడలపై మలచబడినారు.




వేములవాడ కేదారేశ్వర దేవాలయము-గ్రౌండ్‌ప్లాన్

గర్భగృహము నందు గల లింగమునకు నాలుగువైపుల స్తంభములున్నాయి. ఈ నాలుగు స్తంభముల చుట్టు ప్రదక్షిణా పథమున్నది. కరీంనగరము జిల్లాలోని పదవ, పదకొండవ శతాబ్దపు దేవాలయముల గర్భగృహములందు నాలుగు స్తంభములు నిలుపునట్టి తొలి చాళుక్యుల కళా సంప్రదాయము గోచరిస్తుంది. ఈ ఆలయ శిల్పమనుపమానము. దేవాలయ కుడ్యములు అపురూప శిల్ప సంపదతో నొప్పారుతున్నాయి. పంచతంత్ర హంస తాబేలు కథ, పక్షులు, సింహములు, పౌరాణికకథలు, స్త్రీల నృత్య భంగిమలు చూపరులనాకర్షిస్తాయి.

## రాజరాజేశ్వర దేవాలయము

వేములవాడలోని ఆలయములన్నింటిలో అత్యంత జనప్రియమైన ఆలయము (Popular Temple) శ్రీరాజరాజేశ్వర దేవాలయం. శ్రీరాజరాజేశ్వర క్షేత్ర మహాత్మ్యము అను స్థల పురాణము దీని ప్రాధాన్యతను తెలుపుచున్నది. పశ్చిమ కళ్యాణి చాళుక్య చక్రవర్తి, ఆఱవ విక్రమాదిత్యుని మహా మండలేశ్వరుడైన రాజాదిత్యుడు ప్రతిష్ఠించిన రాజాదిత్యేశ్వర దేవరకు గొప్ప దేవాలయము నిర్మించెనని ఈ ఆలయమందు నిలుపబడిన క్రీ.శ. 1083 శాసనంలో ఉంది[11]. అదియే నేడు శ్రీ రాజరాజేశ్వర దేవాలయముగా వ్యవహరింపబడుతుంది. చుట్టూ ఎత్తైన రాతి ప్రాకారము గల ఈ దేవాలయము తూర్పు ముఖమును కలిగిఉంది. ఈ ఆలయ ప్రాంగణము సువిశాలముగా నుండుటచే కాలక్రమములో ఇతర చిన్న దేవాలయాలు వెలసాయి.



గర్భగృహద్వారము



కోనేరు

రాజరాజేశ్వర దేవాలయ అధిష్ఠానము నేలను చదును (Flooring) చేయుట వలన భూమిలో మునిగిఉంది. దీనిపై నున్న కుడ్యములు అలంకరణ లేక సాదాగా (Plain) నుండి కుడ్య స్తంభముల (Pilasters)తో అలంకరింపబడినాయి. గోడపై నున్న కపోతము (Cornice) అర్ధచంద్రాకృతి శిలలతో అలంకరింపబడింది. ప్రస్తర భాగము హంసలు, కత్తి, డాలు పట్టుకొన్న యోధులు, గజారూఢులు, స్త్రీ రూపములు మున్నగు వాటితో అలంకరింపబడింది. గర్భగృహముపై నున్న శిఖరము సంపూర్ణముగా నూతన నిర్మాణము. అంతకు ముందున్న శిఖరము పిరమిడ్ ఆకృతిలో (Stepped Pyramidal Form) ఉండేది. పూర్వపు పునాదుల పైననే ఆలయ ముఖమంటపము పునఃనిర్మాణముగావింపబడింది. గోపురము, ముఖమంటపము దాని ముందు జీవముట్టిపడునట్లు నిలువెత్తు మలచబడిన నునుపైన ద్వారపాలక విగ్రహములు మున్నగునవన్నియు నూతన నిర్మాణములే. ముఖమంటపమునకు తూర్పు, ఉత్తర, దక్షిణ దిశల యందు ప్రవేశద్వారము లుండి, పడమట నున్న గర్భ గృహమందు గల పానవట్టముపై లింగము




వేములవాడ రాజరాజేశ్వర దేవాలయము - గ్రౌండ్ ప్లాన్

ప్రతిష్ఠించబడి ఉంది. ముఖమంటపములో కుడివైపున లక్ష్మీగణపతి విగ్రహముంది. ఇది అత్యంత మనోహరముగా నుండి శిల్పకళతో నొప్పారుతుంది. ఇంద్రనీల ఛాయగల ఈ విగ్రహము చూపరులనాకర్షిస్తుంది. గణపతి మలచుకొని యున్న ఎడమకాలిపై దేవి (Goddess seated on his folded left leg) కూర్చొని ఉంది. మంటపములోని ఎడమవైపు రాజరాజేశ్వరీదేవి ఆలయముంది. అమ్మవారి పైచేతులలో డమరుకము, త్రిశూలము, క్రింది చేతులలో ఖడ్గము, గిన్నె (Bowl) ను చూడవచ్చు.

ఆలయ గర్భ గృహ ప్రవేశ ద్వారము లలాటమున గజలక్ష్మి ప్రతిమతో కళ్యాణి చాళుక్యుల కళారీతులలో శోభాయమానముగా ఉంది. ఈ ఆలయ ద్వార బంధములు శిల్ప సంపద కాలవాలమైనవి. లింటెల్ పై బయటకు చాపుకొని యున్న చూరు బహుఅందముగా నున్నది. ద్వారమునకిరువైపుల చెక్కబడిన త్రిశాఖలలో మధ్యనున్న స్తంభాకారమున కిరువైపుల వివిధ లత పుష్పాకృతులు మాలల రూపమున మలచబడినాయి. ద్వారపు అధోభాగముననున్న ఫలకములపై అందమైన ద్వారపాలకులు మలచబడినారు. వీరి పైహస్తములందు త్రిశూలము, డమరుకము క్రింది కుడి హస్తమునందు గద యుండగా దానిపై ఎడమహస్తము నిలుపబడింది. ద్వారపాలకులకు ఇరువైపుల మలచబడిన సుందరాంగుల అంగసౌష్ఠవము, కేశాలంకరణ, వివిధ ఆభరణములు శిల్పసౌందర్యమును చాటుతున్నాయి.

రాజేశ్వరాలయమునకు ఎడమవైపు కాశీవిశ్వేశ్వరాలయమున్నది. ఇది ఒక మంటపము వంటిది. ఇచట లేత గులాబీరంగులో నున్న శివలింగము కాశీ విశ్వేశ్వరలింగమనబడుచున్నది. వేములవాడను దక్షిణ కాశీయని పిలుచుటకు ఈ లింగవే కారణమై ఉంటుంది. రాజేశ్వరాలయమునకు వెనుక అనంతపద్మనాభస్వామి ఆలయముంది. ఈ ఆలయ ద్వార తోరణములు శిల్పకళల కాలవాలమై ఉన్నాయి. శివకేశవుల ఉత్సవములు వేములవాడలో నిర్వహించబడుట వలన ఇది హరిహర క్షేత్రమని ప్రసిద్ధి గాంచింది.

రాజరాజేశ్వరాలయ ప్రాంగణములో కోదండ రాముని, బాలత్రిపుర సుందరీదేవి, బాలరాజేశ్వర, విఠలేశ్వర మున్నగు ఆలయాలున్నాయి. రాజరాజేశ్వరాలయమొక బృహత్తటాకపు కట్ట (Bund) పై నిలిచిఉంది. ఈ ఆలయమునంటుకొని ఉత్తర దిశలో యొక కోనేరున్నది. అది ధర్మకుండ మనబడును. దీని యందు స్నానమాచరించినచో భూత,ప్రేత,పిశాచాది గ్రహబాధలు, చర్మవ్యాధులు, పాపము నివృత్తి యగునని భక్తులు నమ్ముతారు. రాజరాజనరేంద్రుడీ కుండమునకు సోపానములు నిర్మించాడని తెలుస్తుంది. గుండము నందు శివలింగములు గల రెండు మంటపములున్నాయి. ధర్మకుండమునకు పై భాగమునందనేక నాగప్రతిమలు చెక్కిన శిలలున్నాయి. ఈ ధర్మకుండము నందున్న రెండు లింగ మంటపములు బాదామికి సమీపమున గల మహాకూటేశ్వరము నందలి పద్మకొలనులో క్రీ.శ. 600 ప్రాంతములో నిర్మింపబడిన లింగ

మంటపమును (Linga pavilion constructed in vishnu's lotus pond at Mahakut datable to A.D. 600) గుర్తు చేస్తాయి[12]. రాజరాజేశ్వర దేవాలయ ప్రాంగణములో అనేక విడివిగ్రహాలున్నాయి. అందులో భైరవుడు, మురళీకృష్ణుడు, వినాయకుడు, లింగములు, నంది విగ్రహములు ప్రధానమైనవి. శ్రీ రాజరాజేశ్వరాలయ ప్రాంగణములో ఈశాన్యమునందొక మహ్మదీయ సాధువు సమాధి ఉంది. హిందూ మహ్మదీయులు దానిని పవిత్రమైనదిగా భావిస్తారు.

## ఆదిత్య గృహం

రెండవ అరికేసరి కాలపు శాసనములో పేర్కొనబడిన నాలుగు దేవాలయములలో ఆదిత్య గృహమొకటి[13]. ఇది పూర్తిగా శిథిలమైనందున దీని నామరూపాలు నేడు లేవు. కాని దాదాపు రెండడుగుల ఎత్తున్న ఆదిత్య విగ్రహమొకటి రాజరాజేశ్వర దేవాలయ దీప స్తంభము సమీపమున ఉంది. ఈ ద్విహస్తముల సూర్యప్రతిమలో పైకెత్తిన రెండు చేతులలో పద్మములున్నాయి. పాదముల వద్ద కొంత శిథిలమైన ఇలాంటి విగ్రహమే ఇంకొకటి భీమేశ్వరాలయమందలి బయటి వరండాలో పడిఉంది. ఇది బాగా అటిగిపోయిన విగ్రహము. ఇందులో గూడా ఆదిత్యుని పైకెత్తిన ద్విహస్తములందు పద్మములున్నాయి. అంసుమద్భేదాగమము మరియు సుప్రభేదాగమములను అనుసరించి కమలములను పట్టుకొనిన పిడికిలిలు సూర్యుని భుజములదాకా ఎత్తబడియున్నవి[14]. సూర్యుడు సమభంగములో నిలబడి తలవెనుక ప్రభామండలమును కలిగియున్నాడు. సూర్యుని మెడలో హారము, కర్ణములకు వలయాకారాభరణములు (Ear-Rings) తలపై మకుటము అలంకరింపబడినవి. బహుశః ఈ రెండు సూర్య విగ్రహములు రెండవ అరికేసరి తంత్రపాలుడైన పెద్దనార్యుడు కట్టించిన ఆదిత్య గృహమునకు సంబంధించినవై యుండును.

## శుభధామ జినాలయము

ప్రస్తుత మీ జినాలయము లేదు. పూర్తిగా శిథిలమై అదృశ్యమైంది. కాని ఇందలి నిలువెత్తు పార్శ్వనాథ విగ్రహము చాలాకాలము మట్టుకు రాజరాజేశ్వర గోపురద్వారము లోపలి గోడకు ఆనుకొని నిలుపబడి ఉండేది. ఈ ఆలయ పునరుద్ధరణ సమయములో ఇందలి విడి విగ్రహములన్నియు (Loose Sculptures) భీమేశ్వరాలయమునకు ఉత్తరమున నున్న తోటలోనికి తరలింపబడినాయి. అద్భుతమైన రాతి శిల్పములనేకములు నేటికిని ఈ తోటలో పడిఉన్నాయి. ఎర్రఇసుక రాతితో చెక్కబడిన పార్శ్వనాథుని విగ్రహము కాయోత్సర్గ రీతిలో నుండి అతని బాహువులు మోకాళ్ల వరకు విస్తరించి యున్నవి. అతని వెనుక మెలికలు తిరిగిన సర్పము (Coils of the serpent) చెక్కబడి దాని పడగలు అతని శిరముపై గొడుగువలె అలంకార ప్రాయముగా విప్పుకొనియున్నవి. ఈ దిగంబర విగ్రహమునకు ఒక ప్రక్కన శిశువుతో గూడిన స్త్రీ రూపము మలచబడింది. పార్శ్వనాథుడు సంతానసాఫల్యమునకై వచ్చిన తన భక్తులను దీవించేవాడని దీని వలన ద్యోతకమవుతుంది. ఈ ప్రతిమ అడుగుభాగమున నాలుగు పంక్తుల

సంస్కృతశాసనము చెక్కబడిఉంది[15]. రెండవ అరికేసరి లోకాంబికలకు జన్మించిన రెండవ బద్దెగుడనురాజు తన సపాదలక్ష దేశము నందు సుప్రసిద్ధ జైనమతాచార్యుడైన సోమదేవసూరి కొఱకు వేములవాడలో శుభధామజినాలయమును కట్టించెనని ఈ శాసనము తెలుపుతుంది. గౌడ సంఘాధ్యక్షుడగు సోమ దేవసూరి బద్దెగుని విద్యాగురువు.

వేములవాడ ప్రాచీనకాలమున జైనమత కేంద్ర స్థానముగా ఉండేది. చాళుక్యులు జైన మతానుయాయులు. వీరి పరిపాలనా కాలమున జైన మఠములు, జినభవనములు, జైన బసదులు, జినాలయములు నిర్మింపబడినాయి. అనేక తీర్థంకరుల విగ్రహములు ప్రతిష్ఠింపబడినాయి. కాలక్రమమున జైన మతము క్షీణించింది. జినాలయములు, జైనమఠములు పడగొట్టబడినాయి. శిథిలాలయములందలి విగ్రహములు, స్తంభములు శివాలయముల నిర్మాణ మందుపయోగింపబడినాయి. స్థానిక వేణు గోపాలస్వామి దేవాలయ కుడ్యముల నిర్మాణమందట్టి జైనాలయముల శిథిలావశేషములు ఉపయోగింప బడినాయి. రాష్ట్రకూటుల వలె వారి సామంతులైన వేములవాడ చాళుక్యులు జైన మతముతో పాటు వైదిక మతమును పోషించారు. ఆనాడు జైనమతమున వర్ణవ్యవస్థకు స్థానమేర్పడి ఉంది[16].

శాసనాధారమును బట్టి శుభధామజినాలయమును గూర్చి మాత్రమే తెలుస్తుంది. కాని వేములవాడలో వివిధ దేవాలయములందు కనీసము ఒక డజన్ జైన విగ్రహములున్నాయి. ఈ ప్రతిమలన్నియు ఒకే దేవాలయమందు ప్రతిష్ఠింపబడినవని చెప్పుటకు వీలులేదు. ప్రస్తుతము వేములవాడలో ఐదు పార్శ్వనాథుని, మూడు వర్ధమానుని, ఒక గోమతేశ్వరుని విగ్రహములు గలవు. ఇంకను నాలుగు ప్రతిమల అడుగుభాగమున వారి వాహనముల గుర్తులు లేనందున అవి ఏ తీర్థంకరులవో చెప్పుటకు కష్టముగా నున్నది. ఈ ప్రతిమలన్నియు వేములవాడ చాళుక్యుల తొలికాలము నుండి కళ్యాణి చాళుక్యుల పాలనాంతకాలము వరకు సంబంధించినవై ఉంటాయి. ఇవి ప్రధానంగా తొమ్మిది మరియు పదకొండవ శతాబ్దముల మధ్యకాలములో చెక్కబడియుండవచ్చు. వేములవాడలోని గోమతేశ్వరుని శిల్పము నందు బోధన్ ప్రాంతపు శిల్పకళా ప్రభావము మిక్కుటముగా గోచరిస్తుంది.

వేములవాడ చాళుక్యుల తొలి రాజధాని బోధన్ నగరం. ఇచటి జైన దేవాలయములు రూప శిల్ప సౌందర్య విరాజితములు. జైన తీర్థంకరుల ఎత్తైన విగ్రహములతి మనోహరములు. శిథిలమైన బోధన్ దుర్గము నందు నాలుగు జైన శాసనములు లభించినవి. బోధన్‌లో అతి ఎత్తైన జైన తీర్థంకరుల విగ్రహములు తయారు అవుతుండేవి. అందొక విగ్రహము 56 అడుగుల కంటే ఎత్తైనది. ఆ విగ్రహము శిథిలమైనది. దాని మొండెమెన్ని వ్రక్కలైనదో తెలియదు కాని జైన తీర్థంకరుని శిరస్సు మాత్రము బోధన్‌లోని రహదారి బంగళా ఆవరణలో పడిఉంది. ఈ విగ్రహము నాదర్శముగా గొని కర్ణాటక మండలి శ్రావణ బెళగోళలోని విగ్రహము రూపొందింపబడినదని

ప్రతీతి[17]. వేములవాడలోని జైన విగ్రహములు అతి ప్రాచీన శిల్పకళారీతులను కలిగి కొనకొండ్ల మరియు పెదతుంబలమ్‌లోని విగ్రహములను బోలియున్నవి[18].

## ప్రతిమా శిల్పములు (Sculptures and Icons)

ఒకానొక కాలమందు రాజరాజేశ్వర దేవాలయ అరుగుల పై నుండిన అనేక విడి ప్రతిమా శిల్పములు భీమేశ్వరాలయములో ఆగ్నేయదిశయందు గల వరండాలో పడి ఉన్నాయి. ఈ శిల్పరాజము లన్నియు శతాబ్దముల తరబడి నిరాదరణకు గురియై ఎండకు ఎండి వానకు తడిచి రూప విహీనములై అరిగి పోయాయి.

### 1. సప్తమాతృకాఫలకము

ఒక చివరలో వినాయకునితో గూడిన ఈ సప్తమాతృక ఫలకము (Stone Slab) చాలా అఱిగిపోయి (Worn out) ఉంది. ఈ ఫలకముపై బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండీ మరియు గణపతి రూపములు, వాటి ఆసనముల క్రింద వరుసగా హంస, నంది, నెమలి, గరుడ, మహిషము, ఐరావతము, జంబుకము, మూషిక వాహనములు ఆగమ శాస్త్రానుసారముగా చెక్కబడినవి. సప్తమాతృకలందరు మకుటములు ధరించి వాటి వెనుక ప్రభా మండలములతో (Halos) శోభిల్లుచున్నారు. సప్తమాతృకలు సాధారణముగా ధరించు అన్ని ఆభరణములతో చతుర్భుజములను కలిగియున్నారు. ఇది క్రీ.శ. తొమ్మిదవ, పదవ శతాబ్ద కాలముదై యుండును.

### 2. ఇంకొక సప్త మాతృకాఫలకము

ఈ సప్తమాతృకల ఒక చివరలో గణపతి, రెండవ చివరలో వీరభద్రుడు చెక్కబడినారు. ఈ రూపములన్నియు చతుర్భుజములను కలిగి వాటి క్రింద వాహనములు చెక్కబడియున్నవి. సప్తమాతృకలు మకుటములు, కర్ణవలయములు (Ear-Rings) గ్రైవేయకములు, దండ, ముంజేతి, కాలికడియములను (arm-lets, wrist-lets and anklets) ధరించియున్నారు.

**3. సూర్య విగ్రహము** :- కమలపు మొగ్గలను కలిగిన కాడలను పైకెత్తిన ద్విహస్తములతో పట్టుకొని యున్న ఈ చిన్న సూర్య విగ్రహము పాదముల చెంత కొంత విరిగిపోయి ఉంది.

**4. వినాయక విగ్రహము** :- ద్విహస్తములు గల కిరీటములేని ఏనుగు తల గల గణపతి కుడిచేతిలో దంతము ఎడమచేతిలో గల పాత్రలోని మోదకములపై తన తొండపు కొనను నిలిపియున్నాడు.

### 5. జైన చౌముఖ శిల్పము

ఈ జైన చౌముఖ ప్రతిమ లేదా సర్వతోభద్రిక నాలుగు ప్రక్కల పద్మాసనములో నున్న జినుల విగ్రహాలున్నాయి. కడప జిల్లాలోని దానవులపాడు చౌముఖముల కంటె ఇది కొంత

ఎక్కువ పొడవు వెడల్పులను కలిగి ఉంది. పండుగ సమయములందు దీనిని పానవట్టము పై నిలిపి అభిషేకము చేస్తుంటారు[19].

**6. వేరొక జైన చౌముఖము** :- దీనికి నాలుగు ప్రక్కల పద్మాసనములో నున్న జినవిగ్రహముల చేతులు ధ్యానముద్రలోనున్నవి.

**7. జైన చౌవీస శిల్పము**

జైన చౌవీస శిల్పము గూడా చౌముఖ శిల్పము వలెనే యుండి ఒక్కొక్క ప్రక్క మూడు అంతరములను (Three Floors) కలిగి ఆరేసి జైన విగ్రహములు చెక్కబడినవి. ఈ విధంగా నాలుగు ప్రక్కల యందు మొత్తము చౌవీస (Twenty Four) జిన విగ్రహాలున్నాయి. ఈ చౌముఖ మరియు చౌవీస ప్రతిమలు ఏలేశ్వరము, వెల్దుర్తి, అలంపురము, మహానందిలలో భక్తులు మ్రొక్కుబడికై చేయించిన చిన్న చిన్న శివాలయములను (Resembling the votive shrines of siva) బోలియున్నవి[20]. దానవుల పాడులోని ఇలాంటి జైన చౌముఖ ప్రతిమపై రాష్ట్రకూట మూడవ ఇంద్రుని చిన్న శాసనముంది. దీనిని బట్టి వేములవాడలోని చౌముఖములు, చౌవీస ప్రతిమలు గూడా క్రీ.శ. పదవ శతాబ్దమునకు చెందినవని రూఢీగా చెప్పవచ్చు[21].

**8. జినవిగ్రహములు**

నల్లని గ్రానైట్ రాయితో చేయబడి ధ్యానముద్రలో కూర్చొనియున్న రెండు జినవిగ్రహములు ఉంగరాల జట్టును (hair in spiral ringlets) కలిగియున్నవి.

**9. భైరవుడు** :- నాలుగు అడుగుల ఎత్తున్న ఈ భైరవ ప్రతిమ పైహస్తములందు డమరుకము, త్రిశూలము, క్రింది హస్తములందు ఖడ్గము మరియు గిన్నె లేదా పాత్ర (Bowl) ఉన్నాయి.

**10. స్కందుడు** :- ఇది నెమలి పై స్వారి చేయుచున్న షణ్ముఖ విగ్రహము.

ఇవి గాకుండా ఇంకను అనేక నాగశిల్పములు, రెండు సర్పములు తమ పడగలను పైన నిలిపి ఒకటికొకటి పెనవేసికొనిన (Two Nagas entwined with their hoods above) ప్రతిమలు, వినాయక, దేవి, నంది ప్రతిమలనేకములు భీమేశ్వరాలయము లోను, దాని కుత్తరమున నున్న తోటలోను పడిఉన్నాయి. ఈ ప్రతిమా శిల్పముల వలన వేములవాడ చాళుక్యుల మరియు కళ్యాణి చాళుక్యుల కాలములో వేములవాడ గొప్ప శైవ, సౌర, జైన క్షేత్రముగా విరాజిల్లినట్లు ద్యోతకమగుచున్నది.

## 3. గంగాధర

కరీంనగరమునకుత్తరమున 25 కి.మీ. దూరంలో గంగాధర ఒక మండలకేంద్రముగా నున్నది. వేములవాడ రాజధానిగా నేలిన చాళుక్య ప్రభువగు రెండవ అరికేసరి పెద్దకుమారుడు

వాగరాజు గంగాధర ఉపరాజధానిగా కొంతకాలము పాలించాడు. సుప్రసిద్ధ జైనకవి సోమదేవసూరి గంగాధరలో నిలిచి క్రీ.శ. 959లో తన "యశస్తిలక చంపువు" అను సంస్కృత గ్రంథమును పూర్తి చేశాడు. గంగాధర నేలు వాగరాజు రాష్ట్రకూట మూడవ కృష్ణ వల్లభునితో దక్షిణ దండయాత్రల కేగి చిత్తూరు జిల్లాలోని మెల్పాడి వద్ద బస చేయుచున్న సమయమున సోమదేవసూరి తన యశస్తిలక గ్రంథమును పూర్తి చేసెనని ఆ గ్రంథమందే వ్రాయబడి ఉంది[22]. వాగరాజు సవతి తమ్ముడైన రెండవ బద్దెగుడు గూడా గంగాధరకు కొంతకాలము పాలకునిగా ఉండేవాడు. ఆ కాలమందు గంగాధర పట్టణము అమితమైన సిరిసంపదలతో నిండియుండెనని తెలియుచున్నది[23]. పదవ శతాబ్ది మధ్యభాగములో గంగాధర ఒక గొప్ప జైన క్షేత్రముగా విరాజిల్లినందువలన జైన కవి సోమదేవసూరి ఇచటనే నివసించి తన రచనలను కొనసాగించాడు.

## బొమ్మలగుట్ట

వేములవాడ చాళుక్య ప్రభువైన రెండవ అరికేసరి మరియు అతని వారసుల కాలములో గంగాధరకు దక్షిణమున 2 కి.మీ. దూరంలో కొండన్నపల్లి దగ్గర నున్న బొమ్మలగుట్ట వృషభాద్రియను పేరుతో గొప్ప జైన క్షేత్రంగా వెలుగొందింది. కరీంనగర్ నుండి జగిత్యాలకు పోవు రహదారి పై నున్న కురిక్యాల గ్రామము నుండి లేదా గంగాధర నుండి 2 కి.మీ. కాలినడకతో ఈ గుట్టను చేరవచ్చు. పంప మహాకవి సోదరుడైన జినవల్లభుడు వేయించిన సంస్కృత, కన్నడాంధ్ర పద్యములతో గూడిన సుప్రసిద్ధ త్రిభాషా శాసనమొకటి (Trilingual inscription) ఈ గుట్టపై ఉంది. ఈ శాసనాంతమున తెలుగులో చెక్కబడిన చివరి మూడు కంద పద్యములు ఈ ప్రాంతములో తెలుగు భాష యందు తొలి పద్యములుగా గుర్తింపబడినాయి. ఆదికవి నన్నయ్య గావించిన ఆంధ్ర మహాభారత రచన కంటే ఒక శతాబ్దము పూర్వమే ఉత్తర తెలంగాణాలో పద్యములల్లి కవితారచన సాగించుస్థాయికి తెలుగుభాష అభివృద్ధి చెందినదని జినవల్లభుని శాసనమందలి ఈ క్రింది మూడు కందపద్యముల వలన తెలియుచున్నది.

కం॥ జిన భవనంబు లెత్తించుట
జిన పూజల్సేయు చున్కి జినమునులకున
త్తిన యన్న దానం బీవుట
జినవల్లభుడు బోలంగలరె జినధమ్మపరుల్

దినకరు సరి వెల్గుదు మని
జినవల్లభు నొట్ట నెత్తి జితకవి ననను‌ం
మను జుల్గలరే ధాత్రిం
విని తిచ్చిదు ననియవృత్త విబుధ కవీన్ద్రుల్

ఒక్కొక్క గుణంబ కల్గుదు
రొక్కొణ్డిగా కొక్కలక్క లేవెవ్వరికిం
లెక్కింప నొక్కొ లక్కకు
మిక్కిలి గుణ పక్షపాతి గుణమణి గుణంబుల్

కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర రచన గావించిన డా.మలయశ్రీ చివరి తెలుగు పద్యాన్ని ఇప్పటి విధానంలో వ్రాస్తే ఈ క్రింది విధంగా ఉంటుందని తెలిపారు[24].

ఒక్కొక్క గుణమ గల్గుదు
రొక్కొదుగా నొక్క లెక్క లేవెవ్వరికిన్
లెక్కింప నొక్క లెక్కకు
మిక్కిలి గుణ పక్షపాతి గుణమణి గుణముల్

జినభవనములు కట్టించుట, జినసాధువుల పూజలు చేయుట, జినమునులకు నచ్చిన భోజనములు పెట్టుటలో ఇతర జైనులెవ్వరూ జినవల్లభునితో సరిపోజాలరు. సూర్యునితో సమానముగా వెలుగువారును, జినవల్లభునితో సరితూగు మరే కవులునూ లేరు. ఒక్కొక్కరు ఒక్కొక్క సుగుణము కలవారుగా ఉంటారు. ఆలోచించి చూడగా జినవల్లభుడు గుణమణి. పైగా అతడు గుణపక్షపాతియని మూడుకందములందు పేర్కొనబడింది. కందం కన్నడం నుండి తెలుగులోనికి వచ్చిందని, అదీ కరీంనగర్ జిల్లాలో జినవల్లభుని ద్వారానే ఆవిర్భవించిందని డా.మలయశ్రీ అభిప్రాయము. జినవల్లభుడు జైన మతాధిపతిగా సాధు జీవితం గడిపాడు. శాంతి ధర్మ ప్రబోధంతో పాటు త్రిభాషా సాహిత్యాన్ని వెలయించాడు. ఈ జిల్లా ప్రథమాంధ్ర కవిగానే కాక, అఖిలాంధ్ర దేశంలోనే మొట్టమొదట తెలుగులో కందపద్య రచన గావించిన ప్రయోగశీలిగా జినవల్లభుడు చిరస్మరణీయుడై నిలిచినాడు. ఇతడు సంగీతపరుడు, ప్రియభాషణుడు మరియు కవిపుంగవుడు. ఇచటి దిగంబర సంప్రదాయ జైన క్షేత్రం సర్వదా జినభక్తుల సంచారముతో సందడిగా ఉండేది.

ఈ బొమ్మలగుట్ట వృషభగిరి, వృషభాద్రి లేదా వృషభ పర్వతముగా పిలువబడింది. ఈ గుట్ట వృషభాకారములో నుండుటచే ఇది వృషభగిరి యని పిలువబడింది. అంతే గాకుండా ఈ పర్వతముపై వృషభేశ్వరుడు చెక్కబడినాడు కావున ఇది వృషభాద్రిగా ప్రసిద్ధి చెందింది. ఈ గుట్టపైనొక గండశిల ఉంది. ఇది ఇచటి శాసనమందు సిద్ధశిలగా పేర్కొనబడింది. ఈ సిద్ధశిలపై జైనమత ఆద్యంత తీర్థంకరుల మరియు చక్రేశ్వరి బృహత్ప్రతిమలు చెక్కబడినాయి. ఈ ప్రతిమల సమీపమందే జినవల్లభుని శాసనముంది. ఈ శాసనము క్రీ.శ. 945 కాలమునకు చెందింది[25]. ఇచటి జైన ప్రతిమలు జినవల్లభుని కులదైవములుగా పేర్కొనబడినవి. అతడిచట త్రిభువనతిలకమనే జైనబసది కవితాగుణార్ణవమనే తటాకము, మదన విలాసమనే తోటను ఏర్పరచాడు. పంప మహాకవికి కవితాగుణార్ణవుడను బిరుదముంది. తన సోదరునిపై గల

అభిమానము వలన తాను త్రవ్వించిన తటాకమునకు కవితాగుణార్ణవమను పేరు పెట్టి యుండును. కురిక్యాల నుండి గంగాధరకు కాలినడకన పోవు మార్గమందు ఈ గుట్ట దగ్గర నున్న చెఱువే కవితా గుణార్ణవ తటాకమై యుండును. మదనవిలాసమను వనము నేడు కానరాదు. త్రిభువనతిలక యను జైన బసది శిథిలమై అదృశ్యమైనది. కాని ఈ గుట్టచుట్టున్న పొలములందు మరియు గంగాధర గ్రామమునందనేక జైన విగ్రహములు పడిఉన్నాయి. ఇవన్నియు ఈ జైన క్షేత్రమునకు సంబంధించినవై ఉంటాయి. ఇటీవల ఇచటి పొలములందు లభ్యమైన నిలువెత్తు పార్శ్వనాథవిగ్రహము కరీంనగర్ మ్యూజియంనకు తరలింపబడింది. మ్యూజియం గేటులోనికి ప్రవేశించగానే నగునూరు గణపతి, గంగాధర పార్శ్వనాథ విగ్రహములు ఎదురుగానే చూడవచ్చు. ఈ పార్శ్వనాథుని వెనుక మెలికలు తిరిగిన సర్పముండి దాని పడగలు ఛత్రరూపమున తీర్థంకరుని శిరస్సు పైభాగమున అలంకార భూషణముగా నున్నవి.

బొమ్మలగుట్టపై నిలిచియున్న సువిశాల మరియు సమతల సిద్ధశిలపై జినవల్లభుడు చెక్కించిన అతని కులదైవములు, జినదేవత చక్రేశ్వరి, ఆది తీర్థంకరుడైన వృషభుని, అంత్య తీర్థంకరుడైన వర్ధమానుని బృహత్ ప్రతిమలు బహు సుందరముగా నున్నవి. జైన శిల్పములలో అత్యంత అద్భుత చిత్రమైన చక్రేశ్వరి కిరువైపుల సేవకులైన స్త్రీరూపములున్నాయి (Flanked by the lady attendants). చక్రేశ్వరి జినదేవత వృషభుని యక్షిణి. ఆమె మకుటము, గ్రైవేయకములు, కేయూరములు, కంకణములు, కటిబంధము మున్నగు ఆభరణములతో అలంకరింపబడింది. అష్టభుజములను కలిగియున్న ఈమె ఆసనము క్రింద గరుడ వాహనమున్నది. ఈ యక్షిణి భుజముల సంఖ్య వేర్వేరు ప్రాంతములందు వేర్వేరుగా ఉంది. మధురలో దశ భుజములు, దియోఘర్‌లో షోడశ భుజములు, అదే చోట వేరొక ప్రతిమ అష్టభుజములు మరియు ఒరిస్సా యందలి ఉదయగిరిలో పండ్రెండు భుజములతో గూడిన ఈ దేవతా శిల్ప ప్రతిమలున్నాయి[26]. రాజస్థాన్‌లోని మౌంట్ అబూపై గల దిల్వారా ఆలయమందున్న అష్టభుజ చక్రేశ్వరి ఆభరణ భారముతో అందముగా చెక్కబడింది. ఇది పదమూడవ శతాబ్దమునకు చెందింది. పదవ శతాబ్దమునకు చెందిన బొమ్మలగుట్టపై కూర్చొని యున్న జినదేవత కుడికాలు క్రిందికి వ్రేలాడియుండి ఎడమకాలు మలచుకొని ఉంది. కాని దీనికి భిన్నముగా దిల్వారా జినాలయము లోని దేవత కుడికాలు మలచుకొని ఉండి ఎడమకాలు క్రిందికి వ్రేలాడునట్లు కూర్చొని యున్నది[27]. ఆదితీర్థంకరుని శాసనదేవిగా ఈ జినదేవత అత్యంత ప్రాధాన్యతను కలిగియున్నది. వృషభుని యక్షిణిగా ఈమె గరుడ చిహ్నముతో మరియు యక్షుడైన గోముఖుడు వృషభ చిహ్నముతో శిల్పములందు అగబడుదురు[28]. గరుడ చిహ్నముతో చక్రధారిణియైన ఈ చక్రేశ్వరి చక్రధారుడైన శ్రీ మహావిష్ణువు అర్ధాంగి వైష్ణవికోవకు చెందింది. ఈ వైష్ణవి వేరొక నామమే చక్రేశ్వరి. సాధారణముగా యక్షిణుల ప్రతిమలందు వైదిక దేవతల (Brahamanic Goddesses) మరియు అర్ధదేవతలైన (Demi divinities) యక్షుల సంప్రదాయముల మేళవింపు శిల్పము గోచరించును[29].



జైన చక్రేశ్వరి

బొమ్మల గుట్టపై నున్న జైన చక్రేశ్వరి కిరువైపుల ముగ్గురు చొప్పున మొత్తము ఆరుగురు జైన దిగంబరులు చెక్కబడినారు. చక్రేశ్వరి పై భాగమున ఆద్యంత తీర్థంకరులు వృషభుడు మరియు వర్ధమానుడు ఆజానుబాహువులతో నిలబడియున్నారు. ఈ యౌవ్వన దిగంబర విగ్రహములందు మృదుస్వభావముట్టి పడుతుంది. వీరి తలలపైన త్రిఛత్రములు శోభాయమానముగా నున్నవి. ఈ ప్రతిమల సమీపమందున్న వలయములో జినపాదములు చెక్కబడినవి.



ఆద్యంత తీర్థంకరులు



వైష్ణవాలయము

జినవల్లభుడనేక మంది జైనమత గురువులను, పండితులను, కవులను, ఆదరించి పోషించాడు. కవిజనాశ్రయమను ఛందో గ్రంథము మల్లియరేచన యను జైన వైశ్యపుంగవుడు జినవల్లభుని ప్రోత్సాహముతో రచించినట్లు సుప్రసిద్ధశాసన పరిశోధకులు డా.పి.వి.పరబ్రహ్మశాస్త్రి అభిప్రాయము[30]. తరువాతి కాలములో ఈ కవిజనాశ్రయము వేములవాడ భీమకవి పేరప్రఖ్యాతి గాంచినదని పలువురి అభిప్రాయము.

## వైష్ణవాలయము

ప్రాచీన చారిత్రక గ్రామమైన గంగాధరలో నొక వైష్ణవాలయముంది. దానిచుట్టు ప్రహారీగోడ ఉంది. ఒకే అధిష్ఠానము పై నిలిచియున్న గర్భగృహము, అంతరాళము తొలి నిర్మాణాలై ఉంటాయి. తరువాతి కాలములోని మంటపము దాని ముందున్న చిన్న మంటపము (Porch) రెండును వేరొక అధిష్ఠానము పై నిర్మింపబడి ఉన్నాయి. అధిష్ఠానము నందు చతుర్దళ పుష్పాకృతులు చెక్కబడినాయి. ఆలయభిత్తిని అర్ధచంద్రాకారాకృతులతో అలంకరింపబడిన కపోతము (Cornice) గోపురము నుండి వేరుచేయుచున్నది. నాలుగు మధ్యస్తంభములతో (Central Pillars) కూడిన పదహారు స్తంభముల చతురస్రాకారపు మంటపము చుట్టును పిట్టగోడ (Pial) యుండి తూర్పులో పోర్చ్ నుండి లోనికి ప్రవేశించుటకు మార్గమున్నది. అంతరాళ మరియు మంటప లోకప్పు సమతలముగా (Flat roofed) నుండి మంటప మధ్యభాగము మరియు గర్భగృహపు లోకప్పు (Ceiling) లుపవితాన రీతిలో తీర్చిదిద్దబడింది.

దేవాలయ శిఖరం ఎత్తైన పిరమిడ్ ఆకారము (Stepped elongated pyramid form) లో ఉంది. ఆలయ ప్రవేశమునందొక వైపు 4' ఎత్తున్న గరుడ మరియొకవైపు ఆంజనేయ విగ్రహములున్నాయి. ఆలయము ముందు దాదాపు 20' ఎత్తుగల గరుడ స్తంభముంది. దానిపై నుండిన చిన్న మంటపము లోని గరుడ ప్రతిమ ఇప్పుడొక గూటిలో నిలుపబడింది. ఇచటి గరుడస్తంభము కరీంనగర్ జిల్లాలోని వాల్గొండ, చిలువాకోడూరు, నగునూరు, రామగుండం ఆలయముల ముందున్న స్తంభములను పోలియున్నది. మధ్యయుగపు ఈ దేవాలయము నందు ప్రస్తుతము లక్ష్మీదేవి, పద్మావతులతో గూడిన వేంకటేశ్వర విగ్రహము ప్రతిష్ఠింపబడి ఉంది.

# 4. రేపాక

కరీంనగర్‌నకు నైరుతి యందున్న కుగ్రామమైన రేపాకకు బెజ్జంకి నుండి లేదా సిరిసిల్ల గుండా చేరవచ్చు. వేములవాడ నేలిన మూడవ అరికేసరి క్రీ.శ. 966లో జారీ చేసిన పర్భిణి తామ్రశాసనమందు రేపాక ప్రసక్తి ఉంది[31]. సోమదేవ సూరి కొరకు తన తండ్రి బద్దెగుడు నిర్మించిన శుభధామ జినాలయ మరమ్మతులకు, సున్నము వేయుటకు, నైవేద్యములకై సబ్బి సహస్రములోని రేపాక ద్వాదశాంతర్గత వనికటుపలు గ్రామమును దానమిచ్చు సందర్భమునందు మూడవ అరికేసరి పై తామ్రశాసనమును వేయించాడు. ఈ శాసనమును బట్టి రేపాక

పన్నెండు గ్రామములకు పాలనా కేంద్రముగా నుండెనని తెలుస్తుంది.

రేపాక గ్రామమున మాధ్యమిక పాఠశాలకు చేరువలో నున్న చేనులో పడియున్న స్తంభముపై నాలుగు ప్రక్కల చెక్కబడిన 116 పంక్తుల శాసనమొకటున్నది[32]. శక సంవత్సరము ప్రభవ ఫాల్గుణ శుద్ధ త్రయోదశి బృహస్పతి వారము క్రీ.శ. 968 ఫిబ్రవరి 14న వేయబడిన ఈ శాసనము మూడవ అరికేసరి రేపాక యందొక జినాలయము నిర్మించినట్లు తెలుపుచున్నది. ఇదియే ఖలివుత్తు జినాలయము. శాసనమందలి పంక్తుల మొదటి అక్షరములు చాలా మట్టుకు అరిగి పోయినందున జినాలయము పేరు అస్పష్టముగా నున్నది. అరిగిన అక్షరములు వదలినచో ప్రస్తుతము ఖలివుత్తు జినాలయమని చదువవచ్చు. శ్రీమద్విట్టకుల వంశీయులగు కామ,రామ, తుక్కయ, రేవణ, పుణ్యారామ, కొమ్మయ్య మున్నగువారు ఇందులో పేర్కొనబడినారు. అటుకూరు-70, పమ్మి-12 ప్రాంత పాలకులైన శ్రీమద్విట్టకుల సంభవులగు జైనమతానుయాయుల విషయమిందు వర్ణితము.

ఈ శాసనశిల మొదటి రెండుప్రక్కలు కన్నడ భాషలో నున్నవి. మూడవ, నాలుగవ ప్రక్కలు సంస్కృత భాషలో చెక్కబడ్డాయి. ఈ శాసనాంతమున వ్యాసగీతాశ్లోకములున్నవి. తరువాత కన్నడ వచనముంది[33].

## 5. ధర్మపురి

కరీంనగర్ నుండి 65 కి.మీ. దూరంలో, జగిత్యాల నుండి 27 కి.మీ. దూరంలో పవిత్ర గోదావరి నది తీరమందున్న ధర్మపురిని చేరవచ్చు. ఇచట గోదావరినది ఉత్తరము నుండి దక్షిణదిశకు ప్రవహించుట విశేషం. ఈ గోదావరి కరీంనగర్ ఆదిలాబాద్ జిల్లాలకు మధ్య సరిహద్దుగా ఉంది. దీనిలో పవిత్రస్నానము లాచరించుటకై బ్రహ్మగుండం, చక్రతీర్థం, యమగుండం, వసిష్ఠగుండం, సత్యావతి గుండం, గొల్లమడుగు అను గోపికాతీర్థం మున్నగు గుండాలున్నాయి. ధర్మపురి ప్రాచీన ప్రాశస్త్యమును, చారిత్రక విశేషములను, పూర్వ వైభవమును తెలుపు దేవాలయములనేకములు ఇక్కడ ఉన్నాయి.

శ్రీమహావిష్ణువు అవతారమైన నృసింహస్వామి దేవాలయము ఇచట నుండుట వలన ధర్మపురి గొప్ప హైందవ క్షేత్రముగా విరాజిల్లినది. శక సంవత్సరము 850 అనగా క్రీ.శ. 928కి సంబంధించిన "ధర్మపురి క్షేత్ర మహాత్మ్యము" అను స్థలపురాణము ఈ ప్రాంత విశిష్టతను తెలియచేస్తుంది[34]. ఇది 105 అధ్యాయములు, 3500 సంస్కృత శ్లోకములతో కూడుకొనిన తాళపత్రగ్రంథము. శాసనములందు, సాహితీ గ్రంథములందు ధర్మపురి నామము గోచరిస్తుంది. పంప మహాకవి సోదరుడైన జినవల్లభుడు బొమ్మలగుట్టపై నున్న సువిశాల సమతల సిద్ధశిలపై క్రీ.శ.945లో వేయించిన కురిక్యాల శాసనమునందు ధర్మపురి 'ధర్మవురము' లేదా ధర్మపురముగా పేర్కొనబడింది[35]. వేములవాడ పాలకులందరిలో అతి శ్రేష్ఠుడైన రాజన్యుడు రెండవ అరికేసరి

(క్రీ.శ. 930-955) తన ఆస్థాన కన్నడకవి పంపడు రచించిన విక్రమార్జున విజయమను పంప మహాభారత రచనకు సంతసించి ధర్మపురమును అతని కగ్రహారముగా నొసంగెనని పై శాసనము తెలుపుచున్నది. ధర్మపురిలోని రామలింగేశ్వరాలయావరణలో నిలిచియున్న అరిగిపోయిన విరిగిపోయిన (Much abraded and broken inscription) కాకతీయ గణపతి దేవచక్రవర్తి కాలపు క్రీ.శ.1246 శిలాశాసనమందు వైజనాథ, సూర్యదేవరలకు దానములు ఇవ్వబడినట్లు పేర్కొన బడింది[36]. ఇదే శిలా స్తంభముపై పూర్వపు శాసనమొకటి ఉండెననియు అది కళ్యాణి చాళుక్య చక్రవర్తి ఆఅవ విక్రమాదిత్యుని కాలమున (క్రీ.శ.1076-1126) వేయబడినదనియు అందు రామేశ్వరస్వామి కిచ్చిన దానములు స్పష్టముగా తెలియదము లేదనియు ఆం.ప్ర. పురావస్తుశాఖలో శాసన పరిశోధనా విభాగములో పనిచేసిన ధర్మపురి నివాసి కీ.శే.సంగనభట్ల నరహరి త్రిశతి గ్రంథము నందు తెలిపినారు[37].



దేవాలయముల సముదాయము

క్రీ.శ. 1323లో కాకతీయ సామ్రాజ్య పతనానంతరము ఓరుగల్లు మహ్మదీయుల వశమైంది. కాని కాపయనాయకుడు క్రీ.శ. 1336లో తిరిగి ఓరుగల్లును వశపరచుకొని తన సన్నిహితుల ననేకులను వివిధ ప్రాంతములందు పాలకులుగా నియమించాడు. గురజాల తెలుగున్నపాలుని కుమారుడైన ముప్పభూపాలుని రామగిరి దుర్గము రాజధానిగా గోదావరికి దక్షిణమున నున్న సబ్బినాడు ప్రాంతము నేలుటకై నియమించాడు. ముప్పభూపాలుని మంత్రి కేసన మిగుల సమర్థుడు. ఇతని సోదరుడు కందనామాత్యుడు ఎల్లందల పాలకునిగా ఉండెను. మడికి సింగన రామగిరి ఆస్థాన కవిగా నుండి శక సంవత్సరము క్రీ.శ.1342లో అనగా క్రీ.శ.1420లో పద్మపురాణోత్తర ఖండమును రచించి దానిని వెలిగందుల కందనకు అంకితమిచ్చాడు. ఈ గ్రంథమందు రామగిరి కేసనామాత్యుడు ధర్మపురిలో అన్న సత్రము పెట్టించి లక్ష్మీనృసింహస్వామి వారికి ఉత్సవాదులు జరిపించి దానములొసంగెనని పేర్కొనబడింది[38].

చివరి కుతుబ్‌షా అబుల్ హసన్ తానీషా ప్రధానమంత్రి మాదన్న క్రీ.శ. 1676లో ధర్మపురి లక్ష్మీనరసింహస్వామి ఉత్సవములకు మరియు నిత్యపూజలకై అక్కడి బ్రాహ్మణులకు భూదానములిచ్చాడు. మాదన్న కాలపు ప్రభుత్వ ముద్రతో గూడిన సనదు పత్రములు (Manuscript documents with the official seal of Madanna) నేడు మునగాల చిద్రూపయ్య పంతులు వారి మరియు వజ్జలవారి పత్రములు అనే పేరట పిలువబడుచున్నవి[39]. ఐదవ నిజాం అఫ్జలుద్దౌలా కాలములో క్రీ.శ. 1858 కాళయుక్తి కార్తీక బహుళ దశమి మంగళవారము రోజున ధర్మపురిలో రోహిల్లాలు బీభత్సము సృష్టించి గ్రామము నంతటిని దోచుకొన్నారు. ఆనాటి ప్రజల ఆక్రందనలను నృసింహదాసుకవి "రోహిల్లాలపాట" రూపములో వ్రాశాడు. అదే సంవత్సరములో పుష్య బహుళ ఏకాదశినాడు ధర్మపురిలోని ఉభయ నరసింహ దేవాలయములందు సంప్రోక్షణ చేశారు[40].

సాహిత్యపరంగా, ఏకామ్రనాథుని ప్రతాపచరిత్రము, కొఱవిగోపరాజు సింహాసన ద్వాత్రింశిక, పోతన నారాయణశతకము, పింగళి సూరన కళాపూర్ణోదయము, చరిగొండ ధర్మయ్య చిత్రభారతము, చరిగొండ హన్మయ్య జ్యోతిష రత్నాకరము, శేషప్ప లేదా శేషాచలదాసు నృసింహ, నరసింహ, నృకేసరి శతకములు, నరసింహదాసు రోహిల్లాలపాట, మైరావణ చరిత్ర యక్షగానములు, మున్నగు గ్రంథము లందు మరియు కీ.శే. సంగనభట్ల నరహరి సేకరించిన ప్రాచీన వ్రాత పత్రములందు (Old Manuscripts) ధర్మపురి ప్రసక్తి ఉంది. 1956లో కొరిడె సదాశివశాస్త్రి, 1979లో యం.శ్యాంసుందరశాస్త్రి ప్రచురించిన ధర్మపురి క్షేత్ర మహాత్మ్యగ్రంథములు గూడా ధర్మపురి గురించిన వివరాలను తెలియజేస్తాయి.

ధర్మపురిని తొలి శతాబ్దములలో బౌద్ధభిక్షువులు 'ధమ్మపురి' యని పిలిచెడివారు. ఇచటి తొమ్మిదవ శతాబ్దపు అముద్రిత డెక్కల బండ శాసనమందు ఇది 'ధర్మ్మారమని' పేర్కొనబడింది. రాష్ట్రకూటులకు లోబడి పరిపాలించిన వేములవాడ చాళుక్యరాజు బద్దెగుని (క్రీ.శ. 850-895) సామంతుడగు హైహయ వంశోద్భవుడు అయ్యవర్మ చేసిన భూదానములీ డెక్కల బండ శాసనమందు పేర్కొనబడినవి. కరీంనగర్ జిల్లాలో ఇంతవరకు లభ్యమైన శాసనములలో కోటిలింగాలలోని బ్రాహ్మీలిపి లేఖనములు తప్ప ధర్మపురిలోని ఈ డెక్కల బండ శాసనమే అతి ప్రాచీనమైంది[41].

15వ శతాబ్ది నుండి యున్న అనేక దానపత్రములు (Manuscripts) మహ్మదీయ కాలము నాటి సమాచారాన్ని తెలియజేస్తాయి. వాటిలో భర్తునిపేట దాన పత్రము, ఇందవరపు వారి పత్రములు, గోలకొండ మంత్రి మాదన్న పత్రము, ఇనుంగంటి, జువ్వాడి, గూడూరి వెలమదొరల, గందేవారి యెల్లాపు దొరల, నమిలెవారి బ్రాహ్మణకరణం వారి పత్రములు ధర్మపురి విశేషాలను తెలియచేస్తాయి. అంతే గాకుండా సంగనభట్ల, మునిగెల, పాలెపు, పణతుల, చక్రవర్తుల, రావులకొలను, పార్నంది మున్నగు వారి పత్రములు గూడా ధర్మపురి గత సమాచారము నందిస్తాయి. ఏడవ నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ కాలములో ధర్మపురి వాసుల వినతి పత్రములను

మన్నించి అతని వజీరు మహరాజాకిషన్ ప్రసాద్ బహదూర్ ధర్మపురి వారి నుండి నాలుగవ వంతు భూమిశిస్తు మాత్రమే గ్రహించుటకు తగు ఆదేశములిచ్చాడు[42].

మున్యాశ్రమముగా పేరు తెలియని ఈ క్షేత్రము ధర్మవర్మ కారణముగా ధర్మపురి మహాక్షేత్రమై చారిత్రకయుగమున అద్వితీయ వైభవమునను భవించింది. స్కందపురాణాంతర్గతమని చెప్పబడు ధర్మపురి క్షేత్రమహాత్మ్యము నందు బలవర్మ నందనుడగు ధర్మవర్మ ఇచటి లక్ష్మీనృసింహుని గురించి తపమాచరించి, అతని కటాక్షమున తన పేరట ఈ క్షేత్రమునకు ధర్మపురి నామము కలుగవలెనని వరములు పొందినట్లు తెలుస్తుంది. పరమ సాధ్వియగు సత్యవతి సర్పరూపియగు తన భర్తతో ఇచటి గోదావరిలో స్నానమాడి యౌవన పురుషుడుగా భర్తను పొందెనని ఇందు వర్ణింపబడింది. వారు స్నానమాచరించిన స్థలమే నేడు సత్యవతి గుండముగా పిలువబడుచున్నది[43].

వేదవేదాంగ శాస్త్రాగమ నృత్య గీత నాట్యాదులందారి తేరిన ధార్మిక ప్రజానీకముతో, అనంత కాలగతిలోని వివిధ ప్రభుత్వముల ఏలుబడిలో మతసామరస్యముతో కలిమిలేముల ఒడిదుడుకులతో మనగలిగి ఈ గ్రామము వర్ధిల్లినది. వేదవేదాంగములందు, యజ్ఞయాగాదులందు ఆరితేరిన విప్రవరులెందరో అనేక రాష్ట్రములలోని పలు సంస్థానములందు పారితోషికముల బడసినారు. అట్టి వారిలో ఇందవరపు, సంగనభట్ల, కొరిడె, రొట్టె, పణతుల, పాలెపు, నార్వాభట్ల కుటుంబముల ప్రముఖుల నేకులున్నారు. గర్షకుర్తి గదాధరశాస్త్రి, బొజ్జగ గదాధరశాస్త్రి, భావి వెంకట కృష్ణశాస్త్రి, పార్నంది ధర్మశాస్త్రి, రావులకొలను నర్సన్నశాస్త్రి, పాత పాపయ్యశాస్త్రి, రొట్టె వాసుదేవమూర్తి మున్నగు వారెందరో 18,19 శతాబ్దములందు వర్ధిల్లారు. భక్తి పారవశమున భగవన్నామ మాచరించిన శేషప్ప, అతని బంధువు నృసింహదాసులు సుప్రసిద్ధులు.

ప్రాచీనార్ష విజ్ఞాన సభ్యతా సంస్కృతులకు భక్తి ప్రపత్తులకు నేటికిని కాణాచిగా నిలిచిన ఈ సనాతన తీర్థక్షేత్రము గంభీర గౌతమీ తటమున నెలకొని ఆస్తిక ప్రపంచమునకు భక్తి, ముక్తి నిచ్చుచున్నది.

## పాతనరసింహ (యోగానంద) స్వామి దేవాలయం

ప్రస్తుతం ధర్మపురిలో ఇది అత్యంత జనాదరణ గల దేవాలయం. ధర్మపురి ప్రజలు దీనిని క్రీ.శ.1724-1750 మధ్యకాలములో నిర్మించినట్లు సంగనభట్ల నరహరి వద్ద నున్న పత్రముల వలన (Manuscripts) తెలియుచున్నది[44]. క్రీ.శ.1794లో చెన్నమనేని జోగారాయుడు శ్రీ లక్ష్మీనృసింహునికి వెండి భూషణముల జేయించి కోవెల ప్రహారి లోపల రాయి పరిపించాడు. పోలాస, దీవికొండ పర్గణాల దేశ్‌ముఖ్‌లు గందెవారు, జువ్వాడివారు ప్రతి ఏట స్వామి వారి కళ్యాణోత్సవములకు వలయు సర్వమంగళ ద్రవ్యములను వంశపారంపర్యంగా సమర్పించుటకు తగు నియమములు ఏర్పాటు జేశారు[45].

రాతి ప్రాకారములో గల ఈ దేవాలయము గర్భగృహము, దాని ముందు 48 స్తంభముల

మంటపమును కలిగియున్నది. అధిష్ఠానము విశాలపట్టిక, అర్ధచంద్రాకారశిలలతో గూడిన జగతిని కలిగియున్నది. భిత్తి నుండి కపోతము శిఖరమును వేరు చేయుచున్నది. పిరమిడ్ ఆకారములో (Stepped Pyramidal Form) శిఖరమున్నది. గర్భగృహమందు ఉగ్రరూపములో గాకుండా యోగరూపములో యోగానంద లక్ష్మీనరసింహస్వామి విగ్రహముంది. గర్భగృహ అధిష్ఠానము వేరుగా నుండుటచే మంటపము తరువాత కాలానికి చెందినదై యుండును. మంటపము చుట్టు పిట్టగోడ (Parapet wall) యుండగా తూర్పు, ఉత్తర, దక్షిణముల నుండి మంటపమును ప్రవేశింపవచ్చు.



శ్రీ లక్ష్మీనరసింహస్వామి

ఈ దేవాలయము ముందు నల్ల గ్రానైట్ రాయితో నిర్మింపబడిన కాకతీయుల కాలము నాటి నాలుగు స్తంభముల కళ్యాణమంటపముంది. ఈ నాలుగు స్తంభములు సొంతము అనేక ప్రతిమా శిల్పములు కలిగియున్నవి. ఇతిహాసగాథలు, మత్స్య, కూర్మ, వరాహ, నటరాజ, నరసింహ, రామలక్ష్మణుల మున్నగు చిత్రములు చెక్కబడినవి. ముస్లిముల దుశ్చర్యల వలన ఈ చిత్రశిల్పములు అంగచ్ఛేదములైనాయి. ఈ మంటపము పదకొండవ, పన్నెండవ శతాబ్దమునకు చెందిన కాకతీయుల నిర్మాణము గనుక ఇచ్చోట ప్రప్రథమము నుండియే నృసింహ దేవాలయము నిలిచి యుండును. ఆసఫ్‌జాహీల పాలనారంభకాలములో అనగా 18వ శతాబ్దపు ప్రథమార్థములో ధర్మపురి వాసులు శిథిలమైన ప్రాచీన దేవాలయమున్న చోటనే ప్రస్తుత పాత నరసింహదేవాలయ పునఃనిర్మాణము గావించి యుందురు. ఈ ఆలయ ప్రాంగణములో అష్టదిక్కులయందు నరసింహస్వామి ప్రీత్యర్థము భక్తాంజనేయ విగ్రహములు ప్రతిష్ఠింపబడుట విశేషము.

ఈ ఆలయ మంటపమందు బ్రహ్మ, బలరామకృష్ణుల ప్రతిమలు నిలుపబడినవి. కాని ప్రస్తుతము ఒక బలరామ విగ్రహమే మంటపమందున్నది. కృష్ణుని ప్రతిమ కరీంనగర్ మ్యూజియంకు తరలింపబడింది.



కాకతీయుల మంటపము



మంటప స్తంభము

బ్రహ్మ:- చతుర్భుజములతో ఆరడుగల ఎత్తున్న శిలాఫలకము పై చెక్కబడిన విగ్రహమిది. పై నున్న కుడి హస్తములో శృకము ఎడమ హస్తములో వేదాలు, క్రింది ఎడమ హస్తము అక్షమాలతో గూడిన అభయముద్రలోను కుడి హస్తము ఎడమ ప్రక్కకున్న గదపై నిలుపబడినట్లున్నవి. ప్రతిమలో నున్న మూడు ముఖములలో మధ్యముఖమునకు గడ్డము చెక్కబడిఉంది. శిలాఫలకము కావున నాలుగవ ముఖమగబడుటకు వీలులేదు. బ్రహ్మజటామకుటము ధరించి కర్ణకుండలములు, హారములు, దండ ముంజేతి కడియములు, చీలమండలకు కడియములు, పాదములకు నూపురములు ధరించియున్నాడు. అతని కుడివైపున క్రింది భాగమున హంస వాహనమున్నది. మహారాష్ట్రమందలి ఠానా జిల్లాలో గల సోపరయందు గల బ్రహ్మవిగ్రహము యొక్క మధ్యముఖము గడ్డముతో చెక్కబడి ధర్మపురిలోని బ్రహ్మప్రతిమను పోలియున్నది[46].



బ్రహ్మ



బలరాముడు



శివాలయం గణపతి

**బలరాముడు:-** ద్విహస్తములతో నున్న ఈ ప్రతిమ మకుటము, గ్రైవేయకములు, కేయూరములు, కంకణములు, వనమాల, చీలమండ కడియములు, పూసలతో గూడిన నూపురములతో అలంకరింప బడింది. కుడికాలును ఎడమ వైపు త్రిప్పి వ్రేళ్లపై మోపబడింది. రెండు చేతుల వేణువు ధరించి ఒకకొన పెదవులపై నిలుపబడింది. అతని హస్తముల వ్రేళ్లన్నియు ఉంగరములతో అలంకరింపబడినాయి. క్రింది భాగమున అతని కిరువైపుల చామర గ్రాహిణుల శిల్పములున్నవి. ప్రతిమ వెనుక మకరతోరణము, కుడివైపున అతని చిహ్నము హలము, ఎడమవైపు వేణువు ఒర (Case) చెక్కబడియున్న ఈ మనోహర శిల్పము చూపరుల దృష్టినాకర్షిస్తుంది.

**శ్రీకృష్ణుడు :-** ఇది 4' ఎత్తు గల నల్ల గ్రానైట్ రాతి విగ్రహము. శ్రీకృష్ణుడు త్రిభంగములో నిలబడి కుడికాలును ఎడమవైపునకు త్రిప్పి వ్రేళ్లపై మోపినాడు. ఇది అష్టభుజప్రతిమ. కుడివైపున నున్న నాలుగు చేతులలో మొదటి చేతి వ్రేలుపై గోవర్ధనగిరిని ఎత్తినాడు. రెండవ, మూడవ హస్తములందు శంఖము, ఖడ్గములున్నాయి. ఎడమవైపున్న మూడు హస్తములందు పద్మము, గద, చక్రము గలవు. మిగిలిన రెండు చేతులలో మురళి ఉంది. కాని విరిగిపోయింది. శ్రీకృష్ణుడు మకుటము, కర్ణకుండలములు, కటిబంధము, వనమాల, కేయూరములు, కంకణములు, చిన్నవ్రేళ్లకు ఉంగరములు చీలమండ కడియములు, నూపురములు ధరించియున్నాడు. అతినికిరువైపుల క్రింది భాగమున చామర గ్రాహిశిల్పములున్నాయి. ఈ ప్రతిమ గోవర్ధనధారి కృష్ణునిది గనుక ఆవులు, దూడలు చెక్కబడినాయి. ప్రస్తుత మీ ప్రతిమ కరీంనగరములోని ప్రభుత్వ మ్యూజియం నందు నిలుపబడినది.

**గరుడుడు:-** ఎగురుచున్న రెక్కలు గల గరుడుడు రెండు చేతులు జోడించి అంజలి ఘటించు రూపమున మలచబడినాడు.

## అరువది స్తంభముల దేవాలయము The Sixty Pillared Temple

బహమనీ సుల్తాన్ అహ్మద్‌షా (క్రీ.శ. 1422-1436) కాలములో అజీమ్‌ఖాన్ సేనాని ధర్మపురిలోని ఆలయమును ధ్వంసము చేశాడు. అది నేటి మసీదు దేవాలయమై ఉంటుంది. క్రీ.శ. 1448 ప్రభవ సం॥లో అరవై స్తంభములతో గూడిన నూతన దేవాలయము దాని ప్రక్కనే నిర్మింపబడింది. అందులో నరసింహస్వామి విగ్రహము ప్రతిష్ఠింపబడింది[47]. ప్రస్తుత మీ దేవాలయ మందు శ్రీ వేంకటేశ్వరస్వామి విగ్రహముంది. తూర్పు దిశయందు 12 స్తంభములు పడిపోవుట వలన ఇప్పుడిది 48 స్తంభములపై నిలబడియున్నది. అధిష్ఠానమునందు ఉపానము, పట్టిక, అర్ధచంద్రాకృతి శిలలతో గూడిన జగతి, కుముదము, వేది అగబడుచున్నవి. ఈ ఆలయ మంటపము చుట్టు ఎలాంటి పిట్ట గోడలేదు. మంటపము యొక్క పై కప్పు చూరు కొంత వంపును కలిగి యుండి (Cornice with slight slant) అచ్చటచ్చట శిథిలమైయున్నది.

## క్రొత్త నరసింహ దేవాలయము

అన్నదానపరులగు పణతుల నారాయణ దీక్షితులవారు శకసంవత్సరము 1725 అనగా క్రీ.శ. 1803లో నూతనముగా ఆలయము నిర్మించి (క్రొత్తగుడి) యోగానందలక్ష్మీ నృసింహస్వామిని ప్రతిష్ఠించారు. జువ్వాడి దేశ్‌ముఖ్ ధర్మజగపతిరావు ఈ స్వామి వారికి కానుకలు సమర్పించి సకలోత్సవములకు తగు ఏర్పాట్లుజేసినాడు. మసీదు వెనుకనున్న ఈ దేవాలయము తూర్పు ముఖమును కలిగిఉంది. ఈ ఆలయమందు గర్భగృహము, అంతరాళము, దాని ముందు మంటపములున్నాయి. పూర్వము ఈ ఆలయమునకు అష్టదిక్కులయందు అష్టదిక్పాలకులు వేర్వేరు శాలలలో ప్రతిష్ఠింపబడిరి. ప్రస్తుతము ఇంద్రుడు అతని వాహనము ఐరావతముతో నొక శాలయందుండగా, రెండు తలలు గల అగ్ని వేరొక శాల (Miniature Shrine) లో అతని వాహనము మేషముతో నిలబడియున్నాడు.

## వేణుగోపాలస్వామి ఆలయము

క్రొత్త నరసింహస్వామి గుడి నిర్మించిన కాలములోనే భూంపల్లి చలం అను భక్తుడు వేణుగోపాలస్వామి ఆలయమును కట్టించాడు. దీనికి అర్చకుడుగా జువ్వాడి దేశ్‌ముఖ్‌లచే ఇందుర్తి శ్రీనివాసాచార్యులు నియమింపబడినాడు[48]. ఇది అరవది స్తంభముల గుడి వెనుక తూర్పు ముఖముతో నిలిచిఉంది. ఈ దేవాలయమందు వేణుగోపాలస్వామి మరియు కొందరు ఆళ్వారుల శిల్పప్రతిమలు గలవు. ప్రవేశమునకు ముందు ఎడమవైపు ఆంజనేయ, కుడివైపు గరుడ విగ్రహములున్నాయి.

## రామలింగేశ్వరాలయము

పది,పదకొండవ శతాబ్దములకు చెందిన ఈ దేవాలయము చుట్టు పది అడుగుల ఎత్తుగల రాతిప్రాకారము కలదు. నరసింహ దేవాలయమునకు ఈశాన్యదిశయందు గల ఈ దేవాలయము తూర్పు ముఖమును కలిగి ఉంది. ఆలయ ప్రాంగణములోనికి ప్రవేశము పొందుటకు గల ముఖద్వారము లలాటమున గజలక్ష్మి, దాని పై ఉబికి వచ్చిన చూరు (Projecting Cornice), ద్వారపుశాఖల క్రింది భాగమున శైవ ద్వారపాలకుల కిరువైపుల చామరగ్రాహి శిల్పములున్నవి. ద్వారపాలకుల పైరెండు హస్తములందు దమరుకము, కపాలములుండగా క్రింది ఎడమ హస్తములో గద, కుడిహస్తము అభయ ముద్రలో చెక్కబడినది. ప్రాకారము లోపలివైపు ప్రవేశద్వారము నానుకొని 16 స్తంభముల మంటపమున్నది. ఈ మంటపము మధ్య నుండి లోనికి ప్రవేశించుటకు మార్గమున్నది. మార్గమునకు అటు, ఇటు రెండు వైపుల ఎత్తైన అరుగులున్నవి. ఈ అరుగులపై ఒక్కొక్కవైపు ఎనిమిది స్తంభములున్నవి. ఈ అరుగుల క్రింది భాగమున చతుర్దళముల పుష్పాకృతులున్నవి.

ఈ దేవాలయమందు గర్భగృహము, అంతరాళము, ముఖమంటపము, దాని ముందు రెండు స్తంభములపై నిలబడియున్న చిన్న మంటపము (Porch) ఉన్నాయి. తూర్పు నుండి లోనికి ప్రవేశింపవచ్చు. ఈ ఆలయ ఎత్తైన అధిష్ఠానమందు ఉపానము, పట్టిక, జగతి, కుముదము వేది అగబడుచున్నవి. అధిష్ఠానము పై నున్న చూరు (Cornice) అర్ధచంద్ర శిలలతో అలంకరింపబడియున్నది. దానిపై భిత్తి పెద్ద పెద్ద శిలలతో నిర్మింపబడింది. గర్భగృహముపై నాగరరీతిలో నున్న చాపరేఖాకృతి శిఖరముపై (Curvilinear Sikhara) రాతి ఆమలకము, దానిపై గుండ్రని శిలాకలశము నేటికి నిలిచిఉన్నాయి. చాళుక్య కళారీతులలో శిఖరము ముందు అడుగు భాగము నుండి శుకనాసము నిర్మింపబడింది.



రామలింగేశ్వరాలయం

మెట్లు ఎక్కిలోనికి ప్రవేశించగానే దీర్ఘచతురస్రాకారపు మంటపములో ఎనిమిది స్తంభములు వాటికి అనుబంధ కుడ్యస్తంభములున్నాయి. వీటి పైనున్న లోకప్పు పన్నెండు విభాగములుగా నుండి కదలికాకరణ పద్ధతిలో (లుపవితాన పద్ధతిలో) దర్శనమిస్తుంది. తూర్పు, ఉత్తర, దక్షిణముల నుండి మంటపములోనికి ప్రవేశములుండగా పడమట గర్భగృహమున్నది. గర్భగృహములోని సైకత లింగమును శ్రీరామచంద్రుడు దండకారణ్యములో సంచరించు సమయమున నిలిపినాడని స్థానికుల కథనము. గర్భగృహములోని దేవి విగ్రహము పైచేతులలో డమరుకము, త్రిశూలము, క్రింది హస్తములందు ఖడ్గము, గిన్నె (Bowl) ఉన్నాయి.

రామలింగేశ్వరాలయ ప్రాంగణమునందే ఈశాన్య దిశలో నున్న చిన్నగుడి (Small shrine) యందు అతి పెద్ద గణపతి విగ్రహముంది. చతుర్భుజములతో, చాటల లాంటి అతి పెద్ద చెవులతో, తలపై కరండ మకుటమును ధరించిన గణపతి కూర్చొనియున్నాడు. రామలింగేశ్వరాలయ మంటపము నందనేక విడిప్రతిమా శిల్పములున్నాయి.

**1. సప్తమాతృకల ఫలకము:-** ఏడుగురు దేవతలు చెక్కబడిన ఈ శిలాఫలకము నందు ఒక చివరలో వినాయకుడు మరియొక్క చివరలో వీరభద్రుడు చెక్కబడినారు. వీరందరి ఆసనముల క్రింద వారి వారి వాహనములు చెక్కబడినాయి. చతుర్భుజములు గల సప్తమాతృకలు మకుటములతో నుండి సాధారణమైన అభరణములన్నియు ధరించియున్నారు.

**2. మహిషాసురమర్దని:-** అందంగా నున్న ఈ దేవతా శిల్పము యొక్క చేతులన్నియు ఛేదింపబడినాయి. మహిషుడు జంతురూపమున నున్నాడు.

**3.ఆలింగనమూర్తి :-** కూర్చొని యున్న ఈ ప్రతిమ కుడికాలు వ్రేలాడుచుండగా, మలచిన ఎడమకాలు (Folded left leg) పై దేవి చెక్కబడింది. పై నున్న కుడిహస్తము నందు నాగసర్పముచే చుట్టబడిన దమరుకము, ఎడమ హస్తమునందు త్రిశూలము, క్రింది కుడిహస్తము అభయముద్రలో నుండగా, అక్షమాలతో గూడిన ఎడమహస్తము దేవి నడుముచుట్టు నిలుపబడియున్నది. అలంపురములో నున్న తొలిచాళుక్యుల కాలపు ప్రతిమలను ఇది పోలియున్నది[49].

**4. స్కందుడు :-** ఆరుముఖములు గల అందమైన ఈ ప్రతిమ నెమలి వాహనముతో ఉంది.

**5. గౌతమ, అహల్యల ప్రతిమ :-** కూర్చొని యున్న దంపతులు గౌతముడు, అహల్య అంజలి ముద్రలో శోభాయమానముగా నున్నారు.

రామలింగేశ్వరాలయ ప్రాంగణములో వీరగల్లుల, నంది, నాగదేవత, తదితర విగ్రహము లనేకములు పడిఉన్నాయి. ఆలయము ముందు 25 అడుగుల ఎత్తున్న స్తంభముపై పూర్వమొక చిన్న మంటపములో నంది నిలుపబడి ఉండేది. కాని ఒక స్తంభము మాత్రమే నేడు నిలిచి ఉంది.

## సత్యవతి దేవాలయము

ఎత్తైన ప్రదేశములో నున్న ఈ దేవాలయము కేవలము చతురస్రాకారపు గర్భగృహముతో తూర్పు ముఖమును కలిగియున్నది. ఇందులో లక్ష్మీనరసింహస్వామి ప్రతిష్ఠింపబడియున్నను ఇది సత్యవతి ఆలయంగానే స్థానికులచే పిలువబడుతుంది. ఈ ఆలయము ముందు దాదాపు 25 అడుగుల ఎత్తుగల ఎర్ర ఇసుకరాతి స్తంభము (Red Sand Stone Pillar) ఉంది. దీనివలన ఈ ఆలయములోని దేవుడిని స్తంభ నరసింహస్వామి అని అంటారు. పౌరాణికగాథలోని సత్యవతి తన పాతివ్రత్యమును చాటుటకై ఈ స్తంభమును నిలిపినట్లు ప్రతీతి. సర్పరూపములో నున్న తన భర్తతో సత్యవతి పవిత్ర గోదావరిలో స్నానమాచరించగా ఆ సర్పము చిత్రాంగదునిగా మారెనని, ఆ చోటును సత్యవతి గుండంగా నేటికీ పిలుస్తుంటారు. ఈ సత్యవతి ఆలయమునకు ముందు 9 స్తంభములపై నిలిచియున్న మంటపము కలదు. ఆ మంటపములో ద్వారపు శాఖలు కలిగిన ఒక శిథిలమైన శిలపై 5' అడుగుల ఎత్తున్న భీకరద్వారపాలుని విగ్రహము

చతుర్భుజములతో చెక్కబడి ఉంది. పై నున్న కుడిచేతిలో ఖట్వాంగము, ఎడమచేతిలో డమరుకము, క్రింది కుడిహస్తము ఎడమవైపునకు మలచబడి గదపై నిలుపబడింది. క్రింది ఎడమ హస్తము అభయముద్రలో ఉంది. ఈ ద్వారపాలుని విగ్రహము కాళేశ్వర మందున్న రెండు ద్వారపాలప్రతిమలను బోలియున్నది.

## మసీదు దేవాలయము

అరువది స్తంభముల దేవాలయము అనగా నేటి వేంకటేశ్వరాలయమునకు దక్షిణ దిశయందున్న ప్రాచీన త్రికూటాలయము మసీదుగా మార్చబడింది. ప్రవేశద్వారము లోపలివైపు ప్రాకారమునానుకొని పదహారు స్తంభముల మంటపము రామలింగేశ్వర దేవాలయములో వలె నిలిచియున్నది. ఈ దేవాలయపు అధిష్ఠానమునందు ఉపానము, విశాల పట్టిక, జగతి, వేదిక అగబడుచున్నవి. ఈ మసీదు దక్షిణ భాగము నందు ద్వారపు శాఖల ప్రక్కనే కాకతీయుల కాలపు జాలిపని (Lattice Work) గాలి వెలుతురుకై చేసిన రంధ్రముల అల్లిక కనబడును. ఇది మసీదుగా మార్చబడినను అనేక హిందు దేవాలయ లక్షణములు కనబడుతూనే ఉన్నాయి.

త్రిశతి పుస్తకమందలి సమాచారమును బట్టి ఈ దేవాలయము మూడు పరియాయములు ధ్వంసము చేయబడినట్లు తెలియుచున్నది. మొదటి పరియాయము అలాఉద్దీన్ ఖిల్జీ సేనాని మలిక్‌కాపూర్ వరంగల్ పై దండెత్తినప్పుడు, రెండవ పరియాయము బహమనీ సుల్తాన్ అహ్మద్‌షా (క్రీ.శ. 1422-1436) సేనాని అజీంఖాన్ చే ఈ ఆలయము ధ్వంసము చేయబడింది. చివరగా మూడవ పరియాయము ఔరంగజేబుచే దక్కన్ సుబేదార్‌గా నియమింపబడిన రుస్తుందిల్ ఖాన్ దీనిని క్రీ.శ. 1693లో పూర్తిగా మసీదుగా మార్చివేసి, అబుల్‌హసన్‌ఫారస్ అనునతనిని మౌజన్‌గా నియమించి, దీని నిర్వహణకై వంద బిగముల భూమిని ఇచ్చాడు[50].

## బ్రహ్మపుష్కరిణి

నాలుగువైపుల మెట్లున్న సువిశాలమైన చతురస్రాకారపు కోనేరే బ్రహ్మపుష్కరిణి. కోనేరు మధ్యనున్న భోగమంటపమును చేరుటకు ఆరు అడుగుల వెడల్పున్న వంతెన కలదు. పుష్కరిణికి నాలుగు వైపుల పిట్టగోడ నిర్మింపబడింది. నాలుగు దిక్కుల యందు ప్రవేశద్వారములు కలవు. ఉత్తరద్వారము వంతెనతో కలుపబడింది.

ఈ బ్రహ్మపుష్కరిణి మంటపమున గల స్తంభముపై చింతల నర్సాబోయి తనయుడగు తిరుమల్లయ్య శక సంవత్సరము 1566 పార్థివ వైశాఖ శుద్ధ త్రయోదశి సోమవారము రోజున వేయించిన శాసనము ఉంది. క్రీ.శ. 1644లో చెక్కబడిన ఈ శాసనమందు మొత్తము 53 పంక్తులున్నాయి. ఇది తెలుగు శాసనము. నర్సింహస్వామి భోగార్థము బ్రహ్మపుష్కరిణి మధ్యలో మంటపమును, పుష్కరిణి చుట్టు పిట్టగోడను (Parapet wall) తిరమలయ్య నిర్మించినట్లు అంతకు

ముందే జూపెల్లి ధర్మరాయుడు బ్రహ్మపుష్కరిణి చుట్టు సోపానములు, పుష్కరిణి మధ్యలో వేదిక నిర్మాణము గావించినట్లు ఈ శాసనం తెలుపుచున్నది.



బ్రహ్మపుష్కరిణి

# 6. చొప్పదండి

కరీంనగర్‌కు ఉత్తరమున 16 కి.మీ. దూరములో చొప్పదండి లక్షెట్టిపేటకు పోవు రహదారి పై నున్నది. ఇచట లభ్యమైన రెండు శిలాశాసనములందు ఈ గ్రామము చెప్పణ్డణ్డి (చెప్పండండి) మరియు చొప్పంద్యాణ్డి (చొప్పంద్యాండి)గా పేర్కొనబడింది. శక సంవత్సరము 914 నందన శ్రావణ శు॥ విదియ ఆదిత్యవారము సరియగు తేది క్రీ.శ. 992 జులై 3న వేయబడిన ఆహవమల్లదేవ బిరుదాంకితుడైన పశ్చిమ కళ్యాణి చక్రవర్తి రెండవ తైలపుని కాలపు శాసనం చొప్పదండి సమీపమున గల మేలకుంట వద్ద నున్నది. రాజకుమారుడైన సత్యాశ్రయ ఇర్వబెడంగుని అనుచర గణములోని అనుంగు దుర్గారాయని కూతురు ఆచబ్బె (ఆచవ్వ) పేరట ఆచబ్బెసముద్రము నిర్మింపబడినట్లు ఈ శాసనంలో ఉంది. అంతే కాకుండా కళ్యాణి రాకుమారుడైన ఇర్వబెడంగుని దాది (Female Nurse) దేవకబ్బె (దేవకవ్వ) మార్తాండదేవరకు 70 ద్రమ్మములను నాణెములు మరియు భూదానముల నొసంగెనని ఇదే శాసనంలో ఉంది[51]. స్వస్తిశ్రీ శక సంవత్సరము 930 కీలక వైశాఖ శుద్ధ తదియ ఆదిత్య వారము సరియగు తేది క్రీ.శ. 1008 ఏప్రిల్ 11న సమస్త భువనాశ్రయ శ్రీ పృథ్వీ వల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర పరమభట్టారక సత్యాశ్రయ కులతిళకం శ్రీమత్ ఇర్వెబెడెంగ దేవరదాది దీవకబ్బె (దీవకవ్వ) వేయించిన శిలాశాసనము శంభుని గుడి ప్రాంగణమందు నిలిచియున్నది[52]. దీవకబ్బెచే ప్రతిష్ఠింపబడిన దివకేశ్వరునకు భూదానములిచ్చిన వివరములు ఈ శాసనమందు గలవు. ఈ దివకేశ్వరాలయము నేడు శంభుని గుడిగా పిలువబడుతుంది. శంభుని గుడి పదవ శతాబ్దపు నిర్మాణ రీతులకు

ప్రతీకగా నిలిచిఉంది. కళ్యాణి చాళుక్యుల కాలపు కళారీతులకు ఈ దేవాలయము కాణాచిగా శోభిల్లుచున్నది. పదవ శతాబ్దపు చివరి భాగములో తెలంగాణమందు నిర్మింపబడిన దేవాలయములలో ఇది ప్రధానమైనది[53].



దేవాలయాల ప్రాంగణము

## శంభునిగుడి

పెద్ద పెద్ద శిలలతో నిర్మింపబడిన ప్రాకారమందు నిలిచియున్న ఈ దేవాలయము తూర్పు ముఖమును కలిగిఉంది. గర్భగృహము, అర్ధమంటపమును బోలిన అంతరాళము, ముఖమంటపము దాని ముందు చిన్న మంటపము (Porch) ఈ దేవాలయ ప్రధానభాగములు. మంటపము చుట్టు గోడలుండుట వలన దేవాలయములోనికి గాలి, వెలుతురు ధారాళముగా వచ్చుటకు వీలులేదు. మంచబంధ అధిష్ఠానము ఎత్తుగా నుండి ఉపానము, పట్టము, జగతి, ప్రతిలను కలిగియున్నది. భిత్తిభాగము నందు దేవకోష్ఠములు (Niches) లేవు. గోడలు కుడ్యస్తంభముల (Pilasters)చే అలంకరింపబడినాయి. గర్భగృహము పై నున్న శిఖరము (Spire) 8 మెట్లతో లేదా భూమికలతో పిరమిడ్ ఆకారములో ఆనాటి వేములవాడ దేవాలయముల శిఖరములను బోలియున్నది. క్రమముగా ఒక దాని కంటె మరియొకటి చిన్నగా నున్న ఈ ఎనిమిది మెట్లపై నున్న పొడుగాటి పెద్దగోళాకారము పై ఆమలకము, దానిపై రాతి కలశము నిలుపబడియున్నవి. శిఖరము నాలుగు దిశల యందు మధ్యన మెట్లనన్నింటిని కలుపుతూ ఒక విశాలపట్టిక గలదు. (The Eight Steps of the spire are connected by a wide tapering band in the centre on all four sides) శిఖరము ముందు శుకనాసము లేదు.

గోడలచే పరివేష్టితమైన ముఖమంటప ద్వారము $2\frac{1}{2}$ అడుగుల వెడల్పు 5' అడుగుల ఎత్తుతో నుండి అడుగున శైవద్వారపాలకులు, ఊర్ధ్వ పట్టిక పైన గుడి గోపురములు (Turrets)

చెక్కబడినాయి. మంటపము యొక్క లోకప్పు చదునుగా (Flat) ఉంది. అంతరాళమునకు ద్వారము లేదు. గర్భగృహద్వారము పై ఏలాంటి అలంకారములు లేవు.



శంభునిగుడి శిఖరము



గోడ వివరములు



చాముండాదేవి

ఈ దేవాలయమునకు అభిముఖముగా నున్న కేశవాలయమునందు గర్భగృహము, అర్థ మంటపము కలవు. దీని నిర్మాణ రీతులు కూడా దివకేశ్వరాలయమునే బోలియున్నవి. ఒక స్తంభముల వరుస ఈ రెండు దేవాలయములను కలుపుచున్నది. కేశవుడు సమపాద స్థానకమందుండి పై నున్న కుడిచేతిలో శంఖం, ఎడమచేతిలో చక్రం, క్రింది కుడి హస్తం నందు పద్మము, ఎడమ హస్తము గదపై నిలిపినట్లుగా మలుచబడింది. కిరీటమకుటము, పూసలహారము, కంకణములు, కేయూరములు, ఉదరబంధము, కటిబంధము మున్నగు ఆభరణములతో కేశవుని ప్రతిమ శోభాయమానముగా మలుచబడింది.

ప్రాకారము బయట శిథిలమైన ద్వారపు శకలముల అడుగుభాగమున అందమైన ద్వారపాలకుల ప్రతిమలు మలుచబడినవి. ఈ దేవాలయమునకు దక్షిణదిశలో ప్రాకారము బయట కోనేరు (Holy Tank) శిథిలావస్థలో ఉన్నది. దీనికి నాలుగు వైపుల మెట్లున్నవి. శంభుని గుడిముందు చాళుక్య కళారీతులలో $3^1/_2$ అడుగుల పొడవు 2 అడుగుల ఎత్తున్న నంది విగ్రహమున్నది.

**చాముండాదేవి**

చతుర్భుజములు గల ఈ చాముండాదేవి సుఖాసనములో కూర్చొనియుండి పై నున్న కుడి హస్తము నందు డమరుకము, ఎడమహస్తము నందు ఖట్వాంగము, క్రింది కుడిహస్తమునందు ఖడ్గం, ఎడమ హస్తమందు గిన్నె (Bowl) ధరించియున్నది. జటాజూటములు సుస్పష్టముగా

చెక్కబడినవి. దేవి మకుటము, కుండలములు, గ్రైవేయకములు, కటిబంధము, కేయూరములు, దండ, ముంజేతి, కాలికడియములు ధరించియున్నది. మోకాళ్లవరకు అర్థోరుకమున్నది. దేవి ధరించిన కపాలముల హారము కుచద్వయము నడుమ నుండి నాభి వరకు వ్రేలాడుచున్నది. మకుటమునకిరువైపుల నాగసర్ప పడగలు చెక్కబడినవి. దేవి ఆసనం క్రింద ఏ వాహనము కాని, చిహ్నముకాని చెక్కబడలేదు. ఎండకు ఎండి, వానకు నాని చాలా అరగిపోయిన ఈ ప్రతిమ 1980లో కరీంనగర్ మ్యూజియంనకు తరలింపబడింది. మ్యూజియం ఆవరణలో ఈ చాముండాదేవి శిల్పప్రతిమ సందర్శకుల దృష్టినాకర్షించు చున్నది. వేములవాడ, నందికంది, పానుగల్, హన్మకొండలోని విగ్రహములతో పోల్చినపుడు ఈ ప్రతిమ 10వ శతాబ్దమునకు చెందినదనవచ్చు[54].

## 7. జమ్మికుంట

కరీంనగర్‌నకు ఆగ్నేయమున 53 కి.మీ. దూరములో గల జమ్మికుంట, కాజీపేట–బల్హార్షా రైల్వేలైన్‌పై నున్నది. హుజురాబాద్ నుండి ఈ గ్రామము చేరవచ్చును. స్టేషన్ జమ్మికుంటకు 2 కి.మీ. దూరమున పాత జమ్మికుంట గ్రామమున్నది. అచ్చటనున్న చెరువు ప్రక్కనేనొక ప్రాచీన శివాలయము ఉన్నది. దాని ప్రాంగణములో దాదాపు 25' అడుగుల ఎత్తున్న ఏకశిలా ధ్వజ స్తంభముపైన నొక ప్రక్క 25 పంక్తులు, 2వ ప్రక్క 30 పంక్తులు మొత్తము 55 పంక్తుల కన్నడశాసనము చెక్కబడింది. శక సంవత్సరము 917 మన్మథ వైశాఖ శుద్ధ తదియ శుక్రవారము సరియగు తేది క్రీ.శ. 995 ఏప్రిల్ 5న స్వస్తిశ్రీ పృథ్వీవల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర పరమబట్టారక చాళుక్యాభరణ శ్రీమదాహవ మల్లదేవ బిరుదాంకితుడైన కళ్యాణి చాళుక్య చక్రవర్తి రెండవ తైలపుని కాలములో జమ్మికుంటను ఏలిన నాగియగావుండు తన భార్య వేమకబ్బె (వేమకవ్వ) కు శుభములు చేకూరుటకై ఆదిత్య గృహమునకు ఇరువది మర్తురుల నీర్నేల (Wet land) మరియు ఇతర భూములతో పాటు, సేద్యపు బావులనుండి నీటిని బయటకు లాగుటకు రెండు రాటణములను దానమిచ్చినట్లు ఈ శాసనములో పేర్కొనబడింది[55]. రెండవ తైలపుని ఉత్తర దండయాత్రల సందర్భములో అతడు ఉప్పల లేదా ఉత్పల రాజ్యమును జయించి మాళవ పారామారరాజుపై విజయం సాధించినట్లు ఈ శాసనము తెలుపుచున్నది. ఈ శాసనమందు గ్రామనామము 'దమ్మికుంటెయు'యని పేర్కొనబడింది. శాసనమునందు తెలుపబడిన ఆదిత్యగృహము లేదా సూర్యదేవాలయము నేడు జమ్మికుంటలో కానరాదు. అలాగే క్రీ.శ.992 చొప్పదండి శాసనములో పేర్కొనబడిన రెండవ తైలపుని కాలపు మార్తాండదేవుని ఆలయము గూడా కనబడుటలేదు. జమ్మికుంట, చొప్పదండి శాసనములను బట్టి తొలికళ్యాణి చాళుక్య చక్రవర్తుల కాలములో సౌరపూజ సర్వవ్యాప్తమై ఉండెనని తెలియుచున్నది. వేయి సంవత్సరముల క్రిందటి దమ్మికుంటె (Dammikunte) నేడు జమ్మికుంటగా వ్యవహరింపబడుచున్నది.



వినాయకుడు

పాతజమ్మికుంట చెఱువు ప్రక్కనే నున్న శివాలయము తూర్పు ముఖమును కలిగి ఉంది. శిథిలమైన సనాతన దేవాలయపునాదుల పైననే ప్రస్తుత ఆలయ పునఃనిర్మాణము జరిగినదని స్థానికుల కథనము. కళ్యాణి చాళుక్యుల కాలపు శిలాప్రతిమలు కొన్ని ఈ ఆలయము ప్రాంగణమందున్నవి. గణపతి మకుటధారియై అతని తొండము ఎడమ హస్తములో గల మోదకములపై నిలుపబడింది. నాగసర్ప పడగ నీడలోనున్న భైరవవిగ్రహము చూడ ముచ్చటగా నున్నది. మూడు, ఐదు, ఏడు పడగల నీడలో నున్న పెక్కునాగిని ప్రతిమలు తమ హస్తములందు డాలు, ఖడ్గములను ధరించియున్నవి. ఈ నాగిని ప్రతిమలు పొలాస యందున్న నాగిని విగ్రహములను పోలియున్నవి. నాగిని ప్రతిమల ఊర్ధ్వభాగము స్త్రీ రూపములోను అధోభాగము సర్పరూపములోను మలచబడినవి. చాళుక్యుల కాలపు నంది విగ్రహములిచట కనబడును.

## 8. శనిగరము

కరీంనగరము నుండి 40 కి.మీ. దూరంలో హైదరాబాద్‌కు పోవు రాజీవ్‌రహదారిపై నున్న సరిహద్దు గ్రామమే శనిగరము. ఇచటి కళ్యాణి చాళుక్య చక్రవర్తులకాలపు ఐదు శిలాశాసనములు శనిగరము ఒక జైన, శైవ క్షేత్రముగా విరాజిల్లెనని తెలుపుతున్నాయి[56]. శాసనములందీ గ్రామము "సణగర, ఖణ్డిసణగర, బళియసనగర" యని పేర్కొనబడింది. కళ్యాణి చాళుక్య చక్రవర్తి మొదటి సోమేశ్వరుని కాలపు క్రీ.శ. 1051 శాసనములో అతని మహాసామంతుడు కాకతీయ మొదటి బేతరాజు యొక్క ప్రెగ్గెడ నార్ణయ్య స్థానిక గావుండులైన (Local Officers) ముప్పదయ్య, పున్నెరడ్డిల అనుమతితో శక సంవత్సరము 973 (క్రీ.శ. 1051) వికృతి ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తము ఒక రాటణమును (రాటుపంపు) దుద్ధమల్ల జినాలయమునకు దానముగా నొసంగెనని పేర్కొనబడింది. ఇది శనిగరములో లభ్యమైన తొలి శాసనము. ఇదే చక్రవర్తి కాలపు రెండవ శాసనములో అతని మహాసామంతుడైన కాకతీయ

మొదటి ప్రోలరాజు శక సంవత్సరము 975 విజయకార్తీక అమావాస్య ఆదిత్యవారము సూర్యగ్రహణము రోజున సరియగు తేది క్రీ.శ. 1053 నవంబర్ 13న స్థానిక, గావుండుల అంగీకారముతో 12 నివాస స్థలములను మాన్యములుగను, ఒకరాటణమును, 20 మత్తుర్ల నల్లరేగడి భూమిని, 20 మత్తుర్ల కేసుకాడు భూమిని దానములుగా నొసంగెనని తెలుపబడింది. బెజవాంకేయ (బెజ్జంకి) గ్రామకాటెరడ్డి తదితరుల అంగీకారముతో ఖణ్డిసణగరమందు ప్రెగ్గడ మధువప్పయ్య ప్రతిష్ఠించిన మధుపేశ్వరదేవరకు ఒక మత్తురు నీరు నేలను మొదటి ప్రోలరాజు దానముగా ఇచ్చాడు.

కళ్యాణి చాళుక్య ప్రభువులలో మేటి చక్రవర్తి అయిన ఆఱవ విక్రమాదిత్యుని కాలపు శిలాశాసనము క్రీ.శ. 1107 జనవరి 10న అతని మహామండలేశ్వరుడైన జగద్దేవరసర్ (పారమార జగద్దేవుడు) దండనాయకుడైన కొండమయ్య శకసంవత్సరము వ్యయ మాఘ శుద్ధ పూర్ణిమ గురువారము సోమగ్రహణ నిమిత్తం పుల్గునూర్-70 అంతర్గత బళియ సనగరమందున్న స్వయంభూః భీమేశ్వర దేవరకు ఒకరాటణమును, కొన్ని భూములను దానమిచ్చినట్లు తెలుపుతుంది. ఖణ్డిసణగర, బళియసనగర యను నామములు ఆనాటి శనిగరమందలి వాడల, వీధుల పేర్లు అయి ఉంటాయి.

కళ్యాణి చాళుక్య చక్రవర్తి భూలోకమల్ల మూడవ సోమశ్వరుని కాలపు క్రీ.శ. 1128 శాసనములో అతని మహామండలేశ్వరుడైన కాకతీయ రెండవ ప్రోలరాజు అధికారి సబ్బిసహస్రమునేలు రేపోల కుఱవరాజు శకసంవత్సరము 1050 కీలక, ఆశ్వీజ అమావాస్య ఆదిత్యవారము సూర్యగ్రహణ నిమిత్తం ఖండిసనగరమందలి కామ్మేశ్వర దేవుని ధూపదీపనైవేద్యములకు, సన్యాసులకు ఉచితాన్న వస్త్రములకై ఒక రాటణమును, ఒక గాణువును, మరియు బెజవాంకేయ గ్రామమందలి ఎనిమిది మత్తుర్ల నేలను దానములుగా ఇచ్చాడు.

కళ్యాణి చాళుక్య రెండవ జగదేకమల్లచక్రవర్తి పాద పద్మోపజీవి కాకతీయ రెండవ ప్రోలరాజు అధీనమందున్న సబ్బి సహస్రమునేలు రేపోల కుఱువ రాజు యొక్క దండనాయకుడు, అత్రేయ గోత్రికుడైన మండపరసర్ (మండపరాజు) క్రీ.శ. 1149 మార్చి 25న వేయించిన శిలాశాసనములో శనిగరమందలి పార్థేశ్వరదేవునకు నిత్యనైవేద్యములకు, అఖండదీపమునకు, సన్యాసుల అన్నవస్త్రములకై ఒక రాటణము, ఒక గాణువు మరియు కొన్ని భూములను అతడుదానముగా నొసంగినట్లు తెలుపబడింది.

క్రీ.శ. 1051 నుండి 1149 వరకు అనగా శతాబ్దకాలమునకు చెందిన ఐదు శిలాశాసనములు ఒక్క శనిగరమందే లభ్యమగుట వలన పదకొండవ, పన్నెండవ శతాబ్దములలో ఈ ప్రాంతము అత్యంత చారిత్రక ప్రాధాన్యత కలిగి ఉండెనని ద్యోతకమవుతుంది. కాకతీయుల తొలి నలుగురు ప్రభువులు కళ్యాణి చక్రవర్తులకు సామంతులని విదితమవుతుంది.

గోలకొండ రాజ్యమునేలిన అబ్దుల్లాకుతుబ్‌షా కాలపు శిలాశాసనమొకటి పెద్దచెఱువు అలుగు ప్రక్కన కట్టమైసమ్మ గుడి ఎదురుగా ఉంది. శకసంవత్సరము 1586 ప్లవంగ శ్రావణ మాసమందు అబ్దుల్లాకుతుబ్‌షా ఆజ్ఞానుసారము సైదు ముజపుర్ సరిఖేలు అను అధికారి 540 హొన్నులను బంగారు నాణెములు మంజూరు చేయగా హవల్దార్ మెనవిబేగ్ వెంకటపతితో శనిగరపు చెఱువు మత్తడిని కట్టించాడు. నరసింహ క్షేత్రమున కివ్వబడిన దేవ బ్రాహ్మణ వృత్తులన్నియు ఎప్పటిలాగే కొనసాగునని ఈ శాసనమందు పేర్కొనబడింది[57].

శాసనములలో పేర్కొనబడిన దేవాలయములేవియు ప్రస్తుతము శనిగరములో అగబడుటలేదు. వాటి శిథిలాలు గ్రామ సమీపమందున్న గుట్టబోరులందు పొలములలోను అగబడుతాయి. గుట్టలపైన ప్రాచీన కోటగోడల అవశేషాలు అక్కడక్కడ కనిపిస్తాయి.

## దుద్ధమల్ల జినాలయము

ఇచటి క్రీ.శ. 1051 శాసనములో దుద్ధమల్ల జినాలయమును మరమ్మతు చేసి నారణయ్య దానములిచ్చినట్లు పేర్కొనబడింది. వేములవాడ నేలిన చాళుక్యప్రభువులలో యుద్ధమల్ల నామము గల రాజు ఈ దుద్ధమల్ల జినాలయమును నిర్మించి ఉంటాడు[58]. కాని ఇప్పుడీ జినాలయములేదు. ప్రస్తుతము ఒక గుట్టపైనున్న శిలపై పార్శ్వనాథుని రూపము చెక్కబడిఉంది. అచ్చోటనే ఆనాటి దుద్ధమల్ల జినాలయము విరాజిల్లి ఉంటుంది. చెఱువునకు పోవు మార్గమున ఒక శిలపై పార్శ్వనాథుడు కాయోత్సర్గ రీతిలో నిలబడి ఉన్నాడు. అతని వెనుక మెలికలు తిరిగిన సర్పముండి దాని పడగలు అతని తలపై అలంకారప్రాయముగా ఉన్నాయి. వేములవాడలోని శిల్పము వలె ఇచటి పార్శ్వనాథునికి ఎడమవైపు క్రింది భాగమున శిశువుతో గూడిన తల్లి సంతానసాఫల్యము సూచకంగా కృతజ్ఞతాభావము తెలుపుచున్నట్లు చెక్కబడింది. వేములవాడ శుభధామ జినాలయపు పార్శ్వనాథ విగ్రహముతో ఇచటి ప్రతిమ పోలికలు అధికముగా నుండుటచే ఇవి ఏకకాలమునకు అనగా పదవ శతాబ్దమునకు చెందినవై ఉంటాయి[59].

## భీమేశ్వరదేవాలయము

ప్రస్తుతము జననివాసము లేని ప్రాంతమున గుట్టబోరుల దగ్గర నున్న భీమేశ్వరాలయము తూర్పు ముఖమును కలిగి శిథిలావస్థలో ఉంది. శనిగరమందలి క్రీ.శ. 1107 శాసనములో పేర్కొనబడిన భీమేశ్వరాలయము ఇదేకావచ్చు. ఈ దేవాలయ గర్భగృహము 11' అడుగుల చతురస్రాకారములో ఉంది. దాని ముందు 8'-8" ఎనిమిది అడుగుల ఎనిమిది అంగుళముల వెడల్పుతో 11' అడుగుల పొడవు గల అంతరాళము, దాని ముందు 9'-2" వెడల్పుతో 18' అడుగుల పొడవుగల మంటపము ఉన్నాయి. గర్భగృహ, అంతరాళపు గోడలు ఎలాంటి అలంకారములు లేక సాదాగా ఉన్నాయి. ఆలయ గోపురము శిథిలమై అదృశ్యమైంది. మంటపము యొక్క లోకప్పు చదునుగా నుండి ఆరుస్తంభములపై నిలిచి ఉంది. చాళుక్యుల కళారీతులలో

గల గర్భగృహప్రవేశ ద్వారపు క్రింది భాగమున శైవద్వార పాలకులు, ద్వార పతంగము (Lintel) పైన ఒక అడుగు ఉబికి వచ్చిన చూరు (Projecting Cornice over the lintel) అందంగా మలచబడింది.



శనిగరం భీమేశ్వరాలయం

**మహిషాసురమర్దని :-** భీమేశ్వరాలయ గర్భగృహమందున్న ఈ ప్రతిమ అడుగుభాగము శిథిలమైంది. ఊర్ధ్వభాగము అనేక చేతులతో ఉంది. ఆమె కుడి చేతులలోని ఒక హస్తముతో శూలమును అసురుని వైపు దించుచున్నట్లుంది. కాని అసురుని భాగము ఛేదింపబడి ఉంది.

**సప్తమాతృకల శకలము**

సప్తమాతృకల శిలాఫలకము శిథిలము కాగా ఏడుగురు దేవతలలో కేవలము ఇరువురు దేవతల ముక్క మిగిలి భీమేశ్వరాలయమందు పడి ఉంది.



గణపతి మహాలింగేశ్వరాలయము

**మహాలింగేశ్వర దేవాలయము**

శనిగరము ఊరు పొలిమేరలలో నున్న ఈ చిన్న ఆలయము నందు గల వేదికపై శివలింగముంది. వేదికపై 1'-8" ఎత్తుతో 4'-6" చుట్టుకొలత గల ఈ బృహత్ లింగము

చూపరులదృష్టి నాకర్షిస్తుంది. ఈ ఆలయముముందు ఒక పెద్ద గణపతి శిల్పముంది. చతుర్భుజములు గల ఈ వినాయకుని పైకుడి హస్తమందు పరశువు, వామహస్తమందు త్రిశూలము, క్రింది దక్షిణ హస్తమందు దంతము, వామహస్తమందొక పాత్రలో నున్న మోదకములపై తొండముకొన అని ఉంది. గణపతి తల పై చిన్న కిరీటము, ఆసనము క్రింద మూషిక వాహనము స్పష్టముగా అగబడుతాయి. చాళుక్య కళారీతులలో నున్న ఈ గణపతి సమీపముననే ఒక నంది విగ్రహముంది. ఈ కళాఖండములు పదకొండవ శతాబ్దానికి చెందినవి.

## పొలములలో నున్న శివాలయము

పూర్తిగా శిథిలమైన ఈ దేవాలయమందు గర్భగృహము,దాని ముందు అంతరాళము ఉన్నాయి. వీటిపై నున్న కప్పు నేడు కానరాదు. అంతరాళ ద్వార లలాటమున గజలక్ష్మి, క్రింది భాగమున శైవ ద్వారపాలకులు చెక్కబడ్డారు. ఈ ఆలయము తూర్పు ముఖమును కలిగిఉంది. ఇచటి శాసనములలో పేర్కొనబడిన ఈశ్వరాలయములలో ఇది ఒకటై ఉంటుంది.

## భైరవుడు

శనిగరము నుండి కోహెడకు పోవు మార్గమందు ఆరు అడుగుల నిలువెత్తు భైరవ విగ్రహముంది. పై నున్న కుడి హస్తములో డమరుకము, వామహస్తములో త్రిశూలము, క్రింది దక్షిణ హస్తములో ఖడ్గము, వామహస్తములో మొండెము నుండి వేరు చేయబడిన నెత్తురు కారుచున్న తల చెక్కబడి ఉన్నాయి.

## గుట్టపై నున్న నరసింహదేవాలయము

గ్రామమునకు ఒక కిలోమీటరు దూరంలో నొక గుట్టపై నున్న ఈ ఆలయమునకు ఎనిమిది రాతి మెట్లున్నాయి. ఒక పెద్దశిల క్రింద ఏర్పడిన గుహ 18'x9' కొలతలతో 4½' ఎత్తును కలిగిఉంది. మూడు అడుగుల ఎత్తు గల నరసింహస్వామి ప్రతిమ చతుర్భుజములతో ఒక పెద్దబండపై చెక్కబడింది. పైహస్తములందు శంఖచక్రములున్నాయి. క్రింది హస్తములందలి చిహ్నములు అస్పష్టముగా ఉన్నాయి[60].

## గ్రామమందున్న లక్ష్మీనరసింహ దేవాలయము

గ్రామములో నున్న ఈ దేవాలయమందు గర్భగృహము, అంతరాళము, ముఖ మంటపములున్నాయి. నల్లని గ్రానైట్ రాయితో చెక్కబడిన మూడడుగుల ఎత్తున్న ఈ విగ్రహము చతుర్భుజములతో మలచబడింది. పై నున్న దక్షిణ హస్తమందు శంఖము, వామహస్తమందు చక్రము, క్రింది కుడిచేతి వ్రేళ్లలో పద్మముండి అభయముద్రలో నుండగా ఎడమచేతి యందు గద ఉంది.

శనిగరము వేయి సంవత్సరములకు మించిన వైభవ చరిత్రను కలిగియుండుట విశేషం.

# 9. పొట్లపల్లి

కరీంనగర్‌కు దక్షిణమున దాదాపు 35 కి.మీ. దూరంలో నున్న పొట్లపల్లి గ్రామమును హుస్నాబాద్ గుండా చేరవచ్చు. ఇచట బృహత్ శిలా సమాధులు లేదా రాకాసిగుళ్లు (Megalithic burials) ఉండుట వలన ఇది అత్యంత ప్రాచీన గ్రామమని చెప్పవచ్చు. స్వస్తి సమస్త భువనాశ్రయ శ్రీ పృథ్వీవల్లభ మహారాజాధిరాజపరమేశ్వర, పరమభట్టారక సత్యాశ్రయకుల తిళకం చాళుక్యాభరణ త్రైలోక్య మల్ల మొదటి సోమేశ్వరుని కాలపు కన్నడ శాసనమొకటి ఇచటి రామాలయము నందు నిలిచి ఉంది[61]. శకసంవత్సరము 988 పరాభవ చైత్రపూర్ణిమ ఆదిత్యవారము సోమగ్రహణ నిమిత్తం సరియగు తేది క్రీ.శ. 1066 మార్చి 14న వేయబడిన ఈ శిలాశాసనంలో మహాసామంతుడైన రేంగొణ్డె (రేగొండ) చందయ్యరసర్ (చంద్రయ్యరాజు) ఒక రాటణమును ఇచటి దేవాలయమునకు దానంగా ఇచ్చినట్లు పేర్కొనబడింది. శాసనమందు రెండు పరియాయములు ఈ గ్రామనామము "పొట్టపల్లియ" అని చెక్కబడింది. ఆనాటి 'పొట్టపల్లియ'యే నేడు పొట్లపల్లిగా వ్యవహరింపబడుట గమనార్హం. ఈ శాసనమందు పేర్కొనబడిన 'రేంగొణ్డె' పొట్లపల్లికి సమీపమున గల నేటి రేగొండ గ్రామము. ఈ రేగొండ గ్రామమందు గల రాక్ షెల్టర్స్ (Rock shelters) లో కొత్తరాతి యుగపు రాక్ పేయింటింగ్స్ (Rock paintings) ఉన్నాయి. పొట్టపల్లియ గ్రామమునందు ఐదు మఠములుండినట్లు, తపోధనుల ఆహార నిమిత్తం గూడా దానములిచ్చినట్లు ఈ శాసనముందుంది. ఈ శిలాశాసనపు మొదటి ప్రక్కలో 27 పంక్తులు, రెండవ ప్రక్కలో 21 పంక్తులు, మూడవ ప్రక్కలో శపించు పంక్తులు (Imprecatory Verses) చెక్కబడినాయి.

పై శిలాశాసనములోని రెండవ ప్రక్కయందు మొదటి వరసలో లేదా పంక్తిలో నకరేశ్వర దేవర ప్రసక్తి ఉంది. నకరేశ్వరము నేడు నగరేశ్వరముగా పిలువబడుతుంది. ప్రాచీన కాలమందు వర్తక వ్యాపారమొనర్చువారు నకరముల నేర్పరచుకొనేవారు. నకరమనగా వ్యాపారసంఘము. దేశ విదేశములతో వ్యాపారమొనర్చు వర్తకులు తమ వ్యాపారాభివృద్ధికై వారిలోని సమస్యల పరిష్కారమునకై నకరములను లేదా వర్తక సంఘములను స్థాపించుకొనేవారు. వర్తక సంఘము లేదా నకరములో సభ్యత్వమున్న వారు కొంత ధనమును నకరమునకీయ వలసి ఉండేది. అట్లు ప్రోగైన ద్రవ్యము ధర్మకార్యములకు వినియోగింపబడేది. వేములవాడలో పదవ శతాబ్దములో నుండిన నకరము వారు అచటి నకరేశ్వరాలయము (నగరేశ్వరాలయము)ను నిర్మించియుందురు[62]. అదే విధముగా ఆనాటి పొట్టపల్లియ గ్రామమందుండిన నకరము లేదా వర్తక సమాజము శాసనమందు పేర్కొనబడిన నకరేశ్వరాలయమును వేములవాడలో వలె పొట్లపల్లియందు గూడా నిర్మించియుందురు. పొట్లపెల్లి నకరేశ్వరాలయమునకు దానము లివ్వబడినట్లు అచటి శాసనమందుంది. కాని ఈ నకరేశ్వరాలయము శిథిలమై నేడు అదృశ్యమైంది. దాని అవశేషాలు అచటచ్చట గ్రామమందు అగబడుతాయి.

పొట్లపల్లి మల్లన్న గుడి సమీపమున గల వేరొక శాసనము పురావస్తుశాఖ దృష్టికి వచ్చినట్లుగా లేదు. ఈ శాసనము అచటి బావి సమీపమున నిలిచిఉంది. ఇచట లభ్యమైన జైన అవశేషములను బట్టి పొట్లపల్లి జైనమతకేంద్రమై యుండినట్లు తెలుస్తుంది. ప్రాచీన ఆలయములన్నియు కనుమరుగై వాటి శిథిలాలు గ్రామమందు దర్శనమిచ్చుచున్నవి. గ్రామము మధ్యలో నున్న బురుజు పైభాగమున ద్వారపాలకుడున్న శిలాఫలకము మరియు చైత్యవాతాయనమును బోలిన శిల్పమున్న శిల, కట్టడములో వాడబడినాయి. చెఱువు తూము నిర్మాణములో సింహశిల్పము మరియు చైత్యవాతాయన శిల్పరూపమున్న శిలలు వాడబడినాయి.

మల్లన్నగుడి సమీపమున ఒక లోతైన చేదబావి అరుదైన రీతిలో నిర్మింపబడి ఉంది. ఈ బావిలోపలి వైపు నలుదిక్కుల చతురస్రాకారములో నున్న పొడవైన శిలలు ఒకదానిపై నొకటి చక్కగా క్రింది వరకు పేర్చబడి కళాత్మకముగా ఉన్నాయి. నేటికాలములో రింగులు ఒకదానిపై నొకటి అమర్చినట్లుగా ఆనాటి కాలములో ఒక దానిపై నొకటి పొడుగాటి పెద్ద పెద్దశిలలు క్రిందికి నీటి వరకు అమర్చుట అద్భుతముగాను, అందంగాను ఉండుట విశేషం.

పొట్లపల్లిలో ప్రస్తుతమున్న రామాలయము జమ్మికుంటలోని చెఱువు ప్రక్కనున్న శివాలయము మాదిరిగా శిథిలమైన దేవాలయపు పాత పునాదులపైననే నిర్మింపబడినట్లు స్థానికుల కథనము. ఈ రామాలయ అధిష్ఠానమందు ప్రాచీన మత్స్య, కూర్మ, మాతృదేవత (Primitive Mother Goddess) శిల్పములున్నాయి. గజముల సింహముల చిత్ర ఫలకములు పునాది భాగమున కనిపిస్తాయి.



పొట్లపల్లి దేవాలయము

పొట్లపల్లిలో కుమ్మరికులమునకు చెందిన చిలువేరి పోచయ్య, రాజవ్వల ఇంటి ముందు ప్రహరీగోడ నిర్మాణమునకై పునాది త్రవ్వుచుండగా కాకతీయుల శిల్పకళారీతులలో నున్న పెద్ద శివలింగమొకటి బయల్పడింది. దీనినిప్పుడు స్వయంభూ లింగంగా ప్రజలు సేవించుచున్నారు.

ఎత్తైన వేదికతో గూడిన పానవట్టముపై రెండడగుల ఎత్తు గల నల్లసరపురాయి లింగమున్నది. క్రీ.శ.1996 సెప్టెంబర్ 10 మంగళవారము రోజున సాయంత్రము దరిపెల్లి రాజయ్య త్రవ్వునప్పుడు ఈ బృహత్ లింగము బయటపడింది[63].

గ్రామములో కొన్ని ప్రాచీన ప్రతిమాశిల్పములున్నాయి.



పొట్లపల్లి లింగము



జైన ప్రతిమ

**గణపతి :-** ద్విహస్తములతో మకుటములేని ఏనుగుతల గల గణపతి బాదామి చాళుక్యుల కళారీతులలో మల్లన్నగుడియందు నిలుపబడి ఉంది.

**సప్తమాతృకల శకలము :-** ఏడుగురు దేవతలలో కేవలము ముగ్గురు దేవతలతో మిగిలి ఉన్న సప్తమాతృకల ఫలకములోని శకలము మల్లన్నగుడిలో పడి ఉంది.

**జైనప్రతిమ :-** పద్మాసనము వేసుకొని ధ్యానముద్రలో నున్న జైన తీర్థంకరుని విగ్రహమొకటి పొట్లపల్లి చెఱువుకట్ట వెనుకభాగమున పడిఉంది. ఈ విగ్రహపు రెండు బాహువులు ఛేదింపబడినాయి. ఉంగరాల జుట్టుతో నున్న తల, ధ్యానముద్రలో ఒకదానిపై నొకటి నిలుపబడిన హస్తములు స్పష్టముగా అగబడుచున్నాయి. చేతులు ఖండింపబడిన ఈ ప్రతిమ నల్లరాతితో మలచబడింది. ఈ విగ్రహము వేములవాడలోని జైన విగ్రహములను పోలిఉంది.

పొట్లపల్లిలో మల్లికార్జునాలయం, శివాలయం, రామాలయం, ఆంజనేయగుడి, ఎల్లమ్మగుడి, బ్రహ్మంగారి గుడి మున్నగు ఆలయాలున్నాయి.

## 10. కోరుట్ల

కరీంనగర్ నుండి 72 కి.మీ. దూరంలో నిజామాబాద్‌కు పోవు రహదారిపై కోరుట్ల పట్టణముంది. కోరుట్లలో నున్న పాతకోట, ఎత్తైన మట్టిగోడలు, కోటద్వారములు, కోటచుట్టున్న కందకములు, రాతితో, ఇటుకతో కట్టిన బురుజులు సందర్శకుల దృష్టినాకర్షిస్తాయి. కళ్యాణి చాళుక్య చక్రవర్తి త్రైలోక్యమల్ల మొదటి సోమేశ్వరుని కాలపు (క్రీ.శ. 1042-1068) కన్నడ

శాసనమొకటి కోరుట్ల కోట లేదా గడిలోని కోనేరు (Holy tank) లో ఉంది[64]. తేదిలేని ఈ శిలాశాసనం నాలుగు ప్రక్కల యందు చెక్కబడింది. మూడవ ప్రక్క కోనేరు కట్టడములో ఉపయోగింపబడుట వలన పురావస్తు శాఖవారు కనిపించు మూడు ప్రక్కల యందున్న వ్రాతలనే కాపీ చేయగలిగారు. మొదటి ప్రక్కలో 19 పంక్తులు, రెండవప్రక్కలో 26 పంక్తులు, నాలుగవ ప్రక్కలో 20 పంక్తులు చెక్కబడినాయి. మూడవ ప్రక్క నిర్మాణములో మూసుకపోయింది. రెండవ మరియు నాలుగవ ప్రక్కలందున్న పంక్తుల మొదటి అక్షరములు అఱిగిపోవుట వలన గుర్తింపబడుటలేదు. శాసనమందున్న రెండవ ప్రక్కలోని మొదటి రెండు పంక్తులలో ఫాల్గుణ శుద్ధ పంచమి బృహస్పతివారము అను పదములు స్పష్టంగా తెలుస్తున్నాయి. కాని శక సంవత్సరము లేదు. శాసనము యొక్క అంచులు విరిగి పోవుట వలన పంక్తులలోని మొదటి అక్షరములు గోల్పోవడమైంది.

పొలవాసరాజుల మాదిరిగా లట్టలూరు పురవరాధీశ్వర, సువర్ణ గరుడధ్వజాది బిరుదములు ధరించిన రాష్ట్రకూట నాయకుడొకడు (Chief) కోరుట్లలోని రట్టమార్తాండ జినాలయ మరమ్మతులకు, పూజలకు, నైవేద్యములకు భూదానములిచ్చినట్లు ఈ శాసనము తెలుపుతుంది.

శాసనమందలి లట్టలూరు (Lathore) రాష్ట్రకూటుల రాజధానిగా ఉండేది. లట్టలూరు పురవరాధీశ్వర యను బిరుదము ధరించిన దాత రాష్ట్రకూట వంశజుడై ఉంటాడు లేదా రాష్ట్రకూట నాయకుడై ఉంటాడు. రట్టయను పదము రాష్ట్రకూటులను సూచిస్తుంది. కావున దానములిచ్చిన దాత రాష్ట్రకూటనాయకులలో ఒకడై ఉంటాడు. అతని పేరు తెలియుటలేదు. రాష్ట్రకూటులకు సామంతులుగా సమకాలీనులుగా క్రీ.శ. 750 నుండి 973 వరకు వేములవాడ చాళుక్యులు పాలించారు. వేములవాడ ప్రభువులకు రాష్ట్రకూట పాలకులతో వివాహబాంధవ్యాలున్నాయి. అందువలన ఈ ప్రాంతములో వేములవాడ ప్రభువుల పాలన యందు రాష్ట్రకూటనాయకులు కొందరు పాలకులుగా నుండు అవకాశముంది. రాష్ట్రకూటుల వలె వేములవాడ చాళుక్యులు గూడా జైనమత పోషకులు. కోరుట్లలోని రట్టమార్తాండ జినాలయము గూడా వేములవాడ చాళుక్య ప్రభువుల కాలములో నిర్మింపబడి ఉంటుంది. శనిగరములోని దుద్ధమల్ల జినాలయము, రేపాకలోని ఖలివుత్తు జినాలయము, వేములవాడలోని శుభధామ జినాలయముతో పాటు కోరుట్లలోని రట్టమార్తాండ జినాలయము గూడా వేములవాడ చాళుక్యప్రభువుల కాలములోనే నిర్మింపబడి ఉంటాయి. కాని ఈ జినాలయములు నేడు కనబడుటలేదు. శనిగరము, రేపాక, వేములవాడలోని జినాలయములు అదృశ్యమైనాయి. కోరుట్లలోని రట్ట మార్తాండ జినాలయము నేడు మహాదేవ స్వామి ఆలయముగా వ్యవహరింపబడుతుంది. జైన మతములో క్రాణూరుగణ మరియు తింత్రిణి గచ్ఛశాఖలకు జెందిన కొరవట్టుగోష్ఠి జైనుల ప్రసక్తి ఈ శాసనమందుంది. పది, పదకొండవ శతాబ్దములలో కొరవట్టు జైనుల కేంద్రమగుటచే ఈ పట్టణమునకు క్రమముగా

కొరవట్టుల, దాని నుండి కోరుట్ల అను నామము వచ్చి ఉంటుంది. కొరవట్టుల పదమే కోరుట్లగా మారినదనుటలో సందేహం లేదు.

## మహాదేవస్వామి దేవాలయము

కోరుట్ల వాగు ఒడ్డుననున్న చిన్నగుడియే మహాదేవస్వామి ఆలయము. కోరుట్ల శాసనములో పేర్కొనబడిన రట్టమార్తాండ జినాలయము నేటి మహాదేవస్వామి ఆలయమే యనుటకు ప్రబల నిదర్శనములున్నాయి. ఇచటి జినాలయములోని పార్శ్వనాథుని, బాహుబలి విగ్రహములు బయటపడ వేయుట వలన అవి నేడు ప్రవేశద్వారమునకిరువైపుల లోపలిగోడలకు నిలుపబడి ఉన్నాయి. పన్నెండవ, పదమూడవ శతాబ్దములలో వీరశైవులు జైనులను ముప్పుతిప్పలు పెట్టి వారి జినాలయములన్నింటిని బలవంతముగా శివాలయములుగా మార్చి వాటిలోని జైన ప్రతిమలను బయటపడ వేశారు. కోరుట్లలోని జినాలయము గూడా బలవంతంగా శివాలయముగా మార్చబడి నేడు మహాదేవాలయముగా పిలువ బడుతుంది. అందలి జైన ప్రతిమలను బయట పడవేయుట వలన అవి నేడు అదే ప్రాంగణములో దర్శనమిస్తున్నాయి. ప్రప్రథమములో ఈ దేవాలయమందు కేవలము గర్భగృహము, దాని ముందు చిన్న మంటపము (Porch) మాత్రమే ఉండేవి. ఈ చిన్నమంటపము (Porch) ముందున్న ముఖ మంటప నిర్మాణము ఈ జినాలయమును శివాలయముగా మార్చినప్పుడు జరిగి యుండవచ్చు. ద్వారపుశాఖల క్రింది భాగమున పూర్ణకుంభములను చెక్కడము జైన సంప్రదాయం [65]. ఈ దేవాలయపు గర్భగృహ ద్వారము క్రింది భాగమున హిందూ దేవాలయములలోవలె ద్వారపాలకులు లేకుండా, జైన సంప్రదాయములో పూర్ణకుంభములు చెక్కబడినాయి. దేవాలయ ప్రాంగణములో నున్న ప్రతిమాశిల్పములు ఈ క్రింద పేర్కొనబడినాయి.



మహాదేవాలయము

**పార్శ్వనాథుడు** :- ఐదు అడుగుల ఎత్తుగల ఈ పార్శ్వనాథ విగ్రహము ఎర్ర ఇసుకరాయితో (Redsandstone) మలచబడింది. యౌవ్వనముట్టిపడుచు కాయెత్సర్గ (Kayotsarga Posture)

రీతిలో నగ్నముగా నిలబడియున్న ప్రతిమ ఇది. పార్శ్వనాథుని వెనుక మెలికలు తిరిగిన సర్పము యొక్క ఏడు పడగలు అతని తలపై భాగమున ఛత్రము వలె బహు అందంగా చెక్కబడినాయి. కాని ఎడమవైపున నుండిన మూడు పడగలు విరిగిపోయినాయి. ప్రస్తుతము ఈ ప్రతిమ ఆలయ ప్రవేశద్వారము లోపలి వైపు గోడకు నిలుపబడింది.

**బాహుబలి** :- నాలుగు అడుగుల ఎత్తున్న ఈ జైన విగ్రహము ఎర్రయిసుకరాయితో మలచబడింది. బాహుబలి తలపై త్రిఛత్రములు చెక్కబడినాయి. ఈ ప్రతిమలో బాహుబలి నగ్నముగా కాయోత్సర్గరీతిలో నిలబడి ఉన్నాడు. అతని బాహువులు మోకాళ్లనంటుచున్నాయి.



పార్శ్వనాథుడు, బాహుబలి



జైన ప్రభామండలి

**జైనప్రభామండలి** :- ఈ దేవాలయ ప్రాంగణములోనే వెనుకభాగమందు ఒక అందమైన జైన ప్రభామండలి పడి ఉంది. ఈ ప్రభామండలి ఒక పెద్ద జైన విగ్రహము యొక్క తల వెనుక భాగముననుండు అందమైన అలంకారము. కాని ఆ పెద్ద జైనవిగ్రహము అదృశ్యమైంది. దానికి సంబంధించిన ప్రభామండలి మాత్రము మిగిలిఉంది. త్రిఛత్రములతో గూడిన ఈ ప్రభామండలికిరువైపుల నున్న చిన్నశాలలలో (Miniature Shrines) ధ్యానముద్రయందున్న జైన తీర్థంకరులు చెక్కబడినారు. ప్రభామండలిపై ఎగురుచున్న గంధర్వులు చామరధారులై ఉన్నారు. త్రిఛత్రముల క్రింద తలభాగమునకై స్థలము వదలబడింది. ఈ ప్రభామండలితో గూడిన అతి పెద్ద ఎత్తైన జైన విగ్రహము నేడు కనబడుటలేదు. శిథిలమై అదృశ్యమై ఉంటుంది.

**సప్తమాతృకల శకలము** :- సప్తమాతృకల శిలాఫలకము నుండి విరిగిపోయిన భాగము ఒక వేదికపై నిలుపబడింది. ఇందులో బ్రాహ్మి, మహేశ్వరి మరియు కౌమారి దేవతలు స్పష్టముగా అగబడుచున్నారు.

**సూర్యుడు** :- ఇది ఒక చిన్న సూర్యప్రతిమ. నాభి క్రింది భాగము శిథిలమై అదృశ్యమైంది. పైకెత్తియున్న రెండు చేతులలో కమలపు మొగ్గలున్నవి. ఇది గూడా అదే వేదిక సమీపమున నిలుపబడింది.

కోరుట్ల జవాహర్ రోడ్‌పై కాలువగడ్డకు సమీపమున నున్న ఆంజనేయ దేవాలయంలో సమీకరింపబడిన విడిప్రతిమలలో పదవ, పదకొండవ శతాబ్దములకు చెందిన చిన్న మకుటము ధరించిన నాలుగు హస్తముల గణపతి, మహిషాసురమర్దని, సూర్య విగ్రహములున్నాయి. కోరుట్ల నడిబొడ్డున నగరేశ్వరాలయము, వేంకటేశ్వరాలయములున్నాయి. ప్రస్తుతమున్న వేణుగోపాలస్వామి ఆలయము నందు 1923లో ఉభయవేదాంతద్వయవర్ధని యను సంస్కృత పాఠశాల స్థాపించబడింది. కాని ప్రస్తుతమిది కరీంనగర్‌కు మార్చబడింది. కోరుట్ల సంస్కృత పాఠశాల వ్యవస్థాపకుడు సేనాపతి నరసింహాచార్యులు మరియు సాహితీసేవలో అగ్రగణ్యులైన శ్రీ శిరశినహల్ కృష్ణమాచార్య శతావధాని కోరుట్ల వాసులకు చిరస్మరణీయులు. కోరుట్ల వాగు ఒడ్డున ఇటీవల నిర్మింపబడిన షిరిడి సాయిబాబా దేవాలయము జనప్రియమైన ఆలయంగా పేరొందింది.

ఒక శతాబ్దము క్రిందట కోరుట్ల కాగిత పరిశ్రమకు సుప్రసిద్ధమైంది. కోరుట్లలోని బండలవాడ ప్రాంతము కాగితపు పరిశ్రమ ఏర్పాటు కావటంతో కాగజ్‌పురాగా రూపొందింది. ఇక్కడి కాగితము హైదరాబాద్, సిద్ధిపేట, వరంగల్, షోలాపూర్, నాందేడ్, తదితర ప్రాంతాలలో అమ్మబడేది. కాని ఈ పరిశ్రమ, ఆధునిక పద్ధతులలో తెల్లకాగితం రావటం వలన కనుమరుగైంది. ప్రస్తుతము కోరుట్ల బీడి పరిశ్రమకు ప్రసిద్ధము. జనాభా క్రమేణ పెరుగుట వలన కోరుట్లలో సిటి మున్సిపాలిటి ఏర్పడింది.

## 11. పొలాస

కరీంనగర్‌కు ఉత్తరమున 56 కి.మీ. దూరంలో పొలాస గ్రామముంది. జగిత్యాలకు 6 కి.మీ. దూరమున ధర్మపురికి పోవు జాతీయ రహదారిపై నున్న ఈ పొలాస గ్రామము ఒకనాడు పొలవాస రాజులు పాలించిన పొలవాస రాజ్యమునకు రాజధానిగా విరాజిల్లింది. పొలవాస రాజులు రాష్ట్రకూట సేనానుల సంతతివారు. పొలాస పంచాయితీ కార్యాలయము సమీపమున నున్న ఒక శిలాస్తంభముపై కేవలము శకసంవత్సరము మరియు వారము మాత్రము చెక్కబడిఉన్నాయి. ఈ శాసనస్తంభము ఏదేని ఒక మంటపనిర్మాణములో వాడియుందురు. ఆరు చిన్న పంక్తులు గల ఈ శాసనములో శకసంవత్సరము 1001 సిద్ధార్థి శ్రావణ శుద్ధ పాద్యమి బృహస్పతి వారమందు అనగా క్రీ.శ. 1079లో కట్టినారని మాత్రమే చెక్కబడిఉంది[66]. వేరొక ప్రధానమైన 49 పంక్తులతో గూడిన కన్నడశిలాశాసనము పులస్త్యేశ్వర దేవాలయ ప్రాంగణమందు నిలిచిఉంది. స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వరుదు, లత్తలూరు పురవరాధీశ్వరుదు, సువర్ణగరుడధ్వజుడు, మూర్తి మకరధ్వజ, త్రివళీ శబ్దఘోషణ, గుణమణి విభూషణ, శరణాగత వజ్రప్రాకార, గండరహీర, పగెవరమల్ల, పరమండల సూరకార, చక్రగొట్టరాయ దిశాపట్ట, మండలిక లలాటపట్ట, శ్రీకేశవదేవ దివ్య శ్రీ పాదపద్మారాధక, పరబలసాధక, ద్విజగురుదేవ పూజాపరాయణ, శ్రీ సత్యనారాయణ నామాది సమస్త ప్రశస్తి సహితుండైన శ్రీమన్మహామండలేశ్వరుదు మేడరాజు

నిజరాజధాని పొలవాసె యందు రాజ్యపాలన చేయుచుండగా వీరబలంజవర్తక సమాజమునకు చెందిన అయ్యావళి-500 స్వాములు, 36 బిడులకు చెందిన ముమ్మారిదండులు మరియు ఉభయ నానాదేశీలు పులస్త్యేశ్వర దేవరకొసంగిన దానముల ప్రసక్తి ఈ శాసనమందు ఉంది[67]. దానముల వివరములు స్పష్టముగా లేవు. పొలాస గ్రామనామము పొలవాస అనియు, అచటి పులస్త్యముని ఆశ్రమము మున్నగు వివరములు ఈ శాసనమందు పేర్కొనబడినాయి. శాసనమందు పులస్త్యాశ్రమ పట్టణమనియు పొలవాస పట్టణమనియు పేర్కొనబడిన ఈ ప్రదేశము నేడు పొలాస (Polas) గ్రామముగా వ్యవహరింప బడుతుంది.

తుంగభద్రానది ఒడ్డున వ్యాపారవర్తక మహానాడు కేంద్రంగా విరాజిల్లిన అలంపురము శాసనములందు కన్నడ ఉభయ నానాదేశీలు-400, 36 బిడులకు చెందిన అయ్యావోలు మరియు ముమ్మారి దండుల వర్తక సంఘముల (Guilds) యొక్క ప్రసక్తి ఉంది[68]. ఈ ప్రాంతమునకు కన్నడ దేశీయులతో వర్తక సంబంధములధికముగా నుండెనని వారు దానధర్మాలు చేసేవారని తెలుస్తుంది. వీరబలంజ సమయ (Guilds) వర్తక సంఘములు గూడా వివిధ దేవాలయములకు విరివిగా దానములిచ్చేవారని తెలుస్తుంది[69]. అలాగే ఈ వ్యాపారసంస్థలు పొలవాసలోని పులస్త్యేశ్వర దేవరకు గూడా దానములొసంగినాయి.

పొలాస గ్రామములో శిథిలాలయములు, అనేక శిల్పములున్నాయి. గ్రామము చుట్టు బలమైన కోట ఉంది. దాని చుట్టుండిన లోతైన కందకముల ఆనవాళ్లు మరియు మట్టిగోడలు అక్కడక్కడా ఉన్నాయి.

పదునాల్గొవ శతాబ్దమునకు చెందిన క్రీడాభిరామములో పొలవాసతో పాటు ఆరు ఏకవీర దేవత స్థావరముల ప్రసక్తి ఉంది. పొలవాస, మందపాక, పెనుపాక, మాహూరము, నాగవరము మరియు ఓరుగల్లు అను ఆరు ప్రదేశములందు ఏకవీర, కాకతమ్మలు కొలువబడుచున్నారని క్రీడాభిరామము నందు పేర్కొనబడింది[70]. ఇందలి 128వ పద్యము చివరలో "కాకతమ్మకు సైదోడు ఏకవీర" యని పేర్కొనబడుట వలన ఓరుగల్లునందు ఏకవీర, కాకతమ్మదేవతలు ఒకరి ప్రక్కనే మరొకరు ప్రతిష్ఠింపబడినారని తెలుస్తుంది.[71] శాక్తేయపూజలు పరివ్యాప్తమగుట వలన దుర్గ, గౌరి, గంగమ్మ, కాకతమ్మ, ఏకవీర, ఇరుకలమ్మ, ఎల్లమ్మ ఇత్యాది దేవతలు మధ్యయుగమందు పూజింపబడినారు[72].

## పులస్త్యేశ్వర దేవాలయము

పొలాస చెఱువుకు ఉత్తరమున పొలములలో పులస్త్యేశ్వరాలయము తూర్పు ముఖమును కలిగి ఉంది. పది అడుగుల చతురస్రాకారపు గర్భగృహమునకు ముందు 7'x9' కొలతలతో అంతరాళముంది. దేవాలయమును బాహ్యము నుండి కొలిచినచో 24 అడుగుల పొడవు 16 అడుగుల వెడల్పును కలిగిఉంది. గర్భగృహద్వారపు శాఖల క్రింద పూర్ణకుంభములు లలాటమున

గజలక్ష్మితో కూడిన పతంగము (Lintel) పైన ముందుకు వచ్చిన చూరు (Projecting Cornice) మలచబడింది. గర్భగృహపు లోకప్పు లుపవితాన (కదలికాకరణ) రీతిలో నుండి మధ్యలో విరబూసిన కమలము క్రింది వైపు చూచునట్లు చెక్కబడింది.

దేవాలయ అధిష్ఠానము సాధారణరీతి (Plain and Simple) లో నుండి దానిపై 6' అడుగుల ఎత్తు గల భిత్తి (wall) ని కపోతము (Cornice) శిఖరము నుండి వేరుచేస్తుంది. శిఖరము మొదట చతురస్రాకారములో నుండి పోను పోను చాపరేఖాకృతి (Curvilinear)ని కలిగి దానిపై నున్న ఆమలకము పై పెద్ద గుండ్రని శిలాకలశము ఉంది.



శిఖరము



నాగిని దేవతలు



నాగిని దేవత

గర్భగృహము, అంతరాళము ముందుగా కట్టినవై ఉంటాయి. వాటి ముందున్న 16 స్తంభముల మంటపమునకు దేవాలయము నంటి యుండిన చిన్నమంటపము (Porch) కూలి యుండుట వలన ఈ రెండింటి మధ్య సందు (gap) ఏర్పడింది. ఈ మంటపము చుట్టు గోడలు నిర్మింపబడినవి. ఈ 16 స్తంభముల మంటపమునానుకొని తూర్పున బహుశః కాకతీయుల కాలములో ఇంకొక 16 స్తంభముల మంటపము నిర్మింపబడింది. ఈ రెండవ దశలో నిర్మింపబడిన మంటపము చుట్టు ఉన్న చిన్న గోడలపై (Parapet wall) కక్షాసనములున్నాయి. ఈ మంటపమునకు తూర్పు, ఉత్తర, దక్షిణములందున్న చిన్న మంటపముల (Porches) ద్వారా లోనికి ప్రవేశింపవచ్చు. పడమటి దిశలో మొదటి మంటపములోనికి ప్రవేశ మార్గముంది. ప్రస్తుతము రెండవ మంటపము తూర్పు దిశ సోపానములపై నుండిన చిన్నమంటపము (Porch) అదృశ్యమైంది. రెండవదశలో నిర్మింపబడిన ఈ మంటప పునాదులు శిథిలమైనాయి. మంటపము పైకప్పు చూరు (Cornice) రాళ్లు అచ్చటచ్చట పడి పోయినాయి. రెండవ మంటపము మధ్యనున్న నాలుగు స్తంభముల నడుమ వర్తులాకారములో ఒక అంగుళము ఎత్తున్న రంగశిల ఉంది. శిథిలావస్థలో నున్న ఈ రెండవ మంటపభాగములను స్థానికులు ఇటీవల మరమ్మతులు గావించి కూలిపోకుండా నిలుపగలిగారు. ఈ రెండవ మంటపము పైకప్పు చూరు కాకతీయుల కాలపు చూరులవలె కొంత వంగి యుండుట (Cornice with slight slant) గమనార్హము.



పులస్త్యేశ్వరాలయము

దేవాలయ మంటపమునకు ఉత్తరమున మెట్లతో గూడిన పిరమిడ్ ఆకారపు శిఖరముతో ఒక చిన్నగుడి (Small Shrine) పార్వతికై నిర్మింపబడింది. ఈ గుడి శిఖరమందు వాడిన ఇటుకలు 11"x8"x2" కొలతలతో నుండి ధృఢముగా ఉన్నాయి. మంటపమునకు ఉత్తరమున నున్న కొనేరు ఒక పెద్ద బావి రూపములో ఇటుకలచే నిర్మింపబడింది. ఇందులోని నీటిని చేరుకొనుటకు దక్షిణదిశలో మెట్లున్నాయి. ఎన్ని కరువుకాటకములు వచ్చినను, వర్షాలు లేక పోయినను ఈ కోనేరు ఎండి పోలేదు. ఎందుకనగా ఈ కోనేరు చెఱువుకు సమీపముననే ఉంది.

**విడిప్రతిమలు** :- పులస్త్యేశ్వర దేవాలయమందు, దాని ప్రాంగణములో అనేక ప్రతిమా శిల్పములు దర్శనమిస్తాయి.



సప్తమాతృకలు

**1. సప్తమాతృకల ఫలకము** :- ఈ సప్తమాతృకల శిలాఫలకము అతిప్రాచీనమైంది. ఎనిమిది, తొమ్మిదవ శతాబ్దములకు సంబంధించినదై ఉంటుంది. ఎందుకనగా ఈ ఫలకముపై కేవలము

ఏడుగురు దేవతలే ద్విహస్తములతో చెక్కబడినారు. చివరల యందు వినాయకుడు గాని, వీరభద్రుడు గాని లేరు. దేవత ఆసనముల క్రింద వారి చిహ్నాములుగాని, వాహనములుగాని లేవు. ఆసీనులైన దేవతల ఎడమకాళ్లు మలచుకొని (Legs Folded) కుడికాళ్లు వ్రేలాడుచున్నట్లు (Legs hanging) ఉన్నాయి. సప్తమాతృకలు కిరీటములతో చెక్కబడినారు. వారు గ్రైవేయకములు, దండ, ముంజేతి, కాలి కడియములు ధరించి యున్నారు. ఈ సప్తమాతృకల శిలాఫలకము బాదామి చాళుక్యుల కాలపు కళారీతులను పోలియుండుట వలన ఇది ఈ జిల్లాలోనే అతిప్రాచీన సంప్రదాయ శిలాఫలకమని చెప్పవచ్చు. తదనంతరపు కాలములో చెక్కబడిన ఫలకములందు, చతుర్భుజముల దేవతలు, వారి వాహనములు, చివరలయందు వినాయక వీర భద్రులుండుట గమనింపదగిన అంశములు. ఆ లక్షణములిందు లేనందున ఇది అతి ప్రాచీన కళారీతులలో నున్న ఫలకము.

**2. దేవీ విగ్రహము** :- చతుర్భుజములతో కూడిన ఈ దేవి పైనున్న కుడిచేతిలో డమరుకము, ఎడమచేతిలో త్రిశూలము క్రింది కుడిహస్తము నందు ఖడ్గము, ఎడమచేతిలో గిన్నె (Bowl) చెక్కబడినాయి. కరండ మకుటమును ధరించిన ఈ దేవి ఎడమకాలు మలచుకొని ఉండగా వ్రేలాడుచున్న కుడికాలు ప్రక్కకు నంది మలచబడిఉంది. నంది వాహనమున్నందున ఈమె శివుని అర్ధాంగి యనవచ్చు. ఈ ప్రతిమా శిల్పము ఒకనాడు కళ్యాణి చాళుక్యులకు రాజధానులుగా వెలసిన పటంచెరువు, కొలనుపాకలోని విగ్రహములను పోలిఉంది[73]. ఇలాంటి ప్రతిమలనేకములు కరీంనగర్ జిల్లా అంతటను కనిపిస్తాయి.

**3. వీరగల్ శిల్పము** :- ఎడమచేతిలో డాలు, పైకెత్తిన కుడిచేతిలో ఖడ్గము ధరించిన యోధుడు చెక్కబడిన శిల్పమిది. అతని వెంద్రుకలు ఒక ప్రక్కకు శిఖరూపములో మలచబడినాయి. అతనికి ఎడమవైపున తొండమును పైకెత్తిన గజము చెక్కబడింది.

**4. వీరగల్ శిల్పము :-** చేతులలో డాలు, ఖడ్గము ధరించిన ఈ వీరుని కేశములు అతని ఎడమ ప్రక్కకు మలచబడి ముడివేసిన శిఖరూపమున ఉన్నాయి. అతని కాలి వ్రేళ్లకు ఉంగరములున్నాయి. అతడు నడుమునకు బాకును (dagger) ధరించి ఉన్నాడు. అతనికి ఎడమవైపున గల పడతి తన కుచముల మధ్య హస్తములు కలిపి అంజలి ముద్రలో ఉంది.

**5. గణపతి** :- చిన్నమకుటమును ధరించి ద్విహస్తములతో నున్న విగ్రహమిది.

**6. గణపతి** :- చతుర్భుజములతో, విశాలమైన చాటలలాంటి చెవులతో మకుటమును ధరించిన వినాయకుని విగ్రహమిది.

**7. నాగిని** :- ఈ ప్రతిమా శిల్పము యొక్క ఊర్ధ్వభాగము స్త్రీ రూపములోను నాభి నుండి క్రింది భాగము సర్పరూపములోను మలచబడింది. శిల్పరత్న గ్రంథములో పేర్కొనినట్లు ఈమె దక్షిణ హస్తమందు ఖడ్గము, వామ హస్తము నందు డాలు ధరించి ఉంది[74]. సర్పము యొక్క ఐదు పడగలు ఆమె తలపై భాగమున విప్పుకొని ఛత్రమువలె ఉన్నాయి. ఆమె గ్రైవేయకమును మరియు

ఆమె స్తనములపై వ్రేలాడు హారమును ధరించి ఉంది. ఆమె మకుటమును ధరించలేదు. ఈ నాగిని ప్రతిమలను సాధారణంగా పిల్లలు కలగని స్త్రీలు ప్రతిష్ఠించుచుంటారు[75].

పొలాస యందు దాదాపు ఒక దజన్ నాగిని ప్రతిమలున్నాయి. ఈ శిల్పములు మహబూబ్‌నగర్ జిల్లాలోని అలంపురం, నల్గొండ జిల్లాలోని కొలనుపాక, తూర్పు గోదావరి జిల్లాలోని బిక్కవోలు ప్రాంతములందు గల శిల్పములను పోలి ఉన్నాయి. పులస్త్యేశ్వర దేవాలయ ప్రాంగణములో చాళుక్య కళారీతులలోని నంది విగ్రహములు, వీరగల్లుల ప్రతిమలు మరియు చతుర్భుజములు కలిగిన సప్తమాతృకల శిథిలమైన ఫలకము తదితరమూర్తి శిల్పములు అనేకములు పడి ఉన్నాయి.

## చెఱువు కట్టపై నున్న దేవాలయము

చెఱువు కట్టపై నుండిన దేవాలయము సంపూర్ణముగా శిథిలమై కూలిపోయింది. దాని స్తంభములు, లోకప్పు ఫలకముల పై చెక్కబడిన విరబూసిన కమలములు తదితర అవశేషాలు నీటిలో కట్ట ప్రక్కకు పడి ఉన్నాయి. కట్టపై పెద్ద లింగములు, అన్నపూర్ణవిగ్రహము, పెద్ద వినాయకుని విగ్రహము మున్నగు ప్రతిమా శిల్పములు సందర్శకుల దృష్టిని ఆకర్షిస్తాయి. ఇటీవల గ్రామస్థులు రెండు చిన్న మందిరములు కట్టపై నిర్మించి ఈ విగ్రహములను వాటిలో నిలిపారు.


అన్నపూర్ణ


గణపతి


జైన ప్రతిమ

**అన్నపూర్ణ విగ్రహము** :- మూడు అడుగుల ఎత్తున్న గ్రానైట్ రాతి ఫలకము పై ఉబ్బుగా (Carved in bas-relief) చెక్కబడిన ప్రతిమ ఇది. ఈమె ఉన్నత కుచములతో నున్న దేవత. చతుర్భుజములున్న ఈ దేవత పైహస్తములలో డమరుకము, త్రిశూలము లుండగా క్రింది వామహస్తముతో కుండను పట్టుకొని దక్షిణహస్తములోని తెడ్డు (A wooden spoon or ladle) తో అన్నమును వడ్డించుటకై బయటకు తీయుచున్నట్లుగా మలచబడింది. అన్నమును అందించు ఈ ప్రతిమను అన్నపూర్ణగా, పరమశివుని అర్ధాంగిగా వ్యవహరింపబడుచున్నది. ఈ ప్రతిమలు కేవలము దక్కన్‌లోనే కనిపిస్తాయి. పొలాసలోని అన్నపూర్ణ ఎడమకాలును అడ్డముగా మలుచుకొనగా కుడికాలు పొడవుగా మలుచుకొని కూర్చొని ఉంది. కరండ మకుటమున్న ఈ

దేవత గ్రైవేయకములు, పత్రకుండలములు, దండ, ముంజేతి, కాలి కడియములతో అలంకరింపబడింది. గ్రీవమందున్న హారము స్తనముల మధ్య వ్రేలాడుచున్నది. దేవత వెనక మకరతోరణమున్నది. దీనికంటే కొంత చిన్నగా నున్న చతుర్భుజముల అన్నపూర్ణ ప్రతిమ ఒకటి కాళేశ్వరములోని ముక్తేశ్వరాలయ ప్రాంగణము ముందు నిలుపబడిన అనేక మూర్తి శిల్పములలో ఒకటిగా పడి ఉంది. ఇలాంటి అన్నపూర్ణ ప్రతిమ పొలాస ప్రక్క గ్రామమైన జాబితాపూర్‌లోని చిన్నగుడిలో ఉంది. అరుదైన ఈ శిల్పము చూడ ముచ్చటగా ఉంది. ప్రస్తుతము ఇది నూతనముగా చెఱువు కట్టపై నిర్మించిన ఒక గుడిలో బృహత్ లింగముతో పాటు నిలుపబడిఉంది.

**గణపతి** :- అనేక సంవత్సరాలుగా ఎండకు ఎండి, వానకు తడిచి కొంత అరగి పోయిన ఈ బృహత్ గణపతి పూర్ణ చిత్ర శిల్పము చాల అందంగా ఉంది. ఇప్పుడిది గ్రామస్థులచే నూతనముగా చెఱువు కట్టపై నిర్మింపబడిన గదిలో నిలుపబడింది. గణపతి ఎడమకాలు మలచబడి కుడికాలు వ్రేలాడుచు చెక్కబడింది. ద్విహస్తములతో గూడిన ఈ గణపతి తలపై చిన్న మకుటముంది. వామహస్తము నందు పొడుగాటి దంతము, దక్షిణహస్తములోని పాత్రలో మోదకములుండగా తొండము యొక్క కొన వాటిపై నిలుపబడి ఉంది. గణపతి యజ్ఞోపవీతము ముంజేతి కడియములు ధరించి ఉన్నాడు. తొలికాలపు ప్రతిమలలో మకుటము కానరాదు. కళింగుల సంప్రదాయానుసారము తూర్పు చాళుక్యుల కాలపు బిక్కవోలు గోలింగేశ్వరాలయములోని గణపతి ప్రతిమలు చిన్న మకుటములను (Short Makutas) కలిగి ఉన్నాయి[76]. కాని అక్కడి ప్రతిమలు చతుర్భుజములతో నుండగా వాటికి భిన్నముగా పొలాస బృహత్ గణపతి ద్విహస్తములతో నుండుట విశేషం.

పొలాస చెఱువు కట్టపై శిథిలమైన పూర్వపు దేవాలయమునకు సంబంధించిన పానవట్టములు, లింగములు, చాళుక్య కళారీతిలోని నంది మున్నగు ప్రతిమలు నయనానందంగా ఉన్నాయి.

## వేణుగోపాల స్వామి దేవాలయము

పొలాస గ్రామము మధ్యలో ఈ దేవాలయం తూర్పు ముఖమును కలిగి ఉంది. గర్భగృహము, అంతరాళముతో నున్న ఈ దేవాలయము ముందు ఒక వేదిక గలదు. కాని దానిపైన గల మంటపము నేడు కానరాదు. చాళుక్య కళారీతిలో నున్న త్రిశాఖలతో గూడిన అంతరాళ ద్వారము బహురమ్యంగా ఉంది. శాఖలకు క్రింది భాగమున నున్న ఫలకములందు గల వైష్ణవ ద్వారపాలకులకు ఇరువైపుల వింజామరలతో గూడిన అందమైన స్త్రీల రూపములు (Lady attendants with fly whisks or chowries) మలచబడినాయి. అరుదైన కేశాలంకరణ, అంగసౌష్ఠవము, ఆభరణముల భారము, ఉన్నత కుచద్వయము, వాటి మధ్యన వ్రేలాడుచున్న హారములతో నిండు యౌవ్వనము తొణకిసలాడుచున్న రమ్యమైన ఈ స్త్రీల రూపములు చూపరుల

దృష్టి నాకర్షిస్తాయి. చతుర్భుజములు గల ద్వారపాలకుల పైకుడిచేతిలో శంఖము, ఎడమచేతిలో చక్రము క్రింది కుడిహస్తము అభయ ముద్రలో నుండగా ఎడమ హస్తము నందు గద ఉంది. చామర గ్రాహిణుల కుడిచేతులు పైకెత్తి ఉండగా ఎడమచేతులు వారి తొడలపై నిలుపబడినాయి. అంతరాళ ద్వారపు లలాటమున గజలక్ష్మి చెక్కబడింది. త్రిశాఖలలో మధ్యన కుడ్య స్తంభాకారముండగా దాని కిరువైపుల పద్మలతాశిల్పములు, జంతు శిల్పముల బారులు చెక్కబడినాయి.

దేవాలయ అధిష్ఠానమందొక పట్టము కన్పట్టును. మిగిలిన భాగము భూమిలో మునిగి పోయింది. భిత్తిపై నున్న చూరు శిఖరమును వేరు చేస్తుంది. మెట్లతో గూడిన పిరమిడ్ ఆకారపు ఈ శిఖరము నాలుగు వైపుల మధ్యలో నున్న త్రిభుజాకారపు సన్నని పట్టి మెట్లను కలుపుచూ మలచబడింది. (The spire is in stepped pyramidal form with a wide tapering band in the Centre on all four sides) దేవాలయము ముందు 20' ఎత్తున్న శిలాస్తంభముపైన నాలుగు చిన్న స్తంభములతో ఒక చిన్న మంటపము (Miniature Mandapa) నిలిచి ఉంది. అందులో నుండిన గరుడ ప్రతిమ ప్రస్తుతము ప్రాంగణములో పడి ఉంది. మకుటమును ధరించి అంజలి ముద్రలో నున్న గరుడుడు తన రెక్కలతో ఎగురుచున్నట్లు మలచబడినాడు. అతనికి కుడివైపున శంఖము ఎడమ వైపున చక్రము చెక్కబడినాయి. ఈ ప్రతిమ నల్లసరపు రాయితో మలచబడింది.

వేణుగోపాల దేవాలయము చుట్టూ ఎత్తైన మట్టిగోడలున్నాయి. ఈ ఆలయ ప్రాకారము ముందున్న వీరగల్ శిల్పముపై దేవనాగరిలిపిలో చిన్న శాసనపంక్తి చెక్కబడింది. చెఱువు కట్టపై నున్న వీరగల్, పులస్త్యేశ్వర ప్రాంగణమందున్న వీరగల్, ప్రతిమలపై గూడా ఇలాంటి ఏకపంక్తి, ద్విపంక్తి శాసనములు కన్పట్టును. వేణుగోపాలాలయమునకు తూర్పున కొన్ని అడుగుల దూరంలో నున్న వేదికపై నిలువెత్తు హన్మంతుని విగ్రహములున్నాయి. దీని సమీపమున సేకరింపబడిన గణపతి ప్రతిమ ఏనుగుతలతో ద్విహస్తములను కలిగిఉంది. ఇలా గ్రామమంతటను చిత్ర శిల్పములున్నాయి.

## ఎల్లమ్మగుడి

పొలాస చెఱువుకట్ట దక్షిణ చివరిభాగములో ఎరుకలవాడకు సమీపమున ప్రాచీనమైన అనేక శిల్పాలు పడిఉన్నాయి. అచటి దేవాలయము పూర్తిగా శిథిలమై దాని స్తంభములు, పై కప్పు శిలలు చుట్టు పక్కల పడిఉన్నాయి. శిల్పములన్నియు రక్షణ లేక బాహ్య వాతావరణములో అరిగి పోయినాయి. ఇటీవల గ్రామస్థులు ఒక నూతన దేవాలయమును నిర్మించి క్రొత్త విగ్రహములు ప్రతిష్ఠించారు. చాళుక్యుల కళారీతులలో నున్న కొన్ని మూర్తిశిల్పములు బయట పడియున్న వాటిని వివరించుట ఆవశ్యకము.

1. **మహిషాసురమర్దని :-** ఇది కూర్చొనియున్న అరుదైన ప్రతిమాశిల్పము. మహిషాసురమర్దని

అష్టభుజములలో మూడు విరిగిపోయినాయి. ఆమె కుడి హస్తములందు చక్రము, ఖడ్గము, త్రిశూలములుండగా వామహస్తము లందు శంఖము, డాలు అగబడుచున్నవి. ఆమె కుడి కాలు మోకాలివద్ద మలచబడి పాదమును మహిషునిపై నిలిపింది. సాధారణమైన ఆభరణములన్నింటితో పాటు ఆమె వనమాలను ధరించిఉంది. ఆమె వాహనమైన సింహము ఆమెకు కుడివైపున వేరుగా చెక్కబడింది.

**2. భైరవుడు** :- తల వెనుక కాంతి మండలి (halo) ని కలిగి త్రిభంగములో నిలబడియున్న నగ్న ప్రతిమా శిల్పమిది. భైరవుని పైహస్తములందు డమరుకము, త్రిశూలములుండగా క్రింది హస్తములు (Lower hands) విరిగి పోయినాయి. ఈ ప్రతిమ కంటె కొంచెము చిన్నగా నున్న వేరొక భైరవశిల్పము అచటనే పడి ఉంది.

**3. పెద్ద గుండ్రాయి పై నున్న భైరవుడు :-** చతుర్భుజములతో కూడిన భైరవుడు ఒక స్థిరమైన గుండ్రాయిపై చెక్కబడి ఉన్నాడు. (The figure is carved in low relief on an immovable boulder) అతని పైహస్తములందు డమరుకము, త్రిశూలములుండగా క్రింది హస్తములలో ఒకటి అరిగిపోగా వేరొక దానిలో కపాలము ఉంది. నాభి క్రింద నున్న భాగము చాలా మట్టుకు అఱిగిపోయింది.

**4. గణపతి** :- చతుర్భుజములతో కూర్చొని యున్న ఈ గణపతి తల ఛేదింపబడి ఉంది.

**5. నాగిని :-** ఈ శిల్పము ఊర్ధ్వభాగము స్త్రీరూపములో నాభి నుండి అధోభాగము సర్పరూపములో నుండి ఆమె తలపై ఐదుపడగలు ఛత్రరూపమున చెక్కబడినాయి. ఆమె తలపై మకుటము లేదు. ఆమె కుచములపై హారము వ్రేలాడుచున్నది. ఇచటనే వేరొక ప్రతిమలోని నాగిని మకుటము, కుండలములు, దండ కడియములు ధరించి రెండు చేతులందు ఖడ్గము, డాలు ధరించి ఉంది. పొలాస యందలి నాగశిల్పములు సగము మానవాకృతిలోను, మిగిలిన సగము సర్పరూపములో నుండి మహాబలిపురములోని ఏడవ శతాబ్దమునకు చెందిన సువిశాలమైన అర్జునుని తపస్సు ఫలకముపై చెక్కబడిన (A panel of penance of Arjuna at Mahabalipuram datable to 7th Century A.D.) నాగిని రూపములను పోలిఉన్నాయి[77].

ఎల్లమ్మగుడి సమీపముననే అంజలి ముద్రలో కూర్చొని ఉన్న ఒక భక్తురాలి (Female devotee) శిల్పముంది. ఆమె కుండలములు, గ్రైవేయకములు, ముంజేతి కడియములు, గాజులు ధరించి ఉంది. ఆమె కేశములు అందంగా మలచబడిఉన్నాయి. ఇద్దరు గుఱ్ఱపురౌతులు (Two Cavaliers) ఖడ్గములతో ద్వంద్వ యుద్ధము చేయుచున్న శిలాఫలకమొకటి ఇచట పడిఉంది. లోకప్పు మధ్యన వాడునటువంటి చతురస్రాకారపు శిలాఫలకము పై విరబూసిన పద్మము చెక్కబడి ఉంది. (A Central square slab of the ceiling carved with a full blown lotus). వీటితో పాటు మరికొన్ని శిథిలమైన ప్రతిమలు ఇచట పడిఉన్నాయి.

**జైన చిహ్నాములు** (Jain vestiges)

పొలవాస ప్రభువులు, శైవ, వైష్ణవ మతములతో పాటు జైన మతము నాదరించి పోషించారు. నర్సంపేట తాలుకాలోని బాణాజిపేటలో మేదరాజు వీరకమల జినాలయమును కట్టించెనని అచటి క్రీ.శ. 1082 శాసనము తెలుపుతుంది. పొలాస యందున్న జైన విగ్రహములను బట్టి ఇచట కూడా ఒక జినాలయము ఉండెనని చెప్పవచ్చు.

**1. జైనప్రతిమ :-** పొలాసలోని కొలిచాల విశ్వనాథం అతని భవన నిర్మాణమునకై పునాదులు త్రవ్వుచుండగా కాయోత్సర్గరీతిలో నిలబడియున్న రెండడుగుల ఎత్తున్న అద్భుతమైన జైన ప్రతిమాశిల్పమొకటి బయల్పడింది. ఈ జైన తీర్థంకరుని వెనుక మెలికలు తిరిగిన సర్పము మలచబడలేదు. తలపై పడగలు లేకుండా ఉంగరాల జుట్టు చెక్కబడి ఉంది. చెఱువు నానుకొని ఉన్న సత్యనారాయణ దేవాలయములో నిలుపబడిన ఈ అందమైన మూర్తి శిల్పము నేడు కనిపించుటలేదు.

**2. తెల్ల గుట్టపై నున్న జైన విగ్రహము** :- పద్మాసనములో కూర్చొని యున్న జైన తీర్థంకరుని ప్రతిమాశిల్పమొకటి పులస్త్యేశ్వర దేవాలయమునకు సమీపముననే పడమట నున్న తెల్ల గుట్టపై పడి ఉంది. కాని దీని తల ఛేదింపబడింది. తలలేని ఈ తీర్థంకరుని హస్తములు ధ్యానముద్రలో ఉన్నాయి. బాగా అఱిగి పోయి చెదరిపోయిన ఈ విగ్రహము వేములవాడ భీమేశ్వరాలయపు అరుగులపై నిలుపబడిన జైన విగ్రహములను బోలిఉంది.

పదకొండవ పన్నెండవ శతాబ్దములలో రాజధానిగా వెలసిన పొలవాస పట్టణము జైన, శైవ, వైష్ణవ మతముల పోషణకు గొప్ప కేంద్రంగా విరాజిల్లింది.

## 12. నంది మేడారం

కరీంనగర్‌కు ఈశాన్యము నందు గల నంది మేడారం గ్రామమును లక్షెటిపేట రహదారిపై నున్న ధర్మారం మండల కేంద్రము నుండి చేరవచ్చును. రెండు గుట్ట బోరులను కలుపుతూ నిర్మించిన పెద్ద చెఱువు కట్ట వెనుక భాగమున నున్న ఈ గ్రామమునందు రెండు శాసనములు లభ్యమైనాయి. కాకతీయుల కళారీతులలో చెక్కబడిన ఒక బృహత్ నంది విగ్రహము ఇచటనుండుటచే ఈ గ్రామము నందిమేడారంగా పిలువబడుతుంది.

శకవర్షములు 1098 దుర్ముఖి సంవత్సరము అనగా క్రీ.శ. 1175 సంవత్సరమునకు చెందిన శిథిల శాసనమొకటి (Fragmentary epigraph) గ్రామమునందు గల చిన్నకొండాల్‌రావు ఇంటిముందు నిలిచి ఉంది[78]. నాలుగువైపుల చెక్కబడిన ఈ శాసనములోని అంశములు ఒకదానికొకటి పొంతన లేకుండా ఉన్నాయి. మొదటి ప్రక్కలో బండి బ్రమ్మెనాయకుడు కేశవదేవరకు వెలిచేను వంటి భూదానములిచ్చినట్లున్నది. రెండవ ప్రక్కలో శకవర్షములు 1098 దుర్ముఖి

సంవత్సరముతో పాటు మేదరాజు త్రికూటాలయమును నిర్మించినట్లున్నది. మూడవ ప్రక్కలో శ్రీ మన్మహామండలేశ్వర కాకెత రుద్ర దేవరాజు పేర్కొనబడినాడు. ఇందులోని కాకెతపదము కాకతీయ శబ్దమును సూచిస్తుంది. నాలుగవ ప్రక్కలో ప్రోలేశ్వర, లక్ష్మీశ్వర దేవరలకు దానములిచ్చినట్లు పేర్కొనబడింది. నాలుగు ప్రక్కలందు చెక్కబడిన ఈ శిథిలశాసనమందలి అంశములలో సమన్వయము లేనందున వ్యాఖ్యానించుట కష్టము.

శాసనమందు పేర్కొనబడిన మేదరాజు పొలవాస దేశమును పాలించిన రెండవ మేదరాజై ఉంటాడు. అతడు 1175లో త్రికూటాలయము నిర్మించెనని శాసనమందున్నది. కాని అతని అధికారము క్రీ.శ. 1159 వరకే కొనసాగింది. ఎందుకనగా అదే సంవత్సరములో కాకతీయ రుద్రదేవుడతనిని మానేరునది సమీపమున జరిగిన నగునూరు యుద్ధములో నోడించి పొలవాస రాజ్యమును వశపరచుకొన్నాడు. అందువలన రెండవ మేదరాజు క్రీ.శ. 1175 వరకు పాలించినాడనుటకు వీలు లేదు. శాసనమందలి తేది స్పష్టముగా లేదు. ఎందుకనగా శిథిలమైన ఈ శాసనాంశములు చాలా వరకు అఱిగిపోయినాయి. లేదా శిల్పి తేదిని చెక్కడంలో పొరపాటు చేసి యుండవచ్చు. ఏది ఎట్లున్నను మేదరాజే త్రికూటాలయము నిర్మించెనని స్పష్టముగా శాసనమందున్నది. కావున ఈ గ్రామమందలి త్రికూటాలయము పన్నెండవ శతాబ్దపు ప్రథమార్ధభాగములో ఈ ప్రాంతమందు పరివ్యాప్తమై యున్న కళారీతులకు కాణాచిగా నిలిచి ఉంది. తరువాత కాలములో కాకతీయులు నిర్మించిన అద్భుతమైన త్రికూటాలయముల సౌందర్యము మిన్ను ముట్టింది. అట్టి అందము దీని నిర్మాణములో కానరాదు.

తేదిలేని కాకతి గణపతి చక్రవర్తి కాలపుశాసనమొకటి అమరేశ్వర దేవాలయము వద్ద నున్నది. నాలుగు ప్రక్కలందు చెక్కబడిన ఈ శిలాశాసనమందలి అక్షరములు చాలా మట్టుకు అఱిగిపోయి వివరములు తెలియుటలేదు[79]. ఈ శాసనమందు పేర్కొనబడిన గణపతిదేవునికి కుడి భుజముగా వ్యవహరించిన పల్లవుల వంశమునకు చెందిన ప్రముఖనాయకుని పేరు తెలియుట లేదు. ఇది గ్రామమందు లభ్యమైన రెండవశాసనము. త్రికూటాలయమునకు కొంతదూరములో గాండ్ల గౌరయ్య ఇంటి ముందున్న చిన్న శిలాశాసనము పురావస్తు శాఖవారి దృష్టికి వచ్చినట్లు లేదు. అది ఇంతవరకు రికార్డు చేయబడలేదు. చెఱువు కట్టపై నున్న త్రికూటాలయము వెనుక భాగాన నున్న కోట బురుజు క్రమముగా శిథిలమగుచున్నది. ఈ కోట బురుజులో ఒక సొరంగ మార్గమున్నట్లు కనిపిస్తుంది.

## త్రికూటాలయము

చెఱువు కట్టపైన తూర్పు చివరలో నున్న త్రికూట దేవాలయము ఉత్తర ముఖమును కలిగి ఉంది. తూర్పు, దక్షిణములందుండిన గర్భగృహములు మరియు మంటపమునకుత్తరమున నుండిన ప్రవేశ మంటపము (Porch) నేడు కానరావు. వాటి శిథిలములు అచటనే పడి ఉన్నాయి.

పడమటి గర్భగృహము మరియు మంటపము మాత్రము శిథిలావస్థలో నిలిచిఉన్నాయి. ఆలయ అధిష్ఠానము మరియు గోడలు సాదాగా (Simple and plain) ఉన్నాయి. పదహారు స్తంభములతో గూడిన మంటపము చుట్టూ పిట్టగోడ (Parapet wall) ఉంది. మంటపములోని తొమ్మిది విభాగములందు లోకప్పు ఉపవితాన (కదలికాకరణ) రీతిలో నుండి మధ్యలో కప్పబడిన చతురస్రాకారపు ఫలకములు విరబూసిన పద్మములను కలిగి ఉన్నాయి. పడమట నిలిచిఉన్న ఆలయము (Western Shrine) ముందున్న పిట్టగోడలపై ఇరువైపుల చిన్న (Miniature Shrines) దేవకోష్ఠములుండుట ఈ మంటపము యొక్క ప్రత్యేకత. పిట్ట గోడలపై (Over the parapet wall) చిన్న చిన్న కోష్ఠములు (Miniature shrines) నిలుపు సంప్రదాయము రాయికల్ త్రికూటాలయములో గూడా కన్పట్టును. తరువాత కాలములో ఈ సంప్రదాయము ననుసరించి రామప్ప, చంద్రవెల్లి, కొత్తపెల్లి దేవాలయములలో కాకతీయులు ఇటువంటి చిన్న కోష్ఠములు నిలిపినారు.

పడమట నిలిచియున్న గర్భగృహము ముందు ద్వారములేని అంతరాళము మాదిరిగా అర్ధమంటపము రాయికల్, వాల్గొండ త్రికూటాలయములలోని రీతులలో నిలిచి ఉంది. శివలింగము ప్రతిష్ఠింపబడిన ఈ గర్భగృహ ద్వారపు శాఖల క్రింది భాగమున శైవద్వారపాలకులు ఉన్నారు. పతంగముపైన ముందుకు చొచ్చుకొని వచ్చు చూరుచుట్టు కుండలములు లేదా కమలపు మొగ్గలు (Projecting cornice over the lintel decorated with pendants) ఝూరావళి వలె అందంగా వ్రేలాడుతున్నాయి. ఈ చూరుపై భాగమున తోరణమందు శిఖర అంతస్తులు చెక్కబడినాయి. (The turrets are sculptured on the architrave) మంటపమునకు దక్షిణమున వైష్ణవ ద్వారపాలకులతో గూడిన ద్వారపు శిథిలములు పడి ఉన్నాయి. వీటిని బట్టి దక్షిణ గర్భగృహము వైష్ణవాలయమై ఉండవచ్చు. శాసనమందు గల బంది బ్రమ్మె నాయకుడు ఇందులోని కేశవదేవరకు దానములిచ్చి ఉంటాడు. తూర్పున నుండిన గర్భగృహపు వివరములు తెలియుటలేదు. చాళుక్యుల కళారీతిలో నున్న నంది మంటపమందు నిలువ బడి ఉంది.



త్రికూటాలయము

## అమరేశ్వర దేవాలయము

చెఱువు కట్టపైన పడమటి చివరలో గర్భగృహము, అంతరాళముతో గూడిన అమరేశ్వరాలయము నేటికి పూజలందుకొనుచున్నది. ఆలయ మంటపము శిథిలమై అదృశ్యమైంది. ఆలయ శిఖరము పిరమిడ్ రూపము (Stepped pyramidal form) లో ఉంది. పైన కలశం కనిపిస్తుంది. చతురస్రాకార శిఖరమునకు నాలుగు వైపుల సింహముద్రికలున్నాయి. త్రిశాఖలతో గూడిన గర్భగృహ ద్వారపు క్రింది భాగమున 2' x 2' కొలతలతో నున్న ఫలకములపై శైవద్వారపాలకులు అందముగా మలచబడినారు. ఈ ద్వారపాలకుల కిరువైపుల అందమైన అంగ సౌష్ఠవమున్న చామర ధారిణులు చెక్కబడినారు. చాళుక్య రీతులలో నున్న నంది మరియు పెక్కు నాగశిల్పములు ఈ ఆలయమందు చూడవచ్చు.

## నంది ముందున్న దేవాలయము

గ్రామము మధ్యలోనున్న పెద్ద నంది ముందుండిన దేవాలయము శిథిలమై అదృశ్యమై కేవలము విశాలవేదిక మాత్రము మిగిలి ఉంది. ఈ వేదికపై ఆనాటి శిలాస్తంభమొకటి నేటికి నిలిచి ఉంది. లింగముతో గూడిన పానవట్టము, నాగినిప్రతిమ, గణపతి, సప్తమాతృకల శిథిల ఫలకము, మున్నగు శిల్పములు ఈ వేదికపై సమీకరింపబడి ఉన్నాయి.



బృహత్ నంది



నాగకన్య

### బృహత్ నంది

వేదిక (Platform) ముందు కాకతీయుల కళారీతులుట్టిపడు రమ్యమైన బృహత్ నంది విగ్రహమొకటి శిలాపీఠము (pedestal) పై మలచబడిఉంది. ఇది కరీంనగరము జిల్లాలోనే అతి పెద్ద నంది విగ్రహము. అద్భుతమైన అందమైన ఈ నంది హనుమకొండ వేయి స్తంభాల గుడి ముందున్న నందిని బోలియున్నది. పరిమాణములో నిర్మాణములో ఇవి దాదాపు సమానముగా ఉంటాయి. ఇచటి నంది 8 అడుగుల పొడువు 5 అడుగుల ఎత్తుండగా హనుమకొండలోని నంది $7^1/_2$ అడుగుల పొడువు 5'-8" ఎత్తును కలిగిఉంది. పొడువులో ఇచటి నంది ఆరు

అంగుళములు ఎక్కువగా నుండగా హనుమకొండలోని నంది ఎనిమిది అంగుళములు దీనికంటె ఎక్కువ ఎత్తును కలిగిఉంది. ఇచటి నంది లలాటము (Fore head) కంఠము (Neck) అనేక హారములతో ఆభరణములతో అలంకరింపబడినాయి. మెద నుండి ఒకదాని క్రిందనొకటి రెండు గంటలు (Bells) వ్రేలాడుతున్నాయి. క్రింది గంట పైదాని కంటే పెద్దగా ఉంది. నంది పాదములు గూడా ఆభరణములచే అలంకరింపబడినాయి. నంది దేహమంతటను గల చిన్న గంటల హారములు, మువ్వల మరియు గజ్జెల హారములు, శిల్ప ఔన్నత్యమును చాటును. ఈ నంది సజీవముగా నున్నట్లు మలచబడుట విశేషం. జీవచైతన్య ముట్టిపడునట్లు ఈ నందిని మలచిన శిల్పి తన శిల్పకళ యందు పరాకాష్ఠను పొందినాడనుటలో అతిశయోక్తి లేదు. ఈ నంది నితంబముల (Rumps) ను చుట్టుచూ దేహమంతటను పరివ్యాప్తమై యున్న అతి సూక్ష్మమైన ప్రశస్తమైన చెక్కడములతో నున్న హారము (Festooned rump garland) కాకతీయ శిల్పకళావైభవమును చాటుతుంది[80].

**నాగకన్య** :- నాలుగు అడుగుల ఎత్తు, రెండున్నర అడుగుల వెడల్పున్న శిలాఫలకముపై మలచబడిన ఈ నాగకన్య ప్రతిమ కరీంనగర్ జిల్లాలో అన్నింటికంటె పెద్దది, రమ్యమైంది. ఈ శిల్పము ఊర్ధ్వభాగము స్త్రీ రూపములోను, నాభినుండి అధోభాగము సర్పరూపములో నుండి ఆమె తలపై అనేక పడగలు (Multi-hooded canopy) ఛత్రము వలె మనోహరంగా చెక్కబడినాయి. ఈ సుందర నాగకన్య నడుము సన్నముగా నుండి ఆమె కుచముల మధ్య హారము వ్రేలాడుచున్నది. ఆమె వామహస్తమందు డాలు, దక్షిణహస్తమందు ఖడ్గము ఉన్నాయి. ఆమె మకుటము, కుండలములు, గ్రైవేయకములు, కటిబంధము మున్నగు ఆభరణములను ధరించిఉంది. ఆమె కిరువైపుల పడగలతో గూడిన మెలికలు తిరిగిన నాగసర్పములు చెక్కబడినాయి. ప్రస్తుతమీ ప్రతిమ అమరేశ్వరాలయము ముందు నిలుపబడి ఉంది.

**గణపతి** :- మకుటములేని ఏనుగుతల గలిగిన ద్విహస్తముల గణపతి యొక్క తొండము కొన అతని దక్షిణ హస్తమందున్న మోదకములపై నిలుపబడింది. అతని వామహస్తములో దంతమున్నది.

## 13. రాయికల్

కరీంనగర్‌కు వాయువ్యమందు 70 కి.మీ. దూరములో నున్న పెద్దగ్రామము రాయికల్ నేడొక మండలకేంద్రము. జగిత్యాలకు 20 కి.మీ. దూరములో నున్న ఈ గ్రామమును బసు ద్వారా జేరవచ్చు. రాయికల్ చెఱువునకు తూర్పున సమీపమందే గల గుడికోటలో చాళుక్యుల శిల్ప కళారీతులలో నిర్మింపబడిన త్రికూటాలయము పదకొండవ శతాబ్దమునకు చెందినదై యుండును. దీనినిప్పుడు పంచముఖ లింగేశ్వర కేశవనాథ దేవాలయముగా పిలుస్తున్నారు. ఈ గుడి ఒకప్పుడు కోటలో నుండుట వలన ఈ ప్రదేశము ఇప్పటికిని గుడికోటయని పిలువబడుతుంది. ప్రాచీనకోట చిహ్నములు, కూలుచున్న మట్టి ప్రాకారములు నేటికి

కనిపిస్తున్నాయి. 1980లో ప్రభుత్వము దేవాలయ పునరుద్ధరణ కార్యక్రమము చేపట్టింది. ఆలయమందలి శిల్పములను బయటకు తరలించారు. రెండు దశాబ్దములు గడిచినను జీర్ణోద్ధరణ జరుగలేదని స్థానికులు వాపోవుచున్నారు. ఈ దేవాలయ ప్రాంగణమందున్న క్రీ.శ. 1305 తెలుగు శిథిల శిలాశాసనమును పురావస్తుశాఖ రికార్డ్ చేసి ప్రకటించినట్లుగా కనిపించుటలేదు. మూడు వైపుల చెక్కబడిన ఈ శిలాశాసన శీర్షమున నంది చెక్కబడిఉంది.

స్వస్తిశ్రీ శకవర్షములు 1227 (క్రీ.శ. 1305) శ్రీ మన్మహామండలేశ్వర కాకతీయ ప్రతాపరుద్ర దేవ మహారాజు సుఖసంగాత వినోదమున పృథ్వీరాజ్యము చేయుచుండగా విశ్వావసు సంవత్సర శ్రావణ బహుళ ద్వాదశి వడ్డవారమున ఒకానొక రెడ్డి (పేరు తెలియుటలేదు) కొడుకు రుద్రదేవని గారు రావికంటి రామనాథదేవరకు, లకుమేశ్వర దేవరకు అంగరంగ వైభోగములకుగాను దొనులకాలువ వద్ద 5 మఱుర్తు, బుడిమలగటులో 5 మఱుర్తు మొత్తము పది మఱుర్ల నేలను దానముగా నొసంగినట్లు ఈ అముద్రిత తెలుగు శాసనమందు పేర్కొనబడింది [81]. కోమట్లు (వైశ్యులు) అష్టాదశప్రజలు ఈ శాసనమందు పేర్కొనబడుట విశేషము. ఈ శాసనమందు గ్రామనామము రవికంటి లేదా రావికంటి యని పేర్కొనబడింది. వృద్ధులు ఇప్పటికిని ఈ గ్రామమును రావికంటి లేదా రాయికంటి అని పిలుస్తారు. ఆనాటి రావికంటియే నేడు రాయికల్‌గా మారడము గమనార్హము. రవికంటి యనగా సూర్యుని కన్ను అని అర్థము. ఈ ప్రాంతమున సౌరపూజ పరివ్యాప్తమై యుండెననుటకు త్రికూటాలయములోని ఒక ఆలయము సూర్యదేవరకు అంకితము చేయబడుటయే ప్రబల నిదర్శనము. అంతేగాకుండా ఈ గ్రామమందు ఒక సూర్య శిల్పము లభ్యమైంది. సూర్యుని కన్నుగా భావింపబడిన రవికంటి క్రమముగా రాయికంటి, నేడు రాయికల్‌గా మారింది.



అధిష్ఠాన వివరములు



కేశవుడు, దేవి



స్తంభము

ఆలయ ప్రాంగణమందున్న ఒక వీరగల్ ప్రతిమపై పదకొండవ పన్నెండవ శతాబ్దములకు చెందిన దేవనాగరి లిపిలో 'శ్రీమతు విక్రమ సంవత్సర' పదములు మాత్రమే కనిపిస్తున్నాయి. [82] బహుశః ఈ దేవనాగరి లిపి గణపతి దేవ చక్రవర్తి కాలముదై ఉండును.

## క్రీ.శ. 1305 అముద్రిత శాసనము, రాయికల్.

మొదటిప్రక్క

1. స్వస్తిశ్రీ శకవరుషాలు
2. 1227 స్వస్తిశ్రీ
3. మన్మహా మండలేశ్వర
4. కాకతీయ ప్రతాప
5. రుద్రదేవ మహా
6. రాజులు సుఖసంగ
7. తా వినోదాన పృథివి
8. రాజ్యము చేయు
9. చుండగాను విశ్వావసు
10. సంవత్సర శ్రావణ
11. బహుళ 12 వడ్డవా
12. !రాన స్వస్తి! శ్రీమతు
13. ..................... తొలి
14. రెండి కొడుకు రుద్ర
15. దేవనిగారు రావికం
16. టి రామనాథ దే
17. వరకు

రెండవ ప్రక్క

1. లఖుమేస్వ
2. ర దేవరకు
3. ను అంగభో
4. గానకును
5. రంగ భోగాన
6. కునుదొనుల
7. కాలువ మ-5
8. బుడిమల
9. గటులో-5
10. వెరిసిపది
11. మర్తురును
12. దారవొసి స్వస్తి శ్రీమతు
13. బెజగంగూలె (శిలవిరిగింది)
14. కగారును రా
15. వికంటి ! ప్రోలు !

మూదవ ప్రక్క

1. ................ కోమట్లకు
2. మణి .............. అష్టాదశ! ప్రజలు!
3. కు................. లకు
4. దేవరలు యజమా
5. అంగభోగానకు దేవ
6. యము మాడపా (దుక)
7. లెఖను దార వోసిరి
8. స్వదత్తం ద్విగుణం పుణ్యం
9. పరదత్తను పాలనం ప
10. రదత్తా పహరణ స్వద
11. త్తం నిష్ఫలం భవేతు (శిలవిరిగింది)
12. షష్టిర్వరుష సహా
13. స్రాణి విష్టాయాం జా
14. యతే క్రిమిః ।

## త్రికూటాలయము

రాయికల్ గ్రామమందలి గుడికోటలో గల ఈ త్రికూటాలయము దక్షిణ ముఖమును కలిగి యుండుట అరుదైన విషయము. తూర్పు, పడమర, ఉత్తరములందు గర్భగృహములున్నాయి. దక్షిణమున సోపానములపై నిర్మించిన చిన్నప్రవేశ మంటపము (Portico Projecting to the

south) శిథిలమైంది. దేవాలయ అధిష్ఠానమందు, ఉపానము, విశాలపట్టిక, జగతి, కుముదము, వేదిక ఉన్నాయి. భిత్తిని (Wall) రెండు వరుసల కపోతము (Cornice in two tiers) శిఖరములను వేరు చేయుచున్నది. దేవాలయ కుడ్యములు కోష్ఠములు లేకుండా సాదాగా ఉన్నాయి. మూడు ఆలయముల నిర్మాణము ఒకే విధముగా ఉంది. వాటిపై నాగరరీతిలో (Nagara type) నున్న పొడుగైన శిఖరములు చాపరేఖాకృతిలో (Curvilinear spires) నుండి ఆమలకములచే కప్పబడినాయి. వాటిపై శిలాకలశములున్నాయి. చాళుక్య కళారీతులలో నున్న ఈ శిఖరములు అలంపురము, మహానంది, సత్యవోలు ఆలయముల శిఖరములను బోలిఉన్నాయి. రాయికల్ త్రికూటాలయ శిఖరముల ముందన్న శుకనాసములు చాళుక్య సంప్రదాయమునకు చిహ్నాములు. ఈ శుకనాసములు ఖాళీగా ఉన్నాయి.

దక్షిణ దిశయందున్న సోపానముల ద్వారా ముఖమంటపము లేదా రంగ మంటపమును ప్రవేశింపవచ్చు. నాలుగు మధ్యస్తంభముల (Central pillars)తో గూడిన ఈ మంటపము 24 అడుగుల చతురస్రము. దీనిచుట్టున్న పిట్టగోడ (Parapet wall) పై కక్షాసనములున్నాయి. ఈ కక్షాసనముల అగ్రభాగము కొంత వంపుగా (Slight-Slant) మలచబడింది. పశ్చిమ చాళుక్యుల దేవాలయములలో వలె పిట్టగోడ లోపలి వైపు క్రింది భాగమున పద్మశిల్ప ముద్రికలున్నాయి. మధ్యస్తంభములపై విష్ణు అవతారములైన మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ రూపములు చెక్కబడినాయి. మంటపమందలి లోకప్పు మొత్తము తొమ్మిది విభాగములందు (Nine Compartments of the ceiling) లుపవితాన (కదలికాకరణ) రీతిలో త్రికోణపు శిలలతో సుందరముగా నిలిచి ఉంది. దూలముల క్రింది ముఖము లందు బహుదళ పద్మములు (Multi-petalled lotuses carved on the bottom faces of the lintels) చూడ ముచ్చటగానున్నాయి.

మూడు గర్భగృహములు ఏకరూపములో నున్న 8'-4" చతురస్రాకారములు. వాటి ముందు 8'.4"x8' కొలతలతో అర్ధమంటపములున్నాయి. అంతరాళము లాంటి అర్ధమంటపములకు ద్వారములు లేవు. గర్భగృహముల ద్వారములు రత్న, లతపత్ర, కుడ్యస్తంభ, పద్మ, పత్ర అను పంచశాఖలతో శిల్ప సౌందర్యమును చాటుతున్నాయి[83]. ద్వార లలాటములందు గజలక్ష్మి చెక్కబడింది. ద్వారముల పతంగములపైన (Above the lintels) ముందుకు చొచ్చుకొని వచ్చు (Projecting cornice) చూరు ఉంది. ద్వారపు శాఖల క్రింది భాగమందున్న చతురస్రాకార ఫలకములపై ద్వారపాలకులు మలచబడినారు. ద్వారములముందు శంఖనిధి, పద్మనిధి గల నున్నటి చంద్రశిలలున్నాయి. గర్భగృహ ద్వారములకిరువైపుల అర్ధమంటపములందు కూర్చొనియున్న చిన్న ఏనుగుల శిల్పములున్నాయి. అర్ధమంటపముల, గర్భగృహముల లోకప్పు లుపవితాన (కదలికాకరణ) రీతిలో ఉంది.

పడమటి గర్భగృహము ముందు గల పిట్టగోడపై ఇరువైపుల రెండు దేవకోష్ఠములు (Miniature shrines or Niches) ఉండుటవలన ఇది మిగిలిన రెండింటి కంటే ప్రధానమైందని

తెలుస్తుంది. ఇది తూర్పు ముఖమును కలిగియుండుట వలన శ్రేష్ఠమైనదిగా భావింపబడుతుంది. ఇందున్న అరుదైన పంచముఖ లింగేశ్వరస్వామి శిల్పము భారతదేశములో ఒక కాశీయందు తప్ప మరెచ్చటను లేదని ప్రతీతి. ఈ గర్భగృహద్వారపు శాఖల క్రింద నున్న శైవద్వారపాలకుల కిరువైపుల వింజామరలతో గూడిన స్త్రీ పురుష రూపములు రమ్యముగా మలచబడినాయి. ఈ రూపములలో మానవాకృతిలో వృషభాననమును కలిగిన నందీశ్వరుడు గూడా ఉన్నాడు.

ఉత్తర గర్భగృహ ద్వారపు శాఖల క్రిందనున్న ఫలకములపై వైష్ణవ ద్వారపాలకులు మలచబడి వారికిరువైపుల అందమైన స్త్రీ పురుష రూపములు వింజామరలతో చెక్కబడినాయి. ఇందు కేశవనాథుడు ప్రతిష్ఠింపబడినాడు.

తూర్పు గర్భగృహము సూర్యదేవరకు అంకితము చేయబడింది. దీని ద్వారపు శాఖల క్రింద నున్న ఫలకములందు మలచబడిన ద్వారపాలకుల నాలుగు హస్తములందు కాడతో గూడిన కమలపు మొగ్గ (Lotus bud) ధనుస్సు, నాగసర్పము, గద ఉన్నాయి. ద్వారపాలకుల చతుర్భుజములలోని ఒక హస్తమందు కమలపు మొగ్గ యుండుట వలన ఇది కమలబాంధవుడైన సూర్యుని ఆలయమని చెప్పవచ్చు. గ్రామములో లభ్యమైన సూర్య విగ్రహము ఈ విషయమును ధృవపరుస్తుంది. ద్వారపాలకులకిరువైపుల అందమైన చామర ధారిణిలు మలచబడినారు. హనుమకొండలోని వేయిస్తంభాలగుడి యందున్న శైవ, వైష్ణవ, సౌర మూడు ఆలయముల మాదిరిగా రాయికల్ త్రికూటాలయమందు గూడా అదే వ్యవస్థ కన్పట్టుట గమనార్హము.



త్రికూటాలయము – పంచముఖ లింగేశ్వరాలయం

చాళుక్యుల శిల్ప కళారీతులను బట్టి రాయికల్ త్రికూటాలయము 11వ శతాబ్దమునకు చెందినదై యుండును. దాన శాసనము మాత్రము క్రీ.శ. 1305లో వేయబడింది. ఆలయ జీర్ణోద్ధరణకై ప్రతిమాశిల్పములన్నియు బయట నిలుపబడినాయి.

**పంచముఖ లింగము** :- ప్రస్తుతమిది పడమటి గర్భగృహమందు ఎప్పటి మాదిరిగా తిరిగి నిలుపబడింది. ఒకే ఫలకముపై మధ్యనున్న శివ లింగమునకు నాలుగు మూలలందు నాలుగు లింగములు చెక్కబడినాయి. ఒకే శిలాఫలకముపై ఐదు లింగములుండుట వలన పంచముఖ లింగేశ్వరస్వామిగా పిలువబడుచున్నాడు.

**కేశవనాథుడు** :- నల్లరాయితో మలచబడిన ఈ వైష్ణవ ప్రతిమలో కేశవుడు సమభంగములో సమపాదములో చతుర్భుజములతో నిలబడియున్నాడు. పైనున్న దక్షిణ హస్తమందు శంఖము, వామహస్తమందు చక్రము, క్రింది వామ హస్తములో గద, పద్మముతో గూడిన దక్షిణ హస్తము అభయముద్రలో మలచబడింది. కేశవునికి కుడివైపున అంజలిముద్రలో వినమ్రుడైన గరుడుడుండగా ఎడమవైపున స్త్రీ రూపము చెక్కబడింది. కేశవుని హస్తములందు ఏ వరుసలో ఎట్టి చిహ్నములుండవలెనో (Attributes in four hands) 'రూపమందాన'మను శిల్పాగమము నందు పేర్కొనినట్లుగా ఇచటి కేశవుని హస్తములందు అదే వరుసలో చిహ్నములు చెక్కబడిఉన్నాయి[84].

**దేవి :-** ఎడమకాలు మలచుకొని, నేలపై నిలిపిన కుడికాలుతో, కూర్చొనియున్న దేవతా ప్రతిమ ఇది. ఆమె వామహస్తమందు గిన్నె (Bowl) యుండగా దక్షిణ హస్తము ఛేదింపబడింది. బహుశః అందులో ఖడ్గముండి యుండును. ఇది నల్లరాతితో మలచబడిన విగ్రహము.

**సూర్యుడు** :- పైకెత్తిన ద్విహస్తములందు పద్మములున్న చిన్నసూర్య ప్రతిమ ఇది. ఆగమశాస్త్రములందు తెలిపిన రీతిలో పద్మములు భుజములకంటె ఎత్తున మలచబడినాయి. (The Lotuses rise above the shoulders). కిరీటమకుటమున్న సూర్యుడు గ్రైవేయకము, హారము, కటిబంధము, వనమాల, కాలికడియములు (Anklets) పాదములకు నూపురములు మున్నగు ఆభరణాలంకారములతో శోభిల్లు చున్నాడు. త్రికూటాలయములోని తూర్పు గర్భగృహ మందుండిన ఈ సూర్య విగ్రహము ప్రస్తుతము గ్రామమునకు దక్షిణమందున్న భీమన్న గుడి వద్ద నిలుపబడిఉంది. ఇలాంటి సూర్యవిగ్రహములు రేణిగుంట సమీపమున గుడిమల్లావ్‌లో గల పరశురామేశ్వరాలయమందు [85], మహబూబ్‌నగర్ జిల్లాలోని అలంపురం దేవాలయములందు చూడవచ్చు[86].

# 14. వాల్గొండ

కరీంనగర్‌కు వాయువ్యమున 110 కి.మీ. దూరమున మల్లాపురం మండలంలో గోదావరి నది దక్షిణతీరమందున్న గ్రామమే వాల్గొండ. మెటుపెల్లి నుండి 27 కి.మీ. దూరమున నున్న ఈ గ్రామమును బసుద్వారా జేరవచ్చు. గోదావరి ఒడ్డున నున్న కొండ (Hillock) గ్రామము వైపు వాలుగా (Slope) నుండుట వలన వాల్గొండగా పిలువబడియుండును. గోదావరి తీరమందున్న ఈ గుట్టబోరు (Hillock) పైననే చెక్కుచెదరని త్రికూటాలయముంది. చాళుక్యుల కళారీతులలో

నున్న ఈ త్రికూటాలయము అదేకాలమునకు చెందిన రాయికల్ లోని త్రికూటాలయమును బోలి దాని ప్రతిబింబము వలెనున్నది. ఈ దేవాలయ పరిసరములందున్న ప్రకృతి సిద్ధమైన మనోహర దృశ్యములు సందర్శకుల కంటికి ఇంపుగా ఉంటాయి. వడిగా పరుగులు దీయుచు, గర్జించుచు ఉద్ధృతంగా ప్రవహించు గోదావరి తటమున ఈ ప్రదేశము, అందమైన గుట్టలు, పంట చేలు, పొలాలు, పక్షుల కిలకిలారావములతో ఎంతో రమ్యంగా ఉంటుంది. ఆహ్లాదకరమైన వాతావరణముతో కూడిన ఈ ప్రాంతము వనభోజనములకు (Picnic Spot) మిగుల ఉపయుక్తముగా నుండుననుటలో ఏ మాత్రము సందేహము లేదు.

ఇచటి దేవాలయ ప్రాంగణములో శాసనమునకై ఉద్దేశింపబడిన శిలాఫలకమొకటున్నది. దీనిపై భాగమున సూర్యుడు, నెలవంక రూపములో చంద్రుడు, ఖడ్గము మున్నగు తదితర అస్పష్ట చిహ్నములు చెక్కబడినాయి. కాని ఏ కారణము చేతనో శాసనము చెక్కుట జరుగలేదు. వ్రాతలేని ఫలకము అచటనే పడిఉంది. రాయికల్ త్రికూటాలయ శిఖరములవలె ఇచటి మూడు శిఖరములు గూడా నాగరరీతిలో చాపరేఖాకృతిని (Curvilinear) కలిగి ఉన్నాయి. శిఖరముల ముందు చాళుక్య సంప్రదాయములో శుకనాసములున్నాయి. కాని వాటిలో ఎలాంటి దేవతా ప్రతిమలులేవు.



త్రికూటాలయము

ఇచటి త్రికూటాలయము చుట్టు గల రాతి ప్రాకారమునకు ఉత్తర దక్షిణములందు ప్రవేశములున్నాయి. ఈ రాతిగోడ శిథిలమగుచున్నది. ఉత్తరమున నున్న సోపానముల ద్వారా 20' అడుగుల చతురస్రాకారములో నున్న ముఖమంటపమును ప్రవేశింపవచ్చు. దక్షిణ, పడమట, తూర్పు దిశలందు గర్భగృహములుండి వాటి ముందు అర్థమంటపములున్నాయి. ఉత్తర ముఖమును కలిగిన ఈ దేవాలయము నుండి గోదావరినది ప్రవహిస్తుంది. గోదావరిలోని యిసుక తిన్నెల నుండి దాదాపు 50 మెట్లెక్కినచో ఎత్తుననున్న ఈ దేవాలయ ప్రాంగణమును జేరవచ్చు. అచటి నుండి తిలకించినచో ప్రకృతి మిక్కిలి మనోహరంగా ఉంటుంది.

ఈ త్రికూటాలయ అధిష్ఠానము మలుపులు లేకుండా సాదాగా (Plain and Simple) ఉంది. దీనిపై ఆరు అడుగుల ఎత్తు వరకున్న భిత్తిని రెండు వరుసలలో నున్న కపోతము శిఖరముల నుండి వేరుచేస్తుంది. సోపానములకు ఎదురుగా నున్న దక్షిణ గర్భగృహము వైష్ణవాలయము. ప్రస్తుత మిందులో సీతారామలక్ష్మణుల ప్రతిమలు పూజలందుకొంటున్నాయి. తూర్పు గర్భగృహమందు లింగరూపమున నున్న రాజేశ్వరస్వామి, పడమటి గర్భగృహమందు అదే లింగ రూపములో నున్న రామలింగేశ్వరస్వామి ప్రతిష్ఠింపబడిఉన్నారు. మంటపములోని నాలుగు మధ్య స్తంభముల నడుమ ఒక అంగుళము ఎత్తున్న చతురస్రాకారముపై మరల వృత్తాకారములో రంగశిల బహురమ్యంగా ఉంది. మంటపము చుట్టు పిట్టగోడ ఉండి ఉత్తరమున ప్రవేశమంటపము (Porch) ఉంది. రాయికల్ ముఖమంటపము 24' అడుగుల చతురస్రాకారములోనుండగా ఇక్కడి మంటపము నాలుగు అడుగుల తక్కువతో 20' అడుగుల చతురస్రాకారములో నుండుట గమనార్హము.

దేవాలయ ప్రవేశమున కిరువైపుల 5' అడుగుల ఎత్తున్న చతుర్భుజశైవ ద్వారపాలకుల ప్రతిమలు నిలుపబడినాయి. పై రెండు హస్తములందు దమరుకము, త్రిశూలములుండగా క్రింది వామహస్తమందు గద, దక్షిణ హస్తము అభయముద్రలో మలచబడినాయి. మంటపము పైకప్పు చుట్టున్న పెద్దచూరు వర్షపునీరు సులభముగా క్రింద పడుటకు కొంత వాలు (Big eave cornice with slight slant) కలిగి ఉంది. నాగరరీతి (Nagara Style) లో నున్న ఎత్తైన శిఖరములు ఆమలకములచే కప్పబడినాయి. శిల్పకలశములీ ఆమలకములపై నిలుపబడినాయి. ఈ శిఖరముల ముందు శుకనాసములున్నాయి.

ఆలయప్రాంగణములో 25' అడుగుల ఎత్తున్న గరుడ స్తంభముంది. ఈ స్తంభముపై నుండిన చిన్నమంటపము, దానిలోని చిన్నగరుడ ప్రతిమ నేడగబడుట లేదు. దీని వలెనే నుండిన రెండు నంది స్తంభములు ఆవరణలో పడిఉన్నాయి. ప్రాంగణములో భైరవ, గరుడ, వైష్ణవ ఆళ్వారుల మున్నగు విగ్రహములు పడిఉన్నాయి. చాళుక్యుల శిల్ప కళారీతులలో నున్న ఇచటి త్రికూటాలయము పదకొండవ శతాబ్దమునకు చెందినదని చెప్పవచ్చు.

## 15. మల్లన్నపేట

కరీంనగర్‌కు ఉత్తరమున 62 కి.మీ. దూరములో నున్న మల్లన్నపేట ఒక కుగ్రామము. ఇది తిర్మలాపురం గ్రామము యొక్క హ్యామ్లెట్ (Hamlet) లేదా చిన్నపల్లెటూరు. గొల్లపెల్లి మండలంలో నున్న ఈ గ్రామము జగిత్యాలకు తూర్పున 12 కి.మీ. దూరములో ఉంది. ఇచటి మల్లికార్జున దేవాలయమును స్థానికంగా మల్లన్నగుడి అంటారు. ఈ దేవాలయమందు లింగరూపమున నున్న పరమశివుని గొల్లవారు, కురుమవారు మల్లన్నగా కొలుస్తారు. మల్లన్న గుడి యున్న ఈ ఊరును మల్లన్నపేట అంటారు. చాళుక్య శిల్పకళారీతులలో నున్న ఈ

దేవాలయము పొలవాస రాజులచే పదకొండవ శతాబ్దము లేదా పన్నెండవ శతాబ్దపు ప్రథమార్ధకాలమందు నిర్మింపబడి ఉంటుంది. ఆశ్చర్యకరమైన విషయమేమనగా ఇది ఒక అద్భుతమైన అరుదైన ద్వితల లేదా రెండంతస్తుల (Two storeyed) దేవాలయము. పదకొండవ, పన్నెండవ శతాబ్దములలో రాజధానిగా విరాజిల్లిన పొలవాస పట్టణమునకు తూర్పున ఈ గ్రామము కేవలము 5 కి.మీ. దూరంలో ఉంది. పొలవాస రాజుల తరువాత ఈ ప్రాంతము కాకతీయుల అధీనమై 15వ, 16వ శతాబ్దములలో స్థానిక వెలమదొరల వశమైంది. 18వ శతాబ్దములో వెలమలు ఈ దేవాలయమును పొలాసలోని తమ్మడి వారి హస్తగతము జేశారు. ఆనాటి నుండి నేటి వరకు తమ్మడివారే ఈ దేవాలయ పూజారులుగా కొనసాగుచున్నారు. తొలికాలపు శాసనములేవి లభ్యము కాకపోయినను క్రీ.శ. 1753లో వెలమదొర వేయించిన శాసనమొకటి దేవాలయ మందుంది[87]. స్వస్తిశ్రీ శాలివాహన శకవర్షము 1675 భావనామ సంవత్సర మాఘ శుద్ధ విదియ గురువారము రోజున రాజశ్రీ జూపూడి ధర్మారావు దేశముఖ్, పర్గణ పొలాస నివాసియగు తమ్మడి కులమునకు చెందిన వెన్నజియ్యకు పన్నెండు కుంచాల వడ్ల పడుబాటు పొలమును దానముగా ఇచ్చాడు. అందుకుగాను అతడు పూదోటను వేసి నిరంతరం తిర్మలాపురంలోని మల్లన్న దేవునకు పూలతో పూజ చేయవలెననియు, అతని పుత్ర, పౌత్ర పారంపర్యముగా దేవుని పూజ చేయుచు దానమిచ్చిన భూమిలోని పంట ఫలముననుభవించ వలెననియు ఈ శాసనమందు పేర్కొనబడింది. దాదాపు రెండు శతాబ్దముల పూర్వము కూలిపోయిన దేవాలయమంటప ఆగ్నేయభాగమును స్థానికులు ఇటీవల మరమ్మతు చేయించి పూర్వమువలె నిలుపుట ప్రశంసనీయము.

## మల్లన్నదేవాలయము

మల్లన్న లేదా మల్లికార్జున దేవాలయము గర్భగృహము, అంతరాళము, 16 స్తంభముల ముఖమంటపముతో కూడుకొని తూర్పు ముఖమును కలిగిఉంది. అధిష్ఠానము భూమిలో మునిగిపోవుట వలన ఆలయపు భిత్తి మాత్రమే కనబడుతుంది. అసాధారణరీతిలో ఇది ద్వితల లేదా రెండంతస్తుల దేవాలయము. జిల్లాలోనే ఇది అరుదైన కట్టడం. భిత్తిపైనున్న కపోతము అర్ధచంద్రగోళాకారములతో శోభిల్లుచున్నది. గర్భగృహము పైన 6' అడుగుల చతురస్రాకారములో ఇంకొక గర్భగృహనిర్మాణముండుట విశేషం. ప్రస్తుతమందులో ఏ దేవతా ప్రతిమలేదు. పై అంతస్తు నందున్న గర్భగృహము చుట్టు ప్రదక్షిణా పథము ఉంది. రెండవ అంతస్తునందు 12 స్తంభములపై నిలిచియున్న లోకప్పు (Ceiling) చదునుగా (Flat) ఉంది. పై అంతస్తులో నున్న గర్భగృహముపై పిరమిడ్ ఆకారపు (Stepped pyramidal form) శిఖరముంది. శిఖరము చివరలో నున్న చతురస్రాకార ఫలకముపై కలశముంది. శిఖరపు నాలుగు వైపుల మధ్యలో ఒక విశాలపట్టి (A wide tapering band) తో చొప్పదండిలో వలె మెట్లన్నియూ కలుపబడినాయి.

ముఖమంటపము 31'అడుగుల చతురస్రాకార నిర్మాణము. దాని చుట్టున్న పిట్టగోడలపై కక్షాసనాలున్నాయి. తూర్పు,ఉత్తర, దక్షిణముల నుండి మంటపములోనికి ప్రవేశింపవచ్చు. మంటపము మధ్యనున్న నాలుగు స్తంభములు 8'అడుగులు ఎత్తు 2'-2" వెడల్పుతో అతి పెద్దగాను లావుగాను ఉండి వాటిపైన వృత్తాకార కుడం, ఫలకములుండుట (Huge circular brackets) విశేషం. మంటపము యొక్క లోకప్పు చదునుగా ఉంది. అంతరాళ ద్వారమున కిరువైపుల ఒకదానికొకటి అడ్డముగా నిలుపుకొనిన కాళ్లతో (Cross-legged) నున్న ద్వారపాలకుల ఎడమచేతిలో గద యుండి నాగసర్పముతో గూడిన దక్షిణ హస్తము అభయముద్రలో ఉంది. వీరికి కొంత దూరములో రెండు వైపుల వేరొక ద్వారపాలకుల జత చతుర్భుజములతో కాళ్లు అడ్డముగా పెట్టి నిలిచియున్నారు. వీరి పైహస్తములందు డమరుకము, త్రిశూలము, క్రింది హస్తములందు గద, నాగసర్పము మలచబడినాయి. వీరి తలలపై నాగ సర్పపడగల గొడుగులున్నాయి.



రెండంతస్తుల మల్లన్న దేవాలయం

అంతరాళము 9'-6" x 11'-6"కొలతలతో నుండి ఉత్తర, దక్షిణములందు దేవకోష్ఠములను (Niches) కలిగి ఉంది. గర్భగృహము 14 అడుగుల చతురస్రాకారములో ఉంది. తొలిచాళుక్యుల కళా సంప్రదాయ రీతులలో ఇచట గర్భగృహము లోపల నాలుగు మూలలందు నాలుగు స్తంభములు నిలిచి ఉన్నాయి. స్తంభములు మరియు గోడల మధ్య నున్న స్థలము ప్రదక్షిణా పథముగా నుపయోగపడుతుంది[88]. గర్భగృహములోపల నాలుగు మూలలందు నాలుగు స్తంభములుండి గర్భగృహము లోపలనే దైవము చుట్టు ప్రదక్షిణ చేయుటకు వీలున్న వ్యవస్థ వేములవాడ, అలంపురం, మహానంది మున్నగు ప్రదేశములందు గల చాళుక్యుల కాలపు దేవాలయములందు చూడవచ్చు. మల్లన్నపేట గర్భగృహద్వారము చాళుక్యుల కళారీతిలో ఉంది. ద్వారపుత్రిశాఖల క్రింది భాగమున నున్న ఫలకములపై శైవద్వారపాలకులు, వీరికిరువైపుల వింజామరలతో నున్న సేవకులు మలచబడినారు.

ఆలయ ప్రాంగణములో ద్విహస్తములతో ఏనుగు తలను బోలిన వినాయకుడు, చతుర్భుజముల గణపతి, నాగిని ప్రతిమలు, వీరగల్లులు, రెండు ముక్కలుగా శిథిలమైన సప్తమాతృకలఫలకము, భైరవుడు, నంది, దేవి మున్నగు విడి శిల్పములు కనబడతాయి.

# 16. చిలువాకోడూరు

కరీంనగర్‌కు ఉత్తరమున 70 కి.మీ. దూరంలోను, జగిత్యాలకు తూర్పున 20 కి.మీ. దూరంలోను జగిత్యాల నుండి పెద్దపల్లికి పోవు రహదారిపై నున్న గ్రామమే చిలువాకోడూరు. ఎల్లకాలము ప్రవహించు ఒకవాగు ఒడ్డున నున్న ఈ గ్రామము గొల్లపెల్లి మండలములో ఉంది. వాగు సమీపమున గల రాతి ప్రాకారములో రామలింగేశ్వరాలయముంది. ఈ ప్రాకారమునకు తూర్పు ఉత్తరదిశల యందు ప్రవేశములున్నాయి.

## రామలింగేశ్వరాలయము

ఈ దేవాలయ అధిష్ఠానము భూమిలో మునిగి ఉంది. దానిపైన 4½ అడుగుల ఎత్తు రాతి గోడలున్నాయి. ఈ దేవాలయము ఉత్తరముఖమును కలిగి ఉంది. ముఖమంటపమునకు మూడువైపుల పడమట, దక్షిణ, తూర్పు దిశలలో మూడు గర్భగృహములు, వాటి ముందు అంతరాళములున్నాయి. కాని ఈ మూడు ఆలయముల కొలతలు రాయికల్, వాల్గొండ త్రికూటాలయములలో వలె ఒక్క రీతిలో లేవు. ఇచటి మూడు గర్భగృహములపై వేర్వేరు పరిమాణములలో నాగరరీతి శిఖరములు చాపరేఖాకృతి (Curvilinear Spires) లో నున్నాయి. పడమటి దిశలో శివలింగమున్న గర్భగుడిపై గల శిఖరము మిగిలిన రెండింటికంటే పెద్దగా ఉంది. దేవాలయమునకు ఉత్తరమున పిట్టగోడపై నున్న రెండు అర్ధస్తంభములపై నిలిచియున్న చిన్నమంటపము (Porch) ద్వారా ముఖమంటపములోనికి ప్రవేశింపవచ్చు. ఈ ప్రవేశమంటపముపై నున్న చిన్నగుడిలో (Miniature shrine) నంది విగ్రహముంది. ప్రవేశమునకు ముందు రెండు వైపుల చక్కటి ద్వార పాలకుల ప్రతిమలు చాళుక్యుల కళారీతులలో చెక్కబడిఉన్నాయి. ఈ ద్వారపాలకులు కిరీటము, ఉదరబంధము, అర్ధోరుకము, మోచేతి, ముంజేతి, కాలి కడియములు ధరించియున్నారు. వీరి దక్షిణ హస్తములో గద, వామహస్తములో నాగసర్పము చెక్కబడినాయి.



రామలింగేశ్వరాలయము

అన్ని వైపుల గోడలచే మూయబడిన ముఖమంటపము లోనికి ప్రవేశించుటకు 4½ అడుగుల ఎత్తు 3 అడుగుల వెడల్పు గల చిన్నద్వారముంది. ఈ ద్వారము క్రింది భాగమున ఇరువైపుల పూర్ణకుంభములు చెక్కబడినాయి. ముఖమంటపము 20' అడుగుల చతురస్రాకారములో ఉంది. మధ్యనున్న నాలుగు స్తంభముల ఎత్తు కేవలము ఆరు అడుగులు. చదునుగా నున్న మంటప లోకప్పు ఎత్తు ఏడు అడుగులు. ఈ మంటపమునందు గణపతి, దేవి, నంది విగ్రహములున్నాయి.

మంటపము మూడు దిశలందు అసమాన కొలతలతో వేర్వేరు పరిమాణములలో మూడు ఆలయములున్నాయి. మూడు గర్భగృహముల ముందు విభిన్న కొలతలతో అంతరాళములున్నాయి. పడమటనున్నది ప్రధానమైన శివాలయము. దీని ముందున్న అంతరాళపు ద్వారము ఎత్తు 5' అడుగులు, వెడల్పు 2½' అడుగులు దీని క్రింది భాగమున శైవ ద్వారపాలకులు చెక్కబడినారు. ఈ ద్వారపు శాఖలకు ఇరువైపుల పొడువు వరుసలో ఒకదానిపై నొకటి మూడు జాలి రంధ్రములు (Lattice holes) గాలి, వెలుతురుకై చెక్కబడినాయి. గర్భగృహము 9' అడుగుల చతురస్రాకారము. గర్భగృహద్వారపు క్రింది భాగమున పూర్ణకుంభములు చెక్కబడినాయి.



శిఖరములు



నంది స్తంభము



ద్వారపాలకుడు

దక్షిణ గర్భగృహము ఏడు అడుగుల చతురస్రాకారము. దీని ముందున్న అంతరాళము పొడవు వెడల్పులు 5'x7' అడుగులు. వీటి ద్వారముల ఎత్తు 4' అడుగులు, వెడల్పు 2' అడుగులు. ఈ గర్భగృహములో పైకెత్తిన రెండు చేతులలో కమలపు మొగ్గలు గల కాడలను పట్టుకొనియున్న కమలబాంధవుడైన సూర్యుని విగ్రహముంది. ప్రక్కకు ఒక దేవి విగ్రహముంది. తూర్పు గర్భగృహములో వైష్ణవ విగ్రహముంది. గర్భగృహము 6' అడుగుల చతురస్రాకారము. దీని ముందున్న అంతరాళపు కొలతలు 5'x6' అడుగులు. వీటి ద్వారముల ఎత్తు 4' అడుగులు, వెడల్పు 2' అడుగులు. విభిన్న కొలతలతో నున్న ఈ త్రికూటాలయము విస్మయము కలిగించురీతిలో ఉంది.

పొలాస రాజధానిగా పొలవాస రాజులు తమ రాజ్యాధికారమును గోదావరినానుకొని తూర్పున మంత్రకూటమునుదాటి వరంగల్ జిల్లాలోని నర్సంపేట తాలుకా వరకు విస్తరింపజేసినారు. వారు శైవ, వైష్ణవ, సౌర, జైన దేవతల ఆరాధకులు. ఈ ప్రభువులు పొలాస, మల్లన్నపేట, చిలువాకోడూరు, నంది మేడారం, రామగుండం, మంథని మరియు నర్సంపేట ప్రాంతములందు దేవాలయములు నిర్మించారు. చిలువాకోడూరు దేవాలయము గూడా పదకొండవ శతాబ్దపు చివరలో లేదా పన్నెండవ శతాబ్దపు ప్రథమార్ధములో నిర్మింపబడి ఉంటుంది. చాళుక్య కళారీతులలో నున్న దీని నిర్మాణము మరియు ఇచటి ప్రతిమా శిల్పములు ఈ విషయమును ధృవపరుస్తున్నాయి.

రాయికల్ మండల కేంద్రములో నున్న త్రికూటాలయములో వలె చిలువాకొడూరులోని మూడు గర్భగృహములందు శివుడు, సూర్యుదు, విష్ణువు ప్రతిష్ఠింపబడినారు. క్రీ.శ. 1163లో కాకతి రుద్రదేవుడు అనుమకొండలో నిర్మించిన వేయిస్తంభాల గుడి లోని మూడు గర్భగృహములు రుద్రేశ్వరుడు, విష్ణువు, సూర్యునకు అంకితము చేయబడిన విషయము జగద్విఖ్యాతము.

## ప్రాంగణములోని ఆలయములు

చిలువాకోడూరు దేవాలయ ప్రాంగణములో పడమటి దిక్కున రెండు వేర్వేరు దేవాలయములున్నవి. మొదటి ఆలయము రెండవదాని కంటే పెద్దగా ఉంది. మొదటి ఆలయ గర్భగృహము 7' అడుగుల చతురస్రము. దాని ముందున్న అర్ధమంటపము కొలతలు 5'x7' అడుగులు. ఈ ఆలయము నందు గణపతి, నంది విగ్రహములున్నాయి. కొంత చిన్నగా నున్న రెండవ ఆలయ ద్వారపు లలాటమున గజలక్ష్మి, శాఖల క్రింది భాగమున వైష్ణవ ద్వారపాలకులు మలచబడినారు. చాళుక్య కళారీతిలో నున్న ఈ ద్వారపు పతంగముపై నున్న తోరణ భాగము శిఖరములు, కలశము, స్త్రీ రూపములతో చెక్కబడింది. ప్రస్తుతమీ ఆలయములో భైరవ, దేవి, నాగిని, శిథిలమైన సప్తమాతృకల ఫలకపు ప్రక్కలు పడిఉన్నాయి. ప్రాంగణమందున్న ఈ రెండు ఆలయములపై నున్న శిఖరములు మెట్లతో గూడిన పిరమిడ్ ఆకృతిలో ఉన్నాయి.

ఇచటి ప్రాంగణమందు నిలిచియున్న 25' అడుగుల ఎత్తు స్తంభముపై గల చిన్నమంటపములో నంది ప్రతిష్ఠింపబడిఉంది. ఈ నంది స్తంభమువలె ఇంకను రెండు స్తంభములు నిలిచిఉన్నాయి. కాని వాటిపై నుండిన చిన్న మంటపములు నేడు లేవు. ఉత్తరమందున్న ప్రవేశమునకు ముందు ప్రాకారము నానుకొని స్తంభములపై నిలిచిన మంటపమున్నది. చిలువాకోడూరులో ఎలాంటి శాసనములు లభ్యము కాలేదు.

# 17. తోటపెల్లి

కరీంనగర్‌కు 30 కి.మీ. దూరమున హైదరాబాద్‌కు పోవు రాజీవ్‌రహదారిపై నున్న తోటపెల్లి గ్రామములో పదకొండవ, పన్నెండవ శతాబ్దములకు చెందిన త్రికూటాలయము దక్షిణ

ముఖమును కలిగిఉంది. ఇచటి దేవాలయము ఏ కారణము చేతనో సంపూర్ణముగా నిర్మాణము కాలేదు. పైకప్పు వరకు గోడలులేచిన నిర్మాణము మధ్యలోనే ఆగిపోయింది. ఈ దేవాలయము తురుష్కులచే ధ్వంసము చేయబడినట్లు అగబడుటలేదు. దండయాత్రల భీతివలననో, ఏ ఇతర కారణముల వలననో నిలిచిపోయిన ఈ కట్టడము యొక్క శిల్పసంపద వర్ణనాతీతము. మధ్యలోనున్న మంటపమునకు తూర్పు, ఉత్తర, పడమటి దిశలందు గర్భగృహములున్నాయి. ఈ గర్భగృహములన్నియు 8' అడుగుల చతురస్రాకారములో నుండి వాటి ముందున్న అర్థమంటపములు గూడా అదే 8' అడుగుల చతురస్రాకారములో ఉన్నాయి. ఈ దేవాలయ నిర్మాణము, రాయికల్, వాల్గొండ దేవాలయముల నిర్మాణ రీతులలో కనిపిస్తుంది. తోటపెల్లి త్రికూటాలయములోని మూడు గుడుల కొలతలు ఒకే మాదిరిగా ఉన్నాయి. చిలువాకోడూరు దేవాలయములోవలె కొలతల యందు అసమానతలు కనిపించవు. తోటపెల్లి ఆలయపు కుడ్యములపైన పైకప్పులు లేవు, శిఖరములు లేవు.



ద్వారము



స్తంభము

తోటపెల్లి దేవాలయమునకు కాకతీయుల దేవాలయముల వలె ఉపపీఠములేదు. అధిష్ఠానము నందు ఉపానము విశాలపట్టిక, జగతి, వేది భాగములు కనిపిస్తాయి. ఎలాంటి అలంకారము లేని గోడల నిర్మాణము కపోతము వరకు జరిగింది. చాళుక్యుల కళారీతులలో నున్న గర్భగృహద్వారముల త్రిశాఖల క్రింది భాగమున శైవద్వార పాలకుల ప్రతిమలు లలాటములందు గజలక్ష్మి మలచబడినాయి. పతంగమునకు ఊర్ధ్వభాగమున తోరణమందు చిన్న ఆలయ శిఖరాలు (turrets on the architrave) చెక్కబడినాయి. మంటపము మరియు దాని దక్షిణ దిశలో ప్రవేశ సోపానములకై వదలిన స్థలము ఖాళీగా ఉంది. రాయికల్‌లోని త్రికూటాలయమువలె ఇచటి త్రికూటాలయము గూడా దక్షిణ ముఖమును కలిగి యుండుట విశేషం.

చాళుక్యుల కాలపు నందుల వలె మామూలు పరిమాణంలోనున్న, ఆభరణ భారము లేని నంది ఒకటి అచట పడిఉంది. కప్పు పైభాగమున మధ్యలో వాడబడు ఒక చతురస్రాకారపు

పెద్ద శిలాఫలకముపై చెక్కబడిన అందమైన విరబూసిన కమలము చూడముచ్చటగా నుండి ఆవరణలో పడిఉంది. ఈ దేవాలయము ముందు ఒక వీరగల్ ప్రతిమ ఉండగా చెఱువు కట్టపై గూడా ఒక వీరగల్ శిల్పముంది. ఈ దేవాలయము చెఱువునకు కొంత దూరములో ఉంది. అదృష్టవశాత్తు ఈ దేవాలయము పూర్తిగా నిర్మాణమై యుండినచో కరీంనగర్ జిల్లాలోని బహురమ్యమైన ఆలయములలో ఒకటిగా పరిగణింపబడేది. తోటపెల్లి గాంధిగా పేరొందిన స్వాతంత్ర్య సమరయోధుడు బోయినపెల్లి వెంకట రామారావు దీని నిర్మాణము పూర్తి చేయుటకు విఫల ప్రయత్నము చేశారు.

## 18. బెజ్జంకి

కరీంనగర్‌కు నైఋతి దిశలో 35 కి.మీ. దూరంలో నున్న బెజ్జంకి నేడు ఒక మండలకేంద్రం. స్థానికంగా ఎలాంటి శాసనం దొరకక పోయినను సమీపముననే గల శనిగరములో లభ్యమైన కళ్యాణి చక్రవర్తుల కాలపు రెండు శిలాస్తంభశాసనములందు ఈ గ్రామము పేరు బెజవాంకెయగా పేర్కొనబడింది. కళ్యాణి చాళుక్య చక్రవర్తి త్రైలోక్యమల్ల మొదటి సోమేశ్వరుని కాలపు క్రీ.శ. 1053 శనిగరము శాసనములో బెజవాంకెయ(బెజ్జంకి) గ్రామపు కాటెరెడ్డి తదితరుల ఆమోదముతో ఒక మత్తురు నీరు నేల (Wet land) శనిగరములోని మధుపేశ్వర దేవరకు దానముగా నొసంగబడినట్లు పేర్కొనబడింది[89]. అదే శనిగరములో క్రీ.శ. 1128లో వేయబడిన కళ్యాణి చాళుక్య చక్రవర్తి భూలోకమల్ల మూడవ సోమేశ్వరుని కాలపు శిలాస్తంభశాసనములో రేపోల కుఱువరాజు యొక్క అధికారి ఒకరు బెజవాంకెయ గ్రామములో ఎనిమిది మత్తుర్ల నేలను శనిగరములోని కామ్మేశ్వర దేవరకు దానముగా నొసంగినట్లు పేర్కొనబడింది[90]. పై రెండు శాసనములలో ఈ గ్రామనామము బెజవాంకెయ యని పేర్కొనబడుట గమనార్హం. కళ్యాణి చాళుక్య చక్రవర్తుల కాలపు ఐదు శిలాస్తంభ శాసనములు ఒక శనిగరము నందే లభించుటవలన వారికాలములో శనిగరము రాజకీయ ప్రాధాన్యత గల ప్రదేశమై ఉండింది. శనిగరమునకు అతి సమీపముననున్న బెజవాంకెయ గ్రామము గూడా అంతే చారిత్రక ప్రాధాన్యత కలిగి ఉండెనని అచటి పన్నెండవ శతాబ్దపు మధ్యకాలమునకు జెందిన అద్భుతమైన శిల్పసౌందర్యము గల నరసింహ దేవాలయమును బట్టి విశదమగుతుంది. బెజ్జంకిలోని ప్రాచీనకోట ఆనవాళ్లు, శిథిలమైన గోడలు, కూలుచున్న బురుజులు ఒకనాడు ఈ గ్రామముచుట్టూ కోట నిర్మింపబడియుండెనని ధృవపరచుచున్నాయి[91].

### నరసింహ దేవాలయము

బెజ్జంకిలోని నరసింహ దేవాలయము ఒక కళాత్మకమైన కట్టడం. దాదాపు రెండు వందల మెట్లు అధిరోహించినచో ఇచటి గుట్టపై నున్న దేవాలయమును చేరవచ్చు. దేవాలయము దక్షిణ ముఖమును కలిగి ఉంది. గర్భగృహము, అంతరాళము, ముఖమంటపము దేవాలయ

ప్రధానాంగములు. మంటపమునకు దక్షిణ, తూర్పు, పడమరలందు ప్రవేశమంటపాలున్నాయి (Porches). కొండపై నున్న సహజమైన ఒక గుహ (Cave) యే నేడు నిలిచియున్న గర్భగృహముగా రూపొందింది. ఇది గుట్టపై నున్న దేవాలయము గనుక గర్భగృహమునకు అధిష్ఠానము లేదు. ఒక పెద్దబూయిపై గోడల నిర్మాణము జరిగింది. కాని మంటపము యొక్క అధిష్ఠానమునందు ఉపానము, పట్టిక, జగతి మరియు వేది గలవు. అధిష్ఠానపు కంఠము అనేక విభాగములుగా విభజించబడి (Cut into several compartments) వాటిలో చతుర్దళ పుష్పాకృతులు మలచబడినాయి. ఈ అలంకరణ సాధారణంగా పశ్చిమ చాళుక్యుల దేవాలయములందు అగబడుతుంది. ప్రవేశ మంటపముల (Porches) పిట్టగోడలపై గల కక్షాసనముల వెనుక భాగమందున్న విభాగములలో గజ, సింహ, అశ్వ, హంస, పద్మ శిల్పములు కనిపిస్తాయి. ఒకానొక విభాగము నందు కాళ్లు తెరచి కూర్చొనియున్న మాతృదేవతా (Mother Goddess) రూపముంది. ఆమె జననేంద్రియము స్పష్టముగా చెక్కబడింది. ఇలాంటి రూపములు వేములవాడలోని భీమేశ్వరాలయము ముందున్న వేదిక కంఠభాగములందు చెక్కబడి ఉన్నాయి. గర్భగృహపు గోడలపైన ముందుకు చొచ్చుకొని వచ్చిన వంపుతో గల చూరు (Projected eave cornice is fine and slopy) అందముగా ఉంది. గర్భగృహము పై నున్న సుందరమైన శిఖరము కాదంబుల దేవాలయముల శిఖరములను పోలిఉంది. పదిహేను మెట్ల వరుసలుగా విభజింపబడి పిరమిడ్ ఆకారములో నున్న ఈ శిఖరపు ప్రతి వరుస 'అర్ధచంద్రగోళాకృతులతో ఆలంకరింపబడింది.[92] (The spire consists of fifteen diminishing tiers arranged alternate with recesses to form the pyramid shape. The tiers are decorated with semi-circular stones as seen on the steps of the sikharas of kadamba temples).



నరసింహ దేవాలయము

దేవాలయ ముఖమంటపము చుట్టు గోడలచే మూయబడి (Enclosed by walls) ఉంది. మంటపము మధ్యనున్న నాలుగు స్తంభములు ప్రశస్తమైన అపూర్వ చెక్కడములతో

శోభిల్లుచున్నాయి. స్తంభములపైన అశ్వపాదముల నుండి చివర వరకు సంప్రదాయ పౌరాణిక మరియు లౌకిక, సాంఘిక విషయములను సుందరంగా చెక్కడంలోనే శిల్పి అమితముగా అతని కళానైపుణ్యమును ప్రదర్శించాడు. స్తంభపు అశ్వపాదము నాలుగువైపుల దేవతలతో నిండిన గూడులు (Niches) అందంగా రూపొందించ బడినాయి. స్తంభము యొక్క రెండు ఘనపైన చతురస్రాకారపు భాగముల మధ్యన అలంకార భారముతో గూడిన అష్టభుజాకారపు పట్టికలున్నాయి. ఈ పట్టికలకు ఇరువైపుల మలుపులు, వంపులు (Mouldings and recesses) సూక్ష్మమైన చెక్కడములతో నిండి ఉన్నాయి. స్తంభ ఉపరితలములందు అనేక దేవతలు, సుందరభామాశిల్పములు ఉబ్బుగా (In bold relief) మలచబడినాయి. స్తంభ శీర్షభాగము (The capital of the pillar is marked by a circular part in the form of a vese with sloping top) కలశాకారముతో ఆరంభమై వృత్తాకారపు కుదం (Circular abacus) వరకు అనేక మలుపులను (Mouldings) కలిగి ఉంది. కుదంపైన ఫలికా పద్మము చతురస్రాకారములో (Square abacus) ఉంది. దానిపై నున్న బోదె (Bracket) శిల్పభారముతో మనోహరంగా ఉంది. ఇలాగే నాలుగు స్తంభములకు నాలుగు వైపుల చెక్కబడిన సూక్ష్మమైన అపూర్వమైన శిల్పములు అలంకార శోభితములై పర్యాటకుల దృష్టినాకర్షిస్తాయి. కరీంనగర్ జిల్లాలో ఇచటనున్న సుందర చిత్ర శిల్పము మరెచ్చటను కానరాదు. బెజ్జంకి దేవాలయ మంటపములో మధ్యనున్న నాలుగు చిత్రఖండరూప స్తంభములు పాలంపేట, పిల్లలమర్రి, నాగులపాడు, వరంగల్, హనుమకొండ దేవాలయములలోని సుందరస్తంభములను పోలిఉన్నాయి. బెజ్జంకి స్తంభతలములపై అరుదైన, అద్భుతమైన రీతులలో ఉబ్బుగా (Bold relief) మలచబడిన వివిధ సుందరాంగుల శిల్పముల మాదిరి చెక్కడములు పాలంపేట, హనుమకొండలాంటి ప్రదేశములందు గూడా లేకపోవడం ఇచటి విశేషం.



పట్టభాగము



శీర్షభాగము

స్తంభముల ఉపరితలముపై నున్న అనేక దేవతలు, నాట్యకత్తెలు, మృదంగ, తాళ, వేణువు, వీణాధారిణులు, వేటకత్తెలు మున్నగు వారి శిల్ప సౌందర్యము వర్ణనాతీతం. సహజలావణ్యము ఉట్టిపడు నాట్యకత్తెల, వాద్యకారిణుల, వేటకత్తెల తదితర సుందరాంగుల రూపములలో కళాకౌశలము, శిల్పకళా విన్యాసము చిరస్థాయిగా నిలిచియున్నదనుటలో అతిశయోక్తి లేదు. స్తంభ ఉపరితలముపై భాగవత, భారత, పౌరాణిక గాథలు అనేకములున్నాయి. దేవదానవులు అమృతమునకై చేసిన క్షీరసాగరమథనము నందు ఒక వైపు ముగ్గురు సురులు ఇంకొక వైపు ముగ్గురు అసురులు వాసుకి సర్పమును లాగుచున్నారు. లింగోద్భవ సమయములో ఆద్యంతములు తెలిసికొనుటకై విఫలులైన విష్ణువు ఒక వైపు, బ్రహ్మ మరియొక వైపు చిన్నరూపములలో నుండి వేదికపై నున్న పరమశివుని దర్శించుచున్నారు. ఇలాంటి కథావస్తువు సాధారణంగా కాకతీయుల శిల్పములలో కనిపించదు[93]. నరసింహస్వామికి ఒక వైపు గరుడుడు, రెండవవైపు ఆంజనేయుడు గల ఫలకము కనులకు ఇంపుగా ఉంది.



సముద్ర మథనము



కోలాటము

పౌరాణిక గాథలే కాకుండా అనేక సాధారణ లౌకిక విశేషములను విశదపరచు చిత్ర శిల్పము లెన్నియో స్తంభములపై కనిపిస్తాయి. ఒక అందమైన వేటకత్తె ఎడమచేతిలో ధనుస్సు ధరించి కుడిచేతిలో నున్న బాణముతో ఆమె ఎడమపాదము నందున్న ముల్లును, తీయుటకై యత్నించుచున్న వ్యక్తికి దానిని చూపెడుతుంది. అనుమకొండ నుండి పాలంపేటకు పోవు మార్గముపై నున్న జాకారం గ్రామములోని ఒక ఆలయద్వారపు శాఖల క్రిందనున్న ఫలకమునందు ఇలాంటి వేటకత్తె శిల్పమే దర్శనమిచ్చుట గమనార్హం[94]. వేటకత్తెల శిల్పములు కాకతీయుల కాలపు ద్వారముల క్రింది భాగమున తరచుగా కనిపిస్తాయి. నగ్నముగా నున్న ఇచటి ఒక అందమైన భామ తలపైభాగమున ఆమె చేతులలో పట్టుకొనిన సర్పము వలె నున్న శిల్పఫలకము ఒకటి జాకారము నందు గల వేటకత్తె ప్రక్కనే చూడవచ్చు[95]. బెజ్జంకిలోని రూపములు కుఱుచగా స్థూలముగా (Short and Stout) నుండగా జాకారంలోని రూపములు సన్నగా పొడువుగా నుండుట గమనింపదగిన విషయం. ఇచట గల అందమైన భామ యొక్క చీర చెంగులు లాగుచున్న కోతిశిల్పము సాధారణముగా కాకతీయుల కాలపు శిల్పంలో చూడవచ్చు. రామప్పలోని మదనికా శిల్పము నందు మరియు కర్నూలు జిల్లాలోని త్రిపురాంతకములోను ఇలాంటి శిల్పాలున్నాయి[96].

బెజ్జెంకి లోని అందమైన భామల శిల్పములలో ఆభరణభారము, అంగసౌష్ఠవములతో పాటు వయ్యారము, వంపుసొంపులు ఎక్కువ. ధనుర్బాణములతో నున్న భామాశిల్పము, శరీరపు వంపుల వలన జారిపోవు చీరచెంగులను లాగు కోతిని వారించుచున్న సుందరీ శిల్పము, నాగసర్పమును హస్తములతో తలపై పట్టుకొనిన శిల్పము, నాట్యకత్తెల, వాద్యకారిణుల మున్నగు మనోహర శిల్పములు శిల్పి కళా నైపుణ్యమును, శిల్ప ఔన్నత్యాన్ని చాటుతున్నాయి. శతాబ్దముల తరబడి సందర్శకులకు ఈ శిల్పములు నయనానందకరముగా నిలిచినవనుటలో అతిశయోక్తి లేదు.






స్తంభ ఉపరితలములపై చెక్కడములు

సుందరీమణుల శిల్పములందు శిరోజములు ఒక ప్రక్కకు శిఖరూపములో (Arranged into a side knot in the shape of a bun) ముదవబడినాయి. వారు కర్ణకుండలములు, కంఠాభరణములు, హారములు, వడ్డాణములు, మోచేతి, ముంజేతి, కాలికడియములు ధరించి ఉన్నారు. పాదములు, నూపురములచే అలంకరింపబడినాయి. చాలీచాలని వస్త్రధారణలో నున్నను (Scanty dress) వారు అందంగా ఆకర్షణీయంగా ఉన్నారు. కాని వారు కుఱుచగా స్థూలముగా నున్నారు. జైన చిత్రకళాప్రభావము ఈ శిల్పములందు చూడవచ్చు. బెజ్జెంకి దేవాలయ శిఖరము,

మంటప అంతర్భాగములో పిట్టగోడలపై నున్న పద్మముల వరుసలు జైన సంప్రదాయమును సూచిస్తున్నాయి. బెజ్జంకి దక్షిణమున నున్న కొల్లిపాక (కొలనుపాక), నైఋతిలో గల పొట్టలకేరె (పటాంచెఱువు)లందు గల జైన శిల్పప్రభావము ఇచట చూడవచ్చు. కళ్యాణి చాళుక్యుల ఏలుబడిలో నుండిన ఈ ప్రాంతములకు కర్ణాటకము నుండి శిల్పులు, కళాకారులు వచ్చి ఉంటారు.



అశ్వపాదము



స్తంభము



ఉపరితల చెక్కడములు



గండశిలపై భైరవుడు

ఈ దేవాలయ మంటపము యొక్క లోకప్పు చదునుగా నుండి మధ్యలో మాత్రము (కదలికాకరణ) లుపవితాన రీతిలో ఉంది. మధ్యనున్న చతురస్రాకారఫలకము అర్ధగోళాకారపు పెద్దగిన్నె బోర్లించిన రీతిలో లోతుగా చెక్కబడి ఒకదానిపై నొకటి మూడు వలయములందు దళములతో విరబూసిన పద్మము నడుమనున్న మొగ్గ క్రింది వైపు చూచుచున్నది. ఇలాంటి (dome shaped) శిల్పములు నగునూరు, కరీంనగర్ దేవాలయములందు కనిపిస్తాయి. ఇచటి మంటప దూలములు పద్మశిల్పములతో అలంకరింప బడినాయి. ఇచటి లోకప్పు త్రికోణపు ఫలకములందు హనుమకొండలోని వేయిస్తంభాల గుడిలో వలె సింహపు తలలు లేదా కీర్తి ముఖాలు మలచబడినాయి.

మంటపమునకు ఉత్తరముననున్న అంతరాళ ద్వారపు శాఖల క్రింద వైష్ణవ ద్వారపాలకులు ఉన్నారు. మంటపమునకు మూడువైపుల నున్న ప్రవేశద్వారములు సాదాగా (Plain) ఉన్నాయి. ప్రవేశ మంటపముల లోకప్పు ముఖమంటప మధ్యభాగపు లోకప్పును పోలిఉంది.

<u>భైరవుడు</u> :- నరసింహదేవాలయమునకు పడమట కొంత దూరములో అదే గుట్టపైనున్న పెద్ద గుండ్రాయి పై భైరవవిగ్రహము చతుర్భుజములతో చెక్కబడింది. పై నున్న దక్షిణ హస్తములో డమరుకము, వామ హస్తములో త్రిశూలము క్రింది కుడిచేతిలో మెలికలతో గూడిన ఖడ్గము (Curled Sword) ఎడమచేతిలో ఖండింపబడిన తల మలచబడినాయి. భైరవుని శిరముపై సర్పపు పడగలు ఛత్రమువలెనున్నాయి. అతనికి ఎడమవైపున గల శునకము తల నుండి పడుచున్న రక్తపు చుక్కలను స్వీకరించుటకు నాలుకను చాచుకొని ఉంది.

**బాహ్యకుడ్యముపై నున్న శిల్పములు**

నరసింహదేవాలయపు పడమటి బాహ్య కుడ్యముపై నున్న శృంగార మిథునశిల్పములు విస్మయమును కలిగిస్తాయి. రతి క్రీడలో నున్న ఇలాంటి మిథున శిల్పములు కాకతీయ శిల్పమునందు కానరావు. కాని ఇలాంటి మిథున శిల్పములు తూర్పు గోదావరి జిల్లాలోని బిక్కవోలు నందు గల తూర్పు చాళుక్యుల దేవాలయముల యందు కనబడతాయి[97]. కాని బెజ్జంకిలోని మిథునముల శిల్పములు చాలా స్పష్టముగా లేవు.

1. ఈ మిథున శిల్పమునందు ఒకరికొకరు అభిముఖముగా నిలబడి రతిక్రీడలో నున్నారు.

2. రెండవ మిథున శిల్పములో స్త్రీ విల్లువలె ముందుకు వంగి చేతులు నేలపై మోపగా, వెనుకనిలబడి ఉన్న పురుషుడు రతిక్రీడలో నున్నాడు.

3. మూడవ మిథునశిల్పములో స్త్రీ, పురుషులు ఒకరిపై నొకరు అభిముఖదిశలో పడుకొని మర్మావయవములను చుంబించుచున్నారు.

ఇదే కుడ్యము పైన పైకెత్తిన కుడి చేతిలో ఖడ్గము పట్టుకొని ఎడమ చేత కళ్లెము బూని వెనుకనుండి వచ్చుచున్న గుఱ్ఱపురౌతుపై ముందున్న గజారూఢుడు వెనుకకు తిరిగి అతనిపై ధనుర్బాణములను ఎక్కుబెట్టిన శిల్పము రమ్యంగా ఉంది.

## నరసింహదేవాలయపు వాస్తు శిల్పకళారీతులు

ఈ దేవాలయపు వాస్తు, శిల్పకళారీతులు వింతగా ఉన్నాయి. అలంకారము లేని గోడలు, కాదంబులరీతి శిఖరము, సాధారణ ద్వారములు, జాలి పని గల కిటికీలు లేకుండుట, నాలుగువైపుల గోడలచే మూయబడిన మంటపము, రతిక్రీడలో నున్న మిథునముల శిల్పములు, అధిష్ఠానపు కంఠము నందు మాతృదేవతా శిల్పము, మంటపములోపల బయట గల పద్మశిల్పముల వరుసలు మున్నగు లక్షణములు కాకతీయ దేవాలయము లందు కానరావు. గనుక ఇది కళ్యాణి చాళుక్యుల కాలపు దేవాలయమని భావించు అవకాశము ఉంది. కాని ముఖమంటప మధ్యస్తంభములపై అమితముగా చెక్కబడిన సూక్ష్మమైన శిల్పములు, ధనుర్బాణములు ధరించిన వేటకత్తె, నాగసర్పమును తలపై భాగమున రెండు చేతులలో పట్టుకొనిన స్త్రీ రూపము, భామల చీరల చెంగులు లాగుచున్న మర్కటము, లోకప్పు నందు గల త్రికోణ ఫలకములపై గల సింహముఖ శిల్పములు, లోకప్పు మధ్యన గిన్నె బోర్లించిన ఆకారములో (dome shaped) లోతుగా మూడు వలయములతో చెక్కబడిన పద్మశిల్పము, మున్నగు లక్షణములు కాకతీయుల శిల్పకళారీతులకు దగ్గరగా నుండుట వలన, ఇది ఏకాలమునకు చెందిన దేవాలయమో నిర్ణయించుట కష్టంగా ఉంది. ఎలాంటి శాసనాధారములు లేవు. ఈ దేవాలయములో చాళుక్యుల, కాకతీయుల కళారీతుల మేళవింపు అగబడు తుంది. కనుక దీనిని పన్నెండవ శతాబ్దపు మధ్యకాలపు దేవాలయంగా పరిగణింపవచ్చును. అదే కాలమందు చాళుక్యుల కళారీతులు కొంత వెనుకంజ వేయగా కాకతీయుల నూతన కళారీతులు ఆవిర్భవించి అవి పుంజుకుంటున్న సంధికాలములో ఈ దేవాలయము నిర్మింపబడిఉంటుంది. అదే కాలములో అనగా క్రీ.శ. 1163లో కాకతి రుద్రదేవుడు అనుమకొండలో వేయిస్తంభాల గుడియను రుద్రేశ్వరాలయమును నిర్మించుట గమనార్హం.

బెజ్జంకి గుట్టపైననే శిథిలమైన శివాలయమొకటి ఉంది. గుట్టపైనున్న కోనేరుకు సమీపమున 30' అడుగుల ఎత్తుగల స్తంభము నిలిచి ఉంది. దీనిని ఆండాలు స్తంభమంటారు.

# 19. కోహెడ

కరీంనగరమునకు దక్షిణమున 35 కి.మీ. దూరంలో నున్న కోహెడ ఒక మండలకేంద్రం. కోహెడ నుండి హుస్నాబాద్‌కు పోవు రహదారిపైన ప్రాచీన మల్లన్న దేవాలయముంది.

## మల్లన్న దేవాలయం

తూర్పు ముఖమును కలిగి ఉన్న ఈ మల్లికార్జున దేవాలయము నేడు మల్లన్న గుడిగా

పిలువబడుతుంది. ఈ దేవాలయమందు గర్భగృహము, దాని ముందు బహిరంగ మంటపము (Open Mandapa) మాత్రమే ఉన్నాయి. అంతరాళము కానరాదు. ఆలయ అధిష్ఠానము నేలలో మునిగిపోయింది. శిఖరము నేడు లేదు. ఎలాంటి అలంకారము లేని గోడల (Plain walls) పైన కప్పువేయబడింది. గర్భగృహములోపల మల్లికార్జున స్వామికి నాలుగు మూలలందు నాలుగు స్తంభములున్నాయి. ఈ స్తంభములకు, గోడలకు మధ్యనున్న మూడు అడుగుల స్థలము ప్రదక్షిణాపథము. చాళుక్యుల నిర్మాణ లక్షణమును కలిగియున్న ఇట్టి వ్యవస్థ వేములవాద, అలంపురము దేవాలయాల్లో చూడవచ్చు[98]. గర్భగృహము ముందు గల బహిరంగ మంటపము మధ్య నుండి స్వామిని చేరుటకు మార్గముంది. ఈ మార్గమునకు ఉత్తరదక్షిణము లందు వేదికలు (raised platforms) ఉన్నాయి. ఉత్తరపు వేదికపై ఒకొక్క వరుసలో మూడుచొప్పున ఆరుస్తంభములు, అదే విధముగా దక్షిణ వేదికపై నున్న ఆరు స్తంభములు, మొత్తము 12 స్తంభములపై మంటప కప్పు నిలిచిఉంది. మంటపములోని స్తంభములు కుఱుచగా (short and crude in form) మోటుగా కేవలము 4' అడుగుల ఎత్తుతో ఉన్నాయి.



మల్లన్న దేవాలయం

## ప్రాంగణ మందున్న రెండు దేవాలయములు

మల్లన్నగుడి పరిసరములలోనే దక్షిణముఖముతో నున్న రెండు చిన్నదేవాలయాలున్నాయి. శివలింగమును కలిగిన పెద్దగుడిద్వారము 4'x2' కొలతలతో ఉంది. దీని క్రింది భాగమున పూర్ణకుంభములు చెక్కబడినాయి. రెండవ చిన్న గుడిలో చతుర్భుజముల భైరవ విగ్రహముంది. పై హస్తము లందు డమరుకము, త్రిశూలము, క్రింది హస్తములందు ఖడ్గము, గిన్నె (Bowl) ఉన్నాయి. డాలు, ఖడ్గము ధరించిన వీరగళ్లుల 4' అడుగుల ఎత్తున్న ప్రతిమా శిల్పఫలకములు అచట ఉన్నాయి. ఇవి యుద్ధంలో మరణించిన వారి స్మృతిచిహ్నాలు.

కోహెడ గ్రామము మధ్యలో శివాలయము రామాలయము ఒకదాని ప్రక్కన ఇంకొకటి ఉన్నాయి. ప్రతి ఆలయమందు గర్భగృహము, అంతరాళము, 16 స్తంభముల ముఖ మంటపములున్నాయి. శివాలయము ముందు నంది స్తంభము, రామాలయము ముందు

గరుడస్తంభములున్నాయి. వీటి ఆవరణలో నున్న నాగిని హస్తములందు డాలు, ఖడ్గములున్నాయి. ఈ నాగిని ఊర్ధ్వభాగము స్త్రీ రూపములోను, అధోభాగము పొలాసలో వలె మెలికలు తిరిగిన సర్పరూపములో నుండి ఆమె తలపై సర్పము యొక్క ఏడు పడగల ఛత్రముంది. ఇచటి చారిత్రక శిథిలములను బట్టి కోహెడ చాళుక్యుల, కాకతీయుల కాలములో ప్రాముఖ్యత గల ప్రదేశమై ఉండెనని తెలుస్తుంది.

ఆసఫ్‌జాహీల కాలములో ఆఱవ నిజాం మీర్ మహబూబ్ అలీఖాన్ పాలనలో 1894లో ఉర్దూ మీడియం ఏకోపాధ్యాయ పాఠశాల కోహెడ యందుస్థాపించబడింది. మీర్ ఉస్మాన్‌అలీఖాన్ 1911లో ఏడవ నిజాంగా గద్దె నెక్కాడు. అతని కాలములో ఇచటి పాఠశాల తహతానియా (Primary school) గా మారింది. 1958లో మాధ్యమికపాఠశాల, 1965లో ఉన్నత పాఠశాల ఏర్పడింది. ఏడవనిజాం కాలములోనే ఒక మొహరిల్, జమేదార్, ఆరుగురు జవాన్‌లతో పోలీస్‌నాఖా ఏర్పాటైంది. ఇప్పటికి నిజాం కాలపు భవనములోనే ఠాణా కొనసాగుతుంది[99]. ఏడవ నిజాం నవాబు కాలమందు 1916లో నిర్మించిన చెఱువుకట్ట తూముపై ఒక ఆలయ మంటపముంది.

## 20. కాళేశ్వరం

కరీంనగర్‌కు ఈశాన్యమునందు 130 కి.మీ. దూరంలో దట్టమైన అడవి ప్రాంతంలో గోదావరి, ప్రాణహిత నదుల సంగమస్థానమందున్న మహాక్షేత్రమే కాళేశ్వరం. మహదేవపూర్ మండలములో నున్న ఈ గ్రామము అచటికి 16 కి.మీ. దూరములో ఉంది. కరీంనగర్ నుండి లేదా పెద్దపెల్లి రైల్వేస్టేషన్ నుండి మంథని ద్వారా మరియు వరంగల్ నుండి పరకాల ద్వారా ఈ క్షేత్రమును బస్సు (Bus) ద్వారా జేరవచ్చు. మూడు రాష్ట్రములు మహారాష్ట్ర, ఛత్తీస్‌ఘడ్, ఆంధ్రప్రదేశ్ సరిహద్దులు కలియుచోట గోదావరి దక్షిణ తటమున ఈ క్షేత్రముండుట విశేషం. గోదావరికి ఉత్తరమున మహారాష్ట్రలోని చాందా జిల్లా, ఛత్తీస్‌ఘడ్‌లోని బస్తర్ జిల్లా ఈ గ్రామ సరిహద్దులలో ఉన్నాయి.

కరీంనగరము జిల్లా ఆధ్యాత్మిక, చారిత్రక వికాసానికి కాళేశ్వరం తలమానికం. త్రిలింగ దేశమను తెలుగునేల నిర్వచనములో కాళేశ్వరము చోటు చేసికొని ఈ ప్రాంతపు ఘనతను పవిత్రతను చాటింది. ఆంధ్రదేశంలో రాయలసీమ యందున్న కర్నూలు జిల్లాలోని శ్రీశైల మల్లికార్జున దేవాలయం, కోస్తాలోని తూర్పుగోదావరి జిల్లా యందున్న ద్రాక్షారామ భీమేశ్వరాలయం, తెలంగాణంలోని కరీంనగరము జిల్లా యందున్న కాళేశ్వరాలయం త్రిలింగ క్షేత్రాలుగా ప్రసిద్ధికెక్కాయి. శ్రీశైలం, ద్రాక్షారామము, కాళేశ్వరం మహాక్షేత్రములందున్న శివాలయములు ఈ ప్రాంతమును త్రిలింగ దేశమని, ఇచటి ప్రజలు మాట్లాడే భాషను తెలుగు అని అనాది నుండి పిలువడము జరుగుతుంది. త్రిలింగ శబ్దము నుండే తెలుంగు, తెలుగు

పదములు ఆవిర్భవించినాయని పండితుల అభిప్రాయం. దేశంలో వెలసిన అన్ని శివాలయాల కంటే కాళేశ్వరాలయం విభిన్నమైంది. కాలుడు (యమధర్మరాజు) శివుడు ఇరువురు లింగాకారములో ఒకే పానవట్టముపై వెలసియుండుట ఈ దేవాలయ ప్రత్యేకత.

మహారాష్ట్రము నుండి ప్రవహిస్తూ ప్రాణహిత ఉపనది గోదావరినదిలో కాళేశ్వరం వద్ద కలుస్తుంది. స్కాంద పురాణములో గోదావరి, ప్రాణహిత, సరస్వతి నదుల సంగమప్రదేశములోని కాళేశ్వరాన్ని గురించి ప్రస్తావన ఉంది. గంగా, యమున, సరస్వతి నదుల త్రివేణీ సంగమమైన ప్రయాగలో వలె ఇచట గూడా సరస్వతీ నది అంతర్వాహిణిగా నున్నదని అంటారు. కాలుడు శివుడి కోసం తపస్సు చేయగా శివుడు సాక్షాత్కరించి అతని ప్రక్కనే వెలసి పూజలందుకునేలా వరమిచ్చినాడని, అందుకే కాలుడు ముక్తీశ్వరలింగము ప్రక్కనే ఒకే పానవట్టముపై లింగరూపమున అవతరించుటచే ఇది కాళేశ్వరంగా ప్రసిద్ధి చెందింది. కాళేశ్వరుని ముందుగా పూజించి తరువాత ముక్తీశ్వరుని పూజిస్తే ముక్తి లభిస్తుందని భక్తుల విశ్వాసము. పురాణములలోను సాహితీ గ్రంథములందును కాళేశ్వరము ప్రస్తావన విశేషంగా ఉంది.

కాళేశ్వరంలో పద్మాసనములో నుండి హస్తములను ధ్యానముద్రలో నిలిపిన చిన్న జైన తీర్థంకరుని విగ్రహమొకటి యుండుట వలన ఇది పూర్వము నుండియే జైన, శైవ క్షేత్రంగా విరాజిల్లెనని అవగతమవుతుంది. కరీంనగర్ జిల్లాలో గోదావరినది దక్షిణ తీరమందున్న ధర్మపురి, కోటిలింగాల, మంత్రకూటము (మంథని) కాళేశ్వరములాంటి ప్రదేశములు తొలి శతాబ్దముల నుండియే మహాక్షేత్రములుగా విరాజిల్లినాయి. పవిత్ర గోదావరినది తటమున నుండుటయే ఇందులకు కారణము కావచ్చు. శాతవాహనుల తొలి రాజధానిగా వెలసిన కోటిలింగాలలోని పెక్కు అవశేషాలే దీనికి తార్కాణం. కాళేశ్వరము ప్రక్కనుండి ప్రవహించు గోదావరిలో బ్రహ్మతీర్థం, పిచ్చుకతీర్థం, జ్ఞానతీర్థం, వాయసతీర్థం, సంగమతీర్థం, నరసింహతీర్థం, హన్మత్‌తీర్థం, వ్యాసతీర్థం అనే అష్టతీర్థాలున్నాయి. కాళేశ్వరంలోని ప్రతివీధిలో శిథిలావస్థలో నున్న దేవాలయాలు, నాటి శిల్పాలే దర్శనమిస్తాయి. ఇచట బయల్పడిన వివిధ కాలములకు చెందిన అనేక శిల్పాలు అద్భుతమైన కళతో అలరారుతుంటాయి.

శైవాగమముల సుప్రసిద్ధ పండితుడు రామారణ్య శ్రీపాదుడు లేదా రామేశ్వర దీక్షితుడు గోదావరి తటమున నున్న కాళేశ్వరమందు స్థిరపడెనని తెలుస్తుంది[100]. కాకతీయ రెండవ ప్రోలరాజు మతగురువైన ఇతడు అనేక శివాలయములను, శైవమఠములను నిర్మింపజేశాడు. కాళేశ్వరములోని దేవాలయమును అతడే నిర్మించి ఉంటాడు. సబ్బినాడుకు రాజధానిగా వెలసిన నగరూరు (నగునూరు) పాలకుడు (Governor)నూ కాకతి రుద్రదేవుని మంత్రియైన వెల్లకి గంగాధరుడు క్రీ.శ.1171లో వేయించిన నగునూరు శాసనము ప్రస్తుతము కరీంనగరము జిల్లా కలెక్టర్ నివాసభవనము ఆవరణలో నిలుపబడి ఉంది. గంగాధరుడు కాళేశ్వరమందు, తదితర ప్రదేశములందు దేవాలయములు నిర్మించెనని ఈ శాసనము తెలుపుతుంది[101]. హనుమకొండలోని

క్రొత్త బసుస్టేషన్ (New Bus Stand) దగ్గర నున్న చెఱువు కట్టపై బయల్పడిన మంత్రి వెల్లకి గంగాధరుని శిథిలశాసనమొకటి అచటి పోస్ట్‌గ్రాడ్యువేట్ కేంద్రం (P.G.Centre) లో భద్రపరచబడింది[102]. ఈ శాసనములో గంగాధరుడు గోదావరి, ప్రాణహిత నదుల సంగమస్థానమున అనగా కాళేశ్వరము నందు మురారి, శంకర దైవములను ప్రతిష్ఠించెనని పేర్కొనబడింది.

కాకతి గణపతి దేవచక్రవర్తి మతగురువైన పాశుపత శైవాచార్యుడు విశ్వేశ్వర శివుడు కాళేశ్వరము వద్ద ఉపలమఠమను శైవ మఠమును స్థాపించి దాని నిర్వహణకై తానే రూపొందించిన బ్రాహ్మణుల అగ్రహారమగు పొన్న గ్రామమును దానముగా ఇచ్చాడు[103]. గోళకి మఠమునకు చెందిన ఈ విశ్వేశ్వర శివాచార్యుడు కాళేశ్వరము, మంత్రకూటము, చంద్రవల్లి, కొమ్మూరు, ఏలేశ్వరం, సంగమేశ్వరం మున్నగు ప్రదేశములందు శివాలయములను, మఠములను కట్టించెనని తెలుస్తుంది[104]. కాళేశ్వరమందున్న కాకతి గణపతి దేవుని కాలపు తేది లేని శాసనమునందు విశ్వేశ్వర శివాచార్యుడు, అతని ఆధ్యాత్మిక మానసపుత్రుడు (Spiritual son) ధర్మ శివాచార్యుడు కాళేశ్వరమునందు ఒక శివాలయము నిర్మించి భూదానములొసంగినట్లు తెలుపబడింది. ఈ శాసనమందు మంథనవటి, ఊటుపల్లి, చెన్నూరు గ్రామములు గూడా పేర్కొనబడినాయి[105]. కాకతీయ చక్రవర్తి మహాదేవుని కుమార్తె కుందమాంబ కాళేశ్వరములో అర్ధనారీశ్వరుని దేవాలయము కట్టించెనని వరంగల్ జిల్లాలోని నిడిగొండ (Nidigonda) లో గల క్రీ.శ. 1219 గణపతి దేవ చక్రవర్తి కాలపు శాసనం తెలుపుతుంది[106].

శకసంవత్సరము 1319 ఈశ్వర చైత్రశుద్ధ పాడ్యమి సౌమ్యస్యవారము (Wednesday) నూతన వత్సరాది పర్వదినమున సరియగు తేది క్రీ.శ. 1397 ఫిబ్రవరి 28న గౌతమీ (గోదావరి) తటముననున్న ముక్తీశ్వర దేవరకు విజయ నగరాధీశుడైన రెండవ హరిహరరాయల తనయుడు మొదటి దేవరాయలు తులాపురుష దానమిచ్చాడు[107]. అతడు పొందిన విజయములకు సూచకముగా సంస్కృతము నందు ఈ ఆరు పంక్తుల శాసనము మంటప స్తంభముపై వేయించాడు. హిందూ ధర్మశాస్త్రములు తెలుపునట్లుగా షోడశ మహాదానములలో తులా పురుష దానమొకటి. రాజన్యులు ధనికులు తమ బరువునకు సమామైన బరువు గల సువర్ణదానము చేసేవారు. అదే సంప్రదాయములో సామాన్యులిప్పుడు తమ ఎత్తు బరువు గల ధాన్యమును, బెల్లము లేదా చక్కెరను తులాభారముగా నొసంగు ఆచారముంది.

మంటప స్తంభముపై ఒకానొక భక్తుడు చెక్కించిన తేదీ లేని చిన్న శాసనము (Label inscription) ఉంది. ముక్తీశ్వర భక్తుడైన యల్లాబట్టు పుత్రుడు రామభక్తుడు యువ భాద్రపద శుద్ధ ద్వాదశి గురువారము రోజున వేయించిన శాసనమిది. ఎలాంటి వివరములు ఇందులో లేవు[108]. ఇంకొక చిన్న శాసనము (Label inscription) 16వ, 17వ శతాబ్దపు లిపి లక్షణములతో ధ్వజస్తంభముపై చెక్కబడింది[109]. యువ సంవత్సర చైత్ర శుద్ధ దశమి సోమవారము రోజున

కాళేశ్వరములోని ముక్తీశ్వరునకు వాలదు తిదురోజు కుమారుండైన బాలోజు నందికంభం (Nandi Pillar) ను సమర్పించెనని ఈ శాసనం తెలుపుతుంది.

పైన పేర్కొనిన శాసనాధారములే గాకుండా మట్టికోట గోడలు, రాతితో కట్టిన బురుజులు ఈ ప్రాంతము మధ్యయుగములో ప్రాధాన్యతను వహించెనని తెలుపుచున్నాయి. గోలకొండ సుల్తాన్ అబ్దుల్లా కుతుబ్‌షా తన రెండవ కూతరును ఔరంగజేబు కుమారుడైన ముహమ్మద్ రాకుమారునకిచ్చి వివాహము చేయు సందర్భములో రామగిరి దుర్గమును దాని పరిసర ప్రాంతములను క్రీ.శ. 1656లో వరకట్నము క్రింద మొగలులకు ధారాదత్తము చేశాడు. తత్ఫలితంగా కాళేశ్వర ప్రాంతంపై గూడా మొగలులకు అధికారము దొరికింది. ఔరంగజేబు ఇచట నివసించిన కాలమున మహదేవ్‌పూర్ తాలుకాలోని కాళేశ్వరము మరియు సోనిపేట్‌లందు మసీదుల నిర్మాణము గావించినట్లు తెలుస్తుంది[110]. కాళేశ్వరములోని ప్రధాన ముక్తీశ్వర దేవాలయమునకు వాయువ్యమున కొంత దూరములో శిథిల దేవాలయ శిలలతో నిర్మింపబడిన మసీదు ఔరంగజేబు కాలముదై ఉంటుంది. ఆ తరువాతనే ఆచటి వీధి మసీదుపల్లిగా ఏర్పడింది.

1975 కంటే పూర్వము రోడు రవాణా సౌకర్యములు లేక కీకారణ్యములో నున్న ఈ క్షేత్రము కనీస వసతులు లేక కాలినడకన వాగులు, వంకలు దాటుతూ భక్తులు సాహసయాత్రే చేసేవారు. చాళుక్యుల కాలములోని ఇచటి దేవాలయమును పన్నెండవ శతాబ్దపు ప్రథమార్ధములో కాకతీయులు పునరుద్ధరించిన అనంతరం దీని అభివృద్ధికి ఎలాంటి ప్రయత్నము జరుగలేదు. క్రీ.శ. 1976లో అప్పటి అమాత్యులుగా నుండిన కీ.శే. జువ్వాడి చొక్కారావు ఒక కమిటిని ఏర్పరచి జీర్ణోద్ధరణకై నిధులు మంజూరు చేయించాడు. 1982 లో జగద్గురు శంకరాచార్యులు విగ్రహ పునఃప్రతిష్ఠ చేశారు. బి.టి. రోడ్ల నిర్మాణముతో రవాణా సౌకర్యములు పెరిగి యాత్రికులు అధిక సంఖ్యలో ఇచటి ఆలయమును దర్శించుచున్నారు. నాడు ఏడాదికి రూ. 500 మాత్రమే ఆదాయముండిన దేవాలయము నేడు రూ. 20 లక్షల ఆదాయంతో భక్తుల సందడితో కళకళలాడుచున్నది.



దేవాలయము



కాళేశ్వరుదు–ముక్తేశ్వరుదు

కాళేశ్వరములో అనేక శిథిలాలయములున్నాయి. సంగమమందు గల సంగమేశ్వర ఆలయము, అరణ్యములోనున్న ఆదిముక్తీశ్వరాలయము, చంద్రశేఖరాలయము శిథిలమైన దేవాలయములలో ముఖ్యమైనవి. కాళేశ్వర, ముక్తీశ్వర దేవాలయమే ఇచటి ప్రధాన పూజా మందిరం.

## కాళేశ్వర, ముక్తీశ్వర దేవాలయము

ఒకే పానవట్టముపై కాలుడు, శివుడు ఇరువురు రెండు లింగరూపములలో ప్రతిష్ఠింపబడుట ఈ దేవాలయ ప్రత్యేకత. ముక్తీశ్వర లింగమునకు రెండు నాసికారంధ్రము ఉన్నాయి. ఈ రంధ్రాలలో (Nostrils) ఎంత నీరు లేదా పాలు పోసినా బయటకు రాకుండా అంతర్వాహిని గుండా గోదావరిలో కలుస్తాయని ప్రతీతి. అందుకే దీనిని త్రివేణి సంగమమని పిలుస్తారు. లింగము ఉపరితలముపై గల ఈ రెండు నాసికా రంధ్రములలో ఎన్ని పాలు పోసినా, ఎంత నీరు పోసినా అవి పూర్తిగా నిండక పోవడము ఒక విశేషంగా నేడు తిలకింపవచ్చు.



జీర్ణోద్ధరణకు పూర్వము (1975)



జీర్ణోద్ధరణ తరువాత

సనాతన దేవాలయముండిన చోటనే 1976-1982 మధ్యకాలములో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము నూతనముగా దేవాలయమును సంపూర్ణముగా పునఃనిర్మాణము గావించింది. ప్రస్తుతమగబడునదంతయు క్రొత్త నిర్మాణమే. గర్భగృహములో ప్రతిష్ఠింపబడిన కాళేశ్వర, ముక్తీశ్వర లింగములు గల పానవట్టము మాత్రము పాతది. ఈ ఆలయము యొక్క జీర్ణోద్ధరణ కార్యక్రమము చేపట్టుటకు పూర్వము తీయబడిన ఫోటో ఒకటి దేవాలయ కార్యాలయమందుంది. దానిని తిలకించినచో తూర్పు ముఖమును కలిగి ఉన్న ఈ దేవాలయపు శిఖరము మెట్లతో గూడిన పిరమిడ్ ఆకారంలో ఉండేది. స్తంభములతో గూడిన మంటపము పైకప్పు (terrace) చదునుగా నుండి చుట్టు నాలుగు వైపుల పిట్టగోడ (Parapet wall) ను కలిగి ఉండేది. శిఖరము ఈ పిట్టగోడల మధ్యన కనబడుతుంది. (The spire appears within the parapeted terrace) ఈ ఆలయము ముందున్న ఎత్తైన స్తంభముపై గల చిన్న మంటపములో (Miniature Mandapa)

నంది ప్రతిష్ఠింపబడింది. పూర్వపు దేవాలయమునకు ఉత్తరమునందుండిన చిన్న దేవాలయములో అన్నపూర్ణ విగ్రహముండెనని, అదే విధముగా దక్షిణమునందుండిన దేవాలయములో ప్రౌఢ సరస్వతి విగ్రహముండేదని తెలుపబడింది. దేవాలయ ప్రాంగణమును ప్రవేశించుటకు సమతలమైన పైకప్పుతో (Flat roofed gateway) గూడిన పెద్ద ప్రవేశద్వారముండేది. ఈ ప్రవేశమున కిరువైపుల నుండిన శిథిలమైన ప్రహరీగోడలు ఫోటోలో కనిపిస్తున్నాయి.

## ప్రతిమాశిల్పములు

ముక్తీశ్వర దేవాలయము బయట దక్షిణ ప్రాకారపు గోడ ప్రక్కకు రెండు వరుసలలో విడి శిల్పములనేకములు పెట్టబడిఉన్నాయి. అనేక అమూల్యమైన చిత్ర శిల్పములలో నర్తకీమణులు, వేటకాళ్లు, ధనుర్ధారులు, గరుడ, మిథున మున్నగు మనోహర చిత్రశిల్పములగబడుతాయి. అర్జునుని మత్స్య యంత్రము, గోపికావస్త్రాపహరణము, మయూరము పై స్వారి చేయు స్కందుడు, తొండమును పైకెత్తిన గజముపై వెనక నుండి లంఘించుచున్న సింహము, అంజలి ఘటించుచున్న స్త్రీ, పురుషుల రూపములు మున్నగునవన్నియు చూడముచ్చటగానున్నాయి. ఊర్ధ్వభాగము మానవాకృతిలో, అధోభాగము సర్పరూపములో నున్న నాగ, నాగినీ విగ్రహములు పొలాసలోని నాగిని రూపములను బోలి ఉన్నాయి. ఇచట పడియున్న శిల్పములన్నియు ఎర్ర ఇసుకరాయితో మలచబడినవి. పదకొండవ, పన్నెండవ శతాబ్దపు ఈ శిల్పములలో కొన్నింటిని ఉదహరించుట ఆవశ్యకము.

## అన్నపూర్ణ

కాశీవిశ్వేశ్వరుని అర్ధాంగి అన్నపూర్ణ ప్రతిమ ద్విహస్తములతో ఉంది. కూర్చొని యున్న దేవి ఒకచేత ప్రసాదపాత్ర లేదా కుండను (Vessel) పట్టుకొని మరియొక చేత తెడ్డు (Ladle) తో అన్నమును బయటకు తీయుచున్నట్లున్నది. ఆమె వజ్ర కిరీటము, విలువైన రాళ్లతో పొదిగిన కర్ణకుండలములు, గ్రైవేయకము ధరించినట్లు చక్కగా మలచబడింది. ఆమె లావైన స్తనములు క్షీరభారముచే క్రిందికి వంగినట్లు అందముగా చెక్కబడినాయి. ఆమె కేయూరములు, కంకణములు, వనమాలను ధరించి ఉంది. శిలాఫలకముపై ఉబ్బుగా (Bold relief) చెక్కబడిన బహుసుందరమైన అర్ధశిల్ప ప్రతిమ ఇది.


అన్నపూర్ణ


చతుర్ముఖలింగము


మత్స్యయంత్రము

**2. అన్నపూర్ణ :-** ఇది మొదటి దాని కంటే చిన్నగా నున్న రూపము. పాలాసలోని అన్నపూర్ణవలె ఇది చతుర్బాహువులతో ఉంది. పై హస్తములందు దమరుకము త్రిశూలములుండగా, క్రింది హస్తములతో కుండను (ప్రసాదపాత్ర) పట్టుకొని తెడ్డుతో అన్నమును బయటకు తీయుచున్నది. ఆమె కిరీటము హొయసలశిల్ప ప్రభావమును చూపుచున్నది.[111]

**3. గణపతి :-** బాగా అఱిగిపోయిన ఈ గణపతి విగ్రహము మకుటము లేకుండా ఏనుగు తలతో ద్విహస్తములను కలిగి ఉంది.

**4. గణపతి :-** ఎర్ర ఇసుక రాతితో చెక్కబడిన ఈ విగ్రహము 3' అడుగుల ఎత్తుతో చతుర్బాహువులు కలిగి ఉంది. కరండ మకుటము ధరించిన గణపతికి నాగసర్పము ఉదరబంధంగా ఉంది.

**5. మత్స్యావతారము**

నల్ల గ్రానైట్ రాయితో మలచబడిన పెద్ద చేపరూపము 8' అడుగుల పొడువు 2½' అడుగుల ఎత్తుతో నోటిని తెరచి ఉంది. ప్రహారి గోడనానుకొని లోపలివైపు వరుసగా కట్టబడిన నడవ (Corridor) లో ఇది నిలుపబడింది.

**6. చతుర్ముఖలింగము**

నల్లసరపురాయి (Basalt) తో చేయబడిన లింగమునకు నాలుగువైపుల నాలుగు శివుని తలలున్నాయి. లింగము యొక్క ఉపరితలము చదునుగా ఉంది. ముక్తీశ్వరాలయ ప్రాంగణములో ఇది నిలుపబడింది. నిగనిగలాడే నున్నటి చెక్కడము (Smooth Polish) ను బట్టి ఓరుగల్లు కోటలోని శిథిలమైన స్వయంభూ దేవాలయపు చతుర్ముఖలింగమును ఇది బోలి ఉంది. స్వయంభూ దేవాలయపు చతుర్ముఖ లింగము ప్రస్తుతము శంభుని గుడి ఆవరణలో దర్శనమిస్తుంది. ఇలాంటి చతుర్ముఖ లింగమొకటి కాళహస్తి లోని మానికేశ్వర దేవాలయమందుంది[112].

**7. సూర్యుడు**

ఇది నల్లసరపురాతితో (Basalt) మలచబడిన 4'-6" అడుగుల ఎత్తున్న అందమైన కాకతీయ శిల్పము. నిగనిగలాడే నునుపుతో ప్రశస్తమైన ఆభరణభారము (well polished and exquisitely ornamented) తో నున్న రూపము వెనుక మకరతోరణము, పీఠమున ఏడు అశ్వములు అందముగా చెక్కబడినాయి. సూర్యుడు కిరీటమకుటము, కర్ణకుండలములు, కేయూరములు, ముంజేతి కడియములు, కాలికడియములు, పాదములకు నూపురములు మున్నగు ఆభరణములతో శోభిల్లుచున్నాడు. అతనికి ఉన్న రెండు భుజములు మోచేతి నుండి విరిగి ఉన్నాయి. అర్ధోరుకము, వనమాల ధరించిన సూర్యుని కిరువైపుల చామరధారిణులు, విల్లంబులు ధరించిన స్త్రీలు అందముగా మలచబడినారు.

**8. విష్ణువు**

సాధారణ ఆభరణములనన్నింటిని ధరించి మూడు అడుగుల ఎత్తున్న ఈ విగ్రహము

వెనుక మకరతోరణము ఉంది. ఈ దేవరకు కుడివైపున పాదముల వద్ద అంజలి ముద్రలో గరుడశిల్పము బహుసుందరంగా ఉంది.

**9. లింగములు**

దేవాలయ ఆవరణలో బయట వివిధ పరిమాణములలో నున్న అనేక లింగములున్నాయి. కాకతీయుల కాలములో నల్లసరపురాయితో మలచబడిన నునుపైన పెద్ద లింగములు ఎనిమిది అడుగుల చుట్టుకొలతను కలిగి యుండుట విశేషం.

**10. నంది విగ్రహములు :-** చాళుక్యుల, కాకతీయుల కళారీతులలో వివిధ పరిమాణములలో గల అనేక నంది విగ్రహాలున్నాయి.

**11. ద్వారపాలకుడు**

ఎర్ర ఇసుకరాయి (Red Sandstone) తో ఆరు అడుగుల ఎత్తు గల ద్వారపాలక విగ్రహము మలచబడింది. చతుర్బాహువులు గల ఈ ద్వారపాలుని పైకుడి చేతిలో దమరుకము, ఎడమచేతిలో ఖట్వాంగము, క్రింది కుడిహస్తములో గద యుండగా ఎడమహస్తము గద పిడిపై నిలుపబడింది. ద్వారపాలుడు మకుటము, గ్రైవేయకములు, యజ్ఞోపవీతము, మోచేతి, ముంజేతి, కాలి కడియములు, నూపురములు మున్నగు ఆభరణములు ధరించి మెడలో కపాలముల హారము వేసికొని ఉన్నాడు. ఈ హారము వనమాల వలె అగబడుతుంది. ఈ అర్ధశిల్పము ఒక పెద్ద శిలాఫలకముపై ఉబ్బుగా (Bold relief) మలచబడింది. ఇలాంటి మరియొక ద్వారపాలుని విగ్రహము అచటనే నిలిచి ఉంది.

## 21. నగునూరు

కరీంనగర్‌కు ఉత్తరమున 8 కి.మీ. దూరములో నున్న గ్రామమే నగునూరు. శిథిలమైన దేవాలయములు, అంగచ్ఛేదములైన విగ్రహములు (Mutilated images) అనేక చిన్న పెద్ద శిలాశాసనములు ఇచటి పూర్వపు ప్రాభవ వైభవములను తెలుపుతాయి. శిలాశాసనములందు ఈ గ్రామము నగరూరు (Nagaruru) అని పేర్కొనబడింది. ఆనాడు రాజధానిగా వెలసిన నగరూరు నేడు నగునూరుగా పిలువబడుతుంది. నగునూరు ఆనాడు ఒక రాజధాని నగరముగా సుప్రసిద్ధము. నేడు ప్రతిమా ఆసుపత్రి కేంద్రంగా సుప్రసిద్ధము. వేములవాడ చాళుక్యుల, కళ్యాణి చాళుక్యుల, కాకతీయుల కాలములో ఎనిమిదవ శతాబ్దము నుండి పన్నెండవ శతాబ్దము మట్టుకు నాలుగు శతాబ్దములు నగునూరు రాజకీయ, ధార్మిక, మతపరమైన వివిధ కార్యక్రమముల కేంద్రంగా విరాజిల్లింది. గ్రామము చుట్టూ ఉండిన పురాతన మట్టికోట గోడల ఆనవాళ్లు అక్కడక్కడ నేటికీ కనిపించటం విశేషం.

క్రీ.శ. 946 నాటి నగునూరు తొలి శిలాశాసనమొకటి కరీంనగర్ మ్యూజియంలో ఉంది.[112] ఈ శాసనమును వేములవాడ రాజ్యపాలకుడగు రెండవ అరికేసరి శకసంవత్సరము

869 పరాభవ కార్తీక బహుళ ఏకాదశి సోమవారము నాడు కౌశిక గోత్రోద్భవుడును, నూతులపాడు గ్రామనివాసియు, విష్ణుభట్టుని పౌత్రుడును, అప్పనయ్య పుత్రుడునునగు ధారపయ్య అను విప్రునకు అరిపినపల్లి గ్రామమున యాభై మత్తుల్ల నీరు నేలను దానమిచ్చు సందర్భమున వేయించాడు. ఇది నాలుగువైపుల చెక్కబడిన కన్నడ శిలాశాసనం. శిలాశాసనపు మూడవ ప్రక్కన చెక్కబడిన 20వ పంక్తిలో ఈ గ్రామనామము 'నగరూరు' గా పేర్కొనబడింది.

కళ్యాణి చాళుక్యుల కాలములో గూడా సబ్బినాడులోని వేములవాడ, పొలవాస (Polas), మంత్రకూటము (Manthani) వలె నగరూరు (Nagaruru) రాజకీయ ప్రాధాన్యతను సంతరించుకున్న నగరము. నగునూరులోని బీరన్న గుడి వద్ద గల శిలాశాసనము శక సంవత్సరము 1035 నందన పౌష్య శుద్ధ పంచమి సోమవారం సరియగు తేది క్రీ.శ. 1112 డిసెంబర్ 25న నగునూరు మహామండలేశ్వరుడైన పండరసర్ (పండరాజు) రవ్వీశ్వర దేవాలయమును కట్టించి చెఱువు క్రింద సాగుచేయబడు భూములను దాన మొసంగినట్లు తెలుపుతుంది[113]. నగునూరులోని నక్కలగుడి వద్ద పడియున్న వీరగల్లుల అడుగుభాగమున చెక్కబడిన చిన్నశాసనములు (Label inscriptions) కెలన్, నారప్పతి, సంగమ మున్నగు మహాయోధులు దొమ్మరాజు పక్షమున పోరాడి శత్రువులను చంపి గెలుపొందిరని తెలుపుచున్నాయి[114]. ఇంకొక లేబెల్ శాసనము చాళుక్య విక్రమశకములో చెక్కబడింది. కాని వివరములు స్పష్టముగా లేవు. దీనిలో చెక్కబడిన ప్రమాది సంవత్సరము క్రీ.శ. 1159కి సరిపోతుంది. ఈ లేబెల్ శాసనమందు ప్రమాది వైశాఖ బహుళ అమావాస్య శుక్రవారము రోజున మేడరాజు, జగ్గదేవుడు 80 వేల సైన్యముతో పొడిచి గెలిచెయని పేర్కొనబడింది[115]. ఈ లేబెల్ శాసనమును బట్టి తొలిదశలో పొలవాస రెండవ మేడరాజు, అతని కుమారుడు రెండవ జగ్గదేవుడు 80వేల సైన్యముతో శత్రువు నెదిరించి విజయము పొందిరని తెలుస్తుంది. కాని ఆ శత్రువు పేరు శాసనమందులేదు. ఆ శత్రువు కాకతి రుద్రదేవుడు తప్ప అన్యులు కావడానికి ఆస్కారము లేదు. కాని తదనంతరము మహాయోధుడైన కాకతి రుద్రదేవుడు నగునూరు దొమ్మరాజును, పొలవాస రెండవ మేడరాజును, కళ్యాణి సేనాని మైలిగి దేవుని ముగ్గురి మిత్రకూటమిని క్రీ.శ. 1159లో చిత్తుగా ఓడించినట్లు హనుమకొండలోని వేయిస్తంభాల గుడి శాసనములో పేర్కొనబడింది[116]. క్రీ.శ.1159లో విజయము పొందిన కాకతి రుద్రేవుడు సబ్బినాడునంతయు (నేటి కరీంనగరము జిల్లా) నగునూరుతో సహా తన రాజ్యములో కలుపుకొన్నాడు. కాకతి రుద్రదేవుడు తన మంత్రియైన వెల్లకి గంగాధరుని నగనూరు రాజధానియందు సబ్బినాడు పాలకునిగా (Governor) నియమించాడు.

శక సంవత్సరము 1092 వికృతి మాఘశుద్ధ పంచమి బుధవారము సరియగు తేది క్రీ.శ.1171 జనవరి 13న కాకతిరుద్రదేవుని మంత్రి, నగునూరు పాలకుడైన వెల్లకి గంగాధరుడు వేయించిన నగునూరు శిలాస్తంభ తెలుగుశాసనము నేడు కరీంనగర్ జిల్లా కలెక్టర్ బంగ్లాలో ఉంది[117]. వెల్లకి గంగాధరుడు బ్రాహ్మణులకు దిండొంట గ్రామమును అగ్రహారముగా నొసంగినట్లు

మరియు నగునూరులో త్రికూట దేవాలయమును పరమశివునికై కట్టించినట్లు ఈ శాసనంలో ఉంది. ఇతడు అనుమకొండ, హిడింబాచలము, నగరూరు, మంత్రకూటము మొదలగు చోట్ల దేవాలయములు కట్టించినట్లు ఇందులో పేర్కొనబడింది. ఈ శాసనములో సప్తసంతానములు పేర్కొనబడుట విశేషం. తను పెంచిన సంతానము (పెంపుడుకొడుకు) తన సంతానము (స్వంతకొడుకు) కృతి (కావ్యము) అగ్రహారము, వనము, చెఱువు, గుడి జనవినుతములైన సప్త సంతానములుగా ఈ శాసనమందు తెలుపబడినాయి.

నగునూరు గ్రామములో పురావస్తుశాఖ దృష్టికి రాని అముద్రిత శాసనమొకటి రామలింగాల గుడిశాసనముగా స్థానికులచే పేర్కొనబడింది. దాదాపు రెండు దశాబ్దాల పూర్వము నగునూరు దేవాలయములపై పరిశోధన జరుపు సమయమున అచటి పాఠశాల ప్రధానోపాధ్యాయులుగా పనిచేయుచుండిన కె. మల్లయ్య గారి నుండి 1983 డిసెంబర్ 24 రోజున సేకరించిన అముద్రిత తెలుగు శాసనము పాఠకుల ప్రయోజనార్థమై ఈ క్రింద పేర్కొనబడింది[118]. ఇది తేది లేని అసంపూర్ణ శాసనము. ఇది కాకతి రుద్రదేవుని లేదా రుద్రమదేవి కాలమునకు చెందినదై ఉంటుంది. పురుషవేషము ధరించి పాలన చేసిన రుద్రమదేవి శాసనములందు రుద్రదేవునిగా పేర్కొనబడిన ఉదంతములున్నాయి. ఈ శాసనమునందు గ్రామనామము నగరూరుగా పేర్కొనబడింది. రామనాథదేవరకు పూలమాలలు తయారు చేయు మాలకారుల జీతములకై నగరూరు గ్రామములోని బ్రాహ్మణగడ్డ వద్ద గల పొలము దానముగా నొసంగబడినట్లు ఈ శాసనమందుంది. ఇందులోని కొన్ని చెఱువుల పేర్లు తెలియుటలేదు.

## రామలింగాలగుడి అముద్రిత శాసనము-నగునూరు

స్వస్తిశ్రీ మనుమహా
మండలేశ్వర కాకతి
య్య రుద్రదేవ మహా
రాజుల ధర్మము 11 తదా
రి రామనాథని పూమం(డి)
సేసె మాలాకారుల జీ
తాలకు నగరూరి నగర
ము బ్రాహ్మణగడ్డ వ్రిత్తి
విలిచి ఇచ్చిన పొలము
చింతల చెఱ్వురొంబచే
ల రామేశ్వని పద్దె వారి
డి అద్ద। అండముడ చెర
గుండలి అద్ద। ఆండ ఆ
తోట అతిథి వాంగు పొడు
గు ............
బ్రహ్మలదవి చెఱ్వ బా . . .

కాకతి గణపతి దేవుని కాలపు క్రీ.శ. 1228 నగునూరు శాసనమందు నిజరంగాల మల్లిశెట్టి మరియు అతని కుమారుడు వెన్నిశెట్టి సాలీయల పక్షమున సాలేశ్వర, గణపతిదేవ మహారాజు పేరట గణపతీశ్వర, భక్తులందరి పక్షాన సకలేశ్వర దేవాలయములు కట్టించినట్లు తెలుపబడింది.[119] కొన్ని శిలాశాసనస్తంభములు స్థానికముగా గృహనిర్మాణములకై ఉపయోగించుట

దురదృష్టకరము. గణపతి దేవుని కాలపు శాసనమొకటి కె.మల్లయ్య గారి ఇంటికి సమీపమున గల ఒక గృహపు కట్టడములో వినియోగించుట గమనార్హము.

శిలాశాసనములే గాకుండా కాకతీయ గణపతి దేవచక్రవర్తి శక సంవత్సరము పరాభవ పుష్యశుద్ధ షష్ఠి శనివారము సరియగు తేది క్రీ.శ. 1246 డిసెంబర్ 15న వేయించిన తామ్రపత్ర శాసనము (Copper plates) చామన్‌పెల్లి గ్రామపు గొనుగుకాలువ అచటి బ్రాహ్మణులకే చెందునను తీర్మానమును తెలుపుతుంది[120]. ఈ శాసనములో చామన్‌పెల్లి, కుమ్మరికుంట, దేవనపల్లి, కాట్యకోలపల్లి (కాట్నెపెల్లి) గ్రామముల పేర్లున్నాయి. గొనుగుకాలువ గల చామన్‌పెల్లి గ్రామము నగునూరుకు కేవలము 6 కి.మీ. దూరంలో ఉంది. మహారాజా అక్షయ చంద్రదేవుడు ఈ ప్రాంతపు సామంతరాజుగా పేర్కొన బడినాడు. నగునూరు రాజధానిగా గల సబ్బినాడును పదమూడవ శతాబ్దపు మధ్యభాగమున గణపతి దేవుని సామంతుడైన అక్షయ చంద్ర దేవుడు ఏలినట్లు ఈ శాసనమును బట్టి విదితమవుతుంది.

కళ్యాణి చాళుక్యుల, కాకతీయుల కాలములో రాజధానిగా విరాజిల్లిన నగునూరు నేడొక కుగ్రామముగా మిగిలిపోయింది. ఇచట నున్న అనేక సుందరదేవాలయములు, అద్భుత శిల్పములు పూర్వకాలపు వైభవమును చాటుచున్నాయి. మహోన్నత శిల్ప కళారీతులను చాటు ఇచటి దేవాలయములు 12, 13 శతాబ్దములకు చెందిన కాకతీయ కట్టడములు, పది, పదకొండవ శతాబ్దములకు సంబంధించిన దేవాలయముల శిథిలాలు, అవశేషాలు పెక్కు గ్రామమంతటా చూడవచ్చు. నగునూరు ఒక జైన మతకేంద్రమై యుండెననుటకు అచటగల ఒక పెద్ద గుండ్రాయిపై కాయోత్సర్గలో నున్న జైన ప్రతిమయే తార్కాణము. దాదాపు ఇచటి దేవాలయములన్నియు స్థానికంగా లభ్యమగు ఎర్ర ఇసుకరాతితో నిర్మింపబడినవేయని చెప్పవచ్చు. నగునూరు పరిసరములందున్న స్థానిక గుట్టలరాయి చాలా నాణ్యమైంది, అమూల్యమైంది గనుకనే నేడు ఇచటి రాయి కొరియా, జపాన్‌లాంటి దేశములకు అమితంగా ఎగుమతి యగుచున్నది.



ప్రధాన త్రికూటాలయము



గరుడస్తంభము

## 1.ప్రధాన త్రికూటాలయము

ఈ దేవాలయము నక్షత్రాకార పథకమును (Cruciform plan) కలిగి ఉంది. మధ్యనున్న ముఖమంటపమునకు తూర్పు,పడమర,దక్షిణములందు మూడు గర్భగృహములుండి ఉత్తరముఖమును కలిగి ఉంది. ఈ త్రికూటాలయము ఉపపీఠముపై నిలిచి ఉండుట వలన ఎత్తుపై ఉంది. ఉపపీఠము అనేక వర్గములను (Mouldings) అడ్డముగా (horizontally) కలిగి ఉండి దేవాలయము చుట్టూ ప్రదక్షిణా పథముగా తోడ్పడుతుంది. మహాపట్టిక, పట్టిక, పద్మము, త్రిపట్టిక వర్గములోని ప్రధానమలుపులు. ఇలాంటి అమరిక గల వర్గములు అనేకములు ఉపపీఠమునకు శోభతోపాటు ఉన్నతి (height) ని సమకూర్చినాయి. కొన్ని పట్టికలు అర్ధచంద్రాకారగోళములతో అలంకరింపబడినాయి. ఉపపీఠమున నున్న వర్గము (Mouldings) మలుపుల రూపములు అధిష్ఠానము నందు గూడా అగబడుతాయి. కాకతీయుల దేవాలయములలో ఉపపీఠము, అధిష్ఠానము రెండును వర్గములతో (Horizontal Mouldings) అలంకరింపబడుట సర్వసాధారణము. అధిష్ఠానముపైన లేచిన గోడలు పెద్ద చిన్న కుడ్యస్తంభముల (Broad and narrow pilasters) తో అలంకరింపబడినాయి. పెద్ద కుడ్యస్తంభమున కిరువైపుల మడతలు (Broad pilaster with folds on either side) ఉన్నాయి. శిఖరాన్ని మోస్తున్న సన్నని కుడ్యస్తంభములు (Narrow pilasters surmounted by turrets are sculptured in the recesses) వంపులలో అమర్చబడినాయి. కొన్ని సందర్భములలో ఈ సన్నని కుడ్యస్తంభములు కీర్తి ముఖములతో గూడిన ఛత్రము (Arched canopy with a kirtimukha at the top) లతో కలుపబడినాయి. గోడలపై నున్న కపోతము రెండు వరుసలలో ఉంది. మూడు గర్భగృహములపై నుండిన శిఖరములు నేడు లేవు. కాని పైకప్పుకై అమర్చిన పెద్ద పెద్ద పొడుగైన శిలలను ఇప్పటికీ (Large blocks of stone) చూడవచ్చు.



దక్షిణ ఆలయము



గోడల వివరములు

ఉత్తర దిశనుండి ఎనిమిది మెట్లెక్కినచో 24'-4" చతురస్రాకార మంటపమును జేరవచ్చు. ప్రవేశ మంటపము (Porch) పూర్తిగా కూలిపోయింది. మంటప ప్రవేశద్వారము ఐదు లేదా

ఆరు శాఖలతో నుండి గడప లేదా భువంగమము వర్గము (Mouldings) తో కూడుకొని ఉంది. శాఖల క్రింద పూర్ణకుంభములున్నాయి. పతంగము (Lintel) విరిగిపోయింది. మంటపములోని నాలుగు మధ్యస్తంభముల నడుమ నున్న స్థలము 6" ఆరు అంగళముల ఎత్తు చదరముగా నుండగా దానిపై రెండు అంగుళముల ఎత్తుతో వలయాకార రంగశిల రమ్యంగా ఉంది. మధ్యనున్న నాలుగు స్తంభములకు (Central pillars) అనుబంధంగా నాలుగువైపుల నాలుగేసి అర్ధస్తంభములు పిట్టగోడలపై నిలుపబడినాయి. పదహారు స్తంభములపై నిలిచిన మంటపలోకప్పు మొత్తము తొమ్మిది విభాగములలోను (Nine compartments) లుపవితాన (కదలికాకరణ) రీతిలో ఉంది. ప్రతివిభాగములోను లోకప్పుపై గల చతురస్రాకారపు శిలాఫలకము లోతుగా చెక్కబడిన విరబూసిన బహుదళ పద్మము మూడు వలయములతో ఒక దానిపై నొకటి చిన్నగా నుండి మధ్యలో మొగ్గ క్రిందికి వ్రాలుచున్నట్లు చెక్కబడిన శిల్పము బోర్లించిన పెద్ద అర్ధగోళాకార గిన్నె రూపములో మలచబడుట అద్భుతము. బహుదళ పద్మమునకున్న వలయములు లోలకముల వలె వ్రేలాడుచున్న చిన్నరాతి గోళముల (dripstones) తో నీటిచుక్కల ఝూరావళి వలె అలంకరింపబడుట వలన ఈ శిల్పము యొక్క అందము అతిశయించింది.



ఉపపీఠపు వివరములు



నంది ముందున్న శిథిలశివాలయ ద్వారము

మధ్యస్తంభముల పైనున్న లోకప్పు (ceiling) అలంకార భారముతో శోభాయమానముగా ఉంది. దూలముల యొక్క మూడు తలములు (The three surfaces of the beams) అనేక శిల్పములతో నిండి ఉన్నాయి. దూలముల బయటవైపున (outer side) ప్రాకుచున్న లతావృత్తములందు అందమైన హంసల వరుస ఉంది. దూలముల లోపలి తలములందు (Inner sides) నాట్యకత్తెలు, మృదంగ, తాళ వాద్యకారులు, బాకలను ఊదువారు. (dancers,

drummers, cymbal-beaters, trumpet-bearers) ఆధ్యాత్మిక భావోద్వేగముతో అందముగా మలచబడినారు. దూలముల క్రింది తలములందు (Bottom faces of beams) మూడు వలయములతో చెక్కబడిన బహుదళ పద్మము యొక్క మొగ్గ క్రింది వైపు వ్రేలాడుచున్నది. త్రికోణ ఫలకముల క్రింది తలములు (The under faces of the triangular slabs of the ceiling) విశాల పత్రములతో, లోలకముల లాంటి చిన్న రాతిగోళములతో (drip stones) అలంకరింపబడినాయి. ఈ ఫలకముల ప్రక్కలందు చతుర్దళ పద్మములను చూడవచ్చు. హంస, లతా పద్మముల వరుసలు ఈ త్రికూటాలయపు అనేక భాగములందు అగబడుతాయి. మహోన్నతమైన శిల్పకళారీతులను చాటు ఈ అందమైన దేవాలయము పెక్కు అలంకార శిల్పములతో శోభిల్లుచున్నది. అమితమైన ప్రశస్తపు చెక్కడములతో గూడిన ఈ దేవాలయపు లోకప్పు (ceiling) హనుమకొండ, పాలంపేట, నాగులపాడు మున్నగు దేవాలయములలోని లోకప్పును బోలిఉంది. నగునూరులో శిథిలావస్థయందున్న ఈ త్రికూటాలయము కాకతీయ శిల్పకళా వైభవమును వేనోళ్లచాటుతుంది.

ముఖమంటపమునకు మూడు వైపుల నున్న గర్భగృహములు 9'-6" చతురస్రాకారములో ఒకే రీతిలో ఉన్నాయి. వాటి ముందున్న అంతరాళముల కొలతలు 9'-9" x 9'-4". అంతరాళముల, గర్భగృహముల ద్వారముల నిర్మాణము ఒకే రీతిలో ఉంది. ద్వారపు త్రిశాఖల మధ్య భాగము కుడ్యస్తంభము. ఈ శాఖలందు గజ, సింహ శిల్పపు వరుసలున్నాయి. శాఖల క్రింది భాగమున నున్న శైవద్వారపాలకుల కిరువైపుల అందమైన చామరధారిణులు ఉన్నారు. అన్నిద్వారముల పతంగములపై 2'-3" వెడల్పుతో బయటకు పొడుచుకొని వచ్చిన చూరు అర్ధచంద్రాకారపు శిలలతో, వ్రేలాడుచున్న నీటి చుక్కల ఝూరావళి వలె అందంగా అలంకరింపబడింది. గర్భగృహద్వారపు తోరణములు శిఖర అంతస్తులతో అలంకరింపబడగా అంతరాళ ద్వారపు తోరణములు కూర్చొనియున్న పరమశివుని శిల్పములతో అలంకరింపబడినాయి. ఈ శివునికి ఇరువైపుల మృదంగ వాద్యకారుల, హస్తములందు కలశములు గల స్త్రీ రూపములు అందంగా మలచబడినాయి. శివుని పైహస్తములందు డమరుకము, త్రిశూలములుండగా, క్రింది వామహస్తము ముడుచుకొనిన కాలుపై నిలిపి దక్షిణ హస్తము అభయముద్రలోనూ ఉన్నాయి.

ప్రతి గర్భగృహము నందు ఎత్తైన వేదికపై లింగము ప్రతిష్ఠింపబడిఉంది. ఈ వేదిక వర్గము (Pedestal) అనేక మలుపుల (Mouldings)తో కూడుకొనిఉంది. పానవట్టముతో గూడిన వేదిక, దాని పైనున్న లింగము మొత్తము నల్లసరపురాయి (Black Basalt) తో మలచబడింది. పానవట్టము పై నున్న లింగము ఎత్తు ఒకటిన్నర అడుగులు మరియు దాని చుట్టుకొలత నాలుగు అడుగుల నాలుగు అంగుళాలు. లింగము ఉపరితలము సమతలముగా నుండి అంచులు శిరోవర్తనము (Flat topped with its edge bevelled) లో ఉన్నాయి. అంతరాళద్వారముల కిరువైపుల జాలి కిటికీలు అలంకార ప్రాయంగా ఉన్నాయి. ఎందుకనగా రంధ్రముల వెనుకభాగము

సమతల శిలాఫలకముతో మూసి వేయబడింది. (The rears of the lattice windows are closed). ద్వారపు శాఖలు మరియు జాలి కిటికీల క్రింది భాగమున నున్న శిలా ఫలకములలో సుందరమైన భామామణులు పైకెత్తిన తమ చేతులలో వింజామరలను (Fly-whisks) పట్టుకొని ద్విభంగములో నిలబడి ఉన్నారు. ఈ చామరధారిణుల అంగసౌష్ఠవము, వయ్యారము, వంపుసొంపులు తన్మయత్వము కలిగిస్తాయి. వీరి కేశాలంకరణ ఒక ప్రక్కకు ధమ్మిల్ల రూపములో (Their hair arranged in the shape of a bun) ముడువబడిన శిఖగా నుండి చూపరుల దృష్టి నాకర్షిస్తుంది. చేతులందు పూర్ణకలశములతో నున్న స్త్రీ రూపములు, చంకలో శిశువు నెత్తుకొనిన మాతృమూర్తి చూడముచ్చటగా ఉన్నాయి. అందమైన ఈ మగువలందరు గ్రైవేయకములు, హారములు, మోచేత్రి ముంజేతి కడియములు, కాళ్లకు చీలమండల వద్ద కడియముల జత (anklets in pairs) పాదములకు నూపురములు ధరించి ఆభరణ భారముతో రమణీయంగా మలచబడినారు. ఈ త్రికూటాలయ ద్వారములు కాకతీయుల కళాకౌశలము మరియు శిల్ప ఔన్నత్యమునకు మచ్చుతునకలుగా నిలిచియున్నవనుటలో అతిశయోక్తి లేదు. ఏ క్షణములోనైనా కుప్పకూలుటకు సిద్ధముగా నున్న ఈ త్రికూటాలయములోని బృహత్ లింగములు నేటికీ స్థానికుల పూజలందుకొనుట చోద్యంగా ఉంది. పరిశోధనకై వెళ్లిన సందర్శకులు కూలుచున్న ఈ ఆలయము లోనికి ప్రవేశించుటకు భయభ్రాంతులగుదురు. ప్రభుత్వము ఇచటి దేవాలయముల జీర్ణోద్ధరణకై ప్రయత్నించుచున్నదని తెలియుట ముదావహము.

## 2. శివాలయము

ప్రధాన త్రికూటాలయమునకు ఉత్తరమున కొన్ని అడుగుల దూరములోనున్న శివాలయము తూర్పుముఖమును కలిగి ఉంది. గర్భగృహము, అంతరాళము, ముఖమంటపము దీని ప్రధానాంగములు. ప్రస్తుతము నిలిచి యున్న మంటపము 25' అడుగుల చతురస్రము. దీని చుట్టున్న పిట్టగోడ బయట భాగము గజ, పద్మ శిల్పముల వరుసతో అలంకరింపబడింది. మంటపమునకు తూర్పు, ఉత్తర, దక్షిణ దిశల నుండి ప్రవేశములుండగా పడమట గర్భగృహముంది. ఈ మంటప లోకప్పు లుపవితాన రీతిలో నుండి అన్ని విభాగములందు చదరపు ఫలకము పై విరబూసిన సమతల పద్మము మూడు వలయములలో నుండి దాని మొగ్గ క్రింది ముఖమును కలిగిఉంది. (Flat Multi-petalled lotus carved in three concentric circles with a lotus bud hanging from the centre) ఈ బహుదళ పద్మ శిల్పములు హనుమకొండ, పాలంపేట దేవాలయములలోని పద్మములను బోలిఉన్నాయి. అంతరాళద్వారము ప్రక్కనున్న కుడ్యస్తంభము పై ఆసక్తికరమైన పంచతంత్రములోని తాబేలు గాథ అందంగా చెక్కబడింది. ఇలాంటి శిల్పమే ఒకటి అలంపురములోని విశ్వబ్రహ్మదేవాలయ ఉత్తరపు గోడ యందున్న కుడ్య స్తంభముపై దర్శనమిస్తుంది[121]. అంతరాళము యొక్క కప్పు కూలిపోయింది. గర్భగృహపు గోడలు కుప్పకూలి ఉన్నాయి. గర్భగృహద్వారము క్రింది భాగమున నున్న శైవద్వారపాలకుల

ఫలకములను బట్టి ఇది శివాలయమని తెలుస్తుంది.

## 3. శివాలయమునకు సమీపమున నున్న వేరొక శిథిలాలయము

పైన పేర్కొనిన శివాలయమునకు ఉత్తరమున ప్రక్కనే వేరొక శిథిలమైన ఆలయపు అవశేషాలున్నాయి. ఈ శిథిలాలయము గూడా తూర్పు ముఖముగానే ఉంది. ఒక సుందరమైన ద్వారము, దాని ముందు రెండు స్తంభములపై నిలుపబడిన ప్రవేశమంటపము (porch) మాత్రమే ప్రస్తుతము నిలిచియున్న దేవాలయ భాగము. ప్రవేశ మంటప రెండు స్తంభములు, మంటపలోకప్పు మరియు ద్వారము, అలంకారములోను, నిర్మాణములోను ప్రధాన త్రికూటాలయములో నున్న వాటిని పోలియుండుట గమనార్హము. ఈ ఆలయ ప్రాంగణములో కాకతీయుల కాలపు నంది విగ్రహము పడి ఉంది.

### నంది

కాకతీయుల కాలపు నందుల వలె నిగనిగలాడే నునుపు (well polished) తో మెరియుచున్నది. దీనిపై నున్న ఆభరణభారము కాకతీయ శిల్పుల ఉలి కౌశలమును ప్రదర్శిస్తుంది. నంది యొక్క ముందు వెనుకభాగములు మువ్వలపట్టా, గజ్జెల పట్టా, గంటల హారములతో బహురమ్యముగా మలచబడినాయి. కంఠ హారములున్న ఈ నందిముట్టె (Snout) విద్రోహుల విధ్వంసమునకు గురి అయింది.

## 4. వైష్ణవాలయ మంటపము

ప్రధాన త్రికూటాలయమునకు కొద్ది దూరంలోనే ఈశాన్యము నందుండిన దేవాలయము నేడు లేదు. కాని నాలుగు మధ్య స్తంభములతో (Central Pillars) గూడిన పదహారు స్తంభముల మంటపము మాత్రము నిలిచి ఉంది. ఇచట నిలిచియున్న ఎత్తైన గరుడ స్తంభములను బట్టి ఇది శిథిలమైన వైష్ణవాలయ మంటపమని చెప్పవచ్చు. కరీంనగర్ కలెక్టర్ నివాస గృహపు ఆవరణలో నిలుపబడిన క్రీ.శ. 1171 వెల్లకి గంగాధరుని నగునూరు శాసనములో అతడు చతుర్వింశతి విష్ణురూపములు (Twenty four forms of vishnu) ప్రతిష్ఠించినట్లు పేర్కొనబడింది[122]. అట్లు ప్రతిష్ఠింప బడిన విష్ణురూపములు నేడు లేవు. కాని ప్రతిష్ఠింపబడిన స్థలము ఈ శిథిల దేవాలయమే కావచ్చు. సమోన్నతముగా ఇచట నిలిచియున్న రెండు గరుడ స్తంభములే దీనికి తార్కాణము. చతుర్వింశతి విష్ణు రూపములను ప్రతిష్ఠించుట అరుదైన ఆసక్తికరమైన విషయము. ప్రస్తుతము అవికానరావు. ఈ చతుర్వింశతి విష్ణురూపములు విశాఖపట్నం జిల్లాలోని సింహాచల దేవాలయపు జగమోహన మంటపమందు దర్శనమిస్తాయి[123].

### గరుడస్తంభము

పై వైష్ణవాలయ మంటపము ముందు దాదాపు 40 అడుగుల ఎత్తున్న స్తంభముపై

గల చిన్న మంటపములో (Miniature mantapa) రెండు వైపుల తలలు చెక్కబడిన చిన్న గరుడ విగ్రహముంది. మానవాకృతిలో నున్న గరుడ విగ్రహమునకు రెక్కలు, పక్షిముక్కు అందమును చేకూర్చుచున్నవి. అంజలిముద్రలో నున్న గరుడశిల్పతలలు ఒకటి ఉత్తరము వైపు రెండవది దక్షిణము వైపు చూచుచున్నాయి. ఆగమశాస్త్రములలో తెలుపబడినట్లుగా గరుడుని ఒకే శిల్పమందున్న రెండు తలలు అభిముఖ దిశలను చూచుచున్నాయి. (Double sided garuda facing opposite directions)

## రెండవ గరుడ స్తంభము

మొదటి దాని వలెనే అంతే ఎత్తుతో వేరొక గరుడస్తంభము కొంతదూరంలో నిలిచి ఉంది. కాని గరుడుని రెండు తలలు తూర్పు పడమటి దిశలను చూచుచున్నాయి.



గుట్ట ప్రక్క శివాలయము



దాని శిఖరము

## 5. గుట్ట ప్రక్కనున్న దేవాలయము

నగునూరులో నున్న గుట్ట ప్రక్కన ఒక దిబ్బపై తూర్పుముఖమును కలిగిన దేవాలయముంది. గర్భగృహము, అంతరాళము, ముఖమంటపము దీని ప్రధానాంగములు. ఈ శివాలయపు గోడలు చదును చేయబడిన పెద్దపెద్ద పొడుగాటి శిలల (Large blocks of stone) తో కట్టబడినాయి. గర్భగృహపు గోడల బయటభాగము అన్ని వైపుల వివిధ పరిమాణములలో గల కంపముల (Fillets) చే చుట్టబడి ఉంది. గర్భగృహమునకు దక్షిణమున ఒక చిన్నగుడి (Minor shrine) ఉంది. మంటప ఈశాన్యభాగము కూలిపోయింది. మంటపములోని స్తంభములు, గర్భగృహ మరియు అంతరాళద్వారములు ప్రధాన త్రికూటాలయములోని వాటిని పోలిఉన్నాయి. కాదంబుల దేవాలయ శిఖరములను బోలిన శిఖరములుండుట ఈ దేవాలయ ప్రత్యేకత. పిరమిడ్ ఆకారములో నున్న ఈ దేవాలయ శిఖరపు వరుసలు పైకి పోను పోను పరిమాణములో తగ్గుచూ చదునైన ఉపరితలము గల చతురస్రాకారపు ఫలకముతో కప్పబడినాయి. వరుసల మధ్య

లోతుస్థలము అమర్చబడింది. (The spire consists of diminishing tiers with recesses to form the pyramidal shape) శిఖరములోని ప్రతి వరుస అర్ధచంద్రాకారపు శిలలతో అలంకరింపబడింది. శిఖరము ముందు చిన్న శుకనాసముంది. ఈ దేవాలయ శిఖరము బెజ్జంకి నరసింహాలయ శిఖరమును మరియు పాలంపేటలోని ప్రధానాలయమునకు ఒకటిన్నర ఫర్లాంగుల దూరంలో నున్న చిన్న ఆలయముపై నున్న శిఖరమును బోలి ఉంది.

## 6. రామలింగాలగుడి

నగునూరుకు దక్షిణమున కొద్ది దూరంలో ప్రవహించు వాగు ఒడ్డున నున్న శిథిలమైన శివాలయమే రామలింగాల గుడి. కాకతి రుద్రదేవుని కాలపు ఇచటి అముద్రిత శాసనములో మాలాకారులకు భూదానము లొసంగినట్లు తెలుపబడింది. ఇచటి పెద్ద గణపతి విగ్రహము ప్రస్తుతము కరీంనగర్ మ్యూజియంగేటు కెదురుగా ముందు ఆవరణలో నిలుపబడింది.

### గణపతి

మకుటము లేని ఏనుగుతలను కలిగిన ద్విహస్తముల గణపతి నగునూరు నుండి కరీంనగర్ మ్యూజియంనకు తరలింపబడింది. మ్యూజియం గేటులోనికి ప్రవేశించగానే ముందుగా ఈ గణపతి శిల్పమే కనబడుతుంది. కూర్చొని ఉన్న ఈ గణపతి విగ్రహము 4' ఎత్తు ఉంది. వామహస్తములో దంతముండగా దక్షిణ హస్తములో నున్న మోదకములపై తొండపుకొన ఆని ఉంది. గణపతి ఫాలభాగము హారములతో అలంకరింపబడింది. చాళుక్యుల కళారీతిలో ఉన్న యజ్ఞోపవీతము, మోచేతి ముంజేతి, కాలికడియములు ధరించి ఉన్నాడు. సహజమైన ఏనుగు తలతో మకుటములేకుండా ద్విహస్తములతో నున్న ఈ గణపతి పూర్ణప్రతిమ చాళుక్యుల తొలి కాలపు గణపతిరూపములను పోలి ఉంది. ఇదే రూపములో, ఇంతే పరిమాణములో నున్న గణపతి విగ్రహము నల్గొండ జిల్లాలోని కొలనుపాక మ్యూజియంలో చూడవచ్చు [124].

## 7. గ్రామము మధ్యలో నున్న దేవాలయము

గర్భగృహము, అంతరాళము, ముఖమంటపములతో తూర్పు ముఖమును కలిగియున్న ఈ శివాలయము శిథిలావస్థలో ఉంది. ఎత్తు తక్కువ నున్న ద్వారము గుండా ఎత్తు తక్కువ ఉన్న మంటపమును ప్రవేశింపవచ్చు. ద్వారపు లలాటమున గజలక్ష్మి, శాఖల క్రింది భాగమున శైవ ద్వారపాలకులకు ఇరువైపుల చామరధారిణులున్నారు. ఎత్తులేని ద్వారము, ఎత్తులేని మంటపము, మోటుగా నున్న స్తంభములు చూపరుల దృష్టికి ఇది కాకతీయుల కంటే పూర్వకాలమునకు చెందిన పదవ, పదకొండవ శతాబ్దపు దేవాలయమని విదితమవుతుంది. ఇచటి మహిషాసురమర్దని విగ్రహము వేరొకచోటికి తరలింపబడిందని స్థానికుల కథనము.

## 8. P.W.D. రహదారి ప్రక్క దేవాలయము

కరీంనగర్ నుండి లక్షెటిపేటకు పోవు ప్రభుత్వ రహదారికి కుడి ప్రక్కన శిథిలావస్థలో నున్న త్రికూటాలయము దక్షిణ ముఖమును కలిగి ఉంది. ఇది నగునూరు గ్రామమునకు 1 కి.మీ. దూరములో ఉంది. ఈ త్రికూటాలయ ఉపపీఠము యొక్క వర్గము (Mouldings) లేదా మలుపులు భూమిలో మునిగిపోయి నేడు కానరావు. ప్రస్తుతము ఉపపీఠమునకగబడు పట్టిక అనేక విభాగములుగా విభజింపబడి వాటిలో చతుర్దళపద్మ శిల్పములు నింపబడినాయి. అధిష్ఠానముపై హంసలు, వృషభములు, గజములు పద్మములు చెక్కబడినాయి. గోడలు గ్రామములోని ప్రధాన త్రికూటాలయపు గోడలకు కొంత భిన్నమైన రీతిలో ఉన్నాయి. గర్భగృహములు శిథిలమై ఉంటాయి.



త్రికూటాలయము



నిర్మాణ వివరములు

## 9. బస్‌స్టాప్ దగ్గర నున్న చిన్న దేవాలయము

పై నున్న త్రికూటాలయమునకు ఉత్తరమున గర్భగృహము, దానిముందు ప్రవేశమంటపము (Porch) గల ఈ చిన్నదేవాలయము తూర్పు ముఖమును కలిగి ఉంది. ఈ దేవాలయ అధిష్ఠాన వర్గము (Mouldings) మలుపులతో శోభాయమానంగా ఉంది. గోడలు పెద్ద చిన్న కుడ్యస్తంభములతో (with broad and narrow pilasters) అలంకరింపబడినాయి. శిథిలావస్థలో నున్న ఈ దేవాలయపు వివరములు వర్ణింపబడుటకు అవకాశము లేదు.



బస్‌స్టాప్ దగ్గర గుడి



గణపతి

నగునూరు గ్రామములో మరియు దాని చుట్టూ పరిసరములందు అనేక చోట్ల నున్న శిథిలమైన దేవాలయములను బట్టి తొలి మధ్యయుగము (Early Medieval period) లో ఇది గొప్పరాజధాని నగరముగా విరాజిల్లెనని ద్యోతకమవుతుంది. నాలుగు నూర్ల (Four hundred) గుడులుండుట వలన ఇది నగునూరుగా పిలువబడుచున్నది యనువాదన సత్యదూరము. ఎందుకనగా ఇచటి శాసనములలో ఈ గ్రామనామము నగరూరు (Nagaruru) అని స్పష్టంగా పేర్కొనబడింది. ఆనాటి నగరూరు కాలక్రమేణ నగునూరుగా మారింది.

**విడిప్రతిమా శిల్పములు (Loose sculptures)**

నగునూరు గ్రామము మధ్యలో నున్న ఒక గదిలోనికి ఇచటి విగ్రహములన్నియు చేర్చబడినాయి. ఈ గదికి ఇనుప సలాకలతో గూడిన కట్టె ద్వారముంది. ప్రస్తుతము ఈ గది గూడా పూజాస్థలముగా రూపొందింది.

**1. విష్ణువు** :- చతుర్బాహువులతో నున్న విష్ణువు సమభంగములో నిలబడిఉన్నాడు. అతని పైదక్షిణ హస్తములో శంఖము వామహస్తములో చక్రము ఉండగా క్రింది రెండు చేతులు విరిగిఉన్నాయి. అతని వెనుక మకరతోరణము, క్రింది భాగమున ఇరువైపుల చామరధారిణులున్నారు. అతని కుడివైపున అంజలి ముద్రలో నున్న గరుడ శిల్పము అందంగా ఉంది.

**2. ఉమామహేశ్వర విగ్రహము**

కూర్చొనియున్న శివుని క్రింది భాగమున నంది ఉంది. మలచి ఉన్న ఎడమకాలిపై ఉమ కూర్చొనిఉంది. కుడికాలు చాచుకొని క్రిందికి మోపబడింది. చతుర్భుజముల శివుని పైకుడిచేతిలో త్రిశూలము, ఎడమచేతిలో దమరుకము, అతని క్రింది దక్షిణ హస్తము అభయముద్రలో నుండగా వామహస్తము దేవి నడుముచుట్టూ చాచి ఉంది. అలాగే పార్వతి దక్షిణ హస్తము శివుని నడుము చుట్టూ చాచి యుండగా వామహస్తములో కలశము లేదా ఫలముంది. శివుడు జటామకుటము, హారములు, యజ్ఞోపవీతము తదితర ఆభరణములు ధరించాడు. శివుని కుడివైపున గణపతి దర్శనమిస్తాడు. ఇలాంటి ఆలింగనమూర్తి విగ్రహమొకటి ధర్మపురి శివాలయములో చూడవచ్చు.

**3. నాగిని** :- ఊర్ధ్వభాగము మానవాకృతిలోను అధోభాగము సర్పరూపములో నుండి కుడిచేతిలో ఖడ్గము, ఎడమచేతిలో డాలు ధరించి ఉంది. ఆమె తలపై మూడు పడగల గొడుగు అలంకరింపబడింది.

**4. దేవి**

చతుర్భుజముల దేవి పైహస్తములందు త్రిశూలము, దమరుకము, క్రింది హస్తములందు ఖడ్గము, గిన్నె (Bowl) ఉన్నాయి.

**5. గణపతి** :- కుడిచేతిలో దంతము, ఎడమచేతిలో గల మోదకముల పై తొండము మోపిన ఈ గణపతి విగ్రహము చిన్నగా ఉంది.

**6. మహిషాసురమర్దని**

ఎనిమిది భుజములతో నున్న ఈ దేవి కుడికాలు నేలపై నుండగా ఎడమకాలును మహిషుని మెడపై నిలిపింది. మహిషుని కంఠభాగము నుండి అసురరూపము ఆవిర్భవించుచున్నది. ఆమె క్రింది కుడిచేతిలో నున్న శూలమును అసురుని దేహములోనికి గ్రుచ్చుచున్నది. ఆమె ఎడమవైపున్న రెండు చేతులలో ఖేటకము, విల్లు ఉన్నాయి. ఆమె క్రింది చేతితో అసురుని మెడను వంచుచున్నది. అసురుని హస్తములందు డాలు, ఖడ్గము ఉన్నాయి. అర్ధోరుకము ధరించిన దేవి మకుటము, హారములు, కేయూరములు, వలయములు మున్నగు ఆభరణములతో అలంకరింపబడింది.

**7. భైరవుడు**

గ్రామములో గుట్ట ప్రక్కనున్న శివాలయము ముందట గల ఒక పెద్ద గుండ్రాయి (A big boulder) పై చెక్కబడిన చతుర్భుజముల భైరవుడు నిలబడిఉన్నాడు. ఇది చాలా అతిగియుండుట వలన పైఎడమచేతిలో త్రిశూలము క్రింది ఎడమ చేతిలో కపాలము మాత్రము కనిపించుచున్నాయి. అతనికి ఎడమవైపున నున్న శునకము పైకి ఎగురుచున్నది. ఇలాంటి రూపమే ఇంకొకటి ఇదే గుండ్రాయిపై వెనుక వైపున ఉంది.

**8. మహిషాసురమర్దని** :- గ్రామమునకు మరియు బస్‌స్టాండ్‌కు మధ్యగల ఒక గుండ్రాయిపై చెక్కబడిన చతుర్భుజముల దేవి ఎడమకాలును నేలపై నిలిపి కుడికాలును మహిషరూపముననున్న అసురునిపై మోపింది.

**9. సూర్యుడు** :- ఇదే గుండ్రాయిపై సమభంగములో నిలబడియున్న సూర్యుడు పైకెత్తిన రెండు చేతులలో పద్మములు పట్టుకొని ఉన్నాడు.

**10. గణపతి** :- ఇదే గుండ్రాయిపై మకుటము లేని ఏనుగుతల గల ద్విహస్తముల గణపతి దివ్యంగా మలచబడినాడు. అతని తొండము కుడి వైపునకు తిరిగి ఉంది.

**11. నాగిని** :- బాగా అతిగిపోయిన ఈ ప్రతిమ ఏడు పడగల ఛత్రముతో సగము సర్పరూపములో, సగము స్త్రీ రూపములో ఉంది. ప్రస్తుతమిది కరీంనగరము మ్యూజియంలో నిలుపబడిఉంది. ఇలాంటి నాగిని రూపములు అలంపురము, కొలనుపాక, బోధన్ మున్నగు ప్రదేశాల్లో చూడవచ్చు.

**12. మహిషాసురమర్దని** :- ప్రస్తుతమీ విగ్రహము కరీంనగరము మ్యూజియంలో ఉంది. ఆమె కుడికాలును మహిష రూపములో నున్న అసురుని తలపై మోపి ఆమె ఎడమచేతితో తోకను ముడుచుచున్నది. ఆమె చతుర్భుజములు ఛేదింపబడినాయి. దేవి తల విరిగిపోయింది.

# 22. కొత్తపెల్లి

కరీంనగర్‌కు ఉత్తరమున 5 కి.మీ. దూరంలో జగిత్యాలకు పోవు ప్రభుత్వ రహదారిపై నున్న గ్రామమే కొత్తపెల్లి. కాకతీయుల కాలపు త్రికూటాలయము గ్రామము నందు శిథిలావస్థలో ఉంది. ఈ దేవాలయము ఇచటికి సమీపమున నున్న నగునూరులోని ప్రధాన త్రికూటాలయమును జోలి ఉంది. కొత్తపెల్లి చెఱువునకు కొంత దూరములో నున్న ఈ త్రికూటాలయము దక్షిణ ముఖమును కలిగి ఉంది. ఈ దేవాలయపు చతురస్రాకార మంటపమునకు తూర్పు, పడమర, ఉత్తర దిశల యందు గర్భగృహములుండగా దక్షిణమున ప్రవేశమంటపముంది.



త్రికూటాలయము

ఈ త్రికూటాలయము నక్షత్రాకారపు ఉపపీఠముపై నిలిచి ఉంది. ఈ ఉపపీఠపు వర్గము (Mouldings) చూడముచ్చటగా ఉంది. వివిధ పరిమాణములలో నున్న పట్టికలు (pattikas of various sizes and padma are arranged alternate with recesses) మరియు పద్మము లోతు ఉబ్బులతో మరల మరల అమర్చిన విధానము ఆకర్షణీయంగా ఉంది. ఈ ఉపపీఠము అనేక చోట్ల శిథిలమై ఉంది. ఈ ఉపపీఠము చుట్టూ ఉన్న పట్టిక (Band) చతుర్దళ పద్మశిల్పములతో అలంకరింపబడింది. ఇలాంటి అలంకారము నగునూరు గ్రామము బయట ప్రభుత్వ రహదారి ప్రక్కనున్న శిథిల త్రికూటాలయపు ఉపపీఠము నందు చూడవచ్చు. కొత్తపెల్లి ఉపపీఠము 6'-6" ఎత్తుండి దాని ఉపరితలమున 10'-6"వెడల్పుతో దేవాలయము చుట్టూ తిరుగుటకు ఉపయోగపడు ప్రదక్షిణాపథముంది. ఈ ఉపపీఠముపై నున్న ఎత్తైన అధిష్ఠానము గూడా అనేక మలుపులతో (Mouldings) శోభాయమానంగా ఉంది. అధిష్ఠానము పైనున్న గోడలు పెద్ద చిన్న కుడ్యస్తంభములతో (with Broad and narrow pilasters) లోతు ఉబ్బులతో (with projections and recesses) శోభిల్లుచున్నాయి. శిఖరాన్ని మోస్తున్న సన్నని కుడ్యస్తంభములు వంపులలో నింపబడినాయి. (The shallow recesses are filled with narrow pilasters surmounted by turrets). మూడు గర్భగృహములపై నున్న శిఖరములు పడిపోయినాయి. పై కప్పుపై గల

ఇటుక కుప్పలపైన గడ్డి పెరిగింది. ఈ ఇటుక ముక్కలు పడిపోయిన శిఖరములవై ఉంటాయి. దక్షిణముననున్న సోపానముల ద్వారా ముఖ మంటపమును ప్రవేశింపవచ్చు. ఈ మంటపము మధ్యనున్న నాలుగుస్తంభముల నడమ గల స్థలము కొంత ఎత్తుగా ఉంది. మంటపము చుట్టుగల పిట్టగోడ (Parapet wall) పై పాలంపేటలో వలె చిన్నగుడులు (Miniature shrines) న్నాయి. ప్రవేశపు సోపానముల కిరువైపుల దేవాలయము ముందు ఇలాంటి చిన్నగుడులు నిలుపు సంప్రదాయము హోయసల దేవాలయము లందు చూడవచ్చు. మైసూరుకు సమీపమున గల సోమనాథపురంలోని సుప్రసిద్ధ చెన్న కేశవాలయము ముందు, మెట్లకు ఇరువైపుల ఇలాంటి చిన్న గుడులను చూడవచ్చు.



గోడల వివరములు



త్రికూటాలయ ద్వారము

కొత్తపెల్లి దేవాలయ ముఖమంటపములోని తొమ్మిది విభాగము లందు గల లోకప్పు లుపవితాన రీతిలో ఉంది. ఈ లోకప్పు నందు త్రికోణాకారపు పట్టముల అమరిక వాటిపైన చదర పట్టములు నిలుపు పద్ధతి రమ్యంగా ఉంది. గర్భగృహముల మరియు అంతరాళముల ద్వారము లందు కాకతీయ శిల్పుల కళాకౌశలము చూడవచ్చు. ఈ ద్వారముల పతంగములపై నున్న తోరణములు (Architraves lying over the lintels of the doorways) నర్తకీమణులతో, అంతస్తుల శిఖరములతో (turrets) అలంకరింపబడినాయి. మూడు అంతరాళముల ద్వారములకు ఇరువైపుల నిలుపబడిన జాలి కిటికీలు (Perforated sereen windows) మరింత శోభను చేకూర్చినాయి. కొత్తపెల్లిలో ఎలాంటి శాసనము లభ్యము కాలేదు.

## 23. సుందిల్ల

గోదావరి తీరమున నున్న సుందిల్ల కుగ్రామమును గోదావరిఖని నుండి చేరవచ్చు. ఇచటనున్న నరసింహదేవాలయమునకు సమీపమున గల పొలములలో కాకతి మహాదేవచక్రవర్తి కాలపు శిలాస్తంభ శాసనముంది. శక సంవత్సరము పింగళ చైత్ర శుద్ధ అష్టమి శుక్రవారము సరియగు తేది క్రీ.శ. 1197 మార్చి 28 రోజున వేయబడిన దానశాసనమిది. మూడు ప్రక్కలందు

చెక్కబడిన ఈ శాసనము చాలా అఱిగిపోయింది. దాదాపు అన్ని పంక్తులలోను తొలి అక్షరములు అఱిగిపోవుట వలన విషయము స్పష్టముగా తెలియుట లేదు. ఇందులో మదపల్లి గ్రామప్రసక్తి ఉంది.

## నరసింహ దేవాలయము

ఇది పురాతన నరసింహ దేవాలయము. ఈ ఆలయములోని ద్వారములు ఎత్తు తక్కువగా ఉన్నాయి. పతంగములపై ముందుకు పొడుచుకొని వచ్చిన చూరు (Projecting cornice over the lintel of the door way) అందంగా ఉంది. ఈ దేవాలయ మంటపము కాకతీయుల కాలానికి చెందింది. నరసింహ దేవాలయము ఈ మంటపమునకు పడమటి దిశలో ఉంది. తొలిదశలో నిర్మింపబడిన ఆలయమునకు ఈ మంటపము తరువాత కాలంలో కలుపబడింది. మంటపమునకు ఉత్తరమున రెండు గర్భగృహములు, వాటి ముందు అంతరాళములు ఉన్నాయి. ఈ గుడుల ద్వారములు మంటప స్తంభములు, మంటప లోకప్పు మున్నగునవి కాకతీయుల కాలపు కళారీతులలో ఉన్నాయి. మంటపము యొక్క మధ్యభాగమున నున్న లోకప్పు అర్ధగోళాకారపు పెద్ద గిన్నెను బోర్లించిన రీతిలో (dome shaped lotus) నుండి ఒకదానిపై నొకటి చెక్కిన వలయములతో (upward circular rings) బహుదళ పద్మాకారములో శోభిల్లుచున్నది. ఇలాంటి లోకప్పు అమరిక చంద్రవెల్లి, మంథని దేవాలయములందును చూడవచ్చు.

## శివాలయము



నరసింహ దేవాలయమునకు కొంతదూరంలో ఒక చిన్న శివాలయముంది. ఇది శిథిలావస్థలో ఉంది. దేవాలయ గర్భగృహము, అంతరాళము నిలచి ఉన్నాయి. వీటి ద్వారములు త్రిశాఖలతో నుండి వాటి క్రింద పూర్ణ కుంభములు అందంగా చెక్కబడినాయి. ద్వారముల పతంగములపై బయటకు విస్తరించి యున్న చూరు (Projecting cornice) ద్వారముల శోభను ఇనుమడింపజేస్తుంది.

కమాన్‌పూర్ మండలములో నున్న ఈ గ్రామము గోదావరిఖనికి 5 కి.మీ. దూరంలో ఉంది. ఆనాటి చుండి గ్రామమే క్రమముగా చుండిల్, సుందిల్లగా మారిందని స్థానికుల కథనము. కాని చారిత్రకాధారము లేదు. ఇచట నున్న కాకతీయుల కాలపు శాసనములో ఈ గ్రామనామము కనిపించదు.

# 24. గోదావరిఖని

గోదావరి నది ఒడ్డున నూతనంగా రూపొందిన పట్టణమే గోదావరిఖని. ఈ ప్రాంతము బొగ్గు గనులకు ప్రసిద్ధము. ఇచట ఒక ఎరువుల కార్మాగారముంది. 20వ శతాబ్దపు ద్వితీయార్థములో పది, పన్నెండు కుగ్రామముల స్థానములో వెలసిన పారిశ్రామిక పట్టణమే గోదావరిఖని. జనగామ, అల్లూరు, అందుగులపల్లి, మల్కాపూర్, సుందిల్ల, జల్లారం, చందనాపూర్, వీర్లపల్లె, వెంకటరావుపల్లె, వకీలుపల్లె మున్నగు గ్రామములు కలిసి బొగ్గుగనుల కార్మికులతో క్రొత్తగా రూపు సంతరించుకొనినదీ గోదావరిఖని పట్టణము[125]. ఇది చరిత్ర పూర్వయుగపు (Pre-historic site) స్థావరము కావడం విశేషం. తొలి మరియు మధ్య పాతరాతి యుగపు (Early and Middle palaeolithic age) పనిముట్లను పురావస్తు పరిశోధకుడైన మున్ (Munn) కనుగొన్నాడు. వీటిలో బిచ్చురాళ్ళు, గీకుడురాళ్ళు (Flake scrapers) చేతిగొడ్డళ్ళు (hand axes) మున్నగురాతి పనిముట్లు (artefacts) అల్లూరు, జనగామలలో బయల్పడినాయి[126]. వీటిని బట్టి వేల సంవత్సరముల నుండి ఈ ప్రాంతము జన సంచారము గల ప్రదేశముగా నుండెనని ద్యోతకమవుతుంది. అంతే గాకుండా గోదావరి నదికిరువైపుల తొలినాగరికతలు వెలసినవను విషయము నిర్వివాదాంశము.



జనగాం త్రికూటాలయభాగము



జనగాం త్రికూటాలయభాగము

మధ్యయుగములో పన్నెండవ శతాబ్దపు ప్రథమార్ధ భాగములో రామగుండం నుండి ఏడరాజు మహామండలేశ్వరునిగా ఈ ప్రాంతమును పాలించాడు. కాకతీయ రెండవ ప్రోలరాజుతో జరిగిన యుద్ధములో ఏడరాజు ఓడి పారిపోయెనని హనుమకొండలోని వేయిస్తంభాల గుడి శాసనం తెలుపుతుంది. పొలవాస రెండవ మేడరాజు, నగునూరు దొమ్మరాజు, రామగుండం ఏడరాజు, మంథని గుండరాజు సమకాలీనులై గోదావరి దక్షిణ ప్రాంతము నేలిరి. క్రీ.శ. 1138-1140 మధ్యకాలములో మంథని, రామగుండం ప్రాంతములు కాకతీయ రాజ్య అంతర్భాగమైనాయి. కళ్యాణి చాళుక్యుల, పొలవాస ప్రభువుల, కాకతీయుల కాలములో పదకొండు, పన్నెండవ శతాబ్దములలో వెలసిన దేవాలయములు ఈ ప్రాంతమందు చూడవచ్చు.

## జనగామ త్రికూటాలయము

గోదావరిఖని పట్టణములోని జనగామ ప్రాంతమందున్న అద్భుతమైన త్రికూటాలయము ఉత్తర ముఖమును కలిగి ఉంది. మూడు గర్భగృహములలో గూడా పరమశివుడు లింగరూపమున ప్రతిష్ఠింపబడుటచే దీనిని స్థానికులు త్రిలింగేశ్వరాలయముగా పిలుచుచున్నారు. సాధారణముగా రంగ మంటపము (ముఖమంటపము) మధ్యలో నాలుగు (Four central pillars) స్తంభములుంటాయి. కాని దానికి భిన్నంగా ఇచటి సువిశాల ముఖమంటపం యొక్క ప్రతి మూల యందు నాలుగు స్తంభముల చొప్పున (A cluster of four pillars) నాలుగు మూలలందు మొత్తము పదహారు స్తంభములుండుట విశేషము. అనగా నాలుగు మధ్య స్తంభములకు బదులుగా పదహారు మధ్యస్తంభములున్నాయి. వీటికి అనుబంధంగా ప్రతి దిశలో నాలుగేసి అనుబంధ స్తంభములు (Four corresponding pillars on each side) మంటపము యొక్క చివరలయందున్నాయి. ఈ స్తంభములన్నియు అందముగా చెక్కబడి శీర్షమున సింహపు బోదెలతో (Lion brackets) అలంకరింపబడినాయి.



బోదెను మోయు కన్య



శిథిలమైన వేరొక త్రికూటాలయము

ఈ త్రికూటాలయమునకు పడమట వేరొక శిథిలమైన దేవాలయము గర్భగృహము, ముఖమంటపములతో నిలిచి ఉంది.

పైన పేర్కొనిన త్రిలింగేశ్వరాలయమునకు కొంత దూరములో ప్రభుత్వ రహదారికి ఆవలివైపున వేరొక శిథిలమైన త్రికూటాలయముంది. ఈ త్రికూటాలయపు మంటప స్తంభములు కొన్ని కూలిపోయినాయి. మరికొన్ని వంగిపోయి ఏ క్షణమునైనను పడిపోవుటకు సిద్ధముగా ఉన్నాయి.

ఒకే ప్రాంతములో రెండు త్రికూటాలయములుండుట వలన చాళుక్యుల, కాకతీయుల కాలములో ఇది అత్యంత ప్రాధాన్యతను సంతరించుకొనిన ప్రదేశమని తెలుస్తుంది.

జనగామ దేవాలయముల పరిసరములలో అమూల్యమైన విగ్రహములుపడిఉన్నాయి. వీటిలో 5' అడుగుల ఎత్తుగల శైవ ద్వారపాలకుని విగ్రహము, మరియు దేవి ప్రతిమ ప్రధానమైనవి. దేవి పైరెండు హస్తములలో డమరుకము, త్రిశూలములుండగా క్రింది రెండు హస్తములలో ఖడ్గము, గిన్నె (Bowl) ఉన్నాయి. ఇది చాలా అఱిగిపోయిన (Much worn out) విగ్రహము. ఈ దేవి విగ్రహము కరీంనగరము మ్యూజియంలో గల చొప్పదండి దేవి విగ్రహమును పోలిఉంది.

## 25. మంథని

పురాణాలు, శాసనాల్లో పేర్కొనబడిన మంత్రకూటము క్రమముగా మంథెన్య, మంథెన, మంథనిగా మారింది. అనాది నుండి గొప్ప సంస్కృతి, చరిత్రకు నిలయమైన మంథని నేడొక రెవెన్యూ డివిజన్ కేంద్రము. కరీంనగరమునకు ఈశాన్యమునందు 72 కి.మీ. దూరములో పవిత్ర గోదావరి తటమున గల మంథని మధ్యయుగములో రాజధాని నగరముగా విరాజిల్లింది. మంథని గ్రామమంతటను గల అనేక శిథిల దేవాలయములు, శిల్పములు ఈ ప్రాంతపు గత వైభవప్రాభవములను వేనోళ్ల చాటుతున్నాయి. మంథని గ్రామము ప్రక్క నుండే ప్రవహించు బొక్కలవాగు ఇచట గోదావరినదిలో కలుస్తుంది.

మంత్రకూటము గౌతమమహర్షి ఆశ్రమమునకు నిలయమై యుండెనని స్కాందపురాణము తెలుపుతుంది[127]. అనేక మంది మునులు, సన్యాసులు గౌతమాశ్రమమునకేగి, అతని ఆశీర్వాదములు గైకొని వేద మంత్రములు నేర్చుకొనెడివారట. వేదమంత్రములు నేర్చుకొనుచోటు యగుటచే ఇది మంత్రకూటముగా పేరొందింది.

పన్నెండవ శతాబ్దపు ప్రథమార్థ భాగములో మంత్రకూటము రాజధానిగా గుండరాజు పాలించాడు. ఇతడు పొలవాస (Polas) రాజధానిగా పాలించిన రెండవ మేడరాజు సోదరుడు. రామగుండం నుండి పాలించిన ఏడరాజు వీరికి సమకాలీనుడు. మంథనికి సమీపమున గల గంగాపురంలోని శిలాశాసనము నందు గుండరాజు కళ్యాణి చాళుక్యచక్రవర్తి భూలోకమల్ల దేవుని సామంతునిగా పేర్కొనబడినాడు. చాళుక్య రాజ్యమూలస్తంభం, శ్రీమద్భూలోకమల్లదేవ పాద పంకజ భ్రమరంగా ఈ శాసనమందు పేర్కొనబడిన గుండరాజు సూరేశ్వర దేవరకు పంచమఠస్థానములను తదితర దానముల నిచ్చాడు[128]. ఈ శాసనము గంగాపురం ఆంజనేయ గుడి అవరణలో ఉంది. పాలంపేట రేచెర్ల రుద్రుని శాసనములో మరియు హనుమకొండలోని వేయిస్తంభాల గుడి శాసనములో మంథెన్య గుండరాజు ప్రసక్తి ఉంది.

క్రీ.శ. 1122లోని గోవిందాపురం శాసనము[129.] మరియు తేదీలేని వెంకటాపురం శాసనము[130]. వరంగల్ జిల్లాలోని నర్సంపేట, ములుగు ప్రాంతములపై గుండరాజు అధికారము ఉండెనని తెలుపుచున్నాయి. పాలంపేటలోని రామప్ప గుడియందు గల రేచర్ల రుద్రుని క్రీ.శ.1213 శాసనములో అతని వంశపు వివరములను తెలుపుచు అతని పితామహుడు కాముడు (Kama)

కాకతి రెండవప్రోలుని సేనానిగా యుద్ధమునందు మంథెన్య గుండరాజు నోడించెనని తెలుపబడింది[131]. పాలంపేట శాసనములో గ్రామనామము మంథెన్య అని పేర్కొనబడింది. కాకతి రుద్రదేవుడు వేయించిన క్రీ.శ.1163 వేయిస్తంభాల గుడి శాసనంలో కాకతి రెండవప్రోలరాజు మంత్రకూటపు గుండరాజు నోడించి, శిరో ముండనము గావించి వక్షస్థలముపై వరాహముద్ర వేయించి శిరచ్ఛేదముగావించెనని తెలుపబడింది[132]. ఈ శాసనములో గ్రామనామము మంత్రకూటముగా పేర్కొనబడింది. ఓడిపోయి చేజిక్కిన గుండరాజును అసభ్యకరమైన రీతిలో అవమాన పరచి శిరచ్ఛేదముగావించుట గర్హనీయము. ఇది రెండవప్రోలరాజు కక్ష సాధింపు చర్య కావచ్చును లేదా సమకాలీన శత్రురాజులను భయభ్రాంతులను జేయుటకు కావచ్చును. ఏది ఎట్లున్నను ఈ చర్య రెండవ ప్రోలరాజు అహంభావమునకు ప్రతీక. క్రీ.పూ. 326లో జీలంనది ఒడ్డున ఓడిపోయి చేజిక్కిన వీరాగ్రేసరుడైన పురుషోత్తముని గ్రీకు చక్రవర్తి అలెగ్జాండర్ గౌరవించి తోటిరాజుగా సంభావించిన ఉదంతము కాకతి రెండవ ప్రోలరాజు దృష్టికి వచ్చియుండదు కాబోలు. క్రీ.శ.1138-1140 మధ్యకాలములో జరిగిన యుద్ధము ఫలితముగా గుండరాజు పాలించిన మంత్రకూట రాజ్యమంతయు కాకతీయ రెండవ ప్రోలరాజు రాజ్యములో కలుపబడింది. కాకతి రుద్రదేవుని మంత్రి మరియు నగునూరు పాలకుడైన వెల్లకి గంగాధరుడు మంత్రకూటము నందు త్రినేత్రునికి దేవాలయము కట్టించెనని క్రీ.శ.1171లో అతడు వేయించిన నగునూరు శాసనము తెలుపుతుంది[133]. ప్రస్తుతము ఈ శిలాస్తంభ శాసనము కరీంనగరము నందు జిల్లా కలెక్టర్ నివాస గృహపు ముందు ఆవరణలో (Front court-yard) నిలుపబడి ఉంది.

కాకతీయ గణపతి దేవ చక్రవర్తి పాలనాకాలపు మొదటి సంవత్సరములో అనగా శక సంవత్సరము 1121 సిద్ధార్థి మకర సంక్రాంతి సరియగు తేది క్రీ.శ. 1199 డిసెంబర్ 26 రోజున వేయబడిన శిలాస్తంభశాసనము దేవనాగరిలిపిలో స్థానిక తమ్మి చెఱువు ప్రక్కనున్న హనుమాన్ దేవాలయములో ఉంది[134]. గణపతి దేవచక్రవర్తి గురువైన మంచిభటోపాధ్యాయునికి చెన్నూరు దేశపాలకుడైన సామంతుడు అల్లుం ప్రోలరాజు భూదానములొసంగగా, అతడొక గ్రామమును స్థాపించి, చెఱువును త్రవ్వించి మంత్రకూటపు బ్రాహ్మణులకు నివాసస్థలములనిచ్చాడు. రాజగురువైన మంచిభటోపాధ్యాయుడు కేశవ దేవ, మహాదేవ ఆలయములను నిర్మించి మంత్రకూటపు గోపీజనవల్లభ దేవరకు ఒక తోటను దానంచేశాడు. ఈ శాసనములో గ్రామనామము మంత్రకూటము మరియు మంథెనయని రెండు రకములుగా పేర్కొనబడింది. మంచిభటోపాధ్యాయుడు మరియు మంచనార్యుడు రెండు పేర్లు ఒకే గురువునకు చెందినవని సుప్రసిద్ధ చరిత్రకారుడైన డి.సి. సర్కార్ అభిప్రాయము[135]. పన్నెండవ శతాబ్దపు చివరికాలము మరియు పదమూడవ శతాబ్దపు తొలికాలములో ఈ రాజ గురువు కాకతీయుల ప్రాపకములో ఉన్నాడు.

డి.సి. సర్కార్ బీహార్ రాష్ట్రములో నున్న గయ పుణ్యక్షేత్రము నందు గల శాసనములో "మంత్రకూట గోపీజనవల్లభాయ నమః" యను పదములు తిలకించి తదనంతరకాలములో మంథనిని సందర్శించినప్పుడు అవే పదములు మంథనిలోని 1199 శాసనములో గాంచి ఆశ్చర్యపోయాడు. కాకతీయ రాజుల గురువగు (Preceptor) మల్లికార్జున సూరి సతీ సమేతంగా కాశి, గయ పుణ్యక్షేత్రములు దర్శించి రాజు పక్షమున పూజలు చేసిన సందర్భములో అతని అర్ధాంగి గౌరి గయలో ఒక శాసనము వేయించింది. అందులోనే మంత్రకూట గోపీజనవల్లభ దేవర ప్రసక్తి ఉంది[136].

కాకతి గణపతి దేవ చక్రవర్తి మతగురువైన (Religious preceptor) విశ్వేశ్వర శివుడు లేదా విశ్వేశ్వర శంభూ మంత్రకూటము, కాళేశ్వరము, చంద్రవెల్లి (చందరెల్లి), ఖమ్మంపెల్లి మున్నగు ప్రదేశములందు దేవాలయములు కట్టించి మఠములను స్థాపించినట్లు తెలుస్తుంది[137]. ఈ విశ్వేశ్వర శివుడే కాళేశ్వరములో ఉపలమఠమును కట్టించి దానికి తాను స్థాపించిన పొన్న గ్రామమును దానము చేశాడు[138]. కాకతీయ పాలకుడైన గణపతి దేవుడు, రుద్రమదేవి ఇరువురికి విశ్వేశ్వరశివుడు దీక్షా గురువు. అతనికి మందడం మరియు వెలగుపుడి లేదా వెలంగపుండి (గుంటూరు జిల్లా) యను గ్రామములు దానముగా నొసంగబడినట్లు కాకతీయుల కాలపు శక సంవత్సరము 1183 సరియగు క్రీ.శ.1261 మలకాపురం శాసనము తెలుపుతుంది[139]. అతడు ఈ రెండు గ్రామములను కలిపి తన పేరట విశ్వేశ్వరగోళకిని స్థాపించి అచట దేవాలయము, మఠము, విద్యాలయము, సత్రము ప్రసూతి మరియు సాధారణ వైద్యశాలలను కూడా నిర్మించాడు. ఈ విశ్వేశ్వర శివుడే పవిత్ర గోదావరితటమున గల మంథని మరియు దాని పరిసరప్రాంతములందు అనేక శివాలయములు, మఠములు కట్టించి వాటి నిర్వహణకై దానములిచ్చాడు. కాకతి మహాదేవ చక్రవర్తి కూతురు కుందమాంబ వరంగల్ జిల్లాలోని నిడిగొండ (Nidigonda) యందు వేయించిన క్రీ.శ.1219 శాసనములో ఆమె మంత్రకూటములో ఉమా మహేశ్వర దేవాలయము, కాళేశ్వరములో అర్ధనారీశ్వర దేవాలయము నిర్మించినట్లు పేర్కొనబడింది[140].

కుతుబ్‌షాహీ వంశమునకు చెందిన అబ్దుల్లా కుతుబ్‌షా నవాబు తన కూతురును ఔరంగజేబు కుమారుడైన ముహ్మద్‌నకిచ్చి వివాహము చేసి వరకట్నము క్రింద క్రీ.శ. 1656లో రామగిరి దుర్గమును వదులుకొన్నాడు. 1656 నుండి 1724 వరకు రామగిరి, మంథని, కాళేశ్వర ప్రాంతములు మొగలుల ప్రత్యక్ష పాలన క్రింద ఉండేవి. నిజాం నవాబు పాలనకు వ్యతిరేకంగా ఉద్యమము జరిపి కరీంనగరము జిల్లాలో ప్రప్రథమంగా సత్యాగ్రహము చేసిన స్వాతంత్ర్య సమరయోధుడు రఘునాథరావు కాచే మంథని నివాసియగుట గర్వకారణము. మంథనిలోని గణపతిరావు మున్నగు వారు హైదరాబాద్ సంస్థాన విమోచనోద్యమములో నిర్వహించిన పాత్ర ప్రశంసనీయము.

మంత్రకూటమి వేదవిద్యా వైదుష్యాన్ని ప్రశంసించిన ఆది శంకరాచార్యులు (క్రీ.శ.788-820) మంత్రకూటనామ సార్థకతను గమనించి దీనిని ధర్మపీఠంగా గుర్తించారని స్థానికుల కథనము. వేద, తర్క, వ్యాకరణ, మీమాంస, జ్యోతిష్య, ఛందశ్శాస్త్రములలో నిష్ణాతులైన పండితులు, వేలసంఖ్యలో ఉండేవారు. ఇప్పటికీ వందల సంఖ్యలో నున్నారనుటలో అతిశయోక్తి లేదు. వైదిక ఘనాపాఠీలకు, ఆగమశాస్త్ర నిపుణులకు, బహుభాషా కోవిదులకు, ధర్మవర్తనులకు కేంద్రముగా నాటి నుండి నేటి వరకు మంత్రకూటము సుప్రసిద్ధము. గత శతాబ్దము వరకు గూడా ఇచట వేదనాదం అవిచ్ఛిన్నంగా ప్రతిధ్వనించింది. మంథని అంటే చల్లకుండ అనే అర్థమును ఇచటి పెద్దలు చెప్పుచుంటారు. వేదాలను చిలకరించే కుండ వంటిదే ఈ ప్రాంతమని, అందుకే మంథని అన్నది సార్థకనామమైందని ఇచటి వారి నమ్మకము. ఇచటి పండితులనేకులు మహారాష్ట్రము మున్నగు రాష్ట్రాలలో పాలకుల మన్ననలు పొందారు. వైదిక విద్యా వైదుష్యముతో రాజుల, పామరుల నుండి గౌరవము పొంది కీర్తి గడించారు. మంథనికి చెందిన వరహాల రాజన్న బరోడా మహారాజు పురస్కారములందుకొని జీవితకాలము పాటు పండిత భృతిని పొందినట్లు తెలుస్తుంది. పాత హైదరాబాద్ (Erst-while Hyderabad State) రాష్ట్రమునకు ముఖ్యమంత్రిగా నుండిన బూర్గుల రామకృష్ణారావు కాలములో మంథనికి చెందిన వరహాల భీమయ్య అత్యున్నత స్థానములో నుండి రాష్ట్ర పాలనావ్యవహారములలో ప్రముఖ పాత్ర వహించాడు. మంథనిలోని మోతిరాం అను వేద పండితుడు పీష్వాబాజీరావు ఆస్థానమును, ఘన్కోట కిష్టయ్యా నానా ఫడ్నవీస్ ఆస్థానమునలంకరించారు. పల్లి లింగన్న, తాంత్ర రాజన్న, గంగరామశాస్త్రి మున్నగువారు వేద పండితులుగాను, మహవాడి విశ్వనాథ మరియు రాజేశ్వరసిద్ధాంతులు, గంగరామశాస్త్రి, జక్కిరామ శాస్త్రి జ్యోతిశ్శాస్త్ర పండితులుగా వెలుగొందారు[141]. గట్టు కృష్ణశాస్త్రి, అవధానుల పుల్లన్న సోమయాజి, లోకె లింగన్న, గంగాలక్ష్మణరావు, ముద్దురాజంభట్టు, ముద్దురామకృష్ణయ్య మున్నగువారు వారి ప్రజ్ఞా ప్రాభవములతో మంథనికి వన్నెతెచ్చినారు.

చాళుక్యుల, కాకతీయుల కాలపు అనేక శిథిల దేవాలయములు, ప్రతిమాశిల్పములు పూర్వకాలపు ఇచటి ప్రాభవ వైభవాలను వేనోళ్ల చాటుతున్నాయి. శీలేశ్వర, సిద్ధేశ్వర, గౌతమేశ్వర ఆలయములు, కోదండరామాలయం, గోపీజనవల్లభ ఆలయం, భిక్షేశ్వరాలయం, వరదరాజస్వామి, ఓంకారేశ్వర, ఆంజనేయ మున్నగు దేవాలయములు 20 వరకు ఉన్నాయి. మంథనికి రక్షణ కవచంగా అష్టశివలింగాలు ప్రతిష్ఠింపబడినాయి. మంథనిలోని ప్రభుత్వ వసతి గృహం ఆవరణలో నున్న కళింగదేవి యజ్ఞోపవీతధారణతో ఉండటము విశేషము.

## శీలేశ్వర, సిద్ధేశ్వర దేవాలయములు

ఒక ఎత్తైన ప్రదేశములో ఒకే ఆవరణలో రెండు శివాలయములు, గర్భగృహము, అంతరాళము, ముఖమంటపములతో ఉన్నాయి. కాకతి రెండవ ప్రోలరాజు సేనానులు శీలప్ప, సిద్ధప్ప ఇరువురు మంత్రకూటపు ఏలిక గుండరాజు పై విజయము సాధించినందుకు సూచకముగా

తమ పేరట శీలేశ్వర, సిద్ధేశ్వర దేవాలయములను పన్నెండవ శతాబ్దపు ప్రథమార్థములో నిర్మించారని తెలుస్తుంది[142]. శిథిలమైన ఈ రెండు దేవాలయములను క్రీ.శ. 1942లో మంథని నివాసియైన లోకెరామన్న జీర్ణోద్ధరణ గావించగా నేడు అవి పూజలందుకొనుచున్నాయి. ఇవి గౌతమేశ్వరాలయము కంటే పూర్వపునిర్మాణములు. వీటి శిఖరములు మెట్లతో కూడిన పిరమిడ్ (Stepped pyramidal form) ఆకారములో నుండి పైన చదరపు ఫలకముచే కప్పబడినాయి. గర్భగృహములందు వర్గము (Mouldings) గల ఎత్తైన వేదికతో గూడిన పానవట్టము పై శివలింగములు నల్లసరపురాతి (Basalt stone) తో మలచబడి దివ్యంగా ఉన్నాయి. మంటపములలో నున్న పీఠములపై కాకతీయుల కళాకృతులలో మలచబడిన నంది విగ్రహములు చూడ ముచ్చటగా ఉన్నాయి. ఈ రెండు దేవాలయములు గ్రామము మధ్యలో నుండుట వలన నిత్యపూజలందుకొనుచున్నాయి. శీలప్ప శీల సముద్రమను తటాకమును గూడా నిర్మించాడు.



శీలేశ్వర దేవాలయము



సిద్దేశ్వర దేవాలయము

## గౌతమేశ్వరాలయము

పవిత్ర గోదావరి తటమున గల ఈ అందమైన త్రికూటాలయము దక్షిణ ముఖమును కలిగి ఉంది. సూక్ష్మమైన మరియు ప్రశస్తమైన చెక్కడములతో, అందమైన శిల్పములతో ఈ దేవాలయము కాకతీయుల శిల్పకళా ఔన్నత్యమును చాటుతుంది. ప్రతాపరుద్రచక్రవర్తి కాలములో పదమూడవ శతాబ్దపు చివరి భాగములో ఎర్ర ఇసుకరాయితో నిర్మింపబడిన ఈ త్రికూటాలయ నిర్మాణపు రీతులు హనుమకొండలోని వేయి స్తంభాల గుడిని పోలిఉన్నాయి. కాల ప్రవాహములో ఈ దేవాలయపు ఉపపీఠము సంపూర్ణంగా అదృశ్యమైంది. అధిష్ఠానము కొన్ని చోట్ల అగబడుతుంది. గోడల నిర్మాణపు రీతులు గణపురం దేవాలయపు గోడలను తలపిస్తాయి. ఈ దేవాలయపు గోడల ఉపరితలములందు నరసింహస్వామి అసురుని ఉదరమును చీల్చి ప్రేగులను(Intestines) హారముగా ధరించినట్లు మలచబడినాడు. ఇది హొయసల శిల్పములను స్ఫురణకు తెస్తుంది. గోడలపై నాగినీ దేవతలు, చామరధారిణులు, వాసుదేవ, వరుణ,బ్రహ్మ మున్నగు రమ్యమైన శిల్పములు కన్పట్టును. తూర్పు వైపునున్న గోడపై అంధకాసుర సంహార శిల్పము మనోహరంగా

ఉంది. దక్షిణ ముఖమును కలిగియున్న దేవాలయముపై ఇలాంటి శిల్పములున్నాయి. ఉత్తరపు మరియు తూర్పు గర్భగృహములపై నుండిన శిఖరములు నేడు కానరావు. పడమటి గర్భగృహముపై నున్న శిఖరము మెట్లతో గూడిన పిరమిడ్ ఆకారములో నిలిచిఉంది.



గౌతమేశ్వరాలయ గోడలు



శిథిలభాగము



కళింగదేవి

ఉత్తరపు, పడమటి ఆలయములను కలుపు మంటప భాగము నేడు కానరాదు. మంటప నాలుగు మధ్యస్తంభముల (Four central pillars) తో కూడుకొని నిలిచియున్న భాగము నేడు తూర్పు వైపున నున్న గౌతమేశ్వరుని గర్భగృహము ముందు అర్ధమంటపమువలె మిగిలిఉంది. ఈ మంటపములో నిగనిగలాడు మెరుపుతో ఆభరణభారము కలిగిన కాకతీయుల నంది విగ్రహము నల్లసరపు రాతితో (Basalt) మలచబడి బహురమ్యంగా ఉంది. మంటప నాలుగు మధ్య స్తంభములు విస్తారముగా ప్రశస్తమైన చెక్కడములతో శోభిల్లుచున్నాయి. స్తంభము యొక్క వీరకంఠము నందు (Between circular member and square abacus) అనగా కుదంపైన ఊర్ధ్వముఖమును కలిగియున్న విరబూసిన విశాల పద్మము ఫలికాపద్మము (square abacus) ను మోయుచున్నట్లు అందంగా అమర్చబడింది. ఈ పద్మపు అమరిక (Lotus looking upward) చంద్రవెల్లి స్తంభములందు కనిపిస్తుంది. ఈ నాలుగు మధ్యస్తంభములపై గల లోకప్పు అర్ధగోళాకారపు పెద్ద గిన్నె (Bowl) బోర్లించిన (dome shaped) రీతిలో నుండి ఒకదానిపై నొకటి గల వలయములు చిన్నవగుచు వర్తులాకారపు శిలతో కప్పబడి మధ్య నుండి మొగ్గ వ్రేలాడుచున్నది. (The ceiling above the central pillars is dome shaped and constructed of ring upon ring of stones, each ascending ring smaller than the lower and closing in towards the top, which is covered by a single circular slab with a graceful pendant like bud hanging from the apex). ఇలాంటి లోకప్పు రాయచూరు జిల్లాలోని ఇట్టగి (Ittagi) (ఇత్తగి) మహాదేవాలయములో చూడవచ్చు [143]. అలాగే బెల్లారి జిల్లాలోని హిరహద్‌గల్లి సమీపమున గల మాగల (magala) లోని వేణుగోపాలస్వామి దేవాలయపు లోకప్పు దీనిని బోలియుండుట విశేషము[144]. హొయసల దేవాలయముల సంప్రదాయములు, కళారీతులు ఇచట అనుకరింపబడినవని విదితమవుతుంది.

గౌతమేశ్వరాలయములోని మూడు ఆలయములు ఒకే రీతిలో గర్భగృహము, దాని ముందు అంతరాళముతో నిర్మింపబడినాయి. అంతరాళముల కిరువైపుల చిన్నగూడులు (Niches) కనిపిస్తాయి. తూర్పు ఆలయపు అంతరాళమునకు ఇరువైపుల చిన్నగుడులు (Miniature Shrines) పాలంపేట దేవాలయ మంటపమందున్న గుడుల వలె నిలుపబడినాయి. హొయసల దేవాలయముల ముందున్న సోపానముల కిరువైపుల చిన్నగుడులను అలంకార ప్రాయముగా నిలుపు సంప్రదాయమేర్పడింది[145]. తూర్పు ఆలయము యొక్క అంతరాళద్వారమున కిరువైపుల నిలువెత్తు పొడుగాటి జాలికిటికీలు నిలుపబడినాయి. వీటిపై పద్మాసనములో నున్న జైనుల శిల్పములు ధ్యానముద్రలో బహురమ్యముగా మలచబడినాయి. ఈ తూర్పు ఆలయపు అంతరాళపు లోకప్పు గూడా లోతుగా (dome shaped) ఒక దానిపై నొకటి చిన్నవగుచున్న వలయములతో బోర్లించిన గిన్నె ఆకృతిలో నుండి మధ్యనున్న పద్మపు మొగ్గ క్రిందివైపు చూచుచున్నది. కాని ఉత్తర ఆలయములోని అంతరాళపు లోకప్పు వలయాకారములో లేకుండా చతురస్రాకారములో ఒకటి పై నొకటి ఐదు చదరముల వరుసలు అమర్చబడినాయి. ఈ చదరముల వరుసలు పైకి పోవుకొలది చిన్నవగుచు చివరకు చదరపు ఫలకముతో లోకప్పు మూయబడింది. (The ceiling consists of five squares each ascending square being smaller than the lower and finally covered by a square slab). ద్వారపు పతంగములపై నున్న తోరణములందు (Architraves) నృత్య భంగిమలో నున్న బ్రహ్మ, గణపతి, నటరాజ, కాళి, విష్ణు శిల్పములను చూడవచ్చు.

## 26. చంద్రవెల్లి

మంథనికి ఆగ్నేయము నందు 16 కి.మీ. దూరంలో సందరెల్లి యను కుగ్రామము మానేరునది ఒడ్డున ఉంది. ఇది ఖమ్మంపల్లి గ్రామము యొక్క హ్యామ్లెట్‌గా ఉంది. ముత్తారం (మంథని) మండలములో నున్న ఈ చిన్నగ్రామమును ఖమ్మంపెల్లి నుండి గుట్టబోరు మార్గమున (hilly track) 4 కి.మీ. దూరము కాలినడకన చేరవచ్చు. కాకతీయ శిల్ప కళా సంపదను చాటు శివాలయమొకటి మానేరు నది ఒడ్డున ఉంది. దీని పరిసరములందు నివాస గృహములులేక అడవిలో ఏకాంత ప్రదేశముననుండుటచే పూజలు జరుగుట లేదు. కాకతి గణపతి దేవ చక్రవర్తి కాలపు తేదీ లేని శిలాస్తంభ శాసనమొకటి ఖమ్మంపెల్లి గ్రామములోని చిన్న శివాలయము ముందు నిలిచి ఉంది[146]. ఈ శాసనమునందు సందరెల్లి గ్రామనామము చంద్రవెల్లి మరియు చంద్రవెల్లిగా పేర్కొనబడింది. గణపతి దేవుని రాజగురువైన విశ్వేశ్వర శివాచార్యులు ఖమ్మంపెల్లి విశ్వనాథ దేవరకు భూదానములొసంగినట్లు ఇందులో పేర్కొనబడింది. బ్రాహ్మణులకు సన్యాసులకు అన్నవసతులు కలిపించుటకై (For feeding) గూడా భూములు దానమివ్వబడినాయి. ఈ శాసనములో చంద్రవెల్లి, ఖమ్మంపల్లి, పెద్దపల్లి గ్రామములు పేర్కొనబడినాయి. గోళకి మఠమునకు

చెందిన విశ్వేశ్వర శివాచార్యులు కాళేశ్వరము, మంత్రకూటము, ఖమ్మంపల్లి, చంద్రవెల్లిల యందు శివాలయములను మఠములను (Monasteries) కట్టించెనని తెలుస్తుంది[147].

## శివాలయము

నిర్మానుష్య ప్రదేశములో నున్న ఈ అద్భుతమైన శివాలయము మానేరునది వైపు తూర్పు ముఖమును కలిగి ఉంది. నక్షత్రాకారము (cruciform plan) లో నున్న ఈ దేవాలయమునకు తూర్పు, ఉత్తర, దక్షిణములందు ప్రవేశమంటపములుండగా (Porches) పడమట గర్భగృహము దానిముందు అంతరాళము ఉన్నాయి. ఈ దేవాలయ నిర్మాణము పిల్లలమర్రి లోని ఎరకేశ్వర దేవాలయము మరియు నల్గొండ జిల్లాలోని నాగులపాడు నందు మసీదుకు ఉత్తరమున నున్న దేవాలయమును పోలిఉంది. ఉపపీఠముపై గల ఈ దేవాలయము నుండి తిలకించినచో పరిసరములన్నియు ప్రకృతి సిద్ధమైన మనోహర దృశ్యములతో నిండియుండి రమ్యంగా ఉంటుంది. పచ్చిక బయళ్లు, తళతళ మెరిసే మానేరు నది అలలు, పక్షుల కిలకిలారావములు సందర్శకుల ఒంటరితనాన్ని దూరం చేస్తాయి. ఈ దేవాలయపు ఉపపీఠము, దానిపై నున్న అధిష్ఠానము యొక్క వర్గములు (Mouldings) అడ్డముగా (horizontally) అనేక మలుపులతో హనుమకొండలోని రుద్రేశ్వరాలయము లేదా వేయిస్తంభాల గుడి మరియు పాలంపేటలోని రామప్పగుడి వాటివలె శోభాయమానముగా ఉన్నాయి. రుచిక, భద్రరీతిలో గోడలు ముందుకు వెనుకకు అమరిన విన్యాసము ఈ దేవాలయమందు దర్శనమిస్తుంది. గోడలు పెద్ద చిన్న కుడ్యస్తంభములతో (Broad and narrow pilasters) అలంకరింపబడినాయి. హనుమకొండ వేయి స్తంభాల గుడిలోవలె ఇచటి గోడలు నిర్గమము (offsets) రీతిలో మధ్యలో నున్న గూడు (Niche) ను చేరువరకు ముందుకు అమరిన విధానమును కలిగిఉంది. గర్భగృహమునకు మూడువైపుల ఇదే అమరిక అందంగా ఉంది. దేవాలయపు శిఖరము శిథిలమై అదృశ్యమైంది.



శివాలయము



అధిష్ఠానభాగము

తూర్పుదక్షిణములందున్న ప్రవేశ మంటపములు (Porches) కూలిపోగా ఉత్తరముననున్న సోపానముల ద్వారా ప్రవేశమంటపము (Northen porch) గుండా సువిశాలమైన ముఖమంటపమును చేరవచ్చు. ఈ మంటపము 38'-6" x 44'-3" కొలతలతో ఉంది. నాలుగు వరుసలలో (Four rows of pillars) నున్న స్తంభములపై మంటపము నిలిచిఉంది. ఈ స్తంభములన్నియు ఎత్తుగా శోభాయమానముగా ఉన్నాయి. కొన్ని స్తంభముల వీరకంఠములందు ఊర్ధ్వ ముఖమును కలిగిన విరబూసిన పద్మములు వాటిపై నున్న ఫలికాపద్మములను మోయుచున్నట్లు అందముగా మలచబడినాయి.

ఫలికాపద్మములపై నున్న బరువైన పొట్టిగా నున్న పోదెల చివరలు చుట్టవలె నుండి మధ్యలో పడగవిప్పిన నాగసర్పముచే అలంకరింపబడినాయి. The brackets above the square abacus are massive and short ending in scroll design and decorated with hooded nagas at the centre). ముఖ మంటపము పడమటి చివరలో పిట్టగోడపై ఒకదానికొకటి ఎదురుగా రెండు చిన్న గుడులు (Miniature shrines) నిలుపబడినాయి. మంటప పిట్టగోడలపై చిన్న గుడులు నిలుపు పద్ధతి కొత్తపెల్లి, రాయికల్, పాలంపేట మున్నగు దేవాలయములందు కన్పట్టును. మంటపలోకప్పు శిథిలమై ఉంది.

అంతరాళపు ద్వారము 7'-3" ఎత్తు 5' అడుగుల వెడల్పుతో నుండి ఇరువైపుల జాలికిటికీల (perforated) తో అలంకరింపబడింది. ద్వారపు పతంగముపైన ముందుకు విస్తరించియున్న చూరు (Projecting cornice) లోలకముల లాంటి శిలాగోళములతో శోభిల్లుచున్నది. అపస్మారపురుషునిపై నాట్యము చేయుచున్న సుందర నటరాజ శిల్పము తోరణము (Architrave) నకు శోభను చేకూర్చింది. అష్టభుజములతో నున్న శివుని ఎడమకాలు అపస్మారపురుషునిపై నిలుపగా కుడికాలు నాట్యపు భంగిమలో పైకి ఎత్తి ఉంది. శివునికి ఎడమవైపు విష్ణువు, వినాయకుడు కుడివైపు బ్రహ్మ, కుమారస్వామి అందముగా మలచబడినారు. అంతరాళము యొక్క లోకప్పు ఒకదానిపై నొకటి నాలుగు అష్టభుజాకారపు వరుసలందు పట్టిక (Octagons) లతో పైకి పోయిన కొలది చిన్నవగుచు చివరకు విరబూసిన పద్మముతో మూసి వేయబడింది. (The ceiling of the antarala consists of four octagons, each ascending octagon being smaller than the lower and finally covered by a full blown lotus) అష్టభుజాకారములో నున్న లోతైన భాగము (dome) వ్రేలాడుచున్న శిల్పగోళములతో (dripstones) చూపరులను తన్మయపరుస్తుంది. గర్భగృహపు ద్వారము గూడా ఇదే మాదిరిగా సుందరంగా మలచబడింది. కాని అంతరాళద్వారపు విస్తారమైన చెక్కడములు ఇందులో కొంత తక్కువగా అగబడుతాయి. చంద్రవెల్లి దేవాలయము కాకతీయుల శిల్పకళా వైభవమునకు అద్భుతమైన ప్రతీకగా నిలిచిఉంది. వసతులను కల్పించినచో ఇది మనోహరమైన సుందరమైన పర్యాటక స్థలము(Picnic spot)గా మారు అవకాశములు మెండుగా ఉన్నాయి.

# 27. కటుకూరు

కరీంనగర్‌కు దక్షిణమున 40 కి.మీ. దూరములో భీమదేవరపల్లె మండలములో నున్న కటుకూరు గ్రామమును హుజూరాబాద్ లేదా హుస్నాబాద్ గుండా చేరవచ్చు. కాకతి గణపతి దేవ చక్రవర్తి కాలపు దుందుభి సంవత్సరపు క్రీ.శ. 1202 శిలాస్తంభశాసనమొకటి ఇచటి త్రికూటాలయములో నిలిచి ఉంది[148]. ఈ శాసనము విరియాల మరియు మల్యాల నాయకుల వంశావళి వివరములు తెలుపుతుంది. ఈ శాసనములో గ్రామనామము కట్టకూరుగా పేర్కొనబడింది. నాలుగువైపుల చెక్కబడిన ఈ శిలాస్తంభశాసనములో మొదటిప్రక్క 1 నుండి 50 పంక్తులు, రెండవ ప్రక్క 51 నుండి 102, మూడవ ప్రక్క 103 నుండి 154, నాలుగవప్రక్క 155 నుండి 204 పంక్తులు చెక్కబడినాయి.

విరియాల వంశము సూరునితో ఆరంభమగుచున్నది. ఇతనికి ప్రోలుడు, మల్లుడు, బేతడు ముగ్గురు పుత్రులు. చివరి బేతనాయకునికి సూర,మల్ల,ప్రోల, కొమ్మ యని నలుగురు పుత్రులు. మల్లని కుమారుడైన అన్నయ్య యొక్క కుమార్తె మైలమ మల్యాల వంశమునకు చెందిన చౌండనాయకుని వివాహమాడింది. మల్యాల వంశపు దన్నయ పుత్రుడు సబ్బాయ పౌత్రుడు కాటయ. ఈ కాటయ పుత్రులే పోతరాజు మరియు చౌండసేనాని. మల్యాల వంశపు ఈ చౌండసేనానినే విరియాల వంశపు మైలమ పరిణయమాడిందని ఈ శాసనము తెలుపుతుంది.

విరియాల వంశపు బేతనాయకుని కుమారుడైన సూరనాయకుడు (Chief) మృడాలయం (శివునకు) హరి మరియు భాస్కరునకు ఆలయములు నిర్మించెనని ఈ శాసనమందు పేర్కొనబడింది. కాకతి గణపతి దేవ చక్రవర్తి ఆజ్ఞానుసారము చౌండసేనాని యుద్ధమునందు పాల్గొని చోళరాజు నోడించి "దివిచూఅకార" బిరుదము పొందాడు. ఈ చౌండసేనాని అర్ధాంగి మైలమ శివాలయములు కట్టించి, చెఱువులు త్రవ్వించి భూదానములొసంగెనని కటుకూరు శాసనము తెలుపుతుంది.



త్రికూటాలయము



అంతరాళ ద్వారము

# త్రికూటాలయము

రాతిప్రాకారములో నున్న ఈ త్రికూటాలయమునకు ఉత్తరము నుండి ప్రవేశ మార్గముంది. పడమట, దక్షిణములందు గల రాతి ప్రహారిగోడ పడిపోయింది. కాని పునాదుల ఆనవాళ్లు మిగిలి ఉన్నాయి. ఈ త్రికూటాలయపు ముఖమంటపమును ఉత్తరపు ప్రవేశమంటపము (porch) ద్వారా చేరవచ్చు. ఈ మంటపమునకు దక్షిణ, తూర్పు, పడమరలందు గర్భ గృహములున్నాయి. ఈ దేవాలయమునకు ఉపపీఠము లేదు. రెండు అడుగుల ఎత్తున్న అధిష్ఠానము సాధారణ పట్టికలను కలిగి ఉంది. గోడల పైభాగమున కపోతము రెండు వరుసలలో (two tiers) ఉంది. మూడు గర్భగృహములపై నుండిన శిఖరములు శిథిలమై కేవలము ఇటుక ముక్కలు మిగిలి ఉన్నాయి.

ముఖమంటపము 19'-4" చతురస్రాకారము. మంటపము ఎత్తు ఎనిమిది అడుగులు. అశ్వపాదము నుండి పోదె వరకు స్తంభముల ఎత్తు ఆరు అడుగుల నాలుగు అంగుళములు. మంటపము యొక్క లోకప్పు చదునుగా ఉంది. కాని మధ్యభాగము లుపవితాన రీతిలో (కదలికాకరణ) త్రికోణాకార ఫలకములతో నుండి చదరపు ఫలకముతో కప్పబడింది. చదరపు ఫలకము విరబూసిన పద్మశిల్పముతో అలంకరింపబడింది. మంటపము చుట్టున్న పిట్టగోడలపై కక్షాసనములున్నాయి. కాకతీయుల కళారీతిలో నల్లసరపురాయి (Basalt) తో మలచబడిన నిగనిగ మెరుపులను కలిగిన, నునుపైన నంది ఈ మంటపమందుంది. సప్తమాతృకల ఆసనముల క్రింద వారి వాహనములు గల శిలాఫలకమొకటి కనబడుతుంది. ఈ ఫలకము చివరల యందు వీరభద్రుడు, వినాయకుడు చెక్కబడినారు.

ఈ దేవాలయములోని మూడు గర్భగృహములు ఒకే రీతిలో 6'-6" చతురస్రాకారములో ఉన్నాయి. వాటి ముందున్న అంతరాళముల కొలతలు 6'-6"x5'. అంతరాళముల మరియు గర్భగృహముల ద్వారముల ఎత్తు 4'-4" వెడల్పు 2'-2". ప్రతి అంతరాళపు ద్వారమునకు ఇరువైపుల జాలికిటికీలు అలంకరింపబడినాయి. అంతరాళ ద్వారముల అడుగున (Base) మరియు తోరణములందు (Architraves) నర్తకీమణులు (dancers) మృదంగ, తాళవాద్యకారిణులు (drummers, cymbal-beaters) అందముగా మలచబడినారు. గర్భగృహముల ద్వారములందు త్రిశాఖల క్రింది భాగమున శైవ ద్వారపాలకులుండగా తోరణములందు అంతస్తుల శిఖరములు (turrets) చెక్కబడినాయి.

ఈ దేవాలయపు ప్రత్యేకత ఏమనగా ప్రాకారపు గోడలనానుకొని ప్రాంగణములోపల చిన్నగుడులు (Miniature shrines) ఒకదానికొకటి కొంత దూరములో (with regular intervals) నిలిచి ఉన్నాయి. ఇట్టి చిన్నగుడులు ప్రాకారపు గోడలనానుకొని లోపలివైపు తూర్పున ఆరు, ఉత్తరమున నాలుగు, పడమట రెండు నిలిచిఉన్నాయి. ప్రతిచిన్న గుడి శిఖరము రెండు

మెట్లతో (Two steps) నుండి చదరపు ఫలకముతో కప్పబడింది. దేవాలయము చుట్టూ గల ప్రాకారమునానుకొని ఇలాంటి చిన్న గుడులు ఏకరీతిలో నిలుపబడుట కటుకూరులో తప్ప ఈ జిల్లాయందు మరెచ్చటను కనిపించదు.



చిన్నగుడుల వరుస



చిన్నగుడి

## 28. గొడిశాల (ఉప్పరపల్లి)

కరీంనగర్‌కు ఆగ్నేయమునందు 50 కి.మీ. దూరంలో సైదాపూర్ మండలములోనున్న గ్రామమే గొడిశాల. హుజురాబాద్‌కు 10 కి.మీ. దూరములో నున్న ఈ గ్రామమును బస్సు ద్వారా జేరవచ్చు. శాసనాల్లో ఈ గ్రామమును ఉప్పరపల్లియని పేర్కొన్నారు[149]. పెద్ద గుడులు ఉన్న ప్రదేశమగుటచే ఇది గుడిశాల అయియుండును. క్రమముగా గుడిశాల నామమే గొడిశాలగా మారియుండవచ్చు. కాకతీయ గణపతిదేవ చక్రవర్తి కాలమునకు చెందిన శకవర్షంబులు 1157 మన్మథమాఘ శుద్ధ 15 గురువారము సరియగు తేది క్రీ.శ. 1236 జనవరి, 24 రోజున అచ్చగ్రాంథిక భాషలో కావ్యశైలిలో తెలుగు నందు వేయించిన శిలాస్తంభశాసనము ఇచటి శివాలయము వద్ద నిలచి ఉంది[150]. నాలుగు వైపుల చెక్కబడిన ఈ శాసనములో మొదటిప్రక్క 1 నుండి 21 పంక్తులు, రెండవ ప్రక్క 22 నుండి 49 పంక్తులు, మూడవప్రక్క 50 నుండి 75 పంక్తులు, నాలుగవప్రక్క 76 నుండి 101 పంక్తులున్నాయి. తెలుగు పద్యములతో ఆరంభమైన ఈ శాసనమందు గణేశుని, దుర్గ, వరాహరూప విష్ణువు, సూర్య దేవరల స్తుతి ఉంది. గణపతి దేవ చక్రవర్తి కాకతి రుద్ర నరేంద్రుని కుమారునిగా పేర్కొనబడినాడు. గణపతిదేవుని ముఖ్యప్రధానులలో నొకడగు రేచెర్ల రుద్రుడు, కాట్రెడ్డి మరియు బెజ్జమాంబల తనయునిగా ప్రశంసింపబడినాడు. రేచర్ల రుద్రుని మంత్రియగు రాజనాయకుడు ఉదయగిరి మున్నగు ప్రాంతములు జయించి ద్రాక్షారామపు భీమేశ్వరాలయములో అక్షయ, అఖండ దీపముల (Perpetual lamps) కై దానములిచ్చాడు. బ్రాహ్మణుడైన రాజనాయకుడు మరియు రవ్వమాంబ దంపతులకు జన్మించిన కాటయ ఈ గ్రామము నందు శివాలయములు కట్టించి, తటాకములు త్రవ్వించి వనములు వేయించి దేవబ్రాహ్మణులవృత్తులు విడిచి పించరపల్లి గ్రామమును పంచలింగాలకు దానముగా నొసంగుచు ఈ శాసనము వేయించాడు. ఇందులో కాకతివంశమున

రుద్రదేవుని, గణపతి దేవుని ప్రశంసించి, రేచర్లరుద్రిరెడ్డిని తన తండ్రి రాజనాయకుని, తనను గూర్చి గూడా కాటయ చెప్పుకొన్నాడు. ఈ శాసనము గద్య పద్యాత్మకము. కాటయనాయకుడు చెఱువులను నిర్మించి వనములను వేయించాడు. ఈ శాసనములో కాట్నాయని చెఱువు, రవ్వసాని చెఱువు, రాజనాయకుని చెఱువు, రవ్వసాని మామిడితోట మరియు కొన్ని కాలువల పేర్లు పేర్కొనబడినాయి. కాటయ మామిడి వనమును, చింతవనమును, ఊరికి దక్షిణమున తాటివనమును, అంగడిసుంకమును దేవరలకు అంగరంగ వైభోగ ధూపదీప నైవేద్య తాంబూలాదులకు దానముగా ఇచ్చాడు. శాసనము చివరలో గణపతి దేవ చక్రవర్తి గూడా భూదానము నొసంగినట్లు పేర్కొనబడింది. ఐదు ప్రార్థనా పద్యములలో (Invocatory verses) గణేశుడు, దుర్గ, హరి, సర్వేశుడు, భాస్కరుడు స్తుతింపబడుట వలన స్మార్త బ్రాహ్మణులు పంచాయతనముల పూజించు సంప్రదాయము ప్రబలిందని తెలుస్తుంది[151]. శైవ, వైష్ణవ, శాక్తేయ, గాణపత్య, సౌరపూజలు స్మార్త బ్రాహ్మణులు నేటికి జరుపుచునే యున్నారు. ధర్మపురిలో పంచాయతనముల గుడిలో ఈ పూజలు జరుగుచున్నాయి.

శాసనములో పేర్కొనబడిన పంచలింగాలలో మూడు త్రికూటాలయమునందుండగా మిగిలిన రెండు త్రికూటాలయమునకు దక్షిణమున గల రెండు వేరు వేరు దేవాలయములలో ప్రతిష్ఠింపబడినాయి. ఉప్పరపల్లి చారిత్రక ప్రాధాన్యత గల ప్రదేశము. ఢిల్లీసుల్తాన్ అలాఉద్దీన్ ఖిల్జీ తన సేనలను మాలిక్ ఫక్రోద్దీన్‌జునా, మరియు జూనాఖాన్ సేనాధిపతుల నాయకత్వములో ఓరుగల్లు పైకి క్రీ.శ. 1303లో తొలి దండయాత్ర చేయుటకు పంపాడు. కాకతీయ సైన్యములు ఈ గొడిశాల (ఉప్పరపల్లి) వద్ద తురుష్కసైన్యములను అడ్డుకొని భీకరమైన యుద్ధం చేశాయి. పోతుగంటి మైలి, రేచర్ల వెన్న భూపాలుడు, మంగయదేవుడు మున్నగు సేనానులు వీరోచితముగా పోరాడి మహ్మదీయుల దండయాత్రను త్రిప్పికొట్టినారని, వారిని కాకతీయ రాజ్యభాగముల నుండి పారద్రోలినారని వెలుగోటి వారి వంశచరిత్ర తెలుపుతుంది[152]. గొడిశాల దేవాలయముల చుట్టు గుట్టలున్నాయి. స్థానిక గ్రానైట్‌రాయినే వీటి నిర్మాణములో ఉపయోగించారు. నేడు ఈ ప్రదేశమంతయు ఏ కారణము చేతనో నిర్మానుష్యమై ఉంది. గొడిశాల నుండి 3 కి.మీ. ఎడ్లబండి మార్గము (Cart track) గుండా ఈ దేవాలయములు జేరవచ్చు.

## త్రికూటాలయము

దేవాలయ పథకము నక్షత్రాకారములో ఉంది. ముఖమంటపమునకు ఉత్తరము, పడమట, దక్షిణములందు గర్భగృహములుండగా తూర్పున ప్రవేశ మంటపము (Porch) ఉంది. మూడు గర్భగృహములలో శివుడు లింగరూపమున ప్రతిష్ఠింపబడినాడు. తూర్పు ముఖమును కలిగియున్న ఈ దేవాలయము కాకతీయుల కళాకౌశలమునకు నిదర్శనముగా ఉంది. ఈ త్రికూటాలయమునకు ఉపపీఠము లేదు. అధిష్ఠానము నందు ఉపానము, జగతి, కుముదములుండి వేదిపైన గోడలు లేచినాయి. దేవాయలయము చుట్టూ గోడలపైన చివరలయందు ముందుకు

విస్తరించి రెండు వరుసలలో నున్న చూరు అందమును అతిశయింప జేస్తుంది. మూడు గర్భగృహములపై నుండిన శిఖరములు శిథిలమై అదృశ్యమైనాయి. రెండు పొరలు (Double shell) గల రాతిగోడలు పెద్దపెద్ద శిలాఫలకములతో నిర్మింపబడినాయి. రెండు పొరల మధ్యన మట్టి, గులకరాళ్లు నింపబడినాయి. కొన్ని సందర్భములలో రెండుపొరల మధ్య శూన్య మేర్పడింది. వర్షమునకు మధ్యనున్న గులకరాళ్లు (Rubbles) మట్టి కొట్టుకొని పోయాయి. పడమటి, ఉత్తర ఆలయముల గోడల బయటిపొర (Outer shell) కూలిపోవుట వలన మధ్యనున్న శూన్యప్రదేశము మరియు లోపలిపొర (Inner shell) బయల్పడినాయి. కాకతీయ దేవాలయముల యొక్క పునాదులు (Foundations) దృఢముగా లేనందున పెద్ద పెద్ద శిలలతో నిర్మాణము గావించిన గోడలయందు నీరు కారుట వలన కట్టడములన్నియు తరచుగా క్రుంగి శిథిలమైనాయి.



త్రికూటాలయము



అంతరాళ ద్వారము

తూర్పుననున్న నాలుగు సోపానముల ద్వారా ప్రవేశమంటపము (Porch) ను జేరవచ్చు. ప్రవేశమంటపము తూర్పు, పడమరలుగా 12 అడుగుల పొడవు ఉత్తరదక్షిణములుగా 9 అడుగుల వెడల్పు కలిగి ఉంది. ముఖమంటపము 27'-6" చతురస్రాకారము. నాలుగు మధ్యస్తంభముల మధ్యనున్న చదరపు ఆకారముపై వృత్తాకారపు రంగశిల నునుపుగా అద్దమువలె మెరయుచున్నది.

మంటపములోని స్తంభములు విస్తారముగా ప్రశస్తమైన మరియు సూక్ష్మమైన చెక్కడములతో మనోరంజకముగా ఉన్నాయి. కాకతీయుల కాలపు నిగనిగ మెరుపులతో అందమైన శిల్ప సంపదతో ఈ స్తంభములు చూపరుల నాకర్షిస్తాయి. సున్నితపు సూక్ష్మచెక్కడములన్ని కచ్చితంగా రూపొందుటకై శిల్పులు నల్లసరపురాతి (Basalt) స్తంభములనే నిలిపారు. అనేక మలుపులతో గూడిన పదునైన చెక్కడములు ఇప్పుడే చెక్కబడినట్లు స్తంభములలోని ప్రతి అంగుళము మేర శిల్పముతో నింపబడింది. స్తంభముల యొక్క అశ్వపాదముల ఉపరితలములు నాలుగువైపులా అందమైన నాట్యకత్తెల వాద్యకారిణుల (dancers and drummers) శిల్పములతో అలంకరింపబడినాయి. స్తంభ మధ్యభాగము అనేక కంపములతో (Fillets) సూక్ష్మాతి సూక్ష్మమైన చెక్కడములతో శోభిల్లుతుంది. స్తంభ శీర్షమున గల కలశము నాలుగువైపుల అందమైన

సమద్విబాహు త్రిభుజాకారపు శిల్ప ముద్రికలతో అలంకరింపబడింది. కుడం (circular abacus) భాగము, వీరకంఠము, దానిపై నున్న ఫలికా పద్మము (Square abacus) అలంకార శోభితములు. స్తంభ ఆరంభపు మరియు పట్టభాగముపై నున్న చదరపు భాగముల (Square parts) ఉపరితలములు నునుపుగా అద్దమువలె చెక్కబడి సందర్శకుల ముఖాలు కనబడేటట్లున్నాయి. గొడిశాలలోని నిగనిగలాడు స్తంభములు వరంగల్ జిల్లాలోని పాలంపేట, హనుమకొండ మరియు నల్గొండ జిల్లాలోని పిల్లలమర్రి నాగులపాడు దేవాలయములలోని స్తంభములవలె శోభాయమానముగా ఉన్నాయి.



స్తంభము



పట్టశీర్ష భాగములు

త్రికూటాలయ మంటప లోకప్పు దాని మొత్తము తొమ్మిది విభాగములలో లుపవితాన (కదలికాకరణ) రీతిలో త్రికోణ ఫలకములతో, చదరపు ఫలకములతో కప్పబడిఉంది. నాలుగుస్తంభముల మధ్య నున్న మంటప లోకప్పు కరీంనగర్ జిల్లాలోని కాకతీయ దేవాలయములందు గల లోకప్పులన్నింటి కంటే మిన్నగా నుండుట విశేషము. ఇచటి లోకప్పు దూలముల లోపలి వైపు గల తలములు హంసమాలతో అలంకరింపబడగా బయట తలములు (Outer surfaces) సాదాగా (plain) ఉన్నాయి. ప్రతిదూలపు క్రింది తలము (bottom surface) మూడు చదునైన బహుదళ పద్మములతో ఆకర్షణీయంగా ఉంది. మధ్యనున్న విశాలమైన చదరపు ఫలకము లోతుగా (dome shaped) వలయములతో చెక్కబడింది. ఈ వలయములు ఒకదానిపై నొకటి చిన్నవగుచు మధ్యలో విస్తారముగా చెక్కబడిన పద్మపు మొగ్గ అందముగా వ్రేలాడుతుంది. అర్ధగోళాకారపు గిన్నె (Bowl) బోర్లించిన రీతిలో నున్న ఈ లోతైన చెక్కడము అసంఖ్యాక

శిల్పగోళములతో (dripstones) శోభిల్లుతుంది. నాలుగు మధ్యస్తంభములపై నున్న లోకప్పు మధ్యలో నున్న ఈ సుందరశిల్పము వర్ణనాతీతము.

ఈ త్రికూటాలయపు అంతరాళముల, గర్భగృహముల ద్వారముల అలంకారములు నిరుపమానములు. ప్రతిద్వారము 6'-2" ఎత్తు 3'-2" వెడల్పుతో ఉంది. అంతరాళముల ద్వారముల కిరువైపుల జాలి కిటికీలు విస్తారమైన చెక్కడములతో "Screen windows of exquisite fret work" అందమును ఇనుమడింపజేశాయి. పద్మ, లతా శిల్పవరుసలతోనున్న ద్వారపు త్రిశాఖల క్రింది భాగమున ద్వారపాలకుల కిరువైపుల చామరధారిణులు, నాట్యకత్తెలు అందంగా మలచబడినారు. ద్వారపు లలాటమున గజలక్ష్మి ఉంది. పతంగముపై ముందుకు విస్తరించిన చూరు క్రిందిభాగము (Projecting cornice over the lintel) అర్ధచంద్రాకార గోళములతో (semi circular stones) అలంకరింపబడింది. దీనిపై నున్న తోరణము (Architrave) నందు శివుడు అపస్మారపురుషుని పై తాండవము చేయుచున్న శిల్పము బహురమ్యంగా ఉంది. పదిహస్తములతో నాట్యము చేయుచున్న శివునికి ఎడమవైపు వినాయకుడు, విష్ణువు కుడివైపు బ్రహ్మ, కుమారస్వామి అందముగా మలచబడినారు. ప్రతి అంతరాళము 8'-6" x 9'-3" కొలతలతో ఉంది. గర్భగృహముల ద్వారములు గూడ అంతరాళముల ద్వారముల వలె అలంకార శోభితములై వాటి క్రింది భాగమున పూర్ణకుంభములు, తోరణములందు అంతస్తుల శిఖరములు (turrets) మలచబడినాయి. ప్రతి గర్భగృహము 11'-2" చతురస్రము. ఈ త్రికూటాలయములోని సుందరశిల్పము గల ద్వారబంధములు, నిగనిగలాడు శిల్పము గల స్తంభములు, చిత్రశిల్పఫలకములు, ద్వారపాలప్రతిమలు, పద్మలతా శిల్పముల బారులు గల ద్వారపు శాఖలు, సుందర లోకప్పు శిల్పము అలంకార భారముతో నున్న దూలములు, లోకప్పు నందు లోతుగా అర్ధగోళాకారములో చెక్కబడిన సుందరశిల్పము మున్నగునవి కాకతీయ శిల్పకళా వైభవమును వేనోళ్ల చాటుచున్నాయి. కాకతీయ శిల్పుల భావోద్వేగము, శిల్పఔన్నత్యమునకు ఇచటి దేవాలయములు మచ్చుతునుకలు.

## త్రికూటాలయమునకు దక్షిణముననున్న మొదటి శివాలయము

త్రికూటాలయమునకు కొన్ని అడుగుల దూరములో గర్భగృహము, అంతరాళము, ముఖమంటపముతో కూడిన శివాలయము తూర్పు ముఖమును కలిగి ఉంది. పదహారు స్తంభముల ముఖమంటపము ముందు రెండు స్తంభములపై నిలిచిన ప్రవేశమంటపముంది. మంటపము చుట్టూ పిట్టగోడలేదు. మంటపము శిథిలావస్థలో ఉంది. ఇది సువిశాలమైన దేవాలయము.

## రెండవ శివాలయము

పై శివాలయము నానుకొని దక్షిణమున వేరొక శివాలయము తూర్పు ముఖమును కలిగి ఉంది. ఈ రెండు శివాలయముల నిర్మాణము ఒకే రకపు కొలతలతో ఒకే రీతిలో ఒకదానినొకటి అనుకొని యుండుటవిశేషము. ఈ దేవాలయపు గర్భగృహము, ప్రవేశమంటపము

శిథిలమై అదృశ్యమైనాయి. ఈ దేవాలయ మంటపములో కాకతీయ కళారీతిలో నంది విగ్రహము పడిఉంది. త్రికూటాలయములోని శిల్ప కళా ఔన్నత్యము ఈ రెండు దేవాలయములందు కానరాదు. బహుశః ఇవి తొలినిర్మాణములై ఉంటాయి. త్రికూటాలయములోని మూడు లింగములు, ఈ రెండు దేవాలయములలోని రెండు లింగములు కలిపి మొత్తము పంచలింగాలుగా కాటయ వేయించిన ఇచటి శాసనమునందు పేర్కొనబడినాయి. ఈ రెండు శివాలయములు ఒక దాని ప్రక్కకు వేరొకటి అంటి యుండుట వలన రెండు ముఖమంటపములు అవిచ్ఛిన్నంగా ఒకటిగానే కలిసియున్నట్లు అగబడుతాయి. మొదటి శివాలయ మంటప దక్షిణ భాగపు వంపుగల చూరు మరియు రెండవ శివాలయ మంటప ఉత్తరభాగపుచూరు ఒకదానికొకటి తాకి యుండుట వలన ఉమ్మడి మంటపము వలె కనిపిస్తుంది. ఈ రెండు దేవాలయముల మంటపములు కూలిపోకుండా ఇటీవల సిమెంట్, రాయితో గోడల నిర్మాణము అచటచ్చట గావించారు.



త్రికూటాలయమునకు దక్షిణమున ఉన్న రెండు శివాలయములు

**ప్రతిమా శిల్పములు**

**భైరవుడు** :- ఏడు అడుగుల ఎత్తు గల శిలాఫలకముపై చతుర్భుజముల భైరవుడు చెక్కబడినాడు. అతని పైకుడిహస్తములో డమరుకము ఎడమ హస్తములో త్రిశూలము, క్రింది దక్షిణహస్తములో మెలికలు గల ఖడ్గము (Curled sword) వామ హస్తములో కపాలము ఉన్నాయి. అతనికి ఎడమవైపున శునకము ఎగురుచున్నది. ఈ భైరవ విగ్రహము త్రికూటాలయము ముందు నిలిచిఉంది.



**నంది** :- త్రికూటాలయము ముందు ఆభరణభారముతో నున్న కాకతీయుల కళారీతిలో పెద్ద నల్లరాతి నంది విగ్రహముంది. ఈ నంది పొడువు 5'-9". పీఠముపై కూర్చొని యున్న నిగనిగలాడు ఈ నంది వెనుక నుండి ముందు వరకు మేని నిండా అనేక హారములతో అలంకరింపబడింది. దీని మెడ చుట్టూ గంటల హారముంది. నంది నితంబములను చుట్టుచూ దేహమంతటను పరివ్యాప్తమై యున్న హారములు Festooned rump garlands సూక్ష్మమైన ప్రశస్త చెక్కడములతో కాకతీయ శిల్పి ఉలికి గల కళాకౌశలమును చాటుతాయి.

నంది :- పైన చెప్పబడిన నంది మాదిరిగానే వేరొక కాకతీయ నంది విగ్రహము త్రికూటాలయమునకు దక్షిణమున గల రెండవ శివాలయ మంటపములో పడిఉంది.

గొడిశాలలోని ఈ అద్భుతదేవాలయముల పరిసరములు నేడు నిర్మానుష్యముగా ఉన్నాయి. ఊరికి 3 కి.మీ. దూరములో అడవిలో నున్న ఈ దేవాలయములకు ఆదరణ లేదు. దండయాత్రల భయము వలన గాని, కరువు కాటకములు, క్షామముల వలన గాని, అంటువ్యాధుల వలన గాని నాటి గ్రామము ఇచటి నుండి దూరమునకు తరలిపోయి యుండవచ్చు. ఇలాంటి పరిస్థితియే చొప్పదండిలోని శంభుని గుడి, మంథని సమీపమునగల ఖమ్మంపల్లి హ్యామ్లెట్ గ్రామమైన సందరెల్లి (చంద్రవెల్లి) శివాలయము యొక్క పరిసరములందు చూడవచ్చు.

## 29. పోతుగల్

కరీంనగర్‌కు నైఋతి యందు 60 కి.మీ. దూరంలో ముస్తాబాద్ మండలంలో నున్న గ్రామమే పోతుగల్ లేదా పోతుగంటి. ఇచటికి సిరిసిల్ల గుండా చేరవచ్చు. కాకతి గణపతి దేవచక్రవర్తి కాలపు దేవనాగరిలిపి శాసనమొకటి లక్ష్మీనారాయణ దేవాలయపు ప్రధానద్వారము పై చెక్కబడిఉంది. స్వస్తిశ్రీ శక సంవత్సరము 1157 యువ వైశాఖ శుద్ధ సప్తమి గురువారము సరియగు తేది క్రీ.శ. 1235 మే 26 రోజున మహాప్రధాని నారాయణ విశ్వేశ్వర దేవరను ప్రతిష్ఠించినట్లు ఈ శాసనము తెలుపుతుంది. వశిష్ఠ గోత్రుడైన వామిదేవుని కుమారుడు నారాయణ రాయస్థాపనాచార్య బిరుదాంకితుడుగా పేర్కొనబడినాడు[153]. గ్రామము సమీపమున గల గుట్టబోరు (hillock) పై రాతి ప్రాకారములో ఒకదాని ప్రక్కకు మరియొకటి రెండు దేవాలయములు తూర్పు ముఖమును కలిగిఉన్నాయి.

### శివాలయము

గర్భగృహము, అంతరాళము, పదహారు స్తంభముల ముఖమంటపము ఈ దేవాలయపు ప్రధానాంగములు. తూర్పు నుండి మంటపములోనికి ప్రవేశింపవచ్చు. మంటపము చుట్టూ పిట్టగోడ (Parapet wall) ఉంది. ఈ దేవాలయము ముందు దాదాపు 25' అడుగుల ఎత్తు గల నంది స్తంభము నిలిచిఉంది. స్తంభముపై భాగమున నున్న చిన్నమంటపము (Miniature shrine) లో నంది విగ్రహముంది.

### వైష్ణవాలయము

ఈ దేవాలయమందు గర్భగృహము, అంతరాళము, చుట్టూగోడలు గల మంటపము, (A closed mandapa) దాని ముందు గోడలులేని మంటపము (An open mandapa) ఉన్నాయి. దేవాలయము ముందు తూర్పున ప్రవేశమంటపము ఉంది. పెద్దపరుపు బండపైన (on the plain surface of the rock) గల ఈ దేవాలయమునకు అధిష్ఠానము లేకుండా బండపైన

రాతిగోడలు లేపబడినాయి. తెఅచియున్న మంటపము (open Mandapa) చుట్టూ గల పిట్టగోడ (Parapet wall) పై కక్షాసనములున్నాయి. చుట్టూగోడలు గల మంటప (closed mandapa) ద్వారము యొక్క క్రింది భాగమున సుందరాంగుల శిల్పములు చూడముచ్చటగా ఉన్నాయి. గర్భగృహములో ప్రస్తుతము శ్రీరాముని విగ్రహము ప్రతిష్ఠింపబడి ఉంది. గనుక ఇది రామాలయముగా పిలువబడుతుంది. ఈ దేవాలయములో నున్న సూర్యశిల్పము క్రింది భాగమున ఏడు అశ్వములు చెక్కబడినాయి. సమభంగములో నిలబడియున్న సూర్యుని చేతులు ఛేదింపబడినాయి. ఈ దేవాలయము ముందు ఆవరణలో ఆరు అడుగుల ఎత్తు గల గరుడ మరియు ఆంజనేయ ప్రతిమలు శిలాఫలకములపై అందముగా మలచబడినాయి. ఈ దేవాలయము ముందు గూడా 25' అడుగుల ఎత్తు గల గరుడ స్తంభము నిలిచి ఉంది. గ్రామము బయట రహదారి ప్రక్కకు నాలుగు అడుగుల ఎత్తుగల రెండు వీరగల్ ప్రతిమలున్నాయి. వీరి చేతులలో ఖడ్గము, డాలు ఉన్నాయి. కొలనుపాక నుండి వేములవాడకు పోవు మార్గమున గల పోతుగంటి చాళుక్యుల మరియు కాకతీయుల కాలములో ప్రాధాన్యత గల గ్రామము.



వైష్ణవాలయము

కాకతి ప్రతాపరుద్రదేవుని సేనానులలోనొకడైన పోతుగంటి మైలి అసమాన ధైర్య సాహసములను ప్రదర్శించిన యోధునిగా వెలుగోటి వారి వంశ చరిత్రలో పేర్కొనబడినాడు. క్రీ.శ. 1303 లో ఢిల్లీసుల్తాన్ అలాఉద్దీన్ ఖిల్జీ దండయాత్రను ఎదుర్కొని ఉప్పరపల్లి (గొడిశాల) వద్ద తురుష్క సేనలు పలాయనము చిత్తగించునట్లు చేసిన మహాయోధుడు పోతుగంటి మైలి. ఒక పరియాయము కప్పము చెల్లించుటకై ఢిల్లీకి వెళ్లిన సందర్భములో అలాఉద్దీన్ ఖిల్జీ ఆస్థానములో పోతుగంటి మైలి మరియు తెలుగు బిజ్జన ప్రదర్శించిన ఖడ్గ నైపుణ్యమునకు సుల్తాన్ అచ్చెర్వొందాడు[154].

## 30. ముత్తారం

కరీంనగర్‌కు ఆగ్నేయమునందు 60 కి.మీ. దూరంలో భీందేవరపల్లి మండలములో నున్న గ్రామమే ముత్తారం. హుజూరాబాద్ లేదా హుస్నాబాద్ నుండి ముల్కనూరు ద్వారా ఈ

గ్రామము చేరవచ్చు. గ్రామమునకు సమీపముననున్న పొలములలో కాకతీయుల కాలపు త్రికూటాలయము తూర్పు ముఖమును కలిగి ఉంది. ఈ దేవాలయ నిర్మాణము నగునూరు, కొత్తపెల్లి దేవాలయములను పోలి ఉంది. తూర్పులో నుండు ప్రవేశమంటపము (Porch) మరియు మధ్యనుండు ముఖమంటపముల నిర్మాణము పూర్తికాలేదు లేదా శిథిలమైయుండును (Either unfinished or ruined). మంటపముకై ఉద్దేశింపబడిన వేదికకు పడమట, ఉత్తర దక్షిణములందు మూడు గర్భగృహములు వాటి ముందు అంతరాళములున్నాయి. కాకతీయ కళారీతులను బట్టి ఇచటి త్రికూటాలయము పదమూడవ శతాబ్దపు ప్రథమార్థభాగములో నిర్మింపబడి ఉంటుంది.



త్రికూటాలయ గోడలు



త్రికూటాలయ గోడలు

## త్రికూటాలయము

ఈ దేవాలయపు ఉపపీఠము నక్షత్రాకారములో ఉన్నతముగా నుండి దాని వర్గము (Mouldings) అడ్డముగా అనేక మలుపులతో శోభాయమానముగా ఉంది. వివిధ పరిమాణములలో గల పట్టిక, పద్మము, త్రిపట్టము మరల మరల వంపులతో రూపొందింపబడినాయి. (Bands of various sizes are repeated with alternate recesses). నేల నుండి మూడవ పట్టిక ఊర్ధ్వముఖ అర్ధచంద్రాకార గోళములతో చివరి పట్టిక క్రింది భాగము అధోముఖ అర్ధచంద్రాకారపు గోళముల (Semicircular stones) తో అలంకరింపబడినాయి. ఉపపీఠము వలె అధిష్ఠానము యొక్క వర్గము (Mouldings) చూపరులను తన్మయులను చేస్తుంది. అధిష్ఠానము పైనున్న గోడలు పెద్ద చిన్నకుడ్యస్తంభములతో (Broad and narrow pilasters) తీర్చిదిద్దబడినాయి. శిఖరాన్ని మోస్తున్నట్లుగా నున్న సన్నని కుడ్య స్తంభములు (Narrow pilasters surmounted by turrets are sculptured in the recesses) వంపులలో నింపబడినాయి. గోడలపైన మూడు వరుసలలో (in three tiers) నున్న కపోతము చూడముచ్చటగా ఉంది. గర్భగృహములపై నుండిన శిఖరములు నేడు కానరావు. కాని లోకప్పుకై వేయబడిన పొడుగాటి ఘనమైన శిలాఫలకములు శిఖరముల స్థానములో మిగిలిఉన్నాయి.

తూర్పు వైపున నున్న పదిమెట్లు మంటపమునకై నిర్దేశింపబడిన ఎత్తైన వేదిక (platform) పైకి తీసికొనిపోతాయి. ఈ వేదికపై చదునైన పొడుగాటి ఘనమైన అనేక

శిలాఫలకములు పడిఉన్నాయి. ఇవన్నియు శిథిలమైన మంటపమునకు చెందినవై ఉంటాయి. లేదా మంటపనిర్మాణమునకై ఉపయోగించుటకు తేబడిన శిలలై ఉంటాయి. అంతరాళముల మరియు గర్భగృహముల ద్వారములన్నియు ఒకే రీతిలో ఉన్నాయి. ప్రతిద్వారపు పతంగము (lintel) పైన ముందుకు విస్తరించియున్న చూరు (Projecting cornice sculptured with pendants) లోలకముల లాంటి చిన్నచిన్న శిల్పగోళములతో శోభాయమానంగా ఉంది. తోరణములందు (Architraves) శిఖర అంతస్తులున్నాయి (turrets). అంతరాళముల ద్వారముల క్రింది భాగమున ద్వారపాలకులుండగా గర్భగృహముల ద్వారములు సాదాగా ఉన్నాయి. పడమటి, దక్షిణ గర్భగృహములందు శివలింగములుండగా, ఉత్తర గర్భగృహములో విష్ణువు ప్రతిష్ఠింపబడినాడు.



త్రికూటాలయ ప్రస్తరభాగము



అంతరాళ ద్వారము

**ప్రతిమాశిల్పములు**

**విష్ణువు:-** ఉత్తరపు గర్భగృహములో నిలుపబడిన నాలుగు అడుగుల ఎత్తుగల ఈ విష్ణువు విగ్రహము నాలుగు హస్తములతో సమభంగిలో నిలబడియున్న కాకతీయ శిల్పము. పై దక్షిణ హస్తమందు శంఖము, వామ హస్తము నందు చక్రములుండగా క్రింది రెండు హస్తములు విరిగిపోయినాయి. విష్ణువు కిరీటమకుటము, కుండలములు, హారములు,గ్రైవేయకములు, ఉదరబంధము, మూడు వరుసల కటిబంధము, అర్ధోరుకము, వనమాల ధరించియున్నాడు. దండ కడియములు, ముంజేతి కడియములు చీలమండ వద్ద కాలికడియములు పాదములకు నూపురములు శోభను చేకూర్చుచున్నాయి. విష్ణువు కిరువైపుల చామరధారిణులున్నారు. అతనికి కుడివైపు క్రింది భాగమున గరుడుడు మలచబడినాడు.

**గణపతి**

త్రికూటాలయమునకు ఉత్తరమున కొంత దూరములో చతుర్బాహువులతో మకుటము ధరించిన పెద్ద వినాయక విగ్రహము చెట్ల క్రింద పడి ఉంది. నాగసర్పము ఉదరబంధంగా ఉంది. ఈ విగ్రహము హనుమకొండలోని వేయి స్తంభాల గుడి మంటపములో నిలుపబడిన గణపతిని పోలిఉంది.

# 31. సుల్తానాబాద్ (గుడిమెట్టపల్లె)

సుల్తానాబాద్ గ్రామములో ఒక భాగముగా నున్న గుడిమెట్టపల్లి పెద్దపెల్లికి పోవు జాతీయ రహదారి ప్రక్కనే ఉంది. సుల్తాన్‌బాద్‌కు 1 కి.మీ. దూరములో నున్న ఇచటి దిబ్బ (Mound) ఒక తొలిచారిత్రక యుగపు (Early historical site) ప్రదేశము. ఇచట నల్లని ఎర్రని రంగుగల కుండ ముక్కలు, పెంకులు (Black and Red ware pottery) దొరకుతాయి. సుల్తానాబాద్, పెద్దపెల్లి ప్రాంతము లందు అనేక గ్రామాలలో తొలి చారిత్రకయుగపు అవశేషాలు లభిస్తాయి. ఇచట శిథిలావస్థలో నున్న కాకతీయుల కాలపు శివాలయముంది.



అంతరాళ ద్వారము



మంటప స్తంభము

## శివాలయము

జాతీయ రహదారి ప్రక్కనే నున్న భూములలో ఈ దేవాలయము ఉత్తరపు ముఖమును కలిగి ఉంది. గర్భగృహము, అంతరాళము, పదహారుస్తంభముల ముఖమంటపము ఈ దేవాలయపు ప్రధానాంగములు. దేవాలయపు గోడలు శిథిలమగుచున్నాయి. గోడలోని బయటపొర (Outer shell) పడిపోగా లోపొర (Inner Shell) శిలాఫలకములు తెఱవబడి కనిపిస్తున్నాయి. గర్భగృహముపై నుండిన శిఖరము శిథిలమై అదృశ్యమైంది. మంటపము చుట్టూ పిట్టగోడ (Parapet wall) యుండి ఉత్తర, తూర్పు, పడమరల యందు ప్రవేశములున్నాయి. మంటపము యొక్క పడమటి భాగము పూర్తిగా కూలిపోయింది. నిలిచియున్న భాగములందు లోకప్పు లుపవితానరీతిలో (కదలికాకరణ) త్రికోణఫలకములతో, చదరపు ఫలకముతో మూయబడింది. మధ్యనున్న చదరపు ఫలకములు విరబూసిన పద్మములతో అలంకరింపబడినాయి. కాకతీయుల నిర్మాణపు రీతిలో నున్న అంతరాళపు ద్వారమున కిరువైపుల జాలికిటికీలు ధారాళముగా వెలుతురు గాలి లోనికి ప్రవేశించుటకై నిలుపబడినాయి. ద్వారపు శాఖల క్రింద పూర్ణకుంభములు చెక్కబడినాయి. గర్భగృహద్వారపు శాఖల క్రింద శైవద్వారపాలకులు, లలాటమున గజలక్ష్మి

బహురమ్యముగా కన్పట్టును. పతంగము (Lintel) పైన ముందుకు విస్తరించియున్న చూరు (Projecting cornice) గుండ్రని శిల్పగోళములతో అలంకరింపబడింది. తోరణము (Architrave) నందు శిఖర అంతస్తులు (turrets) మలచబడినాయి. మంటపములో కాకతీయ శిల్పరీతులలో గల నంది ముఖము చెదరగొట్టబడింది.

క్రీ.శ. 1897లో ఎల్గందల్ జిల్లా కేంద్రముగా నున్నప్పుడు ఆనాటి తొమ్మిది తాలూకాలలో సుల్తానాబాద్ ఒకటి. ఆఱవ నిజాం మీర్‌మహబూబ్ అలీఖాన్ కాలములో జిల్లాల పునర్వ్యవస్థీకరణ జరిగినప్పుడు 1905లో జిల్లాకేంద్రము ఎల్గందల్ నుండి కరీంనగరమునకు మార్చబడింది. కరీంనగర్ జిల్లాలో గూడా సుల్తానాబాద్ తాలుకా కేంద్రముగా ఉండేది. నేడు ఇది ఒక మండలకేంద్రము.

## 32. విలాసాగర్

కరీంనగర్‌కు పడమట 25 కి.మీ. దూరములో బోయినపల్లి మండలములో నున్న గ్రామమే విలాసాగర్. కుదుర్పాక చౌరస్తా నుండి ఈ గ్రామమును చేరవచ్చు. గ్రామము మధ్యలో గల అందమైన త్రికూటాలయము తూర్పు ముఖమును కలిగి ఉంది. దేవాలయ ప్రాంగణములో నున్న ఒక శిలాఫలకముపై కాకతి ప్రతాప రుద్రదేవుని కాలపు క్రీ.శ. 1302 శాసనము అఱిగిపోయి ఉంది. శక సంవత్సరము 1224 శుభకృత్సంవత్సర పుష్యమాసము మాత్రము అగబడుచున్నాయి. మిగిలిన వివరములు అస్పష్టము. మల్యాల వంశనామము ఇందులో పేర్కొనబడింది[155]. మల్యాల, విరియాల వంశముల నాయకులు కాకతీయుల సేనానులుగా నుండిరి. ఈ గ్రామంలో కాకతీయుల కాలపు పెద్దచెఱువుంది.

### త్రికూటాలయము

దేవాలయపు ముఖమంటపమునకు పడమట,ఉత్తర,దక్షిణములందు గర్భగృహములు, వాటి ముందు అంతరాళములున్నాయి. తూర్పున నున్న ప్రవేశ మంటపము (porch) ద్వారా లోనికి ప్రవేశింప వచ్చు. ఈ దేవాలయమునకు ఉపపీఠము లేదు. అధిష్ఠాన భాగము కొంత నేలలో మునిగిఉంది. ప్రస్తుతము రెండు పట్టికలు కనిపించుచున్నాయి. మొదటిపట్టిక ఊర్ధ్వ ముఖ అర్ధచంద్రాకారపు శిల్పములతో, పై పట్టిక అధో ముఖ అర్ధచంద్రాకారపు గోళములతో (inverted semicircular stones) అలంకరింపబడినాయి. అధిష్ఠానముపై సాదాగోడలు (plain walls) లేచినాయి. ప్రతిగర్భగృహపు గోడలచుట్టూ చతుర్దళ పద్మశిల్పములతో గూడిన వరుస ఒక కంపము (fillet) రూపములో నడుచుచున్నది. గోడలపైన రెండు వరుసల కపోతముంది. మూడు గర్భగృహములపై నున్న శిఖరములు మెట్లతో గూడిన పిరమిడ్ (stepped pyramidal form) రూపములో ఉన్నాయి. ఒక్కొక్క శిఖరములోని పదిమెట్లు పైకి పోనుపోను పరిమాణములో

చిన్నవగుచు చివరలో కలశమును మోయుచున్నవి. ఈ శిఖరములు ఇటుక నిర్మాణములు. ఇవి కర్ణాటక కదంబుల దేవాలయముల శిఖరములను పోలిఉన్నాయి[156]. కాకతి రెండవ ప్రోలరాజు మంత్రి బేతన అర్ధాంగి మైలమ హనుమకొండలో నిర్మించిన పద్మాక్షి దేవాలయపు శిఖరము గూడా ఇదే మాదిరిగా ఉంది[157].



త్రికూటాలయము

ముఖమంటపము 24' అడుగుల చతురస్రము. ప్రవేశమంటప (Porch), ముఖమంటప, అంతరాళముల మరియు గర్భగృహముల లోకప్పు లుపవితాన (కదలికాకరణ) రీతిలో కప్పబడింది. గర్భగృహములు, అంతరాళములు ఒకే రీతిలో 8'-8" x 8' కొలతలతో నిర్మింపబడినాయి. మూడు గర్భగృహములందు శివుడు లింగరూపమున ప్రతిష్ఠింపబడినాడు. 2'-4" ఎత్తుగల వేదిక (pedestal) పై నున్న లింగము ఎత్తు 1'-3" మరియు చుట్టుకొలత 3'-10". అంతరాళముల ద్వారములకు ఇరువైపుల పొడువైన జాలికిటికీలు పద్మశిల్పములతో అలంకరింపబడినాయి. గర్భగృహముల ద్వారముల త్రిశాఖల క్రింది భాగమున గల శైవద్వారపాలకులకు ఇరువైపుల చామరధారిణులు అందంగా మలచబడినారు. లలాటములందు గజలక్ష్మి చెక్కబడింది. పతంగముపైన ముందుకు విస్తరించియున్న చూరు (Projecting cornice) ఉండగా తోరణము (Architrave) అంతస్తుల శిఖరములతో (turrets) అలంకరింపబడింది.

విలాసాగరము నుండి కుదుర్పాకకు పోవు మార్గమున ఐదు అడుగుల ఎత్తు గల రెండు శిలాఫలకములపై వీరగల్లుల (Hero stones) ప్రతిమలు అందముగా మలచబడిఉన్నాయి.

## 33. చిట్టాపూర్

కరీంనగర్‌కు వాయువ్యము నందు 80 కి.మీ. దూరములో చిట్టాపూర్ గ్రామము మల్లాపూర్ మండలములో ఉంది. మెటుపెల్లి నుండి లేదా కోరుట్ల నుండి 10 కి.మీ. దూరములో నున్న ఈ గ్రామమును బస్సుద్వారా జేరవచ్చు. దీనికి ప్రక్కన నొక వాగు ప్రవహిస్తుంది. ఈ

వాగు ఒడ్డున ఒక త్రికూటాలయముండేది. కాని నేడు అది శిథిలమై ఆనవాళ్లు లేకుండా పోయింది. ఒక శతాబ్దము పూర్వమే స్థానిక వెలమదొర ఒకరు ఈ త్రికూటాలయపు రాళ్లను అతని భవన నిర్మాణమునకై వాడినట్లు స్థానికుల కథనము. గుంటూరు జిల్లాల్లోని అమరావతి స్థూపపు రాళ్లను అచటి స్థానిక పాలకుడు ఇదే విధంగా ఉపయోగించుకొనినట్లు తెలుస్తుంది. ఈ త్రికూటాలయ స్థలము నందుండిన కాకతి ప్రతాప రుద్రదేవుని కాలపు (క్రీ.శ. 1295-1323) స్తంభ శిలా శాసనము అదే గ్రామములో నున్న హనుమాన్ తోటకు తరలింపబడింది. నాలుగు వైపుల చెక్కబడిన ఈ శాసనము ప్రస్తుతము హనుమాన్ తోటలోనే నిలిచిఉంది. ఈ తెలుగు శాసనమునకు మొదటి ప్రక్కలో 1 నుండి 33 పంక్తులు, రెండవప్రక్కలో 34-66 పంక్తులు, మూడవప్రక్కలో 67-97, నాలుగవ ప్రక్కలో 98 నుండి 115 పంక్తులు చెక్కబడినాయి. ఇది తేదీలేని శాసనము. కాని శక సంవత్సరము శోభకృత్ ఫాల్గుణ శుద్ధ సోమవారము నాడు ఈ శాసనము వేయబడిందని అఱిగిపోయిన మొదటిప్రక్క పంక్తులలో ఉంది. తిథిమాత్రము అఱిగిపోయి తెలియుటలేదు[158].

చిన్న పరియల స్థలమందు గల పెద్దపరియల మహామండలేశ్వరుడగు (నాయంకారుడు) చిన్ని రుద్రదేవుని ప్రశస్తి ఈ శాసనమందుంది. చిన్న పరియల నామమే క్రమముగా నేటి చిట్టాపూర్‌గా మారియుండవచ్చు. చిట్టాపురము సమీపములో నున్న శ్రీపురము (నేటి సిరిపురము) ధర్మపురము (నేటి ధర్మారం) గ్రామముల ప్రసక్తి ఈ శాసనమందుంది. బైరిసెట్టియనునతడు సకల సముద్రమను చెఱువు కట్ట యొక్క ఎత్తును పెంచి దాని సమీపమున ఒక త్రికూటాలయమును నిర్మించాడు. వాటిలో సకలేశ్వర, బైరేశ్వర, నాగేశ్వర దేవరలను ప్రతిష్ఠించాడు. అతడు చెఱువుకట్ట ఎత్తును పెంచిన ఫలితంగా అదనంగా సాగులోనికి వచ్చిన భూములపై వచ్చు ఆదాయములో మూడవవంతు దేవరలకు, మిగిలిన రెండువంతులు చక్రవర్తికి చెందునని ఈ శాసనమునందు పేర్కొనబడింది. చిట్టాపూర్ గ్రామమునకు ప్రక్కననున్న పెద్ద చెరువే ఆనాటి సకల సముద్రమై ఉంటుంది. కాకతి ప్రతాపరుద్రదేవుడు ఈ గ్రామమును సందర్శించి ఇచటి దేవతలకు భూదానములు ఇచ్చినట్లు తెలుస్తుంది. దురదృష్టవశాత్తు నేడు ఇచటి త్రికూటాలయము శిథిలమై అదృశ్యమైంది. వాగుకు కొంతదూరములో పునాదుల ఆనవాళ్లు మాత్రమే కనిపిస్తున్నాయి.

## 34. తిమ్మాపూర్

కరీంనగరము నుండి జగిత్యాల మీదుగా 81 కి.మీ. దూరములో ధర్మపురి మండలములో గల గ్రామమే తిమ్మాపూర్. జగిత్యాల నుండి లక్షెటిపేటకు పోవు జాతీయ రహదారిపై 31 కి.మీ. దూరములో ఉంది. ధర్మపురి నుండి 4 కి.మీ. రాయి వద్ద జాతీయ రహదారి ప్రక్కనే ఒక పెద్ద పరపు బండపై శిథిలమైన త్రికూటాలయముంది. ఈ ఆలయము గోదావరికి దక్షిణమున ఒక ఫర్లాంగు దూరములో తూర్పు ముఖమును కలిగి ఉంది. దేవాలయము చుట్టూ వ్యవసాయపు భూములున్నాయి. ఇచటి దేవాలయ నిర్మాణమునకై స్థానిక ఎఱ్ఱ ఇసుకరాయి (Red sandstone)

వాడబడింది. నేల నుండి ఆరు అడుగుల ఎత్తున ఒక సువిశాలమైన రాయిపై కట్టబడినందున (on a big rock) ఈ దేవాలయమునకు అధిష్ఠానము లేదు. రాయిపై నుండియే నేరుగా 6' అడుగుల ఎత్తు వరకు గోడలు లేచినాయి. తూర్పుననున్న మెట్ల ద్వారా 17' చతురస్రాకారపు ముఖమంటపమును చేరవచ్చు. పడమట, ఉత్తర దక్షిణములందు మూడు గర్భగృహములు వాటి ముందు చిన్న అంతరాళములున్నాయి.



త్రికూటాలయము

ముఖమంటపము యొక్క లోకప్పు చదునుగా ఉంది. మధ్యలో మాత్రము లుపవితాన రీతిలో ఉంది. పడమటి గర్భగృహములో శివుడు లింగరూపమున ప్రతిష్ఠింపబడినాడు. ద్వారపు శాఖల క్రింద శైవద్వార పాలకులుండగా లలాటమున గజలక్ష్మి ఉంది. ఉత్తరపు ఆలయములో ఒక ద్వారము తప్ప మిగిలిన దంతయు శిథిలమైంది. దక్షిణపు ఆలయములో అంతరాళముతో కూడిన ద్వారములు నిలబడిఉన్నాయి. మిగిలినదంతయు కూలి పోయింది. ఉత్తర దక్షిణములందు గల ద్వారముల క్రింది భాగమున పూర్ణకుంభములున్నాయి. మూడు గర్భగృహములకు ముందున్న అంతరాళములు ఒకే రీతిలో 2'-4" x 6'-4" కొలతలతో ఉన్నాయి. పడమటి గర్భగృహముపై నున్న శిథిలమగుచున్న శిఖరము మెట్లతో కూడిన పిరమిడ్ ఆకారము (stepped pyramidal form) లో ఉంది. ఈ త్రికూటాలయము వద్ద శాసనముగాని విడి శిల్పప్రతిమలు గాని లేవు. మంటపములో మాత్రము పానవట్టముతో కూడిన లింగముంది. ఇచటి అందమైన నంది విగ్రహము ధర్మపురికి తరలింపబడినట్లు తెలుస్తుంది.

## 35. పెద్దంపేట

కరీంనగర్‌కు ఈశాన్యమునందు 60 కి.మీ. దూరంలో రామగుండం మండలంలో నున్న కుగ్రామమే పెద్దంపేట. ఇది రాయిదండి యొక్క హ్యామ్లెట్ గ్రామము. ఇది రామగుండం నుండి కేవలము 5 కి.మీ. దూరములో ఉంది. పెద్దంపేట గ్రామమునకు దక్షిణమున గల పెద్దదేవుళ్ల గుట్ట పై శిథిలమైన దేవాలయపు ద్వారబంధములు, అందమైన చెక్కడములతో గల

స్తంభము, పెద్దనంది విగ్రహము, నల్లసరపురౌతు (Basalt) తో మలచబడిన లింగము, ధ్వజస్తంభపు ముక్కలు మున్నగునవి చిందరవందరగా పడిఉన్నాయి. ఇచట శివాలయముతో పాటు ఒక వైష్ణవాలయము కూడా ఉండెనని తెలుస్తుంది[159]. ఇచటి వైష్ణవాలయమునకు చెందిన అందమైన యక్షిణి విగ్రహమొకటి హైదరాబాద్ మ్యూజియంనకు తరలించబడింది. ఇంకొక అందమైన వేటకత్తె విగ్రహము శిథిలమైన ద్వారపు ముక్కలు కరీంనగరము మ్యూజియంలో నిలుపబడినాయి.

ప్రతిమాశిల్పములు

**యక్షిణి:-** యౌవ్వనము తొణకిసలాడుచూ అందములొలకించు సుందరమైన ఈప్రతిమ యొక్క నితంబములు లావుగా ఉన్నాయి. సన్నని నడుముతో స్తనభారముతో ఈ శిల్పము చూపరులను తన్మయులను చేస్తుంది. పైకెత్తిన హస్తములు ఆమె తలపై భాగమున సొగసుగా కలుపబడినాయి. మోచేతులు సన్నగా నుండి బాహువులు లావుగా ఉన్నాయి. అంగసౌష్ఠవము ఆమె జీవితములోని ఆనందాతిశయమును తెలుపుతుంది. ప్రస్తుతమీ సుందరశిల్పము హైదరాబాద్ మ్యూజియం నందుంది.



వేటకత్తె



శిథిల స్తంభము

**వేటకత్తె** (Huntress) :- ఎర్ర ఇసుకరాయితో మలచబడిన ఈ సుందరశిల్పము కరీంనగరము మ్యూజియంలో నిలిచి ఉంది. ఈ వేటకత్తె ధరించిన విల్లు చెదరిపోయి అదృశ్యమైంది. ఈమె ముఖము కొంత చెదరి పోయింది. కుడిచేయి సాంతము పోగా ఎడమచేతి ముంజేతి పై భాగము కొంత విరిగిపోయింది. ఆమె ఎడమవైపున భుజము వద్ద ధనుస్సు పై భాగపు వక్రరేఖ (curve) కనిపిస్తుంది. ఆమె కుడివైపున క్రింది భాగమున నున్న కోతి ఆమెను నగ్నపరచుటకై చీరె చెంగులు లాగు చుండుగా ఆమె ఎడమచేతితో వాటిని పైకిలాగు చున్నది. ఆమె ప్రయత్నము విఫలము

కాగా జననేంద్రియము బయటపడింది. ఆమె నడుము సన్నగా నుండి ఎత్తైన బరువైన స్తనములతో చూడముచ్చటగా ఉంది. మర్కటములు, భామామణులు చెంగులులాగుట కాకతీయ శిల్పములలో సర్వసాధారణము [160].

**ద్వారపు శిథిలములు** :- పెద్దంపేట నుండి తెచ్చిన త్రిశాఖల క్రింద శైవద్వారపాలకుదున్న ద్వారపు భాగము, అడుగున స్త్రీ రూపమున్న వేరొక ద్వారపు భాగము రెండునూ కరీంనగరము మ్యూజియంలో నిలుపబడినాయి.

## 36. ఎల్గేడు

కరీంనగర్‌కు ఈశాన్యంగా 20 కి.మీ. దూరంలో కొత్తగా మండలకేంద్రంగా ఏర్పడిన గ్రామమే ఎల్గేడు. ఇది సుల్తానాబాద్‌కు పడమటగా 10 కి.మీ. దూరములో ఉంది. ఎల్గేడు చెఱువు ప్రక్కన గల రామలింగేశ్వరాలయం తూర్పుముఖంగా ఉంది. ఇచట కాకతీయ ప్రతాపరుద్రదేవుని కాలపు శిలాశాసనముంది[161]. శక సంవత్సరము ప్లవ ఆషాఢశుద్ధ 15 గురువారము సరియగు తేది క్రీ.శ. 1301 జూన్ 27 రోజున తెలుగులో వేయబడిన ఈ స్తంభ శాసనం మొదటి ప్రక్కలో 1 నుండి 15 పంక్తులు, రెండవప్రక్కలో 16-26, మూడవ ప్రక్కలో 27-34, నాలుగవ ప్రక్కలో 35 నుండి 47 పంక్తులు చెక్కబడినాయి. కాకతి ప్రతాపరుద్ర దేవుని రాణి లకుమాదేవి ఆమె తండ్రి పాల్దేవనాయినిం గారి పుణ్యగతికై రామనాథ దేవరకు పన్ను, కానిక, కట్నము, మున్నగు స్థానిక సుంకములను దేవరకు దానముగా ఇచ్చింది. పాడి పశువులపై 'పుల్లరి' అనే పన్ను లేకుండా, దానిని దేవవృత్తిగా ఇచ్చింది. పుల్లరి అనగా పచ్చిక బయళ్లపై విధించు పన్ను.



గణపతి



రామలింగేశ్వరాలయ స్తంభము

### రామలింగేశ్వరాలయము

సాదాగా నిర్మించబడిన ఈ దేవాలయము కాకతీయుల కాలము కంటే పూర్వముదై ఉంటుంది. ఈ దేవాలయ గర్భగృహము పది అడుగుల చతురస్రముగాను అంతరాళము 6'x8"

కొలతలతోనూ ఉన్నాయి. పదహారుస్తంభముల ముఖమంటపము చుట్టూ పిట్టగోడతో తూర్పున ప్రవేశమార్గము కలిగి ఉంది. మంటపానికి ఉత్తరాన మరో చిన్నగుడి గర్భగృహము, అంతరాళములతో ఉంది. దీనిలో డమరుకము, త్రిశూలము ధరించిన దేవి విగ్రహముంది. మంటపము ఉత్తరదిశలో నున్న చిన్నగుడికి ఎడమ ప్రక్క గల కుడ్యస్తంభముపై పద్మాసనములో ధ్యానముద్ర యందున్న జైన తీర్థంకరుని శిల్పము చాలా అందంగా మలచబడింది. ప్రధానాలయ శిఖరం, దేవి గుడిపై నున్న శిఖరం రెండునూ మెట్లతో గూడిన పిరమిడ్ ఆకారములో ఉన్నాయి. చాళుక్యుల కాలపు నంది, మకుటము లేకుండా ఏనుగుతలను కలిగిన రెండు చేతుల గణపతి విగ్రహములు చూడ ముచ్చటగా ఉన్నాయి. ఈ ఆలయానికి ఉత్తరాన కొంత దూరంలో రామాలయముంది.

# 37. కాశీపేట

కాశీపేట మంథని మండలంలోని ఒక చిన్న గ్రామము. ఇది మంథనికి వాయువ్యంగా 15 కి.మీ. దూరంలో గోదావరికి సమీపంలో ఉంది. మంథని నుండి గుంజపడిగె ద్వారా ఈ గ్రామాన్ని చేరవచ్చు. కానీ నేడు ఈ గ్రామము అచట కానరాదు. ఏ కారణము చేతనో అదృశ్యమైంది. గోదావరి వరదల వలన గాని, కరవు కాటకముల వలన గాని, యుద్ధములు లేదా అంటువ్యాధుల వలన గాని లేదా ఏ ఇతర కారణము చేతనో గ్రామము ఇచటి నుండి తరలి యుండవచ్చు. ప్రస్తుతం గోదావరికి సమీపాన దేవాలయముల సమూహము తప్ప మరేమి ఇచట కానరాదు. గుంజపడిగె నుండి 3 కి.మీ. కాలినడకన పోయినచో కాశీపేట దేవాలయములను చేరవచ్చు. కాశీపేట ఒక తొలిచారిత్రకయుగపు ప్రదేశము. అచట అనేక దిబ్బలున్నాయి. ఈ దిబ్బలందు నల్లని,ఎర్రని రంగులలో గల కుండ పెంకులు మరియు శాతవాహనుల కాలపు ఇటుకముక్కలు ఇప్పటికీ బయటపడుతూనే ఉంటాయి.

## ప్రధానాలయము (ద్వికూటాలయం)

ప్రహారీగోడల మధ్య నున్న ఈ ప్రధానదేవాలయము తూర్పు ముఖంగా ఉంది. ఈ దేవాలయంలో ఒక దాని ప్రక్క మరొకటి గల రెండు గర్భగృహములలో ఒకటి వైష్ణవ గర్భగృహము, రెండవది శైవ గర్భగృహము. వైష్ణవ గర్భగృహమునకు ఎదురుగా నున్న తూర్పు ప్రాకారపు గోడ (Entrance) ప్రవేశముతో ఉంది. ఇలాంటి ప్రవేశమే శైవ గర్భగృహమునకు ఎదురుగా ఉండేది. కాని నేడు అది కానరాదు. ఇతర దిశలయందు ప్రహారీగోడ కూలిపోయింది. ఈ రెండు గర్భగృహాలకు కలిపి వాటి ముందు ఒకే అంతరాళముంది. అంతరాళం ముందు గల సువిశాల ముఖమంటపమునకు తూర్పు, ఉత్తర, దక్షిణములందు ప్రవేశ మంటపాలున్నాయి. ఈ ముఖమంటపంనకు వాయువ్య, నైఋతి దిశలలో రెండు చిన్న గుడులున్నాయి. ఈ దేవాలయపు గర్భగృహములపై నున్న ఇటుకతో నిర్మించిన శిఖరములు శిథిలమౌతున్నాయి.



ప్రధాన ఆలయ శిఖరములు



స్తంభముపై స్త్రీరూపము

మంటపంలో ఆరువరుసలలో ఒక్కొక్క వరుసయందు ఐదు చొప్పున మొత్తము 30 స్తంభాలున్నాయి. వీటికి అనుబంధంగా మంటపము చుట్టూ పిట్టగోడపై అర్థస్తంభములు అదనంగా కనిపిస్తాయి. స్తంభం యొక్క ఉపరితలములందు నర్తకీమణులు, వేటకత్తెలు, హస్తములందు కలశము గల స్త్రీరూపము, ఒక స్త్రీ కూర్చొనియున్న పల్లకిని ఇరువైపుల మోయుచున్న ఆడవారు, హస్తములను జోడించి నమస్కరించుచున్న భక్తుడు, గోపికావస్త్రాపహరణము, మున్నగు దృశ్యాలు చాల అందంగా చెక్కబడినాయి. కాళ్లను ఒక దానికొకటి అడ్డముగా నిలుపుకొని నగ్నముగా నిలబడియున్న యువతి కుడిచేతితో వక్షోజములను, ఎడమచేతితో యోనిభాగమును దాయుచున్నట్లుగా చెక్కబడిన స్త్రీరూపములు సందర్శకుల దృష్టినాకర్షిస్తాయి. ఒకదానికొకటి పెనవేసుకొనిన నాగములు ఏనుగు, సింహం, లేడి మున్నగు జంతువుల శిల్పములు స్తంభాలకు శోభను చేకూరుస్తున్నాయి.

### రామాలయం

ప్రధానాలయానికి దక్షిణమున కొంతదూరంలో ఈ ఆలయం తూర్పు ముఖంగా ఉంది. ప్రస్తుతం ఇందులో సీతారాముల విగ్రహముంది. కూర్చొనియున్న శ్రీరాముని ఎడమకాలిపై సీతాదేవి ఆసీనురాలై ఉంది. శ్రీరాముడు అతని ఎడమచేతిని దేవి నడుముచుట్టూ చాచి యుండగా కుడిచేయి అభయముద్రలో ఉంది. రాముని వెనుక గల మకరతోరణముపై దశావతారములు చెక్కబడినాయి.

## 38. ముల్కనూరు

హుజురాబాద్ నుండి ఎల్కతుర్తి ద్వారా హుస్నాబాద్‌కు పోవు రహదారి ప్రక్కన భీందేవరపల్లె మండలములో నున్న గ్రామమే ముల్కనూరు. ఇచటి కుమ్మరివాడలో గల శివాలయము తూర్పు ముఖంగా ఉంది. ఈ దేవాలయమందు గర్భగృహము, అంతరాళము,

పదహారు స్తంభముల ముఖమంటపము గలవు. ఇక్కడ ప్రాచీనమైన గణపతి, దేవి విగ్రహాలున్నాయి. ఇచటి దేవీ విగ్రహాలు చతుర్భుజములతో ఉన్నాయి. పై హస్తములలో డమరుకము, త్రిశూలములుండగా క్రింది హస్తములలో ఖడ్గము, గిన్నె ఉన్నాయి.

ముల్కనూరు శైవ క్షేత్రంగానే కాక జైన క్షేత్రంగా కూడా గుర్తింపుపొందింది. నల్లరాతితో మలచబడిన ఇచటి జైన తీర్థంకరుని విగ్రహము కరీంనగర్‌కు తరలించబడింది. పద్మాసనంలో నుండి ధ్యానముద్రలో నున్న ఈ జైన ప్రతిమ ప్రస్తుతము కరీంనగర్ మ్యూజియంలో ఉంది.

ప్రస్తుతము అతి సమర్థవంతంగా నిర్వహించబడుచున్న సహకార బ్యాంక్ సేవలకు ముల్కనూరు సుప్రసిద్ధము.

## 39. నంచెర్ల

కరీంనగర్‌కు ఉత్తరాన పెగడపెల్లి మండలంలో గల నంచెర్లను బసుద్వారా జేరవచ్చు. జగిత్యాలకు తూర్పున 24 కి.మీ. దూరంలో గల ఈ గ్రామాన్ని మల్యాల ద్వారా లేదా గొల్లపెల్లి ద్వారా చేరవచ్చు. గ్రామం మధ్యలో నున్న రామాలయం తూర్పు ముఖంగా ఉంది. గర్భగృహము, అంతరాళము, ముఖమంటపము ఈ దేవాలయపు ప్రధానాంగములు. ప్రప్రథమములో కేవలము గర్భగృహము, దాని ముందు రెండు స్తంభములపై నిలిచియున్న ప్రవేశమంటపము మాత్రమే నిర్మింపబడినట్లు కనిపిస్తుంది. ఎందుకనగా పోర్చ్ యొక్క రెండు స్తంభములు మరియు గర్భగృహములో నాలుగు మూలలందు గల నాలుగు స్తంభముల నిర్మాణము ఒకే రీతిలో ఉంది. ఇప్పుడున్న అంతరాళమునకు ఉత్తర, దక్షిణములందు గల రెండు గర్భగృహములు మరియు ముఖమంటపము కాకతీయుల కాలపు నిర్మాణాలై ఉంటాయి. గర్భగృహం మరియు దాని ముందున్న ప్రవేశ మంటప నిర్మాణములో చతురస్రాకారములో చదును చేయబడిన పొడుగాటి శిలలను వాడినారు. కాని తరువాత కట్టిన గర్భగృహములకు వాడిన రాయి పరిమాణములో చాలా చిన్నదిగా ఉంది. బాహ్యంగా చూచినప్పుడు ఈ దేవాలయం ఒక త్రికూటాలయం వలె ఉంటుంది. కాని తదితర త్రికూటాలయములలో వలె మధ్యలో ముఖమంటపం లేదు. నగునూరు, కొత్తపెల్లిలోని దేవాలయముల వలె ఈ దేవాలయానికి నక్షత్రాకారపు ప్రదక్షిణాపథం కానరాదు.

దేవాలయ అధిష్ఠానము వర్గములు లేకుండా సామాన్యంగా ఉంది. దీనిపై లేచిన గోడలను రెండు వరుసలలో నున్న కపోతము శిఖరము నుండి వేరుచేస్తుంది. ప్రధాన గర్భగృహం పై నున్న శిఖరము మెట్లతో గూడిన పిరమిడ్ ఆకారములో ఉంది. మిగిలిన రెండు గర్భగృహములపై శిఖరములు కానరావు. ముఖమంటపము తూర్పుపడమరలుగా 26' ఉత్తర దక్షిణములుగా 28' కొలతలతో ఉంది. మంటపము యొక్క తూర్పు భాగము 10' మేరకు కూలిపోయింది. మంటపం యొక్క మధ్యభాగంలో కొంత ఎత్తు చేయబడిన వృత్తాకారపు రంగశిల రమ్యంగా ఉంది.

అంతరాళ ద్వారపు త్రిశాఖల క్రింది భాగమున గల వైష్ణవద్వారపాలకులకు ఇరువైపుల చామరధారిణులు మలచబడినారు. ఈ ద్వారపు లలాటమున గజలక్ష్మి, తోరణము నందు అంతస్తుల శిఖరములు అందంగా చెక్కబడినాయి. గర్భగృహపు ద్వారము ఎలాంటి అలంకారము లేక సాదాగా ఉంది. ఈ దేవాలయ ప్రధాన గర్భగృహము 14' అడుగుల చతురస్రము. గర్భగృహములో తొలిచాళుక్యుల కళారీతులలో నాలుగు మూలలందు గల నాలుగు స్తంభముల మరియు గోడ మధ్య ఒకటిన్నర అడుగుల వెడల్పుతో ప్రదక్షిణాపథముంది.



రామాలయము



కృష్ణ విగ్రహము

గర్భగృహములో కూర్చొని యున్న శ్రీరాముని ఎడమకాలి తొడపై సీతాదేవి ఆసీనురాలై ఉంది. శ్రీరాముని కుడిహస్తము అభయముద్రలో నుండగా వామహస్తము దేవి నడుముచుట్టూ చాచి ఉంది. రాముని వెనుక గల మకరతోరణము నందు లతాహారపు వలయములలో దశావతారములు అందంగా మలచబడినాయి. లక్ష్మణ, భరత, శతృఘ్న, అంజనేయ విగ్రహములు గర్భగృహంలో ఉన్నాయి. ఉత్తరపు గర్భగృహములో బలరామ, దక్షిణపు గర్భగృహములో శ్రీకృష్ణుని విగ్రహములు చూడవచ్చు.

## 40. గంభీరావుపేట

కరీంనగర్‌కు నైఋతిగా 80 కి.మీ. దూరంలో నున్న గంభీరావుపేట నేడొక మండలకేంద్రము. ఈ గ్రామమును సిరిసిల్ల నుండి బస్సుద్వారా జేరవచ్చు. దీనిని గంభీర్రావుపేటయని కూడా పిలుస్తారు. ఈ గ్రామము మానేరు నదికి 1 కి.మీ. దూరంలో ఉంది. మానేరు నది వైపు తూర్పుముఖమును కలిగియున్న రెండు దేవాలయములు ఒకే రాతి ప్రాకారంలో ఒకదాని ప్రక్కకు ఇంకొకటి నిలిచి ఉన్నాయి. ఈ రెండు దేవాలయాలకు వేర్వేరు ప్రవేశద్వారాలున్నాయి. ప్రతి ప్రవేశద్వారమునకు రెండంతస్తుల మంటపముంది. మంటపక్రింది అంతస్తులో 12, మీది అంతస్తులో వీటి పైననే లేచిన 12 స్తంభాలున్నాయి. చాళుక్యుల

కళారీతిలోనున్న ఇలాంటి రెండంతస్తుల మంటపమొకటి మెదక్ జిల్లాలో సిద్దిపేట నుండి హైదరాబాద్‌కు పోవు రాజీవ్ జాతీయ రహదారి ప్రక్కననున్న దుద్దెడ గ్రామంలోని శివాలయము ముందు చూడవచ్చు. గంభీరావుపేట దేవాలయములలో విడిప్రతిమలుగాని ఎలాంటి శాసనములుగాని లేవు. రెండు దేవాలయాలు గూడా శిథిలావస్థలోనే ఉన్నాయి. చాళుక్యుల కళారీతిలో నున్న ఈ దేవాలయములు పన్నెండవ శతాబ్దమునకు చెందినవని చెప్పవచ్చు.

## ఉత్తరపు శివాలయం

ఈ దేవాలయంలో గర్భగృహం, అంతరాళం, ముఖమంటపం ప్రధానాంగాలు. గర్భగృహము 6'-9" చతురస్రము. అంతరాళం ఉత్తర దక్షిణాలుగా 6'-4" తూర్పు పడమరలుగా 3'-10" కొలతలతో ఉంది. అంతరాళపు ద్వారము ఎత్తు 4'-7" వెడల్పు 2'-3". దీని అడుగుభాగమున పూర్ణకుంభములు చెక్కబడినాయి. సాదాగా నున్న గర్భగృహ ద్వారపు ఎత్తు 4' వెడల్పు 2'-9". తెఱచియున్న ముఖమంటపము పదహారు అడుగుల చతురస్రము. చాళుక్యుల రీతిలో నున్న శిథిలమైన నంది ఈ మంటపములో ఉంది. గర్భగృహములో ప్రస్తుతమేమి లేదు. ఇది బహుశః శివాలయమై యుండవచ్చు. ఎత్తైన నంది స్తంభమొకటి శీర్షభాగమందు విరిగిపోయి ఈ శివాలయం ముందు నిలిచి ఉంది.

## దక్షిణపు వైష్ణవాలయం

గర్భగృహం, అంతరాళం, గోడలచే మూయబడిన ముఖమంటపం దాని ముందు తెఱచియున్న మంటపము ఈ దేవాలయ ప్రధానాంగాలు. కేవలం స్తంభాలతో గోడలు లేకుండా నిర్మించిన మంటప ఉత్తరభాగం శిథిలమైంది. గోడలచే చుట్టబడిన మంటపం పదహారడుగుల చతురస్రం. ఈ మంటపంలోని నాలుగు మధ్యస్తంభములు అందముగా అలంకరింపబడినాయి. వీటి అశ్వపాదము లందు నాలుగు వైపుల నున్న కోష్ఠములలో వివిధ రకములైన దేవతలు మలచబడినారు. శూన్యముగా నున్న గర్భ గృహము 9'-4" చతురస్రం. అంతరాళం ఉత్తర దక్షిణములందు 9'-4" తూర్పు పడమరలందు 5'-3" కొలతలతో ఉంది. ఈ దేవాలయపు ద్వారము యొక్క పతంగము పైన మూడునామాల (Vishnu mark) చిహ్నములుండుట వలన ఇది వైష్ణవాలయమని చెప్పవచ్చు.

గంభీరావుపేట గ్రామములో సీతారామ దేవాలయం, ఎల్లమ్మగుడి ప్రధానమందిరాలుగా పూజలందుకొంటున్నాయి.

# 41. రామగుండం

కరీంనగర్‌కు ఈశాన్యంగా 64 కి.మీ. దూరంలో నున్న రామగుండం నేడొక మండల కేంద్రమే కాక మున్సిపాలిటీ కూడా. కాజీపేట నుండి బల్హార్షా పోవు బ్రాడ్ గేజి రైలు మార్గం

మీద నున్న ఈ పట్టణానికి రైల్వేస్టేషన్ కూడా ఉంది. పవిత్ర గోదావరి తీరాన గల ఈ ప్రదేశము తొలి మధ్యయుగము నుండియే చారిత్రకప్రాధాన్యతను సంతరించుకొంది. ఇచటి రామాలయం మెట్ల వద్దగల శిథిలమైన, అఱిగిపోయిన శాసనములో ఏడరాజు ప్రశస్తి ఉంది[162]. శిథిలమైన ఈ శిలాస్తంభముపై మొదటిప్రక్కలో 13, రెండవప్రక్కలో 5, మూడవప్రక్కలో 13, నాలుగవప్రక్కలో 5 పంక్తుల శాసనాక్షరములు చెక్కబడినాయి. శాసనమంతయు అఱిగి పోయి చాలామట్టుకు వివరాలు తెలియుటలేదు. శాసనమందున్న ఏడరాజు లత్తలూరు పురవరేశ్వర, సువర్ణ గరుడధ్వజ, సత్యనారాయణాది బిరుదులు ధరించియున్నాడు. ఇలాంటి బిరుదులే పొలవాస నేలిన మేడరాజుకు కూడా ఉన్నట్లు పొలాసలోని పులస్త్యేశ్వరాలయము వద్ద గల క్రీ.శ.1108 శాసనం తెలియజేస్తుంది[163]. గోదావరి లోయలో గల పొలవాస మేడరాజు, రామగుండం ఏడరాజు, మంత్రకూటం గుండరాజు పూర్వపు రాష్ట్రకూట సేనానుల సంతతికి చెందినవారు. వీరు ఈ ప్రాంతంలో స్థిరపడి మహామండలేశ్వరులుగా వివిధ ప్రదేశాలను ఏలారు. రామగుండం మహామండలేశ్వరుడైన ఏడరాజు, పొలవాస రెండవమేడరాజు మరియు మంథెన గుండరాజు సమకాలీనులని శాసనాలు తెలియజేస్తున్నాయి. ఈ ముగ్గురు మహామండలేశ్వరులను, కాకతి రెండవ ప్రోలరాజు కళ్యాణి చాళుక్య చక్రవర్తి రెండవ జగదేకమల్లుని సమక్షములో యుద్ధరంగము నందు ఎదురించాడు. ఈ యుద్ధం క్రీ.శ. 1138–1140 మధ్యకాలములో జరిగింది. రెండవ ప్రోలరాజు ముందు నిలువలేక రామగుండం ఏడరాజు యుద్ధరంగం నుండి భయపడి బాలునివలె పరుగెత్తినాడని తరువాత కాలములో వేయబడిన కాకతిరుద్రదేవుని కాలపు క్రీ.శ.1163 వేయిస్తంభాలగుడి శాసనంలో ఉంది[164]. ఈ యుద్ధంలో పొలవాస రెండవ మేడరాజు పారిపోయాడు. అతని సోదరుడు మంథని గుండరాజు శిరచ్ఛేదము గావింపబడినాడు. తరువాత కాలములో ఏడరాజు వివరాలు తెలియవు. మంథని ప్రాంతముతో పాటు బహుశః రామగుండం ప్రాంతము గూడా కాకతి రెండవ ప్రోలరాజు ఆధిపత్యము క్రిందికి వచ్చి ఉంటుంది.

తోరణ ద్వారము

యన్.టి.పి.సి.

## రామాలయం

గర్భగృహం, అంతరాళం, ముఖమంటపం, దాని ముందు ప్రవేశమంటపం ఈ దేవాలయ ప్రధానాంగములు. అధిష్ఠానము యొక్క కంఠభాగము చిన్న చిన్న కుడ్యస్తంభములతో అనేక విభాగములుగా విభజింపబడింది. ఈ విభాగములన్నియు గజ, కేసరి, హంస, చతుర్దళ పద్మశిల్పములతో నింపబడినాయి. గోడలు సాదాగా నుండి శిఖరం మెట్లతో గూడిన పిరమిడ్ ఆకారంలో ఉంది. గర్భగృహంలో ప్రస్తుతం శ్రీరాముడు ప్రతిష్ఠింపబడిఉన్నాడు. ఈ దేవాలయము ముందు నిలిచి యున్న ఎత్తైన స్తంభముపై చిన్న మంటపముంది.

## తోరణద్వారం

ఈ దేవాలయం ముందుకొంత దూరంలో ప్రవేశ తోరణముండుట ఒక ప్రత్యేకతగా చెప్పుకోవచ్చు. ఎత్తైన ఈ శిలాతోరణము తెలంగాణములోని తోరణముల నిర్మాణములో తొలిదశకు చెందింది. అటూ ఇటూ గల రెండు స్తంభములపై విస్తారమైన శిల్పముతో గూడిన అడ్డపుదూలముంది. దీనిలో ప్రబలమైన అలంకారము మకరము గనుక ఇది మకరతోరణము. అడ్డపు దూలము లేదా పతంగము మధ్యలో గల దేవకోష్ఠమునకు ఇరువైపుల నాలుగేసి అందమైన పద్మపు మొగ్గలు వరంగల్ కోటలోని హంసతోరణంలో వలె క్రిందికి వ్రేలాడుచున్నాయి. ఇది చాలా ప్రాచీనమైన తోరణం. ఇది నల్గొండ జిల్లాలోని కొలనుపాక, మెదక్ జిల్లా నందికందిలో గల తోరణాల్ని పోలిఉంది.

వరంగల్ ప్రాంతంలో తోరణాలను నిలుపు సంప్రదాయము హనుమకొండలోని పద్మాక్షి దేవాయము వద్ద ప్రారంభమై, కొలనుపాకలో ఈ ద్వార తోరణము మెరుగై, ఐనవోలులో సుందర పూర్ణరూపము సంతరించుకున్నది. వరంగల్ కోటలోని హంసతోరణముల నిర్మాణము పరాకాష్ఠకు చేరుకొని కాకతీయుల శిల్పకళా ఔన్నత్యమును చాటుతుంది. వాటి శోభ, పరిమాణము, అందము వర్ణనాతీతము[165]. వరంగల్ జిల్లాలోని ఐనవోలులోని తోరణం, వరంగల్ కోటలోని హంసతోరణములు రెండు ప్రక్కలయందు రెండేసి స్తంభములను కలిగి ఉన్నాయి. కాని రామగుండములోని తోరణమునకు ఇరువైపుల ఒక్కొక్క స్తంభము మాత్రమే నిలిచిఉంది. తోరణము చివరన అందమైన సింహముల శిల్పఫలకాలు అమర్చబడినాయి. ప్రస్తుతము ఎడమ ప్రక్క సింహశిల్ప ప్రతిమ ఒక్కటే ఉంది. ఇరువైపుల నిలిచియున్న స్తంభములు పద్మలతా, పశుపక్ష్యాదుల శిల్పములతో కూడిన అనేక శాఖలచే అలంకరింపబడినాయి. ఈ శాఖల క్రింది భాగమున గల ఫలకములపై శైవద్వార పాలకులకు ఇరువైపుల చామరధారిణులు అందంగా మలచబడినారు. ద్వారపాలకులు గల ఈ తోరణపు ప్రత్యేకత వరంగల్, ఐనవోలు తోరణములందు కానరాదు. రామగుండం ద్వారతోరణపు ముందు భాగమువలె దాని వెనుకభాగము గూడా అందమైన శిల్పములతో అలంకరింపబడింది. తోరణము పై నున్న శైవ ద్వారపాలకులను బట్టి అదే

ప్రాంగణములో వేరొక శివాలయముండెనని చెప్పవచ్చు. వేరొక దేవాలయపు శిథిలమైన స్తంభములు తదితర అవశేషములు అదే ప్రాంగణములో పడి యుండుట ఇందుకు తార్కాణము. బోడగుట్టపై ఒక శిథిలాలయముంది.

నేడు రామగుండం N.T.P.C. కేంద్రంగా సుప్రసిద్ధము.

## 42. వెల్లుల్ల

కరీంనగర్‌కు వాయువ్యంగా 90 కి.మీ. దూరంలో నున్న వెల్లుల్ల గ్రామము మెటుపెల్లి మండలములో ఉంది. మెటుపెల్లికి దక్షిణంగా ఇది 5 కి.మీ. దూరంలో ఉంది. గ్రామమునకు దక్షిణమున గల గుట్ట పైనొక నరసింహ దేవాలయముంది. ఇచట చెఱువుతూముపై వెలమనాయకుల శాసన మొకటుంది. ఇది క్రీ.శ.1613 ఎప్రిల్ 15వ తేదీన వేయించిన తెలుగుశాసనం. శాలివాహన శక సంవత్సరము 1535 ప్రమాది వైశాఖ శుద్ధ పంచమి గురువారము రోజున పద్మనాయక శిఖామణి రాజ ఇనుంగంటి తిమ్మజగదేవరాయని కుమారుదు శ్రీ వెంగళ జగదేవుని ముతాలికుండు వెలమకుల వార్ధి చంద్రుండగు జువ్వాడి మాధవరాయుని కుమారుదు దళపతిరాయదు నాగుల తటాకము యొక్క తూమును పుప్పాల అంకయ్య కుమారుదు మిన్నయ్యచే స్థానిక నరసింహస్వామి ప్రీత్యర్థము కట్టించినాడని ఈ శాసనము తెలుపుతుంది[166]. ఈ శాసనమందు ఇనుంగంటి మరియు జువ్వాడి వెలమ వంశస్థుల ప్రసక్తి ఉంది.

### నరసింహ దేవాలయం

వెల్లుల్ల గుట్టపైన ఉన్న నరసింహస్వామి ఆలయము తూర్పుముఖంగా ఉంది. అక్కడ ఉన్న మూడు గదుల ముందు దీర్ఘచదరపు మంటపము ఉంది. పెద్ద పెద్ద గుండ్రాళ్ల మధ్య ఏర్పడిన గుహ ఐదు అడుగుల లోతుంది. అందులో నరసింహస్వామి విడిప్రతిమ ఉంది. అన్ని వైపుల గుండ్రాళ్లున్న గుహకు తూర్పున ద్వారముతో గూడిన గోడ నిర్మింపబడింది. మంటపము యొక్క స్తంభములు మోటుగా ఉన్నాయి. మంటపమునకు ఉత్తరమున చిన్న గుడిలో లోకమాత దేవి విగ్రహముంది. దక్షిణమున నున్న చిన్న గుడిలో కొన్ని శిల్పప్రతిమలు పడి ఉన్నాయి.



నరసింహ దేవాలయము

## హనుమాన్ దేవాలయం

గ్రామంలో నున్న ఆంజనేయ విగ్రహము చుట్టూ నాలుగు వైపుల గోడలు నిర్మించి ఒక చిన్న ఆలయాన్నేర్పరచారు. ఆంజనేయుదున్న పెద్ద గుండ్రాయి పైననే క్రీ.శ. 1665 సం॥పు ఎనిమిది పంక్తుల శాసనముంది[167]. ఇది విశ్వావసు శకసంవత్సరము 1587లో వేయబడింది. మున్నూరికాపు కులశేఖరుడైన అనిశెటి ప్రతాపరావు ముగ్గురు పుత్రులు ప్రతాపరావుకొనయ, వెంకటయ, పోతయజగ్గయలు హనుమాన్ విగ్రహాన్ని ప్రతిష్ఠించినట్లు ఈ శాసనంలో ఉంది. వీరు హనుమంతదాసులుగా పేర్కొనబడినారు. భూపాలుడు తొండయ ఈ పనిని చేపట్టినట్లు తెలుస్తుంది.

## ఎల్లమ్మ

ఉత్తర తెలంగాణాలో వెల్లుల్ల ఎల్లమ్మ దేవత సుప్రసిద్ధము. గ్రామానికి ఉత్తరాన పెద్ద మర్రిచెట్టు క్రింద ఎల్లమ్మ దేవత విగ్రహము నేలపై పడిఉంది. దీనికి ప్రక్కలో నున్న ఒక త్రికోణాకారపు శిల గూడా బహుశః రేణుకాదేవి యొక్క ఛేదింపబడిన తలగా పూజలందుకొంటుంది. ఈ దేవతకు ఇంత వరకూ మందిరము లేదు. ప్రతి మంగళవారము వందలాది కుటుంబములవారు ఈ దేవతనారాధించి వనభోజనం చేసి తిరిగి వెళుతుంటారు.

మాతారేణుక జమదగ్ని మహర్షి ధర్మపత్ని. ప్రతిరోజు ఆమె నదికి పోయి అచటి ఇసుకతోనే ఆమె పాతివ్రత్య మహాత్మ్యము వలన కుండను తయారుచేసి, మునికి నీరు తెచ్చేది. కాని ఒకనాడు నదిలో నొక రాచజంటయొక్క రాసక్రీడలు తిలకించి, మనస్సు వికలమై కుండను తయారుచేయుటకు విఫలమై రిక్తహస్తములతో ఆశ్రమమునకు తిరిగివచ్చింది. అందులకు ముని కోపించి రేణుకను శిరచ్ఛేదము గావించుటకై ఆజ్ఞాపించగా తనయుడైన పరశురాముడు ఆపనిని నిర్వర్తించాడు. ముని సంతసించి కుమారుని వరము కోరుకొమ్మని అడుగగా అతడు తల్లిని తిరిగి బ్రతికించుమని వేడుకొన్నాడు. అది సాధ్యపడదని బదులు చెప్పిన ముని ఛేదింపబడిన రేణుక తల ఎల్లమ్మగాను, తనువు భూదేవిగాను పూజలందుకొనునని వరమిచ్చాడు. ఇది పురాణాల్లో ఉన్న కథ.

కాకతీయుల కాలము నుండియే శాక్తేయ పూజకు అమిత ఆదరణ లభించింది. గంగమ్మ, ఏకవీర, కాకతి, ఇరుకలమ్మ, గౌరి, మహాలక్ష్మి, ఎల్లమ్మ, మైసమ్మ, పోచమ్మ, నాయకురాలు, పోలేరమ్మ మున్నగు పేర్లతో శాక్తేయ పూజ ప్రచారములోనికి వచ్చింది. యాదవులు, గొల్లవారు, కురుమ కులముల వారు నేటికి శక్తి పూజలు జరుపుచున్నారు. కరీంనగర్ జిల్లాలో పోచమ్మ, మైసమ్మ పూజలధికము. భక్తులందరిని బ్రోచే అమ్మ క్రమముగా ప్రోచే అమ్మ, పోచమ్మగా మారియుండును. మహిషాసురుని సంహరించిన అమ్మ మహిషమ్మ క్రమముగా మైసమ్మగా నేడు పూజలందుకొనుట గమనార్హము. చాళుక్యుల, కాకతీయుల కాలపు ఈ ప్రాంతపు

దేవాలయాల్లో అనేక మహిషాసురమర్దని విగ్రహాలున్నాయి. మహిషాసురుని సంహరించిన రోజు దసరాపండుగగా మైసూర్‌లో నేటికి ఘనముగా జరుపటము జగద్విఖ్యాతము.

## 43. దుబ్బరాజన్న (పెంబెట్ల-కోనాపూర్)

కరీంనగర్‌కు ఉత్తరాన 58 కి.మీ. దూరంలో సారంగాపురం మండలంలో పెంబెట్ల-కోనాపురం గ్రామాల సరిహద్దులలో గల దుబ్బరాజన్న జగిత్యాల ప్రాంతములో ఒక సుప్రసిద్ధ క్షేత్రము. జగిత్యాలకు 8 కి.మీ. దూరంలో నున్న దుబ్బరాజన్న దేవాలయమును బస్సుద్వారా జేరవచ్చు. ఇచట పూర్వముండిన చిన్న దేవాలయములో దుబ్బరాజేశ్వర స్వామి లింగ రూపమున ప్రతిష్ఠింపబడినాడు. ప్రస్తుతమున్న దేవాలయము సంపూర్ణముగా నూతన కట్టడము. దుబ్బలో నుండి ఆవిర్భవించిన స్వయంభూలింగము దుబ్బరాజేశ్వర స్వామి పేరుతో మధ్యయుగము నుండి పూజలందుకొంటుంది. ఒకనాడు నిర్మానుష్య ప్రదేశములో నుండిన ఈ దేవాలయము నేడు జన నివాసములతో కళకళలాడుతుంది. జగిత్యాల నుండి లక్ష్మీదేవి పల్లెకు పోవు రహదారికి ఎడమవైపు ఈ దేవాలయముంది. దేవాలయమునానుకొని యున్న రహదారికి ఇరువైపుల నూతన గృహముల నిర్మాణము జరిగి నేడు దుబ్బరాజన్న గ్రామముగా రూపొందింది.



దుబ్బరాజేశ్వర స్వామి దేవాలయము

దేవాలయము ఆవరణలో 15వ శతాబ్దపు తెలుగు లిపి అక్షరములతో ఏడు పంక్తుల శిలా ఫలక శాసనమొకటి నిలిచిఉంది[168]. శకసంవత్సరపు సంఖ్య లేదు. కాని ఇది క్రోధి సంవత్సర వైశాఖ శుద్ధ చతుర్దశి గురువారము రోజున వేయబడినదని తెలుస్తుంది. ధన్నపనేని ఘంటయ ధంసాగి శింగరయ్య గారు సార్వభూముని నరుసయ గారికి ఇచ్చిన క్షేత్రముగా శాసనకంభము తెలుపుతుంది. అక్షరముల లిపిని బట్టి ఇది 15వ శతాబ్దపు శాసనము కాగా అంతకు ముందునుండియే బహుశః కాకతీయుల కాలము పదునాలుగవ శతాబ్దారంభము నుండియే ఇచటి స్వయం భూలింగము పూజలందుకొని ఉంటుంది.

ఈ దేవాలయపు ఆవరణలో పెద్ద శిలాఫలకముల ఉపరితలముపై ఉబ్బుగా మలచబడిన రెండు వైష్ణవద్వారపాలకుల విగ్రహములు చూపరుల దృష్టినాకర్షిస్తున్నాయి. నాల్గు చేతులతో నున్న ఈ ద్వారపాలకులకు ఇరువైపుల చామరధారిణులు అందమైన భంగిమలలో ఉన్నారు. వీరి పైకుడి హస్తము నందు చక్రము వామ హస్తము నందు శంఖము ఉన్నాయి. గదను పట్టుకొనిన వారి రెండు క్రింది హస్తములు విరిగిపోయినాయి. మకుటధారులైన ఈ ద్వారపాలకులు కుండలములు, గ్రైవేయకములు, హారములు, కేయూరములు, కటిబంధము, వనమాల, మోచేతి, ముంజేతి, కాలికడియములు ధరించారు. వీరి పాదములకు నూపురములున్నాయి. ఈ ద్వారపాలక ప్రతిమల సమీపమున గజకేసరి శిల్పములతో కూడిన శిథిల ద్వార పార్శ్వమొకటి నిలుపబడి ఉంది.

# 44. నీరకుల్ల

కరీంనగర్‌కు తూర్పున సుల్తానాబాద్ మండలంలో మానేరునది ఒడ్డున గల కుగ్రామమే నీరకుల్ల. సుల్తానాబాద్‌కు 5 కి.మీ. దూరములో గల ఈ గ్రామమును బస్సుద్వారా జేరవచ్చు. ఇచటి మానేరునదిలో ఒక పెద్దపరపు బండ లేదా గుండ్రాయిపై శ్రీరంగ నాయక వైష్ణవాలయము నిలిచి ఉంది. మానేరు నడుమ గల ఈ దేవాలయము నుండి చుట్టూ తిలకించినచో మనోహరమైన ప్రకృతి దృశ్యములు నయనానందము కలిగిస్తాయి. పరిసరములలో నున్న పొలములు, చిన్న చిన్న గుట్టలు పక్షుల కిలకిలారావములు, దేవాలయము చుట్టూ గల మానేరు నదిలోని తళ తళ మెరిసే అలలు మదకి, హృదికి ప్రశాంతతను చేకూర్చుతాయి. ఇది ఒక అందమైన వనభోజన పర్యాటక స్థలము. ఆలయములో శ్రీరంగనాయక స్వామి ప్రతిష్ఠింపబడినాడు. ఈ దేవాలయ గోడలు సాదాగా నుండి శిఖరము మెట్లతో గూడిన పిరమిడ్ ఆకారములో ఉంది. మంటపములోని స్తంభములు లావుగా, పొట్టిగా, మోటుగా ఉన్నాయి.



శ్రీ రంగనాయక దేవాలయము

ఈ దేవాలయమునకు సమీపమునే మానేరునది ఉత్తరపు ఒడ్డున గల ఒక గుట్టబోరు పై చిన్న దేవాలయముంది. ఈ దేవాలయములో గర్భగృహము, దాని ముందొక

అర్ధమంటపముంది. ప్రస్తుత మిందులో ఏ విగ్రహము లేక శూన్యంగా ఉంది. గర్భగృహద్వారపు లలాటమున గజలక్ష్మి, క్రింది భాగమున పూర్ణకుంభములు చెక్కబడిఉన్నాయి. ఇదే ప్రాంతములో నున్న రెండు చిన్నగుడుల శిఖరములు రెండు మెట్లతో నుండి చదరపు శిలాఫలకముతో కప్పబడినాయి.

# 45. కోటిలింగాల

కరీంనగర్‌కు 65 కి.మీ. దూరంలో పెద్దవాగు గోదావరి నది సంగమస్థానమందు వెలగటూరు మండలంలో నున్న గ్రామమే కోటిలింగాల. కరీంనగర్ నుండి లక్షెటి పేటకు పోవు ప్రభుత్వ రహదారి నుండి 3 కి.మీ. తూర్పున గోదావరినది ఒడ్డుననున్న ఈ గ్రామమును వెల్గటూరు నుండి చేరవచ్చు. వాస్తవమునకు ఇచట కోటి సంఖ్యలో లింగాలు లేవు. శాతవాహనుల కాలపు కోట ఇచటి త్రవ్వకాలలో బయల్పడింది. ఈ కోటలో కోటీశ్వర, సిద్ధేశ్వర లింగములు గల శివాలయముంది. కోటలో లింగములుండుట చేత పూర్వము ఇది కోటలింగాలుగా పిలువబడి ఉంటుంది. క్రమముగా అది కోటిలింగాలుగా మారి యుండును లేదా మధ్యయుగమునకు చెందిన శివాలయములో కోటీశ్వరుడు ప్రతిష్ఠింపబడుట వలన ఈ ప్రదేశము కోటీశ్వరుని పేరట కోటిలింగాలుగా మారియుండును. కరీంనగర్ జిల్లాలో చారిత్రకముగా ఇది చాలా ప్రాచీన ప్రదేశము. ఇది శాతవాహనుల తొలి రాజధాని.

కోటిలింగాల నుండి మునులగుట్టకు పోవు మార్గమున కొన్ని చిన్న బ్రాహ్మీశాసనములు క్రీ.పూ. రెండవ శతాబ్దపు లిపి లక్షణములతో కనుగొనబడినాయి. కోటిలింగాలకు 1 కి.మీ. దూరములో నున్న పొలములలో గల ఇసుకరాతి స్తంభముపై క్రీ.శ. ఒకటవ శతాబ్దపు లక్షణాలతో బ్రాహ్మీ లిపిలో "నాగగోపినికయ" అని చెక్కిఉంది[169]. హాలుని గాథా సప్తశతిలోని గోదావరినది వర్ణన ఆధారంగానూ, ఇచట లభ్యమైన సిముకుని (శ్రీముఖుని) నాణేలను బట్టి కోటిలింగాల శాతవాహనుల బలిష్ఠమైన దుర్గమని తెలుస్తుంది. శాతవాహనుల కాలములో ఓడ సరకుల ఎగుమతి దిగుమతులకు ఓడ రేవుగా (wharf) ఉపయోగపడెనని కోట ఉత్తరభాగాన గోదావరి నీటి వరకు గల ప్రాచీన ఇటుక కట్టడాల వల్ల తెలుస్తుంది. కోటి లింగాలకు సమీపమున పాషిగాంవ్ గుట్టపై బౌద్ధస్థూపముండేది. జైన మునులు నివసించిన మునుల గుట్ట ఇచటికి సమీపములో ఉంది. రెండు దశాబ్దముల క్రితము పురావస్తుశాఖ ఇచట జరిపిన త్రవ్వకాలలో అనేక ప్రాచీన అవశేషములు బయల్పడినాయి.

## శివాలయము

ఈ దేవాలయములో రెండు గర్భ గృహములకు ఒకే ఉమ్మడి మంటపముంది. ప్రతి గర్భగృహము ముందు అంతరాళముంది. పడమట దిశలో నున్న గర్భగృహము తూర్పుముఖంగా యున్న ప్రధానాలయం. ఇందులో కోటీశ్వరుడు లింగ రూపమున ప్రతిష్ఠింపబడినాడు. దక్షిణ

దిశలో నున్న గర్భగృహము ఉత్తరముఖమును కలిగి ఉంది. ఇందులో సిద్దేశ్వరుడు లింగరూపమున ప్రతిష్ఠింపబడినాడు. మంటపము చుట్టూ పిట్టగోడ యుండి తూర్పు, ఉత్తరములందు మంటపములోనికి ప్రవేశములున్నాయి. మంటప స్తంభములు లావుగా ఉన్నాయి. ఈ దేవాలయము చాళుక్య కళారీతులలో ఉంది[170].



కోటీశ్వర, సిద్ధేశ్వర దేవాలయము

**భైరవుడు** :- దేవాలయ అవరణలో నున్న నాలుగు అడుగుల ఎత్తు గల భైరవుని ప్రతిమ తలపై సర్పపు పడగల ఛత్రము అందంగా మలచబడింది. ఎడమవైపు క్రింది భాగమున ఒక కుక్క ఎగురుచున్నట్లుంది.

ఈ దేవాలయపు మంటపంలో వేణుగోపాల, గణపతి విగ్రహములు, గోదావరి ఒడ్డున అనేక శిల్పప్రతిమలున్నాయి. వాటిలో కాళీయమర్ధనము అందమైన శిల్పము [171]. సర్పముపై పడుకొనియున్న విష్ణమూర్తి అనగా శయనమూర్తి శిల్పము ఇచటి నుండి కరీంనగర్ మ్యూజియంనకు తరలింపబడింది.

## 46. ఆరవెల్లి

కరీంనగరమునకు ఉత్తరమున 50 కి.మీ. దూరములో పెగడపెల్లి మండలంలో నున్న కుగ్రామమే ఆరవెల్లి. మల్యాల గుండా ఈ గ్రామమును చేరవచ్చు.

**వేణుగోపాల దేవాలయము** :- గ్రామము బయట పొలములలో మధ్య యుగమునకు చెందిన శిథిలమైన వేణుగోపాలస్వామి ఆలయము తూర్పుముఖము కలిగి ఉంది. దేవాలయపు గోడలు సాదాగా నుండి శిఖరము మెట్లతో గూడిన పిరమిడ్ (Stepped pyramidal form) ఆకారములో ఉంది. శిఖరము ఇటుకతో కట్టబడింది. అంతరాళ ద్వారపు త్రిశాఖల క్రింది భాగమున వైష్ణవద్వారపాలకులు అందంగా మలచబడినారు. పతంగముపైన ముందుకు విస్తరించి యున్న చూరు శిల్ప గోళములతో అలంకరింపబడింది. అంతరాళ ద్వారమునకిరువైపుల జాలి కిటికీలు (Lattice windows) అలంకార ప్రాయంగా ఉన్నాయి. ఎందుకనగా రంధ్రముల వెనుకభాగము

శిలాఫలకముచే మూయబడింది. దేవాలయ ప్రవేశమునకు ముందు రెండువైపుల మూడు అడుగుల ఎత్తు గల వైష్ణవద్వారపాలకుల సుందర శిల్పప్రతిమలు దర్శనమిస్తాయి. ఈ దేవాలయమునందు పూజలు జరుగుట లేదు.

**నాయకురాలు గుడి** :- గ్రామములో గల నాయకురాలు గుడి పూజలందుకుంటున్న ప్రధానప్రదేశము. ఇచటి దేవీ విగ్రహము గూనచే కప్పబడిన లోతైన గదిలో నిలుపబడింది. కొన్ని మెట్లు దిగి లోపలి గదిని ప్రవేశించినచో దేవి దర్శనము జరుగుతుంది. ఇది శైవ సంప్రదాయములో నున్న దేవి విగ్రహము. దేవి కుడిచేతిలో ఖడ్గము, ఎడమచేతిలో గిన్నె (Bowl) ఉన్నాయి. పరమశివుని అర్ధాంగి పార్వతి ఇచట నాయకురాలు రూపములో నున్న చిన్న ప్రతిమాశిల్పము. ఈ నాయకురాలు గుడి కేశఖండనములకు మరియు అనేక విధముల పూజా కార్యక్రమములకు ప్రసిద్ధము.

జగిత్యాల గీతాసత్సంగ్ అధ్యక్షులు జిడ్డె కిషన్, అతని ధర్మపత్ని విజయ, వారి కొడుకులు పురుషోత్తం, పార్థసారథి, శ్రీరాము ఈ గుడి ముందు భక్తుల సౌకర్యార్థమై నూతనముగా ఒక మంటప నిర్మాణము గావించారు. నాయకురాలు వారి ఇంటిదైవము. ఈ ఆలయపు ఆవరణలో కొన్ని ప్రతిమా శిల్పములు ఒక చెట్టు క్రింద నిలుపబడినాయి.



వేణుగోపాలాదేవాలయము



ప్రతిమా శిల్పములు

**1. విష్ణువు** :- విష్ణువు విగ్రహం ఇరువైపుల చామరధారిణులున్నారు. వెనుక మకరతోరణముంది. ఇది నల్లరాయితో మలచబడింది. అతనికి కుడివైపున క్రింది భాగమునందు అంజలి ముద్రలోనున్న గరుడుడు కూర్చొనిఉన్నాడు. ఈ ప్రతిమలోని విష్ణువు హస్తములు ఛేదింపబడినాయి.

**2. షణ్ముఖుడు** :- షణ్ముఖుడు అతని భార్యతో నెమలివాహనముపై ఉన్నాడు.

**3. నాగిని** :- పై భాగము స్త్రీ రూపములోను, నాభి నుండి క్రిందిభాగము పాము రూపములో నున్న ఆమె ఖడ్గము, డాలు ధరించింది. ఆమె తలపై ఏడు పడగల ఛత్రముంది.

**4. వీరగల్** :- అరవెల్లి నుండి బతికెపెల్లికి పోవు రహదారి ప్రక్కన దాదాపు మూడు అడుగుల ఎత్తున్న వీరగల్ ప్రతిమ ఉంది.

# 47. అనంతగిరి

కరీంనగర్‌కు నైఋతిలో సిరిసిల్ల రెవెన్యూ డివిజన్‌లోని ఇల్లంతకుంట మండలములో అనంతగిరి గ్రామముంది. ఇచటి గుట్టపై నున్న ఆలయములో విష్ణువు అనంతశయనుని రూపములో నుండుట వలన ఈ గ్రామమునకు అనంతగిరి యని పేరువచ్చింది. సిరిసిల్ల నుండి బస్సుద్వారా ఈ గ్రామమును జేరవచ్చు. ఇచట క్రీ.శ. 1517 మే నెలలో వేయబడిన 26 పంక్తుల శిలాశాసనముంది[172]. ఇది శకసంవత్సరము 1439 ఈశ్వర వైశాఖ శుద్ధ దశమినాడు వేయబడిన శాసనము. ఈ శాసనములో శ్రీవత్సగోత్రోద్భవుడైన లఖయ మంత్రి అతని సంతతి శ్రీకృష్ణ, రామ, లఖయలతో పాటు మరల రాముదు, కృష్ణుడు పేర్కొనబడినారు. చివరి వాడైన కృష్ణుడు ఇచటి గిరిపైన అనంతశయన వైష్ణవాలయమును నిర్మించినట్లు ఇచటి శాసనము తెలుపుతుంది.

# 48. పెద్దపెల్లి

కరీంనగర్‌కు ఈశాన్యమున 32 కి.మీ. దూరములో రాజీవ్ జాతీయ రహదారిపై నున్న పెద్దపెల్లి నేడొక రెవెన్యూ డివిజన్ కేంద్రము మరియు మండలకేంద్రము. కాజీపేట నుండి బల్హార్షా పోవు బ్రాడ్ గేజి రైలు మార్గముపై నున్న ఈ గ్రామములో రైల్వేస్టేషన్ ఉండుట వలన ఇది వర్తక కేంద్రముగా మారింది. మంథనికి సమీపములో నున్న ఖమ్మంపెల్లి గ్రామములో కాకతి గణపతి దేవ చక్రవర్తి (క్రీ.శ. 1199-1261) కాలపు తేదీ లేని శిలాశాసనములో ఖమ్మంపెల్లి, చంద్రవెల్లి గ్రామములతో పాటు పెద్దపల్లి గ్రామము గూడా పేర్కొనబడుట విశేషము[173]. పై శాసనమును బట్టి పెద్దపెల్లి గ్రామము పదకొండు పన్నెండవ శతాబ్దములలో కాకతీయులకాలపు ప్రాచీన గ్రామమని తెలుస్తుంది. దీనికి దగ్గరలో నున్న పెద్దబొంకూరు, ధూళికట్ట ప్రాంతములలో పురావస్తు శాఖ 1968-1974 మధ్యకాలములో త్రవ్వకాలు జరుపగా బయల్పడిన అవశేషములను బట్టి ఈ ప్రాంతపు ప్రాచీనత క్రీ.పూ. రెండవ, మూడవ శతాబ్దములకు చెందిన శాతవాహనుల కాలమునకు చేరును.

## శివాలయము

పాతపెద్దపెల్లి గ్రామములో చాళుక్యుల కళారీతులలో గల శివాలయాన్ని స్థానికులు రామలింగేశ్వరాలయముగా పిలుస్తారు. గర్భగృహము, అంతరాళము, ముఖమంటపము, ప్రవేశమంటపము ఈ దేవాలయ ప్రధానాంగములు. గోడలు సాదాగా నుండి శిఖరము మెట్లతో కూడిన పిరమిడ్ ఆకారములో ఉంది. త్రిశాఖలతో నున్న అందమైన అంతరాళ ద్వారపు క్రింది భాగమున పూర్ణకుంభములున్నాయి. ద్వారపు పతంగము పైన ముందుకు విస్తరించియున్న చూరు బహురమ్యంగా ఉంది. ఈ దేవాలయములో చాళుక్య కళారీతిలో నున్న నంది విగ్రహము, మరియు మకుటము ధరించి చతుర్భుజములతో నున్న గణపతి విగ్రహములున్నాయి.

భైరవుడు :- ఈ దేవాలయపు ఆవరణలో ఐదు అడుగుల ఎత్తు గల శిలాఫలకముపై చతుర్భుజములతో భైరవరూపము మలచబడింది. అతని పైఎడమ చేతిలో త్రిశూలము, కుడి చేతిలో దమరుకము, క్రింది కుడిచేతిలో ఖడ్గము, ఎడమచేతిలో కపాలములున్నాయి. ఇది నల్లరాయితో మలచబడింది.

# 49. సిరిసిల్ల

కరీంనగర్‌కు పడమట 40 కి.మీ. దూరంలో మానేరునది ఉత్తరతీరమున గల సిరిసిల్ల నేడొక రెవెన్యూ డివిజన్ కేంద్రము మరియు మండల కేంద్రము. ఇది మున్సిపల్ కౌన్సిల్‌చే పాలింపబడుచున్న పట్టణము. దీనికి ఉత్తరమున కొంతదూరములో గల మూలవాగు ఒడ్డున నున్న వేములవాడకు ఎనిమిదవ శతాబ్దము నుండియే ఘనమైన చరిత్ర ఉంది. వేములవాడ చాళుక్యుల కాలములో సిరిసిల్ల ప్రాంతమంతయు వారి ఏలుబడిలో ఉండేది. ఇచటి శివాలయములో నున్న విగ్రహముల శిల్పకళారీతిని బట్టి అవి వేయిసంవత్సరములకు పూర్వమువై ఉంటాయి. ఇచట పురాతన శాసనాలేవీ లేవు. కాని కొన్ని చిన్న శాసనములు (Label inscriptions) ఇటీవలి కాలపువి ఉన్నాయి.

## శ్రీ వేంకటేశ్వరాలయం

గ్రామం మధ్యలో నున్న ఈ దేవాలయము మధ్యయుగములో చెన్న కేశవాలయమై యుండెనని తెలుస్తుంది. కాని ప్రస్తుతము ఇందులో శ్రీవేంకటేశ్వరస్వామి నిలుపబడుట వలన ఇది వేంకటేశ్వర ఆలయంగా మారింది. గర్భగృహము, అంతరాళము, ముఖమంటపము గల ఈ దేవాలయముపై నున్న శిఖరము మెట్లతో గూడిన పిరమిడ్ ఆకారములో ఉంది. ఇచట నున్న నాలుగు పంక్తుల చిన్నశాసనములో కేవలము శాలివాహనశకము 1812 విరోధి వైశాఖ శుద్ధ త్రయోదశి ఇందువారము (సోమవారము) మాత్రమే చెక్కబడిఉన్నాయి. ఇది క్రీ.శ. 1890లో అనగా 112 సంవత్సరముల క్రితము వేయబడిన చిన్నశాసనము[174]. ఈ దేవాలయములోనే ఉన్న వేరొక అటిగిపోయిన 11 పంక్తుల తెలుగు శాసనముంది. అంగబొఖల కోనయ్య కొడుకు ప్రసక్తి ఇందులో ఉంది. కాని ఈ భక్తుని పేరు అటిగిపోయి తెలియుటలేదు. ఇందులో వేరొక భక్తుడు విఠల కుమారుడైన రామభద్రయ్య పేర్కొనబడినాడు. ఇందులో భక్తులపేర్లు తప్ప వివరములులేవు[175].

## శివాలయము

సిరిసిల్ల పట్టణము మధ్యలోనొక చిన్న శివాలయముంది. ఈ ఆలయ ఆవరణలో చాళుక్యుల కళారీతిలో నాలుగు అడుగుల ఎత్తుగల ఒక పెద్ద గణపతి విగ్రహముంది. ద్విహస్తములతో నున్న ఈ గణపతి మకుటధారియై ఉన్నాడు. అతని దక్షిణ హస్తములో దంతము,

వామహస్తములో నున్న మోదకములపై తొండము అని ఉంది. కూర్చొనియున్న ఈ గణపతి ఎడమకాలు మలచుకొని యుండగా కుడికాలు మోకాలివద్ద వంగి నిటారుగా నిలుపబడింది. అతని ఫాలభాగము హారములచే అలంకరింప బడింది. నాగసర్పము అతనికి ఉదరబంధముగా నుండగా అతని ఆసనము క్రింద మూషిక వాహనము చెక్కబడింది. చాళుక్యుల కళారీతులలో నున్న మధ్యరకపు నంది అదే ఆవరణలో కన్పట్టును. వీటి శిల్పకళా రీతులను బట్టి సిరిసిల్ల వేయి సంవత్సరముల క్రిందటి చాళుక్యుల కాలపు గ్రామమై యుండునని తెలుస్తుంది.

# 50. కరీంనగర్

మానేరునది ఉత్తరతటమున నున్న జిల్లా కేంద్రమే కరీంనగర్ పట్టణము. మానేరు ప్రక్కనే మధ్యయుగము నుండియే అరిపిరాల యను కుగ్రామముండేదని తెలుస్తుంది[176]. కరీంనగరములోని పురానాబజార్ (పాతబజార్) ప్రాంతమే ఆనాటి అరిపిరాలయై యుండవచ్చు. మధ్యయుగము నాటి శివాలయము ఒకటి ఇచట ఉండుట వలన దాని పరిసరములందే ఈ గ్రామముండెనని తెలుస్తుంది. నిజాం కాలపు వన్‌టౌన్ పోలీస్‌స్టేషన్ ఇచటనే ఉంది. అసఫ్‌జాహీల పరిపాలనా కాలములో ఎల్గందల్ ఒక సర్కారు కేంద్రముగా నుండేది. ఎల్గందల ఖిలేదారైన సయ్యద్ కరీమొద్దీన్ ఎల్గందల్‌కు 8 కి.మీ. దూరంలో మానేరునది ఒడ్డున అతని పేరట స్థాపించిన గ్రామమే కరీంనగర్‌గా పిలువబడుతుంది.[177] అరిపిరాల కుగ్రామము విస్తరించి కరీముల్లాషావలి పేరట కరీంనగర్‌గా మారింది. ఈ కరీమొద్దీన్ లేదా కరీముల్లాషావలి యొక్క దర్గా లేదా సమాధి పాతబజారులో ఉంది. ప్రాచీన కరీంనగరము పాతబజారులోని శివాలయము మరియు పెద్దమసీదు వరకే పరిమితమై యుండేది. పందొమ్మిదవ శతాబ్దపు ద్వితీయార్థములో మరియు ఇరువదవ శతాబ్దపు ప్రథమార్ధములో ప్రస్తుతమున్న తపాల కార్యాలయము, పాత దవాఖానా, పాత కలెక్టర్ ఆఫీసు భవనము, హనుమాన్ దేవాలయము వరకు గ్రామము క్రమముగా విస్తరించింది. ఆఱవ నిజాం మీర్ మహబూబ్ అలీఖాన్ (క్రీ.శ.1869-1911) కాలములో జిల్లాల పునర్వ్యవస్థీకరణ జరిగినప్పుడు జిల్లా కేంద్రము క్రీ.శ. 1905లో ఎల్గందల్ నుండి కరీంనగరమునకు మార్చబడింది[178]. అప్పటి నుండి జిల్లా కేంద్రంగా కరీంనగరము పట్టణము ప్రాధాన్యతను సంతరించుకొని అనేక రకముల కార్యాలయములకు నిలయమై క్రమముగా విస్తరించింది. గత శతాబ్దపు ద్వితీయార్థములో మంకమ్మ తోట ఏరియా, కోతిరాంపూర్ ఏరియా, జ్యోతినగర్, శ్రీరాజరాజేశ్వర డిగ్రీకళాశాల ఏరియా, బస్‌స్టేషన్, ప్రస్తుతపు కలెక్టర్ కార్యాలయ భవన సముదాయము మున్నగు ప్రాంతములన్నియు క్రమేణ విస్తరించి కరీంనగర్ ఒక పెద్ద పట్టణముగా రూపొందుటకు దోహదపడినాయి. ఒక శతాబ్దము పూర్వము ఊరికి చాలా దూరంలో నుండిన మిషన్ కాంపౌండ్ ఏరియా ఇప్పుడు పట్టణము మధ్యలో నుండుట గమనార్హము. కరీంనగర్ జిల్లాలోనికి మిషనరీలు 1882లో ప్రవేశించి 1887లో వాటి కేంద్రములను జిల్లాలోని పలుచోట్ల స్థాపించాయి.

ఇరువదవ శతాబ్దపు తొలి చతుర్థభాగములో కఠినమైన క్రమశిక్షణకు ప్రసిద్ధి చెందిన ఒక ముస్లిం కలెక్టర్ హంటర్ (Hunter) అను మాఱుపేరుతో పిలువబడ్డాడు. హంటర్ అని పిలువబడిన ముస్లిం కలెక్టర్ క్రీ.శ. 1928లో కరీంనగర్‌లోని క్లాక్‌టవర్‌ను నిర్మించెనని తెలుస్తుంది. ఇతడే కరీంనగర్‌కు 1 కి.మీ దూరంలో మిషన్ కాంపౌండ్‌కై మిషనరీలకు స్థలము కేటాయించెనని స్థానికుల కథనము. తరువాత కాలములో ఇతడు వరంగల్ సుబాకు సుబేదార్‌గా పనిచేసిన కాలములో హనుమకొండలో సుబేదారికి సమీపాన ఇతని పేరట హంటర్‌రోడ్ వెలసింది.







క్లాక్ టవర్

లోయర్ మానేరు డ్యామ్

ఆసఫ్‌జాహీ వంశపు చివరిరాజు ఏడవనిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ (క్రీ.శ. 1911–1948) పరిపాలనా రజతోత్సవములు 1937లో అతని రాజ్యమంతటను జరుపబడినాయి. పాతబజార్‌లో నుండిన ధనికుడు షేక్‌ఖాన్ నిజాం పాలనారజతోత్సవముల జ్ఞాపక చిహ్నముగా కరీంనగర్ పట్టణ సరిహద్దులో 1937లో కమాన్‌ను కట్టించాడు. ఇప్పుడీ కమాన్ ఏరియా అంతయు జనసమ్మర్ధమైన ప్రాంతంగా మారింది. ఈ షేక్‌ఖాన్ కుమారుడే షేక్‌సాలె రేకుర్తి సమీపమున పెద్దఈద్‌గా ముస్లిం పండుగల ప్రార్థనలకై నిర్మించాడు. ప్రస్తుతము కరీంనగర్ మున్సిపల్ కౌన్సిల్‌చే పాలింపబడుతుంది.

## శివాలయం

కరీంనగర్ పాతబజార్‌లో మధ్యయుగపు కళారీతులలో ఒక సుందరమైన శివాలయము ఉంది. గర్భగృహం, అంతరాళం, ముఖమంటపాలతో నున్న ఈ దేవాలయము తూర్పు ముఖమును

కలిగి ఉంది. దేవాలయపు అధిష్ఠానము కొంత భూమిలో పూడుకపోయింది. అగబడుచున్న పట్టికలు అర్ధచంద్రాకార గోళములతో అలంకరింపబడినాయి. భిత్తి సాదాగా నుండి శిఖరము మెట్లతో గూడిన పిరమిడ్ ఆకారములో ఉంది. ముఖమంటపము చుట్టూ పిట్టగోడ ఉంది. తూర్పు, ఉత్తర, దక్షిణముల నుండి మంటపములోనికి ప్రవేశింపవచ్చు. మంటపము మధ్యనున్న నాలుగుస్తంభములపై గల లోకప్పు లుపవితాన (కదలికాకరణ) రీతిలో త్రికోణ పట్టములతో వేయబడింది. మధ్యనున్న చదరపు ఫలకము నందు లోతుగా ఒకదానిపై నొకటి మూడు వలయములందు విరబూసిన బహుదళ పద్మశిల్పము చూడ ముచ్చటగా నుండి దాని మొగ్గ క్రిందికి అందముగా వ్రేలాడుచున్నది. ఈ సుందరశిల్పము నగునూరు త్రికూటాలయపు లోకప్పు మధ్యనున్న చదరపు ఫలకములపై చెక్కబడిన పెద్ద అర్ధగోళాకారపు గిన్నె బోర్లించి యున్న రీతిలో గల రమణీయమైన శిల్పములను బోలిఉంది.

అంతరాళద్వారపు త్రిశాఖల క్రింది భాగమున పూర్ణకుంభములు, పతంగము పై గల తోరణము నందు అంతస్తుల శిఖరములు బహురమ్యముగా మలచబడినాయి. గర్భగృహద్వారము గూడా ఇంతే సుందరముగా నుండి క్రింది భాగమున శైవద్వారపాలకులు చెక్కబడినారు. ఈ శివాలయము ప్రాంగణములో సుందరమైన ప్రతిమాశిల్పములనేకములున్నాయి.


శివాలయ ద్వారము


పార్శ్వనాథుడు


కమాన్

**1. సప్తమాతృకలు :–** సప్తమాతృకల శిలాఫలకము ఒక చివరలో వినాయకుడు చెక్కబడినాడు. మకుటములు ధరించి చతుర్భుజములతో నున్న మాతృకల ఆసనముల క్రింద వారి చిహ్నములు లేదా వాహనములు ఉన్నాయి.

**2. మహిషాసురమర్దని :–** అష్టభుజములు గల దేవి ఎడమకాలును నేలపై మోపగా కుడికాలును మహిషరూపమున నున్న అసురుని మెడపై నిలిపింది. క్రింది కుడిచేతిలోని త్రిశూలమును అసురుని దేహమునందు గ్రుచ్చుచు క్రింది ఎడమ చేతితో మహిషుని తోకను ముడుచుచున్నది. కుడివైపున్న మిగిలిన మూడు చేతుల్లో బాణము, ఖడ్గము, అగ్నిపాత్ర మరియు మూడు ఎడమ చేతులందు డాలు, బాణము, బల్లెములున్నాయి. మకుటధారియైన దేవి కుండలములు, కేయూరములు, కంకణములు, కటిబంధము ధరించి ఉంది.

**3. బ్రహ్మ :-** ఒక శిలాఫలకముపై చెక్కబడిన చతుర్ముఖ బ్రహ్మ యొక్క మూడుతలలు అగబడుచున్నాయి. నాలుగవ తల ఈ ప్రతిమ వెనుక భాగము ఫలకమగుటచే కానరాదు. చతర్భుజములు గల ఈ బ్రహ్మ పైచేతులలో నున్న చిహ్నములు స్పష్టముగా లేవు. క్రింది కుడిచేతిలో పుస్తకము, ఎడమ హస్తమందు గద ఉన్నాయి. అతనికి కుడివైపున క్రింది భాగమున హంస వాహనముంది. బ్రహ్మ మకుటము, గ్రైవేయకములు, యజ్ఞోపవీతము, కటిబంధము, వనమాల మున్నగు ఆభరణములతో శోభాయమానముగా నున్నాడు.

**4. సరస్వతి :-** దేవి హంస వాహనముపై నిలుపబడింది. హంస పరిమాణములో పెద్దగా ఉంది. చతుర్భుజములు గల దేవి పైకుడిహస్తము నందు వేదములు క్రింది కుడిహస్తము అక్షమాలతో గూడిన అభయముద్రలో ఉంది. ఎడమవైపు గల రెండు హస్తములందలి చిహ్నములు స్పష్టముగా లేవు. ఇది అరుదైన విగ్రహము.

**5. పార్శ్వనాథుడు :-** నాలుగు అడుగుల ఎత్తున్న శిలాఫలకముపై గల పార్శ్వనాథుని నగ్నశిల్పము కాయోత్సర్గ రీతిలో ఉంది. అతని వెనుకనున్న సర్పము అనేక మెలికలు తిరిగి యుండి దాని ఏడు పడగలు తీర్థంకరుని తలపై ఛత్రమువలెనున్నాయి. అతని కుడి చేతిలో అక్షమాల ఉంది.

**6. నాగినీ శిల్పాలు :-** పై భాగము మానవాకృతిలో నుండి క్రింది భాగము పాము రూపములో నున్న ఈ శిల్పాలు కుడిచేతిలో ఖడ్గము, ఎడమచేతిలో డాలు ధరించి ఉన్నాయి.

**7. ద్వారబంధాలు :-** దేవాలయ ప్రవేశమునకు రెండు వైపుల శైవ ద్వారపాలకులతో గూడిన శిథిలమైన ద్వార బంధాలున్నాయి.

కరీంనగర్‌లోని శివాలయము చూడదగ్గది. మానేరు నదిపై నిర్మించిన లోయర్ మానేర్‌డ్యామ్, దాని వెనుక ఉజ్వలపార్క్ అక్కడికొచ్చే వారికి ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాయి. ఇది ఒక చక్కటి పర్యాటక కేంద్రము. ఇచటి ఉన్నత పాఠశాల ప్రాచీనమైంది.

## 51. ఎల్గందల్

కరీంనగర్‌కు పడమట దాదాపు 10 కి.మీ. దూరంలో కామారెడ్డికి పోవు ప్రభుత్వ రహదారిపై నున్న ప్రాచీన గ్రామమే ఎల్గందల్ లేదా వెలిగందుల. తొలుత దీనిని బహుదన్యపురంగా పిలిచేవారని తెలుస్తుంది.[179] ఎల్గందల్ చింతామణి చెఱువు వద్ద క్రీ.శ. 1202 అముద్రిత శిలాశాసనముంది. కాకతి గణపతి దేవుని సేనాని మల్యాల వంశమునకు చెందిన చౌండప్రెగ్గడ కాలము వెలిగందుల తమ్మడి వాయిద్యగాండ్రు శ్రీకరణ మరియు భసవోజీలు ఇచటి నరసింహదేవర అంగరంగ వైభోగములకై భూదానాలిచ్చినట్లు ఈ శాసనం తెలియజేస్తుంది. దీని తరువాత గల శాసనభాగము చాలా అఱిగిపోయి తెలియుటలేదు[180]. వెలిగందుల కాకతీయుల కాలము నుండియే ప్రాధాన్యతను సంతరించుకొంది.

కాకతీయుల, ముసునూరి నాయకుల అనంతరం ఓరుగుల్లు నేలిన రేచర్ల పద్మనాయక రాజు అనపోతానాయకుని కాలములో ముప్పభూపాలుడు రామగిరి కేంద్రంగా సబ్బి మండలపాలకునిగా నున్నాడు. ఇతని సమర్థుడైన మంత్రి కేసన. కేసన సోదరుడు కందన వెలిగందుల కోటకు అధిపతి. ఇతనికి మడికి సింగన పద్మ పురాణోత్తర ఖండమును అంకితమిచ్చాడు. పదిహేనవ శతాబ్దములో బమ్మెర పోతన రచించిన భాగవతములోని ఖాళీలను వెలిగందుల నారయ పూరించిన విషయము అందరికీ తెలిసిందే.

కులీకుతుబుల్ ముల్క్ (1518-1543) కాలములో ఎల్గందల్, మొలంగూర్ కోటలు ఖివాముల్ ముల్క్ అధీనములో నుండేవి. కుతుబ్‌షా వంశపు మొదటి పాలకుడు సుల్తాన్ కులీ దండెత్తగా ఖివాముల్ ముల్క్ బెరార్‌నకు పారిపోయి దరియా ఇమాదుల్ ముల్క్ (1529-1572) సహాయమర్థించాడు. ఇంతలో ఎల్గందల్, మొలంగూర్ దుర్గములు కుతుబ్‌షాహీల వశమైనాయి. ఖివాముల్ ముల్క్ బెరార్ సైన్యములతో రాగా సుల్తాన్ కులీ అతనిని రామగిరి వద్ద ఓడించాడు[181].

ఇబ్రహీం కుతుబ్‌షా కాలములో (క్రీ.శ. 1550-1580) ఎల్గందల దుర్గాధిపతియైన జగదేవరావునాయక్‌వారి తిరుగబడినాడు. కాని ఓడిపోయి ఇతడు గూడా బెరార్‌కు పారిపోయి దరియా ఇమాదుల్ ముల్క్ సహాయముతో తిరిగివచ్చాడు. ఎల్గందుల వద్ద జరిగిన భీకరపోరులో ఇరువర్గముల యందు చాలా మంది ప్రాణాలు పోగొట్టుకొన్నారు. చివరకు జగదేవరావు విజయనగరమునకు పారిపోయాడు. ఎల్గందలకోటతో పాటు ధనాగారమంతయు కుతుబ్‌షాహీల వశమైంది[182]. క్రీ.శ.1687లో ఔరంగజేబు గోలకొండను జయించాడు. ఎల్గందుల మొగలుల సుబేదారైన ముబారిజ్‌ఖాన్ అధీనములోకి వచ్చింది.

1724 నుండి ఆసఫ్‌జాహీ నవాబుల ఆధిపత్యములో ఎల్గందుల సర్కారు పాలింపబడింది. నిజాముల్ ముల్క్ ఆసఫ్‌జా (1724-1748) కాలములో అమీన్‌ఖాన్ ఎల్గందల్ దుర్గాధిపతి. అతని మరణానంతరము అతని కుమారుడు ముకర్రబ్‌ఖాన్ పాలకుడైనాడు. ఇతడు గతించిన తర్వాత ఏర్పడిన వారసత్వపు తగాదాలలో ఇతిని భార్య (వితంతువు) నవాబ్ సలాబత్ జంగ్‌ను ఆశ్రయించింది. సలాబత్ జంగ్ ఫాకిర్ మునవ్వర్‌ఖాన్‌ను ఎల్గందల్ వారసునిగా నియమించాడు.

నవాబ్ సలాబత్ జంగ్ కాలములోనే ముబారిజుల్ ముల్క్ జఫరుద్దౌలా బహద్దూర్ మిర్జా ఇబ్రహీం ఖాన్‌ధంసా ఎల్గందల్‌ఖిలేదారైనాడు. ఇతడే 1754లో ఎల్గందుల కోటను పునః నిర్మాణము గావించి బలిష్ఠ దుర్గముగా రూపొందించాడు. ధంసా మరణానంతరము అతని కుమారుడు ఫారుక్ మిర్జా ఎహతెషామ్‌జంగ్ ఎల్గందల్ సర్కారులో దుష్పరిపాలన గావించాడు. రెండవ ఆసఫ్‌జా నిజాం అలీఖాన్ 1791లో ఎల్గందల్‌ను ముట్టడించాడు. ఎహతెషామ్ జంగ్ ఓడిపోయి క్షమాభిక్ష కోరగా బెరార్‌కు గవర్నర్‌గా నియమింపబడినాడు. మూడవ ఆసఫ్‌జాయగు

సికందర్‌జా (1803-1829) కాలములో బహదూర్‌ఖాన్ ఆ తరువాత సయ్యద్ కరీమొద్దీన్ ఎల్గందల్ ఖిలేదారులుగా ఉన్నారు. ఈ సయ్యద్ కరీమొద్దీన్ స్థాపించిన గ్రామమే నేటి కరీంనగర్. ఆఱవ నిజాం మీర్ మహబూబ్ అలీఖాన్ కాలములో జిల్లాల పునర్వ్యవస్థీకరణ జరుగగా 1905లో జిల్లా కేంద్రము ఎల్గందుల నుండి కరీంనగర్ నకు మార్చబడింది.

ఎల్గందల్ ప్రక్కనేయున్న గుట్టపై గల కోట కాకతీయుల కాలము నుండి అసఫ్‌జాహీ నిజాం నవాబుల మట్టుకు దక్కన్ చరిత్రలో కీలకపాత్ర వహించింది. కోట తూర్పు ద్వారము బయట ఉన్న బృందావన్ చెఱువు, కొండపై కోటలో నున్న మసీదులు, సమాధులు, నీలకంఠేశ్వర, నరసింహ దేవాలయాలు పర్యాటకులను ఆకర్షిస్తున్నాయి.



## నరసింహదేవాలయం

కొండపైన మసీదు, దానికి ఆవల తూర్పు ముఖము కలిగియున్న నరసింహదేవాలయము ఉంది. దాదాపు 250 మెట్లు ఎక్కినచో ఇచటికి చేరవచ్చు. ఈ ఆలయము కొలతలు 12'x13'.6" గర్భగృహములోనే ఒక దాని ప్రక్కకు ఒకటి మూడు చిన్న గదులు తూర్పు ముఖమును కలిగియుండి మధ్య గదిలో ఒక గుండుకు మూడు వైష్ణవనామాల చిహ్నాము చెక్కబడి, స్థానికులచే లక్ష్మీనర్సింహస్వామిగా పూజింపబడుతుంది.

# 52. రామగిరి దుర్గము

కరీంనగర్‌కు ఈశాన్యమున 65 కి.మీ. దూరంలో మంథనికి పోవు ప్రభుత్వ రహదారి సమీపమున కమాన్‌పూర్ మండలంలో బేగంపేట శివారులో నున్న సుప్రసిద్ధ చరిత్రగల సువిశాల గిరి దుర్గమే రామగిరికోట. అనాది నుండి అసఫ్‌జాహీల పాలన మట్టుకు ఈ కోటకు విశేషమైన చరిత్ర ఉంది. శత్రుదుర్భేద్యమైన ఈ కోట అరుదైన శిల్పకళకు, కోట బురుజులకు నిలయము. ప్రకృతి సోయగాల మధ్య సమున్నతంగా దర్శనమిచ్చే ఈ కోట పరిసరప్రాంతాల్లో అపారమైన వనమూలికాసంపత్తి, అరుదైన వృక్షజాలాలు నిక్షిప్తమై ఉన్నాయి. వీటికోసం వివిధ రాష్ట్రాల నుండి విభిన్న ప్రాంతాల నుండి వృక్షశాస్త్రవేత్తలు, ఆయుర్వేదనిపుణులు ప్రతిఏట ఆగస్టు, సెప్టెంబర్ నెలల్లో ఈ ప్రాంతానికి వస్తుంటారు. అభివృద్ధి పరచినచో అబ్బురంగా గోచరించు ఈ ప్రదేశము గొప్ప పర్యాటక కేంద్రంగా మారును. వివిధ స్థాయిల విద్యాలయాల విద్యార్థులు బొటానికల్ టూరు పేరట ఈ దుర్గానికి వస్తుంటారు.

రామగిరికి నైరుతిలో 20 కి.మీ. దూరంలో గల పెద్దబొంకూరు, పడమట అంతే దూరంలో ధూళికట్టలో శాతవాహనుల కట్టడాలు, పెక్కు అవశేషాలు బయల్పడినాయి. రామగిరికి

ఈశాన్యాన గోదావరి సమీపమున గల కాశీపేట గుంజపడిగెల తదితర అనేక పరిసర గ్రామాలలో శాతవాహనుల కాలపు అవశేషాలు బయల్పడినాయి. రామగిరికి వాయువ్యమున ఉన్న కోటిలింగాల శాతవాహనుల తొలి రాజధానిగా గుర్తింపబడింది. అచట బయల్పడిన కోట, నాణెముల, పెక్కు అవశేషాలు ఇందుకు తార్కాణము. శాతవాహనుల స్థావరములతో పరివేష్టితమైన రామగిరిని శాతవాహన రాజులు తప్పక వారి రక్షణకోటగా ఉపయోగించుకొని ఉంటారు. గౌతమీపుత్ర శాతకర్ణి, పులోమావి మున్నగు శాతవాహన రాజులు ఇచటి కోట తొలినిర్మాణము గావించి దీనిని పాలించారని స్థానికుల కథనము [183]. అప్పటి నుండి వివిధ రాజవంశముల వారు ఈసువిశాల పర్వతముపై ఎవరికి దోచిన రీతులలో వారు అనేక రకముల నిర్మాణములు గావించి దీనిని దుర్భేద్యమైన కోటగా మలచుకొని పాలించారు. కళ్యాణి చాళుక్యుల కాలములో మంత్రకూటము నేలిన గుండరాజు, రామగుండంనేలిన ఏడరాజు కాకతి రెండవ ప్రోలరాజునకు వ్యతిరేకముగా జరిగిన యుద్ధంలో ఈ రామగిరి దుర్గమును ఉపయోగించుకొని ఉంటారు. క్రీ.శ. 1138-1140 మధ్యకాలములో అనుమకొండనేలిన కాకతి రెండవ ప్రోలరాజు మంత్రకూట, రామగుండం ప్రాంతములను కాకతీయ రాజ్యములో కలుపుకొన్నాడు. రామగిరి దుర్గము గూడా కాకతీయుల వశమై ఉంటుంది.

ముసునూరి నాయకుల అనంతరం 14వ శతాబ్దపు రేచర్ల పద్మనాయక రాజు అన పోతానాయకుడు సబ్బిసాయిరమును పాలించుటకై రామగిరి కేంద్రంగా ముప్పభూపాలుని పాలకునిగా నియమించాడు. ఇతని మంత్రి కేసన కడుసమర్థుడు. మడికి సింగన రామగిరి యందే పద్మపురాణోత్తర ఖండమును రచించి కేసన సోదరుడు మరియు ఎల్లందుల పాలకుడైన కందనకు అంకితమిచ్చాడు. క్రీ.శ. 1433లో బహమనీ సుల్తాన్ మొదటి అహ్మద్‌షా (1422-1436) తెలంగాణము పై దండెత్తాడు. రామగిరి దుర్గము అతని వశమైంది.

గోలకొండలో కుతుబ్‌షాహీ వంశస్థాపకుడైన సుల్తాన్ కులీకుతుబుల్ ముల్క్ (క్రీ.శ. 1518-1543) ఎల్లందల దుర్గాధిపతి ఖివాముల్ ముల్క్ పై దండెత్తగా అతడు బెరారునకేగి దరియా ఇమాదుల్ ముల్క్ సేనలతో తిరిగి రాగా సుల్తాన్ కులీ సేనలు బెరార్ సేనలను రామగిరి వద్ద ఎదురించాయి. విజయము పొందిన సుల్తాన్ కులీ రామగిరిని వశపరచుకొన్నాడు[184]. రామగిరి యందు కుతుబ్‌షాహీల కాలపు క్రీ.శ. 1556లో చెక్కిన తెలుగు శాసనమొకటుంది. శక సంవత్సరము 1478 బహుళ ద్వాదశి బుధవారము రోజున వేయబడిన శాసనమిది. ఇది ప్రవేశద్వారమునకు కుడివైపు గోడపై ఎనిమిది పంక్తులు గల శాసనము. తుమ్మీఖాన్ కోట దరువాజా (ద్వారము) కట్టించి ప్రజలపై పదివేలు పన్ను విధించెనని ఈ శాసనమందుంది[185]. క్రీ.శ. 1656లో గోలకొండ సుల్తాన్ అబ్దుల్లా కుతుబ్‌షా ఔరంగజేబు దక్కన్ రాజప్రతినిధి సేనల చేతిలో ఓడిపోయి అతని కుమార్తెను ఔరంగజేబు కుమారుడైన ముహమ్మద్‌న కిచ్చి వివాహము చేశాడు. వరకట్నము క్రింద 1656లోనే రామగిరి దుర్గమును మొగలులకు

అప్పగించాడు.[186] ఔరంగజేబు ఒకసారి షేక్ మొహియొద్దీన్ ఉర్ఫ్ నసీరొద్దీన్ అను పండితునితో రామగిరి వద్ద బసచేశాడు. ఎత్తైన పర్వతములపై బలిష్ఠమైన దుర్గరాజము నలు పార్శ్వములు వృక్షములతో, లతలతో, మూలికలతో, రంగు రంగుల వనపుష్పాదులతో, సువాసనాభరిత ఘుమాయింపులతో చల్లని హాయిగొల్పు పిల్లవాయువులు వీచుచుండగా దూరము నుండియే గోదావరి, మానేరు నదుల దృశ్యములు చూస్తూ ఆనందించారు. అప్పుడు నసీరొద్దీన్ పండితుడు ఈ పర్వతమును రాంగీర్ అని పిలుచుట కంటే హాయిని గొల్పు ఆరామ్‌గీర్ అని పిలుచుట సమంజసముగా నుండునని ఔరంగజేబునకు సూచించాడు. అందులకే మొగలుల కాలములో రాంగీర్ దుర్గము ఆరామ్‌గీర్ గా పిలువబడింది. క్రమముగా రామగిరి మొగలుల నుండి ఆసఫ్‌జాహీ నవాబుల పాలన క్రిందికి వచ్చింది. తరువాత కాలములో దేశ్‌పాండ్యులు దేశ్‌ముఖ్‌లు పాలించారు.



రామగిరి కోట



పిల్లల ఫిరంగీ

రామగిరి దుర్గముపై అనేక సందర్శన స్థలాలు ఉన్నాయి. సీతారాముల ఆలయము, రామస్థాపిత లింగము, శ్రీరామపాద చిహ్నములు, జానకీమాత పాదచిహ్నములు, సీతమ్మ కొలను, సీతమ్మ వారి పసుపు, కుంకుమబరణి గుంతలు మున్నగునవి ఈ గుట్టమీద ఉండుటచే శ్రీరాముడు సంచరించిన ప్రదేశముగా ఇది రామగిరి యని పిలువబడుచున్నది. ఈ దుర్గముపై రాతి కట్టడాలు, కోటగోడలు, బురుజులు, భవనాలు, సమాధులు, మసీదులు, బావులు, మంచినీటి కొలనులున్నాయి. దుర్గాంతర్భాగంలో ప్రతాపరుద్రదేవుని కోట, అశ్వశాల, దర్బారు, చెరసాల, గజశాల, భోజనశాలలతో పాటు రహస్యమార్గాలు, సొరంగాలు, తోపులు, ఫిరంగులు, ఫిరంగి గుండ్లను చూడవచ్చు. దుర్గంపై చిత్రకోట, త్రాటికోట, నిమ్మకోట, నగారాఖానా, మందుగదులు, తోపుబావి, నల్లకయ్య బావి, పసరుబావి, హరిబావి, అచ్చమ్మ బావి, అమ్మగారి బావి, దేవస్థలములు, సప్తద్వారములు, చౌకీలు, అనేక వనములు మున్నగు వాటితో ఈ కోట కొన్ని మైళ్ల వైశాల్యముతో నొప్పారుచున్నది. ఈ రామగిరి దుర్గములోగల పిల్లల ఫిరంగీయను తోపు నుండి దూరినచో సంతానము కలుగుతుందని ప్రజల విశ్వాసము. రామగిరిని అభివృద్ధి పరచినచో రాష్ట్రములోనే గొప్ప పర్యాటక కేంద్రమౌతుంది.

## 53. ప్రతాపగిరికోట

కరీంనగర్‌కు ఈశాన్యంగా 120 కి.మీ. దూరంలో జిల్లా తూర్పు సరిహద్దు ప్రాంతమున దట్టమైన మహదేవపూర్ అడవులందు కాటారం మండలంలో నున్న వనదుర్గము ప్రతాపగిరికోట. ఈ కోటగుట్టపై నున్నది గనుక గిరి దుర్గము గూడా. మంథని, మహదేవ్‌పూర్‌లు దాటి కాటారం అడవి ప్రాంతముగుండా ఈ వనదుర్గమును చేరవచ్చు. ప్రయాణ సౌకర్యములు లేవు గనుక దీనిని సందర్శించుట కష్టము. గుట్ట పైభాగముననున్న కోటగోడపై తేదీలేని తొమ్మిది పంక్తుల తెలుగు శాసనమొకటుంది. శకసంవత్సరపు సంఖ్య లేని ఈ శాసనంలో కీలక సంవత్సర వైశాఖ శుద్ధ తదియ వడ్డవారము మాత్రము చెక్కబడినాయి. ముచ్చునాయనింగారు ప్రతాపగిరి కోటను నిర్మించినట్లు ఈ శాసనము తెలుపుతుంది[187]. అతనికి గల ఇరువత్తు గండదు, గండగోపాలుదు, కంచిరక్షపాలకా, చోళరాజ్య స్థాపనాచార్య, పాంద్యమనువిభాళ, దాయ గజకేసరి, అరిరాయ గజకేసరి, తెలుగురాయదు మున్నగు బిరుదములు ఈ శాసనమందు పేర్కొనబడినాయి. దాయ గజకేసరి, రాయ గజకేసరి కాకతీయుల బిరుదములను బట్టి ఈ శాసనము కాకతీయుల కాలపు శాసనమని భావించవచ్చు. కాకతి ప్రతాపరుద్రదేవుని పేరట నిర్మింపబడిన దుర్గము గనుక ఇది ప్రతాపగిరికోటగా ప్రసిద్ధిచెందింది[188].

## 54. మొలంగూరుకోట

కరీంనగర్‌కు ఆగ్నేయంగా కేశవపట్నం మండలంలో గల గ్రామము మొలంగూరు. ఇది మలంగూర్ అని చరిత్ర గ్రంథములలో పేర్కొనబడింది. ఈ గ్రామము కరీంనగర్‌కు 29 కి.మీ., హుజూరాబాద్‌కు 13 కి.మీ, జమ్మికుంట రైల్వేస్టేషన్ నుండి 16 కి.మీ. దూరంలో ఉంది. కేశవపట్నం నుండి సులభంగా జేరవచ్చు. ప్రతాపరుద్రుని అధికారులలోనొకడైన వొరగిరి మొగ్గరాజు ఇచటి గుట్టపై నొక దుర్భేద్యమైన గిరికోటను కట్టించాదు [189]. ఓరుగల్లు కోట నుండి ఎల్గందుల కోటకు పోవుమార్గము మధ్యలో మొలంగూర్ కోట యుండుట వలన ప్రాధాన్యతను సంతరించుకొంది.



గుట్టపైన కొనయందు ఎటునుండి ఎక్కలేని గ్రానైట్ బండపై ఈ కీలక దుర్గము నిర్మింపబడింది. గుట్టపై ఒక గుహ వద్ద మలంగ్‌షావలి దర్గా ఉంది. మలంగ్‌షావలి సమాధియుండుట వలన ఈ గ్రామము మలంగూర్, మొలంగూర్‌గా మారింది. ఈ గ్రామము పూర్వపు పేరు ముదగర్ అని తెలుస్తుంది. గుట్టపైన ఒక కోనేరు, గుట్టక్రింద మరియెక కోనేరు ఉన్నాయి. ఇచటి దూద్ బావిలి నీరు (పాలువలె నీరున్న బావి) స్వచ్ఛముగా నుండునని సుప్రసిద్ధము. ఇచటి శివాలయము,

వీరభద్రాలయము పూజలందుకొనుచున్నాయి. కోటబురుజులు, కందకములు, రాతిద్వారములు, ప్రాకారములు, ఫిరంగులు, శిథిలమైన గోడలు, శిల్పావశేషములు సందర్శకుల దృష్టినాకర్షిస్తాయి. ఇది మధ్యయుగము నాటి బలిష్ఠమైన గిరిదుర్గము. మొలంగూరు బృహత్‌శిలా సమాధులున్న ప్రాచీన స్థావరం కావడం గమనార్హము.

## 55. హుస్నాబాద్

కరీంనగర్‌కు దక్షిణమున 30 కి.మీ. దూరంలో నున్న మండల కేంద్రము హుస్నాబాద్. చెఱువు కట్టపై నున్న శిథిలమైన శిలాశాసనమొకటి కన్నడ భాషయందుంది. మొదటి ప్రక్కనున్న 13 పంక్తులలో 11, రెండవ ప్రక్కలో 12 పంక్తులు స్పష్టముగా ఉన్నాయి. దానము లొసంగిన భాగము శిథిలమై లభ్యమగుట లేదు. ఇది కళ్యాణి చాళుక్య వంశపు మూలపురుషుడైన రెండవ తైలపుని కుమారుడు సత్యాశ్రయ ఇర్వెబెదంగ దేవుని కాలము (క్రీ.శ. 997-1008)లో వేయబడిన శాసనము[190]. దీనిని బట్టి వేయి సంవత్సరముల పూర్వమే హుస్నాబాద్ గ్రామము కాకతీయులకు పూర్వము ఈ ప్రాంతమును పాలించిన కళ్యాణి చక్రవర్తుల కాలములోనే విరాజిల్లెనని తెలుస్తుంది.

చెఱువునకు సమీపముననున్న పొలంలో తేదీలేని కాకతి రుద్రదేవుని లేదా రుద్రమదేవి కాలపు ఏడు పంక్తుల తెలుగు శిలాశాసనమొకటి పడిఉంది. రుద్రమ దేవిని గూడా రాజువలె భావించి రుద్రదేవ నామముతో శాసనములు వేయడమైంది. తేది లేదు గనుక ఇది రుద్రదేవుని లేదా రుద్రమదేవి కాలమునకు చెందిన 12వ లేదా 13వ శతాబ్దపు శాసనమై ఉంటుంది. మహామండలేశ్వర రుద్రదేవని కాలములో ముఱుసంటి ఎక్కటీలు (సైనికులు) లేదా యోధుల పక్షాన తాడ్లపయిడి గుడ్డలిచిన్నాలు రాటణచేనును, నాలుగు పుట్ల వడ్లను రుద్రేశ్వర దేవరకు దానం చేసినట్లు ఈ శాసనంలో ఉంది[191].



పై రెండు శాసనాలను బట్టి కళ్యాణి చాళుక్య మరియు కాకతీయ చక్రవర్తుల కాలములో పదవ శతాబ్దము నుండి పదునాల్గొవ శతాబ్దము వరకు హుస్నాబాద్ గ్రామము ప్రాశస్త్యము గల ప్రదేశమని తెలుస్తుంది.

హుస్నాబాద్ పట్టణంలోని ఎల్లమ్మ చెఱువునానుకొని గుట్టపై నున్న కాకతీయుల కాలపు సిద్ధేశ్వరాలయంను సంపూర్ణముగా పునఃనిర్మించినపుడు క్రింది నుండి గుట్టపైనున్న దేవాలయము వరకు మెట్లు కూడా నిర్మించారు. ఇందులో పరమశివుడు సిద్ధేశ్వరుని పేరుతో బృహత్ లింగ రూపములో నున్నాడు. ఇది నల్లని గ్రానైట్‌రాయితో మలచబడిన కాకతీయుల కాలపు సిద్ధేశ్వర లింగము. ఎత్తైన వేదిక కంఠము నందు అనేక వర్గములు ఉన్నాయి. కాకతీయుల కాలపు లింగముల వలె ఇచటి లింగము పైన గూడా లక్షణోద్ధరణ రేఖలు కన్పట్టును. ప్రస్తుతము బయట ఉన్న ఈ లింగమును నూతనముగా నిర్మించిన దేవాలయములో పునఃప్రతిష్ఠ చేయవలసి ఉంది.

# 56. రేగొండ

కరీంనగర్‌కు దక్షిణమున హుస్నాబాద్ మండలంలో గల రేగొండ గ్రామములో పటేల్ రాంగోపాల్ రావు ఇంటి ముందు ఒక శిలాశాసనముంది. కాకతి ప్రతాపరుద్రదేవుని కాలపు తేదిలేని ఈ తెలుగు శాసనములో నాలుగు మఱ్తుర్ల చేను సోమనాథ దేవరకు దానమిచ్చినట్లుంది. దాత వివరములు తెలియుట లేదు[192].

రేగొండ గ్రామము అతి ప్రాచీన స్థావరము. కొత్త రాతి యుగపు రాక్ పేయింటింగ్స్, ఇచటి కొండచరియ ఆవాసాలపై నుండుట విశేషము[193]. గ్రామము సమీపమున గల గుట్టబోరులందే ఈ రాక్‌షెల్టర్స్ ఉన్నాయి. ఈ గుట్టలు హుస్నాబాద్‌కు పడమట 8 కి.మీ. దూరంలో ఉన్నాయి.



కొండచరియ ఆవాసాలు

# 57. ఇల్లందకుంట

కరీంనగర్‌కు ఆగ్నేయము నందు దాదాపు 65 కి.మీ. దూరంలో జమ్మికుంట మండలము నందు అపరభద్రాద్రిగా పేరొందిన ఇల్లందకుంట శ్రీ సీతారామ చంద్రస్వామి ఆలయము సుప్రసిద్ధము. ఇచటికి హుజురాబాద్ ద్వారా జమ్మికుంట నుండి చేరవచ్చు. ఇచటి దేవాలయము పడమటి ముఖము కలిగిఉంది. తూర్పున నున్న ద్వారము నుండిలోనికి ప్రవేశించగానే గర్భగృహపు వెనుకభాగము చూడవచ్చు. గర్భగృహములో నున్న పెద్ద గుండ్రాయి పై సీతారామ లక్ష్మణులు, రంగనాయక స్వామి చెక్కబడినారు. వీరి క్రింది భాగమున ఆళ్వారుల చెక్కడములున్నాయి. గర్భగృహమునకు ముందర 16 స్తంభముల మంటపము, దాని ముందు ఇంకొక 16 స్తంభముల మంటపమున్నది. ఈ మంటపముల ఎత్తు కేవలము ఆరు అడుగులు. ఈ దేవాలయమునకు ఉత్తరమున గల 16 స్తంభముల మంటపము, దేవాలయ అవసరములకై గదిగా మార్చబడింది. గదిగా మార్చబడిన ఈ మంటపము ముందు ఇంకొక 16 స్తంభముల మంటపముంది. అదే విధంగా దేవాలయము నానుకొని దక్షిణము వైపు గూడా 16 స్తంభముల మంటపములు రెండు, 12 స్తంభముల మంటపము ఒకటి ఉన్నాయి. దేవాలయము నందు గల అనేక మంటపములు భక్తుల సౌకర్యార్థమై వేర్వేరు కాలములందు కట్టబడి ఉంటాయి.

రెండు ఇల్లెందు వృక్షములతో ఈ దేవాలయము ఒక కుంట ప్రక్కనే యుండట వలన ఈ గ్రామమునకు ఇల్లెందుకుంటయని పేరు వచ్చియుండును. తూర్పున గల ప్రధాన ద్వారముపై మిథున శిల్పములు మరియు జననేంద్రియము అగబడుచున్న మాతృదేవత రూపములుండుట



విశేషము. దేవాలయ ఆవరణలో పడమట గల రామలింగేశ్వరాలయములో మకుటము లేకుండా, ఏనుగు తలను కలిగి ద్విహస్తములతో ఒక ప్రాచీన గణపతి విగ్రహముంది. చతుర్భుజములతో గూడిన వీరభద్రుని విగ్రహము, ఐదు అడుగుల ఎత్తు గల రెండు వైష్ణవ ద్వారపాలకుల అందమైన రూపములు చతుర్భుజములతో ఆవరణ యందు దర్శనమిస్తాయి. ఉత్తరపు ప్రవేశ ద్వార సమీపమున ఎత్తైన గరుడ స్తంభముంది. స్తంభము పై నున్న చిన్న మంటపములో గరుడ విగ్రహముంది. దేవాలయమునకు పడమట గల చెఱువు వెనుకభాగమున అందమైన కోనేరు గలదు. మాజీ భారతప్రధాని పి.వి. నరసింహారావు వివాహము ఈ దేవాలయము నందే జరిగినదని తెలియుచున్నది.

ఇల్లందకుంటలోని సురమ దేవాలయములో శ్రీముఖ మాఘ బహుళ తదియ గురువారము రోజున వేయబడిన శాసనముంది. శక సంవత్సర సంఖ్య లేదు గనుక ఈ తెలుగు శాసనము తేదీ నిర్ణయించుట కష్టము. బోగంబలరాయని చెల్లెలు లక్ష్మీనాంచారు యాగశాల మంటపము కట్టించినదని ఈ ఎనిమిది పంక్తుల శాసనము తెలుపుతుంది[194]. శ్రీరామ దేవాలయ గర్భగృహము ముందర గల నాలుగు పంక్తుల ఆధునిక లిపి తెలుగుశాసనములో సీతాయల్లప్ప కుమారుడు వీరప్ప భార్య ముత్తమ్మ పుణ్యము అని భక్తురాలి గురించి పేర్కొనబడింది[195]. ఇవి తప్ప ఇచట ప్రాచీన శిలాశాసనాధారము లేవీ లేవు.

## 58. బిజిగిరి షరీఫ్

కరీంనగర్‌కు తూర్పున జమ్మికుంట మండలంలో గల బిజిగిరి షరీఫ్‌లో రైల్వేస్టేషన్ ఉంది. ఇచట హజ్రత్ ఇంకెషావలీ రహమతుల్లా అలీ గారి దర్గా ఉంది. దీనికి నాలుగువైపుల గల స్వాగత తోరణ ద్వారములు చూడముచ్చటగా ఉన్నాయి. ఇచటి ప్రకృతి సౌందర్యము, ప్రశాంత వాతావరణము మదికి హృదికి ఆహ్లాదము కలిగించి ఆధ్యాత్మిక భావనలను రేకెత్తిస్తాయి. దర్గాభవనముపై నున్న గుంబద్ ఆకర్షణీయంగా ఉంది. ఇంకెషావలి సోదరుడైన అజ్మత్‌షావలి, వారి కుమారులైన, ముర్తజాషావలి, అక్బర్‌షావలి సమాధులు గూడా ఇక్కడ ఉన్నాయి. సిద్ధపురుషుడైన ఇంకెషావలి దర్గాకు సమీపముననే అతని భార్య హజ్రత్ సయ్యద్ అఫ్జల్‌బీ యొక్క సమాధి ఉంది.



దర్గా చుట్టూ గల గుట్టలు, స్వాగతతోరణ ద్వారములు, తండోప తండములుగా నుండు పావురములు ఈ ప్రాంతమును రమణీయ ప్రదేశంగా మార్చినాయి. ప్రతి ఏటా బక్రీద్ పండుగ సందర్భములో జరుగు ఉర్సనకు వేలాది మంది భక్తులు వస్తుంటారు. హిందువులే ఈ ప్రాంతమును అధిక సంఖ్యలో

సందర్శించుట మతసామరస్యమును చాటుతుంది. ఈ దర్గా ఎనిమిది శతాబ్దాల క్రిందిదని స్థానికులంటారు. ఇచటి గుట్టపై గల నరసింహ, హనుమాన్ దేవాలయములను చేరుటకు మెట్లున్నాయి. ఒక నాటి విజయగిరినే నేడు బిజిగిరిగా పిలుస్తున్నారు. ఇది బృహత్‌శిలా సమాధులున్న ప్రాచీన స్థావరం.

## 59. నాంపెల్లి

కరీంనగర్‌కు పడమట కామారెడ్డికి పోవు రహదారి ప్రక్కనే వేములవాడ మండలంలో నున్న నాంపెల్లి సుప్రసిద్ధ నరసింహక్షేత్రము. మూలవాగుకు ఉత్తర ఒడ్డున వేములవాడ శైవక్షేత్రముండగా దక్షిణ ఒడ్డున ఈ వైష్ణవక్షేత్రముంది. సిరిసిల్ల నుండి ఈ గ్రామము 8 కి.మీ. దూరంలో ఉంది. ఈ క్షేత్రమునకు రాజరాజనరేంద్రునితోను సారంగధరునితోను సంబంధముంది అని స్థానికుల కథనము. కాని రాజమహేంద్రవరము పాలకుడైన రాజరాజనరేంద్రునికి ఈ ప్రదేశముతో గల సంబంధము నమ్మశక్యముగా లేదు.



ఇచటి గుట్టపై నరసింహదేవాలయముంది. దీనిని చేరుటకు దాదాపు 500 మెట్లు ఎక్కాలి. ప్రస్తుతము గుట్టపైకి రోడు వేసి ఒక పర్యాటక స్థలంగా మార్చటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ దేవాలయానికి కొంత దూరములో తొమ్మిది మంది సిద్ధులుండిన నవనాథసిద్ధుల గుహ ఉంది. గుట్టపైన ధర్మ గుండములున్నాయి. ఇచటి పెద్ద గుండ్రాయి పై నరసింహ స్వామి రూపముంది. ఈ గుండ్రాయితో గూడిన గర్భగృహము ముందు అంతరాళము, దాని ముందు పదిస్తంభముల ముఖ మంటపము ఉన్నాయి. ఇచటి ఒక గుండును సారంగధర గుండు అని పిలుస్తారు.

నాంపెల్లికి సమీపమున కుదురుపాకకు పోవు రహదారి ప్రక్కనే యున్న ఒక పెద్ద గుండ్రాయిపై నిలువెత్తు పార్శ్వనాథ విగ్రహము కాయోత్సర్గాసనంలో చెక్కబడి ఉంది. ఈ తీర్థంకరుని వెనుక మెలికలు తిరిగియున్న సర్పపు పడగలు అతని తలపై ఛత్రముగా ఉన్నాయి. దీనిని బట్టి తొమ్మిది, పదవ శతాబ్దములలో వేములవాడ వలె ఇది గూడా ఒక జైన క్షేత్రమై యుండెనని తెలుస్తుంది. నవనాథ సిద్ధుల గుహ పది, పదకొండవ శతాబ్దాలకు చెందినదై యుండవచ్చు. జైన క్షేత్రముతో పాటు నాంపెల్లి వైష్ణవ క్షేత్రంగా విరాజిల్లడం గమనార్హం. ప్రాచీన శాసనము లేవీ ఇచటగానరావు. గుట్ట క్రింది భాగమున శ్రీ వేంకటేశ్వరాలయము మూడు గదులతో శోభిల్లుచున్నది. ఇందులో దేవేరులు కూడా ప్రతిష్ఠింపబడినారు. నాంపెల్లి సమీపమున బృహత్ శిలాసమాధులుండుటచే ఇది శిలాయుగపు స్థావరమని తెలుస్తుంది.

# 60. కొండగట్టు

కరీంనగర్‌కు ఉత్తరాన 35 కి.మీ. దూరంలో జగిత్యాలకు పోవు రహదారిపై మల్యాల మండలంలో నున్న కొండగట్టు సుప్రసిద్ధ ఆంజనేయ క్షేత్రము. ఇది జగిత్యాలకు దక్షిణమున 15 కి.మీ. దూరంలో ఉంది. గుట్టపై నున్న ఆంజనేయస్వామిని చేరుటకు నాచుపెల్లి ద్వారా గుట్ట వెనుక నుండి ఉండిన ఎడ్లబండ్ల బాట రోడ్‌గా రూపొంది బస్సు సౌకర్యము ఏర్పడింది. ముత్యంపేటరోడ్ నుండి కాలినడకన భక్తులు గుట్టపైకి వెళ్లే వారు. కాని ఇటీవల నూతనంగా కచ్చా ఘాట్‌రోడ్ వేయబడింది. మోటారు వాహనములు ఈ ఘాట్‌రోడ్ గుండా దేవస్థానమును చేరవచ్చు. ప్రభుత్వము కొండగట్టును ఒక పర్యాటక కేంద్రంగా రూపొందించు ప్రయత్నములో ఉంది. ఇచట చారిత్రకాధారము లేవియు లేవు.

దాదాపు 300 సంవత్సరాల పూర్వము పశువులకాపరి సింగం సంజీవుడు ఇచట ఆంజనేయ విగ్రహముగాంచగా పశువులమంద కాపరులు ఒక చిన్న ఆలయం నిర్మించారని స్థానిక కథనము. 160 సంవత్సరముల పూర్వము కొడిమ్యాల ఫర్గణాకు చెందిన కృష్ణారావు దేశ్‌ముఖ్ ఈ ఆలయమును ఉద్ధరించి ప్రస్తుతరూపము కలిపించాడని తెలుస్తుంది[196]. పదహారు స్తంభముల మంటపము వెనుక నున్న మూడు గర్భగృహములలో శ్రీ వేంకటేశ్వర, ఆంజనేయ, లక్ష్మీదేవి రూపములు చూడ ముచ్చటగా ఉన్నాయి. మధ్యనున్న గర్భగృహములోని ఆంజనేయ విగ్రహము శోభాయమానంగా ఉంది. ఆలయ మూడు గోపురములు చూపరుల దృష్టినాకర్షిస్తున్నాయి.

వెలమదొర బల్మూరి రఘుపతి రావు, దమ్మమ్మ దంపతులకు స్వామి వరప్రసాదముగా కొండాల్‌రావు జన్మించి శత్రువులనెదురించుటకై ఇచట బురుజులతో కోట నిర్మించెనని ఒక గాథ ఉంది. అతడు 27 సంవత్సరములకే గతించినను అతని వీరగాథలు జనములో ప్రచారములో ఉన్నాయి. దేవాలయానికి కొంత దూరంలో కొండలరాయని కోట, గుహలు, గుర్రపుడెక్కల గుర్తులున్నాయి.



సంతానములేని మహిళలు, దీర్ఘకాలం బాధ పడుతున్న వ్యాధిగ్రస్థులు ఇచట 40 రోజులుండి పూజలుచేస్తారు. ప్రస్తుతము ఈ క్షేత్రము మండల దీక్షకు ప్రసిద్ధము. వేలాది ఆంజనేయ భక్తులు ఉత్తర తెలంగాణా, పొరుగు రాష్ట్రాల నుండి ఈక్షేత్రము దర్శిస్తారు. ఈ గుట్ట సమీపమున ఒక చిన్న గ్రామము నెలకొంది. ఆంజనేయ దేవాలయము చుట్టూ నూతనంగా నిర్మింపబడిన ప్రహారీ గోడల లోపలి వైపు మంటపముల నిర్మాణము జరిగింది.

# 61. జగిత్యాల

కరీంనగర్‌కు ఉత్తరాన 50 కి.మీ. దూరంలో నున్న జగిత్యాల పట్టణము ఒక రెవెన్యూడివిజన్ కేంద్రము మరియు మండల కేంద్రము. దాదాపు ఐదు దశాబ్దముల నుండి మున్సిపల్‌కౌన్సిల్‌చే పాలింపబడుచున్న జిల్లాలోని అతి పెద్ద పట్టణము. తెలంగాణములోని పెద్దతాలూకాలలో అతి పెద్ద తాలూకా కేంద్రంగా పేరొందిన పట్టణము. దీనికి సమీపమున గల పొలాస గ్రామమునకు వేయి సంవత్సరముల ఘనమైన చరిత్ర ఉంది. కాని జగిత్యాలలో ఒకకోట తప్ప తదితర చరిత్రాధారములేవి గానరావు.

ఎల్గందల్ సర్కారు సువిశాలమైంది. ఇందులో చెన్నూరు, లక్షెటిపేట, నిర్మల్ ప్రాంతములు గూడా చేరి ఉండేవి. ఎల్గందలకోటకు అధిపతిగా నుండిన ముబారిజుల్‌ముల్క్ జఫరుద్దౌలా మిర్జా ఇబ్రహీంఖాన్ ధంసాయనునతడు జగిత్యాలలో క్రీ.శ.1747లో సువిశాలమైన, పటిష్ఠమైన స్థల దుర్గమును ఫ్రెంచి ఇంజనీర్ల సాంకేతిక సహకారముతో నిర్మించాడు[197]. ధంసాయే నిర్మల్ గుట్టలపైన దుర్గనిర్మాణములు గావించాడు. జఫరుద్దౌలా ఇబ్రహీంఖాన్ ధంసా 1789లో గతించగానే అతని కుమారుడు ఫారూక్ మిర్జా ఎహెతెషామ్ జంగ్ ఎల్గందల ఖిలేదారైనాడు. అతడు దుష్పరిపాలన గావించి రెండవ ఆసఫ్‌జా నిజాం అలీఖాన్ పంపిన తాఖీదులను గూడా లెక్కచేయలేదు. అప్పుడు నిజాం రాజా పద్మాసింగ్, కన్వర్ బోదాసింగ్ నాయకత్వములో సైన్యమును పంపాడు. ఎహెతెషామ్ జంగ్ 1791లో ఓడిపోయి ఎల్గందల్ నుండి పారిపోయి జగిత్యాల, ఆ తరువాత నిర్మల్ దుర్గములందు తలదాచుకొన్నాడు. ఈ సందర్భములో నిజాం సేనలు 1791లో జగిత్యాల కోటను ముట్టడించాయి. జగిత్యాల ఖిలేదార్ జఫర్ ఆలం పోరాడి, ఓడిపోయి నిజాం సేనలకు జగిత్యాల దుర్గమునప్పగించాడు. ఆ తరువాత నిజాంసేనలు నిర్మల్‌వైపు శత్రువు వేటలో వెళ్లాయి[198].

జగిత్యాల కోట రాయి, సున్నముతో కట్టబడిన నక్షత్రాకారపు పటిష్ఠమైన కట్టడము. ఇది విశాల మైదానంలో కట్టబడిన స్థలదుర్గము. ఈ కోట చుట్టూ లోతైన కందకముంది. ఇప్పటికి కందకం లేదా అగడ్త నీటితో నిండి ఉంటుంది. 250 సంవత్సరములు గడిచినను కోట చెక్కుచెదరలేదు. కర్రతో చేయబడిన ప్రవేశ ద్వారము నేడు అదృశ్యమైంది. ప్రవేశ ద్వారమునకు వెనుక ఎడమవైపు కందకములోనికి పోవుటకు మెట్లతో గూడిన ఏకైక మార్గముంది. ఈ కోట బురుజులలో దాదాపు రెండు మీటర్ల పొడువుగల తోపులు అనేకములున్నాయి. ఈ ఫిరంగులపై మొహ్మద్‌ఖాసిమ్ పేరుంది. కోట ప్రక్కనే జగిత్యాలలోని అతిపెద్ద మసీదు ఎప్పుడూ జనంతో కిటకిట లాడుతుంది. కోట నిర్మాణము కండ్లపెల్లి చెఱువు ప్రక్కనే జరిగింది గనుక కందకములలో మరియు కోటలోని కోనేరులో నీరు ఎప్పుడు ఎండిపోదు. కోటలోపల మందు గుండు సామగ్రికై నిర్మించిన గదులున్నాయి. ఈ గదుల సమీపముననే కోట వెనుక ద్వారముంది. ఈ ద్వారముపైకి లేచి కందకమును దాటుటకై క్రిందికి వ్రాలు పద్ధతిలో నుండేది. ఇప్పుడీ ద్వారము గూడా

లేకుండా పోయింది. 1930 వరకు జగిత్యాల రెవెన్యూ కార్యాలయములు కోటలోనే ఉండేవి. ఆ భవనముల గోడల ఆనవాళ్లు రెండు మూడు దశాబ్దముల క్రింది మట్టుకు ఉండినాయి. కోటకు సరియైన రక్షణ లేక క్రమేణ శిథిలమగుచున్నది.



కోట ద్వారము



కోట వెనుక భాగము



బురుజుపై ఫిరంగి

క్రీ.శ. 1791లో జరిగిన కోటముట్టడి అనంతరము దాని మరమ్మతులకై ఏటా మూడువేలు ఖర్చుచేశారు. ఇచట ఒక ఖిలేదార్ మరియు 210 సిఫాయిలుండేవారు. ఖిలేదార్ జీతం నెలకు 35 రూపాయలు. సిఫాయి జీతము నెలకు 3-50 మూడన్నర రూపాయలుండేదని తెలుస్తుంది. క్రీ.శ.1880లో జగిత్యాలలో 516 గృహములుండేవని, ఆనాటి జగిత్యాల జనాభా కేవలము 2812అని తెలుస్తుంది.[199] నేడు దాదాపు ఒక లక్ష జనాభాగల పట్టణముగా రూపొందడం గమనార్హము.

పదకొండవ శతాబ్దములో పొలవాస రాజులు పొలాస రాజధానిగా పాలించారు. పొలాసలోని క్రీ.శ. 1108 కన్నడశాసనము మొదటి మేదరాజు పొలాస రాజధానిగా పాలించెనని తెలుపుతుంది. అతని అనంతరం అతని కుమారుడు జగ్గదేవుడు క్రీ.శ. 1110 నుండి 1116 వరకు పాలించాడు. ఇతడు మహాయోధుడు. 21 యుద్ధములు చేసి విజయములు సాధించి నూతన గ్రామములను స్థాపించాడు. పొలాసకు దక్షిణాన 6 కి.మీ. దూరంలో జగ్గదేవుడు అతని పేరట జగ్గదేవాలయము నిర్మించిఉంటాడు. ఇది క్రమముగా జగదాలయము, జగతిఆలయముగా మారి ప్రస్తుతము జగిత్యాల అయిఉంటుంది.[200]

ఏడవ నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ 1937లో అతని పరిపాలనా రజతోత్సవములను రాజ్యమంతట జరిపించాడు. ఈ రజతోత్సవముల సందర్భములో చల్‌గల్ రాజా జువ్వాడి ధర్మజలపతి రావు జగిత్యాల నడిబొద్దున 1937లో అందమైన, ఎత్తైన క్లాక్‌టవర్ నిర్మాణము గావించాడు. అప్పుడే జగిత్యాల వేణుగోపాలస్వామి ఆలయమునకు ఉత్తరమున చల్‌గల్ గడి నిర్మించబడింది. జగిత్యాల క్రొత్త బస్‌స్టేషన్ వద్ద నిర్మింపబడిన కమాన్ కూలిపోయి అదృశ్యమైంది.



జగిత్యాలలోని వేణుగోపాలస్వామి ఆలయము ఇరువదవ శతాబ్దపు ఆరంభములోనే నిర్మింపబడింది. ఇటీవల ఈ ఆలయ అర్చకులు నంబి వేణుగోపాలాచార్యులు దీని పునర్నిర్మాణము గావించారు. జగిత్యాల శివవీధిలోని శివాలయము 1930 మరియు ఊరుబయట పడమట గుట్టపై గల గుట్టరాజేశ్వరాలయము 1940 ప్రాంతములో నిర్మింపబడినట్లు తెలియుచున్నది. పాతజగిత్యాల గ్రామము పురాణిపేట నుండి జగిత్యాల ఖిలావరకు వ్యాపించి ఉండేది. విద్యానగర్, జంబిగద్దె, అంగడిబజార్, యావర్‌రోడ్, వాణీనగర్, తులసీనగర్, ధరూర్‌క్యాంపు, బాలాజీనగర్, కృష్ణానగర్, అరవిందనగర్ మున్నగునవి జగిత్యాల పట్టణములో కొత్తగా విస్తరించిన ప్రాంతములు. ప్రస్తుతమున్న న్యాయ, రెవెన్యూ కార్యాలయములు, టౌన్‌పోలీస్‌స్టేషన్, ఆసుపత్రి, ఉన్నతపాఠశాల మున్నగు ప్రభుత్వ భవనములన్నీయు ఇరువదవ శతాబ్దారంభములో నిర్మింపబడినాయి.

# 62. నందగిరి - కోట్ల నరసింహులపల్లె

కరీంనగర్‌కు ఉత్తరాన 30 కి.మీ. దూరంలో పెగడపెల్లి మండలంలో నందగిరి మరియు గంగాధర మండలంలో కోట్ల నరసింహులపల్లె గ్రామములున్నాయి. ఇవి ఒకటి ప్రక్కన ఇంకొకటి గల జంటగ్రామాలు. గంగాధర ద్వారా ఈ ప్రాంతమును జేరవచ్చు. బూర్గుపల్లి సమీపములోని కోట్ల నరసింహులపల్లి హరిహర క్షేత్రంగా పూర్వము విరాజిల్లింది.

## నందగిరి వీరభద్రస్వామి దేవాలయము

కాకతీయులు శైవమత పోషకులై అనేక శివాలయములు నిర్మించారు. వీటిలో వీరభద్రస్వామి దేవాలయములున్నాయి. వాటిలో నందగిరి వీరభద్రస్వామి ఆలయము సుప్రసిద్ధము. గర్భగృహము, చిన్న అంతరాళము, పదహారు స్తంభముల ముఖమంటపముతో నున్న ఈ దేవాలయము ఉత్తర ముఖమును కలిగి ఉంది. దక్షిణదిశలో నున్న గర్భగృహము నందు వీరభద్రుడు ప్రతిష్ఠింపబడినాడు. అతని పైహస్తములందు డమరుకము,త్రిశూలములున్నాయి. క్రింది కుడిహస్తములో ఖడ్గముండగా వామహస్తము వరద ముద్రలో ఉంది. ముఖమంటపమునకు పడమట గల వేరొక గర్భగృహము నందు రాజరాజేశ్వరస్వామి లింగరూపంలో నున్నాడు. మంటప లోకప్పు చదునుగా ఉంది. కాని మధ్యలో లుపవితాన రీతిలో నుండి పైన గల చదరపు ఫలకము విరబూసిన పద్మముతో అలంకరింపబడింది. ఇదే రీతిలో గర్భగృహములోని లోకప్పు కన్పట్టును. మంటపము చుట్టూ పిట్టగోడ ఉంది. అధిష్ఠానము నందు పద్మశిల్పములున్నాయి. దేవాలయము పైన నున్న దక్షిణ, పడమటి రెండు గోపురములు నక్షత్రాకారములో మెట్లతో గూడి ఎత్తుగానున్నాయి. శిఖరాగ్రములందు కలశములున్నాయి. పైకప్పు చూరు కొంత వంపుగా నుండి అర్ధచంద్రాకార గోళములతో అలంకరింపబడింది. చాళుక్య కళారీతులలోని నంది ఇచట ఉంది. దేవాలయం ముందు కొత్తగా నంది మంటప నిర్మాణము జరిగింది. మంటపము ముందు

ఎత్తైన నంది స్తంభము నిలిచిఉంది. దానిపై ఒక చదరపు ఫలకము మాత్రమే ఉంది. చిన్ననంది గల మంటపము నేడు ఈ స్తంభముపై కానరాదు.



వీరభద్రస్వామి దేవాలయము

## మల్లికార్జున దేవాలయం

ఇది కాకతీయుల కాలపు దేవాలయం. అంతరాళము, ముఖమంటపము శిథిలమై అదృశ్యమైనాయి. తూర్పుముఖమును కలిగియున్న ఈ దేవాలయములో మిగిలియున్న గర్భగృహములో ఎత్తైన వేదిక పై నల్లని గ్రానైట్ లింగం ప్రతిష్ఠింపబడింది. కాకతీయుల లింగములలోవలె వేదిక మధ్యభాగమున వర్గములున్నాయి. అంతరాళ ద్వారము శైవ ద్వారపాలకులతో ప్రక్కలకు జాలికిటికీలను కలిగి ఉంది. గర్భగృహద్వారము త్రిశాఖలతో శోభాయమానముగా నుండి, వాటి క్రింది భాగమున గల శైవ ద్వారపాలకులకు ఇరువైపుల చామరధారిణులు అందముగా మలచబడినారు. లలాటమున గజలక్ష్మి, పతంగము పైన ముందుకు విస్తరించియున్న చూరు నుంచి నీటిచుక్కలు జారిపడుతున్నట్లుగా ఝూరావళితో అలంకరింపబడింది. తోరణము నందు శిఖర అంతస్తులు చెక్కబడినాయి. అంతరాళపు కప్పుకూలిపోయింది. గర్భగృహముపై నున్న శిఖరము శిథిలమైంది. కాని కప్పుపై పెద్ద పెద్ద శిలాఫలకములు నేటికి నిలిచిఉన్నాయి. గర్భగృహపు గోడల బయటిపొర కూలిపోగా, లోపలిపొర బయటపడింది. మంటపము అదృశ్యమైనను దాని చదరపు ఫలకముపై వృత్తాకారపు రంగశిల నేటికి నిలిచిఉంది.

## నాంచారీశ్వరగుడి

వీరభద్రస్వామి దేవాలయానికి కొంత దూరంలో పొలాల్లో సోమనాథ దేవాలయముంది. దీనినే స్థానికంగా ఎఱుకల నాంచారి గుడి అంటారు. శిథిలమైన ఈ గుడి ముందు నల్లసరపురాయితో మలచబడిన పెద్దనంది కాకతీయ శిల్ప ఔన్నత్యమును చాటుచు

శోభాయమానంగా ఉంది. ఈ నంది మువ్వల, గజ్జెల, గంటల హారములతో శోభిలుచున్నది. చెక్కుచెదరకుండా ఉన్న ఈ అందమైన నందిని మ్యూజియంలో భద్రపరిస్తే బాగుంటుంది.

నందగిరి వీరభద్ర స్వామి దేవాలయం 12 లేదా 13 శతాబ్దాలకు చెందింది. మల్లికార్జున, నాంచారీశ్వర దేవాలయాల్లో కాకతీయుల కాలపు సుందర శిల్పములు ఈ విషయమును ధృవపరస్తున్నాయి. నంధగిరి అతి ప్రాచీనమైన కోటలో నుండినందున దీనిని నందగిరికోట్ల మరియు నరసింహపల్లిని కోట్ల నరసింహులపల్లి యని పిలుస్తారు. మౌర్యులకు ముందు మగధనేలిన నందరాజులు గోదావరి ఒడ్డున నౌనందధేరా యను సైనిక శిబిరము నిలుపుట వలన అక్కడ వెలసిన పట్టణము నాందేడ్‌గా పిలువబడుతుంది. నందరాజులు ఈ ప్రాంతమును గూడా పాలించి బహుశః వారి కాలములో ఈ నందగిరిని స్థాపించి మట్టికోట నిర్మించియుంటారు. ఆ కోట గోడలు, అగడ్తల చిహ్నములు నేటికీ కనిపిస్తున్నాయి.

## నరసింహదేవాలయం

కోటలో నుండిన నరసింహులపల్లె నేడు కోట్లనరసింహులపల్లెగా పిలువబడుతుంది. గుట్టపైన మధ్యయుగపు నరసింహదేవాలయముంది. ముఖద్వారము వరకు దాదాపు 60 మెట్లున్నాయి. గుట్టపైన శిథిలమైన కోటగోడల చిహ్నములున్నాయి. గుట్టపై నున్న లోతైన గుహ గర్భగృహముగా మార్చబడింది. గర్భగృహద్వారము పడమటి ముఖము కలిగి ఉంది. ఈ దేవాలయమందు ఆళ్వారుల విగ్రహములున్నాయి. పెద్ద గుండ్రాయి పై నరసింహస్వామి చెక్కబడి ఉన్నాడు. లక్ష్మీ సమేత నరసింహ విగ్రహము వెనుక గల శిలా తోరణముపై దశావతారములు చెక్కబడినాయి. 12 స్తంభములతో గూడిన కళ్యాణమంటపం 10 అడుగుల చతురస్రము. గుట్టపైన ఆలయమునకు తూర్పున కోనేరుంది. ఒక గుండ్రాయిపై పంచముఖ నరసింహస్వామి పదహారు చేతులతో చెక్కబడిఉన్నాడు. స్వామి హిరణ్య కశ్యపుని ఉదరము చీల్చి ప్రేగులు తీయుచున్నట్లు గల ఈ సుందరశిల్పము చాలా అరుదైంది[201].

రామడుగు దేశ్‌పాండ్య కలువకోట క్రిష్ణయ్య నందగిరి, కోట్ల నరసింహులపల్లె దేవాలయముల జీర్ణోద్ధరణ గావించినట్లు తెలియుచున్నది. నందగిరి కోట్ల హరిహర క్షేత్రంగా నేటికీ వేలాది భక్తుల పూజలందు కొంటుంది.

# 63. కొత్తకొండ



కరీంనగర్‌కు ఆగ్నేయాన భీందేవరపల్లి మండలంలో ముల్కనూరు సమీపమున గల కొత్తకొండ గ్రామము పేరొందిన వీరభద్రస్వామి క్షేత్రము. ఇచటికి హుజూరాబాద్ లేదా హుస్నాబాద్ నుండి బసు ద్వారా జేరవచ్చు. ఇచటి కోరమీసాల వీరభద్రస్వామి కాకతీయుల కాలములో మల్లికార్జున పండితుని మనుమడు కేదార పండితునిచే ప్రతిష్ఠింపబడినట్లు స్థానికుల

కథనము. కొండపై నున్న వీరభద్రస్వామి తిరిగి గుట్ట క్రింద ప్రతిష్ఠింపబడినట్లు తెలుస్తుంది. సంక్రాంతి పండుగ సందర్భములో జరుగు ఉత్సవములలో అగ్నిగుండముల నిర్వహణ, జేగంటల ధ్వనులు, ప్రభల సౌందర్యము, అలంకరింపబడిన వాహనములు, బండ్లు వేలాది భక్తులను ఆకర్షిస్తున్నాయి.

## 64. కొత్తగట్టు

కరీంనగర్‌కు ఆగ్నేయాన హుజూరాబాద్‌కు పోవు రహదారి ప్రక్కన కేశవపట్నం మండలంలో గల కొత్తగట్టు గ్రామము మత్స్యగిరీంద్రస్వామి దేవాలయమునకు ప్రసిద్ధము. ఇచటి గుట్టపై నున్న దేవాలయము చేరుటకు ప్రధానరోడ్ ప్రక్కనుండియే మెట్లున్నాయి. విష్ణువు మత్స్యరూపమున ఒక గుండ్రాయిపై చెక్కబడినాడు. గర్భగృహము ముందు 16 స్తంభముల మంటపము ఉంది. దాని ప్రక్కనే గల నరసింహాలయ గర్భగృహము ముందు గూడా 16 స్తంభముల మంటపముంది. గుట్టపై నున్న కోనేరులో ఎల్లప్పుడు నీరు ఉండుట విశేషము.



## 65. ఓదెల

కరీంనగర్‌కు తూర్పున సుల్తానాబాద్ సమీపంలోగల మండలకేంద్రము ఓదెల కాజీపేట–వార్ధా రైల్వేలైన్ పై ఉంది. గొల్ల కురుమ కులముల వారికి ఇది ప్రధానమైన మల్లన్న లేదా మల్లికార్జున క్షేత్రము. పూర్వము నుండి ప్రభలతో ఒగ్గువాయిద్యములతో, అలంకరించిన బండ్లతో ఇక్కడ జరుగు శివరాత్రి ఉత్సవములకు వేలాది భక్తులు వస్తుంటారు. బోనములు తీయు ఆచారము అమలులో ఉంది. వేములవాడలో వలె ఇచట గూడా కోడెలను దేవునికి కానుకగా ఇస్తుంటారు. ఇచట కేశఖండన కార్యక్రమములు గూడా జరుగుతాయి.



## 66. కమాన్‌పూర్

కరీంనగర్‌కు ఈశాన్యము నందు పెద్దపెల్లి నుండి మంథనికి పోవు రహదారిపై కమాన్‌పూర్ మండల కేంద్రముంది. గ్రామములో వేణుగోపాలస్వామి ఆలయముంది. గ్రామము బయట తూర్పున ఒక పెద్ద గుండ్రాయి పై ఆదివరాహ స్వామి రూపము శంఖ చక్రములతో చెక్కబడింది. దీనిచుట్టూ ప్రహారిగోడ నిర్మింపబడింది. ఈ గుండునకు ఇరువైపుల వేదిక రావికంటి

శ్రీనివాస్ గారిచే నిర్మింప బడింది. ఈ వరాహస్వామికి పూజలు విశేషంగా జరుగుచున్నాయి.



ఆది వరాహస్వామి గండశిల

# 67. రామడుగు

కరీంనగర్‌కు ఉత్తరాన గంగాధరకు తూర్పున గల మండలకేంద్రము రామడుగు. ఇది శిల్పులకు, శిల్పకళకు ప్రసిద్ధము. అర అడుగునుండి ఆరు ఆడుగుల ఎత్తు గల ప్రతిమా శిల్పములు ఇచట విస్తారంగా చేయబడుతాయి. రామడుగు గ్రామములో ఎత్తైన కోటగోడలు మరియు కోటద్వారము చూపరులనాకర్షిస్తున్నాయి. ఆగమములకు, శిల్పశాస్త్రములకు సరిపోవు రీతిలో సమస్త దేవతా విగ్రహములు ఇచట తయారౌతాయి. రోడ్‌నకు ఇరువైపుల శిలలు, శిల్పులు, శిల్పములే కనిపించుట ఈ గ్రామము ప్రత్యేకత. అద్భుతమైన కళాఖండాలను సృష్టించి ఇచటి శిల్పులు శిల్పకళకే వన్నెతెస్తున్నారు.



# 68. మీర్జంపేట

కరీంనగర్‌కు తూర్పున 56 కి.మీ. దూరమున శ్రీరాంపూర్ మండలంలో మానేరునది ఒడ్డున నున్న తొలిచారిత్రక యుగపు గ్రామమిది. మీర్జంపేట నుండి గుంపుల ఊరికి పోవునప్పుడు మధ్యలో 50 నుండి 60 వరకు బృహత్ శిలా సమాధులున్నాయి. వీటిని బట్టి మీర్జంపేట గ్రామ ప్రాచీనతను గమనింపవచ్చు. మీర్జంపేట హ్యామ్లెట్ పోచంపల్లిలో మానేరు నది సమీపమున అనుమాండ్ల వెంకటయ్య ఒక దిబ్బ (Mound) వద్ద బావి కొఱకు త్రవ్వకము జరుపగా రాతి కట్టడముతో నున్న చిన్న బౌద్ధ స్థూపమొకటి 1994లో బయల్పడింది. ఇచట బుద్ధుని అస్థికలు గల బరణి లభ్యమైందని కరీంనగర్ పురావస్తు శాఖ సాంకేతిక నిపుణుడు యం.లక్ష్మినారాయణ తెలిపాడు. వారిది అదే గ్రామము. ధూళికట్ట, పాషాయిగాంవ్ స్థూపాలలో లభ్యముగాని బుద్ధధాతువులిచట లభించడం విశేషం.

ఆవుల వెంకటయ్య పెరడులో నల్లరాతి భైరవ విగ్రహమొకటి పడి ఉంది. ఇచటనే చతుర్భుజములదేవి విగ్రహము కాకతీయుల కాలము నాటిది పడి ఉంది. హస్తములందు డమరుకము, త్రిశూలము, నాగసర్పములు కనిపిస్తాయి. ఒక గుండ్రాయిపై భైరవ, కాళీరూపములు చెక్కబడ్డాయి. డాలు, ఖడ్గము ధరించిన వీరగల్ ఎర్రరాయి ప్రతిమ కాటమయ యోధునిదని స్థానికుల కథనము. ఇచట రాతియుగపు గొడ్డళ్లు, అరుగుడు బండలు, నూరుడు రాళ్లు బయల్పడినాయి. మీర్జంపేటకు సమీపమున గల కిష్టంపేట గ్రామములో ఒకే పానవట్టముపై రెండు లింగములుండుట విశేషము. ఇది ఎర్ర ఇసుక రాయితో చెక్కబడింది.

## 69. సర్వాయిపేట

కరీంనగర్‌కు ఆగ్నేయము నందు సైదాపూర్ మండలంలోని ఆకునూర్ గ్రామము యొక్క హ్యామ్లెట్ సర్వాయిపేట మూడు వందల సంవత్సరాల పూర్వము గొప్ప చరిత్రను సృష్టించిన ప్రదేశము నేడొక కుగ్రామము. ఇది సైదాపూర్ నుండి 10 కి.మీ. దూరంలో ఉంది. సర్వాయిపాపడు లేదా సర్దార్ పాపన్న మూడు శతాబ్దముల పూర్వము ఇచట ఒక కోటను నిర్మించి గోలకొండ సుల్తాన్‌ల, మొగలుల అధికారము ధిక్కరించెనని తెలుస్తుంది. సామాన్యుడైన సర్దార్‌పాపన్న మాన్యుడై బలహీన వర్గాలను చేరదీసి బలమైన సైన్యాన్ని తయారుచేసి నవాబు నియమించిన పాలకులను, జమీందారులను ఎదురించి పేద ప్రజల నాదుకొన్నాడు. దాదాపు 30 సంవత్సరాలు (క్రీ.శ.1680–1710 వరకు) సర్వాయి పాపన్న ముస్లింపాలకులకు ప్రక్కలో బల్లెమై నిలిచాడు[202]. సర్వాయి పాపన్న పుట్టింది పులగాం. అదియే నేటి వరంగల్ జిల్లాలోని జనగాం యని తెలుగు విశ్వవిద్యాలయ ఉపకులపతిగా నుండిన ఆచార్య పేర్వారం జగన్నాథం అభిప్రాయము. కాని పాపన్న కృష్ణా జిల్లాలోని జగ్గయ్యపేట నుండి వరంగల్ షాపురంనకు వచ్చాడని మరికొందరి అభిప్రాయం. అతడు షాపురంలో ఖిలా నిర్మించుట వలన నేడది ఖిలాషాపురంగా పిలువబడుతుంది.



పాపన్న తల్లి సర్వమ్మ కావటంతో ఇతడు సర్వాయి పాపన్నగా పిలువబడినాడు. ఈ సర్దార్ స్థాపించిన గ్రామమే సర్వాయిపేట. అతడిచట నిర్మించిన కోట మరియు శివాలయం శిథిలమగుచున్నాయి. ఇతడు షాపురం, తాటికొండ, సర్వాయిపేటలో కోటలు నిర్మించి తగిన సైన్యాన్ని సమకూర్చుకొని ముస్లింపాలకులను ముప్పుతిప్పలుపెట్టాడు. చివరకు మొగలు సేనాని యూసుఫ్‌ఖాన్‌ను ఎదురించుచు హుస్నాబాద్ అటవీ ప్రాంతములో ప్రాణాలు గోల్పోయినట్లు ఆవాల దామోదర్‌రెడ్డి 1994లో రచించిన సర్దార్ సర్వాయి పాపన్న (బుర్రకథ) పుస్తకములో వర్ణింపబడింది. ఖిలాషాపురంలో పాపన్న కాంస్య విగ్రహ ప్రతిష్ఠ జరుగడం విశేషం. ఆచార్య

జగన్నాథం గారి అధ్వర్యంలో తెలుగు విశ్వవిద్యాలయం ద్వారా పాపన్న త్రిశతజయంతి జరుపబడుట గర్వకారణము[203].

## 70. ఇతర స్థలాలు

కరీంనగర్ జిల్లాలో కొంత చారిత్రక ప్రాధాన్యత సంతరించుకున్న ప్రదేశాలు, దేవాలయాలు. రాబోవు చరిత్ర పరిశోధకులు అధ్యయనం చేయు అవకాశము కలిపించుటకై ఈ క్రింది వివరములు ఇవ్వబడినాయి. జిల్లా పడమటి నుండి ఆరంభించగా మల్లాపురం మండలం కేంద్రంలో నొక గుట్టపై కళ్యాణి చాళుక్య చక్రవర్తి సోమేశ్వరుని కాలపు కనక సోమేశ్వర దేవాలయముంది. మల్లాపురంలో ఎలాంటి శాసనము లేదు. కాని మల్లాపురంకు సమీపమున గల కోరుట్లలో త్రైలోక్యమల్ల సోమేశ్వరుని (క్రీ.శ. 1042-1068) శాసనముంది[204]. దీనిని బట్టి మల్లాపురం ప్రాంతం గూడా అతని ఏలుబడిలో ఉండేదని బోధపడుతుంది. ఇదే మండలంలో గోదావరి ఒడ్డున గల వేంపెల్లిలో శిథిలమైన భీమేశ్వరాలయముంది. మెటుపెల్లి మండల కేంద్రంలోనే గడిలో కేశవనాథాలయము, దానికి సమీపంలోనే మెట్లతో గూడిన అందమైన కోనేరు ఉంది. ఈ కోనేరులోని మంటపమునకు వేరే మెట్లున్నాయి. మెటుపెల్లి గ్రామములో ప్రాచీన ఓంకారేశ్వరాలయం ఉంది. కథలాపురం మండలంలోని దుంపెట గ్రామంలో గుట్టపై నున్న గుహతో గూడిన నరసింహదేవాలయము, గుట్టక్రిందనున్న మంటపము, అదే మండలములోని భూషన్‌రావుపేటలో గల శివాలయము, వేణుగోపాలాలయం మరియు గంభీర్‌పూర్‌లోని శిథిల శివాలయము, వేంకటేశ్వరాలయం, పెగ్గెర్లలోని నరసింహ ఆలయం స్థానికుల ఆదరణలో ఉన్నాయి. సారంగాపూర్ మండలంలోని బీర్‌పూర్ గుట్టపై నున్న నరసింహ దేవాలయము సుప్రసిద్ధము. ధర్మపురి మండలంలోని రాయపట్నం వద్ద నున్న ఒక చెలక (చేను)లో శాతవాహనుల కాలము నాటి పెంకులు, పూసలు, ఇనుపచిట్టము (Iron Slags) మున్నగునవి లభిస్తాయి. దీనిని స్థానికులు డెబ్బయి రూపాయల చెలకయని పిలుస్తారు. గ్రామస్థులకు శాతవాహనుల నాణెములు దొరుకుతుంటాయి. దీనికి దగ్గరలో నున్న పాషిగాంవ్‌లో బౌద్ధస్థూపముండేది. దీనికి సమీపమున గల స్తంభంపెల్లి గుట్టల్లో గుహలున్నాయంటారు. ఇదే ధర్మపురి మండలంలోని నక్కలపేట గ్రామంలో ఇటీవల ధ్యానముద్రలో నున్న జైన విగ్రహము బయల్పడింది. కోరుట్ల మండలంలోని సంగెం గ్రామము నందు ఒక వాగులో ఇంకొక ఒర్రె (Stream) వచ్చి సంగమించుచోట సంగమేశ్వరాలయముంది. నాగులపేట నాగుల పూజకు ప్రసిద్ధము. కోరుట్లకు 6 కి.మీ. దూరంలో నున్న పైడిమడుగు గ్రామము చివరలో శతాబ్దములనాటి ఒక పెద్ద మర్రిచెట్టు పర్యాటకులు చూడదగ్గది.

మల్యాల మండలంలోని రాజారం గుట్టపై నున్న గుహలలో రామాలయం ఉంది. ఒక పెద్ద రాయియే పైకప్పుగా ప్రకృతి సిద్ధంగా ఉంది. జగిత్యాల సమీపమున గల శ్రీరాంసాగర్

ప్రధానకాలువ ప్రక్కకే ఈ రామాలయం గుట్ట ఉంది. మల్యాల నుండి తక్కలపెల్లికి పోవు మార్గమున గల వ్యవసాయపు భూములలో శిథిలమైన ఒక వైష్ణవాలయముంది. విడి ప్రతిమలు అచట పడి ఉన్నాయి. కొడిమ్యాల మండల కేంద్రంలో ఊరు బయట వాగుకు సమీపమున పొలములలో శిథిలమైన శివాలయముంది. కొడిమ్యాలలోని ఎత్తైన మట్టిగోడలు గతంలో నుండిన గడి వైభవాన్ని తెలుపుతాయి. నాచుపెల్లి గ్రామంలో శిథిలావస్థలో నున్న శైవ వైష్ణవ రెండు చిన్న గుడులున్నాయి. ప్రస్తుతము వాటిలో విగ్రహాలు లేవు. ఇదే కొడిమ్యాల మండలంలోని నల్లగొండ వద్ద గల గుట్టపై నున్న నరసింహదేవాలయము సుప్రసిద్ధము. ఇచటి గుహయే గర్భగృహంగా మార్చబడింది. దీని ముందు ముఖమంటపముంది. గుట్టపై నున్న దేవాలయం చేరుటకు మెట్లున్నాయి. జగిత్యాల నుండి నిజామాబాద్‌కు పోవు జాతీయ రహదారిపై గల మేడిపెల్లి మండల కేంద్రంలో ఊరి బయట యోగానంద నరసింహ స్వామి దేవాలయముంది. గర్భగృహము ఆరు అడుగుల చతురస్రము. దాని ముందు అంతరాళము, ముఖమంటపము ఉన్నాయి. ఈ గుడిలో ఆళ్వారుల విగ్రహములున్నాయి.

గంగాధర మండలంలోని గరిషెకుర్తి గ్రామంలో ప్రహరి గోడలతో నున్న ఒక వైష్ణవాలయముంది. దాని ముందు గరుడరూపము అందంగా చెక్కబడింది. బోయిన్‌పెల్లి మండల కేంద్రంలో చిన్న శివాలయము, చిన్న వైష్ణవాలయము ఒక దాని ప్రక్కకొకటి ఒకే ఆవరణలో ఉన్నాయి. బోయినపెల్లి నుండి వేములవాడకు పోవు రోడ్ ప్రక్కనే గల కంబంపెల్లి లేదా స్తంభంపెల్లి ఒక కుగ్రామము. అచటి పెద్ద చెఱువు సమీపముననే మధ్యయుగం నాటి చిన్న శివాలయముంది. శిఖరము మెట్లతో గూడిన పిరమిడ్ ఆకారము. ద్విహస్తముల గణపతి విగ్రహము, శిథిలమైన సప్తమాతృకలఫలకము యొక్క ముక్కలు రోడ్ ప్రక్కనే పడి ఉన్నాయి. వేములవాడ మండలంలో మానేరునది, మూలవాగుల సంగమమందు గల అనుపురం గ్రామములో చాళుక్యులకాలపు శివాలయముంది. ప్రాచీన కళారీతిలో గల ద్విహస్తముల మకుటములేని గణపతి విగ్రహముంది. ఇదే మండలంలోని ఫాజల్‌నగర్ వద్ద గల గుట్టలలో లోతైన గుహలున్నాయని అంటారు. అందులో జైన మునులుండే వారని స్థానికుల కథనము. వేములవాడ గొప్ప జైన కేంద్రమై యుండుట గమనార్హము.

సిరిసిల్ల డివిజన్‌లోని గంభీరావుపేట మండలంలో మానేరునది ఒడ్డున గల భీముని మల్లారెడ్డిపేట గ్రామము రమణీయమైన ప్రకృతి దృశ్యాలకు, శిథిలమగుచున్న పురాతన దేవాలయాలకు నిలయం. చిన్నచిన్న జలపాతాలు, అద్భుతమైన శిల్పసంపద గల ఈ గ్రామము ప్రకృతి ప్రేమికులకు విడిది ప్రాంతము. ఇచటి ప్రకృతి అందాలను దృష్టి యందుంచుకొని రాష్ట్ర, జిల్లాస్థాయి ఫోటోగ్రఫీ వర్క్‌షాప్‌లు, పోటీలు నిర్వహింపబడుతుంటాయి. ఇచటి రెండంతస్తుల మంటపము చూడముచ్చటగా ఉంది. ముస్తాబాద్ మండలంలోని గూడెం వేంకటేశ్వరాలయం ప్రసిద్ధము. సిరిసిల్ల సమీపాన ఉన్న ఇల్లంతకుంట మండల కేంద్రంలో శైవ వైష్ణవాలయాలున్నాయి.

ఈ మండలంలోని రామాజిపేటలో రామాలయం ఉంది.



భీముని మల్లారెడ్డిపేట రెండంతస్తుల మంటపము    నల్లగొండ నరసింహ దేవాలయము

కరీంనగర్ జిల్లా దక్షిణభాగంలో నున్న హుస్నాబాద్ మండలంలోని అక్కన్నపేట గ్రామపు శివాలయము, అంతక్కపేట, తోటపెల్లి గ్రామములలోని శిథిలాలయములు, బెజ్జంకి మండలంలోని కల్లెపెల్లి వేణుగోపాలాలయం జంగపల్లిలోని శిథిలాలయములు, కోహెడ మండలంలోని కూరెల్ల శింగరాయ దైవము, వర్కోల్ నందలి శివాలయము, తంగళ్లపల్లిలోని శివాలయం, వేణుగోపాలస్వామి ఆలయాలు చూడదగ్గవి.

చిగురుమామిడి మండలంలోని రామంచయందలి రామాలయము, సుందరగిరిలోని గుట్టపై నున్న వేంకటేశ్వరాలయము, తిమ్మాపూర్ మండలంలోని నల్లగొండ నరసింహ దేవాలయము, మానకొండూరు మండలకేంద్రంలోని కోట రాతి గోడలు, చెఱువు కట్టపై నున్న పెద్ద గణపతి విగ్రహము, వీణవంక మండల కేంద్రంలోని శ్రీ వేంకటేశ్వరాలయం ఇదే మండల మందున్న చల్లూరులోని వేణుగోపాలాలయము, కేశవపట్నం మండలంలోని ముత్తారం గుట్టపై నున్న వేణుగోపాలస్వామి ఆలయం, దాని ముందు నిలిచియున్న గరుడస్తంభం స్థానికుల దర్శనీయస్థలాలు. ఎల్కతుర్తి మండలంలో వాగు ప్రక్కన కరీంనగర్ నుండి హనుమకొండకు పోవు రహదారికి కొంత దూరమున గల వీరనారాయణ పురంలో కాకతీయుల కాలపు త్రికూటాలయముంది. విగ్రహాలేవీ లేవు. ప్రస్తుతము దేవాలయము అడవిలో ఉంది.

కరీంనగర్ జిల్లాకు తూర్పున హుజూరాబాద్ సమీపమున గల కమలాపూర్ మండల కేంద్రంలో రామాలయం, అదే మండలంలోని ఉప్పల్, శనిగరంలలోని శిథిలాలయములు, జూలపెల్లి మండలంలోని తేలికుంట చెఱువు ఒడ్డున నున్న మధ్యయుగపు శివాలయము, జమ్మికుంట మండలంలోని మడిపల్లిలోని రామాలయం, వేణుగోపాలస్వామి ఆలయం, హుజురాబాద్ మండలంలోని చెల్పూరు గ్రామము బయట పొలాల్లో నున్న చాళుక్యుల కాలపు శివాలయము దర్శనీయములు. చెల్పూరు శివాలయంలోని గర్భగృహములో చాళుక్యుల దేవాలయములలో వలె లింగం యొక్క నాలుగు మూలలందు నాలుగు స్తంభాలున్నాయి. దీని

శిఖరము ముందు చిన్న శుకనాసం ఉంది. చెల్వార్ చాలా ప్రాచీన గ్రామము. ఇచట బృహత్ శిలానవమాధులు రిన్నాయి. హుజూరాబాద్‌కు సమీపమున గల రంగ నాయకుల గుట్ట చాలా ప్రాచీన స్థావరము.

చెల్వార్ శివాలయము



ఇచట నగ్నకబంధ మాతృదేవతా (Mother Goddess) విగ్రహం లభ్యం కావడం గమనార్హం. ఇచటి గణపతి విగ్రహము తలపై సర్పపు పడగల ఛత్రముండుట అరుదైన విశేషం. పెద్దపెల్లి మండలంలోని రాంపల్లి హ్యామ్లెట్ ధర్మాబాద్‌లో తోరణముతో గూడిన రంగనాయక స్వామి ఆలయం దానిపై నున్న గోపురములు చూపరుల దృష్టినాకర్షిస్తున్నాయి. మహదేవపూర్ మండలంలోని అంబట్‌పల్లిలో కాకతీయుల కాలము నాటి అందమైన దేవాలయం శిథిలమగుచున్నది. ఓదెల మండలంలోని కొలనూర్ నందున్న కాకతీయుల కాలపు శివాలయం, మంథని మండలంలోని ఖానాపూర్ మొసళ్ల మడుగు ప్రకృతి రమణీయత, అపురూప శిల్పసంపద ఒకే పానవట్టముపై రెండేసి లింగములున్న రెండు పెద్దశిలలు, పెద్దపెల్లికి సమీపమున గల సబ్బితం మరియు రామగిరిఖిలా శివారులో నున్న గౌరీగుండం జలపాతం, గుహాలయాల స్తంభాలు ఇత్యాదులు పర్యాటకులకు ప్రీతికరమైన ప్రదేశాలు.



అంబట్‌పల్లి (కాకతీయ) శిథిలాలయము



గౌరీగుండం జలపాతము

మానేరునదికి దక్షిణ ఒడ్డునందున్న అల్గునూరులో 8వ, 9వ శతాబ్దములకు చెందిన ద్విహస్తములతో గూడిన పెద్ద గణపతి విగ్రహమొకటి జనవరి 2003లో బయల్పడింది. సహజమైన ఏనుగుతలతో నున్న ఈ గణపతికి మకుటము లేదు. యజ్ఞోపవీతము ధరించిన ఈ గణపతి తొండము కుడిహస్తమందున్న మోదకములపై మోపబడింది. ఆసనము క్రింద మూషిక వాహనముంది. దీనికి సమీపంలో చాళుక్యుల కళారీతులలో నున్న సప్తమాతృకల శకలమొకటి లభించింది. అందులో కౌమారి, వైష్ణవి వాహనములతో నున్నారు. మానేరునది దక్షిణ ఒడ్డున అల్గునూరు, ఉత్తర ఒడ్డున కరీంనగర్ ఉండుట గమనార్హం. ప్రాచీన అరిపిరాల (కరీంనగర్), అల్గునూరుల మధ్య మానేరునది గుండా రాకపోకలుండేవి. సమగ్రమైన పరిశోధన జరిపినచో కరీంనగర్ జిల్లా యందు ఇంకను అనేక ప్రాచీన చారిత్రక స్థలాలను గుర్తించవచ్చు.

# ఆధార గ్రంథములు

(References)


1. B.Rajendra Prasad, *Art of South India.* p. 64
2. *IAPKD*, Nos. 40 & 41
3. N.S.Ramachandra Murthy, 'Art and Architecture of Karimnagar Dist.,' *APHC.* Vol.VII, 1983. Section II, pp. 3&4
4. బి.యన్.శాస్త్రి, వేములవాడ చరిత్ర – శాసనములు, 1991, pp. 95-127
5. N.Venkataramanayya, *Chalukyas of Vemulawada*, pp. 44, 82, 84.
6. M.L.Nigam, *Sculptural Art of Andhra*, p. 20
7. B.Rajendra Prasad, *Temple Sculpture of Andhra Pradesh*, p. 42
8. M.Rama Rao, *Early chalukyan Temples of Andhradesa*, pp. 13,17,33,38. Plates. II & V
9. *తెలంగాణ శాసనములు*, No.21, pp. 173-177
10. N.Venkataramanayya, *Op.cit.* p. 45
11. *తెలంగాణ శాసనములు*, No.19, pp. 120-122
12. Stella Kramrisch, *The Art of India*, p. 203, plate 57.
13. *IAPKD*. No. 2, p. 5
14. T.A.Gopinatha Rao, *Elements of Hindu Iconography*, Vol.I, Part II, p.306
15. *RE*. 1966, No.169, p.42
16. బి.యన్.శాస్త్రి, *Op.cit.*, pp. 15,79,80
17. *Ibid*, p.44
18. S.Gopala krishna Murthy, *Jain vestiges in Andhra*, p. 44
19. *Ibid*, p.45
20. *Ibid*
21. B.Rajendra Prasad, *Op.cit.*, p. 34
22. N.Venkataramanayya, *Op.cit.*, p. 41
23. *EHD*, p. 511
24. డా. మలయశ్రీ, *కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర*, 1977. p.7
25. *EA*, Vol.II, pp. 21-28
26. B.C.Bhattacharya, *The Jain Iconography*, p.87
27. C.Sivaramamurti, *An Album of Indian Sculpture*, p. 82
28. R.P.Hingorani (ed), *Digambara Jaina Iconography*, p. 37
29. B.C.Bhattacharya, *Op.cit.*, p. 87
30. బి.యన్.శాస్త్రి, *Op.cit.*, pp. 33,43 & 67
31. N.Venkataramanayya, *Op.cit.*, pp. 42 & 93
32. *IAPKD*, No.5, p. 12
33. బి.యన్.శాస్త్రి, *Op.cit.*, pp. 111-113
34. రొట్టె విశ్వనాథశాస్త్రి, "ధర్మపురి క్షేత్ర మహాత్మ్యము" ఆంధ్రప్రభ తెలుగు వారపత్రిక, తేది. 19-6-1963.
35. *EA*, Vol. II, p. 22
36. *IAPKD*., No. 31, pp. 93-96
37. సంగనభట్ల నరహరి, "కాలస్రవంతిలో ధర్మపురి", త్రిశతి, 1979, pp. 15 & 16
38. *EA*, Vol. II, p. 25
39. M.Narasimhacharya, *History of the Cult of Narasimha in Telangana*, pp. 123, 124.
40. *Ibid.*, p. 125.

41. సంగనభట్ల నరహరి, *Op.cit.*, pp. 2,13 & 14
42. *Ibid*, pp. 6, 24 & 25.
43. *Ibid*, pp. 3 & 4
44. M.Narasimhacharya, *History of the cult of Narasimha in A.P.*, 1989, p. 209
45. M.Narasimhacharya. *History of the cult of Narasimha in Telangana*, 1989, pp. 124,125.
46. *EHI*, Vol.II, Part II, p. 508, plate, CXLV
47. M.Narasimhacharya, *Op.cit.*, p. 123.
48. సంగనభట్ల నరహరి, *Op.cit.*, p. 24
49. M.RamaRao, *Select Andhra Temples*, p. 23
50. యం.శ్యాంసుందరశాస్త్రి, (ed) త్రిశతి, 1979, pp. 17-23.
51. *IAPKD*, No.8, pp 21-24.
52. *Ibid*, No. 11, pp 29-31.
53. M.Somasekhar Rao & B.Rajendra Prasad, "Temples of choppadani & Raikal" *APHC*, Vol. XI, 1987, pp. 73-75.
54. *Ibid*, p. 74.
55. *EA*, Vol. II, pp. 36-38
56. *EA*, Vol. IV, pp. 67-89
57. *IAPKD*, No. 54, pp 126, 127
58. *EA*, Vol.IV, p. 68
59. S.Gopala Krishna Murthy, *Op.cit.*, p. 44, plate XI
60. M.Narasimhacharya, *Op.cit.*, pp. 103-105.
61. *IAPKD*, No.16, pp. 42-44
62. బి.యన్.శాస్త్రి, *Op.cit.*, p. 14.
63. కరీంనగర్ జిల్లా దర్శిని, జిల్లా సమాచార, పౌరసంబధాల శాఖ ముద్రణ, 1999-2000, p. 19
64. *IAPKD*, No.17, pp. 44-47
65. S.Gopala Krishna Murthy, *Op.cit.*, p.51
66. *IAPKD*, No.42 p. 113
67. *Ibid*, No. 75. pp. 139-141
68. G.Sankhyana Sarma, "Alampur as a Trade Centre", *APHC.*, Vol. XII, 1988. p.83.
69. Parkala Satya Prasad, "Temple outreach in Medieval Andhradesa" *APHC*, Vol. XXIII, 1999. pp. 65-68.
70. క్రీడాభిరామము, 127&128 పద్యములు.
71. *Ibid*, 128వ పద్యము, “కాకతమ్మకు సైదోడు ఏకవీర”
72. B.Rajendra Prasad, *Art of South India.*, p. 171
73. M.Radhakrishna Sarma. *Temples of Telingana*, pp. 62,63.
74. *EHI*, Vol. II, Part II, p.556
75. *Ibid*, pp. 555,556
76. C.Sivaramamurthi, *Early Andhra Art and Iconography*, p. 12, Plate 60.
77. G.Jouveau Dubreuil, *Iconography of Southern India*. plate XXXII.
78. *IAPKD*, No. 26, pp. 71-73
79. *Ibid*. No.33, pp. 99-101
80. B.Rajendra Prasad, *Temple Sculpture of Andhra Prades*, p. 44
81. J.Ramanaiah, *Temples of South India*, 1989, pp. 89 & 272-274
82. *IAPKD*, No. 68, p.134

83. M.Somasekhara Rao & B.Rajendra Prasad, *Op.cit.*, pp. 73-75.
84. *EHI*, Vol.I, Part I, pp. 228,229
85. Late Jitendranath Banerjea, *The Development of Hindu Iconography*, p. 440
86. M.L.Nigam, *Op.cit*, p.58
87. *IAPKD*, No. 53, pp. 125,126.
88. M.Rama Rao, *Early Chalukyan Temples of Andhradesa*, pp. 17 & 38.
89. *EA*, Vol.IV, pp.70-74
90. *Ibid*, pp.81-84
91. *APGKD.*, 1974, p. 246
92. S.Gopala Krishna Murthy, *The Sculpture of the Kakatiyas*, p.21
93. *Ibid*, p.42
94. *Ibid*, p.23, plate 22(a)
95. *Ibid*,
96. *Ibid*, p. 23
97. M.Rama Rao, *Eastern Chalukyan temples of Andhrdesa*, pp. 5-7
98. M.Rama Rao, *Early chalukyan temples of Andhradesa*, pp.17&38
99. ఈనాడు దినపత్రిక, తేది 20-12-1999, జిల్లా ఎడిషన్ పేజి 7
100. S.Gopala Krishnamurthy, *Op.cit.*, p. 7
101. *IAPKD*, No.25, pp. 64-71
102. *JAHRS*, vol.XXXVI, part I, pp. 58-62.
103. *EHD*, p. 710
104. P.Hymavathi, "Temple and Matha as Medical Centres" *APHC.*, Vol. XIII, 1989, p.119
105. *IAPKD*, No. 32, pp. 96-99
106. P.V.P.Sastry, *Select Epigraphs of A.P.*, No.20, pp. 50-55
107. *IAPKD.*, No.45, p. 117
108. *Ibid*, No.70, pp. 135 & 136.
109. *Ibid*, No. 71, p. 136
110. *Census Hand Book*, Karimnagar District, 1961, p. VI.
111. S.Gopala Krishna Murthy, *Op.cit.*, p. 7.
112. బి.యన్.శాస్త్రి, *Op.cit.*, No.1, pp. 95-97.
113. *IAPKD*, No.77, pp. 143-145.
114. *Ibid*, No.74, pp. 137 & 139
115. తెలంగాణ శాసనములు, Vol. I, No. 17
116. *IAPWD*, No. 36
117. *IAPKD*, No. 25, pp. 64-71.
118. J.Ramanaiah, *Temples of South India*, 1989, pp 109, 270 & 271.
119. *Corpus*, part. III, p.2
120. *JAHRS*, Vol. XXXV, pp. 183-188.
121. M.Radha Krishna Sarma, *Temples of Telingana*, p. 129, plate 131.
122. *IAPKD*, No.25, p. 70
123. S.Gopala Krishna Murthy, *Op.cit.*, p. 28
124. S.Rama Kantham, *Guide Book to Kolanupaka Site Museum*, p. 9, plate 2.

125. V.V.Krishna Sastry, *Op.cit.* p. 13
126. *Ibid.* pp. 11 & 13
127. T.Vedantam (ed), *Town Study of Manthani.*, p. 19.
128. *IAPKD,* No.23, pp. 58-60
129. *JAHRS,* Vol. XXXVI, part I, pp. 33-47.
130. *IAPWD,* No.31, p. 87
131. *Ibid.*, No.50, pp.141-149.
132. *Ibid,* No.36, pp. 94,95
133. *IAPKD,* No. 25. pp. 65-70
134. *Ibid.*, No. 28, pp. 75-80.
135. *JAHRS,* Vol. XXXV, p. 169.
136. T.Vedantam (ed), *Op.cit.*, pp. 22&23
137. *Corpus,* part I, p. 20.
138. J.Ramanaiah, *Op.cit.*, p.206
139. P.Hyamavathi, "Temple and Matha as a Medical Service Centre" *APHC,* Vol.XIII, 1989, p. 118
140. P.V.P. Sastry, *Op.cit.*, p. No. 20, pp. 50-55.
141. *APGKD.*, 1974, p. 216.
142. T.Vedantam (ed), *Op.cit.*, p. 159
143. P.Sreenivasachar (ed), *The Arechaeological Bulletin No. II,* plate XXXVII B
144. Alexr Rea, *Chalukyan Architecture.*, pp. 11&12, plate. XVII
145. S.Gopala Krishna Murthy, *Op.cit.*, p. 41
146. *IAPKD.*, No. 34, pp. 101-103.
147. P.Hymavathi, *Op.cit.*, p. 118.
148. *IAPKD,* No. 29, pp. 80-88.
149. *ARE,* 1967, p.7
150. *Ibid,* No. 385, pp. 124-127.
151. K.Pramila, "Significance of Godisala Inscription" *APHC,* Vol. XVII, 1993, pp. 65-67.
152. *EHD,* pp. 644-645
153. *IAPKD,* No. 35, p.103
154. *EHD,* pp. 644-647
155. *IAPKD,* No.43, p. 114
156. S.Gopala Krishna Murthy, *Op.cit.*, pp. 8,9.
157. *Ibid,* p. 9
158. *IAPKD,* No. 38, pp.106-111.
159. *EHD,* p. 759.
160. S.Gopala Krishna Murthy, *Op.cit.* p. 23
161. *IAPKD,* No. 37, pp. 104-106
162. *Ibid,* No.76, pp.141-143
163. *Ibid,* No. 75, pp. 139-141
164. *JAHRS,* XXXVI, Part I, pp. 1-24.
165. S.Gopala Krishna Murthy, *Op.cit.* p.30
166. *IAPKD,* No.48, pp. 119 & 120

167. *Ibid,* No.51, pp. 123 & 124
168. *Ibid,* No.62, p.131
169. V.V.Krishna Sastry, *Op.cit.* p.126
170. *ARDAM,* 1977-1978, p.2
171. *Ibid,*
172. *IAPKD,* No. 46, pp. 117&118.
173. *Ibid,* No.34, pp. 101-103.
174. *Ibid,* No.55, p.127
175. *Ibid,* No.67, p.134
176. కరీంనగర్ మండల చరిత్ర, 1981, p. 34
177. *Census of India, Karimnagar district,* 1961, p. IX
178. *APGKD,* 1974, p. 2.
179. M.Narasimhacharya, *History of the cult of Narasimha in A.P.,* p. 201
180. *Ibid.*
181. H.K.Sherwani, *History of Qutubshahi dynasty,* pp. 24,25
182. *Ibid,* pp. 126,127.
183. యరబాటి బాబూరావు, రామగిరిచరిత్ర, 1982, p. 18
184. H.K.Sherwani, *Op.cit,* pp. 24 & 25.
185. *IAPKD,* No. 47, p. 119
186. H.K.Sherwani, *Op.cit,* p. 445.
187. *IAPKD,* No.69, p. 135
188. *APGKD,* 1974, p. 248.
189. *Ibid,* p.244.
190. *IAPKD,* No.12, pp. 12 & 13.
191. *Ibid,* No. 36, pp. 103 & 104.
192. *Ibid,* No. 39, pp. 111 & 112.
193. V.V.Krishna Sastry, *Op.cit.* p. 46
194. *IAPKD,* No. 73, p. 137
195. *Ibid,* No.72, pp. 136 & 137
196. కరీంనగర్ జిల్లాదర్శిని, సమాచార పౌరసంబంధాలశాఖ, 1999-2000, p. 12
197. *APGKD,* 1974, pp. 61 & 245.
198. A.Nagabhooshanam, "The greatness of Jagtial fort" published in English daily New paper, Dated 22-10-1972
199. *Ibid.*
200. J.Ramanaiah, *Temples of South India,* 1989, p. 36
201. M.Narasimhacharya, *Cult of Narasimha in Telangana.* pp. 96-98.
202. ఆవాల దామోదరరెడ్డి, సర్దార్ సర్వాయి పాపన్న, 1994, (రచయిత భూమికలో తెలిపాడు)
203. *Ibid.*
204. *IAPKD,* No.17, pp. 44-47.

నాలుగవ అధ్యాయము

# IV. మత పరిస్థితులు

కరీంనగర్ జిల్లాలోని ప్రజలు తొలియుగంలో, మధ్యయుగంలో బౌద్ధ, జైన మతాలను ఆదరించి అనుసరించారు. క్రమంగా పౌరాణిక, ఐతిహాసిక వాఙ్మయం ప్రధానంగా భక్తి భావాలతో హిందూమతం వృద్ధి చెందింది. జిల్లాలో మధ్యయుగారంభం నుండే మతరంగంలో చాలా మార్పులు వచ్చాయి. మహాభారతం, రామాయణం, వివిధ పురాణాలు ప్రజాదరణ పొందాయి. భక్తిభావం పెరిగి ఇష్టదైవాన్ని పూజించడం ఆరంభించారు. ఇంటి దైవానికి తోడు కులదైవం కూడా పూజింపబడింది. ఎవరికి తోచిన రీతిలో వారు ఇష్టదైవాన్ని ఎంచుకొని పూజలు, నోములు, వ్రతాలు నిర్వహించుకున్నారు. తమ భక్తి భావాలకు కేంద్రమైన ఆరాధ్య దైవాలకు పెద్ద పెద్ద దేవాలయాలు గూడా నిర్మించారు. క్రమేణా ఈ జిల్లాలో 14వ శతాబ్దం నుండి ఇస్లాంమతం, 20వ శతాబ్దారంభం నుండి క్రైస్తవ మతం వ్యాప్తి చెందాయి. ఇక ఒక్కొక్క మతం జిల్లాలో ఎప్పుడెప్పుడు దాని ప్రాభవాన్ని కొనసాగించిందో తెలుసుకుందాం.

## 1. బౌద్ధమతము

క్రీ.పూ. 6వ శతాబ్దంలో గంగా మైదాన ప్రాంతాల్లో బౌద్ధ, జైన మతాల వ్యాప్తి జరిగి అవి ఆంధ్ర దేశంలో ప్రవేశించి అశేష ఆదరణ పొందాయి. అశోకునికి ముందే దక్కన్‌లో బౌద్ధమతం ప్రవేశించినా అది శాతవాహనుల కాలంలోనే విశేష ఆదరణ పొందింది[1]. ఆంధ్రదేశంలో శాతవాహన రాజుల పాలనలో సామాన్యప్రజలు బౌద్ధాన్ని స్వీకరించారు. శాతవాహనుల రాజకీయ కార్యకలాపాలకు కీలక ప్రదేశమైన కరీంనగర్ జిల్లాలో ధూళికట్ట, పాషిగాంవ్, మీర్జంపేట బౌద్ధకేంద్రాలుగా వెలసినాయి.

కరీంనగర్ జిల్లాలో సుల్తానాబాద్‌కు సమీపాన జూలపెల్లి మండలంలోని ధూళికట్ట వద్ద పురావస్తుశాఖ జరిపిన త్రవ్వకాలను బట్టి ఇచటి ప్రజలు బౌద్ధమతాన్ని స్వీకరించి ఆదరించారని తెలుస్తుంది. ధూళికట్టలో బయల్పడిన మట్టికోటకు ఉత్తరాన 1 కి.మీ. దూరంలో వెలుగుచూసిన

బౌద్ధస్థూపాన్ని బట్టి ఈ ప్రాంతంలో వైదిక మతం కంటే ఎక్కువ బౌద్ధమతం సామాన్యప్రజలను ఆకట్టుకుందని తెలుస్తుంది. ఈ స్థూపం పూర్తిగా ఇటుకలతో నిర్మించబడింది. దీనిపై నుండిన హార్మిక, ఛత్రము త్రవ్వకాలలో కనిపించాయి. ఈ స్థూపానికి వాయువ్యము నందు రెండుమీటర్ల దూరంలో 3.30 x 3.50 మీటర్ల కొలతలతో బౌద్ధ భిక్షువులు నివాసములున్న ఆధారాలున్నాయి. ఆయకాఫలకములపై అనగా వేదికను అండ భాగాన్ని కప్పిన శిల్పాలంకృత ఫలకాలపై జాతకకథలు, విరబూసిన పద్మములు, ముచిలిందనాగసర్పము, బోధివృక్షము, మహాభినిష్క్రమణము మున్నగునవి అందంగా చెక్కబడినాయి. ఇచటి ముచిలింద నాగశిల్పము అమరావతి శిల్పాలను బోలి ఉంది[2]. ముచిలింద నాగఫలకముపై క్రీ.పూ. రెండవ శతాబ్దానికి చెందిన బ్రాహ్మీలిపి లేబెల్ శాసనముంది[3]. అమరావతి బౌద్ధశిల్పకళారీతుల ప్రభావము నాగార్జునకొండ, కేసనపల్లి, ఫణిగిరి, చందవరంలలో కనిపించినట్లుగానే ధూళికట్టలో గూడా ప్రస్ఫుటంగా అగబడుతుంది.

కరీంనగర్ నుండి లక్షెటిపేటకు పోవు రహదారికి కుడివైపున స్తంభంపెల్లి సమీపాన గల పాషిగాంవ్ గుట్టపైన ధగధగ మెరిసే శిలాఫలకములతో ఒక బౌద్ధస్థూపముండేది. దాని ప్రక్కనే దీర్ఘచతురస్రాకారపు గది చిహ్నాలున్నాయి. ఇది శాతవాహనుల కాలపు ఇటుకల నిర్మాణము. బౌద్ధ భిక్షువులకై నిర్మింపబడిన కట్టడమై ఉంటుంది. క్రీ.శ. 1999 డిసెంబర్ చివరి వారంలో ఇర్కాన్ సంస్థ వారు రోడ్ వెడల్పు కార్యక్రమంలో మట్టి తీయుచుండగా ఈ స్థూపం పూర్తిగా శిథిలమైంది. ఈ స్థూప అవశేషాలను తెచ్చి కరీంనగర్ మ్యూజియం ఆవరణలో ఒక చిన్నస్థూపాన్ని పునర్నిర్మించారు.

కరీంనగర్‌కు తూర్పున శ్రీరాంపూర్ మండలంలో మానేరునది ఒడ్డున మీర్జంపేట్ హ్యామ్లెట్ గ్రామమైన పోచంపల్లిలో ఒక దిబ్బ వద్ద అనుమాండ్ల వెంకటయ్య బావి త్రవ్వుచుండగా రాతి కట్టడంతో నున్న చిన్న బౌద్ధ స్థూపమొకటి 1994లో బయల్పడింది. ఇచట బుద్ధుని అస్థికల బరణి లభ్యమైందని కరీంనగర్ పురావస్తుశాఖ సాంకేతిక నిపుణుడు యం. లక్ష్మీనారాయణ తెలిపాడు. ధూళికట్ట, పాషిగాంవ్ స్థూపాలలో లభ్యంగాని బుద్ధధాతువులిచట లభించడం విశేషం.

శతాబ్దాల తరబడి ఆదరణ పొందిన బౌద్ధమతం ఆంధ్రదేశంలో 10వ, 11వ శతాబ్దం వరకు నామరూపాలు లేకుండా పోయింది. బౌద్ధ ఆరామాలన్నియు హిందూ దేవాలయాలుగా మార్చబడినాయి. వైదిక బ్రాహ్మణులు బుద్ధుని విష్ణువు యొక్క అవతారంగా గుర్తించారు. క్రమంగా బౌద్ధమతం బ్రాహ్మణమతంలో లీనమై చివరకు అంతర్ధానమైంది. కాని క్రీ.శ. 1171 నగునూరు శాసనములో కాకతి రుద్రదేవుని మంత్రి మరియు నగునూరు పాలకుడైన గంగాధరుడు పట్టశాలలో బుద్ధనిరూపంను ప్రతిష్ఠించెనని ఉంది. ఈ శాసనమందలి పద్యాలలో విష్ణువే బుద్ధుని రూపంలో అవతరించాడని ఉంది[4]. ఈ శాసనం హిందూ, బౌద్ధధర్మాల విలీనతను ప్రస్ఫుటంగా వివరిస్తుంది.

## 2. జైనమతం

ఆంధ్రదేశంలో క్రీ.పూ. నాల్గవ శతాబ్దంలోనే జైనమతం ప్రవేశించింది. మౌర్యచంద్రగుప్తుడు అతని చివరిరోజులు శ్రావణ బెల్గొలాలో గడిపినట్లు జైనవాఙ్మయం వివరిస్తుంది. శ్రీశైలం కెదురుగా చంద్రగుప్త పట్టణమను నగరం అతని పేరట వెలసిందని భావింపబడుతుంది. ఆంధ్రదేశంలో జైనమతం దృఢపడుటకు కొన్ని శతాబ్దాలు పట్టింది. దక్కన్‌లో జైనమతం తొలి శతాబ్దాల నుండి ఉన్నప్పటికిని, అది 9 నుండి 11 శతాబ్దాల మధ్యకాలంలో బాగా అభివృద్ధి చెంది విశేష ప్రజాదరణ పొందింది[5]. రాష్ట్రకూటుల కాలంలో జైనమతం రాజాదరణ పొందింది. వారి సామంతులైన వేములవాడ చాళుక్యులు జైనమతాన్ని స్వీకరించి పోషించారు. జినాలయాలు నిర్మించి జైన బసదులు కట్టించారు. వీరి ఆస్థానముల నలంకరించిన పంప మహాకవి ఆదిపురాణమను జినపురాణమును, సోమదేవసూరి యశస్తిలక చంపువును రచించారు. వీరిరువురు జైన కవులు. ఆనాడు జైనమతమున వర్ణవ్యవస్థ ఉండేది. జైనులలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణముల వారుండిరని బి.యన్.శాస్త్రి అభిప్రాయం. వైదికమతస్థులు ఏవర్ణమునకు చెందిన వారైనను జైనమతమునవలంబించిన పిదప గూడా వారి పూర్వ వర్ణ ధర్మముల నాచరిస్తూనే ఉండేవారు[6].

కరీంనగర్ జిల్లాలో వేములవాడ, గంగాధర, రేపాక, నాంపెల్లి, శనిగరం, పొట్లపెల్లి, కోరుట్ల, పొలాస, కాళేశ్వరం, నగునూరు, ఎల్గేడు, ముల్కనూరు, తంగళ్లపల్లి, కరీంనగర్ మున్నగు ప్రాంతములందున్న జైన శిల్పాలను బట్టి అవి అన్నియు జైన మత కేంద్రాలుగా వర్ధిల్లెనని తెలుస్తుంది. వేములవాడ చాళుక్యప్రభువు రెండవబద్దెగుడు సుప్రసిద్ధ జైన పండితుడైన సోమదేవసూరి గౌరవార్థం శుభధామ జినాలయం నిర్మించెనని వేములవాడ శాసనం తెలుపుతుంది[7]. మూడవ అరికేసరి ప్రభువు నిర్మించిన ఖలివృత్తి జినాలయమునకు ఉజయగావుండు భూదానము లొసంగినట్లు రేపాక శాసనంలో పేర్కొనబడింది[8]. వేములవాడ పంప మహాకవి సోదరుడైన జినవల్లభుడు గంగాధర, కురిక్యాల గ్రామాల మధ్యనున్న బొమ్మలగుట్టపై ఆద్యంతతీర్థంకరుల శిల్పాలను చెక్కించి అచట త్రిభువన తిలకయను జైన బసది నిర్మించాడని క్రీ.శ. 945 కురిక్యాల శాసనం తెలుపుతుంది[9]. వేములవాడ యుద్ధమల్ల ప్రభువుచే నిర్మింపబడినట్లుగా భావించుచున్న శనిగరంలోని దుద్ధమల్ల జినాలయ జీర్ణోద్ధరణకై దానము లిచ్చినట్లు అచటి క్రీ.శ. 1051 శాసనం తెలుపుతుంది[10]. నూతన జినాలయ నిర్మాణాలతో పాటు అనేక పురాతన ఆలయాలు బసదులను ఉద్ధరించి పునఃనిర్మాణం చేయడం కూడా విస్తారంగా జరిగినట్లు తోస్తుంది. రాష్ట్ర కూట నాయకుడొకడు కోరుట్లలో నిర్మించిన రట్ట మార్తాండ జినాలయ జీర్ణోద్ధరణకై భూదానములొసంగినట్లు అచటి శాసనంలో పేర్కొనడం ఇందుకు ఉదాహరణ[11].

వేములవాడ శుభధామ జినాలయము, రేపాక ఖలివృత్తి జినాలయము, కోరుట్ల రట్ట మార్తాండ జినాలయము, శనిగరం దుద్ధమల్ల జినాలయము, గంగాధర త్రిభువన తిలకబసది

కరీంనగర్ ప్రాంతంలో జైన మతవ్యాప్తికై ప్రధానపాత్ర వహించాయి. కాని దురదృష్టవశాత్తు నేడు ఏ ఒక్క జినాలయం కానరాదు. సమకాలీన మతాలు జైనమతంపై విరుచుక పడ్డాయని మరియు జినాలయాలు దగ్ధం చేయబడి నేలమట్టమైనట్లు కొన్ని సందర్భాల్లో శాసనాధారాలు కానవస్తున్నాయి. ఇలాంటి మూర్ఖపు పనులు పటంచెఱువు, కొలనుపాక ప్రాంతాలలో గూడా జరిగాయి. పురావస్తుశాఖ త్రవ్వకాలలో అనేక జైన ప్రతిమలు బయటపడినాయి. పటంచెఱువు ప్రాంతములో నేల ఉపరితలము నుండే అనేక జైన శిల్పాలు ప్రోగుచేయబడినాయి[12]. ఈ ప్రాంతాలకు సమీపమందే ఉన్న కరీంనగర్ జిల్లాలోని జినాలయాలకు ఇదే దుర్గతి పట్టి ఉంటుంది. పన్నెండవ, పదమూడవ శతాబ్దాలలో వీరశైవులు విజృంభించి జినాలయాలను శివాలయాలుగా మార్చి జైనప్రతిమలను బయట పడవేశారు. కోరుట్లలోని రట్ట మార్తాండ జినాలయము బలవంతంగా శివాలయంగా మార్చబడి నేడు మహాదేవాలయంగా పిలువబడుతుంది. ఇందులోని పార్శ్వనాథ, బాహుబలి విగ్రహాలను బయట పడవేయుట వలన నేడవి అదే ప్రాంగణములో దర్శనమిస్తున్నాయి.

దాదాపు 20 సంవత్సరాల పూర్వం పొలాసలోని కొలిచాల విశ్వనాథం, అతని గోడ నిర్మాణమునకై పునాదులు తీయుచుండగా కాయోత్సర్గరీతిలో నిలబడి ఉన్న రెండు అడుగుల ఎత్తున్న అద్భుత జైన ప్రతిమాశిల్పమొకటి బయల్పడింది. పొలాస చెఱువు నానుకొని ఉన్న సత్యనారాయణ దేవాలయంలో నిలుపబడిన ఈ సుందర జైన శిల్పం నేడు కనబడుటలేదు. ఈ విగ్రహాన్ని బట్టి పొలాస యందుండిన జినాలయం కూడా ధ్వంసమై ఉండునని భావించాల్సి వస్తుంది. పొలవాస రాజులు జైనమతపోషకులు. మొదటి మేడరాజు నర్సంపేట తాలుకాలోని బాణాజిపేటలో వీరకమల జినాలయాన్ని కట్టించాడని అచటి శాసనంలో ఉంది[13]. హనుమకొండలోని పద్మాక్షి దేవాలయ గుట్టపై నుండిన జైన కదలాలయబసదికి పొలవాస రెండవ మేడరాజు భూదానములిచ్చినట్లు అచటి క్రీ.శ. 1117 శాసనం తెలుపుతుంది[14]. పై శాసనాలను బట్టి పొలవాస రాజులు జైన మతపోషకులని వారి రాజధాని పొలవాస (పొలాస) గూడా ఒక జైన కేంద్రమై యుండెనని అచట లభ్యమైన జైన ప్రతిమలు తెలుపుచున్నాయి.

కరీంనగర్ జిల్లాలో పార్శ్వనాథుని ఆరాధన ప్రబలంగా ఉండేది. పార్శ్వనాథుని పూజ సంతానం కొరకై జరిపేవారని వేములవాడ, శనిగరంలలోని పార్శ్వనాథ శిల్పముల క్రింది భాగాన శిశువులతో గూడిన తల్లిరూపాలు మలచబడుట వలన విదితమవుతుంది. దక్షిణ భారతదేశంలో పూజింపబడిన వేరొక ప్రధాన దైవము గోమతేశ్వరుడు [15]. కాయోత్సర్గరీతిలో నున్న ఇతని నగ్న విగ్రహాలు వేములవాడ, కోరుట్లలో ఉన్నాయి. నిజానికి గోమతేశ్వరుడు తీర్థంకరుడు కాదు. కేవలము అతడొక దివ్యజ్ఞానము పొందిన సిద్ధపురుషుడు. ఇతన్నే బాహుబలి అంటారు. జైనుల ప్రథమతీర్థంకరుని చిన్నకుమారుడైన బాహుబలి యొక్క రాజధాని బోధన్ అని జైనులు భావిస్తారు. అందులకే బోధన్ జైనులకు ప్రియమైన ప్రదేశం. బోధన్‌లో అనేక

జినాలయాలుండేవి. బోధన్‌లోని ఒకనాటి బాహుబలి విగ్రహం నేటి శ్రావణ బెల్గొలాలోని బాహుబలి విగ్రహం కంటే ఎత్తుగా ఉండేది. చాముండరాయ ప్రభువు శ్రావణ బెల్గొలాలోని ఇంద్రగిరి గుట్టపై బోధన్‌లోని గోమతేశ్వరుని విగ్రహం కంటే ఎత్తైన విగ్రహాన్ని నిలుపుటకు ప్రయత్నించి విఫలుడైనాడని అచటి శాసనం తెలుపుతుంది[16]. శ్రావణ బెల్గొలాలోని బాహుబలి విగ్రహం కంటే ముందు నిలుపబడిన మరియు అంతకంటే ఎత్తైన విగ్రహం నేడు బోధన్‌లో కానరాదు. బోధన్ వేములవాడ చాళుక్యుల తొలి రాజధాని. ఇచట తయారైన బాహుబలి విగ్రహాలనేకములు ఇతర ప్రాంతాలకు ఎగుమతి చేయబడేవి. బహుశః బోధన్‌లో తయారైన బాహుబలి విగ్రహాలే వేములవాడ, కోరుట్ల ప్రాంతములకు దిగుమతి అయి ఉంటాయి. వేములవాడలో తొలి సంప్రదాయపు జైన చౌముఖాలు, చౌవ్వీస తీర్థంకరుల ప్రతిమా శిల్పములు దర్శనమిచ్చుట విశేషం. ఎందుకనగా ఇవి అరుదైన శిల్పాలు.

జినాలయాలకు, బసదులకు అనేక దానములొసంగబడినట్లు కరీంగనర్ జిల్లా శాసనాలు తెలుపుతున్నాయి. హిందూ దేవాలయాలవలె బసదులు జైనమత కేంద్రాలు. జైన బసదులు మతవ్యాప్తితో పాటు ప్రజల లౌకిక, ఆధ్యాత్మిక ఉన్నతికై కృషి చేశాయి. జైనమునులు విద్యావ్యాప్తికై కృషి చేశారు. గంగాధరలోని త్రిభువనతిలక ఒక ప్రధానమైన జైన బసదిగా ఉండేది. సుప్రసిద్ధ జైనపండితుడు సోమదేవసూరి అచటనే అతని యశస్తిలక చంపువు రచనను క్రీ.శ. 959లో పూర్తి చేసినాడు. రాజులు, మంత్రులు పాలకులే గాకుండా సాధారణ ప్రజలు జైనమతమును అవలంబించారు. హిందువుల వలె జైనులు గూడా వర్ణవ్యవస్థను పాటించారు. హిందూ మతానుయాయులు జైన మతం స్వీకరించినను వారి వర్ణమును గోల్పోలేదు. మతమార్పిడికి వర్ణము, కులము, వర్గము, ప్రతిబంధకాలుగా నిలువలేదు. అందువలన సాంఘిక ఐక్యత పటిష్ఠంగా నిలిచి ఉండేది. మత సామరస్యానికి విఘాతం కలుగలేదు[17]. అయితే కాకతీయుల కాలము వచ్చేసరికి జైన మత పతనము ఆరంభమైంది. కాకతీయుల కాలంలో జైనులు చిత్రహింసలకు గురైరి. వారి జినాలయాలు ధ్వంసం చేయబడినాయి. వీరశైవులు సర్వత్రా విజృంభించారు. జైనమతంపై, జైనులపై జరిగిన విధ్వంసక చర్యలు బసవపురాణం, పండితారాధ్య చరిత్ర గ్రంథాలలో వర్ణింపబడినాయి.

## 3. శైవ మతం

క్రీ.పూ. ఒకటవ శతాబ్దానికి చెందిన గుడిమల్లాంలోని శివలింగాన్ని బట్టి ఆంధ్రదేశంలో అనాది నుండే శైవపూజ ఉందని తెలుస్తుంది. మధ్యయుగారంభం నుండే ఈ ప్రాంతంలో శైవమతము ప్రధానమతంగా అవతరించింది. క్రీ.శ. 600 నుండి 900 మధ్యకాలంలో ఆంధ్రదేశంలో అనేక శివాలయాలు వెలసినాయి. శైవమతపోషకులైన వేములవాడ చాళుక్యప్రభువులు వారి రాజధాని వేములవాడలో శాశ్వత ప్రాతిపదికపై రాతితో శివాలయాలను నిర్మించారు. ఆంధ్రదేశంలో శైవమతమందు కాలాముఖ, పాశుపత, ఆరాధ్య, కాపాలిక, వీరశైవ

శాఖలేర్పడినాయి. వాటి ప్రభావం కరీంనగర్ ప్రాంతమందు గూడా గోచరిస్తుంది.

**కాలాముఖశైవము**

ఆంధ్రదేశంలో 9,10 శతాబ్దాల్లో కాలాముఖశైవము ఆవిర్భవించింది. వేములవాడలో గూడా దీని ప్రభావము ఉండింది. వేములవాడ చాళుక్య ప్రభువైన మొదటి అరికేసరి ఏలేశ్వరంలోని కాలాముఖ మఠాధిపతి అయిన ముగ్ధశివాచార్యునికి విద్యావ్యాప్తికై బెల్మోగా గ్రామమును విద్యాదానంగా ఇచ్చాడు[18]. రెండవ అరికేసరి ప్రభువు వేములవాడలోని దైవములకు దానము లొసంగినప్పుడు శైవమతాచార్యులైన మల్లికార్జునుడు వ్యాక్తలింగి, విద్యాశ్రీ మరియు వ్యాఖ్యాని భట్టారకుడు సాక్షులుగా ఉండిరని వేములవాడ శాసనం తెలుపుతుంది[19]. ఇదే ప్రదేశంలోని వేరొక శాసనం కళ్యాణి చాళుక్య చక్రవర్తి ఆహవమల్ల దేవ రెండవ తైలపుని అధికారి ఒకరు శైవమతాచార్యులకు భోజనవసతి కలిపించుటకై మహేశ్వర శక్తి పండితునికి దానములిచ్చినట్లు తెలుపుతుంది[20].

కాలాముఖులకు రాజాదరణ ఉండుటవలన వారి మఠములు విద్యాకేంద్రములుగా వెలసి అనేక అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టాయి. ప్రతి కాలాముఖమఠము విద్యాకేంద్రంగా వెలుగొంది విద్యార్థులకు ఆచార్యులకు ఉచిత నివాస భోజనవసతులు ఏర్పాటుచేసింది. కళ్యాణి చాళుక్య చక్రవర్తి ఆఱవ విక్రమాదిత్యుని మహామండలేశ్వరుడైన రాజాదిత్యుడు వేములవాడ రాజేశ్వర దైవమునకు మరియు అచటి విద్యార్థులకు, ఆచార్యులకు ఉచిత భోజనవసతి కల్పించుటకై భూదానములోసంగెనని అతని శాసనం తెలుపుతుంది[21]. కాలాముఖ శైవము కళ్యాణి చాళుక్య చక్రవర్తి మొదటి సోమేశ్వరుని కాలము వరకు ఉచ్ఛదశకు చేరుకుంది[22]. పశ్చిమ కళ్యాణి చాళుక్యుల అధీనంలో ఉండిన వేములవాడ ప్రాంతంలో కూడా కాలాముఖశైవ ప్రభావం ప్రబలంగా ఉండింది.

కాకతీయ వంశపు తొలిరాజులు సైతం కాలాముఖ శైవాన్ని పోషించారు. మొదటి ప్రోలరాజు, రెండవ బేతరాజు, రెండవ ప్రోలరాజు పరమ మహేశ్వరులుగా శనిగరము శాసనములందు పేర్కొనబడినారు[23]. కర్నూలు జిల్లాలోని శ్రీ పర్వతం (శ్రీశైలం) లోని మల్లికార్జున శిల యొక్క మఠాధిపతి రామేశ్వర పండితునికి రెండవ బేతరాజు, రెండవ ప్రోలరాజు శిష్యులు. రామేశ్వర పండితుడు లకులేశ్వర ఆగమమందు దిట్టగా ప్రసిద్ధి చెందాడు. కాలాముఖ మఠాధిపతి సాధారణంగా లకులేశ్వర పేరుతో పిలువబడినాడు. కాకతి రెండవ బేతరాజు అతనికి హనుమకొండకు నైఋతి దిశలో నుండిన శివపురాన్ని దానముగా నొసంగాడు[24]. శైవాగమములందు గొప్ప పండితులుగా పేర్కొనబడిన రామేశ్వర పండితుడు లేదా దీక్షితుడు మరియు మహేంద్రుడు ఇరువురు కరీంనగర్ జిల్లాలో గోదావరినది తీరమున నున్న కాళేశ్వరం నందు స్థిరపడినట్లు తెలుస్తుంది. రెండవ ప్రోలరాజు మత గురువైన రామేశ్వర పండితుడు

అనేక శివాలయాలను, మఠములను కట్టించాడు. కాళేశ్వరం దేవాలయం అతనిచే స్థాపింపబడిందని భావింపబడుతుంది[25]. కాలాముఖశైవము 12వ శతాబ్దము చివరి వరకు ఆంధ్రదేశమంతటా వ్యాపించింది. రాజుల ఆస్థానములందే గాక ఇది సర్వత్రా జనాదరణ పొందింది.

**పాశుపత శైవం**

కాకతీయుల కాలంలో గణపతి దేవ చక్రవర్తి పరిపాలనాకాలం శైవమతవ్యాప్తికి ప్రసిద్ధి చెందింది. పాశుపత శైవాచార్యుల ఆగమనముతో కాలాముఖశైవము వెనుకంజ వేసింది. శైవము యొక్క ప్రాథమిక భావనలు మూడు పతి, పశు మరియు పాశం. పరమశివుడే పాశముతో బంధింపబడిన పశు(వు)లందరికి పతి. పాశుపత శైవానుయాయులు పశుపతియే సృష్టికి మూలం అని భావిస్తారు. పతి అయిన శివుని అనుగ్రహంతో సంసార పాశమను బంధము నుండి పశు అనే ఆత్మవిముక్తి పొందుతుందని వీరి విశ్వాసము.

గణపతి దేవ చక్రవర్తి కాలంలో నర్మదానది తీరమందుండిన చేది లేదా దహల రాజ్యమందలి దేవకీపురపు గోళకిమఠమునకు చెందిన శివాచార్యులు పాలకుల మరియు ప్రజల ఆదరణ పొందారు. విమలశివుడు, ధర్మశివుడు, విశ్వేశ్వర శివుడు సుప్రసిద్ధ ఆచార్య త్రయము. వీరిలో విశ్వేశ్వర శివుడు గణపతి దేవచక్రవర్తికి, అతని కుమార్తె రుద్రమదేవికి దీక్షా గురువు. కృష్ణానది తీరమందు మందడం వద్ద అతడొక పెద్ద శైవమఠమును స్థాపించాడు[26].

కరీంనగర్ జిల్లా ప్రజల మత విశ్వాసములు పెంపొందించుటలో విశ్వేశ్వర శివుడు లేదా విశ్వేశ్వర శంభువు ప్రధానపాత్ర వహించినట్లు కాళేశ్వరం మరియు ఖమ్మంపెల్లి శాసనాలు తెలుపు తున్నాయి [27]. అతడు కాళేశ్వరంలో రాయితో నిర్మించిన ఉపలమఠమును స్థాపించి, దీని నిర్వహణకై అతడే నూతనంగా స్థాపించిన పొన్నగ్రామమను బ్రాహ్మణుల అగ్రహారమును దానముగా ఇచ్చాడు[28]. విశ్వేశ్వర శివుడు కాళేశ్వరం, పొన్నగ్రామము, మంథనవటి (మంథని), ఉటుపల్లి, చంద్రవెల్లి, ఖమ్మంపల్లి మున్నగు ప్రాంతములందు శివాలయములు కట్టించి శైవమఠములను స్థాపించాడని తెలుస్తుంది.

గోళకిమఠ శివాచార్యులు అనేకచోట్ల దేవాలయాల స్థానాధిపతులుగా ఉన్నారు. వారి ప్రభావము, పలుకుబడి వారి శిష్యులు, విద్యార్థులు, సామాన్యప్రజానీకంపై ప్రబలంగా ఉండింది. గోళకి మఠమునకు చెందిన విశ్వేశ్వర శంభువు మరియు తదితర శివాచార్యులందరు వైదిక బ్రహ్మచారులు. పరమ మహేశ్వరుడుగా పేర్కొనబడిన కాకతీయ వంశపు చివరి చక్రవర్తి ప్రతాపరుద్రుని రాజ్యపాలనాంతం వరకు గోళకి మఠమునకు చెందిన పాశుపతశైవం ఉచ్ఛదశలో ఉండేది.

## ఆరాధ్యశైవం

ఆంధ్రదేశంలో శ్రౌతశైవముగా పేరొందిన శాఖయే ఆరాధ్యశైవం. దీనిని కాకతీయ రాజులు పోషించకున్నను ఇది వారి కాలంలో ప్రవేశించి ఊపు అందుకుంది. పండిత త్రయముగా ప్రసిద్ధిగాంచిన శ్రీపతి పండితుడు, మల్లికార్జున పండితుడు మరియు మంచన పండితుడు ఆంధ్రదేశమంతటా ఆరాధ్య శైవము వ్యాప్తికై బహుళంగా కృషి చేశారు. వీరిని అనుసరించిన బ్రాహ్మణులు ఆరాధ్యులుగా లింగధారులుగా పిలువబడినారు. ఆరాధ్యులు మెడలో లింగం ధరించుట వలన లింగధారులైనారు. ఆంధ్రదేశంలో ఆరాధ్య బ్రాహ్మణులు నేటికీ ఒక ప్రత్యేక తెగగా ఉన్నారు. ఇప్పటికీ వీరు మత నియమాలను కఠినంగా పాటిస్తారు.

గుంటూరు జిల్లాలోని చందవోలు (చందోలు) క్రీ.శ. 1162 నుండి 1181 వరకు పాలించిన వెలనాటి చోడప్రభువు సమకాలీనుడు మల్లికార్జున పండితుడు[29]. కాకతి ప్రతాపరుద్రదేవుని సమకాలీనుడైన పాల్కుర్కి సోమనాథుడు మల్లికార్జున పండితుని జీవిత విశేషాలను తెలుగులో ద్విపద కావ్యంగా పండితారాధ్య చరిత్ర రచించాడు. కాలచూరి బిజ్జలుని మంత్రి అయిన బసవేశ్వరుని మల్లికార్జున పండితుడు మిగుల ప్రశంసించాడని ఇతడు తన రచనలో తెలిపాడు. కర్ణాటకములో వీరశైవము వ్యాప్తికై బసవేశ్వరుడు బహుళంగా కృషి చేశాడు.

నేడు ఆరాధ్యశైవం మరియు వీరశైవం యొక్క లక్షణాలు కొన్ని ఒకే రకంగా ఉన్నాయి. మెడలో లింగం ధరించుట, చనిపోయిన వారిని దహనం చేయుటకు బదులు సమాధి చేయడం వంటి సంప్రదాయాలు ఒకే రకంగా ఉన్నాయి. కాని ఆరాధ్యశైవులు బ్రాహ్మణ కర్మకాండను ఆచరిస్తారు. నేడు ఆరాధ్యకుటుంబాలు అధికంగా వరంగల్‌లో ఉన్నాయి. కొన్ని కుటుంబాలు వేములవాడలో గూడా ఉన్నాయి. ఆరాధ్యులు ఊరూరా సంచారము చేయుచు వారి శిష్యులకు ఉపదేశములిచ్చుచు మతవిశ్వాసము పెంపొందిస్తున్నారు. కరీంనగర్ జిల్లా వాసులు నేటికి వరంగల్ ఆరాధ్య మతగురువులను ఆహ్వానించి వారి నుండి మతోపదేశము పొందుచునే ఉన్నారు.

## వీరశైవం

వీరశైవం అనగా బలిష్ఠులైన, సాహసులైన వీరుల మతమని అర్థము. బసవేశ్వరుడు వీరశైవమత స్థాపకుడు కాకపోయినను, అతడు ఈ మతవ్యాప్తికై సర్వశక్తులను వినియోగించాడు. వీరశైవములోని ప్రతి స్త్రీ, పురుషుడు మెడ నుండి వ్రేలాడు లింగమును ధరిస్తారు. కావున వీరశైవులను కర్ణాటకము నందు లింగాయతులంటారు. ఆంధ్రదేశంలో కాకతీయుల కాలమందు వీరశైవము అంతగా వ్యాప్తి నొందలేదు. తెలుగు ప్రాంతంలోని పాల్కుర్కి సోమనాథుడు వీరశైవమును అవలంబించి దీని వ్యాప్తికై కృషి చేశాడు. బసవేశ్వరుని బోధనలనన్నింటిని అతని బసవపురాణము కావ్యములో విశదీకరించాడు.

కాపాలికశైవం

కాపాలికుల ఆచారము చాలామట్టుకు కాలాముఖుల ఆచారములను పోలి ఉన్నాయి. కాని కాపాలికులకు నరబలియందు విశ్వాసముండేది. వారు కామపరమైన శృంగారలీలలకు అధిక ప్రాధాన్యత నిచ్చారు. వారు స్మశానమందు నివసించి మృతుల బూడిదను దేహమంతయు భస్మముగా ధరించి మానవకపాలములోనే భుజించి దానిలోనే మద్యము సేవించేవారు. కాపాలికులు మానవ కపాలముల హారాన్ని ధరించిన భయంకర భైరవ రూపాన్ని ఆరాధిస్తారు. వారు నరబలి ఇచ్చి మద్యమునర్పించి ఈ దైవమును సంతుష్టపరిచేవారు[30]. శివుని భయంకర రూపమైన భైరవుని కాపాలికులు, కాలాముఖులు ఆరాధించేవారు. పశ్చిమ చాళుక్యుల తొలికాలము నుండే కరీంనగర్ ప్రాంతంలో భైరవ ఆరాధన ప్రబలంగా ఉండిందనుటకు ఈ జిల్లాలో అనేక చోట్ల దర్శనమిచ్చు భైరవ విగ్రహాలను బట్టి స్పష్టమౌతుంది.

కాకతీయులు శైవమతాన్ని పోషించి అనేక అద్భుతమైన దేవాలయాలను నిర్మించారు. నగునూరు, కొత్తపెల్లి, మంథని, చంద్రవెల్లి, కటుకూరు, గొడిశాల మున్నగుచోట్ల వీరికాలపు అందమైన దేవాలయాలు ప్రస్తుతం శిథిలావస్థలో ఉన్నాయి.

మధ్యయుగంలో శక్తి ఆరాధన గూడా ప్రబలంగా ఉండేది. శివుని అర్ధాంగి పార్వతి అనేక పేర్లతో, రూపాలతో ఆరాధింపబడింది. ఉమ, అంబిక, భవాని, గౌరి, నాగేంద్రకన్య, మహేశ్వరి మున్నగునవి పార్వతికి నామాంతరాలు[31]. వల్లభరాయని క్రీడాభిరామము దుర్గ అనేక రూపాలను కాకతి, ఏకవీర, జగదాంబ, గిరిజానందన, ఉమ, పార్వతి, ఆదిశక్తి మున్నగు వాటిని తెలుపుతుంది[32]. ఏకవీర, మాహూరమ్మలాంటి ఇలవేల్పులు, గ్రామదేవతలు కాకతీయుల కాలంలో పూజలందుకున్నాయి. పూర్వము ఏకవీర కేంద్రంగా పేర్కొనబడిన పొలవాస (పొలాస)[33] నేడు ఎల్లమ్మ దేవతారాధన కేంద్రంగా ఉంది. వెల్లుల్లలోని ఎల్లమ్మ ఆరవెల్లిలోని నాయకురాలు దేవతలు నేటికి గ్రామీణ ప్రజల పూజలందుకుంటున్నాయి.

## 4. వైష్ణవ మతం

మహాకావ్యాల్లో, సారస్వత గ్రంథాల్లో విష్ణువు మహత్తర దైవంగా స్తుతింపబడినాడు. ఋగ్వేదంలో విష్ణువు సూర్యాంశ దైవంగా కనిపిస్తాడు. కాని పురాణాలలో విష్ణువు సూర్యుని యొక్క భాగంగా కాకుండా పరిపూర్ణ దైవంగా పేర్కొనబడ్డాడు. విష్ణువు దశావతారాలు ప్రాధాన్యతను సంతరించుకున్నాయి. రాముడు, కృష్ణుడు, బుద్ధుడు పూర్ణావతారాలుగా భావింపబడినారు. విష్ణువు క్షీరసముద్రంలో వేయిపడగల ఆదిశేషునిపై పడుకొని ఉంటాడు. అతని పాదాల చెంత లక్ష్మీదేవి కూర్చొని ఉంటుంది. అతని నాభి నుండి ఆవిర్భవించిన పద్మముపై బ్రహ్మ కూర్చొని ఉంటాడు. అతడు పీతాంబరములతో వక్షస్థలమున కౌస్తుభము ధరించి ఉంటాడు. అతని చెంత అతని వాహనమైన గరుడుడు వినమ్రపూర్వకంగా అంజలి ముద్రలో ఉంటాడు. అతడే

సృష్టిస్థితిలయకారకుడు. అతని నుండే సత్వరజస్తమో గుణాలు ఆవిర్భవిస్తాయని భక్తుల విశ్వాసము[34].

కరీంనగర్ జిల్లాలో మధ్యయుగము నందు ప్రత్యేకంగా విష్ణువుకు అంకితమైన దేవాలయాలు తక్కువ. ధర్మపురి, బెజ్జంకి, సుందిల్లలోని నరసింహాలయాలు, పొలాసలోని వేణుగోపాలాలయము మున్నగునవి విష్ణువు దైవానికి అంకితం చేయబడ్డాయి.

త్రికూటాలయములందు హరి అనుబంధ దైవంగా ఒక గర్భగృహము నందు ప్రతిష్ఠింపబడు సంప్రదాయం ప్రబలింది. రాయికల్, వాల్గొండ, చిలువాకోడూరులలోని త్రికూటాలయములందు ఒక దానిలో విష్ణువు దర్శనమిస్తాడు. విష్ణువును ప్రజలు వాసుదేవ, కేశవ, వేణుగోపాల, శ్రీరామ మున్నగు రూపాలలో పూజిస్తారు.

కాకతీయుల కాలంలో విష్ణువు ఆరాధన, వైష్ణవాలయాల నిర్మాణం గూర్చి వారి శాసనములందు ప్రసక్తి ఉంది. వీరి కాలంలో వ్యాప్తిలో నుండిన వైష్ణవ మత తీరు తెన్నులు ఎక్కువగా తెలియదు. కాకతీయుల శాసనములందు ఏ ఒక్క వైష్ణవమతాచార్యుని పేరు కానరాదు. శైవ వైష్ణవముల మధ్య వైరుధ్యములుండెనో, లేదో తెలియదు.

కాకతీయరాజులు, వారి అధికారులందరు శైవమత పోషకులైనను విష్ణువును గూడా ఆరాధించేవారు. సమాజంలో శైవులు, వైష్ణవులను రెండు వర్గాలుండేవి. నగునూరు పాలకుడైన వెల్లకి గంగాధరుడు అతని రాజధానిలో చతుర్వింశతి విష్ణువు రూపాలను స్థాపించాడని క్రీ.శ. 1171 నగునూరు శాసనం పేర్కొంటుంది[35]. ప్రస్తుత మీ శాసనము కరీంనగర్ జిల్లా కలెక్టర్ నివాస గృహపు ఆవరణలో నిలుపబడి ఉంది. ఈ గంగాధరుడే పట్టశాలలో విష్ణువు అవతారమైన బుద్ధుని ప్రతిష్ఠించాడు[36]. మంత్రకూటము (మంథని)లో కేశవ దేవాలయ నిర్మాణము గూర్చి మరియు అచటి గోపీజనవల్లభునకు ఒక తోటదానముగా ఇవ్వబడినట్లు కాకతి గణపతి దేవచక్రవర్తి కాలపు అచటి క్రీ.శ. 1199 శాసనం తెలుపుతుంది[37]. కాకతి ప్రతాపరుద్రదేవుని రాణి లకుమాదేవి రామనాథదేవరకు కొన్ని దానాలిచ్చినట్లు క్రీ.శ. 1301 ఎల్గేడు శాసనంలో పేర్కొనబడింది[38].

కాకతి ప్రతాపరుద్రేవుని కాలంలో తెలంగాణమందలి వెలమనాయకులు వైష్ణవ మతమును పోషించారు. కాకతీయ సామ్రాజ్యము పతనమొందగానే కరీంనగర్ ప్రాంతంలోని వెలమలు నరసింహదేవాలయాలందు దైవ ప్రీత్యర్థం కొన్ని అదనపు నిర్మాణములు గావించారు. కరీంనగర్ జిల్లాలోని శాసనములందు జూపల్లి, జువ్వాడి, జూపూడి, ఇనుంగంటి వంశములకు చెందిన వెలమనాయకుల ప్రసక్తి ఉంది.

వెలమ కులమునకు చెందిన జువ్వాడి దళపతిరాయడు వెల్లుల్లలోని నరసింహస్వామి ప్రీత్యర్థం అచటి నాగులకుంటకు తూము కట్టించాడని అక్కడి క్రీ.శ. 1613 శాసనం తెలుపుతుంది[39]. ధర్మపురి బ్రహ్మపుష్కరిణి మధ్యలో వెలమదొర జూపల్లి ధర్మారాయుడు ఎత్తైన

వేదికను నిర్మించాడని అచటి క్రీ.శ. 1644 శాసనం పేర్కొంటుంది[40]. ఇదే వేదిక పై తదనంతరం నేటి భోగమంటప నిర్మాణం జరిగింది. జూపల్లి ధర్మారాయడే పుష్కరిణికి నాలుగువైపుల మెట్ల నిర్మాణం గావించినట్లు పై శాసనమందు ఉంది. పైన పేర్కొనిన సేవాతత్పరతను తెలుపు వెలమల లేదా పద్మనాయకుల ఉదారపు పనులు వారు వైష్ణవ మత అనుయాయులని తెలుపుతున్నాయి. తరతరాల నుండి వారి సంతతివారు, వారసులు నేటికి ఈ ప్రాంతపు ఆలయములందున్న నరసింహదైవములను సేవించుచునే ఉన్నారు.

బౌద్ధ, జైన, హిందూ మతములకు చెందిన ఆలయాలు, మఠములు సారస్వతము మరియు కళల పోషణకు కేంద్రాలుగా వెలసినాయి. ఆలయాల నిర్మాణం పవిత్రమైన పుణ్యకార్యంగా భావింప బడింది. రాజులు, రాణులు, ఉన్నతాధికారులు, సేనానులు, వాణిజ్య శ్రేణులు, కళాకారులు వారి వారి మతముల అభివృద్ధికై అచ్చెరువొందించు అద్భుత దేవాలయాలను నిర్మించారు. వాటి నిర్వహణకై దానాలిచ్చారు. ఆలయాల జీర్ణోద్ధరణ, అదనపు నిర్మాణములు గావించుట గూడా పుణ్యకార్యాలుగా భావింపబడినాయి. దైవభక్తి, మతాసక్తి కళాత్మకమైన ఆలయాల నిర్మాణానికి దోహదపడినాయి. వివిధ మతస్థుల మధ్య సఖ్యత, మతసామరస్యము ఉండినందున ఆనాటి మఠములు విద్యావ్యాప్తికై కృషి చేసినాయి. కళాత్మకమైన ఆలయాలు నిర్మింపబడి అవి దైవభక్తిని, మత విశ్వాసాన్ని పెంపొందించాయి.

కాకతీయ సామ్రాజ్యం క్రీ.శ. 1323లో పతనమైంది. క్రీ.శ. 1347లో గుల్బర్గాలో బహమనీ రాజ్యస్థాపన జరిగింది. మహ్మదీయులు దక్కన్‌లో స్థిరపడి అన్ని ప్రాంతాలకు విస్తరించారు. బహమనీ సుల్తాన్‌ల రాజధాని తెలంగాణాకు పడమటి సరిహద్దులో నున్న బీదర్‌కు మారింది. క్రీ.శ. 1363లో ఓరుగల్లు నేలు కాపయనాయకుడు బహమనీ సుల్తాన్ ముహమ్మద్‌షాకు గోలకొండ దుర్గమును వదులు కొని, సంధి చేసుకున్నాడు. క్రీ.శ. 1425లో బహమనీ సుల్తాన్ మొదటి అహ్మద్‌షా ఓరుగల్లుపై దండెత్తాడు. అతడు అజీమ్‌ఖాన్ సేనానిని తెలంగాణాలోని కోటల్ని జయించటానికి పంపాడు. ఆ సందర్భంలో అజీమ్‌ఖాన్ ధర్మపురిలోని దేవాలయాలను ధ్వంసం చేశాడు. క్రీ.శ. 1433లో రామగిరి దుర్గం అహ్మద్‌షా వశమైంది. సబ్బినాడు పాలకునిగా సంజర్‌ఖాన్ నియమింపబడ్డాడు. ఎల్గందల్, మొలంగూరు దుర్గాలు సర్కారులుగా ఏర్పడినాయి. సర్కారు అనగా ఒక పాలనా విభాగము. క్రీ.శ. 1480 వరకు దాదాపు తెలంగాణమంతా బహమనీల వశమైంది. మహ్మదీయులు అధిక సంఖ్యలో స్థిరపడినారు.

బహమనీ సుల్తాన్ క్రీ.శ. 1496లో కుతుబుల్‌ముల్క్‌ను గోలకొండ తరఫ్‌దార్‌గా నియమించాడు. అతడు క్రీ.శ. 1518లో స్వతంత్ర కుతుబ్‌షాహి రాజ్యస్థాపనకు పునాది వేశాడు. కుతుబ్‌షాహీలు హిందూ మతాన్ని, హిందువుల్నీ సహించడమే కాకుండా ప్రోత్సహించడం అవసరమని గ్రహించి ఆ విధంగానే పాలించారు. సుల్తానులు, వారి సామంతులు దేవాలయాలకు విరాళాలిచ్చిన సంఘటనలున్నాయి. సుల్తాన్ అబ్దుల్లా కుతుబ్‌షా కాలపు క్రీ.శ. 1664

శనిగరశాసనమందు 540 హొన్నులతో చెఱువు మత్తడి కట్టించినట్లు, నరసింహ క్షేత్రానికిచ్చిన దేవబ్రాహ్మణుల వృత్తులన్నియు, ఎవరు ప్రభుత్వం నడిపినను ఎప్పటిలాగే కొనసాగునని తెలుపబడింది. ఇది వారి మత సామరస్యానికి తార్కాణము.

కుతుబ్‌షాహీల పాలనలో బ్రాహ్మణుల పలుకుబడి క్రమంగా పెరగడం కనిపిస్తుంది. అబుల్ హసన్ తానీషా మాదన్నను ప్రధానమంత్రిగా అక్కన్నను సేనానాయకునిగా నియమించడం మొగలాయిల దండయాత్రకు ఒక కారణం. దక్షిణ భారతదేశంలో ప్రవేశించిన సూఫీ ఉద్యమం ప్రజల నైతిక, ఆధ్యాత్మికోన్నతి కోసం పనిచేసింది. వివిధ సాంస్కృతిక ధోరణుల మధ్య సమన్వయము కొరకు సానుకూల వాతావరణం ఏర్పడింది. మొహరం పండుగకు సంబంధించిన కొన్ని తెలుగు పాటలను నేటికీ గ్రామాల్లో ఎంతో ఉత్సాహంగా పాడుతారని షేర్వాని పేర్కొన్నాడు[41]. అబ్దుల్లా కుతుబ్‌షా, ఆయన అల్లుడు అబుల్ హసన్ కుతుబ్‌షా కాలంలో హిందూ ముస్లిం ప్రజల మధ్య ఏర్పడిన పరస్పర అవగాహనను ఆ పాటలు సూచిస్తున్నాయి. నేటికీ మొహరం పీరీల పండుగలో మహ్మదీయుల కంటె హిందువులే ఎక్కువగా పాల్గొనడం పరిపాటిగా మారింది. మహ్మదీయుల నౌరోజ్ పండుగ హిందువుల వసంతోత్సవాన్ని పోలి ఉంటుంది. ఆనాటి ప్రజలలో అనేక మూఢాచారాలు ప్రబలి ఉన్నాయని బెర్నియర్ వ్రాశాడు. సతీసహగమనం అమలులో ఉండింది. మహ్మదీయ స్త్రీలకు పరదా పద్ధతి ఉండేది.

కుతుబ్‌షాహీల పాలనకు ఉర్దూ భాష గొప్ప ప్రతిష్ఠ తెచ్చి పెట్టింది. ఇది పర్షియన్ సంస్కృత భాషలతో ఏర్పడిన మిశ్రమభాష. ఇది దక్కనీ ఉర్దూగా అభివృద్ధి పొందింది. వీరి కాలంలో పర్షియన్ రాజభాష అయినప్పటికీ తెలుగుభాష నాదరించారు. హైదరాబాద్ నగర నిర్మాత మహ్మద్‌కులీ కుతుబ్‌షా దక్కనీ ఉర్దూలో కవితలు వ్రాస్తూ అనేక తెలుగు పదాలను వాడాడని షేర్వానీ తెలిపాడు. ఆ రోజుల నాటి హిందువులు ముస్లిం దుస్తులూ, వారి అలవాట్లూ అలవరచుకున్నారు. అరబిక్, పర్షియన్, ఉర్దూ భాషలు నేర్చుకున్నారని నేలటూరి వెంకటరమణయ్యా తెలిపారు. ఆ కాలంలో మహ్మదీయ రాజ్యాల నుండి వచ్చిన ఫారసీ, అరబ్బీ పత్రాలను అనర్గళంగా చదివి చెప్పగల తెలుగు వారుండినట్లు శ్రీనాథుని రచనలు తెలుపుతాయి.

బౌద్ధయుగమున బౌద్ధ విహారముల వలె మసీదులకు సంబంధించిన మద్రసాలు మహ్మదీయ విద్యాపీఠాలుగా ఏర్పడినాయి. మహ్మదీయులకు లంగర్‌ఖానాలను భోజనసత్రము లేర్పడినాయి. సయ్యదులు, షేక్‌లు అనుపేర మతములోని సాధువులు సంచారము చేసి జనశ్రేయస్సుకై, రోగముల నివారణకై పాటుపడేవారు. వారు హిందూ ముస్లింలకు సమానంగా చికిత్సలు చేసేవారు. ముస్లిం సాధువుల సమాధులను 'దర్గా'లంటారు. ఈ సాధువుల వార్షికోత్సవములను 'ఉరుసు'లంటారు. ఇటువంటి ఉరుసులలో హిందువులలోని కడ వర్గములవారు, ముస్లింలు సమానంగా పాల్గొంటారు. బిజిగిరి షరీఫ్, కరీముల్లాషా దర్గా వద్ద జరుగు ఉరుసు ఉత్సవాలలో నేటికీ హిందువులు అధిక సంఖ్యలో పాల్గొనడం విశేషం.

హిందువులను ఇస్లాంలోనికి మార్చుటకు ప్రయత్నాలు జరిగినాయి. హిందువులలోని తక్కువ వర్ణములవారు ఇందులో ప్రవేశించారు. ఇందుకు తార్కాణంగా దూదేకుల వారిని పేర్కొనవచ్చు[42].

గోలకొండ కుతుబ్‌షాహీ వంశజులు తెలంగాణమే వారి జన్మభూమిగా భావించి, వారు తెలుగువారే అనుకొని పరిపాలన సాగించారు. కుతుబ్‌షాహీ ప్రభువులందరు తెలుగు నేర్చినవారే. హిందూ దేవాలయాలను, హిందూ విద్వాంసులను గౌరవించేవారు. ఇబ్రహీంకుతుబ్‌షా, మహమ్మద్ కుతుబ్‌షా, అబ్దుల్లా కుతుబ్‌షా తెలుగును అభిమానించటమే గాక తెలుగు పడుచులను వివాహమాడారు. ఇబ్రహీం కుతుబ్‌షా తెలుగు కవులనాదరించాడు. వారికి భూదానములు చేసి సనదులిచ్చాదు. వీరి కాలములో భారతము, భాగవతము, రామాయణము, భగవద్గీత, ఉపనిషత్తులు మొదలైన గ్రంథములన్నియు ఫారసీ భాషలోకి అనువదింపబడినాయి[43]. హిందువులు తమ బిడ్డలను వీధి బళ్లలో పంతుళ్లను పెట్టి విద్య చెప్పించుకున్నారు. హిందువులు దేశభాషతో పాటు అరబిక్, ఫారసీ భాషలను నేర్చుకొని ద్విభాషీలు (దుబాసులు) అయ్యారు. హిందూ, మహ్మదీయ ఉభయజాతి సంస్కృతి సామరస్యానికి కుతుబ్‌షాహీ సుల్తాన్‌లు దోహదపడినారు. తత్ఫలితంగా సంగీతము, శిల్పము, వర్ణచిత్రములలో అధిక మార్పు వచ్చింది.

క్రీ.శ. 1687లో ఔరంగజేబు గోలకొండ కోటను ఆక్రమించాడు. ఆ తరువాత ఇరువయ్యేండ్లు జీవించాదు. కొంతకాలము రామగిరిలో విహార సమయమందు అతడు కాలము గడిపాడు. కాళేశ్వరం, సోనీపేటలో ఔరంగజేబు మసీదులు కట్టించాడు. కాళేశ్వరంలోని మసీదు అచటి దేవాలయాల శిథిల శిలలతోనే నిర్మింపబడింది. ఔరంగజేబ్‌చే దక్కన్ సుబేదార్‌గా నియమింపబడిన రుస్తుందిల్ ఖాన్ ధర్మపురిలోని దేవాలయాన్ని మసీదుగా మార్చి అబుల్‌హసన్‌ఫారస్ అనునతనిని మౌజన్‌గా నియమించి వంద బిగాల భూమిని దాని నిర్వహణకై దానంగా ఇచ్చాదు. మొగలుల కాలంలో ఈ ప్రాంతంలో అరాచకము ప్రబలింది.

క్రీ.శ. 1724లో నిజాముల్‌ముల్క్ ఆసఫ్‌జా స్వతంత్రించి దక్కన్ సుబేదారైనాడు. ఇతని వంశీయులు 1948 వరకు ఏడుగురు నిజాం ప్రభువులు పాలించారు. ఎల్గందల్, మొలంగూర్ దుర్గములు సర్కార్ పాలనావిభాగములకు కేంద్రములుగా నుండి పాలన సాగించాయి. మొదటి ఆసఫ్ జా కాలంలోనే ధర్మపురి వాసులు 1724-1750 మధ్యకాలంలో పాత నరసింహ దేవాలయాన్ని నిర్మించారు. మూడవ నిజాం సికిందర్ జా కాలంలో కరీమొద్దీన్ ఎల్గందల్ ఖిలేదారుగా ఉన్నాడు. అతడు స్థాపించిన పట్టణమే నేడు కరీంనగర్‌గా పిలువబడుతుంది. ఈ కరీముల్లాషా దర్గా కరీంనగర్ పాతబజార్‌లో ఉంది. నేటికి అచట ఉరుసు జరుగుతుంది. ఆఱవ నిజాం మీర్ మహబూబ్ అలీఖాన్ ప్రజానురంజకుడైన పాలకుడు. 1908లో మూసీనది వరదల సమయంలో అతడు హిందూ ముస్లింలను భేదం లేకుండా అతని ప్రజలను కన్న బిడ్డలవలె ఆదుకున్నాడు. ఇతని కాలంలోను, ఏడవ నిజాం కాలములోను హిందువైన మహారాజాకిషన్ ప్రసాద్ ప్రధానమంత్రిగా ఉన్నాడు. బికనేరు మహారాజు కోరగానే ఏడవ నిజాంమీర్ ఉస్మాన్ అలీఖాన్ బెనారస్ హిందూ విశ్వవిద్యాలయానికి లక్షరూపాయల విరాళం

పంపాడు. కాశింరజ్వీ ప్రేరణతో రజాకార్లు పెట్రేగి హిందువులపై అకృత్యాలకు పాల్పడ్డారు. కాని కరీంనగర్ జిల్లాలో నాడు నేడు మత సామరస్యానికి విఘాతం కలుగకపోవడం ఈ ప్రాంతపు విశేషం.

### ఆధార గ్రంథములు (References)


1. M.L.Nigam, *Op.cit.* pp. 12 & 13
2. C.Sivaramamurthi, *Op.cit.* Plates 14 & 22
3. V.V.Krishna Sastry, *Op.cit.* pp. 144, 145
4. *IAPKD*, No.25, p. 69.
5. *EHD*, p. 757
6. బి.యన్.శాస్త్రి, *Op.cit*, pp. 79 & 80
7. *RE*, 1966, No.169, p. 42
8. *IAPKD*, No. 5. P.12
9. *EA*, Vol. II, pp. 21-28
10. *Ibid*, Vol. IV, p. 68
11. *IAPKD*, No.17, pp. 44-47
12. *EHD*, p. 757.
13. *IAPWD*, No. 14, pp. 26-30
14. *Ibid*, No. 22, pp. 55-60
15. S.Gopala Krishna Murthy, *Op.cit.*, p.41
16. *Ibid*
17. నేలటూరి వెంకటరమణయ్య, పల్లవులు-చాళుక్యులు, p.234
18. N.Venkataramanayya, *The Chalkuyas of Vemulawada*, pp. 43, 46.
19. *Ibid*, p.43
20. *IAPKD*, No.6, p. 17
21. *Ibid.*, No. 18, p. 47
22. *EHD*, p. 706
23. *EA*, Vol.IV, pp. 70-89
24. *IAPWD*, No.15, pp.30-35
25. S.Gopala Krishna Murty, *The Sculpture of the Kakatiyas*, p. 7
26. *Corpus*, Part I, p.20
27. *IAPKD*, Nos. 32 & 34
28. *EHD*, p. 710
29. *Ibid*, p. 711
30. R.C.Majumdar, 'Saivism', History and Culture of the Indian People, chapter XVI. *Bharatiya Vidya Bhavan*, Vol. V, p. 458.
31. Sachindra Kumar Maity, *The Imperial Guptas and their times*, p. 101
32. క్రీడాభిరామము, పద్యము 127.
33. *Ibid*, పద్యము 128
34. Sachindra Kumar Maity, *Op.cit*, p. 176
35. *IAPKD*, No.25, pp. 64-71
36. *Ibid*
37. *Ibid*, No.28, pp. 75-80
38. *Ibid*, No.37, pp.104-106
39. *Ibid*, No.48, pp.119,120
40. *Ibid*, No.49, pp.120,121
41. కంభంపాటి సత్యనారాయణ, ఆంధ్రుల సంస్కృతి, చరిత్ర, 1982, p. 305
42. మల్లంపెల్లి సోమశేఖరశర్మ, ఆంధ్రుల సంస్కృతి తరంగిణి, 1976, p. 36
43. *Ibid*, 38 & 39.

ఐదవ అధ్యాయం

# V. సాంఘిక పరిస్థితులు

కరీంనగర్ జిల్లాలో గోదావరిఖని, గౌరీగుండం మున్నగుచోట్ల వెలుగుచూచిన పాతరాతి యుగపు పనిముట్లు, నాటి మానవులు ఆహార సంపాదనకై ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి వలస పోతూ సంచార జీవనం గడిపేవారని తెలియజేస్తున్నాయి. రేగొండ వద్ద కొండచరియలపై శిలాయుగపు చిత్రకళ వెలుగు చూడటం వల్ల ఆదిమానవులు కొండగుహల్లోనూ చరియల క్రింద ఉండేవారనీ, పగటిపూట వేటకు వెళ్లి రాత్రిళ్లు గుహల్లో నివాసాలుండేవారనీ తెలియజేస్తుంది. కొత్తరాతి యుగం నాటికి మానవుడు సంచారాన్ని కొంత తగ్గించి నీటి వనరులున్న ఒకే ప్రాంతంలో ఎక్కువ కాలం గడిపేవాడు. వ్యవసాయం, పశుపాలన సాగించడం, తరువాతి ఇనుపయుగంలో సమాజమందు చాలా మార్పులు గోచరించాయి. మానవులు కుదుళ్లలో (చిన్నపాటి ఊళ్లు) స్థిరనివాసముండేవాళ్లు. ఇళ్లను తమకు సులభంగా లభించే చెట్లు చేమలు, ఆకులు, అలములతో నిర్మించుకొని, సమాధులను మాత్రం సమిష్టిగా, శాశ్వత నిర్మాణాలు గావించుకొన్నారు. వీటినే బృహత్ శిలాయుగపు సమాధులంటారు. జిల్లాలోని పెద్దబొంకూరు ఇనుపయుగానికి చారిత్రకయుగానికి మధ్య క్రమంగా జరిగిన మార్పును సూచిస్తుంది. ఇనుమును కనుక్కోవటంతో అనేక రకాల గృహోపకరణాలు, వ్యవసాయపనిముట్లు, కత్తులు, కటారులు తయారై సమాజం పురోభివృద్ధిని సాధించింది. తరువాత వచ్చిన చారిత్రక తొలి యుగంలో సమాచారవ్యవస్థ, నాణెముల వినియోగం, నగరాల నిర్మాణం, ఇటుక వాడకం, లిపి కనుక్కొని రాయటం మొదలైన మార్పులు గోచరించి నాగరికతకు బాటలు వేయటం జరిగింది. ఈ చారిత్రక తొలియుగంలోనే మతానికి కూడా పునాదులు వేయటం జరిగింది. ఉత్తర భారతం నుంచి వచ్చిన బౌద్ధమతం, జైనమతం కరీంనగర్ జిల్లాలో వేళ్లూనుకొని ధూళికట్ట, పాషిగాంవ్, మీర్జంపేట, మునులగుట్ట వద్ద ఆనవాళ్లను బయట పెట్టాయి. రాచరికవ్యవస్థ సమాజాన్ని నిర్దిష్ట ప్రమాణాలతో పాలించింది. ఈ నేపథ్యంలో జిల్లాలోని సాంఘిక చరిత్రను శాతవాహనుల కాలం నుంచి ఇటీవలి కాలం వరకు క్రమవికాస పరిణామ దశల్లో పరిశీలించాల్సిన అవసరముంది. అందుకు జిల్లాలో జరిపిన

పురావస్తు అన్వేషణ, త్రవ్వకాలు, లభించిన పురాతనసామగ్రి, శాసనాలు, సమకాలీన సాహిత్యం ఎంతగానో ఉపయోగపడుతాయి.

సమాజ వ్యవస్థ ప్రజల జీవన విధానం నుండి ఉత్పన్నమై కాలాను క్రమంగా ప్రజాజీవనంలో సంభవించే పరిణామాలకు అనుగుణంగా మార్పులు పొందుతుంది. కాగా ప్రజాజీవన విధానం, వారు నివసించే భౌగోళిక పరిస్థితుల వలన నిర్ధారితం అవుతుంది. అయితే ప్రస్తుతం సందర్భానుసారంగా ఈ ప్రాంతంలో లభించే శాసనాధారాలు, వాఙ్మయాధారాల ననుసరించి ఈ ప్రదేశానికి సంబంధించిన సామాజిక స్థితిగతులను సాధ్యమైనంత వరకు ప్రదర్శించు ప్రయత్నం జరిగింది.

శాతవాహనయుగ సాంఘిక విషయాలను తెలిపే ఆధారాలు బహుకొద్దిగా ఉన్నాయి. దక్షిణా పథమంతా ఆర్యనాగరికతకు లోబడటం విశేషం. సమాజమున బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర చాతుర్వర్ణాలు ఏర్పడినాయి. బ్రాహ్మణులు పురోహిత వర్గము, క్షత్రియులు వీరవర్గము. వ్యవసాయ వ్యాపారాలను నిర్వహించేవారు వైశ్యవర్గము. పై వర్గాల వారికి సేవలందించే వారిది శూద్రవర్గము. ఆర్యధర్మాలను పాటించేవారు ఈ నాలుగు వర్ణాలలో ఏదో ఒక వర్ణానికి చెందినవారు. ఆర్యధర్మాలను పాటించని వారు కొండ జాతుల వారుగా మిగిలి పోయినారు. వర్ణాల కంటే వృత్తి ప్రధానంగానే కులం ఏర్పడింది. హాలికులు, శెట్లు, గధికులు (మందులు తయారుచేసేవారు), వర్ధకులు (వడ్రంగులు), కమ్మరివారు (ఇనుపపనిచేసేవారు) కొలికులు (నేతగాండ్రు), తిలపిసకలు (గానుగువాండ్రు), గోతిక, మూర్ధిక మున్నగు కులాలు ఏర్పడినాయి.

శుంగుల వలె శాతవాహనులు వైదిక మతాన్ని స్వీకరించారు. వీరి ఆదరణలోనే వైదిక మతము హిందూ మతంగా మారింది. కాని వీరు బౌద్ధ, జైన మతాలను గూడా ఆదరించారు. కరీంనగర్ జిల్లాలోని ధూళికట్ట, పాషిగాంవ్, మీర్జంపేట బౌద్ధ స్థూపాలే బౌద్ధ మతవ్యాప్తికి తార్కాణము. శాతవాహన రాజులు యజ్ఞయాగాదులు గావించారు. ఇంద్రుడు, కృష్ణుడు, పశుపతి, గౌరి మున్నగు హిందూ దైవములను ఆరాధించారు. వీరు ప్రాకృత, సంస్కృత భాషలను పోషించారు. గురువులు నోటితో చెప్పిన దానిని శిష్యులు నోటితోనే వల్లించేవారు. హాలుడు 'గాథాసప్తశతి'ని ప్రాకృతంలో రచించాడు. గుణాఢ్యుడు పైశాచీ ప్రాకృతంలో 'బృహత్కథ' రచించాడు. ఈ బృహత్కథయే సంస్కృత 'కథాసరిత్సాగరము'నకు మూలమైంది. శర్వవర్మ కాతంత్రవ్యాకరణము సంస్కృతభాష సులువుగా నేర్చుటకు రచింపబడింది.

పెద్దబొంకూరు, ధూళికట్ట, కోటిలింగాలలో జరిపిన త్రవ్వకాలలో మట్టి, లోహపు బొమ్మలు, బరణిలు, బంగారు, రాగి, దంతము, శంఖుపూసలు, నల్లని ఎర్రని రంగులతో కూడిన పెంకులు, కుండలు, ఇటుకముక్కలు, ఆభరణాలతో పాటు సీసపు, కంచు నాణేలు కుప్పలుగా దొరికాయి. బొమ్మలలోని తలలు సర్వలక్షణాలతో తీర్చబడినాయి. శిరోజాలంకరణలో

మెచ్చుకోదగిన వైవిధ్యం ఉంది. బౌద్ధస్థూపం శిథిలాల నుండి సంగ్రహించిన శిల్పఫలకములను బట్టి ఆనాటి ప్రజలు కొద్దిపాటి వస్త్రధారణతో విపరీతమైన ఆభరణ అలంకరణతో సంబరపడినట్లు కనిపిస్తుంది. స్త్రీలు నడుముకు బిగించి కాసె పోసిన వస్త్రాన్ని కట్టేవారు. వక్షస్థలాన్ని కప్పుకొనే ఆచారం నాడు లేనట్లుంది[1]. నడుము నుంచి మోకాళ్ల వరకే పురుషులు వస్త్రం ధరించేవారు. తలపాగాలుండేవి. కర్ణాభరణాలు, గాజులు, కంకణాలు హారాలను ధరించటంలో స్త్రీ, పురుష వివక్షత కనబడదు. స్త్రీలు మోచేయి వరకు గాజులను ధరించినట్లు ధూళికట్ట బౌద్ధస్థూప శిల్పాలు తెలుపుతున్నాయి. దండకడియాలు, కాళ్లకడియాలుండడం సర్వసాధారణం. పండ్లు ఫలాదులపై, పుష్పాలపై ప్రీతి ఎక్కువ. సుగంధ ద్రవ్యాలు వాడేవారు. స్త్రీ సమాజంలో గౌరవింప బడింది. గౌతమీ పుత్ర, వాసిష్ఠ పుత్ర అను మాతృసంజ్ఞలు స్త్రీ గౌరవాన్ని సూచిస్తున్నాయి. స్త్రీలు విద్యావంతులు. వితంతు వివాహాలు లేవు. ప్రజలు ఉల్లాసవంతమైన జీవితం గడిపేవారని గాథా సప్తశతి వర్ణిస్తుంది. ఉమ్మడి కుటుంబాలుండటం ఈ యుగలక్షణము.

శాతవాహన రాజులు కోటల నిర్మాణము గావించి రాజభవనాలలో నివసించారు. ధూళికట్ట, కోటిలింగాల నగరాల చుట్టూ బయల్పడిన కోటలే ఇందుకు నిదర్శనము. రాజ్యము 'ఆహారాల'ను పెద్ద పాలనా విభాగాలుగా విభజింపబడింది. ప్రతి ఆహారానికి 'నిగమ' కేంద్ర పట్టణముండేది. మిగిలినవన్ని గ్రామాలే. పెద్దబొంకూరు శాతవాహనుల కాలపు గ్రామము. పట్టణాలు పరిపాలనా ప్రాధాన్యత గలిగిన పెద్ద జనావాసాలు. అంతేగాక అవి వివిధమైన వస్తూత్పత్తికి, వర్తక వాణిజ్యాలకు కేంద్రాలు. అనేక వృత్తి పనివారు, వర్తకులు 'నిగమ' లేక 'నికమ' అనే పేర్లతో శాసనాల్లో ఉదహరించబడిన సంఘాలను ఏర్పరచుకొని తమ వ్యవహారాలను స్వయంగా నిర్వహించుకొనేవారు. కరీంనగర్ జిల్లాలో వీరి కాలపు దేవాలయాలు కానరావు. కాని బౌద్ధస్థూపాలు మాత్రం ఉన్నాయి.

ఆంధ్రదేశంలో చాళుక్యుల, కాకతీయుల కాలంలో చాతుర్వర్ణ వ్యవస్థ బాగా స్థిరపడి ఒక్కొక్క వర్ణము నందు అనేక వర్గములు, కులము లేర్పడినాయి. పౌరజీవితంలో బ్రాహ్మణులు అగ్రస్థానంలో ఉన్నారు. దేవాలయాల నిర్వహణలో వీరు ప్రధానపాత్ర వహించారు. ప్రభువు మరియు అన్ని వర్గముల ప్రజలు స్వచ్ఛందంగా ఇచ్చు దానములపైననే వారు ఆధారపడినారు. కులవ్యవస్థ బాగా పాతుకపోయింది. కులవ్యవస్థతో ఏర్పడిన సమాజమును కాపాడుట రాజు ప్రాథమిక బాధ్యతగా మారింది. ఆహార వివాహాది విషయాలలో కుల పట్టింపులు బాగా పెరిగాయి. కాని దేవాలయాల నిర్వహణలో, స్థానిక పాలనలో, భూమి మరియు నీటి పారుదల వ్యవహారములు పరిష్కరించుకొనుటలో అన్ని వర్ణముల, కులముల, వర్గములవారు పరస్పరంగా సహకరించుకునేవారు. గ్రామాలలో నగరాలలో కులాల వారిగా నివాసము లేర్పడినాయి. కులాల ప్రాతిపదికన వాడలు, వీధులు ఏర్పడుట వలన వారి వారి ఆచార వ్యవహార సంప్రదాయాలు పాటించడానికి సౌకర్యంగా ఉండేది. పరిచారకులు, అంటరానివారు, నిమ్నజాతుల వారు గ్రామము

బయట చిన్నకుదుళ్లలో నివసించేవారు. అంటరాని వారికి మధ్యయుగంలో దేవాలయ ప్రవేశముండెనో లేదో తెలుపుటకు తగిన ఆధారాల్లేవు[2].

వ్యవసాయమే ప్రధానవృత్తి గనుక అత్యధిక జనాభా గ్రామల్లోనే ఉండేది. ఏ వృత్తిలో ఉండిన వారైనను కొంత స్వంతభూమి ఉన్నవారికి సంఘమందు గౌరవముండేది. భూమి యాజమాన్యమునకు అధిక ప్రాధాన్యత ఇవ్వబడింది. దేవాలయములందు నియుక్తులైన బ్రాహ్మణులకు దేవవృత్తులుండేవి మరియు ప్రజలిచ్చిన దానపు భూములుండేవి. భూములు లేని వ్యవసాయ కూలీలు వారి భూములను సాగుచేసి పంటలోని కొంతభాగాన్ని అనుభవించేవారు. ఈ వ్యవసాయ కూలీలకు కార్మికులకు దేవాలయ నిర్వహణలో, స్థానిక వ్యవహారాలలో తక్కువ ప్రమేయముండేది. రోజు వారి పనిచేసేవారికి ధాన్యరూపంలో కూలి లభించేది. విరామ సమయంలో చిన్నకారు సన్నకారు రైతులు గూడా రోజు వారి కూలీకి సిద్ధమయ్యేవారు[3].

విద్యారంగంలో బ్రాహ్మణులదే పై చేయి. విద్యబోధించు బ్రాహ్మణులు రాజుల నుండి మాన్యాలు ప్రజల నుండి అనేక రకాల దానములను స్వీకరించారు. కోరికలకు అతీతంగా ఉండి విద్యావ్యాప్తి, మత విశ్వాసము, ఆధ్యాత్మిక, నైతిక విలువలు పెంపొందించే బాధ్యత వహించారు. ఆనాటి అక్షరాస్యత వివరాలు తెలియవు. చదువు రాకపోయినను ప్రజలు మత సంప్రదాయములు, సాధారణ సంస్కృతి పట్ల తగినంత అవగాహన కలిగి ఉండిరి. దేవాలయములు, మఠములు, సంచరించు సాధువులు, మునులచే ప్రజలలో విద్య, సంస్కృతి పెంపొందింపబడినాయి[4]. క్రీ.శ. 1083 వేములవాడ శాసనం మఠాలకు, విద్యాసంస్థలకు, విద్యార్థులకు, గురువులకు ఉచిత అన్న, వస్త్ర, వసతి సదుపాయాలు కల్పించడానికి భూదానమిచ్చినట్లు తెలుపుతుంది[5].

## సమాజం - స్త్రీల స్థాయి

దేవాలయాలందలి స్త్రీల ప్రతిమాశిల్పాలు సమాజంలో స్త్రీకి గల గౌరవాన్ని సూచిస్తున్నాయి. సాంఘిక జీవనాన్ని గడుపడానికి ఆడవారికి ఎలాంటి అడ్డంకులుండేవి కావు. స్త్రీల వస్త్రధారణ, ఆభరణాలు, శిరోజాలంకరణ, సుగంధ లేపనాలు, ఆటలు, వినోదాలు మున్నగునవి శిల్పాలు ప్రతిబింబింప జేస్తాయి. వారు కళలలో, వేటలో, విలువిద్యలో ఆరితేరి ఉండిరి. ఆడవారు నర్తకీమణులుగా, వాద్యకారిణులుగా, బాకలనూదు భామలుగా, తాళాలను మ్రోగించు తరుణులుగా, విల్లంబులు ధరించిన వేటకత్తెలుగా, సంగీత నాట్యములందు ప్రావీణ్యత గల కళాకారులుగా కాకతీయ దేవాలయాల శిల్పాల్లో చూడవచ్చు. అందంగా అలంకరించుకోవడంలో ఆనాటి స్త్రీలకు మక్కువ ఎక్కువ. అందమైన దుస్తులు ధరించి వివిధ రకాల ఆభరణాలతో, పొడువుగా జాలువారు శిరోజాలను ఒక వైపు ముడివేసి రూపొందించిన శిఖకు సుగంధాలు వెదజల్లే పూలదండలను అలంకరించుకొని ఆనందంతో అందంగా దర్శనమిచ్చేవారు ఆనాటి భామలు.

సన్నని నడుముతో భారీగా నున్న ఎత్తైన కుచములతో అందము అతిశయించుటకై కంఠాభరణములు, మెడ నుండి వ్రేలాడు వజ్రాల హారాలు ధరించి నీలి పద్మపు రేకులను బోలిన ప్రకాశవంతమైన నేత్రాలతో తలపై నట్టనడుమ పాపటతీసి వ్రేలాడుచున్న ఉంగరాలవలె చుట్టుకొనిన నల్లని వెంద్రుకలకు అలంకరించుకొన్న మల్లెపూదండలతో ఆనాటి అతివలు అందంగా అగబడేవారు.

మధ్యయుగంలో ఈ జిల్లా యందు రాజధానులుగా రాణించిన వేములవాడ, మంత్రకూటము, పొలవాస (పొలాస) నగునూరు నగరములందున్న దేవాలయాల శిల్పములందు ఆనాటి స్త్రీల అందాలు ప్రస్ఫుటంగా గోచరిస్తాయి. ఆ శిల్పప్రతిమలలోని నాట్యభంగిమలు, వ్రేళ్ల విన్యాసము కళాభిమానుల దృష్టినాకర్షింపకమానవు. యౌవనోద్వేగములో తాళప్రకారం కదులుచున్న నాట్యకత్తె మనోభావాలను ఉలితో మలచాడు ఆనాటి శిల్పి. దేహపు వంపులలో ప్రతిభంగిమలోని అందమేకాక సాధారణంగా కనబడని సంతోషాతిశయము కూడా ప్రస్ఫుటమైంది. కట్టలు త్రెంచుకొన్న యౌవనోద్వేగము పెద్దంపేట యక్షిణి శిల్పంలో రమ్యంగా గోచరిస్తుంది. ఈ శిల్పంలో లావైన పిరుదులు, భారమైన చనుకట్టు అతి సన్నని నడుము చెక్కినాడు శిల్పి. పైకెత్తిన చేతులు తలదాటిన తరువాత కలుసుకోవడంలో గూడా అందాన్ని సృష్టించాడు. దండల భాగాన్ని లావుగా చూపించి మోచేతులను నాజూకుగా ఒంపు తిప్పటం ఈ శిల్పంలోని ప్రత్యేకత. ఆనాటి అతివల ఆనందాతిశయ, మాధుర్య జీవితానికి ఈ శిల్పం ఒక ప్రతీక. కొందరు స్త్రీలు సకల విద్యాపారంగతులు. రాజ్యాలనేలే స్థితికి ఎదిగారు. కాకతీయ సామ్రాజ్యము నేలిన మహారాణీ రుద్రమదేవి దక్షిణ భారతదేశంలోనే చక్కటి పరిపాలన గావించిన ప్రథమ మహిళగా ప్రసిద్ధి గాంచింది. ఆమె కాలమున వెనిస్ వాస్తవ్యుడైన మార్కోపోలో కాకతీయ రాజ్యమును సందర్శించి ఆమె పరిపాలనా దక్షతను కాకతీయ అభ్యుదయమును కొనియాడాడు.

## వస్త్రధారణ మరియు ఆభరణాలు

శిల్పమును బట్టి చూడగా ఆనాటి ఆడవారు సాధారణంగా క్రింది భాగాన చీర, పైభాగాన రవిక లేదా అంగవస్త్రాన్ని కప్పుకునేవారు. దేవతల మరియు స్త్రీల ప్రతిమాశిల్పములందు చాలా మట్టుకు బొడ్డుపై భాగమందు ఎలాంటి వస్త్రాలు లేవు. స్త్రీలు తమ పైభాగములందు వస్త్రాలు ధరించేవారా లేదా అను అంశముపై పండితులకు భిన్నాభిప్రాయాలున్నాయి. భారతదేశంలోకి మహ్మదీయుల రాకకు పూర్వము పైభాగము దిగంబరంగా ఉండటం అమర్యాదగా భావింపబడలేదని కన్నింగ్‌హామ్ అభిప్రాయము. ఆనాటి శిల్పాలలోని, చిత్రాలలోని స్త్రీలు అతి తక్కువ వస్త్రధారణతో కనిపిస్తారు[6]. భారతదేశపు శిల్ప కళా చరిత్రలో తొలికాలము నుండి క్రీ.శ. 12వ శతాబ్దము వరకు ఆడవారి వక్షోజాలపై వస్త్రాలు కనిపించవు. చాలా శతాబ్దాల మట్టుకు అన్నివర్గముల స్త్రీలు దిగంబరంగా నున్న నడుముపై భాగముతోనే సంచరించేవారు.

ప్రాచీన భారతదేశంలో స్త్రీ ఆమె ఊర్ధ్వభాగమందు ఎలాంటి అంగవస్త్రము లేకుండా దిగంబరంగా యథేచ్ఛగా సంచరించేదని చార్లెస్ ఫ్యాబ్రీ అభిప్రాయము[7].

స్త్రీలు వారి వక్షస్థలము పై కప్పుకొనటానికి చోలిక ప్రధాన అంగవస్త్రంగా ఉండేది. స్త్రీలు వారి వక్షోజాలపై కప్పుకోవడానికి చోలికావస్త్రాన్ని వాడేవారని పదవ శతాబ్దపు యశస్తిలక చంపువు తెలుపుతుంది[8]. కంచుకము కేవలము స్తనములను మాత్రమే దాచు వక్షోజాల వస్త్రము. ఉదరము, నడుముభాగములు నగ్నంగా ఉంటాయి. స్త్రీలు అధోభాగమున ధరించు ప్రధాన వస్త్రము చీర. దాదాపు నేటి మగువలు ధరించు రీతిలోనే ఆనాడు చీరలు కట్టుకునేవారు. సమాజములోని ఉన్నత వర్గముల స్త్రీలు వారి పాదాల వరకు చీరలు కట్టుకునే వారని ఆనాటి శిల్పాలు తెలుపుతున్నాయి. బీదలైన ఆడవారి చీరకట్టు మోకాళ్ల వరకుండేది. నడుముకట్టుతో నున్న చీర చెంగులు క్రిందికి వ్రేలాడుచుండగా దాని కొంగును భుజాలపై వేసికొని వక్షస్థల భాగాన్ని దాచుకునేవారు.

పురుషులు సాధారణంగా తలపాగా, అంగవస్త్రము, ధోవతి ధరించేవారు. శిల్పులు వారి సమకాలీనులు ధరించు వస్త్రాలనే వారి శిల్పములందు ప్రతిబింబింపజేస్తారు. పురుషులు ధోవతిని అనేక రకాలుగా ధరించే వారు. కొన్ని సందర్భాలలో బిగువుగా కాళ్లకు అంటుకున్నట్లుగానే కట్టేవారు. యోధుల ధోవతుల కట్టడము బిగువుగా కనిపిస్తుంది. వారి కదలికలకు బిగువు కట్టడము సులభంగా ఉంటుంది. సన్యాసులు, మునులు కేవలము కౌపీనములు (గోచీలు) ధరించేవారు.

దేవతలు, మానవుల శిల్పాల్లో ఆభరణభారము మెండుగా కనిపిస్తుంది. వారికి ఆభరణములందు మక్కువ ఎక్కువ. సాధారణంగా స్త్రీలు కంఠాభరణాలు, కర్ణాభరణాలు, లోలకాలు, మెడనిండా హారములు, కేయూరాలు, మోచేతి, ముంజేతి కడియాలు, వడ్డాణాలు, నడుముకట్లు, కాలి కడియాలు, పాదాలకు నూపురములు ధరించినట్లు ఆనాటి శిల్పాల్లో చూడవచ్చు. పురుషులు గూడా మెడ నుండి వ్రేలాడు హారములు, మోచేతి, ముంజేతి, కాలికడియాలు ధరించేవారు. వ్రేళ్లకు ఉంగరాలుండేవి.

ఆనాటి ప్రజలు రకరకాల వస్త్రాలను ధరించేవారు. వసంతకాలంలో నూలుబట్టలు, ఎండకాలమున సన్నని తెల్లవస్త్రములు, వర్షాకాలము, శీతకాలములందు ఉన్ని బట్టలు ప్రభుత్వోద్యోగులు ప్రజలు ధరించేవారు. తమలపాకు నమలడం ఆనాడు సర్వసాధారణం. వివాహములు నాలుగైదు దినములు మహావైభవంగా జరుగుచుండేవి. పెద్దలు నిర్ణయించిన వివాహములే అధికము. ప్రజలలో మూఢనమ్మకాలుండేవి. అంజనము వేయించు ఆనాటి ఆచారము నేటికీ వ్యాపించి ఉంది. బాలికలకు చిలుకబొమ్మలు, దంతపుబొమ్మలు, ఆటవస్తువులు. బాలురు బొంగరములాట వనవిహారము, వేట వంటి వాటిలో పాల్గొనేవారు.

## ఆహారపానీయాలు

ఆనాటి ప్రజల జీవిత విధానము తెలియజేయు ఆధారాలు శాసనాల్లో కానరావు. సమకాలీన పిల్లల మర్రి శాసనం భోజన వివరాలను తెలుపుతుంది. పప్పు, నెయ్యితో గూడిన అన్నము సత్రములందు వడ్డించేవారు. వండిన కూరగాయలు భోజనమందుదేవి. తప్పకుండా చివరలో పెరుగు లేదా మజ్జిగ వాడేవారు[9]. పండ్లు ఫలాదులు వారి ఉపాహారము. పండ్లతోటల, వనముల పెంపకము ప్రస్తావన కరీంనగర్, గొడిశాల శాసనాల్లో కనిపిస్తుంది[10]. మామిడి, మాదిఫలాది రకాలు పెంచబడేవి. శిల్పములందు మామిడిపండ్లు, ద్రాక్షపండ్ల గుత్తులు గోచరిస్తాయి. నేటి మాదిరిగానే తీపి తినుబండారాలు అధికంగానే ఉండేవి. గణపతి హస్తమందున్న పాత్రలో మోదకములు కనిపిస్తాయి. చాముండ దేవతారాధన జేయువారు మాంసాన్ని తినేవారు. మద్యము తక్కువ కులముల వారు సేవించేవారు. తాటి వనముల పెంపకమునకు ప్రాధాన్యత ఉండేది గనుక కడపటి వర్ణము వారు కల్లు సేవించేవారు. నేటికి ఈత, తాటికల్లు విస్తారంగా వాడబడుతుంది.

పూదోటల పెంపకం అధికంగా ఉండేది. పుష్పాలకు గిరాకి ఉండేది. కరీంనగర్, వేములవాడ శాసనాల్లో పూలతోటల ప్రస్తావన ఉంది[11]. దేవతారాధనకై దేవాలయ భూములందు పూదోటల పెంపకం ఉండేది. వేములవాడ శాసనంలో మాచిగంగడను మాలాకారుని ప్రస్తావన ఉంది.

సాంఘిక సాంస్కృతిక జీవనమందు దేవాలయాలు ప్రధానపాత్ర వహించాయి. వాటి నిర్మాణము సద్గతినిస్తుందని వారి విశ్వాసము. మధ్యయుగంలో మత విశ్వాసాలకు, దైవారాధనకు దేవాలయాలే ప్రధాన కేంద్రాలు. చాళుక్యుల, కాకతీయుల కాలంలోని దేవాలయాల శిల్పాలు ప్రజల సాంఘిక సాంస్కృతిక జీవనాన్ని ప్రతిబింబిస్తున్నాయి.

గ్రామాల్లో చిన్నదో పెద్దదో ఒక దేవాలయముంటుంది. నూతన గ్రామాల స్థాపన సమయంలో దేవాలయంకై స్థలం కేటాయించి దాని నిర్మాణముగావించేవారు. గణపతి దేవ చక్రవర్తి గురువు మంచి భటోపాధ్యాయుడు ఒక కొత్త గ్రామాన్ని స్థాపించి, చెఱువు త్రవ్వించి కేశవదేవ, మహాదేవాలయాలను కట్టించి మంత్రకూట గోపీజనవల్లభ దేవరకు తోటను దానముగా ఇచ్చినట్లు క్రీ.శ. 1199 మంథని శాసనం తెలుపుతుంది[12]. దేవాలయ స్థాపన సప్త సంతానాలలో ఒకటిగా పరిగణింపబడేది. స్వంత కుమారుడు, పెంపుడు కొడుకు, కావ్యము, అగ్రహారము, తోట, చెఱువు మరియు దేవాలయ నిర్మాణము సప్త సంతానములని క్రీ.శ. 1171 గంగాధరుని నగునూరు శాసనం తెలుపుతుంది[13]. ప్రస్తుతమీ శాసనం కలెక్టర్ నివాస గృహావరణలో ఉంది. రాజులు, సేనానులు, ధనికులు, దేవాలయాలను కట్టించుట, చెఱువులు త్రవ్వించుట పుణ్యకార్యాలుగా భావించేవారు. దేవాలయాలకు వస్తురూపేణ, రొక్కరూపేణ దానాలిచ్చేవారు.

అనేక భూదానములివ్వబడినాయి.

ప్రతి గ్రామంలో దేవాలయం ఒక ఆరాధన ప్రదేశంగానే గాకుండా ప్రజల సాంఘిక, సాంస్కృతిక, ఆర్థిక జీవనంలో బహుముఖ పాత్ర వహించింది. దీని నిర్మాణంలో ఎందరో కూలీలకు, శిల్పులకు ఉపాధి లభించింది. పెద్ద దేవాలయములందు పూజారులకు, వాద్యకారులకు, గాయకులకు, నాట్యకత్తెలకు, పూలమాలాకారులకు, వంటపనివారికి ఇంకను అనేక రకముల పనివారలకు ఉద్యోగాలు లభించినాయి. పండుగ సందర్భాలలో, వార్షికంగా జరుగు దేవాలయ ఉత్సవములందు, జాతరలందు విద్యావిజ్ఞాన పోటీలు, మల్లయుద్ధాలు, వినోదానికై, కోడి పందెములు, పొట్టేళ్ల, దున్నపోతుల, ఎడ్లబండ్ల పోటీలు నిర్వహింపబడేవి. కొందరు చదరంగము, పుంజీతము, అష్టచెమ్మవంటి ఆటలలోను మరికొందరు సంగీత, వాద్యనృత్యములందును, కోలాటములు, బుఱ్ఱకథలు, తోలుబొమ్మలాట, హరికథలు, ఒగ్గుకథ మున్నగువాటితో వినోదంగా కాలము గడిపేవారు. గోలీలాట, గిల్లిదండ (చిర్రగోనె), పచ్చీసు, కచ్చకాయలు, బొంగరములాట, చిరుగుడు (కబడ్డీ), తొక్కుడుబిల్ల, చెమ్మచెక్క, దాగుడుమూతలు మున్నగు ఆటలు ఆనాటి వినోదములు.

దేవాలయ అరుగులందు ఆసుపత్రులు, బడులు నడుపబడేవి. పురాణ హరికథాకాలక్షేపాలు జరిగేవి. స్థానిక సమస్యల పరిష్కారమునకై జనులు గుడివద్ద జమగూడేవారు. దేవాలయ భూములు పేదప్రజలు సాగుచేసి పంటలో కొంత భాగము అనుభవించేవారు. ఆనాటి ప్రజల సాంఘిక జీవనంలో దేవాలయం ప్రధానపాత్ర వహించిందని కె.ఎ. నీలకంఠశాస్త్రి అభిప్రాయం[14]. కస్తూరి, తిలకం, గంధం, కర్పూరం, పూలు, పూలమాలలు ఇత్యాదులు దైవార్పణ గావింపబడేవి. స్త్రీలు, పురుషులు వయోభేదం లేకుండా అందరూ దేవాలయాన్ని దర్శించేవారు. సంఘనీతి, దైవప్రీతి, పాపభీతి సమాజంలో మెండుగా ఉండేవి. దైవ విగ్రహముల అంగరంగ వైభోగములకై అనేక రకముల దానములివ్వబడినాయి. అంగభోగమనగా గర్భగృహమందలి ప్రధాన దైవమునకు రాచమర్యాదలతో అమూల్య ఆభరణములు, వస్త్రములు, ధూపదీప నైవేద్య తాంబూలాదులు, వేదమంత్రాలతో సమర్పించుట. రంగభోగమనగా గర్భగృహము బయట రంగమంటపము లేదా కళ్యాణ మంటపమందు దైవ ప్రీత్యర్థం నిర్వహించు ఉత్సవములు. దేవనర్తకీలు రంగశిలపై నాట్యప్రదర్శనలు ఇచ్చేవారు. వాద్యకాండ్రు తమ నైపుణ్యమును ప్రదర్శించేవారు. కళ్యాణ మంటపాలలో దేవుని కళ్యాణ సమయమందు ఉత్సవ విగ్రహాలుపయోగించేవారు. కాకతి రుద్రదేవుని మంత్రి గంగాధరుడు ఒక చెఱువు నందు విష్ణువు ఉత్సవమును జరిపినట్లు కరీంనగర్ శాసనం తెలుపుతుంది[15]. రాజు నుండి పేద వరకు దైవ ఉత్సవములందు పాల్గొని తమవంతు కట్నములు, దానములు దైవానికి సమర్పించేవారు. వేములవాడ, గొడిశాల, ధర్మపురి, ఖమ్మంపెల్లి, చిట్యాపూర్ శాసనములందు దైవపూజకై, అంగరంగ వైభోగములకై దానములివ్వబడినట్లు తెలుపబడింది[16].

కాకతీయుల కాలంలో వ్రతములు, నోముల ప్రాధాన్యత పెరిగింది. లక్ష్మీనారాయణ వ్రతము, అనంత అరుంధతి వ్రతము, జలశయనవ్రతము కల్పములందు పేర్కొనినట్లుగా నిర్వహించేవారని కాకతీయ శాసనాలు తెలుపుతున్నాయి. వ్రతములనాచరించుటచే పుణ్యప్రాప్తి కలుగుతుందని వారి విశ్వాసము [17]. మతపరమైన క్రియక్రతువులన్నింటికీ గ్రామ దేవాలయమే కేంద్రం. పుణ్యము ప్రాప్తిస్తుందని తీర్థయాత్రలు చేసేవారు. కాకతి రుద్రదేవుని మంత్రి గంగాధరుడు పుణ్యప్రాప్తికై కాశీ, గయ తీర్థయాత్రలకేగినాడని అనుమకొండ శిథిలశాసనం తెలుపుతుంది [18]. తీర్థయాత్రలకేగలేనివారు వ్రతములాచరించేవారు. ఆనాడు 'కాశీకి పోయినవాడు కాటికి పోయినట్లే' నని భావించు నానుడి సర్వవ్యాప్తమై ఉంది. ప్రయాణ సౌకర్యములు, సాధనాలు లేని ఆ రోజులలో కాశీకేగడం దుర్లభంగానే ఉండేది.

వేములవాడ, ధర్మపురి, కాళేశ్వరం తెలంగాణమందలి సుప్రసిద్ధ తీర్థ క్షేత్రాలుగా విరాజిల్లినాయి. దేవాలయాలు దానధర్మాలకు నిలయాలైనాయి. వసతి గృహములు, విశ్రాంతి గృహములేర్పరచి దాతలు పేదలకు అన్నదానం చేసేవారు. అన్న సత్రములు నడుపుట పవిత్ర కార్యంగా భావింపబడేది. యాత్రికులకు, మునులకు, సన్యాసులకు ధర్మశాలలు, అన్న సత్రములుండేవని రెండవ అరికేసరి ప్రభువు కాలపు వేములవాడ శాసనం తెలుపుతుంది [19]. వేములవాడ అరికేశ్వర దేవరకు మరియు పూజారి పూజలు చేయుటకై పూదోటలు దానములివ్వబడినాయి. ప్రవర కులోద్భవుడైన జగద్దేవ మహామండలేశ్వరుడు మునులకు సన్యాసులకు అన్నదానము చేయుటకై సిరిసిల్ల సమీపమున గల ఇల్లంతకుంట గ్రామమును దానముగా ఇచ్చినాడని వేములవాడలోని వేరొక శాసనం పేర్కొంటుంది [20].

గ్రామాలలో అనేక సాంస్కృతిక కార్యక్రమాలు జరిగేవి. భజనలు, నాటకాలు నిర్వహింపబడేవి. పండితులు, కవులు, కళాకారులు, భక్తి సాహిత్యము, సంగీతం, నృత్యం, నాటకాల అభివృద్ధికై దోహదపడ్డారు. దేవాలయ మంటపముల మధ్య నున్న రంగశిలపై నర్తకీమణులు వారి కళానైపుణ్యాన్ని దైవ కైంకర్యమునకై ప్రదర్శించేవారు. మతము సంస్కృతి యొక్క సారము, సంస్కృతి మతము యొక్క రూపము. మతానికి కేంద్రమైన దేవాలయం ఆ ప్రాంతపు ప్రజల సంస్కృతిని ప్రతిబింబింప జేస్తుంది. హరికథలు, నాటక ప్రదర్శనలు, సంగీత సమావేశాలు జరిగేవి. దేవాలయాల వార్షిక ఉత్సవములందు జాతరలు, పండుగలు జరుగు సందర్భాలలో ధనికులు పేదలు కలిసి సంతోషంగా పాల్గొనేవారు. ధర్మశాలలు, విశ్రాంతి గృహములందు యాత్రికులకు ఉచిత భోజన వసతి ఉండేది [21].

పెద్ద దేవాలయాలందు దేవదాసీలుండేవారు. దైవ ప్రీత్యర్థం నృత్యం చేసేవారు. నృత్యం దైవ పూజలోని షోడశోపచారాల్లో ఒకటి. నర్తకీమణులు, వాద్యకారిణులు, బాకలూదువారు, తాళాలు మ్రోగించువారు, సంగీత విద్వాంసులు, పూజారులు నియమింపబడిరి. వారి జీతములను భరించుటకై దైవము యొక్క అంగరంగ వైభోగాలకై విరివిగా భూదానములివ్వబడినాయి. నటులు,

గాయకులు, కవులు, పండితులు, ధ్వని అనుకారులు, వక్తలు, హాస్యకారులు, విదూషకులు, దైవస్తోత్రము చేయువారు. మూకాభినయము చేయువారు, పలురంగములందు నిష్ణాతులైన కళాకారులు వారి కళలను ఆలయ ఉత్సవము లందు ప్రదర్శించి పారితోషికములు, ప్రశంసలందుకునేవారు. గుఱ్ఱపుస్వారి చేయుట ఒక కళ. మొండి గుఱ్ఱములను లొంగదీయుట ప్రత్యేక అర్హతగా పరిగణింపబడేది. నగునూరునేలిన దొమ్మరాజు గుఱ్ఱపు స్వారి చేయుటలో దిట్ట. విలువిద్యకు ప్రాధాన్యత ఉండేది. కాకతి రుద్రదేవుడు శరముల పరంపరతో దొమ్మరాజును అర్జునుడు కర్ణుని ఓడించిన విధముగా యుద్ధరంగమందు పారద్రోలినాడని శాసనం తెలుపుతుంది[22]. జానపదగేయాలు, జానపదనాటకాలు, నృత్యాలు సామాన్య ప్రజలను బాగా ఆకట్టుకునేవి.

వేములవాడ రాజరాజేశ్వర దేవాలయ మహాశివరాత్రి ఉత్సవములు, ధర్మపురి లక్ష్మీనరసింహ స్వామి దేవాలయమందు కాముని పూర్ణిమ రోజు జరుగు ఉత్సవములందు, జాతరలందు దూరదూర ప్రాంతాల నుండి వేలాది మంది పాల్గొను ఆనాటి సంప్రదాయము నేటికీ కనిపిస్తుంది. కరీంనగర్ జిల్లాలోని దేవాలయాలందు జరుగు వార్షిక ఉత్సవాలకు, జాతరలకు అనాది నుండి నేటి వరకు వేలాది మంది భక్తులు పాల్గొంటూనే ఉంటారు.

పురాణమును వినుట వలన సామాన్యప్రజలు జీవితము దిద్దుకొని ధర్మవర్తనులగుటకు ప్రయత్నించిరి. దీపదానము వలన విశేష ఫలము కలుగునని భారతములో తెలుపబడింది. మధ్యతరగతి వారనేకులు దేవాలయాలందు నిత్యము వెలుగుటకై అఖండ దీపమును బెట్టుట ఆచారమైంది. రాజ్యసౌధమునకు గ్రామమే పునాది. ప్రతి గ్రామమునకు లెక్క వ్రాయుటకు కరణము, రాజునకు పన్నులు వసూలు చేసి పంపుటకు రడ్డి, గ్రామకావలికి తలారి, వ్యవసాయమునకు ఉపకరణములు తయారు చేయుటకు వడ్రంగి, కమ్మరి, కుమ్మరి, అగసాలె, మంగలి మొదలైన వారుండిరి. ఆ కాలములో మంగలియే శస్త్రవైద్యుడు. జోస్యుడు గూడా గ్రామానికి అత్యంత ప్రధానమైన వ్యక్తి. రాజ్యపాలనకు నియుక్తులైన బ్రాహ్మణులను నియోగులనేవారు. తదితరులు వైదికులుగా వ్యవహరింపబడ్డారు. కోమట్లు ఈ కాలములో గోమినీ భామాధీశ పదాబ్జ భక్తులమని చెప్పుకునేవారు. గోమినీ భామ అనగా నెవరో తెలియదు. ఈ కోమట్లందరు తేలికవారి వలెనే వ్యాపార సంఘముగా ఏర్పడినారు. ఈ సంఘమునకు నకరమని పేరు. తేలిక వారు వేయి గోత్రాలవారు. కోమట్లు నూట రెండు గోత్రములవారు[23]. గోమటేశ్వర జైన దైవమును పూజించినవారు గోమఠులుగా క్రమముగా కోమట్లుగా వ్యవహరింపబడినారనే అభిప్రాయం వేరొకటి వ్యాప్తిలో ఉంది.

కోమట్లు కాక ఇతరులు గూడా వర్తక వ్యాపారములు చేసి సంఘముగా ఏర్పడినారు. ఈ సంఘమునకు వీరబలంజ సమయమని పేరు. ఈ వీరబలంజ సమయములో ఉభయ నానాదేశీలు, గవరలని, ముమ్మూరి దండులని అనేక వ్యాపార సంఘములుండేవి. ఈ సమయము

వారు అయ్యావళి-500 వర్తక సంఘానికి చెందినవారని తెలుస్తుంది.[24] వీరబలంజ సమయమునకు చెందిన అయ్యావళి-500 స్వాములు, ముమ్మూరి దండులు, 36 బిదులవారు, ఉభయనానాదేశీలు పౌలస్త్యేశ్వర దేవరకు దానములొసంగినట్లు క్రీ.శ. 1108 పొలాస శాసనము తెలుపుతుంది[25].

చివరి తరగతుల ప్రజలు కాకతమ్మ, ఏకవీర, మైలారుదేవ, ముస్తానమ్మ, నాయకురాలు, మున్నగు దేవతలను కొలుస్తారని వల్లభరాయని క్రీడాభిరామం వర్ణిస్తుంది. కామేశ్వరి, ఏకవీర, మాహురమ్మ మొదలైన దేవతల కథలను పాటల రూపంలో పాడేవారు. ప్రాచీన కాలంలో ఈజిప్టు, సిరియా, బాబిలోన్‌లలో లింగపూజ ఉండినట్లు చిహ్నాలున్నాయి. మొహెంజదారో, హరప్పా త్రవ్వకాలలో పూజలో ఉపయోగించిన మూడు రకాల రాళ్లు దొరికాయి. పవిత్రంగా భావించబడే ఉల్కశిల (బాయెటిలిక్), లింగాకారశిల, ఉంగరం మాదిరిగా ఉన్న యోనిశిల. వీనిలో పెద్దవి పూజలకు, చిన్నవి తాయెత్తు మాదిరిగా కట్టుకోవడానికి ఉపయోగించి ఉంటారని సర్‌జాన్‌మార్షల్ అభిప్రాయం[26].

మధ్యయుగపు తెలుగు దేశ సామాజిక పరిస్థితులను తెలిపే గ్రంథం వల్లభరాయని క్రీడాభిరామం. మంచనశర్మ, టిట్టిభసెట్టి అనే యువకులు వరంగల్ వీధులలో విహారం చేసి నగరంలో చూసిన ఒకరోజు అనుభవాలను వల్లభరాయడు ఔచిత్యపు హద్దుల్ని దాటి వర్ణిస్తాడు. విద్య, తపస్సుతో బ్రాహ్మణులు జనాదరణ పొందారు. ప్రజల దాతృత్వగుణము వారికి జీవనాధారంగా ఉండింది. వైశ్యులు వర్తకం చేస్తూ బలమైన శ్రేణులుగా ఏర్పడ్డారు. ఇక శూద్రులకు ఒక నిర్దిష్టత అంటూలేదు.

వీరశైవం వీరిని పైకి తెచ్చి పుష్టినిచ్చింది. అస్పృశ్యులది అధమాధమస్థితి, అవమానకర దీనస్థితి. దేవున్ని, ప్రభువును, బ్రాహ్మణులను నిందించువారికి వేయి పణాల జరిమానా విధించేవారని కేతన విజ్ఞానేశ్వరీయంలో ఉంది. తన కులంవాడి భార్యనే చెరిస్తే వేయిపణాలు, తనకన్న తక్కువ కులం వాడి భార్యను చెరిస్తే 500 పణాలు శిక్షవిధించేవారు. పెద్దకులంవాడు తక్కువ కులం వానిని కొడితే శిక్ష తక్కువ. అదే చిన్నకులం వాడు పెద్ద కులం వాడిని కొడితే శిక్ష ఎక్కువ ఉండేది[27]. తక్కువ కులంవారికి వడ్డీరేట్లు ఎక్కువగా ఉండేవి. ఇంతటి కులవివక్ష, శిక్షల అసమానత, ఒకే రకపు నేరమునకు కుల ప్రాతిపదిక పై శిక్షలలో వ్యత్యాసము నేటి సమాజమునకు గర్హనీయము, అమానుషము. సమాజ స్వరూపం ఆనాటికే మురిగిపోయిన స్థితికి చేరుకుంది. వివిధ తరగతుల వారి మధ్య సామాజిక సంబంధాలపై నిషేధాలు వచ్చేశాయి. కర్మకాండలూ, మూఢాచారాలు బాగా పాతుకపోయాయి. వ్యభిచారానికి రాజపోషణ ఉండింది. ఉన్నత కులాలు దీనికి పెద్దపీట వేశాయి. నిజానికి ఇది సమాజం యొక్క మూలుగుల్ని, జవసత్వాలను పీల్చేసింది.

దేవాలయాలమీద బూతు బొమ్మలు చెక్కడం మామూలు. బెజ్జెంకి దేవాలయపు గోడలపై మైథున శిల్పాలున్నాయి. పవిత్రంగా ఎంచే స్థలాలలో ఈ లైంగిక చిత్రాల చెక్కడంపై పండితులకు

భిన్నాభిప్రాయాలున్నాయి. కొందరు దిష్టితగులకుండేందుకు అన్నారు. ఐహిక సుఖాలు క్షణికమని తెలుపడానికే అన్నారు మరికొందరు. భక్తుల ప్రలోభాలను చూపించేందుకు అన్నారు ఇంకొందరు. ప్రకృతి పురుషుల సమైక్యతను స్త్రీ, పురుష సంగమం ద్వారా చూపదలచారని కొందరి సమాధానం. లైంగిక క్రియాపూజనం పంటల సమృద్ధినిస్తుందనే భావన అనాదిగా ఉంది. దాని రూపాలలో ఇదొకటని కె.కె.పిళ్లే వ్రాశారు. వైదిక ఆర్యులు లింగపూజకులుకాదు. సింధూలోయ ప్రజలు, దక్షిణ దేశపు బృహత్ శిలాయుగపు ప్రజలు లింగారాధకులు. మహాభారతం కాలంనాటికి స్త్రీ, పురుష జననేంద్రియ రూపాలు ఆరాధ్య వస్తువులయ్యాయి. క్రమేణ ఇది మైథున చిత్రణకు దారి తీసిందని కె.కె. పిళ్లే అభిప్రాయపడ్డారు. బౌద్ధులు అనుసరించిన తాంత్రికపూజలు హిందువులకు కూడా పాకినాయి. దీనికి వీరశైవం తోడైంది. శివభక్తురాలికి వాత్సాయన కామసూత్రాలు బోధింపబడినట్లు పండితారాధ్య చరిత్ర చెబుతుంది. నియమ నిబంధరహితమైన మైథున సంబంధాలు శివప్రీతికరమనే భావాన్ని వీరశైవం ప్రచారంలో పెట్టింది. దేవదాసీవ్యవస్థ విస్తరించి దుర్నీతికి దిగజారడం, సుఖలాలసులైన పాలకులు తాంత్రికులతో స్నేహం చేయడం, పండితులలో కామసూత్రాధ్యయనం మీద మోజు పెరగడం మధ్య యుగంలో వచ్చిన కొన్ని పరిణామాలు[28]. వాటిలో భైరవీ తంత్రం లేక చక్రపూజ ఒకటి. మద్యం, మాంసం, మత్స్యం, ముద్ర, మైథునం అనే పంచ'మ'కారాలు ఉపాసించడం వలన ముక్తి లభిస్తుందని నమ్మేవారు. కులభేదం లేకుండా స్త్రీలు పురుషులు సమిష్టి భోజనం నుంచి సమిష్టి సంభోగం వరకు తాంత్రిక పూజా కార్యక్రమంలో పాల్గొనేవారు. ఈ పతన సంప్రదాయం నేటి సభ్యసమాజంకు మింగుడు పడదు. జక్కన, శ్రీనాథుడు తమ రచనలలో భైరవీ యోగుల్ని పేర్కొంటారు. గోపరాజు యోగినీ చక్రాన్ని పేర్కొంటాడు. ఆత్మహింసనం తాంత్రిక పూజా రూపాలలో ఒకటి. నాలుకలు కోసుకొని, తలలు నరుక్కుని సాయుజ్యం పొందే మార్గాలుగా భావించడం కానవస్తుంది.

సతీసహగమనము చేయని వారిని సమాజం నిరసించేది. సమాజంలో వితంతువుది అతిహీనస్థితి. దేవదాసీలు, వేశ్యలు సంఘంలో ఇతర స్త్రీలకు లేని హోదా గౌరవం అనుభవించేవారు. వారు శూద్రకులం వారైనా సంగీతం, నాట్యం నేర్చేవారు. తమ విద్యలతో ధనికులనాకర్షించి సంపదలు గడించేవారు. వారికి రాజాదరణ, సమాజాదరణ లభించింది. వారిని చేరదీయడం గౌరవప్రదంగా భావింపబడింది. సంఘనీతిని భ్రష్టు పట్టించుటలో వీరి పాత్ర గణనీయంగా ఉండేది. నాట్యాభినయములలో నిపుణులైన వేశ్యలు ప్రభువుల, స్థానిక పాలకుల హృదయములను ఆడిపాడి రంజింపజేసి వారి నుండి సన్మానాలు, సంపదలు గడించారు.

క్రీడాభిరామంలో పాములనాడించే వారి ప్రసక్తి ఉంది. వాద్య పరికర ధ్వనికి పడగలు విప్పి పాములాటలాడేవి. పొట్టకూటి కొఱకు నేడు గూడా వీధులందీ పాముల ప్రదర్శన జరుగుతుంది. జూదములో భూములు, రొక్కము, ఆభరణాలు, ఆలుపిల్లలు చివరకు తనకు తాను పందెంలో ఓడిపోయిన వారి ఉదంతాలున్నాయి[29].

గోలకొండ కుతుబ్‌షాహీల కాలంలో సహగమనం కొంతవరకు ఇష్టపూర్వకంగాను, కొంతవరకు బలవంతంగా జరిగేది. బ్రాహ్మణులు బలవంతంగా విధవను మంటలలో తోసేస్తుండే వారని బౌరే వ్రాశాడు. భర్తతో చనిపోవడం పుణ్యమని, ప్రతిష్ఠాకరమని తల్లులు కూతుళ్లకు బోధించేవారు. బెర్నియర్ స్వయంగా ఆరు సహగమనాలు చూశానని పేర్కొన్నాడు. సహగమనంచేసే స్త్రీ ఆమె నగలన్నింటితో మంటలో దూకేది. ఆమె చితాభస్మాన్ని సేకరించే మిషతో ఆ బంగారాన్ని, వెండిని బ్రాహ్మణులు తీసికొనేవారు. అందుకొరకే వారు స్త్రీలను సహగమనానికి ప్రోత్సహించేవారని టావెర్నియర్ పేర్కొన్నాడు. ఒక నేత వాని భార్య, ఒక కాపువాని భార్య, ఒక స్వర్ణకారుని భార్య సహగమనం చేయడం చూశానన్నాడు మెత్‌వోల్డ్. గోలకొండ సుల్తాన్‌లు కొంతమట్టుకు ఈ ఆచారాన్ని మాన్పింప ప్రయత్నించారు[30].

బ్రాహ్మణులు జ్యోతిష్య, ఖగోళ శాస్త్రములందు దిట్టలై ఉండిరి. సుల్తాన్‌లు గూడా జోస్యాన్ని నమ్మేవారు. వైశ్యులలో వర్తకం చేసుకొనేవారు ఉపాయశాలురని, కార్యకుశలురని, మంచి గణిత వేత్తలని బౌరే పేర్కొన్నాడు. శూద్రులు వ్యవసాయదారులుగా, సేవకులుగా, కోటలందు సైనికులుగా పనిచేస్తారని మెత్‌వోల్డ్ వ్రాశాడు. అస్పృశ్యులు గ్రామాల బయటుండి చచ్చిపోయిన జంతువు మాంసం తింటారని, వాటి చర్మాలు తీసి దేశీయులకు చెప్పులు, ముస్లింలకు బూట్లు కుడుతారని మెత్‌వోల్డ్ వివరించాడు. హిందూ స్త్రీలు స్వేచ్ఛగా తిరుగుతారని, ముస్లిం స్త్రీలు పరదా పాటించేవారని, సామాన్య జనం తమ స్త్రీలకు అధిక స్వాతంత్ర్యం ఇచ్చే వారని తెవెనా పేర్కొన్నాడు. బహుభార్యత్వం నిషిద్ధం కాదు. కాని సామాన్యజనులు ఒకే భార్యతో జీవితంగడిపేవారు. బాల్యవివాహాలు ఎక్కువ. మగపిల్లవానికి 5, ఆడపిల్లకు 3 సంవత్సరాల వయస్సురాగానే పెళ్లిళ్లు చేసేవారు. వితంతువులది దుర్భరస్థితి, ఇంటి చాకిరీ అంతా వాళ్ల మీద పడేది. వారు నగలు పెట్టుకోకూడదు. శుభ్రమైన బట్టలు కట్టకూడదు. వేశ్యలు ప్రభుత్వానుమతి పొందేవారు. గోలకొండలో 20వేల మంది వేశ్యలుండేవారని టావెర్నియర్ వ్రాశాడు. దేవదాసీలు అప్రతిష్ఠ అవమానాలు లేకుండా ఇహలోక సౌఖ్యాలనుభవించేవారు. వారికి మగని బాధలు లేవు. సహగమనం లేదు. ఇంటిచాకిరీ లేదు. ఇదే సుఖంగా ఉందని పెళ్లి చేసుకోవడానికి సాధారణంగా స్త్రీలు ఇష్టపడేవారు కాదని బౌరే తెలిపాడు. వారు ధనికులని, వారి ఇళ్లు ఒళ్లు శుభ్రంగా వివిధ అలంకారాలతో ఉండేదని మెత్‌వోల్డ్ వర్ణించాడు[31]. వ్యభిచారము అవినీతిగా కనబడని కాలమది. ముస్లింల రాకతో వారి పాలనా కాలములో బాల్యవివాహములు హెచ్చినాయి. ఆడపిల్లలను ఎక్కడ చెరగొని పోదురోయని భయపడి తలిదండ్రులు వారి బరువు బాధ్యతను తీర్చుకొనుటకు చిన్నపిల్లలకే వివాహములు చేస్తుండేవారు. అది రాను రాను ఒక ఆచారంగా పరిణమించి ఆడపిల్లలకు పదేండ్లయినా రాకముందే వివాహాలు కొన్ని దశాబ్దాల క్రింది వరకు జరిగాయి.

# విద్యావ్యాప్తి

శాతవాహనుల కాలమందు ప్రాకృత, సంస్కృత భాషలు పోషింపబడినాయి. వేములవాడ చాళుక్యులు, కళ్యాణి చాళుక్యుల కాలములో కన్నడ సంస్కృత భాషలు, కాకతీయుల కాలములో సంస్కృతాంధ్రభాషలు, ముస్లింల పాలనాకాలములో ఫారసీ, అరబ్బీ, ఉర్దూభాషలు పోషింపబడినాయి. ఆధునిక యుగంలో ఆంగ్లభాష వాడకము మిన్ను ముట్టినది. ఆంగ్లభాష నేర్చినవారు సమాజంలో గౌరవింపబడినారు.

పూర్వకాలంలో దేవాలయాల మఠములు, జైనపల్లీలు, బసదులు, బౌద్ధ విహారములు, విద్యావ్యాప్తికై కృషిచేసినాయి. వాటిలోని సన్యాసులు, మునులు, విద్యార్థులకు ఉచితంగా విద్యాబోధన చేసేవారు. అగ్రహారములోని ప్రతి బ్రాహ్మణ గృహము గురుకులమే అయినను ప్రత్యేకంగా విద్యాస్థానాలుండేవి. వీటిలో వేదాంత, వ్యాకరణ, తర్క, మీమాంసాది శాస్త్రములు బోధింపబడేవి. దేవాలయపు అరుగులపైన లేదా గ్రామములోని చెట్ల క్రింద చదువడం, వ్రాయడం, సామాన్యలెక్కలు చేయడం గురువుల ద్వారా నేర్చుకొనేవారు. పెద్ద దేవాలయాలందుండిన విద్యామంటపములందు యోగ్యులైన గురువులు బోధించేవారు. ఉపాధ్యాయులకు, విద్యార్థులకు ఉచిత భోజన వసతి ఉండేదని వేములవాడ శాసనం తెలుపుతుంది.

ఆనాటి మఠములు సన్యాసులకు కేవలము నివాసములే గాకుండా అన్న వసతి కలిగించేవి. ఆసుపత్రులు నెలకొలిపి ఉచితవైద్యం అందించాయి. మఠములు విద్యాకేంద్రములుగా వెలసి కళలను శాస్త్రములను పోషించాయి. విద్యావ్యాప్తికై మఠములకు తరచుగా, భూదానములివ్వబడ్డాయి[32]. ప్రధానంగా శైవమఠములు విద్యావ్యాప్తికై, నైతిక విలువలు పెంపొందించుటకై బహుళంగా కృషిచేశాయి. వేదములు, శాస్త్రములు, ఆగమములు, పురాణములు, ఇతిహాసములు, కావ్యములు, నాటకములు, వివిధ కళలు, శైవమతతత్వము శిష్యులకు బోధింపబడేవి. వేములవాడలోని కాలాముఖ శైవమఠములందు యోగ్యులైన ఆచార్యులు శిష్యులకు ఉచిత విద్యనందించేవారు[33]. పాలకుల ప్రభువుల ఉదార దానములతో మఠములు, సత్రములు నడుపబడేవి. మహామండలేశ్వరుడైన రాజాదిత్యుడు భూదానములతో పాటు మఠములకు ఒక గ్రామమును గూడా దానమిచ్చినట్లు అతని క్రీ.శ. 1083 వేములవాడ శాసనం తెలుపుతుంది[34].

మధ్యయుగంలో కరీంనగర్ జిల్లా యందు వేములవాడ, ధర్మపురి, పొలాస, మంథని గొప్ప విద్యాకేంద్రాలుగా భాసిల్లినాయి. నేటికినీ ఈ ప్రాంతములు వేదపండితులకు, ఘనాపాఠీలకు, వాస్తు, జ్యోతిష, ఆగమ, సంగీత, వాద్య, నృత్య, నాటక శాస్త్రములకు సుప్రసిద్ధ నిలయాలుగా నుండి వేల సంవత్సరాల వారసత్వ సంపదను కాపాడటం అమోఘము. దేవాలయాలందు పురాణ పఠన శ్రవణములు హైందవ సంస్కృతి, శాస్త్ర అవగాహనను పెంపొందించుటకై

తోడ్పడినాయి. రామాయణ, మహాభారత ఇతిహాసములు, అష్టాదశపురాణములు, ఉప పురాణములు వయోజనుల విజ్ఞానాన్ని పెంచాయి. ప్రవచన సమయమందు తెలివి గల చురుకైన బోధకుడు కేవలము గ్రంథములోని అంశములకే పరిమితం కాకుండా వాటిని సమకాలీనాంశములతో, నిత్యజీవితంతో పోల్చి రసానుభూతిని కలిగించుచు ఆధ్యాత్మిక, నైతిక, ధార్మిక విలువలను పెంపొందించేవాడు. వివాహాది శుభకార్యములు దేవాలయాలందే నిర్వహింపబడేవి. స్థానిక సమస్యల పరిష్కారమునకై దేవాలయాలు వేదికలుగా ఉపయోగపడినాయి. వేదపండితులు సమావేశమై ఐహిక ఆముష్మిక విషయాలను ఇచటనే చర్చించేవారు. రాజులు, మంత్రులు ప్రజలను దేవాలయాలందే కలిసేవారు. పట్టాభిషేకములు, విజయోత్సవములు మున్నగునవి దేవాలయాలందే నిర్వహింపబడేవి. పవిత్రకార్యములన్నింటికి దేవాలయమే కేంద్రంగా ఉండేది. దేవాలయాలందు సేవాకార్యక్రమాలు జరిగేవి. బీదలకు అన్నదానము, రోగులకు చికిత్స, విద్యార్థులకు విద్యనందించుట మున్నగువాటికి దేవాలయ అరుగులు, ప్రాంగణము ఉపయోగపడేవి. పండుగల సందర్భాలలో, వార్షిక ఉత్సవములందు, జాతరలందు వినోదమునకై మల్లయుద్ధములు, కోడి పందెములు, పొట్టేళ్ల పోట్లాట, దున్నపోతుల కొట్లాట, ఎడ్లబండ్ల పరుగులు మున్నగునవి నిర్వహింపబడేవి. వివిధ రకములైన ఆటల పోటీలు జరిగేవి. రాజభవనము తరువాత దేవాలయమునకే ప్రాధాన్యత ఇవ్వబడింది. దేవాలయాలు దైవపూజలు చేయుటకే గాక జనుల సాంఘిక సాంస్కృతిక జీవనం ప్రతిబింబింప జేయుటలో ప్రధానపాత్ర వహించాయి. గ్రామజీవనంలో దేవాలయమే అన్నింటికి కేంద్ర స్థానంగా ఉండేది.

బహమనీసుల్తాన్‌లు తెలంగాణము నాక్రమించగానే మహ్మదీయుల జనాభా పెరిగింది. చాల చోట్ల మసీదులు వెలసినవి. జైనబసదులు, శైవమఠాలు విద్యావ్యాప్తికై కృషి చేసినట్లుగానే మసీదులకు సంబంధించిన మద్రసాలు మహ్మదీయ విద్యాపీఠాలుగా ఏర్పడినాయి. ముస్లింలు ఈ మద్రసాలలో విద్యనేర్చుకునేవారు. అరబ్బీ, ఫారసీ భాషలందు బోధింపబడేవి. ఉదారులైన మహ్మదీయ ధనికులు, అధికారులు మద్రసాలు. లంగర్‌ఖానాలు (భోజనసత్రములు) నడుపుటకు దానములిచ్చేవారు. ఆ కాలములో మహ్మదీయ రాజ్యముల నుండి వచ్చిన ఫారసీ, అరబ్బీ రాజ పత్రాలను అనర్గళంగా చదివి అర్థం చెప్పగల తెలుగు వారుండినట్లు శ్రీనాథుని గ్రంథముల వలన తెలుస్తుంది. తెలుగుదేశములోని కొందరు ముస్లింలు తెలుగును, హిందువులు కొందరు అరబ్బీ, ఫారసీభాషలు నేర్చుట ఆచారమైంది[35].

క్రీ.శ. 1800 లకు పూర్వము ముద్రణయంత్రములు లేనందున గ్రంథములన్నియు తాటియాకుల మీదను, పీచుకాగితముల మీదను వ్రాయుచుండిరి. ధనధాన్యరూపమున భృతి యొసంగి గ్రంథప్రతులు వ్రాయించుకొనేవారు. ఈ గ్రంథలేఖనము కొంతమందికి వృత్తిగా మారింది. బ్రిటిష్ ఇంజనీర్ కల్నల్ కాలిన్ మెకంజీ క్రీ.శ. 1782లో కంపెనీ ఉద్యోగములో నుండి తెలుగు వాఙ్మయమునకు అపారమైన సేవ చేశాడు. అతడు స్వంతఖర్చుతో దేవాలయములు,

శాసనములు, మతము, స్థానిక చరిత్ర విశేషములు మున్నగు వాటి గురించి తెలిసికొని వాటిని గ్రామచరిత్రలుగా ఏలూరు నివాసియైన కావలి వెంకటబొర్రయ్య మరియు అతని సహచర బృందంతో వ్రాయించాడు. వాటినే నేడు మెకంజీ కైఫియతులు లేదా దండ కవిలెలు అంటారు. క్రీ.శ. 1817లో ఇండియాకు వచ్చిన చార్లెస్ ఫిలిప్‌బ్రౌన్ తెలుగు దేశమందు 1855 వరకున్నాడు. తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు (Dictionary), తెలుగు వ్యాకరణమును అతడు రచించాడు. ఇతడు సొంత సొమ్ముతో పండితులచే తెలుగు గ్రంథములకు ప్రతులు వ్రాయించాడు. అతని రెండువేల సంస్కృతాంధ్ర గ్రంథములను 1845లో మద్రాసు లిటరరీ సొసైటీకి దానం చేశాడు[36].

కుతుబ్‌షాహీల కాలంలో ఫారసీ అనగా పర్షియన్‌భాష రాజభాషగా ఉండేది. ఉన్నతవర్గాల హిందువులు స్థానికభాషతో పాటు ఉద్యోగాలకోసం పర్షియన్‌ను నేర్చుకునేవారు. ఉత్తరాదిలో పుట్టిన ఉర్దూ వీరి కాలంలో దక్కనీ ఉర్దూగా అభివృద్ధి చెందింది. వీరి కాలంలో అనేక సంస్కృతాంధ్ర రచనలు గూడా వెలువడ్డాయి. ఎల్గందల్‌లో అనేక మంది అరబిక్, పర్షియన్ పండితులుండేవారు. సయ్యద్ అబ్దుల్ ఖుద్దూస్ రచించిన "సైరె ఎల్గందల్" (Saire Elgandal) అనగా ఎల్గందల్ విహార యాత్ర గ్రంథము, మౌల్వీ అబ్దుస్ సలామ్ రచించిన 'వ్యాఖ్యాతె జిలే కరీంనగర్' (Waquat-e-zile-e, Karimnagar అనగా కరీంనగర్ జిల్లా విశేషాలు) గ్రంథము ఆనాటి అరబ్బీ, ఫారసీ పండితుల గురించి వివరంగా తెలుపుతాయి.

కుతుబ్‌షాహీల తరువాత పాలించిన ఆసఫ్‌జాహి నిజాం ప్రభువులు గూడా ఫారసీ లేదా పర్షియన్‌ను రాజభాషగా వాడారు. కాని క్రీ.శ. 1884లో ఆఱవ నిజాం మీర్ మహబూబ్ అలీఖాన్ కాలమందు పర్షియన్‌కు బదులు ఉర్దూ రాజభాషగా ప్రవేశపెట్టబడింది. ఉర్దూమద్రసాలు వెలిసాయి.

క్రీ.శ. 1859-60లో నిజాం ప్రభుత్వము ప్రతి తాలుకాయందు నెలకు రూ. 87 ఖర్చుతో ఒక్కొక్క పర్షియన్‌బడి మరియు స్థానికభాషాబడి, అదే విధంగా జిల్లా కేంద్రంలో నెలకు రూ. 150 ఖర్చుతో పాఠశాలల స్థాపనకై ఫర్మానా జారీ చేసింది. 1885-87లో కరీంనగర్ ప్రాథమిక పాఠశాల మాధ్యమిక పాఠశాలగా పెంచబడింది. 1890-91లో పాతహైదరాబాద్ రాష్ట్రమందు మొట్టమొదటి సారిగా రాష్ట్రస్థాయి (Middle Examination) మిడిల్ పరీక్ష (పాత ఏడవతరగతి) ప్రభుత్వముచే నిర్వహింపబడింది. 1921 నుండి ప్రాథమిక విద్య ఉచితంగా బోధింపబడింది. హిందూ విద్యార్థులు గూడా ఉర్దూ మాధ్యమములోనే విద్యనేర్చేవారు. మొదటిభాషగా ఉర్దూ, రెండవభాషగా పర్షియన్ చదివేవారు. 20వ శతాబ్దపు మధ్యకాలం వరకు విద్యార్థులు వీధి బడులందే చదవడం, వ్రాయడం, సామాన్య గణితం (Three Rs.) చేయడం నేర్చుకునేవారు. బ్రాహ్మణులు, భట్రాజులు, చాత్తాదవైష్ణవులు (చాతాని అయ్యవార్లు) గురువులుగా ఉండేవారు.

కరీంనగర్‌లో 1940-1941లో స్థాపించబడిన ప్రభుత్వ బాలికల మాధ్యమిక పాఠశాల 1945లో ఉన్నత పాఠశాలగా రూపొందింది. ఆనాడు అందులో చదివిన విద్యార్థినుల సంఖ్య 375. 20వ శతాబ్దపు ప్రథమార్ధ భాగంలో కేవలము కరీంనగర్, జగిత్యాల, మంథనిలలో మాత్రమే గెజిటెడ్ ప్రధానోపాధ్యాయులచే నడుపబడు ప్రభుత్వోన్నతపాఠశాలలుండేవి. 1948 సెప్టెంబర్‌లో పోలీసుచర్య జరిగి ఏడవ నిజాం ప్రభుత్వము అంతరించింది. 1949-50 నుండి తెలుగుమాధ్యమము పాఠశాలలందు ప్రవేశ పెట్టబడింది. క్రమంగా తెలుగు అధికారభాషగా రూపొందింది.

నిజాం ప్రభుత్వము ప్రప్రథమంగా H.S.C. పాత పదవతరగతి పరీక్ష (Higher Secondary Certificate Examination)ను రాష్ట్రంలో 1943లో నిర్వహించింది. 1945లో కరీంనగర్ జిల్లాలో మూడు ప్రభుత్వోన్నత బాలుర పాఠశాలలు, ఒకటి బాలికోన్నత పాఠశాల, తొమ్మిది బాలుర మాధ్యమిక పాఠశాలలుండేవి. ప్రైవేట్ పాఠశాలలుండేవి కావు. మొట్ట మొదటి తెలుగుమీడియం H.S.C. పరీక్ష పాత హైదరాబాద్ రాష్ట్రంలో 1952లో నిర్వహింపబడింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ సమయమందు 1956లో ఈ జిల్లా యందు 6930 విద్యార్థుల సంఖ్యతో కేవలము 4 ఉన్నతపాఠశాలలు, 16 మాధ్యమిక పాఠశాలలుండేవి.

1955-56లో కరీంనగర్ బాలుర ఉన్నత పాఠశాల, 1958-59లోజగిత్యాల ఉన్నత పాఠశాల, 1962లో కరీంనగర్ బాలికల ఉన్నత పాఠశాల ఈ జిల్లా యందు బహుళార్థసాధకోన్నత పాఠశాలలుగా (Multipurpose High Schools) మార్చబడినాయి. వీటి యందు 12వ తరగతి పూర్తి చేసినవారు నేరుగా మెడికల్, ఇంజనీరింగ్ తదితర డిగ్రీ కోర్సులకు వెళ్లేవారు. ఈ విధానము కొంతకాలమునకు అదృశ్యమై 1969లో S.S.C. ప్రభుత్వ పరీక్షలు ఆరంభమైనాయి. జూనియర్ కళాశాలలు స్థాపింపబడినాయి.

కరీంనగర్ జిల్లా విద్యార్థులు పాత పదవతరగతి H.S.C. పూర్తి చేసిన తరువాత రెండు సంవత్సరాల పాత ఇంటర్మీడియెట్, రెండు సంవత్సరాల పాత డిగ్రీ కోర్సులు అధ్యయనం చేయడానికి హైదరాబాద్ ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ప్రవేశించేవారు. ఆంధ్రప్రదేశ్ అవతరణ సమయమందు 1955-1956లో కరీంనగర్ యస్.ఆర్.ఆర్. డిగ్రీ కళాశాల స్థాపింపబడింది. ఇది 1958-1959లో ప్రభుత్వ పరమైంది. 1965-1966లో దీనికి అనుబంధంగా కరీంనగర్‌లో సాయంకాల డిగ్రీ కళాశాల స్థాపింపబడింది. ప్రస్తుతమీ కళాశాల లేదు. 1964-65లో జగిత్యాల డిగ్రీ కళాశాల (S.K.N.R. Govt. College) స్థాపించబడింది. ఇది 1972లో ప్రభుత్వ పరమైంది. 1965-66లో జమ్మికుంట డిగ్రీ కళాశాల స్థాపించబడింది. కరీంనగర్ జిల్లాలో 1967-68 విద్యా సంవత్సరమందు కళాశాలల విద్యార్థుల సంఖ్య కేవలము 1502. ప్రస్తుతము గ్రామస్థాయి నుండి పట్టణ స్థాయి వరకు అసంఖ్యాకమైన ప్రభుత్వ, ప్రైవేట్ పాఠశాలలు, కళాశాలలు ఏర్పడటం సంతోషింపదగ్గ విషయం.

# సాహిత్యం

కరీంనగర్ జిల్లా సాహిత్యంపై సంవత్సరముల తరబడి పరిశోధన గావించి విశేష కృషి చేసిన డా.మలయశ్రీ మిక్కిలి అభినందనీయులు. ఈ జిల్లా వేయి సంవత్సరాల తెలుగు సాహిత్యాభివృద్ధి క్రమము, కవుల, రచయితల జీవిత విశేషములతో దాదాపు 750 పేజీలలో వారి బృహత్‌గ్రంథము, "కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర" 1977లో వెలువడింది. మరుగున పడిన అనేక కవులను, రచయితలను, ఈ ఉద్గ్రంథములో వెలుగులోనికి తేవడం జరిగింది. అయినప్పటికిని కొన్ని చారిత్రక సాహితీ విశేషాలను పాఠకుల ముందుంచడం అవసరమని తోస్తుంది.

కరీంనగర్ జిల్లా శాసనములందు కవులు, పండితులు వారి సాహిత్యప్రక్రియలు గోచరిస్తాయి. వేములవాడ, ధర్మపురి, పొలాస, మంథని వైదిక వాఙ్మయ కేంద్రాలుగా వెలుగొందాయి. అచటి వేదపండితులు వేదాలను, శాస్త్రాలను, సంస్కృతాంధ్ర సాహిత్యాన్ని మధ్యయుగం నుండి వేలాది శిష్యులకు బోధించడం జరుగుచునే ఉంది.

వేములవాడ చాళుక్యరాజులు పాలించిన కాలమున కన్నడము రాజభాషగా అభివృద్ధి చెందింది. వారు సంస్కృతము, తెలుగుభాషలను గూడా పోషించారు. తెలుగు ప్రజల భాషగా ఉండేది. వారి కాలపు శాసనములన్నియు కన్నడమందే ఉన్నాయి. ప్రముఖ రాజన్యుడు రెండవ అరికేసరి ఆస్థానకవి పంపడు. పంపకవికి కవితాగుణార్ణవుడను బిరుదుండేది. పంప మహాకవి పూర్వీకులు వేంగినాడులోని వంగిపఱ్ఱు గ్రామమునకు చెందిన కమ్మె బ్రాహ్మణ కుటుంబీకులని కురిక్యాల శాసనం తెలుపుతుంది[37]. పంప మహాకవి క్రీ.శ. 902లో జన్మించినట్లు తెలుస్తుంది. అతడు విక్రమార్జున విజయము అనెడు కన్నడ భారతం ను రచించాడు. దానిని రెండవ అరికేసరి ప్రభువుకు అంకితమివ్వగా అతడు సంతసించి పంపకవికి ధర్మవురమును (ధర్మపురి) అగ్రహారంగా ఇచ్చాడు[38]. కన్నడ సాహిత్యంలో పంపకవి భారతము తలమానికము. పంపకవి వేరొక గ్రంథము ఆదిపురాణము క్రీ.శ.941లో రచింపబడింది. ఈ కావ్యమందు జైన తీర్థంకరుల చరిత్రలు వర్ణింపబడ్డాయి. దీని తరువాతనే విక్రమార్జున విజయము రచించిపబడిందని తెలుస్తుంది. శాంతిపురాణము, రామాభ్యుదయము లను రచించిన పొన్నకవి, గదాయుద్ధము, అజితపురాణము లను రచించిన రన్నకవి మరియు పంపకవి కన్నడ కవిత్రయముగా పేరొందినారు. రన్నడు, పొన్నడు కర్ణాటకములో ఆశ్రయము పొందగా పంపడు మాత్రం వేములవాడ ఆస్థానమునాశ్రయించాడు. పంప మహాకవి రెండవ అరికేసరి దండనాథునిగా నుండి కత్తిని, కలమును రెండింటిని నడిపించాడు. ఇతడు జైన మతావలంబి.

పంప మహాకవి సోదరుడు జినవల్లభుడు గంగాధరలో త్రిభువనతిలక జైన బసది నేర్పరచి వృషభగిరి (బొమ్మలగుట్ట) పై ఆద్యంతతీర్థంకరుల శిల్పాలను చెక్కించాడు. అతడచట

క్రీ.శ. 945లో వేయించిన శాసనమందు చివరలో మూడు కంద పద్యములుండుట గమనార్హము[39]. ఇవి ఆదికవి నన్నయ్య కంటే ఒక శతాబ్దము పూర్వపువి. పదవ శతాబ్దమందే కరీంనగర్ జిల్లాలో తెలుగుభాష పద్యరచన స్థాయికి ఎదిగిందనడానికి ఈ కురిక్యాల శాసనమందలి చివరి మూడు కందములే తార్కాణము. పంపకవి సోదరుడైన జినవల్లభునికి మల్లియరేచన మంచి స్నేహితుడు. జినవల్లభుని ప్రోత్సాహమున జైన వైశ్యపుంగవుడు మల్లియ రేచన కవిజనాశ్రయము అను ఛందోగ్రంథమును రచించినట్లు డా.పి.వి.పరబ్రహ్మశాస్త్రి అభిప్రాయము. కాని తరువాత కాలములో ఇది వేములవాడ భీమకవి రచనగా ప్రఖ్యాతి పొందిందని పలువురి అభిప్రాయము[40].

వేములవాడ చాళుక్యుల పోషణలో ఉండిన వేరొక సుప్రసిద్ధ జైనకవి, సంస్కృత పండితుడు సోమదేవసూరి. రెండవ బద్దెగుడు నిర్మించిన శుభధామ జినాలయమునకు స్థానాధిపతిగా ఉండేవాడు. ఇతడు వేములవాడ చాళుక్య వంశపు చివరిరాజులైన వాగరాజు, రెండవ బద్దెగుడు, మూడవ అరికేసరిలచే పోషింపబడ్డాడు. ఇతడు క్రీ.శ. 959లో యశస్తిలకచంపువు ను రచించాడు. ఇది ఉజ్జయిని రాజైన యశోధరుని కథను ఎనిమిది ఆశ్వాసాల్లో వివరిస్తుంది. నేమిదేవుని శిష్యులలో మేటి శిష్యునిగా పేర్కొనబడినాడు సోమదేవసూరి. ఇతడు శ్యాద్వాదోపనిషత్, నీతికావ్యామృతము అను గ్రంథాలను రచించాడు. నీతికావ్యామృతము రచన 30 అధ్యాయముల వరకు సాగింది. కౌటిల్యుని అర్థశాస్త్రము వలె సోమదేవసూరి నీతికావ్యామృతము చక్కటి రాజనీతిని తెలుపుతుందని ఎ.యస్.అల్టేకర్ చరిత్రకారుని అభిప్రాయము.[41] మూడవ అరికేసరి ఆస్థానమందు పెద్దనబట్టు అను వేరొక పండితుడుండేవాడు. పంపమహాకవి, సోమదేవసూరి ఇరువురు ఉద్దండ పండితులు జైనకవులుగా వేములవాడ చాళుక్యుల ఆస్థానమును రాణింపజేశారు.

కళ్యాణిచక్రవర్తి ఆహవమల్లదేవునికాలపు వేములవాడ శాసనమందు మహేశ్వరశక్తి పండితుడు గొప్ప శైవాచార్యునిగా పేర్కొనబడ్డాడు[42]. కళ్యాణి చాళుక్యుల కాలపు శనిగరంలోని శాసనముల లేఖకులుగా సేనబోవ, జెక్కణమయ్యబరహ, దొణయ్యం, దామరసనబరహ మున్నగు పేర్లు శాసనముల చివరలందు చెక్కబడినాయి[43]. ఈ శాసనములు కన్నడమందున్నాయి.

కాకతీయులు సంస్కృతాంధ్రములను పోషించారు. కాకతిరుద్రదేవుని మంత్రి మరియు నగునూరు పాలకుడుగా నుండిన గంగాధరుడు గొప్పపండితుడు. క్రీ.శ. 1171లో అతడు నగునూరు నందు వేయించిన శాసనములోని చక్కటి తెలుగు పద్యములు అతని రచనలేయని భావింపబడుతుంది[44]. ఇప్పుడీ శాసనము కలెక్టర్ నివాస గృహమందు నిలిచి ఉంది. కాకతి గణపతి దేవ చక్రవర్తి మత గురువైన విశ్వేశ్వర శివుడు కాళేశ్వరం, చంద్రవెల్లి శాసనముల రచయితగా భావింపబడుచున్నాడు[45]. క్రీ.శ. 1199 మంథని శాసనములో మల్లికార్జునుడు, కేశవసూరి, ప్రత్యంగాభరణ మరియు గోపాలసూరి గొప్పపండితులుగా ప్రస్తావింపబడ్డారు[46]. మంథనిలో రామానంద త్రిపాదుడు గొప్ప జ్యోతిశ్శాస్త్ర పండితునిగా ప్రఖ్యాతి గాంచాడు.

రామగిరి ప్రాంతమునేలిన ముప్పభూపాలుని ఆస్థానపండితునిగా నుండిన మడికి సింగన పద్మపురాణోత్తర ఖండము, భాగవతదశమ స్కంధము, సకలనీతి సమ్మతము, వాసిష్ఠరామాయణము గ్రంథములు రచించాడు. పద్మపురాణోత్తర ఖండము ను సింగన శక సంవత్సరము 1342 (క్రీ.శ.1420) లో పూర్తిచేసినట్లు తెలుస్తుంది. మడికి సింగన దీనిని ఎల్లందల పట్టణము నేలిన కందనామాత్యునికి అంకితమిచ్చాడు. కందనామాత్యుడు రసికుడు, భోగలాలసుడు, కవిపుంగవుడు, నిత్యము ఇతనికొలువు కూటము ఆనందోత్సాహాలతో, విద్వజ్జనులతో, సరసకవిగాయకులతో, కామినీజనములు పరివేష్టించి ఉండగా సకల పురాణేతిహాసగోష్ఠి వినోదములతో కాలము వెలిబుచ్చేవాడు. సింగన సకలనీతి సమ్మతము అను కృతిని రామగిరి కేశవ దేవరకు అంకితమిచ్చాడు[47].

12వ శతాబ్దారంభంలో వేములవాడ భీమకవి రాఘవ పాండవీయము, నృసింహపురాణము, శతకంఠ రామాయణము రచించాడు. మల్లియరేచన రచించిన కవిజనాశ్రయము అను ఛందోగ్రంథము భీమకవి రచనగా ప్రచారమొందింది. వేములవాడ భీమకవి ఉనికి పై భిన్నాభిప్రాయాలున్నాయి. ఇతడు తెలంగాణమండలి వేములవాడ గాకుండా ఆంధ్రప్రాంతపు వేములవాడ వాస్తవ్యుడని కొందరి అభిప్రాయము. 14వ శతాబ్దమందుండిన కొఱవి గోపరాజు వేముగల్లు (నిజామాబాద్ జిల్లాలోని భీమ్‌గల్) ప్రాంతము వాడని దూపాటి వేంకట రమణాచార్యులు అభిప్రాయపడ్డారు. సింహాసనద్వాత్రింశిక అతని గొప్ప గ్రంథము. మడికి సింగన సోదరుడు మడికి అనంతయ్య విష్ణుమాయానాటకము రచించాడు. కాకతి గణపతిదేవచక్రవర్తి ఆస్థానమందుండిన గన్నయ్య మంత్రి కుటుంబీకుడైన కందనామాత్యుడు ఎల్లందుల ప్రాంతమునేలుచూ తెలుగులో నీతితారావళి రచించాడు. 15వ శతాబ్దపు మధ్య భాగమందుండిన ఎల్లందుల వాస్తవ్యుడు నారయ బమ్మెర పోతనామాత్యుని శిష్యుడు. ఇతడు పోతనభాగవతములోని ఖాళీలను, గోల్పోయిన భాగాలను సమర్థవంతంగా పూరించి వెలిగందుల నారయగా ప్రసిద్ధి చెందాడు.

వేములవాడ కవిగా భావింపబడుచున్న శరభాంకుడు 14వ శతాబ్దమందు చెన్నబసవ పురాణము, శరభాంకలింగ శతకము రచించాడు. చిత్రభారతము రచించిన చరిగొండ ధర్మయ్య, జ్యోతిష్య రత్నాకరము రచించిన చరిగొండ హొన్నయ్య, ధర్మపురి వాసులు. ధర్మపురి కృష్ణగిరి వెంకటరమణయ్య కన్నడంలో గయోపాఖ్యానం ను రచించి వాసిష్ఠ రామాయణాన్ని తెలుగులోకి అనువదించాడు. ధర్మపురి నివాసి శేషాచలదాసు నరసింహ శతకము, నరహరి శతకము, నృకేసరి శతకము మూడింటిని రచించిన గొప్పకవి. అతడు రచించిన నరసింహ శతకము ఆంధ్రదేశమంతటను సుప్రసిద్ధము. అందులోని మకుటము "భూషణ వికాస శ్రీ ధర్మపురి నివాస, దుష్ట సంహార నరసింహ దురితదూర" జగద్విఖ్యాతము. ఇలాంటి ఐదు సంబోధనలతోడనే "వ్యాసవందిత లేమలవాడవాస, పాపసంహార పరమేశ పార్వతీశ" అను మకుటముతో 19వ

శతాబ్దము చివరి పాదములో జగిత్యాల వైశ్యప్రముఖుడు జైశెట్టి రాజయ్య శ్రీ లేమలవాడ రాజరాజేశ్వర శతకము మరియు మనస్సంబోధన కీర్తనలు అను గ్రంథాలు రచించాడు. ఇవి ఉత్తర తెలంగాణ మంతటను ప్రాచుర్యములో ఉన్నాయి. వీరి సుగ్రీవ విజయము నేడు అలభ్యము. జగిత్యాల ప్రాంతపు రాఘవపట్నం రామ సింహకవి యదార్థరామాయణము, భారతము అనేక భజనల పుస్తకాలు రచించాడు. ఇతడు 20వ శతాబ్దపు ప్రథమార్థకాలపు కవి.

ధర్మపురిలోని సంగనభట్ల వంశమునకు చెందిన పెద్దమహదేవ్, నరసింహ, నరహరి, బుచ్చినర్సింలు, రాజన్న, నర్సయ్య, గుండి రాజయ్య, కాకర్ల లక్ష్మీకాంతశాస్త్రి, చంద్రశేఖరశాస్త్రి, తదూరి బాలకృష్ణశాస్త్రి, రేపాల గోపాలం మున్నగు వారందరు పేరొందిన పండితులు. గట్ల నర్సింగాపురం వానమామలై వెంకటాచార్యులు, మంథని అవధానుల పురుషోత్తం సోమయాజి, జగిత్యాల చంద్రమౌళి శాస్త్రి, పెద్దపెల్లి వానమామలై లక్ష్మణాచార్యులు, రాజలింగయ్యశాస్త్రి, చేగుర్తి భాష్యం విజయసారథి, కోరుట్ల కృష్ణమాచార్యులు, హుజూరాబాద్ వానమామలై జగన్నాథాచార్యులు, ఆవునూరు నరసింహా చార్యులు, వెంకటాచార్యులు, వేములవాడ మామిడిపల్లి సాంబశివశర్మ, వజ్జల సాంబశివశర్మ, మునుగోటి కృష్ణమూర్తి, కరీంనగర్ జువ్వాడి గౌతమరావు, సిరిసిల్ల జె. బాపురెడ్డి, గట్టెపెల్లి సత్యనారాయణరాజు, వెలిచాల కేశవరావు, బోయినపెల్లి వెంకటరామారావు మున్నగు వారందరు సాహితీరంగంలో రాణించిన ప్రముఖులు. ఇంకను ఎందరెందరో కవులు, రచయితలు, పండితుల వివరములు డా.మలయశ్రీ అతని కరీంనగర్ జిల్లా సాహితీ చరిత్ర యందు చక్కగా పొందుపరిచాడు.

సిరిసిల్ల సమీపమున గల హన్మాజిపేటపల్లెలో ఆవిర్భవించి ఆంధ్రదేశ కీర్తి బావుటాను దశదిశల ఎగురవేసిన జ్ఞానపీఠ అవార్డు గ్రహీత రాజ్యసభ సభ్యుడు, పద్మశ్రీ డా.సి.నారాయణరెడ్డి కరీంనగర్ జిల్లాకన్న సాహితీ ముద్దుబిడ్డ. హుజూరాబాద్ సమీపమున గల వంగరలో జన్మించిన మాజీ ప్రధాని పి.వి.నరసింహారావు బహుభాషా కోవిదుడు. కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ వేయిపడగలు అను గ్రంథమును హిందీలో సహస్రఫణ్ గా అనువదించి దేశమంతటా సాహితీరంగంలో లబ్ధప్రతిష్ఠులైనారు.

కరీంనగర్ జిల్లా అనేక మంది విజ్ఞులకు, విద్యావేత్తలకు ఆచార్యులకు నిలయము. ఆచార్యులైన జి.రాంరెడ్డి, సి.నారాయణరెడ్డి, జాఫర్ నిజాం, నవనీతరావు, అనంతస్వామి విశ్వవిద్యాలయాల కులపతులు (Vice-chancellors) కరీంనగర్ జిల్లా వారు కావడం విశేషం.

18వ, 19వ శతాబ్దములందు ఎల్లందల్ పర్షియన్ భాషా పండితులకు కేంద్రంగా ఉండేది. మొహ్మద్‌హుస్సేన్, బల్లేష్, అఫ్జల్‌షాఖాన్, హమీదొద్దీన్, మున్షీగౌస్, మౌల్వీ మొహ్మద్‌హనీఫ్, హాజీషేక్ హుస్సేన్ మున్నగువారు ఆనాటి గొప్ప పర్షియన్ భాషా పండితులు. పెద్దపెల్లి రాజాశివరాజ్ బహాదూర్, వెంకటేశ్వరరావు, మంథని స్వర్ణరామారావు, సుందర్‌రావు గొప్ప ఫారసీ పండితులుగా ఖ్యాతిగడించారు. అల్తాఫ్ హుస్సేన్ షీరీన్, మిర్జాఘియాస్ అలీబేగ్,

అజీమొద్దీన్, అబ్దుల్‌కరీమ్, సుభాన్‌అలీ, బద్రొద్దీన్, ఫక్రొద్దీన్ మున్నగువారు గూడా గొప్ప ఫారసీ పండితులు.

ఎల్గందల్‌లో 18వ శతాబ్దమందుండిన జశ్వంత్‌రాయె బింద్రబాన్ గొప్పచరిత్రకారుడు, పర్షియన్ పండితుడు. అతడు రచించిన లుబ్బుత్‌తారీఖ్ (Lubbu-t-twarikh) బ్రిటిష్ మ్యూజియంలో భద్రపరచబడినట్లు తెలుస్తుంది[48].

ఉర్దూరచయితలలో వాజిద్ అలీవాజిద్ ప్రముఖుడు. ఇతని అమదన్‌హఫ్త్ జహాన్ గొప్ప వ్యాకరణ గ్రంథము. హరిరాంపండిట్, షౌకత్ అలీఖాన్‌ఫాని, అమీర్‌మొహ్మద్ ఖాన్ సయీఫ్, సయ్యద్ మొహియొద్దీన్ సయ్యద్ ఆనాటి ప్రముఖ ఉర్దూ కవులు. పాతతరము వారిలో షేర్ మొహ్మద్‌ఖాన్‌దిల్, హకీమ్‌నసీర్ సిద్దిఖీ, ఇస్మాయిల్ షబీర్, జాఫర్ హుసేన్‌జాఫర్, అహ్మదుల్లా హుసేన్, మొహ్మద్ కరీమొద్దీన్, హబీబుర్ రహమాన్ షాకిర్, ఖలీల్, రఫీఖా మరియు పి.నారాయణరావు మున్నగు వారు పేర్కొనదగిన ఉర్దూకవులు. వీరే గాకుండా పెద్దపెల్లి ఠాకూర్ రాజారాంసింగ్, జగిత్యాల మెట్టకైలాసపతి, కరీంనగర్ మెట్ట సచ్చిదానందరావు ఉర్దూ గద్య రచయితలుగా పేరొందారు. రియాసత్ అలీతాజ్ మంచి విమర్శకుడు. ఘౌజీకమల్, షబీర్‌తవక్కలి, రఫీజ్ షబీర్ షంశి, తంకీన్‌అఫాఖి, గౌహర్, అన్వర్, బాసిత్‌నఖ్వీ, జమీల్ హష్మి మున్నగు వారు ఉర్దూభాషలో తమ ప్రతిభ కనబరిచారు.

భారతదేశంలో లార్డ్ విలియం బెంటింగ్ కాలంలో లార్డ్ మెకాలే 1835 మార్చిలో ఆంగ్లవిద్యను ప్రవేశపెట్టాడు. అనతి కాలంలోనే ఇంగ్లీషు భాష దేశమంతటా వ్యాపించినా, ఉస్మానియా విశ్వ విద్యాలయంలో ఉన్నత విద్య ఉర్దూ మీడియంలోనే జరిగేది. పోలీసు చర్య తరువాత ఇంగ్లీషు మీడియం ప్రవేశపెట్టబడింది. మూడు దశాబ్దల క్రితమే ఉన్నతవిద్యలో తెలుగు మాధ్యమము ప్రవేశపెట్టబడింది. తెలుగు అధికార భాషా సంఘము పక్షాన జిల్లాలలో క్రిందిస్థాయి నుండి ఆఫీసుపనులన్నియు తెలుగులోనే జరుగవలెనను ప్రయత్నము జరుగుతుంది.

## ఆధార గ్రంథములు

**(References)**


1. పి.శ్రీరామశర్మ, *ఆంధ్రదేశచరిత్ర - సంస్కృతి*, 1986. p. 44
2. K.A.Nilakanta Sastry, *A History of South India*. p. 319
3. *Ibid.* p. 327
4. *Corpus*, Part I, pp. 32 & 33.
5. *IAPKD*, No.18, p. 47
6. Asha Kalia, *Art of Orissan Temples*, p. 19
7. Charles Fabri, *Discovering Indian Sculpture*, p. 62

8. Asha Kalia, *Op.cit*, P.20
9. *Corpus*, Part. I, p. 34
10. *IAPKD*, Nos. 25 & 30
11. *Ibid*, Nos.7&20
12. *Ibid*, No. 28, p.75
13. *Ibid*, No. 25, p. 71
14. K.A.Nilakanta Sastri, *Op.cit*, pp. 324-326
15. *IAPKD*, No.25, pp. 64-71
16. *Ibid*, Nos.21,30,31,34 & 38
17. *EHD*, p. 713
18. *JAHRS*, Vol. XXXVI, Part I, p. 58.
19. తెలంగాణ శాసనములు, Vol. I, No.21, pp.173-177.
20. *Ibid*, No.13, p. 116
21. T.V.Sairam, *Indian Temple-Forms and Foundations.*, p. 32
22. *IAPWD*, No.36, pp. 94-100
23. మల్లంపెల్లి సోమశేఖరశర్మ, ఆంధ్ర సంస్కృతి తరంగిణి, 1976, p. 29
24. *Ibid*, p. 30
25. *IAPKD*, No.75, pp. 139-141
26. కంభంపాటి సత్యనారాయణ, ఆంధ్రుల సంస్కృతి చరిత్ర II, 1982, p.56
27. *Ibid*, pp. 62 & 63
28. *Ibid*, pp. 69 & 70
29. R.Varalakshmi, "Social life in kridabhiramamu' *APHC*, Vol.XIV, 1990, pp. 248,249.
30. కంభంపాటి సత్యనారాయణ, *Op.cit.*, pp. 307-309.
31. కంభంపాటి సత్యనారాయణ, *Op.cit.*, pp. 308-311
32. N.Venkataramanayya, *Op.cit.*, pp. 43&44
33. నేలటూరి వెంకటరమణయ్య, పల్లవులు-చాళుక్యులు, pp. 233,234.
34. తెలంగాణ శాసనములు, Vol. I, No. 19, pp. 120-122
35. మల్లంపెల్లి సోమశేఖరశర్మ, *Op.cit.*, p. 35
36. *Ibid*, pp. 60-62
37. *EA*, Vol. II, pp. 21-30
38. నేలటూరి వెంకటరమణయ్య, *Op.cit.*, p.260
39. *IAPKD*, No.3, pp.10&11
40. బి.యన్.శాస్త్రి, *Op.cit.*, p. 33 & 82.
41. Kolluru Suryanarayana, "A brief study on somadevasuri" *APHC*, Vol. XVIII, 1994, pp. 41,42.
42. *IAPKD*, No.6, p. 17
43. *EA*, Vol. IV, pp. 67-89.
44. పి.వి.పరబ్రహ్మశాస్త్రి, కాకతీయశాసనసాహిత్యము, p. 106
45. *Ibid*, p.53.
46. *IAPKD*, No.28, pp. 75-80
47. యరబాటి బాబురావు, రామగిరి చరిత్ర, 1982, pp. 24-29.
48. *APGKD*, 1974, p. 218

ఆఱవ అధ్యాయము

# VI. ఆర్థిక పరిస్థితులు

శాతవాహనుల తొలిరాజధాని కోటిలింగాలకావడం వలన కరీంనగర్ ప్రాంతమంతయు రాజకీయ కార్యకలాపాలకు కీలక ప్రదేశంగా ఉండేది. వర్తక వాణిజ్యాలు దూర దూర ప్రాంతములతో జరిగేవి. ఆదాయ విషయంలో వ్యవసాయం ముఖ్యాధారం. సంపాదనకు వ్యాపారం, పరిశ్రమలు రెండో మార్గంగా ఉండేవి. ఒకొక్క సరుకుతో వర్తక వ్యాపారము చేసేవారు ఒక్కొక్క సంఘము లేదా శ్రేణిగా ఏర్పడేవారు. శాతవాహనుల కాలంలో 17 శ్రేణులవారుండినట్లుగా వారి శాసనాలు తెలుపుతున్నాయి.[1] ప్రతి శ్రేణికి శ్రేష్ఠి అను అధ్యక్షుడుండేవాడు. ఈ శ్రేణులకు నిధులు, కోశములుండేవి. అవి నేటి బ్యాంకులవలె పనిచేసేవి. వర్తక వ్యాపారాభివృద్ధికి దోహదపడేవి. పలురకముల వృత్తి సంఘాలు లేదా శ్రేణులుండేవి. తిలపిసకలు (గానుగువాండ్రు), ధాంణికులు (ధాన్యవ్యాపారులు), కోలికులు (నేతవారు), వసకరులు (మేదరివారు), కసకరులు (ఇత్తడి పనివారు), వధకీలు (వడ్రంగులు) ఇంకను కుమ్మరులవి, మాలాకారులవి, కళాకారులవి, తాపీపనివారలవి లోహవణిజులవి వేర్వేరు సంఘాలుండేవి. ఒకే వృత్తి నవలంబించిన వారు, ఒక సంఘంగా ఏర్పడేవారు. వాణిజ్యంలో శ్రేణులకు మంచి పలుకుబడి ఉండేది. వ్యాపారవృత్తి ప్రయోజనాలను కాపాడడానికి శ్రేణిధర్మం (కట్టుబాట్లు) ఉండేది. ఇది వరకు చెప్పినవారు మాత్రమే కాక స్వర్ణకారులు, మణికారులు, గాంధికులు (సుగంధద్రవ్యములమ్మేవారు) చర్మకారులు, శిలావర్ధకులు (శిల్పులు) కూడా ఉండేవారు[2].

శాతవాహనుల కాలములో దేశీయ, విదేశీయ వాణిజ్యము విరివిగా సాగింది. ఐరోపాలోని రోమ్ మున్నగు నగరములతో వాణిజ్య సంబంధాలుండేవి. నౌకా చిహ్నములున్న శాతవాహనుల నాణెములు వారి విదేశ వ్యాపారాన్ని సూచిస్తాయి. పైఠన్ నుండి ధాన్యకటకమునకు పోవు వ్యాపార మార్గమధ్యంలో కోటిలింగాల, ధూళికట్ట కటకములు లేదా కోటలుండేవి. ఎడ్లబండ్లు, జంతువులు సరుకుల రవాణాకు ఉపయోగింపబడేవి. శాతవాహనుల కాలపు నాణెములకు

కార్షాపణములు లేదా కహపణములని పేరు. ఈ నాణెములలో వెండివి, రాగివి, సీసపువి, పోటా కంచువి ఉండేవి. 35 కహపాణములు లేదా కార్షపణములను, వెండినాణేలు ఒక సువర్ణనాణెమునకు మార్పిడి రేటుగా ఉండేది. ఈ నాణెములన్నింటిపై పేర్లు బ్రాహ్మీలిపిలో ఉన్నాయి. వీటిపై చైత్యము, విల్లు, ఏనుగు, గుర్రము, సింహము, బోధివృక్షము మున్నగునవి ముద్రించేవారు. కరీంనగర్‌లోని కప్పరావుపేట సమీపంలో చిముకుని (శ్రీముఖుని) నాణేలు లభించాయి. ఈ జిల్లాలో శాతవాహన రాజులకాలపు 284 పూర్ణ రాగినాణెములు, 116 విరిగిపోయిన రాగి నాణేలు లభించాయి. పెద్దబొంకూరు త్రవ్వకాలలో శాతవాహ, మొదటి శాతకర్ణి, గౌతమీపుత్ర శాతకర్ణి, వాసిష్ఠ పుత్రపులోమావి, శివశ్రీపులోమావి, యజ్ఞ శాతకర్ణి, రుద్రశాతకర్ణి రాజుల కాలపు నాణెములు లభించాయి. ఈ ప్రాంతమునకు పాశ్చాత్య దేశాలతో వర్తక వ్యాపార సంబంధములుండేవి. క్రీ.శ. 1952 లో నుస్తులాపూర్ వద్ద దొరికన ఒక కుప్పలో 39 రోమన్ వెండినాణేలు, తదితర 8 నాణేలు లభించాయి. రోమన్ చక్రవర్తి ఆగస్టస్ (క్రీ.పూ. 27 నుండి క్రీ.శ. 14), నీరో (క్రీ.శ. 14-37) పాలకులకు సంబంధించిన నాణెములిందుండుట వలన ఆనాటి కరీంనగర్ జిల్లా వాసులు రోమ్ దేశముతో ప్రత్యక్ష వ్యాపార సంబంధాలను కలిగిఉండిరని తెలుస్తుంది[3]. రోమన్ మార్కెట్లలో భారతీయ ఉత్పత్తులు నూరురెట్ల అధిక ధరతో అమ్ముడు పోయేవని ప్లినీ చెప్పాడు. భారతీయ వస్తువుల పై మోజు ఎక్కువగా నున్న రోమన్‌లు బంగారు నాణేలను లక్షల సంఖ్యలో తెచ్చేవారు. రోమ్‌తో నుండిన వ్యాపార సంబంధం వలన శక, శాతవాహన రాజ్యాలు అసంఖ్యాకమైన బంగారు నాణేలు లాభాల రూపంలో రోమన్‌ల నుండి గడించాయి. రోమ్ దేశమునకు మల్లుసెల్లాలు, సుగంధద్రవ్యాలు ఎగుమతి అయ్యేవి.

శాతవాహనయుగానంతరం ఇక్ష్వాకుల, విష్ణుకుండినుల కాలములో పెక్కు పన్నుల ద్వారా ప్రభుత్వాదాయం సమకూర్చుకునేవారు. ఉప్పు, పంచదారపై పన్నులుండేవి. వృత్తి పన్నులుండేవి. వివాహ, వినోద పన్నులు గూడా ప్రజలు చెల్లించేవారు. ఘటికలను కళాశాలలకు భూదానములిచ్చి రాజులు విద్యాపోషణ చేసేవారు.

రాష్ట్రకూటులకు సామంతులుగా పాలించిన వేములవాడ చాళుక్యుల కాలమందు వర్తక వ్యాపారాలు విశేషంగా సాగాయి. ఆ కాలమందు ఎడ్లు, దున్నలు, గుఱ్ఱాలపైన ధాన్యపు పెరికలను ఒక చోటు నుండి మరొకచోటుకి తరలించేవారు. వేములవాడ రాజ్యమందుండిన కాళేశ్వరం, సిరవంచ, చెన్నూరు, మంత్రకూటము, గోదావరికిరువైపుల నున్న ప్రాంతములందు వ్యాపారాం బాగా సాగేది. చెన్నూరు పాలకుడైన బద్దెగుడు వేములవాడ రెండవ అరికేసరికి సామంతుడై ఉండెనని క్రీ.శ. 940 చెన్నూరు శాసనమందు పేర్కొనబడింది. ఆనాటి వర్తక సంఘములు వ్యాపారుల నుండి క్రయవిక్రయముల పరిమితుల ననుసరించి ద్రవ్యము వసూలు చేసేవి. ఇట్టి ధనము ధర్మనిధిగా పరిగణింపబడేది. వర్తక సంఘములను నకరములనేవారు. వేములవాడలోని నకరమే నగరేశ్వరాలయ నిర్మాణము గావించింది.

వేములవాడ చాళుక్యుల కాలమున ధాన్యాదులను కొలుచుటకు రాజముద్రికలు వేయబడిన కొలపాత్రలుండేవి. భూమి కొలతలకు ప్రత్యేకమైన దీర్ఘకాలమానములుండేవి. వీరి కాలమున వడ్డీ వ్యాపారము విశేషంగా ఉండేది. గద్యానము, హొగ ఆనాడు వాడుకలో నున్న నాణెములు. బంగారు, వెండి నాణెములు గూడా వాడుకలో ఉండేవి. వేములవాడ ప్రభువులు ఏర్పరచిన రాజమార్గములు, సైన్యపు కదలికలకు, వ్యాపారాభివృద్ధికి తోడ్పడ్డాయి. బోధన్ నుండి గంగాధర మీదుగా వేములవాడకు రాజమార్గముండేది. రాజ్యమందు అన్ని ముఖ్యపట్టణములను కలుపు మార్గములను ఈ రాజన్యులేర్పరిచారు. గోదావరి నదిపై ప్రయాణించు వ్యాపారులకు, యాత్రికులకు సుంకము విధింపబడేది. చిన్న చిన్న వర్తకుల వ్యాపారముపై విధించు పన్నును కిరుపుల సుంకమనేవారు. భూసారము ననుసరించి పంటలో 1/6, 1/8, 1/12 వంతు పన్ను రూపమున వసూలు చేయబడేది. పశువుల వ్యాపారులు, స్వర్ణ, రజత వ్యాపారులు, ఆదాయములో సగభాగము వరకు పన్ను చెల్లించేవారు. వక్కలు, నెయ్యి, రసగంధము, ఔషధము, పూలు, పాత్రలు, మట్టిపాత్రలు, చర్మవస్తువులపై వచ్చు ఆదాయంలో ఆరవవంతు పన్నువసూలు చేయబడేది[4].

వేములవాడ చాళుక్యులలో మేటి ప్రభువగు రెండవ అరికేసరి కాలపు (క్రీ.శ.930-955) తేది లేని శాసనమందు ద్రమ్మములను (Drammas) నాణెముల ప్రసక్తి ఉంది. ఈ శాసనపు చిట్టచివరి పంక్తిలో దానములివ్వబడిన భూముల సిద్ధాయము పన్నెండు ద్రమ్మములుగా నిర్ణయింపబడిందని పేర్కొనబడింది[5].

వేములవాడ చాళుక్యుల అనంతరం ఈ ప్రాంతమందు అధికారంలోకి వచ్చిన కళ్యాణి చాళుక్యుల కాలంలో గూడా ద్రమ్మములను నాణేలు చెలామణిలో ఉండినట్లు తెలుస్తుంది. అహమల్లదేవ బిరుదాంకితుడైన రెండవ తైలపుని క్రీ.శ. 992 చొప్పదండి శాసనములో దీవకబ్బె (దీవకవ్వ) 70 ద్రమ్మములు దానమిచ్చిన ప్రసక్తి ఉంది[6]. కళ్యాణి చాళుక్యచక్రవర్తి జయసింహదేవుని కాలపు క్రీ.శ.1033 వేములవాడ శాసనమందు గూడా ద్రమ్మములను నాణేల ప్రసక్తి ఉంది. ఈ శాసనము కేదారేశ్వరాలయంలో నిలిచి ఉంది[7].

సంపన్నులైనవారు చెఱువులు త్రవ్వించేవారు. త్రవ్వించిన వారి పేరటనే చెఱువులు పిలువబడేవి. క్రీ.శ.992 చొప్పదండి శాసనములో ఆచబ్బె (ఆచవ్వ లేదా ఆశవ్వ) ఆమె పేరట ఆచబ్బె సముద్రము త్రవ్వించిందని ఉంది. భూముల కొలతకు రాజమానమగు దండముండేది. భూవిస్తీర్ణము నివర్తనములలో నుండేది. ఖండికలు, పుట్లు అను భూమి కొలమానములుండేవి. నీటిపారుదల సరిగా జరుగునట్లు చూచుటకు చెఱువులపై అధికారముండు ఉద్యోగిని చెఱువరేంగారని, రాజుకు సంబంధించిన ఆవుల మందలను చూచేవారిని పాలరేంగారని పిలిచేవారు[8]. గ్రామము నందలి భూమిని పన్ను నిమిత్తం చెలుకభూమి, తోటభూమి, నీరునేల, వెలిపొలమని వేర్వేరు తరగతులుగా విభజించేవారు. వరి సాగగు మాగాణి భూమి నీరునేల.

వెలిపొలమన్నది మెట్టభూమి. భూమిని కొలచుటకు గడ అను రాజనిర్ణీత దండముండేది. ఈ గడతో నీరు నేలను మర్తుర్ల లేదా మత్తర్ల (Marturs or Mattars) లెక్కను, వెలిపొలమును పుట్లలెక్కను కొలిచేవారు. ఆ కాలములో పశుపోషణ అధికంగా ఉండేది.

కళ్యాణి చాళుక్యుల కాలంలో వైశ్యులేగాకుండా ఇతరులు గూడా సంఘములుగా ఏర్పడి వర్తక వ్యాపారము చేయుచుండేవారు. వాటిలో వీరబలంజ సమయమనునది పటిష్ఠంగా ఉండేది. దీనిలో ఉభయ నానాదేశీలు, ముమ్మూరి దండులని, 36 బిరుదుల వారని, అయ్యావళి-500 వారని అనేక వ్యాపార ఉప సంఘాలుండేవి. వీరు పొలాస పొలస్త్యేశ్వర దేవరకు కొన్ని దానములిచ్చినట్లు అచటి క్రీ.శ.1108 శాసనము తెలుపుతుంది[9].

కళ్యాణి చాళుక్య వంశపు మూలపురుషుడైన ఆహవమల్లదేవ రెండవ తైలపుని కాలపు (క్రీ.శ.973-997) మెదక్ జిల్లాలోని క్రీ.శ.979 సీతారాంపల్లి శాసనమందు గద్యాణములను నాణేల ప్రసక్తి ఉంది. ఖండుగలను ధాన్యకొలమానము గూడా కనిపిస్తుంది[10]. ఇది పుట్టితో సమానమైనట్లు తోస్తుంది. నన్నయ రచించిన అరణ్య పర్వములోని ద్వితీయాశ్వాసమందు 139 వ పద్యము తరువాత గల వచనమునందు వేయి గద్యాణంబుల ప్రస్తావన ఉంది. ఇదే ఆశ్వాసమందు ఆనాటి గద్దెలను నాణేల ప్రసక్తి కూడా ఉంది. గద్యాణములు బంగారు నాణెములని భావింపబడుతుంది. దక్షిణ భారతమందలి నిష్క (Nishka),మాడ మరియు గద్యాణ మూడు రకముల నాణేలు ఒకే మూల్యమును కలిగి ఉండేవి[11].

చాళుక్యుల కాకతీయుల కాలపు కరీంనగర్ జిల్లాలోని శాసనములందు ఆనాటి రాజులు, స్థానికపాలకులు, ధనికులు మున్నగు వారిచ్చిన అనేక భూదానముల వలన దేవాలయములు భూస్వామ్య ప్రమాణములు గల సంస్థలుగా మారినాయి. దేవాలయాలు, మఠములు వాటి భూములను కౌలు పద్ధతిపై దున్నించేవి. కొన్ని మఠములు అనేక మంది శ్రామికుల (Labourers) ను నియమించి వ్యవసాయం సాగించేవి. భూమి, రొక్కము (Cash) ,పశువులు, ధాన్యము మున్నగునవి దానములివ్వబడుట వలన కొన్ని దేవాలయాలు వలయువారికి 12% వడ్డీపై అప్పులిచ్చేస్థితికి ఎదిగాయి[12]. పదవ శతాబ్దపు చోళుల శాసనములందు సంవత్సరానికి 15% వడ్డీ రేటు కనిపిస్తుంది[13]. చాళుక్యుల కాలము నందు దేవాలయాలకు రాటణములు, గానువులు దానములుగా ఇచ్చినట్లు కరీంనగర్ జిల్లా శాసనాలు పేర్కొంటాయి.

## రాటణ దానములు

గ్రామములందు ఏతము, మోటతో పాటు రాటణము ద్వారా లోతు బావుల నుండి నీటిని తోడేవారు. రాటణము (Lifting water by pulley device) దానికి కావలసిన కట్టె మరియు నీటిని తోడుటకు ఎడ్ల జతను దానములుగా ఇచ్చేవారు. క్రీ.శ.995 జమ్మికుంట శాసనములో నాగియగావుండు ఆదిత్య దేవరకు రెండు రాటణములు దానమిచ్చినట్లుంది[14]. పొట్లపల్లి, కోరుట్ల

శాసనములందు గూడా రాటణములు దానములుగా ఇచ్చిన ప్రసక్తి ఉంది[15]. కళ్యాణి చాళుక్య చక్రవర్తుల సామంతులుగా నుండిన తొలి కాకతీయరాజులు శనిగరం నందు వేయించిన ఐదు శాసనములందు (క్రీ.శ.1051, 1053, 1107, 1128 మరియు 1149) అచటి దైవములకు రాటణములు దానమిచ్చినట్లు తెలుపబడింది[16]. దేవాలయాలు ఈ రాటణములను కిరాయికిచ్చి ఆదాయం పొందేవి. దేవాలయపు వ్యవసాయ బావుల నుండి రాటణముల ద్వారా నీరందించి, దాని ద్వారా వచ్చిన డబ్బు, ధాన్యము దేవాలయానికే ఆదాయంగా చెందేవి. దేవాలయాలకు ఎడ్లను, లాగెలను దానములిచ్చు పద్ధతి నేటికి వేములవాడ రాజరాజేశ్వర దేవాలయానికి ప్రధాన ఆదాయంగా ఉంది.



రాటణ రూపము (రాటు పంపు)

## గానువు దానములు

గానువువారు, నేతవారు సుంకము చెల్లించు కుటీర పారిశ్రామికులుగా శాసనములందు కనిపిస్తారు. దేవాలయాలలోని అఖండ దీపములకై గానువులు దానంగా ఇవ్వబడేవి. కాకతి రెండవ ప్రోలుని సామంతుడు సబ్బిసహస్రపు సావదొర రేపోల కుఱువరాజు అఖండ దీపము వెలిగించుటకై కొమ్మేశ్వరదేవరకు ఒక గానువును దానంగా ఇచ్చినట్లు క్రీ.శ.1128 శనిగరం శాసనం తెలుపుతుంది[17]. అదే శనిగరంలోని క్రీ.శ.1149 శాసనము రేపోల కుఱువరాజు దండనాయకుడైన మండపరసర్ (మండపరాజు) అఖండదీపము వెలిగించుటకై పార్థేశ్వర దేవునకు గానువును దానమిచ్చినట్లు తెలుపుతుంది[18]. దేవాలయాలకు దానములుగా వచ్చిన గానువులను తేలికవారికి (గాండ్లవారికి) ఇవ్వగా వారు వాటిపై జీవితము గడుపుచూ దేవాలయాల అఖండదీపములకు ఉచితంగా తైలము నందించేవారు. ఇచ్చిన దానములు శిలాశాసనాల రూపంలో తెలుపబడినాయి. కరీంనగర్ జిల్లాలోని దానశాసనములు అన్నియు దేవాలయ ఆవరణములందే ఉన్నాయి. ఈ శాసనములందు మొదట దాత గురించిన ప్రశస్తి ఉంటుంది.

చివరలో దానములనడ్డుకొన్నవారు శివ ద్రోహులగుదురని, పవిత్ర గంగానది ఒడ్డున చేసిన గో(బ్రాహ్మణహత్యాపాపము పొందుదురని శపించు పద్యములుంటాయి. కావున ఈ దానములన్నియు దేవాలయానికి నిరాటంకమైన ఆదాయాన్నిచ్చినాయి.



గానువు రూపము

కరీంనగర్ జిల్లాలోని చాళుక్యుల కాకతీయుల శాసనములందు దైవముల అంగరంగ వైభోగమునకు, ధూపదీప నైవేద్యములకై ఇచ్చిన దానముల ప్రసక్తి ఉంది. పూలు, పత్రి, గంధము, కస్తూరి, కర్పూరము, అగరబత్తులు, దీపములు మున్నగు వాటికి వాటి ఆదాయం వినియోగింపబడేది. కాకతి ప్రతాపరుద్ర దేవుని కాలపు తేదీ లేని చిట్టాపురం శాసనమందు బైరిశెట్టి స్థానిక దైవములకు గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్య, తాంబూలాదులకు మరియు అంగరంగ వైభోగమునకు భూదానములే గాకుండా కొన్ని సుంకములను గూడా ధారాదత్తం చేసినట్లు తెలుపబడింది[19]. అధిక ఆదాయముండిన దేవాలయాలు కేవలం మతపరమైన పూజా ప్రదేశములే గాకుండా అవి ఆనాటి ప్రజల సాంఘిక, ఆర్థిక జీవనాన్ని ప్రతిబింబింపజేసేవి. రాజభవనము తరువాత అత్యంత ప్రాధాన్యత వహించిన ప్రదేశంగా దేవాలయమే పరిగణింపబడేది.

## భూదానములు

రాజులు, సేనానులు, స్థానిక పాలకులు, ధనిక వర్తకులు, భూస్వాములు విరివిగా దేవాలయాలకు, మఠములకు, బ్రాహ్మణులకు భూదానములిచ్చేవారు. కొన్ని సందర్భాలలో గ్రామములే దానములుగా ఇవ్వబడ్డాయి. దేవాలయపు దానపు భూములను దేవవృత్తులనే వారు. ఇవి పన్నులు చెల్లింపనవసరములేని సర్వమాన్యములు. కొన్ని సందర్భాలలో నామమాత్రపు పన్నులు విధింపబడేవి.

కరీంనగర్ జిల్లా శాసనాలు భూములు, తోటభూములు, పూదోటలు, పండ్ల తోటలు మరియు గ్రామములు దానములుగా ఇవ్వబడినట్లు తెలుపుతున్నాయి. రెండవ అరికేసరి ప్రభువు

వంద నివర్తనముల భూక్షేత్రమును (dry land) ఎనిమిది నివర్తనముల పానీయ క్షేత్రము (wet land)ను దానమిచ్చినట్లు అతని వేములవాడ శాసనము తెలుపుతుంది[20]. క్రీ.శ.1108 వేములవాడ శాసనమందు హరికేశ్వర దేవరకు ఇల్లంతకుంట గ్రామమే దానంగా ఇవ్వబడినట్లు తెలుపుతుంది[21]. కాకతీయ గణపతి దేవ చక్రవర్తి మతగురువు విశ్వేశ్వర శంభూ పొన్నగ్రామమును స్థాపించి దానిని దేవాలయములకు కాళేశ్వరమందలి ఉపలమఠమునకు దానముగా ఇచ్చాడు[22]. గణపతి దేవచక్రవర్తి ఉద్యోగి కాటయ పించరపల్లి అను గ్రామమును గొడిశాల పంచలింగాలకు దానమిచ్చినట్లు అచటి క్రీ.శ. 1236 శాసనం పేర్కొంటుంది.[23] కళ్యాణి చాళుక్య ఆహవమల్ల దేవుని సేనాని ఒకరు మల్లికార్జున దేవరకు పూదోటతో పాటు నీరు నేలను దానమిచ్చినట్లు క్రీ.శ. 992 కరీంనగర్ మ్యూజియంలో నిలుపబడిన శాసనం తెలుపుతుంది[24]. క్రీ.శ. 1106 వేములవాడ శాసనమందు దేవునికి అర్చనజేయు ఆచారి లేదా పూజారికి పూదోట దానంగా ఇచ్చినట్లుంది. ఇందులో మాచి గంగడను మాలాకారుని ప్రసక్తి గూడా ఉంది[25]. క్రీ.శ.1236 గొడిశాల శాసనమందు మామిడితోట, చింతవనము, తాటివనము, దేవవృత్తులుగా ఇవ్వబడి పన్నులు లేకుండా సర్వమాన్యములుగా ఉండేవని తెలుపబడింది[26]. ఈ విధంగా అనేక రకముల భూదానములతో ఆనాటి దేవాలయము భూస్వామ్య లక్షణములు గల ఒక గొప్ప సంస్థగా ఎదిగిందనుటలో సందేహం లేదు.

తోటభూములందు తమలపాకులు, పోకలు, అల్లము, పసుపు, ఫలములు, పుష్పములు పండించేవారు. నీరునేల, మెట్టభూమి, పూదోటలు, బంజరుభూమితో పాటు నల్లరేగడి మరియు ఎర్రని చౌడు భూముల ప్రసక్తి గూడా శాసనములందు కనిపిస్తుంది[27]. పొలములు,చేనులందు ఆహారధాన్యములు, పప్పుదినుసులతో పాటు కూరగాయలు, పూలచెట్లు విరివిగా పెంచబడేవి.

వ్యవసాయముతో పాటు పశుపోషణ, పాడి అభివృద్ధి పరచుట గూడా ప్రధానవృత్తులై ఉండేవి. దేవాలయాలకు దానం చేయబడిన ఆవులను, కోడెలను పెంచుటకై దేవాలయ పచ్చిక బయళ్లుండేవి. ఆవుల కాపరులు, పశుకాపరులు దేవాలయాలకు ఉచితంగా నెయ్యి సప్లయి చేసేవారు. లభించిన శాసనాధారాలను బట్టి అధికంగా ఉన్న ఆనాటి దేవాలయ భూములు కౌలుపై రైతులకిచ్చేవారు. దానములుగా ఇవ్వబడిన గ్రామముల నిర్వహణా బాధ్యతకై అనేక రకాల ఉద్యోగుల అవసరమేర్పడింది. ఒక రకంగా ఆనాటి దేవాలయ ఆధిక్యతకు రైతాంగములొంగిపోయి దేవస్థాన భూములపై, దానములిచ్చిన గ్రామములపై ఆధార పడవలసిన పరిస్థితి ఏర్పడింది[28].

## వ్యవసాయము

గోదావరి లోయ రామాయణంలో పేర్కొనబడిన దండకారణ్యములోని ఒక భాగము. తగినంత వర్షము లేని ఇచటి నేల కాఠిన్యత (Rocky land) ను బట్టి తొలియుగము,

మధ్యయుగములందు స్వల్ప జనాభా ఉండేదని ఊహించవచ్చు. జలవనరులున్న చోట గ్రామాలు స్థాపించబడ్డాయి. మిగతా ప్రాంతమంతయు చెట్లుపొదలతో నిండి ఉండేది. కోటిలింగాల, పెద్దబొంకూరు, ధూళికట్ట శాతవాహనుల తొలిస్థావరాలుగా ఈ ప్రాంతమందు గుర్తించబడ్డాయి. విష్ణుకుండినుల, బాదామిచాళుక్యుల కాలపు శాసనాలు కొంతమట్టుకు తెలంగాణా చరిత్రను తెలియజేస్తాయి.

వేములవాడ చాళుక్యులు, కళ్యాణి చాళుక్యులు అడవులను నరికి భూములను దున్నడానికి యోగ్యంగా మార్చే ప్రయత్నాలు చేశారు. ప్రజలు స్థిరపడుటకై వారు చెఱువులు త్రవ్వించారు. రెండవ అరికేసరి కాలపు క్రీ.శ. 945 కురిక్యాల శాసనములో పంపకవి సోదరుడైన జినవల్లభుడు 'కవితా గుణార్ణవమను చెఱువును గంగాధర సమీపాన త్రవ్వించాడని తెలుపబడింది[29]. కళ్యాణి చాళుక్య వంశస్థాపకుడు ఆహవ మల్లదేవ రెండవ తైలపుని కాలపు క్రీ.శ. 992 చొప్పదండి శాసనము ఆచబ్బె (ఆశవ్వ) పేరట ఆచెబ్బె సముద్ర నిర్మాణం జరిగినట్లు తెలుపుతుంది[30].

ప్రజల సహకారంతో అరణ్య ప్రాంతములను చదునుచేసి సాగులోనికి తెచ్చు ప్రయత్నము కాకతీయ రాజుల కాలంలో జరిగింది. స్థానిక ప్రభువులుగా తరాల తరబడి పరిపాలించిన కాకతీయులు చాలా మట్టుకు అటవీ ప్రాంతమును సాగులోనికి తెచ్చారు. కాకతీయ రాజన్యులు వారి సామంతులు అనేక గ్రామాలను స్థాపించారు. ధర్మపురి, మంథని, కాళేశ్వరం, చెన్నూరు, నర్సంపేట ప్రాంతములలోని నేటి గ్రామాలన్నియు దాదాపు కాకతీయుల కాలంలోనే రూపొందింపబడ్డాయి. గణపతి దేవ చక్రవర్తి కాలములో మంచిభటోపాధ్యాయుడు చెఱువును త్రవ్వించి ఒక నూతన గ్రామము నేర్పరచెనని క్రీ.శ.1199 మంథని దేవనాగరి లిపి శాసనం తెలుపుతుంది[31]. కాకతి మహదేవరాజు పేరట మహదేవపూర్, ప్రతాపరుద్రచక్రవర్తి పేరట ప్రతాపగిరి దుర్గము నిర్మింపబడిఉంటాయి.

కరీంనగర్ జిల్లాలోని చెఱువులు కాకతీయుల కాలంలో దేవాలయాలతో పాటు నిర్మింపబడి ఉంటాయి. కాకతి రుద్రదేవుని మంత్రి మరియు నగునూరు పాలకుడు వెల్లకి గంగాధరుడు త్రికూటాలయముతో పాటు విలసత్తటాకమును నిర్మించాడని క్రీ.శ. 1171 నగునూరు శాసనం తెలుపుతుంది[32]. గణపతి దేవ చక్రవర్తి కాలపు కటుకూరు, గొడిశాల, చిట్టాపూర్ శాసనాలు నూతన చెఱువుల నిర్మాణాలు జరిగినట్లు పేర్కొంటున్నాయి[33]. నూతన్ గ్రామము యొక్క స్థాపన, చెఱువును త్రవ్వించుట పుణ్యకార్యాలుగా భావింపబడేవి. హిందూ ధర్మశాస్త్రములందు చెఱువుల నిర్మాణమునకు అత్యంత ప్రాధాన్యత ఇవ్వబడింది. చెఱువు నిర్మాణము సప్త సంతానాలలో ఒకటిగా పరిగణింపబడింది. దాని నిర్మాతకు శాశ్వత కీర్తి ప్రతిష్ఠలతో పాటు పుణ్యప్రాప్తి జరుగుతుందని నాటి ప్రజల విశ్వాసం. చెఱువు నిర్మాణాన్ని ప్రారంభించే పూర్వము వరుణదేవుని పూజ చేసేవారు. స్వంతపుత్రుడు, పెంపుడు కొడుకు, కావ్యము, అగ్రహారము, తోట, చెఱువు, దేవాలయం ఇవి ఏడు సప్తసంతానాలుగా గంగాధర మంత్రి

క్రీ.శ. 1171లో వేయించిన నగునూరు శాసనమందు పేర్కొనబడ్డాయి. ఇప్పుడీ శాసనం కలెక్టర్ గృహావరణలో నిలిచి ఉంది[34].

నూతన గ్రామ నిర్మాణాల్లో మొదట దేవాలయం నిర్మించి అందులో ఇష్టదైవాన్ని నిలిపి 'ఉరుము' అను ఉత్సవమును పండుగ రూపంలో జరిపేవారు. ఆ తరువాతనే ఇండ్ల నిర్మాణం జరిగేది. మొదట 12 మంది ఆయగార్లు నియమింపబడేవారు. ఆయం అనగా పొలము యొక్క కొలత (విస్తీర్ణత). దానిపై వచ్చు ఆదాయంపైననే పన్ను విధింపబడేది. గ్రామసేవ లేదా రాజ్యసేవ చేసినందుకుగాను పన్ను లేకుండా భూమి (ఆయము) ని పొందేవారినే ఆయగార్లంటారు. 1.కరణము 2.రెడ్డి 3.తలారి 4.పురోహితుడు 5.కమ్మరి 6.కంసాలి 7.వడ్రంగి 8.కుమ్మరి 9.చాకలి 10.మంగలి 11.వెట్టి 12.చర్మకారుడు ఈ 12 మంది ఆయగార్లు ప్రతిగ్రామ స్థాపనకు ముందే నియమింపబడేవారు. మొదటి ముగ్గురు ప్రభుత్వ సేవకులు. భూముల లెక్కలు చూచువాడు కరణము. పన్నులు వసూలు చేసి ప్రభుత్వానికి పంపే బాధ్యత రెడ్డి లేదా పెద్దకాపుది. తలారి గ్రామరక్షక భటుడు. మిగిలిన తొమ్మండుగురు గ్రామ సేవకులు. ఆయగార్లకు పన్నులు లేని భూములే కాకుండా పంటలలో కూడా కొంతభాగం లభించేది. ఆయగార్లు సుంకము వసూలుచేసి ప్రభుత్వానికి, ప్రజలకు మధ్య సంధానకర్తల లాంటి వారై ఉండేవారు[35].

నూతన గ్రామాలందు స్థిరపడువారికి వ్యవసాయ యోగ్యపు భూమిని ప్లాట్లుగా విభజించి ఇచ్చేవారు. చెఱువు త్రవ్వకంతో ఊరు నిర్మాణం పూర్తి అయ్యేది[36]. సాధారణంగా రెండు దిబ్బల (Mounds) మధ్య లేదా గుట్టల మధ్యనున్న ఖాళీ స్థలమునందు బలమైన కట్టను రాయి, మట్టితో నిర్మించి తటాకములను రూపొందించేవారు. ఆ ప్రాంతమందు ప్రవహించు స్వాభావిక వాగులకు, కాలువలకు ఇలాంటి అడ్డుకట్టలు వేసి చెఱువులు నిర్మించేవారు. శనిగరం, పొలాస, నంది మేడారంలలోని చెఱువులు ఈ విధంగానే నిర్మింపబడ్డాయి. ఈ చెఱువుల కట్టలపైన లేదా ప్రక్కకే దేవాలయాల నిర్మాణం జరిగేది. కరీంనగర్ జిల్లాలో సాధారణంగా చెఱువుగాని, కుంటగాని లేని గ్రామము లేదు. కొన్ని గ్రామములందు ఒకటికి మించి చెఱువులు గూడా ఉన్నాయి. వర్షపు నీటిని వృథా పోనీయకుండా అనుకూలమైన స్థలములందు అడ్డుకట్టలు వేసి కుంటలు, చెఱువులు నిర్మించి వ్యవసాయాభివృద్ధిగావించి తద్వారా రాజ్యఆర్థికాభివృద్ధికై ఆనాటి ప్రజలు కృషిచేశారు.

చెఱువులే గాకుండా కాలువలు గూడా నీటి పారుదలకు ఉపయోగపడినాయి. చామన్‌పెల్లి క్రీ.శ. 1246 రాగిరేకుల శాసనము గొనుగుకాలువ వివాద పరిష్కారం గురించి తెలుపుతుంది[37]. క్రీ.శ.1305 రాయికల్ అముద్రిత శాసనమందు దొనులకాలువ ప్రసక్తి ఉంది. ఈ కాలువ సమీపమందున్న ఐదు మర్తుర్ల భూమిని రుద్రదేవని అనునతడు స్థానిక దైవములకు దానమిచ్చాడు[38]. మర్తూర్ (Martur) లేదా మత్తర్ (Mattar) అనునది భూమి కొలమానము. దాని విస్తీర్ణము, విలువ ఎంతో నేడు తెలియదు. ఆనాటి నుండి నేటి వరకు వ్యవసాయ పద్ధతులు

ఒకే మాదిరిగా ఉన్నాయి. నేటి ఆధునిక యంత్రములు వచ్చు మట్టుకు నాగలి, ఎడ్లే రైతు వ్యవసాయానికి ప్రధాన ఆధారాలు.

నైఋతి ఋతుపవనములు ప్రారంభమయ్యే సమయమందు జ్యేష్ఠపూర్ణిమ రోజున 'ఏరువాక పున్నమ' ఉత్సవము జరుపుకునేవారు. ఆ తరువాత వ్యవసాయపు పనులు ఆరంభించేవారు. గ్రామస్థులందరు ఈ ఉత్సవమును చెఱువు, గుట్ట, దేవాలయ స్థలములందు జరుపుకునేవారు. క్రీ.శ.1236 గొడిశాల శాసనమందు 'ఏరువాకగుబ్బలి' అను గుట్ట వద్ద ఏరువాకపూజ జరిపేవారని తెలుపబడింది[39]. రైతులు నాగళ్లను అలంకరించుకొని, ఎడ్లతో, విత్తనములతో వచ్చి ఈ పూజ చేసి తరువాత వ్యవసాయపు పనులారంభించేవారు. అలాగే పంటల కోత (harvest) సమయమందు గూడా రైతులు పూజ జరిపేవారు. ఈ పండుగ ప్రతి సంవత్సరము జనవరి 14వ తేదీన జరుపు సంక్రాంతి పండుగలో లీనమైంది. అయినప్పటికి కోతల సమయమందు నామమాత్రపు పూజ ఇప్పటికీ జరుపుతుంటారు.

## వివిధ వృత్తులవారు

రాజభవనమందు, పెద్ద పెద్ద దేవాలయాలందు ప్రభుత్వ పాలన నిర్వహణలో అనేక రకాల ఉద్యోగులు, వృత్తులవారు, కళాకారులుండేవారు. దేవాలయాల నిర్మాణములందు తాపీపనివారు, శిల్పులు, కార్మికులు పోటీపడి అందమైన, దివ్యమైన మందిరాలు కట్టేవారు. పెద్ద దేవాలయాలందు పూజారులు, గాయకులు, నాట్యకత్తెలు, సంగీతకారులు, వాద్యకారులు, పూలమాలాకారులు, వంటవారు మున్నగు రకముల ఉద్యోగులుండేవారు. దేవాలయ నిర్వహణకై స్థానాధిపతి ఉండేవాడు. శ్రీకరణము దేవాలయ కోశాగారపు లెక్కలు చూచేవాడు. వీరే గాకుండా దేవదాసీలు, బాకలూదువారు, మద్దెల, తాళాలు మ్రోగించువారు, దేవుని ఛత్రములు పట్టువారు, దైవ అంగరక్షకులు, శంఖములూదువారు, దివిటీలు పట్టువారు, దేవుని పల్లకీలు మోయు బోయవారు, తమ్మడి వాద్యకారులు, ఆలయకావరులు (Watchmen), ప్రాంగణమును శుభ్రపరచువారు, ఇంకను ఎందరెందరో దైవ సేవకులుండేవారు. వీరిని దేవాలయ నిబంధకారులనేవారు.

అనేక రకముల వృత్తులవారికి, కళాకారులకు, ఇంజనీర్లకు, పండితులకు, హరికథకులకు, పౌరాణికులకు మున్నగు వారికి దేవాలయాలందు ఉపాధి లభించేది. విరివిగా వచ్చిన దానములతో దేవాలయపు ఆదాయము పెరిగి అది అప్పులిచ్చుసంస్థగా రూపొందింది. జాతరలు, దేవాలయ వార్షిక ఉత్సవములు నిర్వహించి విశేష ఆదాయము గడించేవారు. ఆనాటి దేవాలయం మత విశ్వాసములకు, ఆధ్యాత్మిక చింతనకే పరిమితం కాకుండా అది ఒక సాంఘిక, సాంస్కృతిక, ఆర్థిక నిర్వహణ సంస్థగా రూపొందడం గమనార్హం.

దేవాలయాల నిర్వాహకులైన స్థానాధిపతులకు లోబడి పూజారులుండేవారు.

స్థానాధిపతులకు భూములు వృత్తులుగా ఇవ్వబడ్డాయి. రెండవ అరికేసరి వేములవాడ శాసనమందు రాజేశ్వర, ఆదిత్య, బద్దెగేశ్వర, నగరేశ్వర దేవాలయాల స్థానాధిపతులుగా మల్లికార్జున, వ్యక్తలింగ, విద్యారాశి, వ్యాఖ్యాని భట్టారకుడు పేర్కొనబడ్డారు[40]. పూజారి, కొట్టరువు (Store-keeper) భండారి (Treasurer) శ్రీకరణము (Accountant) మొదలగువారు మాన్యులు అనగా గౌరవప్రదమైన ఉద్యోగులు. వీరి తరువాత స్వామినులు ముఖ్యమైనవారు. స్వామిని సంస్కృత పదము క్రమముగా సానియను తెలుగు పదంగా మారింది. రంగమంటపమందు నిర్వహించు రంగభోగమునకై భక్తులు తమ బిడ్డలను దేవునికి స్వామినులుగా సమర్పించేవారు. అందరు అనుకొనునట్లుగా దేవాలయసానులు వ్యభిచారులు కారు. ఆలయపు చిట్టచివరి ఉద్యోగులు నిబంధకారులు. వీరిలో వంటవారు, నీరు తెచ్చువారు, శుభ్రము చేయువారు, ఊద్చేవారు, తాపీవారు, కాపలావారు, కళాకారులు మున్నగువారు ఉండేవారు[41].

పౌరాణికులు, హరిదాసులు, స్వర్ణకారులు, శిల్పులు గూడా దేవాలయాలందు ఉద్యోగులుగా ఉండేవారు. రాజభవనము తరువాత దేవాలయమే అనేక మంది ఉద్యోగులకు రొక్కరూపంలో, ధాన్యరూపంలో జీతాలు చెల్లించేది. కొందరు దేవవృత్తులు పొందారు. ఆదాయం పెరిగిన కొలది దేవాలయము మధ్యయుగంలో అనేక వర్గముల ప్రజలకు ఉపాధి కలిపించు సంస్థగా రూపొందింది[42]. నిరుద్యోగులెందరికో దేవాలయము ఏదో ఒక పని చూపించేది. బోయవారు, పశువులకాపరులు, నెయ్యినూనె ఆలయానికి అందించువారు ఇంకను ఎందరెందరో ఆలయాల దయాదాక్షిణ్యాలపై ఆధారపడేవారు.

భక్తులు వారి పంటలలోని ప్రథమ భాగమును దేవునికి సమర్పించేవారు. ధాన్యము, పండ్లు ఫలాదులు, బెల్లం, మున్నగు వస్తువులే గాకుండా ఆవులు, కోడెలు, ఎద్దు, మేకలు, గొఱ్ఱెలు మున్నగు జంతువులు దైవకైంకర్యమునకై అర్పించేవారు. అలాగే కొందరు భక్తులు తమ పుత్రికలను స్వామినులుగా, దేవదాసీలుగా దైవమునకు సమర్పించేవారు. నేటికిని వేములవాడ రాజరాజేశ్వర దేవాలయమందు సమర్పింపబడు కోడెలదే ప్రధాన ఆదాయము. రాజభవనము తరువాత దేవాలయములందే వస్తువుల వినియోగం అధికంగా జరిగేది. దేవునికి సమర్పించబడిన అనేక వస్తువులు ఉద్యోగులకు పేదవారికి పంచబడేవి.

## వర్తక వాణిజ్యములు

కరీంనగర్ జిల్లా యందు శాతవాహనులకాలము నుండియే దేశీయ, విదేశీయ వ్యాపారము విరివిగా జరిగేది. పైఠన్ నుండి ధాన్యకటకమునకు వ్యాపారులు కరీంనగర్ జిల్లా గుండా వెళ్లేవారు. ఆనాటి వర్తకులు సెట్టి గహపతులు బౌద్ధ స్థూపాలకు అనేక దానములిచ్చేవారు. అలాంటి గహపతి దానము ఒకటి ధూళికట్ట బౌద్ధ స్థూప ఆయకఫలకముపై "గహపతినో పరాలసమతూాయ దానం" అని ప్రాకృతంలో చెక్కబడింది. తదనంతరము చాళుక్యుల, కాకతీయుల

కాలమందు వర్తకము క్రమపద్ధతిలో నిర్వహింపబడింది. వర్తక సంఘాలు ఆంధ్రదేశమంతటను వాణిజ్యపరంగా సంచరించేవని ఆ కాలపు శాసనాలు తెలుపుతున్నాయి.

వైశ్యులు లేదా కోమట్లు వర్తక రంగంలో అభివృద్ధి చెంది అనేక దానధర్మాలు చేసేవారు. వరంగల్ జిల్లా నర్సంపేట ప్రాంతమందున్న గోవిందాపురంలోని పార్శ్వజినేశ్వరునకు శనిగరం వైశ్యవర్తకులు దానములిచ్చినట్లు తెలుస్తుంది[43]. శనిగరం గోవిందాపురంల మధ్య నుండిన వర్తక సంబంధాలను ఇది సూచిస్తుంది. ఆనాడు శనిగరం గూడా ఒక జైన కేంద్రమై ఉండేది. జైనకోమట్లు వర్తకం రీత్యాపలుప్రాంతాలు సంచరించేవారు. గుజ్జాల వ్యాపారస్థులు ఈ జినేశ్వరునకు వస్త్రదానము లిచ్చినట్లు తెలుస్తుంది. తొప్పశ్రేష్ఠియను వైశ్యవర్తకుడు గోవిందాపురంలో మధ్యయుగంలో కట్టించిన చెఱువును నేటికి కోమటి చెఱువు అని పిలుస్తుంటారు.

మధ్యయుగంలో వర్తకసంఘము లెన్ని ఉన్నను వ్యాపారంలో వైశ్యసమాజము ఆధిక్యత వహించేది. వైశ్యులను శ్రేష్ఠిలు, సెట్టిలు, చెట్టిలు, కోమట్లు అని పిలిచేవారు. జైనగోమతేశ్వరుని పూజించే వైశ్యులు గోమఠులుగా క్రమముగా కోమట్లుగా పిలువబడినారని పండితుల అభిప్రాయం[44]. మధ్యయుగంలో దక్కన్ నందు ప్రజల ఆర్థిక జీవనములో కోమటి ప్రాధాన్యత 12వ శతాబ్దమందు బద్దెన రచనగా భావింపబడుచున్న సుమతి శతకము నందు చక్కగా వివరింపబడింది. ఏనుగునకు తొండము ఎంత ప్రధానమో, వరిపంటకు నీరు ఎంత ప్రధానమో, గ్రామ జీవనములో కోమటి అంతే ప్రధానమైన వాడని బద్దెన వివరించాడు. నేడు గూడా మూలమూలలందున్న కుగ్రామాలకు గూడా కోమటియే అన్ని రకాల సరుకులు సరఫరా చేస్తుంటాడు. ఆర్థిక జీవనంలో కోమటి లేని గ్రామము అంధకార బంధురమని భావింపబడుతుంది.

శ్రేష్ఠిలు ప్రజాజీవితంలో నమ్మదగిన వ్యక్తులుగా పరిగణింపబడినట్లు వేములవాడ రెండవ అరికేసరి శాసనం తెలుపుతుంది. స్థానిక దేవాలయాలకు భూదానములిచ్చు సమయమందు చంద్రశ్రేష్ఠితో సహా తొమ్మండుగురు వర్తకులు సాక్షులుగా పేర్కొనబడ్డారు[45]. ప్రభువుతో పాటు కొందరు వర్తకులు గూడా దానములొసంగినట్లు ఈ శాసనమందు పేర్కొనబడింది. నగునూరు గ్రామము బయట ఉన్న శక్తి దేవత ఆలయము ముందున్న విగ్రహముల వద్ద గల క్రీ.శ. 1228 శాసనము నిజరంగాల మల్లిసెట్టి, అతనికుమారుడు వెన్నిసెట్టి నగనూరునందు శివాలయములు కట్టించి దానములిచ్చినట్లు పేర్కొంటుంది[46]. ప్రతాపరుద్రచక్రవర్తి కాలపు తేదీ లేని చిట్టాపురం శాసనంలో వీరబలంజ సమయమునకు చెందిన బైరిసెట్టి శివాలయములు కట్టించి భూదానములతో పాటు పెద్ద పరియల గ్రామమందు విక్రయింపబడిన వస్తువులపై వచ్చు సుంకములను గూడా దానమొసంగెనని తెలుపబడింది.[47] సెట్టి ఒక కులంకాదు ఒక పదవి. నిగమ గోష్ఠి మొదలైన వర్తక సంఘాలకు, వృత్తి సంఘాలకు నాయకుడు శ్రేష్ఠి లేదా సెట్టి.

సంతలందు (అంగడులు), అడ్డ (స్థలము) పొందుటకు వ్యాపార సంఘాలు

ప్రభుత్వానుమతి (Licence) పొందేవి. చిట్టాపురమునందు బైరిసెట్టి చెఱువును కట్టించి తద్వారా వచ్చు పంటలలోని 1/3 ఆదాయము దేవాలయమునకు మిగిలిన 2/3 ఆదాయము రాజునకు చెందునట్లు అక్కడి శాసనం తెలుపుతుంది. చెఱువును నిర్మించిన వ్యయము క్రింద వర్తక వాణిజ్యములు నడుపుకొనుటకు అతడు ప్రభుత్వానుమతి పొందినట్లు గోచరిస్తుంది[48].

## సంతలు, జాతరలు

పెద్ద గ్రామాల్లో ప్రతివారంకు ఒక రోజు సంత (Weekly-market) జరిగేది. దేవాలయాలు చిన్న పెద్ద ఉత్సవాలు, పండుగలు జరుపుతూ వార్షిక ఉత్సవములందు పెద్దజాతరలు (Temple Fairs) నిర్వహించేవి. ఈ సంతలందు, జాతరలందు సకల వస్తువులు అమ్మబడేవి. గ్రామాలందు నగరములందు దేవాలయాల పరిసరములందే వ్యాపారం అభివృద్ధి చెందింది. దేవాలయం గ్రామమునందు పరోక్షంగా ఒక వ్యాపార కేంద్రంగా మారింది. భగవంతునికి, భక్తులకు అవసరమగు వస్తువులనన్నింటిని అమ్మటానికి దేవాలయాల చుట్టూ దుకాణాలు వెలసేవి. ప్రస్తుతము గూడా ఇదే పరిస్థితి ఉంది. దేవాలయ ఉత్సవములందు జాతరలందు వేలాదిభక్తులు, యాత్రికులు వస్తుండేవారు గనుక విక్రయాలు అధికమై వర్తక సమాజము లాభాలు గడించేది. సాధారణంగా అంగడులు, సంతలు (Weekly-fairs) దేవాలయాల పరిసరాలలోనే నిర్వహింపబడేవి. ఈ సంతలందు స్థలము లేదా అద్దపొందుటకు గ్రామపాలకుడు అనుమతి (Licence) ఇచ్చేవాడు. గణపతిదేవ చక్రవర్తి కాలపు శాసనమొకటి వివిధ వర్తక సమూహములకు వరంగల్ సంతయందు కెటాయించిన స్థలాల వివరాలను తెలుపుతుంది[49]. క్రీ.శ. 1228 లో వేయబడిన ఈ శాసనం వరంగల్ కోటలో ఉంది. సంతకు వచ్చే సరుకుల, వస్తువుల వివరాలను ఇది తెలుపుతుంది. ఉప్పు, లోహములు, సుగంధ ద్రవ్యాలు, మిరియాలు, అల్లము, సొంటి, లవంగాలు, పోకలు, తైలములు, తమలపాకులు, నీలి (Indigo), వస్త్రములు, పండ్లు ఫలాదులు, గోధుమ, వరి, ఉలువలు, మినుములు, సెనగలు, కందులలాంటి కాయ ధాన్యాలు, మక్కలు, జొన్నలు, నూనెలు మరియు తగరము, రాగి, సీసము లాంటి ధాతువులు, కళాయి వస్తువులు, గంధపు చెక్కలు, కర్పూరము, కస్తూరి పరిమళ ద్రవ్యాలు మున్నగునవి ఓరుగల్లు సంతలో అమ్మకానికి వచ్చేవని అచటి శాసనంలో పేర్కొనటం విశేషం. వరంగల్ ప్రక్కకే ఉన్న కరీంనగర్ ప్రాంతపు సంతలలో గూడా పైన పేర్కొనబడిన వస్తువులన్నియు నాడు నేడు అంగళ్లలో అమ్మబడుచునే ఉన్నాయి.

వేములవాడ, ధర్మపురి, మల్లన్నపేట, కొత్తకొండ, బీర్‌పూర్, దుబ్బరాజన్న (కోనాపూర్) దేవాలయాల జాతరలు కరీంనగర్ జిల్లా యందు పేర్కొనదగ్గవి. ఈ జాతరలందు సాధారణ సరుకులతో పాటు తినుబండారాలు, గ్రామీణ పారిశ్రామిక వస్తువులు నాటి నుండి నేటి వరకు అమ్మబడుచునే ఉన్నాయి. పశువుల అమ్మకంకై వేరే సంతలుండేవి. ఈ పశుసంతలందు

గుఱ్ఱములు, ఎడ్లు, ఎడ్లబండ్లు, త్రాళ్లు (ropes) మేకలు, గొఱ్ఱెలు, గేదెలు అమ్మబడేవి. నేడు గూడా పశువుల అంగళ్లున్నాయి.

వివిధ రకాల వస్తువుల అమ్మకాలకు కేటాయించిన స్థలమును పేమ్ట (Pemta) అడ్డ (adda) లేదా సంత (Santa) అనేవారు. మొదటి రెండు పదాలు కనుమరుగైనాయి. చివరి సంత పదం బదులు అంగడి అని వాడుకలోకి వచ్చింది. ఈ పేమ్ట లేదా సంతలో వసూలు చేయు సుంకమును పేమ్ట సుంకము లేదా మాగము అనేవారు. విక్రయదారులు ముద్ర సుంకము (Registration Tax) చెల్లించేవారు. కరీంనగర్ జిల్లాలోని క్రీ.శ. 1236 గొడిశాల శాసనమందు కాటయ అంగడి సుంకములను స్థానిక దేవాలయాలకు దానములిచ్చినట్లు తెలుపబడింది[50].

దుకాణములు, కొట్టులే గాకుండా వీధులు తిరిగి సరుకులు అమ్ముకునేవారు (Hawkers) ఉండిరి. తలపై గుల్ల లేదా మేదరితట్టలు, బుట్టలు పెట్టుకొని సరుకులు అమ్ముచుండేవారు. భుజాన కావడి వేసికొని (Wooden Shoulder rod) రెండు వైపులనున్న సంచులలో సరుకులు నింపుకొని ఇల్లిల్లు తిరిగి అమ్ముకునేవారుండేవారు. గ్రామాల్లో, నగరవీధులందు, సందులందు ఈ పద్ధతి నేటికి కనిపిస్తుంది. పురాతనమైన వేములవాడ, రాయికల్, కోరుట్ల, ధర్మపురి, మంథనిలందు నాటి నుండి నేటి వరకు సంతలు (Weekly-bazars) నిర్వహింపబడుచునే ఉన్నాయి. గ్రామముల చివరలందు 'పేట' అను పదము అచట నిర్వహింపబడు పేమ్ట (Pemta) అను పదం నుండి వచ్చి ఉంటుందని భావిస్తారు. 'పేమ్ట' పదమే క్రమముగా 'పేట' పదంగా మారి ఉంటుంది. ఉదాహరణకు మల్లన్నదేవాలయ సమీపమున జరుగు పేమ్ట (సంత)ను బట్టి ఆ గ్రామమునకు మల్లన్నపేట అని పేరు వచ్చి ఉంటుంది. ఆనాటి మల్లన్న పేమ్టయే నేడు మల్లన్నపేటగా మారి ఉంటుంది.

## పన్నులు, సుంకములు

పంటలపై విధించు పన్నుల వివరాలు తెలుపుటకు ప్రత్యక్ష ఆధారాలేవీలేవు. దేవాలయాలకు బ్రాహ్మణులకు వృత్తులుగా ఇచ్చిన పన్నుల మినహాయింపులు కొన్ని శాసనాలందు అగబడుతాయి. కొన్ని చోట్ల సర్వమాన్యములైన దేవవృత్తులపై బ్రాహ్మణ అగ్రహారములపై గూడా తగ్గించిన రేట్లతో (concessional rates) పన్నులు వసూలు చేయబడేవి. ఇతర భూస్వాముల కంటే దేవవృత్తులకు, అగ్రహారములకు ఎక్కువ మినహాయింపుల అవకాశముండేది.

మధ్యయుగంలో సిద్ధాయము అనగా వస్తువు లేదా రొక్కరూపములో చెల్లించుపన్ను. వేములవాడ చాళుక్యుల కాలపు క్రీ.శ. 946 కరీంనగర్ శాసనమందు సిద్ధాయ ప్రసక్తి ఉంది[51]. వేరొక వేములవాడ శాసనమందు రెండవ అరికేసరి దేవవృత్తులుగా ఇచ్చిన భూముల సిద్ధాయము 12 ద్రమ్మములుగా నిర్ణయింపబడింది[52]. కరీంనగర్ జిల్లాలోని పశ్చిమ కళ్యాణి చాళుక్యుల కాలపు క్రీ.శ. 1005 కడపర్తి శాసనము మరియు క్రీ.శ. 1033 వేములవాడ శాసనములందు

దైవములకు దానముగా సిద్ధాయము ఇవ్వబడినట్లు తెలుపబడింది[53]. తరువాత కాలపు శాసనములలో సిద్ధాయము ద్రమ్మముల రూపంలో తెలుపబడింది.

తరిభూమి (Wet land) పై వసూలు చేయు పన్నును పార (Para) చెలుక, చేను భూముల (Dry land) పై వసూలు చేయుపన్నును పంగము (Pangamu) అనేవారు. పంగము అనగా నాలుగవ వంతు 1/4 భాగము. పార అనగా బహుశః ఎనిమిదవ వంతు 1/8 భాగమై ఉండేది. ఈ కొద్దిపాటి ఆయము (Tax) గూడా దేవవృత్తి భూములకు మినహాయింపబడేది. భూమి పన్నును సాధారణంగా 'అరి' (Ari) అని గూడా పిలిచేవారు. అరి చెల్లించు రైతులను అరిగాపులు అని పిలిచేవారు[54]. దానశాసనాలందు పన్ను, పంగ లేదా పంగము, పంగటప్పు, పంగసుంకము, వెన్ను లేదా ఎన్నుపన్ను, కానిక, దరిశనము, మున్నగు పన్నులు గోచరిస్తాయి. పంగ అను తెలుగు పదమునకు శాఖ లేదా భాగమని అర్థము. పంటలో కొంతభాగమును చెల్లించు పన్నును 'పంగ' అనేవారు. రాజ్యమందలి భూమి అంతయు రాజుదే గనుక, ప్రభువుస్వామ్యము క్రింద చెల్లించు పన్ను కానిక (Kanika) గా పిలువబడేది. పంటలు చేతికివచ్చు సమయమున పరిశీలించి విధించు పన్ను వెన్ను లేదా ఎన్ను పన్నుగా పిలువబడేది. పంట బాగా పండినచో అధికపన్ను, ప్రకృతి బీభత్సములకు గురై తక్కువ దిగుబడి ఉన్నచో తక్కువ వెన్ను పన్ను విధింపబడేది. రాజును లేదా రాజప్రతినిధిని దర్శించుటకు చెల్లించు పన్నును దరిశనము అనేవారు. రైతు పాలకుని దర్శించక పోయినను అతని నుండి ఈ పన్నును బలవంతంగా వసూలు చేసేవారు[55]. కరీంనగర్ జిల్లాలోని క్రీ.శ. 1301 ఎల్గేడు శాసనమందు లకుమాదేవి వెన్నుపన్ను, కానిక, కట్నము, కని పన్నులను స్థానిక రామనాథ దేవరకు దానమిచ్చినట్లు పేర్కొబడింది[56]. కానిక పన్ను భూమి యొక్క స్వామ్యమునకు సంబంధించింది కాగా కని (Kani) భూసేకరణ మరియు సేద్యమునకు సంబంధించిందని నొబొరుకారాషిమా అభిప్రాయం[57].

చెఱువుల నుండి, కాలువల నుండి, వ్యవసాయ బావుల నుండి రాటణముల ద్వారా గాని ఏ ఇతర సాధనము ద్వారా గాని వాడుకొను నీటిపై విధించు పన్నును నీరువిడి లేదా నిరుడి అని పిలిచేవారు. బంటెల ఆయము (Bamtela-ayamu) అనగా పంటలను కాపాడు బంటుల (Warriors) లేదా భటుల కొరకు విధించు పన్నుగా భావింపబడుతుంది[58]. కాకతీయుల కాలపు హుస్నాబాద్ శాసనమందు అచటి ఎక్కటీలు (Warriors) లేదా బంటులు స్థానిక రుద్రేశ్వరునకు నాలుగు పుట్లు వడ్లు దానంగా ఇచ్చినట్లు తెలుపుతుంది[59].

కొన్ని సందర్భాలలో మూడింట రెండు వంతులు 2/3 పంట రాజునకు పన్ను క్రింద ఇవ్వబడింది. కాకతి ప్రతాపరుద్రదేవుని కాలపు తేది లేని చిట్టాపురం శాసనం బైరిసెట్టి అనునతడు సకల సముద్రమను తటాకము నిర్మించి మూడవ వంతు 1/3 పంటను స్థానిక బైరేశ్వర, సకలేశ్వర, నాగేశ్వర దైవములకు దానముగా నొసంగి మిగిలిన రెండు వంతులు 2/3 పంట రాజునకు

పన్ను క్రింద చెందునట్లు తెలుపుతుంది[60].

కరీంనగర్ జిల్లాలోని క్రీ.శ. 1301 ఎల్గేడు శాసనమందు ఇల్లరి, పుల్లరి అను రెండు రకాల పన్నులు కనిపిస్తాయి[61]. ఇల్లు (House) పై విధించు అరి (tax) ఇల్లరి (house tax) అనబడేది. పశువుల కాపరులపై విధించుపన్ను పుల్లరి అనబడేది. అడవి, పచ్చిక బయళ్లు అన్నియు రాజువే గనుక పశువుల కాపరులు మేకలు, గొర్రెలు, ఆవులు, ఎడ్లు, గేదెలు మున్నగు పెంపుడు జంతువులను మేపుటకు చెల్లించిన పన్నుయే పుల్లరిగా పిలువబడింది. పుల్లు అనగా గడ్డి (Grass) అరి అనగా పన్ను (Tax) పుల్లుపై విధించు పన్ను పుల్లరిగా వ్యవహరింపబడింది. కాకతీయుల కాలంలో వడ్రంగులు, కమ్మరులు, కుమ్మరులు, స్వర్ణకారులు, రజకులు, మంగలులు, చండాలురు (Sweepers) మున్నగు వృత్తులవారు వృత్తి పన్ను చెల్లించేవారని గుంటూరు జిల్లాలోని క్రీ.శ. 1219 మొగలుట్ల (Mogalutla copper plates) రాగి రేకుల శాసనం పేర్కొంటుంది[62].

కరీంనగర్ జిల్లా ప్రక్కకే దక్షిణమందు విస్తరించి యున్న వరంగల్ జిల్లాలోని కాకతి రుద్రదేవుని కాలపు క్రీ.శ. 1172 ఆకునూరు శాసనమందు ఆనాడు విధింపబడిన సుంకములు వివరింపబడ్డాయి[63]. అవే సుంకములన్నియు కాకతీయులేలిన కరీంనగర్ జిల్లా ప్రాంతమునకు గూడా వర్తించేవని భావింపవచ్చు.

| | |
|---|---|
| 1. రాటణముల యజమానులు | 5 మాడలు |
| 2. తోటలలోని రాటణములు | 3 సిన్నాలు (చిన్నాలు) |
| 3. తమ్మడివారు | 8 గద్యలు |
| 4. గొల్లవారు | 2 గద్యలు |
| 5. మిశ్రమవృత్తులవారు (అనామికులు) | 4 గద్యలు |
| 6. కుమ్మరివారు | 1 గద్య |
| 7. మంగలివారు | 5 రూకలు |
| 8. జైన బసదులవారు | 5 రూకలు |
| 9. మాలాకారులు | 5 రూకలు |
| 10. పశువులకొట్టములవారు | 2 రూకలు |

చాళుక్యుల కాలమందు అన్నిరకాల వాణిజ్య వస్తువులపై విధింపబడిన సుంకమును 'వడ్డరావుల సుంకము' అనేవారు. కాకతీయుల కాలమందు 'వడ్డరావుల' బదులు తెలుగుపదము అడ్డవట్టు (adda-vattu) వాడబడింది. వస్తు విక్రయము జరుగు స్థలమును అడ్డ లేదా మజిలి అంటారు. హట్ట (hatta) అను సంస్కృత పదము నుండి తెలుగు పదము అడ్డపట్టు లేదా అడ్డవట్టుగా మారి ఉంటుంది. తైలపు కొలతలకుపయోగించు కుండలపై విధించు పన్ను 'బుర్రసుంకము' (Burra-Sunkamu) నామకరణ దినోత్సవములపై విధించుపన్ను 'పేరు సుంకము',

రేవులపై విధించు పన్ను రేవు సుంకము, పశువుల అమ్మకంపై విధించు పన్ను 'పెరుక ఎడ్ల సుంకము', ఉప్పుపై విధించు సుంకము 'ఉప్పు పెరిక సుంకము' మున్నగు సుంకములన్నియు వసూలు చేయబడేవని కాకతీయుల శాసనాలు తెలుపుతున్నాయి[64]. ఇవి గాకుండా అమ్మబడి సుంకము, అమ్మకడ సుంకము, గానువుకు అరిసుంకము, గానువు ముద్రసుంకము, తలారి పన్ను మున్నగునవి వసూలు చేయబడేవి. వీటి అన్నింటి వలన మధ్యయుగంలో పన్నుల భారం అధికంగానే ఉండినట్లు తోస్తుంది.

ఆధునిక యుగంలో కరీంనగర్ జిల్లా నుండి చేనేత వస్త్రాలు, కట్టి, చేతితో తయారుచేసిన వస్తువులు, వెండి ఫిలిగ్రీ వస్తువులు మరియు బియ్యము, జొన్నలు, మక్కలు, వేరుశనగ, పప్పుధాన్యాలు, జర్దా, బీడీలు మున్నగునవి నిజాంల పాలానా కాలమందు ఎగుమతి చేయబడేవి. కోరుట్ల, మెటుపెల్లి ప్రాంతములందు ప్రస్తుతము పసుపు, చెఱకు అధికంగా సాగు చేస్తున్నారు. సిరిసిల్ల నేత పరిశ్రమకు, మెటుపెల్లి ఖాదీ పరిశ్రమకు ప్రసిద్ధము.

మిల్లువస్త్రాలు, టెర్లిన్, నైలాన్ వస్త్రాలు, మందులు, ఎరువులు, స్టీలు సామానులు, ప్లాస్టిక్ వస్తువులు, రేడియో, టెలివిజన్ ఎలక్ట్రానిక్ పరికరములు, పెట్రోల్ ఉత్పత్తులు మున్నగునవి ఈ జిల్లాలోని ప్రధాన దిగుమతులు. ఇటీవల వచ్చిన శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్ కాలువల వలన నీటిపారుదల అభివృద్ధి జరిగి కరీంనగర్ ప్రాంతము సస్యశ్యామలమై ఆర్థికాభివృద్ధికి నోచుకున్నది.

## రాకపోకల సౌకర్యములు

భారతదేశమందు తొలియుగంలో కంచి నుండి అయోధ్యకు పోవు విశాలమైన బాట ఆనాటి ప్రధానమార్గము. ఈ మార్గము ఓరుగల్లు గుండా పోవుటవలన మధ్యయుగంలో కొన్ని కరీంనగర్ జిల్లా ప్రాంతములు గూడా ఈ మార్గముతో కలుపబడ్డాయని తెలుస్తుంది. నిజానికి ఈ ప్రాంతమందు సరియైన రాకపోకల సౌకర్యాలుండేవి కావు. తొలి రోజులలో పొలాల గుండానే పయనించేవారు. చక్రాల బండ్లు నడుచుటకు ఈ జిల్లాలో చాలా ప్రాంతములందు వీలు లేకుండేది. ఫ్రెంచి వజ్రాల వర్తకుడు టావెర్నియర్ (Tavernier) భారతదేశం క్రీ.శ. 1641–1648 మధ్యకాలంలో పర్యటించి దక్షిణ భారతంలోని రోడ్లకంటే ఉత్తర భారతంలోని మొగలుల రోడ్లు బాగున్నాయని వ్రాశాడు. అయినప్పటికిని భారతదేశంలోని రోడ్లు ఫ్రాన్స్, ఇటలీలోని వాటి కంటే విశాలంగా సౌకర్యంగా ఉన్నాయని పేర్కొన్నాడు. 17వ శతాబ్ద మధ్యభాగంలో సూరత్ నుండి గోలకొండ చేరుటకు అతనికి 40 రోజులు పట్టింది. అతడు గుఱ్ఱము మీద గాని గాడిద మీద గాని ప్రయాణం చేయలేదు. అతడు ఎద్దుపై పయనించి ఉంటాడు, లేదా బండి లేదా పల్లకి ద్వారా పయనించి ఉంటాడు[65]. యాత్రికులు పయనించు పల్లకీలను సాధారణంగా ఒకవైపు ముగ్గురు, మరోవైపు ముగ్గురు మొత్తం ఆరుగురు మోసేవారు. పల్లకీలు మోయు బోయలు అత్యంత వేగంగా పరుగెత్తేవారు. ధనికులు రెండు ఎద్దులాగే చిన్నబండ్లు (Carts) వాడేవారు.

పేదలు ఎంత దూరమైనను కాలినడకన పోయేవారు.

యాత్రాస్థలాలైన వేములవాడ, ధర్మపురి, మంత్రకూటము, కాళేశ్వరంలకు యాత్రికుల రాకపోకలతో మార్గములేర్పడ్డాయి. ఈ యాత్రికుల మార్గములనే వర్తకులు, వర్తకబృందములు అనుసరించేవి. మధ్యయుగంలో పొలవాస (Polas), నగునూరు, వేములవాడ, మంత్రకూటములు రాజధాని నగరములగుటచే వాటి మధ్య సైనిక బాటలేర్పడ్డాయి. వీటినే దండు బాటలనే వారు. ఎడ్లబండ్లు, మూటలను, బరువులను మోయు జంతువులే సరుకులను ఒక చోటి నుండి మరొక చోటికి చేరవేసే సాధనాలుగా ఉండేవి. ఎద్దు, కంచరగాడిద, దున్నపోతు సరుకులు చేరవేయు ప్రధాన సాధనాలుగా 20వ శతాబ్దారంభం వరకు ఉపయోగింపబడేవి. నిజాం కాలములో ఉండిన మార్గాల గుండా సైన్యములు, ఫిరంగిబండ్లు సంచరించేవి. పై అంశాలను బట్టి గత శతాబ్దం వరకు గూడా సరుకుల రవాణా కష్టతరంగా ఉండేదని తెలుస్తుంది వర్షాకాలములో ప్రయాణమే దుర్లభము. బురదనేలల గుండా వర్తకులు పయనించుట కష్టతరంగా ఉండేది. దాదాపు ప్రతి గ్రామానికి బండ్లబాట (Cart-track) ఉండేది. పిల్లత్రోవలకంటే (Singleman-track) బండ్ల బాటల పరిస్థితి మెరుగుగా ఉండేది. మారుమూల గ్రామాలందు నేటికి కాలినడకన సంచరించు పిల్లమార్గములు (Singleman-tracks) దర్శనమిస్తాయి. ఈ పిల్లమార్గాలు దూరాన్ని తగ్గిస్తాయి.

క్రీ.శ. 1868లో నిజాంల కాలములో ప్రజాపనులశాఖ (Public works department) ఏర్పడింది. ఈ శాఖ చెఱువుల, రోడ్ల మరమ్మతుల పనిచూసేది. పనులు పెరిగిపోవుట వలన 1887లో ఈ శాఖ రెండుగా విభజింపబడింది. నీటిపారుదల నుండి భవనములు, రోడ్లు రవాణాశాఖ (Roads & Buildings) వేరు చేయబడింది. కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాలందు 1914 వరకు రోడ్లు (Constructed roads) లేకుండేవి. 1915-1916లో కరీంనగరము నుండి ఎల్కతుర్తి వరకు మెటల్‌రోడ్ అనగా కంకరరోడ్ నిర్మాణం జరిగింది. అదే కాలంలో కరీంనగర్ నుండి మంథని, సిరిసిల్ల, జగిత్యాల వరకు రోడ్ల నిర్మాణము ఆరంభమైంది. కరీంనగర్ వద్ద నున్న మానేరు నదిపై పాత బ్రిడ్జి 1923లో పూర్తి చేయబడింది. దానితో కరీంనగర్ నుండి హైదరాబాద్ రాజధానికి, వరంగల్ సుబాకు రాకపోకల సౌకర్యము పెరిగింది. 20వ శతాబ్దపు చివరి దశాబ్దంలో మానేరునదిపై వెడల్పైన నూతన బ్రిడ్జి నిర్మాణం జరిగింది. దీని వలన వాహనాల రాకపోకలకు సులభమైంది. తొలుత మొరం (Murram) రోడ్ల నిర్మాణం జరిగేది. కొంతకాలానికి మెటల్ లేదా కంకరరోడ్లుగా మారినాయి. 1940 వరకు కరీంనగర్ నుండి ఆర్మూర్ వరకు మెటల్‌రోడ్ జగిత్యాలను కలుపుతూ ఏర్పడింది. అప్పుడే కరీంనగర్ నుండి మంథనిని కలుపుతూ మహదేవపూర్ వరకు మరియు కరీంనగర్ నుండి సిద్దిపేట, కామారెడ్డిల వరకు రోడ్ల నిర్మాణం జరిగి మెటల్‌రోడ్లుగా తయారుచేయబడ్డాయి. కరీంనగర్ నుండి ముక్కర్రావుపేట వరకు గూడా మెటల్‌రోడ్ వేయబడింది. ఇదియే నేడు లక్షెటిపేటకు పోవు మార్గము. రాయపట్నం వద్ద గోదావరి

నదిపై కాజ్‌వే (Cause way) లేదా రొడ్డామ్ నిర్మాణం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణకు పూర్వమే 1955లో పూర్తి అయింది. దీని వలన లక్షెటిపేటకు మరియు ఆదిలాబాద్ జిల్లా ఇతర ప్రాంతాలకు ప్రయాణము సులభమైంది. 1965 వరకు కంకరరోడ్లు బ్లాక్‌టాప్‌డ్ రోడ్లు (Black topped Roads) అనగా బి.టి. రోడ్లుగా మారాయి. ఆ రోజులలో మొరంరోడ్లు, కంకరరోడ్లు మరియు బి.టి.రోడ్లు అని మూడురకాల రోడ్లుండేవి. 1959లో అధికార వికేంద్రీకరణ ఫలితంగా ఏర్పడిన పంచాయతీ సమితిలకు, జిల్లా పరిషత్తుకు వాటి పరిధిలోని ప్రాంతములందు రోడ్ల నిర్మాణం చేపట్టు అధికారాలు లభించాయి. తత్ఫలితంగా పంచాయితి సమితి రోడ్లు, జిల్లా పరిషత్ రోడ్లు ఏర్పడ్డాయి. ప్రస్తుతము హైదరాబాద్ నుండి కరీంనగర్ గుండా రామగుండం వరకు ఏర్పడిన వెడల్పైన రాజీవ్ రహదారి ప్రయాణవేగమును పెంచింది. కాని ప్రమాదాలు పెరిగాయి. కరీంనగర్ నుండి నిజామాబాద్, లక్షెటిపేట, వరంగల్ మున్నగు ప్రాంతములకు వెడల్పు అయిన రోడ్ మార్గము లేర్పడుట వలన నేడు ప్రయాణ సౌకర్యం, సౌలభ్యం అమితంగా పెరిగింది.

పూర్వం బండ్లకు చిన్నరాతి చక్రములుండేవి (Primitive type carts). క్రమంగా కర్రచక్రాల బండ్లు ఇనుపచక్రాల బండ్లు వాడబడ్డాయి. నేడు టైర్లబండ్లు గూడా వాడుతున్నారు. ప్రయాణీకులను చేరవేయుటకు గుఱ్ఱములు లాగు టాంగాలుండేవి. కాని క్రమంగా అవి కనుమరుగైనాయి. పట్టణాలలో సైకిల్‌రిక్షాలు పెరిగినాయి. ఇప్పుడవి గూడా కనుమరుగై ఆటో రిక్షాల సంఖ్య పెరిగింది. 20వ శతాబ్దం తొలిదశకం తరువాత సైకిళ్లు (Bi-cycles) మార్కెట్లోకి వచ్చాయి. గ్రామాలలో ఆనాడు సైకిల్ వింతైన వాహనము. మెటుపెల్లిలో ఆనాటి జాగీర్దార్ నవాబ్ ఫకురుల్‌ముల్క్ 1912లో మొదటిసారిగా సైకిల్ స్వారీ చేయడం చూచి ప్రజలు ఆశ్చర్యపడ్డారు. కరీంనగర్ జిల్లాలో 1920-1930 మధ్యకాలంలో మోటారు వాహనాలు ప్రవేశించాయి. కారు (Car)ను ఆనాడు టూరింగ్ అని పిలిచేవారు. భూస్వాములు, జాగీర్దార్లు కార్లు వాడేవారు. జగిత్యాల ప్రాంతానికి 60 ఊర్ల పట్వారీవతందార్‌గా ఉండిన కరణం చాకుంట కిషన్‌రావు ప్రప్రథమంగా కారు వాడటం విశేషం. 1950 వరకు కరీంనగర్, జగిత్యాల, పెద్దపెల్లి, జమ్మికుంట ప్రాంతాలలో లారీ వాహనాల సంఖ్య పెరిగింది. నేడు సైకిళ్ల స్థానంలో స్కూటర్లు, ఎడ్లబండ్ల బదులు ట్రాక్టర్లు, సవారి బండ్ల బదులు కారులు దర్శనమిస్తున్నాయి. జిల్లాలో 1950 వరకు మొత్తము వాహనముల సంఖ్య కేవలం 235. 1960 వరకు వాటి సంఖ్య 367 వరకు పెరిగింది. నేటి వాహనముల సంఖ్య అనేక వేలలో ఉంటుంది. గత అర్ధశతాబ్దంలో రాకపోకల రంగంలో, వాహనముల వాడకంలో విప్లవాత్మకమైన మార్పు చోటుచేసుకుంది.

1932 జులై 15 రోజున ప్రప్రథమంగా హైదరాబాద్ నగరములో కొన్ని రోడ్లపై మాత్రమే నగర ప్యాసింజర్ బస్సులు (Passenger buses) ప్రవేశపెట్టబడ్డాయి. క్రమంగా బస్సుల సౌకర్యం జిల్లాలకు విస్తరింపబడింది. 1950లో కరీంనగర్ బస్‌డిపో (Bus Depot) 22 బస్సులను మాత్రమే నడిపింది. 1958 జనవరి 11 రోజున R.T.C. సంస్థ ఏర్పడింది. ఈ సంస్థ బస్సుల

సౌకర్యాన్ని అపారంగా విస్తరింపజేసింది[66].

కరీంనగర్ జిల్లాలోని పెద్దపెల్లి 1923 మార్చి ఒకటవ తేదిన రైలుమార్గముతో కలుపబడింది. కాజిపేట నుండి బల్హార్షాకు పోవు రైలుమార్గము పెద్దపెల్లి వరకు పూర్తి అయింది. 1929 వరకు ఈ రైల్వేలైన్ బల్హార్షా వరకు పెంచబడింది. తద్వారా నాగపూర్ ప్రయాణం సులభమైంది. హసన్‌పర్తి వద్ద ఈ జిల్లా యందు ప్రవేశించిన రైలుమార్గము 80 కి.మీ. పొడవుతో హుజూరాబాద్, పెద్దపెల్లి ప్రాంతాలను కలుపుతూ రామగుండం వద్ద జిల్లా సరిహద్దు దాటుతుంది. రైలుమార్గముపై నున్న పెద్దపెల్లి, జమ్మికుంట మంచి వ్యాపార కేంద్రాలుగా అభివృద్ధి చెందాయి. పెద్దపెల్లి నుండి కరీంనగర్ వరకు కలుపబడిన నూతన రైలుమార్గపు ప్రారంభోత్సవం 22 ఎప్రిల్ 2002 రోజున జరిగింది.

కరీంనగర్ జిల్లాలో మధ్య నుండి మానేరు ఉపనది ప్రవహిస్తుంది. ఉత్తర సరిహద్దుగా గోదావరి నది ఉంది. వర్షాకాలములో గోదావరి దాటడం కష్టంగా ఉండేది. బ్రిడ్జిల నిర్మాణం కాక పూర్వము పుట్టీలు (Country boats) తోలుతో కప్పబడిన పెద్దబుట్టలలో నదిని తెడ్ల సహాయమున దాటేవారు. ఇప్పటికి గోదావరి తీరములందు ఈ తోలు పుట్టీలు వాడుకలో ఉన్నాయి. 1968లో జిల్లా పరిషత్ 30 రేవుల వద్ద పుట్టీల సౌకర్యమును వేలం వేసేది. నాటితో పోల్చినప్పుడు నేడు అనేకరకాల ప్రయాణ సాధనాలు పెరిగాయి.

## పూర్వపు బాటలు త్రోవలు

20వ శతాబ్దారంభం వరకు రాకపోకల పరిస్థితి దుర్భరంగా ఉండేదని తెలుస్తుంది. కచ్చడాల బాటలే ఆనాటి ప్రజల మార్గాలు. కరీంనగర్ జిల్లాలో మధ్యయుగమందుండిన పొలాస, వేములవాడ, నగునూరు, మంత్రకూటము వంటి రాజధాని పట్టణముల మధ్య మార్గములుండేవి. అలాగే పుణ్యక్షేత్రాలైన వేములవాడ, ధర్మపురి, కాళేశ్వరం, మంథని లాంటి ప్రదేశములకు గూడా తొలియుగము నుండి రాకపోకల సంబంధాలుండేవి. ఈ జిల్లాలో అనేక చోట్ల శాసనాలు లభ్యమైనాయి. ఈ శాసన ప్రదేశాలన్నియు పూర్వము ఎంతో కొంత ప్రాధాన్యతను సంతరించుకున్న గ్రామాలై ఉంటాయి. వాటిని దృష్టియందుంచుకొని ఈ జిల్లా యందుండిన కొన్ని పాతమార్గాలు సూచింపబడుతున్నాయి. ఆ మార్గాలే గత శతాబ్దారంభం వరకు ప్రజలకు ఉపయోగపడేవి. నేడు అవి అన్నియు బి.టి.రోడ్లుగా మారాయి. పూర్వపు మార్గాలు కొన్ని ఈ క్రింద పేర్కొనబడ్డాయి.

1. వేములవాడ నుండి –రుద్రంగి–కొరవట్టుల (కోరుట్ల)–చిట్టాపూర్–మల్లాపూర్–వాల్గొండ.
2. వేములవాడ–పోతుగంటి (పోత్గల్)–సిద్దిపేట–దుద్దెడ–చేరియాల్–కొల్లిపాకె (కొలనుపాక)
3. వేములవాడ – నాంపెల్లి – ఎల్లందల్ – నగునూరు – చొప్పదండి – కోటిలింగాల.
4. పొలవాస (పొలాస) – మల్లన్నపేట – చిలువాకోడూరు – అంబారిపేట – నందిమేడారం పెద్దపెల్లి – మంత్రకూటము – కాళేశ్వరం.

5. పొలవాస - రాజారం - చెప్పియాల - నల్లగొండ - వేములవాడ.
6. పొలవాస - మోతె - బతికెపెల్లి - పెగడపెల్లి - గుండి - గుమ్లాపూర్ - చొప్పదండి.
7. పొలవాస - రాజారం - కురిక్యాల - కొత్తపెల్లి - వన్నారం - నగునూరు.
8. పొలవాస - రాజారం - చెప్పియాల - నల్లగొండ - వేములవాడ - పోతుగంటి - దుబ్బాక మిరిదొడ్డి(మిడిదొడ్డి) - ఆల్వాల్ - గోలకొండ - పొట్లలకేరె (పటంచెఱువు)
9. శనిగరం - కోహెడ - హుస్నాబాద్ - ఎల్కతుర్తి - అనుమకొండ - ఓరుగల్లు.
10. పొలవాస - రాజారం - గంగాధర - కొత్తపెల్లి - మానకొండూర్ - గొడిశాల ఎల్కతుర్తి - అనుమకొండ - ఓరుగల్లు.
11. వేములవాడ - బోయినపెల్లి - గరిషెకుర్తి - వెలిచాల - కొత్తపెల్లి - నగునూరు.
12. పొలవాస-కొరవట్టుల(కోరుట్ల) - ఆర్మూర్ - ఇందూరు (నిజామాబాద్) - పోదన (బోధన్)

## నాణెములు

శాతవాహనుల కాలంలో కార్షపణములు (కహపణములు), వేములవాడ చాళుక్యుల కాలంలో గద్యాణములు, హాగ, ద్రమ్మములను నాణేల ప్రసక్తి శాసనాలలో కనిపిస్తుంది. కళ్యాణి చాళుక్యులకు సంబంధించిన చొప్పదండి, వేములవాడ శాసనాలలో గూడా ద్రమ్మముల ప్రసక్తి ఉంది. రాష్ట్రకూటుల కన్హేరి (Kanheri) శాసనములో బంగారు ద్రమ్మము పేర్కోబడింది[67]. సాధారణ ద్రమ్మములు వెండివై ఉండేవి. ఈ ద్రమ్మముల విలువ ఎంత ఉండేదో చెప్పుట కష్టతరము. కాకతీయుల కాలంలో రాయగజకేసరి మరియు దాయ గజకేసరి నాణేలుండేవి. రాయగజకేసరి రుద్రమదేవికి సంబంధించింది. దాయగజకేసరి ప్రతాపరుద్రునికి సంబంధించింది[68]. కరీంనగర్ జిల్లాలో ఇటీవల సుద్దాల వద్ద బయల్పడిన కుప్ప (hoard) లో 52 నాణేలు లభించాయి. వాటిలోని 51 దాయగజకేసరి నాణేలు కాకతి ప్రతాపరుద్రచక్రవర్తి కాలపువి[69]. ఈ నాణెములపై వరాహము, నంది, ఖడ్గము, సూర్యచంద్రులతో పాటు దాయ గజకేసరి అని తెలుగు అక్షరాలు కనిపిస్తాయి.

కాకతీయుల కాలపు శాసనాలు పది రూకల నాణెమును కేసరి గద్యన, కేసరిమాడ, నిష్క నామాంతరములతో పిలిచేవారని తెలుపుతున్నాయి[70]. ఆనాటి రూక నేటి రూపాయిలాంటిది. అర్ధరూకను అడ్డుగ, పావురూకను పడిక అని పిలిచేవారు. రూకలో ఎనిమిదవ వంతు భాగమును పరక మరియు పదహారవ వంతు భాగమును వీసము అనేవారు. 1962లో మెట్రిక్‌పద్ధతి (Metric system) ప్రవేశపెట్టుటకు పూర్వమున్న ఒక అణాయే ఈ వీసము. రూక ఆనాటి ప్రామాణిక నాణెము (Standard Coin) వీసము, పరక, పడిక మరియు అడ్డుగ యొక్క గుర్తులు లేదా చిహ్నములు (Symbols) ఈ క్రింది విధంగా శాసనాలందు కనిపిస్తాయి.

| | | |
|---|---|---|
| ఒక వీసము లేదా వీస | (-) | ఒక అడ్డపు చిన్నగీత |
| ఒక పరక లేదా బేడ (బ్యాడా) | (=) | రెండు అడ్డపు చిన్నగీతలు |
| ఒక పడిక లేదా చుక్కలేదా పావలా | ( ၊ ) | ఒక పొడువు చిన్నగీత |
| ఒక అడ్డుగ లేదా అర్ధ | ( ॥ ) | రెండు పొడువు చిన్నగీతలు. |

చిట్టాపురం శాసనమందు మాడ నాణెము పేర్కొబడింది[71]. కాకతీయుల కాలమందు వీసము కంటె చిన్ననాణేల వివరాలు తెలియవు. దబ్బు,కాసు,కని వాటి విలువ వివిధ కాలములందు వివిధ ప్రాంతాలలో వేర్వేరుగా ఉండేది. కావున ఈ నాణెముల విలువ కట్టడం ఊహాజనితమే అవుతుంది[72].

కాకతీయుల కాలపు రూకలోని వివిధ భాగాల విలువ ఈ క్రింద తెలుపబడింది.

| | | | |
|---|---|---|---|
| 1 వీసము | = | 1/2 పరక | 1/16 వంతు రూక |
| 2 వీసములు | = | 1 పరక | 1/8 వంతు రూక |
| 2 పరకలు | = | 1 పడిక(చుక్క) | 1/4 వంతు రూక |
| 2 పడికలు | = | 1 అడ్డుగ (అర్ధ) | 1/2 వంతు రూక |
| 2 అడ్డుగలు | = | 1 రూక | 1 రూక |
| 10 రూకలు | = | 1 మాడ లేదా గద్యన లేదా నిష్క | |

కుతుబ్‌షాహీ నవాబుల నాణేలు బహుతక్కువ సంఖ్యలో లభించినాయి. మొహ్మద్ అబ్దుల్‌వలి ఖాన్ 1961లో ముద్రించిన గోలకొండ నాణెముల పుస్తకములో ఆనాటి వరకు లభించిన వివిధ సుల్తాన్‌ల నాణేల వివరాలు తెలుపబడినాయి. జమ్షీద్ సుల్తాన్ కాలపువి 4 నాణేలు, సుభాన్ అలీది ఒక నాణెము, మొహ్మద్‌కులీ కుతుబ్‌షావి గోలకొండ (Mint) మింట్ లో ముద్రింపబడిన 50 నాణేలు, హైదరాబాద్ మింట్‌లో ముద్రింపబడిన 152 నాణేలు వర్ణింపబడ్డాయి. మొహ్మద్‌కుతుబ్‌షావి 7, అబ్దుల్లా కుతుబ్ షా పేరట ఒకటి, అబ్దుల్లా బాదుషా పేరట ఒకటి అబ్దుల్లా ఘాజీపేరట 71, అతని పేరు లేకుండా 87 నాణేలు వివరింపబడినాయి. చివరి సుల్తాన్ అబుల్‌హసన్ కుతుబ్‌షా కాలపు 11 నాణేల వివరములు, వాటిపై నున్న వ్రాతలు మున్నగునవి తెలుపబడినాయి[73].

కుతుబ్‌షాహీల అనంతరం నాలుగు దశాబ్దాల పాటు మొగలులు దక్కన్‌కు పాలకులైనారు. వారి నాణేలు గోలకొండ రాజ్యమంతట చలామణిలో ఉండేవి. మొగలుల నాణేలు 1857లో జరిగిన సిపాయి విప్లవము వరకు గూడా అమలులో ఉండేవని తెలుస్తుంది. షేర్షాకాలపు నాణేలు గూడా కొన్ని చలామణిలో ఉండినట్లు తెలుస్తుంది.[152] సిపాయిల విప్లవ సమయమందు నైజాం రాజ్యములో మొగలు పాదుషా పేరట నాణేలు చలామణి కావడం బ్రిటిష్ వారికి గిట్టలేదు. ఆంగ్లేయులు చివరి మొగలు పాదుషాను బంధించి 1857లో రంగూన్ జైలుకు పంపిన విషయం విదితమే. వారు నూతన నాణేలు ప్రవేశపెట్టుటకై నిజాం పై ఒత్తిడి తెచ్చారు.

మూడవ నిజాం సికిందర్‌జా కాలంలో హైదరాబాద్ నందు 1803లో టంకసాల స్థాపించబడింది. ఇది సుల్తాన్‌షాహి రాజభవనమందు ఉండేది. చేతితో నాణేలు చేయబడేవి. మొదటి సాలార్‌జంగ్ నవాబు 1858లో హాలీసిక్కా (Hali sicca) ప్రవేశపెట్టాడు. 1903లో సైఫాబాద్‌లో మింట్ (Mint) ఏర్పడింది. 1903లో వెలువడిన నాణేలపై చార్మినార్ బొమ్మ ముద్రించడం ఆరంభమైంది. మీర్ మహబూబ్ అలీఖాన్ ఆఱవ నిజాం కాలంలో 1903 నుండి 1911 వరకు ముద్రింపబడిన నాణేలను మహబూబియా సిక్కా (Mahaboobia sicca) అనేవారు. అతని తరువాత రాజ్యానికి వచ్చిన చివరి ఏడవ నిజాం మీర్ ఉస్మాన్‌అలీఖాన్ కాలపు నాణేలను ఉస్మానియా సిక్కా (Osmania Sicca) అనేవారు. 1903-1905 మధ్యకాలంలో వెండివి గుండ్రటి రూపాయి బిళ్లలు, పావలా, బేడ బిళ్లలు ముద్రింపబడ్డాయి. రాగివి ఒకపైస (రెండు పాయిలు Two pies) మరియు మూడుపైసల (ఆరు పాయిలు Six pies) బిళ్లలు (Copper coins) వెలువడినాయి. గ్రామాలలో నేడు గూడా మూడు పైసల రాగి గుండ్రటి నాణెమును ఒక తులం వస్తువును తూకం చేయడానికి త్రాసులో వాడుతారు. 1906-1910 మధ్యకాలంలో బంగారు గుండ్రటి అష్రఫీ (Ashrafi) నాణేలు అమలులోనికి వచ్చాయి. నాలుగు రకాల గుండ్రటి బంగారు నాణేలు ముద్రింపబడేవి. రూపాయి, అర్ధరూపాయి, పావలా, బేడ అను నాలుగు రకాల నాణేలు అమలులోనికి వచ్చాయి. ఇవన్ని బంగారు నాణెములే. ఒక పాయి (One pie) రాగి నాణేలు మరియు అర్ధరూపాయి వెండినాణేలు గూడా ముద్రింపబడ్డాయి. బంగారు అష్రఫీ నాణెము విలువ వెండి నాణెములతో పోల్చినప్పుడు 1930లలో ఈ క్రింది విధంగా ఉండేది.[74]

| | | |
|---|---|---|
| ఒక బంగారు అష్రఫీ | = | 29 ఉస్మానియా వెండి రూపాయలు |
| అర్ధ బంగారు అష్రఫీ | = | 15 ఉస్మానియా వెండి రూపాయలు |
| పావలా బంగారు అష్రఫీ | = | 8 ఉస్మానియా వెండి రూపాయలు |
| బేడ బంగారు అష్రఫీ | = | 5 ఉస్మానియా వెండి రూపాయలు |

వెండి నాణేలలో గూడా రూపాయి, అర్ధ రూపాయి, పావులా, బేడ లేదా బ్యాడ అను నాలుగు రకాల గుండ్రని బిళ్లలు వెలువడ్డాయి. రాగి నాణేలలో ఒక పాయి (One Pie or half paisa) ఒక పైస (One Paisa or two pies) మరియు మూడుపైసల పెద్ద గుండ్రని బిళ్లలు ప్రవేశపెట్టబడ్డాయి. 1936లో నిక్కెల్ (Nickle) నాణేలు అమలులోనికి వచ్చాయి. 1918లో పేపర్ కరెన్సీ (Paper currency) ముద్రణ ఆరంభమైంది. తొలుత పది రూపాయల నోటు మరియు వంద రూపాయల నోటు ముద్రింపబడ్డాయి. 1919లో ఒక రూపాయి నోటు మరియు ఐదు రూపాయల నోటు గూడా అమలు లోనికి వచ్చాయి. 1926లో వెయ్యి రూపాయల నోటు గూడా ముద్రింపబడింది. ఉస్మానియా సిక్కా పోలీసు చర్య తరువాత గూడా కొంతకాలం చలామణిలో ఉండేది. దీనికి సమాంతరంగా కల్దార్ సిక్కా భారత యూనియన్‌ది నడిచేది. ఉస్మానియా సిక్కా 116 రూపాయలకు 100 కల్దార్ సిక్కా సమానంగా ఉండేది. 1962లో

మెట్రిక్ పద్ధతి (Metric System) నాణేలు ప్రవేశపెట్టబడినాయి. రూపాయి ఒక వంద నయా పైసలుగా విభజింపబడింది. పైస, రెండు పైసలు, ఐదు పైసలు, పది పైసలు, ఇరవై పైసలు, పావలా, అర్ధరూపాయి, రూపాయి బిల్లలు ముద్రింపబడ్డాయి. రూపాయి విలువ తగ్గి నేడు పైస, రెండు పైసల, ఐదు పైసల బిళ్లలు క్రమంగా కనుమరుగవుచున్నాయి. రాబోయే కాలంలో రూపాయి నాణెమే చివరి నాణెంగా పరిగణింపబడుతుందనుటలో సందేహం లేదు.

## తపాలాశాఖ వలన ఆదాయం

1870 వరకు టెలిగ్రాఫ్ పద్ధతి లేదు. టప్పా గుంగ్రూపద్ధతి (Tappa ghumgru) అమలులో ఉండేది. ఒక పొడుగాటి కఱ్ఱ చివర గంట ఉండేది. టప్పాతో పరుగెత్తు ఉద్యోగి (Runner) పరుగులు తీసినకొలది గంట మ్రోగేది. అతని వేగానికి అంతరాయం కలుగకుండా జనమును హెచ్చరించుటకై అతడు గంటగల కఱ్ఱను వెంట మోసేవాడు. 1904లో ఒక అణా రెవెన్యూ స్టాంపు మొదటిసారిగా ముద్రింపబడింది. హైదరాబాద్ నుండి పూనాకు టప్పా (Post) పోవడానికి 5 రోజులు పట్టేది. సర్కారిటప్పా (Govt. Post) కు ఒక ఈక (Feather) తగిలింపబడేది. గుఱ్ఱములు, ఎద్దులు, ఒంటెలపైన టప్పాను పంపించేవారు. రాజధాని నుండి జిల్లాలలోనికి టప్పా చేరుటకు వారం రోజులు పట్టేది.

1937లో ఒక పోస్ట్‌కార్డ్ (Single Postcard) విలువ 4 పాయిలు అనగా రెండుపైసలు. రిప్లై కార్డ్ (Reply Card) విలువ 8 పాయిలు అనగా నాలుగు పైసలుండేది. 1930లో లిఫాఫా లేదా కవర్ (Post Cover or Envelope) ధర నాలుగు పాయిలు లేదా రెండు పైసలు. 1935లో ఒక అణా కవర్లు అమలులోనికి వచ్చాయి. నేడు ఒక కవరు ధర ఐదు రూపాయలు. తపాల స్టాంపుల అమ్మకంతో ప్రభుత్వానికి కొంత ఆదాయం వచ్చేది.

## కొలతలు (Measures)

కాకతీయుల కాలపు ప్రామాణికమైన తూనికలు, కొలతలకు ముందు కేసరి పదమును ఉపయోగించి కేసరిపుట్టి, కేసరితూము, కేసరిమానుక, కేసరికుంచము అని పిలిచేవారు. తెలుగు దేశములో కాకతీయులే ప్రప్రథమంగా కేసరికొలమానములను ఉపయోగించినారు. అంతకు పూర్వము పశ్చిమ చాళుక్యుల కాలంలో గంధహస్తిమాడలు, వెలనాటి చోడుల కాలంలో బిరుదుగద్యలు, తూర్పు చాళుక్యుల కాలంలో త్రిభువనాంకుశమానికలు అనే కొలమానములు వాడుకలో ఉండేవి. కాకతీయులే కేసరి నాణేలు, కేసరి తూనికలు, కేసరి కొలతలు వారి రాజ్యమందు ప్రవేశపెట్టారు[75]. భూముల కొలతలకై ప్రామాణికమైన గడలను కొయ్యదండములను (Wooden rods) వాడేవారు. వివిధ ప్రాంతాలలో వివిధ రకములైన కొయ్య దండముల కొలమానములుండెనని కాకతీయుల శాసనాలు వివరిస్తున్నాయి. 32 జానల (Jenas or palm lengths) పొడువు గల బొంగు (Bamboo pole) తో భూములను కొలిచేవారు[76]. ఈ బొంగు

కొలమానమును గడ, దండక లేదా కోల అని పిలిచేవారు. రెండు జానల కొలమానమును మూర (Cubit) అనేవారు. రెండు మూరలు గల పొడవును ఒక గజము (yard) అంటారు. నేడు మూడు అడుగులకు ఒక గజంగా (3 Feet = one yard) పరిగణిస్తారు. ఈ క్రింద పేర్కొనబడిన వివరములు ఆనాటి కొలమానములను స్పష్టంగా తెలుపుతాయి.

| | | |
|---|---|---|
| 9 అంగుళములు | = | 1 జాన |
| 2 జానలు | = | 1 మూర |
| 2 మూరలు | = | 1 గజము లేదా (3 అడుగులు) |

ఇండ్ల స్థలాలను కొలుచుటకు 8 మూరల కఱ్ఱదండము, భూములు కొలవడానికి 24 మూరల కొయ్యదండము లేదా బొంగు వాడినట్లుగా గుంటూరు జిల్లాలోని పెనుమాలి (Penumali) శాసనమందు పేర్కొనబడింది[77].

తరిపొలములను మర్తుర్లలో లేదా మట్టర్లలో, వట్టి భూములను (dry land) ఖండువ, ఖండుక లేదా పుట్టి కొలమానములతో కొలిచేవారు. సాధారణంగా పొలాల విస్తీర్ణము చేను చెలకల విస్తీర్ణము కంటే తక్కువగా ఉండేది. వేములవాడ చాళుక్యుల కాలపు శాసనములందు దేవాలయాలకు దానాలిచ్చిన భూములు మర్తుర్లలో లేదా మట్టర్లలో పేర్కొబడినాయి. ఇదే మర్తుర్ల పదము కళ్యాణి చాళుక్యుల, కాకతీయుల శాసనములందు గూడా కనిపిస్తుంది[78]. కరీంనగర్ మ్యూజియంలో నున్న రెండవ అరికేసరి కాలపు క్రీ.శ. 946 శిలాశాసనమందు ధరపయ్య అను బ్రాహ్మణునికి 50 మట్టర్‌ల (Mattars) నీరునేలను రాజు దానమిచ్చినట్లు పేర్కొబడింది[79]. వేములవాడ యందున్న అదే రాజు యొక్క వేరొక శాసనము భూకొలతలను నివర్తనములలో (Nivartanas) తెలుపుతుంది[80]. రెండవ అరికేసరి వేములవాడలోని దేవాలయాలకు వంద నివర్తనముల భూక్షేత్రమును (dry land) ఎనిమిది నివర్తనముల పానీయక్షేత్రమును (wet land) దానమిచ్చినట్లు ఈ శాసనమందు ఉంది. ఈ శాసనములో తరి భూమి, పొడి భూమి రెండింటి కొలతలు నివర్తనములలో ఉండుట గమనార్హం. సాధారణంగా భూముల కొలతలు నివర్తనములు, మర్తుర్లు, మట్టర్‌లలో ఉండేవని శాసనాల వలన తెలుస్తుంది. కాని వాటి మూల్యము (Value) తెలిసికోవడం కష్టం.

ధాన్యములు మున్నగు వాటిని (Volumetric measures) కొలుచుటకు గిద్ద చిట్టచివరి కొలమానము కాగా పుట్టి అన్నింటి కంటే పెద్ద కొలమానము. ఈ క్రింది పట్టిక ఆనాటి కొలమానముల వివరములను స్పష్టంగా తెలుపుతుంది[81]. అవే కొలమానములు 1962లో మెట్రిక్ (Metric system) పద్ధతి ప్రవేశ పెట్టబడినప్పటికిని నేటికిని ఇంకా గ్రామాల్లో అచ్చటచ్చట అనుసరింపబడుతూనే ఉన్నాయి.

| | | |
|---|---|---|
| 4 గిద్దలు | = | 1 సోల |
| 2 సోలలు | = | 1 తవ్వ |
| 2 తవ్వలు | = | 1 మానిక |
| 2 మానికలు | = | 1 అడ్డ |
| 2 అడ్డలు | = | 1 కుంచము |
| 2 కుంచములు | = | 1 ఇరుస |
| 2 ఇరుసలు | = | 1 తూము |
| 2 తూములు | = | 1 ఇద్దూము |
| 2 ఇద్దూములు | = | 1 నల్దూము |
| 5 తూములు | = | 1 ఎద్దూము |
| 10 తూములు | = | 1 పందూము |
| 20 తూములు | = | 1 పుట్టి ('ఖ' అక్షరము తెలుపును) |

పైన పేర్కొనబడిన కొలతలు మధ్యయుగపు శాసనములందు కనిపిస్తాయి. తూములు, పుట్టీలు ప్రాథమిక (Basic Measures) కొలతలు కాగా మిగిలినవన్నియు వాటిలోని భాగాలు లేదా వాటి కంటే కొన్ని రెట్లు అధికంగా ఉంటాయి. కరీంనగర్ జిల్లాలోని కాకతి ప్రతాపరుద్ర చక్రవర్తి కాలపు తేదీలేని చిట్టాపూర్ శాసనమందు సోలెడు, మానెడు, తూమెడు కొలమానములు కనిపిస్తాయి.[82] కాకతీయుల కాలపు హుస్నాబాద్ శాసనము స్థానిక దేవునికి నాలుగు పుట్ల వడ్లు దానమిచ్చినట్లు తెలుపుతుంది.[83] జగిత్యాలకు సమీపమందున్న మల్లన్నపేట దేవాలయంలోని వెలమదొర శాసనం స్థానిక దేవరకు 12 కుంచముల వడ్లు దానమిచ్చినట్లు పేర్కొంటుంది[84].

శాసనములందున్న సోలెడు, మానెడు, తూమెడు, కుంచెడు మొదలగు కొలమానములు అన్నియు నేటికి ఈ జిల్లాలోని గ్రామీణ ప్రాంతాలలో అమలులో ఉన్నాయి. కాని కొన్ని ప్రాంతాల్లో ఈ జిల్లా యందే ఈ కొలతలందు కొన్ని వ్యత్యాసాలున్నాయి. మెటుపెల్లి, కోరుట్ల ప్రాంతములందు అమలులో ఉండినకొలమానముల వ్యత్యాసము ఈ క్రింద వివరింపబడింది.

| | | |
|---|---|---|
| 2 పావెడులు | = | 1 అరసోల |
| 2 అరసోలలు | = | 1 చిట్టెడు |
| 2 చిట్టెడులు | = | 1 అట్టెడు |
| 2 అట్టెడులు | = | 1 తవ్వ |
| 2 తవ్వలు | = | 1 మానిక |
| 2 మానికలు | = | 1 కుంచము |
| 8 కుంచములు (16మానికలు) | = | 1 తూము |
| 20 తూములు | = | 1 పుట్టి |

జగిత్యాల ప్రాంతపు మానిక కొలమానము మెటుపెల్లి ప్రాంతపు దానితో వ్యత్యాసముంది. జగిత్యాల ప్రాంతమందు 4 సోలలకు ఒక మానిక అవుతుంది. అదే మెటుపెల్లి మానికకు 5 సోలలవుతుంది. మెటుపెల్లి మానిక జగిత్యాల దానికంటె ఒక సోలెడు కొలమానము ఎక్కువగా ఉండేది. జగిత్యాల ప్రాంతపు 5 సోలల కొలమానము మెటుపెల్లి ప్రాంతపు 4 అట్టెడుల కొలమానమునకు సమానంగా ఉంటుంది. ఈ విధంగా కొలతలలో వివిధ ప్రాంతములందు ఒకే జిల్లాలో వ్యత్యాసములు కనిపిస్తున్నాయి. ఈ కొలమానములన్నియు నేటికి గ్రామీణ ప్రజలు పాటించుట గమనార్హం మరియు అరుదైన విషయం.

## తూనికలు (Weights)

విలువైన వస్తువులు తూకము చేయుటలో (Gravimetric units) తులము, పాల, వీశ తూకములు శాసనములందు పేర్కొనబడ్డాయి. బంగారం, వజ్రములు, విలువైన రాళ్లు (Precious stones) తూకము చేయుటకు గురిగింజ (గురివింద గింజ) (Guriginja) చిట్టచివరి కొలమానము. గురిగింజ ఒక విత్తు (Seed) లేదా బీజము. ఈ క్రింది పట్టికలో తూనికల వివరములు తెలుపబడ్డాయి[85].

| | | |
|---|---|---|
| 4 గురిగింజలు | = | 1 సిన్నము లేదా చిన్నము |
| 30 సిన్నములు | = | 1 తులము |
| 3 తులములు | = | 1 పాల |
| 40 పాలలు | = | 1 వీశము (లేదా తక్కెడు) |
| 2 వీశములు | = | 1 ఎత్తు |
| 8 వీశములు లేదా 4 ఎత్తులు | = | 1 మణుగు (తూము) |
| 20 మణుగులు | = | 1 పుట్టి (ఖండుక) |

ప్రస్తుత మెట్రిక్ పద్ధతి (Metric system) 1962లో ప్రవేశ పెట్టబడు వరకు పైతూకములన్నియు కరీంనగర్ జిల్లా యందు అమలులో ఉండేవి. నేడు గూడా గ్రామీణ ప్రాంతాలలో తులము, తక్కెడు తూనికలు సాధారణంగా కనిపిస్తాయి. పట్టణాలలో గూడా నేటికీ బంగారం, వెండి అమ్మకాలు పాత తులాల తూకంలోనే ఎక్కువగా కనిపిస్తాయి.

కరీంనగర్ జిల్లా మధ్యయుగంలో సిరిసంపదలతో తులతూగింది. కుతుబ్‌షాహీల మరియు ఆసఫ్‌జాహీల కాలంలో గూడా ప్రజల ఆర్థిక పరిస్థితి నేటి కంటే ఎన్నోరెట్లు మెరుగుగా ఉండేది. కాని చివరి నిజాంనవాబుల కాలంలో క్షామముల వలన దుర్భర పరిస్థితి ఏర్పడిందని తెలుస్తుంది. గత రెండు వేల సంవత్సరములలో కరీంనగర్ జిల్లా ప్రజలు అన్ని రకాల ఆర్థిక సాంఘిక పరిస్థితులను జీర్ణం చేసికొని సహించారు. ప్రస్తుతం శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్ కాలువల ద్వారా వ్యవసాయం అభివృద్ధి చెందింది. ప్రజల జీవన ప్రమాణాలలో గత మూడు, నాలుగు

దశాబ్దాలలో విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి. యంత్రాల ఉపయోగం పెరిగింది. వాహనాలు పెరిగాయి. అక్షరాస్యతతో పాటు ఉన్నత విద్య అమోఘంగా అభివృద్ధి చెందింది. రాకపోక సౌకర్యాలు పెరిగాయి. పరిశ్రమలు అభివృద్ధి చెందాయి. బహుముఖంగా కరీంనగర్ జిల్లాప్రజల జీవన ప్రమాణాలు పెరిగాయి.

## ఆధార గ్రంధములు

**(References)**

1. కె.సాంబశివరావు, భారతదేశచరిత్ర - సంస్కృతి, Part I, 1987. p. 145
2. మల్లంపెల్లి సోమశేఖరశర్మ, *Op.cit.* pp. 11&12
3. J.Ramanaiah, *Temples of South India*, 1989. pp. 18 & 19.
4. బి.యన్.శాస్త్రి, *Op.cit*, pp. 76-78 & 83,84.
5. *IAPKD*, No.2, pp. 5-10.
6. *Ibid*, No.8, pp. 21-24
7. *Ibid*, No.13, p. 34
8. మల్లంపల్లి సోమశేఖరశర్మ, *Op.cit*, p. 18
9. *IAPKD*, No.75, pp. 139-141
10. N.Markandeya Sarma, "Sitarampalli Inscription" *APHC*, Vol.X, 1986, pp. 114-116
11. S.Dasarathi, "Numismatic References" *APHC*, Vol.X, 1986. pp.117-119
12. K.A.Nilakanta Sastri, *Op.Cit.*, pp. 324 & 325
13. Ram Saran Sharma, *Light on Early Indian Society and Economy*, 123, 144
14. *EA*, Vol.II, pp. 36-38
15. *IAPKD*, Nos. 16 & 17, pp. 42-47
16. *EA*, Vol.IV, pp. 67-89
17. *Ibid*, pp. 81-84
18. *Ibid*, pp. 84-89
19. *IAPKD*, No. 38, pp. 106-111
20. తెలంగాణ శాసనములు, Vol. I, No.21, pp.173-177.
21. *Ibid*, No.13, p. 116
22. *EHD*, p. 710
23. *IAPKD*, No.30, pp. 88-93
24. *Ibid*, No.7, pp. 19-21
25. *Ibid*, No.20, pp. 52-54
26. *Ibid*, No.30, pp. 88-93.
27. K.A.Nilakanta Sastri, *Op.cit.*, p. 328
28. D.N.Jah, *Studies in Early Indian Economic History*, pp. 82-85
29. *EA*, Vol. II, pp. 21-30
30. *IAPKD*, No.8, pp. 21-24.
31. *IAPKD.*, No.28, pp. 75-80
32. *Ibid*, No.25, pp. 64-71
33. *Ibid*, Nos. 29,30,38
34. *Ibid*, No. 25, pp. 64-71
35. పి.శ్రీరామశర్మ, ఆంధ్రదేశ చరిత్ర - సంస్కృతి, 1986, p. 181
36. *EHD*, pp. 681, 682
37. *JAHRS*, Vol. XXXV, pp. 183-188

38. J.Ramanaiah, *Op.cit.*, pp.272-274
39. *IAPKD*, No.30, pp. 88-93
40. N.Venkatarmanayya, *Chalukyas of Vemulawada.*, pp. 43 & 84.
41. P.V.Parabrahma Sastry, *The Kakatiyas of Warangal*, pp. 284-286.
42. D.N.Jah, *Op.cit*, 76 & 77
43. *JAHRS*, Vol. XXXVI, part I, pp. 33-47.
44. P.B., Desai, *Jainism In South India*, pp. 13 & 14.
45. N.Venkataramanayya, *Op.cit.*, p.84.
46. *Corpus*, Part III, p.2
47. *IAPKD*, No.38, pp. 106-111
48. P.V.Parabrahma Sastry, *Op.cit.*, p. 245
49. *IAPWD*, No.63.
50. *IAPKD*, No.30, pp. 88-93.
51. *Ibid*, No.1, pp. 1-5.
52. *Ibid*, No.2, pp. 5-10
53. *Ibid*, Nos. 10 & 13
54. *EHD*, p. 684.
55. P.V.Parabrahma Sastry, *Op.cit.*, pp. 214-220
56. *IAPKD*, No.37, pp. 104-106
57. Noboru Karashima, *South Indian History and Society*, p.162
58. P.V.Parabrahma Sastry, *Op.cit.*, 220, 221
59. *IAPKD*, No.36, pp. 103, 104
60. *Ibid*, No.38, pp. 106-111
61. M.Somasekhara Sharma, *Corpus*, Part IV, No. 38, p. 84.
62. *EA*, Vol. IV, pp. 93-102
63. *IAPWD*, No. 37.
64. *EHD*, P. 685
65. *JAHRS*, Vol. XXXVI, p. 64
66. *APGKD*, pp. 138-140
67. *EHD*, p. 802
68. P.V.Parabrahma Sastry, *Kakatiya Coins and measures*, p.9
69. *Ibid*, p.10
70. P.V.Parabrahma Sastry, *Op.cit*, p. 11
71. *IAPKD*, No.38, pp. 106-111
72. P.V.Parabrahama Sastry, *Op.cit*, p.14
73. Md. Abdul Wali khan, *Qutub Shahi Coins in A.P. Museum*, 1961. p.21
74. Raza Ali Khan, *Hyderabad 400 years*, pp. 138-141.
75. P.V. Parabrahma Sastry, *Op.cit.* p.18.
76. *EHD*, p. 683
77. *Ibid.*
78. *IAPKD*, Nos. 1,5,7,9,15,38.
79. *Ibid*, No. 1. pp. 1-5.
80. *Ibid*, No. 2. pp. 5-10.
81. P.V.Parabrahma Sastry, *Op.cit.*, p-19.
82. *IAPKD*, No. 38, pp. 106-111
83. *Ibid*, No. 36, pp. 103,104
84. *Ibid*, No. 53, pp. 125, 126
85. P.V.Parabrahma Sastry, *The Kakatiyas of Warangal*, p. 269.

ఏడవ అధ్యాయము

# VII. ఆలయ వాస్తు శిల్పము

హిందూ దేవాలయముల నిర్మాణము ఎప్పుడు, ఎచట ఆరంభమైనదో నేటికీ ఇదమిత్థంగా తేలలేదు. దేవతా విగ్రహములకు గుడుల నిర్మాణము ఆంధ్రదేశంలో బహుశః క్రీ.పూ. రెండవ శతాబ్దములో ఆరంభమైనట్లు, అవి ఇటుకతో నిర్మింపబడినట్లు, పెద్దబొంకూరు, వీరాపురం వద్ద జరిపిన త్రవ్వకాల్లో బయల్పడిన మిక్కిలి శిథిలావస్థలో ఉన్న కొన్నిఅవశేషాలను బట్టి తెలుస్తుంది. తొలి మందిరాలు చాలా మట్టుకు ఇటుక నిర్మాణాలే. క్రీ.పూ. రెండవ శతాబ్దమునకు చెందిన విష్ణుదేవాలయ పునాదులు భూపాల్‌లోని బెస్నాగర్ (Besnagar) వద్ద బయల్పడినాయి[1]. అచటి విష్ణునగర్ యే బిష్ణునగర్ క్రమముగా బెస్నాగర్‌గా మారి ఉంటుంది. ఈ మందిరాలు నశించిపోయే వస్తు సముదాయముతో కట్టబడినాయి. ఆంధ్రదేశంలో బయల్పడిన అవశేషాలు కేవలం ఒక గది మాత్రమే కలిగినవి కనుక అప్పటికి వాస్తు శిల్పవిధానాలు సరిగా ఏర్పడి ఉండవని ఊహించవచ్చు.

ఇటుక మరియు చక్కగా దిద్దబడిన రాయి (dressed stone) తో గూడిన ఆలయముల నిర్మాణము గుప్తరాజుల కాలములోనే ఆరంభమైంది. దేవాలయ వాస్తు కళా పద్ధతులు అప్పటి నుండే ఆరంభమైనవని చెప్పాలి. ఉత్తర భారతములోని దేవాలయాలలో ఉత్తర ప్రదేశ్‌లోని భిటార్‌గాంవ్ ఇటుక దేవాలయము, మధ్యప్రదేశ్‌లోని భూమర శివాలయము, నాచన కుఠార పార్వతి దేవాలయము, ఎరాన్‌లోని విష్ణు, వరాహ ఆలయములు, తిగావలోని దేవాలయములు మున్నగునవి క్రీ.శ. ఐదవ శతాబ్దమునకు చెందినవి[2]. క్రీ.శ. 415 లో సాంచీ యందు రాయితో నిర్మింపబడిన 17వ నెంబర్ దేవాలయము నేటికి దృఢంగా నిలిచియున్న తొలి దేవాలయమనవచ్చు[3]. షోలాపూర్ జిల్లాలోని తేర్ (Ter) వద్ద నున్న రెండు శిథిలాలయాలు, గుంటూరు జిల్లాలోని చేజెర్ల కపోతేశ్వరాలయము క్రీ.శ. ఐదవ శతాబ్దమునకు చెందినవే[4]. కాని ఇటీవలి త్రవ్వకాల వలన చేజెర్ల ఆలయం రెండో శతాబ్దానికి చెందినట్లు తెలియవస్తుంది.

దక్కన్‌లో బౌద్ధుల కళారీతులు పతనమొందిన తరువాత బాదామిచాళుక్యులు అనేక హిందూ దేవాలయములను ఐహొల్, పట్టడకల్, బాదామిలలో నిర్మించి సాంస్కృతిక పునరుజ్జీవమునకు తోడ్పడినారు. అందమైన వీరి కళాత్మక నిర్మాణములు వారి రసికతకు దర్పణము పట్టుచున్నాయి. తొలి చాళుక్యకళారీతులు, వాస్తు నిర్మాణ సంప్రదాయములు ఇచటి నుండియే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములోని దూర దూర ప్రాంతాలకు పయనించాయి. అలంపురము నందలి నవబ్రహ్మ ఆలయములు, సత్యవోలు, మహానందిలోని దేవాలయములు బాదామి చాళుక్యుల కళారీతులకు ప్రతీకలుగా నిలిచి ఉన్నాయి. క్రమముగా ఇవే వాస్తు కళా సంప్రదాయములు తరువాత కాలములో కరీంనగర్ జిల్లా యందు నిర్మింపబడిన దేవాలయాలలో ప్రతిబింబించినాయి.

కరీంనగర్ జిల్లా యందు తొలిచారిత్రక యుగమునకు సంబంధించిన హిందూ దేవాలయముల జాడ లేదు. కాని ధూళికట్టలో క్రీ.పూ. రెండవ శతాబ్దమునకు చెందిన బౌద్ధ స్థూపముంది[5]. పెద్ద బొంకూరు త్రవ్వకాలలో బయల్పడిన ఒక ఇటుకతో నిర్మించిన గది 5.30x4.90 మీటర్ల కొలతలతో హిందూ దేవాలయంగా భావింపబడింది[6]. కాని అందులో ఏ దేవతా ప్రతిమ ఉండేదో కానరాలేదు. క్రీస్తు తరువాత తొలి శతాబ్దములలో నశించి పోవు వస్తువులతో గూడిన నిర్మాణములు నేడు నిలిచిలేవు. కరీంనగర్ జిల్లా దేవాలయపు వాస్తుకళ అధ్యయనం చేయుటకు క్రీ.శ. 7వ, 8వ శతాబ్దములకు చెందిన అదవిసోమనపెల్లి గుహాలయాలు తప్ప దేవాలయ నిర్మాణముల తొలి ఆధారాలేవి లేవు.

కరీంనగర్ జిల్లాలో వేములవాడ చాళుక్యుల పాలనలో చదునుచేసి దిద్దబడినరాయితో శాశ్వత ప్రాతిపదికపై దేవాలయముల నిర్మాణం ఆరంభమైంది. క్రీ.శ. పదవ శతాబ్దారంభం నుండి పదునాల్గొవ శతాబ్దారంభం వరకు కరీంనగర్ జిల్లాలో వేములవాడ చాళుక్యులు, కళ్యాణి చాళుక్యులు, పొలవాస రాజులు, కాకతీయులు వివిధ కళారీతులలో దేవాలయముల నిర్మాణము గావించారు. ఈ నిర్మాణములలో చాలా మట్టుకు శివాలయములే. మరికొన్ని వైష్ణవాలయములతో పాటు జినాలయములు గూడా నిర్మింపబడినాయి. కాకతీయుల కాలపు దేవాలయాల్లో శిల్పుల కళానైపుణ్యము, వారి శిల్పకళా ఔన్నత్యము స్పష్టముగా గోచరిస్తాయి.

## 1. స్థలము

దేవాలయ నిర్మాణములో స్థల ఎంపిక ప్రధానాంశము. ఆలయముల నిర్మాణంలో స్థలము ఎంపికతో పాటు భూపరీక్ష గూడా ప్రధానాంశంగా వాస్తుశాస్త్రాలలో పేర్కొనబడింది. హిందూ దేవాలయాల నిర్మాణంలో అందమైన ప్రదేశము, మత పవిత్రత, సౌకర్యము, నిర్మాణ స్థిరత్వము మున్నగు అంశాలు పరిగణింపబడుతాయి. నదులు, గుట్టలు, ఊటలు, జలపాతాలు మున్నగు వాటికి దగ్గర నున్న తోటలలో, ఉద్యానవనములలో వినోదపు స్థలములలో దేవతలు ఆడుతూ, పాడుతూ విహరిస్తుంటారని బృహత్సంహిత తెలుపుతుంది[7]. దేవాలయ స్థలపు ఎంపిక

నదిఒడ్డున, సముద్రతీరమున, నదులవాగుల సంగమములందు, గుట్టపైన, గుట్టవంపున, అడవిలో, తోట, వనము, ఊరిలో, రాజధానిలో, ఏదేని పట్టణములో లేదా అందమైన పవిత్ర స్థలములో జరుగవలెనని తంత్రసముచ్చయము పేర్కొంటుంది[8].

కరీంనగర్ జిల్లాలోని దేవాలయముల స్థల ఎంపిక వాస్తు శాస్త్రములు సూచించినట్లుగానే జరిగినట్లు తోస్తుంది. గోదావరి నది తీరమందు వాల్గొండ, ధర్మపురి, తిమ్మాపూర్, కోటిలింగాల, కాశీపేట, మంథని దేవాలయాలు నిర్మింపబడ్డాయి. గోదావరి, ప్రాణహిత నదుల సంగమమందు కాళేశ్వర దేవాలయాలున్నాయి. అడవి సోమన్‌పెల్లి గుహాలయాలు మానేరువైపు ముఖము కలిగి యుండగా నీరకుల్ల దేవాలయము మానేరునది నడుమ ఒక పెద్దరాయిపై ఉంది. చంద్రవెల్లి, గంభీరావుపేట దేవాలయములు మానేరుఒడ్డున ఉన్నాయి. మానేరులో కలిసే మూలవాగు ఒడ్డున వేములవాడ దేవాలయాలున్నాయి. వాగుల ఒడ్డులందు గల దేవాలయాలు కోరుట్ల, చిలువాకోడూరు, చిట్టాపూర్, కొడిమ్యాల, తంగల్లపల్లి మున్నగుచోట్ల ఉన్నాయి.

స్థలము ఎంపికలో నీటి సౌకర్యము ప్రధానాంశము. కొన్ని గ్రామాల్లో చెఱువులు దేవాలయాలు ఏకకాల మందు నిర్మింపబడినట్లు తెలుస్తుంది. చొప్పదండిలోని క్రీ.శ. 992 మరియు 1008 శాసనములు అచటి చెఱువు, దేవాలయము ఒకే కాలమందు నిర్మింపబడినట్లు తెలుపుతున్నాయి[9]. కొన్ని సందర్భాలలో చెఱువుల కట్టలపైననే దేవాలయాలు నిర్మింపబడ్డాయి. క్రీ.శ. 1083లో వేములవాడ చెఱువుకట్టపై నిర్మింపబడిన రాజరాజేశ్వర దేవాలయము నేటికి దృఢముగా నిలిచి ఉంది[10]. కాని నంది మేడారం చెఱువు కట్టపై నిర్మించిన అమరేశ్వరాలయపు మరియు త్రికూటాలయపు పునాదులు శతాబ్దాల తరబడి నీటి ఒత్తిడికి తట్టుకోలేక శిథిలమైనాయి. పొలాస చెఱువు కట్టపై నిర్మించిన దేవాలయము కూలిపోయి దాని స్తంభములు, శిలాఫలకములు నీటిలో పడిఉన్నాయి. చెఱువు ప్రక్కనే దేవాలయముండుట శ్రేష్ఠముగా భావింపబడింది. ఎందుకనగా దాని నీరు దేవునికి, భక్తులకు ఉపయోగపడుతుంది. చెఱువుల పరిసరములందు నిర్మితమైన దేవాలయాలు చొప్పదండి, జమ్మికుంట, పొలాస, వేములవాడ, శనిగరం, పొట్లపల్లి, రాయికల్, ఎల్గేడ్, కొత్తపెల్లి, విలాసాగర్ లందున్నాయి.

గుట్టలపై నిర్మితమైన దేవాలయాలు రామగిరి, అనంతగిరి, సుందరగిరి, కొత్తగట్టు, కొండగట్టు లందున్నాయి. సాధారణంగా నరసింహ దేవాలయాలకై పర్వతములు, గుట్టలు, గుట్టబోరుల ఉపరి తలాలు ఎంపిక చేయబడినాయి. ఎందుకనగా సింహం గుహల్లో ఉంటుంది. గిరిజా నరసింహనామము దీనిని ధృవపరుస్తుంది[11]. సింహపు ఉనికి పర్వత గుహలలో గనుక అహోబిలం, సింహాచలం, యాదగిరి, లింబాద్రి మున్నగు ప్రదేశములందు గుట్టలపైననే నరసింహాలయాలు నిర్మింపబడ్డాయి. కరీంనగర్ జిల్లాలోని నరసింహాలయాలు బెజ్జంకి, ఎల్గందల్, నాంపెల్లి, నందగిరి నరసింహులపల్లె, నల్లగొండ, బీర్‌పూర్, దుంపెట, వెల్లుల్ల, శనిగరంలందు గుట్టలపైననే ఉన్నాయి.

రాజధాని నగరము మధ్య గూడా దేవాలయాల నిర్మాణం జరిగింది. రాజధానులుగా వెలసిన వేములవాడ, పొలాస, నగునూరు, మంథనిలందు దేవాలయాలు నేటికీ నిలిచి ఉన్నాయి. కాకతి రుద్రదేవుని మంత్రి గంగాధరుడు అతని రాజధాని నగునూరు నందు విష్ణు ఆలయము నిర్మించెనని క్రీ.శ. 1171 శాసనము తెలుపుతుంది[12]. ఏ కారణము చేతనో కొన్ని గ్రామాలు దేవాలయాలకు దూరమైనాయి. మరికొన్ని గ్రామాలు అదృశ్యమై ఆలయాలు మాత్రం మిగిలి ఉన్నాయి. యుద్ధములు, కరువు కాటకాలు, అంటు వ్యాధులు గ్రామాల తరలింపునకు కారణాలు కావచ్చు. కొన్నిచోట్ల దేవాలయాలు ఊరికి దూరంగా పొలాలలో అగబడుతున్నాయి. అట్టి ఆలయాలు గొడిశాల, ముత్తారం, కటుకూరు, కోహెడ, చెల్పూర్, గుడిమెట్టపల్లె, తక్కలపెల్లి, ఆరవెల్లి మున్నగుచోట్ల ఉన్నాయి.

## 2. భూపథకము (గ్రౌండుప్లాన్)

దేవాలయపు ముఖము ఎటువైపుండాలో నిర్మాత ఇష్టాయిష్టాలకు వదలి వేయుటకు వీలు లేదు. ఈ ప్రధానాంశము వాస్తు శాస్త్రాలు నిర్దేశించే రీతుల్లో ఉండాలి. సాధారణంగా దేవాలయములు తూర్పు ముఖము కలిగి ఉండాలని కోరుతుంటారు. ఎందుకంటే ఉదయించే సూర్యుని కిరణాలు నేరుగా దైవముపై ప్రసరించే వీలుంటుంది.

తూర్పు ముఖమును కలిగిన దేవాలయాల్లో సూర్యరశ్మి, వెలుతురు ధారాళంగా ప్రవేశించే అవకాశముంటుంది. కరీంనగర్ జిల్లాలోని చాలా దేవాలయాలు తూర్పు ముఖంగానే ఉన్నాయి. కాని కొన్ని దేవాలయాలు ఉత్తర, దక్షిణ, పడమటి ముఖముగా ఉన్నాయి.

వేములవాడ, ధర్మపురి, చొప్పదండి, కాళేశ్వరం, చంద్రవెల్లి, గొడిశాల, పోత్గల్, దేవాలయాలు, ముత్తారం, విలాసాగర్ త్రికూటాలయాలు, జమ్మికుంట శివాలయము, శనిగరం భీమేశ్వరాలయం, పొలాసపులస్త్యేశ్వరాలయం తూర్పు ముఖముగా ఉన్నాయి. నంది మేడారం, వాల్గొండ, చిలువాకోడూరు, నగునూరు, జనగాం మరియు కటుకూరు త్రికూటాలయములు ఉత్తర ముఖము కలిగి ఉన్నాయి. కొత్తపెల్లి, తోటపెల్లి, రాయికల్ త్రికూటాలయములు, బెజ్జంకి నరసింహాలయము, మంథని గౌతమేశ్వరాలయం దక్షిణ ముఖముగా ఉన్నాయి. అడవి సోమనపెల్లి గుహాలయాలు, కోరుట్ల మహాదేవాలయం మాత్రం పడమటి ముఖంగా ఉన్నాయి.

చాళుక్య కాకతీయ దేవాలయాల్లో గర్భగృహము, అంతరాళము, ముఖమంటపము, ప్రవేశ మంటపము నాలుగు ప్రధానాంగాలు. ప్రతిష్ఠింపబడు దైవముల సంఖ్యను బట్టి నేల కొలతల పథకములలో మార్పులు కలిగి గర్భగృహముల సంఖ్య వాస్తుశాస్త్రాలు నిర్దేశించు ప్రకారమే పెంచ బడినాయి. దేవాలయ మందు గర్భగృహము పరమ పవిత్రమైన ప్రధానాంగము. ఇందులో ప్రధానదైవము యొక్క ప్రతిష్ఠ జరుగుతుంది. గర్భగృహము మరియు ముఖమంటపము మధ్య విస్తరించి ఉండేది అంతరాళము. అంతరాళము ముందుండు ముఖమంటపము సువిశాలముగా

నుండి మధ్యలో రంగశిలను కలిగి ఉంటుంది. ముఖమంటపానికి ముందుండు చిన్నమంటపమును ప్రవేశ మంటపమంటారు.

రాష్ట్రకూటుల సామంతులైన వేములవాడ చాళుక్యులు ఒకే గర్భగృహమున్న దేవాలయాలు నిర్మించారు. వారి భూపథకమందు గర్భగృహము, అంతరాళము బదులు అర్ధమంటపము, ముఖమంటప ముంటాయి. ఈ తొలి ఆలయాలలో అంతరాళము గది రూపమును ఇంకను సంతరించుకోలేదు. ద్వారములేని అర్ధ మంటప రూపంలో ఉంటుంది. వేములవాడలోని భీమేశ్వర, కేదారేశ్వర గర్భగృహములందు లింగమునకు నాలుగు మూలలందు నాలుగు స్తంభాలున్నాయి. ఈ స్తంభములకు గోడలకు మధ్య నున్న స్థలము గర్భగృహము లోపలే దైవము చుట్టు తిరుగడానికి ప్రదక్షిణాపథంగా తోడ్పడుతుంది. గర్భగృహము లోపల నాలుగు మూలలందు నాలుగు స్తంభములుండు తొలి చాళుక్యుల కాలపు సంప్రదాయము అలంపురం, మహానంది దేవాలయములందు అగబడుతుంది[13].

కళ్యాణి చాళుక్యుల, కాకతీయుల దేవాలయములందు గర్భగృహము, అంతరాళము, ముఖమంటపము, ప్రవేశమంటపము ఉంటాయి. వీరి కాలములో త్రికూటాలయములు గూడా నిర్మింపబడినాయి. వీటి భూపథకము నక్షత్రాకారములో ఉంటుంది. ఒకే గర్భగృహముతో గూడిన వీరికాలపు దేవాలయాలు చొప్పదండి, శనిగరం, వేములవాడ, చంద్రవెల్లి, గుడిమెట్టపల్లె మున్నగు చోట్ల ఉన్నాయి. వీరికాలపు త్రికూటాలయములు రాయికల్, వాల్గొండ, నగునూరు, కొత్తపెల్లి, జనగాం, మంథని, కటుకూరు, గొడిశాల, ముత్తారం, విలాసాగర్‌లందున్నాయి.

### గ్రౌండు ప్లాను ప్రకారం కొన్ని ఆలయాల కొలతలు

1. చొప్పదండి శివాలయము :- ముఖమంటపము 20 అడుగుల చతురస్రము. గర్భగృహము 7'-6" చతురస్రము ప్రవేశమంటపము 10'-6" x 8'-3".
2. రాయికల్ త్రికూటాలయము :- ముఖమంటపము 24 అడుగుల చతురస్రము. గర్భగృహములు 8'-4" చతురస్రాలు. అర్ధమంటపాలు 8'x8'.4" ప్రవేశమంటపము 14'x7'.
3. మల్లన్నపేట శివాలయము :- ముఖమంటపము 31 అడుగుల చతురస్రము. గర్భగృహము 14 అడుగుల చతురస్రము. అంతరాళము 9'-6" x 11'-6".
4. తోటపెల్లి త్రికూటాలయము :- గర్భగృహములు 8' చతురస్రములు అర్ధమంటపములు 8 అడుగుల చతురస్రములు.
5. నగునూరు త్రికూటాలయము :- ముఖమంటపము 24'-4" చతురస్రము. గర్భగృహములు 9'-6" చతురస్రములు. అంతరాళములు 9'-9" x 9'-4".
6. గొడిశాల త్రికూటాలయము :- ముఖమంటపము 27'-6" చతురస్రము. గర్భగృహములు 11'-2" చతురస్రములు. అంతరాళములు 8'-6" x 9'-3". ప్రవేశమంటపము 12'x9'.

7. కటుకూరు త్రికూటాలయము :- ముఖమంటపము 19'-4" చతురస్రము.
గర్భగృహములు 6'-6" చతురస్రములు. అంతరాళములు 6'-6" x 5'.
8. విలాసాగర్ త్రికూటాలయము :- ముఖమంటపము 24 అడుగుల చతురస్రము.
గర్భగృహములు 8'-8"x8'. అంతరాళములు 8'-8"x8'.

## 3. ఉపపీఠ, అధిష్ఠానాలు

దేవాలయాల నిర్మాణము పరిశీలించునప్పుడు గోడల క్రింద ఒకటి లేదా రెండు భాగములు అగబడుతాయి. రెండు భాగములకు వర్గములుంటాయి. ఒక భాగము ఐచ్ఛికను రెండవది ఆవశ్యకము. అధిష్ఠానము ఆవశ్యకము. ఉపపీఠము ఐచ్ఛికము. ఐచ్ఛికభాగము ఆవశ్యకభాగము క్రింద ఉంటుంది[14].

'అధి' అనగా పైన 'స్థా' అనగా నిలబడుట[15]. అధిష్ఠానమనగా నిలబడుటకు కావలసిన వేదిక. ఆధునిక రచయితలు అధిష్ఠానమును ఆంగ్లములో బేస్ (Base), బేస్‌మెంట్ (Basement) సోకిల్ (Socle) అంటారు. డుబ్రిల్[16] మరియు పెర్సీ బ్రౌన్ [17] దీనిని ఆంగ్లంలో 'బేస్' (Base)గా అనువదించారు. శ్రీనివాసన్[18] మరియు మల్లయ[19] దీనిని ఆంగ్లంలో 'బేస్‌మెంట్'గా వాడారు. స్టెల్లాక్రామ్‌రిష్[20] దీనిని సోకిల్‌గా అనువదించారు.

ఉపపీఠం అనగా ప్రధానపీఠమునకు జోడించిన మరొక అదనపు పీఠమని అర్థము. వాస్తుశాస్త్రములు అధిష్ఠానము క్రింద నిర్మింపబడిన భాగమును ఉపపీఠంగా తెలుపుతాయి. డుబ్రల్ మరియు స్టెల్లాక్రామ్‌రిష్ ఉపపీఠమును ఇదే అర్థంలో వాడారు. అధిష్ఠానము క్రింద ఉపపీఠముతోను, ఉపపీఠము లేకను దేవాలయము నిర్మింపవచ్చు. ప్రాచీన వాస్తుశాస్త్రములు మరియు నిలిచియున్న దేవాలయములు ఉపపీఠమును ఐచ్ఛికభాగముగా తెలుపుతున్నాయి. బాదామిచాళుక్యుల, కళ్యాణి చాళుక్యుల దేవాలయములందగబడని ఉపపీఠము కాకతీయ దేవాలయములందు ఒక ప్రత్యేక విశిష్ట భాగంగా గోచరిస్తుంది.

కాకతీయుల దేవాలయములు సాధారణంగా ఎత్తైన విశాలమైన ఉపపీఠములపై దర్శనమిస్తాయి. రాజస్థాన్, గుజరాత్, దక్షిణ భారతంలో దేవాలయముల ఉపపీఠము విశాలమైన గద్దె రూపంలో అగబడదు[21]. కాని హొయసలుల దేవాలయములందు మాత్రము విశాలమైన ఉపపీఠము, దానిపై అధిష్ఠానముతో గూడిన దేవాలయము నిలిచి ఉంటుంది. అనేక వర్గములతో గూడిన ఉపపీఠము కాకతీయుల దేవాలయములకు ప్రత్యేకమైన శోభను చేకూర్చింది.

కరీంనగర్ జిల్లాలోని నగునూరు, కొత్తపెల్లి, మంథని, ముత్తారం త్రికూటాలయములందు మరియు చంద్రవెల్లి శివాలయమందు గల కాకతీయుల కాలపు ఉపపీఠములు అనేక వర్గములతో బహురమ్యంగా ఉండి చూపరుల దృష్టినాకర్షిస్తాయి.

వాస్తుశాస్త్రములు ఉపపీఠముల ప్రయోజనాలు తెలుపుతాయి[22]. ఉపపీఠము దేవాలయమునకు స్థిరత్వము, భద్రత కలిపిస్తుంది. దేవాలయమునకు ఉన్నతినిచ్చి శోభను చేకూరుస్తుంది. కాకతీయుల దేవాలయముల చుట్టూ నక్షత్రాకారములో నున్న ఉపపీఠము విశాలంగా ఉండి ప్రదక్షిణా పథముగా తోడ్పడుతుంది. సాధారణంగా ఉపపీఠము మరియు అధిష్ఠానము ఒకే రకమైన వర్గములతో అలంకరింపబడినాయి. పట్టిక, కంఠము, త్రిపట్టము, పద్మము, కుముదము పదే పదే ఈ వర్గములందు అగబడుతాయి. అనేక మలుపులతో గూడిన వర్గములు నగునూరు, కొత్తపెల్లి, ముత్తారం మున్నగు చోట్ల గల దేవాలయముల ఉపపీఠములకు, అధిష్ఠానములకు అపారమైన అందమును చేకూర్చాయి.

## 4. స్తంభము

హిందూ దేవాలయాల నిర్మాణంలో స్తంభం ప్రధానాంగాలలో ఒకటి. వివిధ పేర్లతో ఇది అనేక రకాలుగా ఉపయోగపడుతుంది. దేశములోని ఇతర ప్రాంతాలలో వలె కరీంనగర్ జిల్లాలో గూడా అనేక రకముల స్తంభాలు స్వేచ్ఛగా నిలిచి ఉన్నాయి. గరుడస్తంభములలో మొట్టమొదటి ఉదాహరణ భారతదేశంలో బెస్నాగర్ గరుడస్తంభము.[23] కరీంనగర్ జిల్లాలో శిథిలమైన నగునూరు వైష్ణవాలయం ముందు రెండు అద్భుతమైన గరుడస్తంభములు నేటికి నిలిచి ఉన్నాయి. ఇలాంటి గరుడ స్తంభమే ఒకటి నల్గొండ జిల్లాలోని కొలనుపాక వీరనారాయణ దేవాలయం ముందుంది. నిజామాబాద్ జిల్లాలోని బోధన్ నందు కళ్యాణి చాళుక్య చక్రవర్తి త్రైలోక్యమల్ల మొదటి సోమేశ్వరుని కాలపు శిలాశాసనమందు గరుడ స్తంభ ప్రసక్తి కనిపిస్తుంది[24].

నగునూరులోని రెండు గరుడస్తంభములు ఒకే రీతిలో నుండుట విశేషము. ఇవి అచటి ప్రధాన త్రికూటాలయమునకు ఈశాన్యము నందు పొలములలో ఉన్నాయి. ఇవి దాదాపు 40 అడుగుల ఎత్తు గల స్తంభాలు. వీటిపైన గల దివ్యమైన చిన్నమంటపములలో రెండువైపుల తలలు గల గరుడుడు అంజలి ముద్రలో అందంగా కూర్చొని ఉన్నాడు. ఈ జిల్లాలోని ఇతర చోట్ల గల గరుడస్తంభములు -20' నుండి 25' ఎత్తు కలిగి ఉన్నాయి. వాటిపై చిన్న మంటపము కనిపిస్తుంది. ఇట్టి గరుడస్తంభాలు పొలాస, గంగాధర, వాల్గొండ, పోత్గల్, రామగుండం లందు గల వైష్ణవాలయాల ముందు దర్శనమిస్తాయి.

గరుడస్తంభాల మాదిరిగానే శివాలయాల ముందు అనేక చోట్ల 25' ఎత్తు గల నంది స్తంభాలున్నాయి. ఈ స్తంభాలపై గల చిన్నమంటపంలో చిన్ననంది అగబడుతుంది. ఈ నంది స్తంభాలు చిలువాకోడూరు, పోత్గల్, వాల్గొండలందున్న శివాలయాల ముందు కనిపిస్తాయి.

తోరణ ద్వారపు స్తంభములు రామగుండం మకరతోరణములో ప్రధానాకర్షణలు. తోరణమునకు రెండు వైపుల నున్న స్తంభములపై గల అనేక శాఖలు లతా పద్మశిల్ప వరుసలతో అలంకరింపబడినాయి. ఈ శాఖల క్రింది భాగమున రెండు వైపుల అందమైన చామరధారిణిలతో

గూడిన శైవద్వారపాలకులు చెక్కబడినారు. ఈ తోరణము కొలనుపాక, నందికంది తోరణములను బోలి ఉంది. కాని ఈ తోరణమునకు రెండు వైపుల వరంగల్ కోటలోని హంసతోరణములలో వలె రెండేసి స్తంభములు లేవు.

కరీంనగర్ జిల్లాలోని దేవాలయాలందు గల స్తంభములు సాధారణంగా ఈ క్రింది భాగాలను కలిగి ఉంటాయి.

1. అశ్వపాదము – ఇది స్తంభము అడుగుననున్న పీఠము.
2. స్తంభ భాగము – ఇది అశ్వపాదము శీర్షముల మధ్యనుండు భాగము.
3. శీర్షము – ఇది స్తంభభాగము పైన కలశాకారంతో ఆరంభమై దానిపై నొక కుడం, ఫలికాపద్మము, వీరకంఠము, పోదెలతో పూర్తి అవుతుంది.

అడవి సోమనపెల్లి గుహాలయాలలోని స్తంభాలు సాదాగా మోటుగా ఉంటాయి. అడుగున ఒక చదరపు భాగము దానిపైన 3 అడుగుల ఎత్తు స్తంభము, దానిపైన అష్టభుజాకార భాగము ఉంది. శీర్షము గూడా చదరపు భాగమే. దానిపై రెండు భుజముల పోదె లింటల్ నానుకొని రెండువైపుల విస్తరించి ఉంది.

వేములవాడ భీమేశ్వరాలయ మంటపములోని నాలుగు మధ్యస్తంభములు అసాధారణరీతిలో ఎత్తుగా ఉన్నాయి. బహుశః లోకప్పు వంపుగా నుండుటకై ఈ ఎత్తైన చిత్రఖండస్తంభాలు వాడబడి ఉంటాయి. వీటి అశ్వపాదములందు నాలుగువైపుల గల గూడులందు దేవతారూపములు దర్శనమిస్తాయి.

హుస్నాబాద్ మండలంలోని తోటపెల్లి శిథిల దేవాలయపు మరియు ఎల్లేడ్ మండల కేంద్రంలోని చెఱువు ప్రక్క దేవాలయపు స్తంభాలు చాలా మోటుగా ఉన్నాయి. మల్లన్నపేట దేవాలయ మంటపము మధ్యన నాలుగు స్తంభాలు అసాధారణ రీతిలో అతిలావుగా ఉన్నాయి. ఈ స్తంభముల ఉపరిభాగములందు ఫలికాపద్మము, నాలుగు భుజాల పోదె బదులు అనూహ్యరీతిలో అతిలావైన మందము గల వృత్తాకారఫలకములు దర్శనమిస్తాయి. ఇలాంటి సంప్రదాయము జిల్లాలో మరెచటా కనబడదు. కరీంనగర్ నుండి హైదరాబాద్ పోవు రాజీవ్‌రహదారిపై బెజ్జంకి మండలంలో ఉన్న తోటపెల్లిలోని శిథిలమైన లేదా అసంపూర్ణంగా నిర్మింపబడిన త్రికూటాలయ స్తంభములు ఆపాద శీర్షము చతురస్రాకారములో నుండుట విశేషం. అశ్వపాదము నుండి బోదె వరకు అన్ని చదరపుభాగాలే కనిపిస్తాయి. బెజ్జంకి, గొడిశాల దేవాలయాల ముఖమంటపాల మధ్య నున్న నాలుగు స్తంభాలు విశేషమైన శిల్ప సంపదతో నొప్పారుచున్నాయి. బెజ్జంకి స్తంభాల ఉపరితలములు విస్తారమైన సూక్ష్మచెక్కడములతో అలరారుచున్నాయి. గొడిశాల స్తంభాలు నిగనిగలాడు నునుపుతో, సూక్ష్మాతి సూక్ష్మ చెక్కడాలతో కాకతీయుల శిల్పకౌశలమునకు ప్రతీకలుగా ఉన్నాయి.

కరీంనగర్ జిల్లాలోని చాళుక్య కాకతీయ దేవాలయాల స్తంభాలందు ఈ క్రింది లక్షణాలు సాధారణంగా కనిపిస్తాయి. స్తంభము యొక్క అశ్వపాదము నాలుగు వైపుల గూడులందు దేవతా రూపాలుంటాయి. స్తంభభాగము మధ్యలో కంపములతో గూడిన పట్టభాగముంటుంది. ఈ మధ్య భాగమునకు క్రింద మీద చతుర్ముఖ చతురస్రాకారపు భాగములుంటాయి. స్తంభపట్టి భాగమందు అనేక వర్గములు, కంపములు కనిపిస్తాయి. కొన్నిచోట్ల స్తంభాల ఉపరితలాలు పౌరాణిక లౌకిక అంశాలతో నింపబడినాయి. అట్టి గాథల చెక్కడాలు వేములవాడ భీమేశ్వర, బెజ్జంకి నరసింహ, ధర్మపురి నరసింహాలయము ముందున్న కాకతీయులకాలపు కళ్యాణమంటప, రాయికల్ త్రికూటాలయ, కాశీపేట ఆలయ స్తంభముల ఉపరితలములందు అమోఘంగా కనిపిస్తాయి. స్తంభ శీర్షము కలశ రూపముతో ఆరంభమై కొన్ని వర్గములుండి వృత్తాకార ఫలకముంటుంది. కలశపైభాగ వర్గములు నాలుగు దిశలందప్పుడప్పుడు త్రికోణ ముద్రికలతో (Triangular pieces) కలుపబడి ఉంటాయి. వృత్తాకారఫలకము పై నున్న ఫలికాపద్మముపై బోదెలగబడుతాయి. ఈ మూలమైన ప్రధానరూపంలోనే కరీంనగర్ జిల్లాలోని స్తంభాలన్నీ అగబడుతాయి. విస్తారమైన అలంకారములతో గూడిన స్తంభములు బెజ్జంకి, గొడిశాల, నగునూరు, చంద్రవెల్లి, మంథని దేవాలయాలలో దర్శనమిస్తాయి. స్తంభములు దేవాలయ నిర్మాణ భారమును మోయు ప్రధానాంగముగా నుండుటయే గాక విస్తారమైన అందమైన శిల్పసంపదతో శోభిల్లడం విశేషం. ముఖమంటపము చుట్టూ గల స్తంభాలు, ప్రవేశమంటప స్తంభాలు పిట్టగోడలపై అర్ధస్తంభాలుగా ఉంటాయి. వేములవాడ, మల్లన్నపేట, నంచర్ల, చెల్పూర్ మున్నగు దేవాలయాల గర్భగృహములందు దైవమునకు నాలుగు మూలలందు నాలుగు స్తంభాలు తొలిచాళుక్యుల కళా సంప్రదాయంలో కనిపిస్తాయి. వాటికి గర్భగృహగోడల మధ్య నున్న స్థలం ప్రదక్షిణాపథంగా ఉపయోగపడుతుంది. దేవాలయాలందున్న కుడ్యస్తంభములు మిగిలిన స్తంభముల ఆకృతిని బోలి ఉంటాయి.

స్తంభములు భారమునుమోస్తాయి. ఎత్తుగా నున్న స్తంభాలు మంటపానికి, ఆలయానికి శోభను చేకూరుస్తాయి. బెజ్జంకి, గొడిశాల, నగునూరు, చంద్రవెల్లి, మంథని ఆలయాలలోని ఎత్తైన స్తంభాలు అచటి దేవాలయాలకు అపారమైన సౌందర్యమును ఉన్నతిని కల్పించాయి.

## 5. గోడలు

వేములవాడ చాళుక్యుల దేవాలయములందు కళ్యాణి చాళుక్యుల కాలపు చొప్పదండి దేవాలయమందు గర్భగృహములు, అంతరాళములు, ముఖమంటపములు చుట్టూ గోడలతో మూయబడినాయి. వీరికాలపు ఆలయాల ముందు ప్రవేశమంటపాలున్నాయి. ఇతర దేవాలయాలలో కేవలము గర్భగృహము చుట్టూ గోడలుండి, వాటి ముందు గోడలు లేని ముఖమంటపాలు కనిపిస్తాయి. ఈ ముఖమంటపాల చుట్టూ పిట్టగోడలుంటాయి.

చాళుక్యుల దేవాలయాలలో గోడల తీరుతెన్నులు వేర్వేరుగా ఉన్నాయి. వేములవాడలోని నగరేశ్వర, కేదారేశ్వర, రాజరాజేశ్వర మరియు చొప్పదండిలోని శివాలయపు గోడలు బాహ్యముగా కొంత కొంత దూరంలో కుడ్యస్తంభాలచే అలంకరింపబడినాయి. కేదారేశ్వర దేవాలయపు గోడల బాహ్యము నందు గల కుడ్యస్తంభముల మధ్యనున్న శాలలందు పెద్దగణపతి, బ్రహ్మ, శివుడు, విష్ణువు, సరస్వతి రూపాలు దివ్యంగా దర్శనమిస్తాయి. వేములవాడ భీమేశ్వరాలయ అంతరాళపు గోడలందు గాలి, వెలుతురు ధారాళంగా రావటానికి కిటికీలున్నాయి. ఉత్తరపు వాతాయనము (జాలకము-కిటికి)లో అందమైన మహిషాసురమర్దని విగ్రహముంది. తొమ్మిదవ, పదవ శతాబ్దములకు చెందిన వేములవాడ చాళుక్యుల దేవాలయములందు అగబడుగోడలు శిల్పుల కళానైపుణ్యము ప్రదర్శించుచు స్ఫూర్తి దాయకంగా నిలిచి ఉన్నాయి.

చాళుక్యుల కాకతీయుల కాలపు కొన్ని దేవాలయముల గోడలు సాదాగా ఉన్నాయి. చదును చేయబడిన ఉపరితలముతో గూడిన పెద్ద పెద్ద దీర్ఘచతురస్రాకారపు శిలాఫలకములతో వీటి గోడలు నిర్మించబడినాయి. ఇలాంటి సాదా గోడలు రాయికల్, వాల్గొండ, పొలాస, మల్లన్నపేట, గొడిశాల, కటుకూరు మున్నగు ప్రాంతాల దేవాలయాలందు కనిపిస్తాయి. కొన్ని సందర్భాలలో గర్భగృహముల గోడల చుట్టూ వివిధ రకాల పట్టికలు కనిపిస్తాయి. నగునూరులోని ప్రధాన త్రికూటాలయమునకు దక్షిణమందు గుట్ట ప్రక్కనే ఉన్న ఆలయపు గర్భగృహము చుట్టూ గోడలపై ఇలాంటి పట్టికలున్నాయి. కాని విలాసాగర్‌లో దీనికి భిన్నంగా త్రికూటాలయపు మూడు గర్భగృహముల చుట్టూ గోడల మధ్య భాగము నుండి చతుర్దళ పద్మ శిల్పములతో అలంకరింపబడిన పట్టిక కనిపిస్తుంది. బెజ్జంకి నరసింహాలయపు గోడలు పెద్ద పెద్ద శిలలతో నిర్మింపబడి సాదాగా ఉన్నాయి. వాటిపై మిథున శిల్పములు లైంగిక ప్రక్రియలో కనిపిస్తాయి. ఈ సాదాగోడలపై తురగ, గజారోహకులు చెక్కబడినారు.

నగునూరు, కొత్తపెల్లి, చంద్రవెల్లి, ముత్తారం దేవాలయాల గోడలు పెద్ద, చిన్న కుడ్యస్తంభాలతో అలంకరింపబడినాయి. రుచిక, భద్రరీతిలో గోడలు ముందుకు, వెనుకకు అమరిన విన్యాసము కాకతీయ దేవాలయాల్లో సర్వసాధారణం. పెద్ద కుడ్యస్తంభాల కిరువైపుల మడతలున్నాయి. శిఖరాన్ని మోస్తున్న సన్నని కుడ్యస్తంభములు వంపులలో (recesses) అమర్చబడినాయి. నగునూరు దేవాలయ గోడలపై నున్న ఈ సన్నని కుడ్యస్తంభాలు కీర్తి ముఖములతో గూడిన ఛత్రములతో కలుపబడినాయి. మంథని గౌతమేశ్వరాలయ గోడలందు గల పెద్ద కుడ్యస్తంభాల అడుగుభాగాన వివిధ దేవతారూపాలు చెక్కబడినాయి. చంద్రవెల్లి శివాలయపు గోడలు హనుమకొండలోని వేయిస్తంభాల గుడి గోడలవలె నిర్గమము రీతిలో మధ్యలో నున్న గూడును చేరువరకు ముందుకు అమరిన విధానమును కలిగి ఉన్నాయి. ఈ రకమైన గోడల అమరిక కాకతీయ శిల్పులు పొరుగు రాష్ట్రమైన కర్ణాటకమందున్న కళ్యాణి చాళుక్యుల దేవాలయాల కళారీతులను అనుకరించి ఉంటారు[25]. ఇత్తగిలోని మహాదేవాలయము,

కర్ణాటకములోని లక్కుండి తదితర ప్రాంతాల దేవాలయాలు ఈ అంశాన్ని ధృవపరుస్తాయి[26].

గోడలు దూలములను, పైకప్పు మరియు శిఖరముల బరువును మోస్తాయి. దేవాలయాల గోడలు సాధారణంగా పెద్దపెద్ద దిద్దిన రాళ్లతో రెండు పొరల నిర్మాణంతో ఉంటాయి. రెండు పొరల మధ్యస్థలము ఖాళీగా ఉంటుంది లేదా మట్టి గులకరాళ్లతో నింపబడుతుంది. నగునూరు, గొడిశాల, గుడిమెట్టపల్లె దేవాలయాల బయటిపొర శతాబ్దాల తరబడి వాతావరణానికి తట్టుకోలేక, వర్షపునీరు కాఱుట వలన కూలిపోయి, లోపలి పొరలు తెరబడినాయి. కాకతీయుల కాలపు దేవాలయాల గోడల పునాదులు లోతుగా లేనందున వర్షపు నీరు కాఱుట చేత దృఢత్వము గోల్పోయి చాలా మట్టుకు శిథిలమై కూలిపోయినాయి. కాకతీయుల కాలపు పునాదులు భద్రతారాహిత్యంగా ఉండడం గమనార్హం[27].

గోడపైనున్న భాగమును కపోతమంటారు. ముత్తారం, కొత్తపెల్లి, చంద్రవెల్లి దేవాలయాల కపోతములందు అనేక వరుసలు వర్గముల రీతిలో కనిపిస్తాయి. కాని కళ్యాణి చాళుక్యుల దేవాలయము లందు మరికొన్ని కాకతీయ దేవాలయములందు కపోతము సాధారణంగా అర్ధచంద్రాకారపు గోళములతో అలంకరింపబడి ఉంటుంది.

దేవాలయాల చుట్టూ ప్రహరీ గోడలు గూడా రెండు పొరలతో నిర్మింపబడినాయి. ఈ నిర్మాణపు రీతి చొప్పదండి, చిలువాకొడూరు, కటుకూరులలో శిథిలమైన ప్రాకారపు గోడలందు బయల్పడింది. మంటపాల చుట్టూ పిట్టగోడలుండుట సర్వసాధారణం. వీటిలోపలి బయటి భాగములందు చతుర్దళ పద్మశిల్ప వరుసలు కనిపిస్తాయి.

## 6. ద్వారములు

దేవాలయాల్లో శిల్పులు నిర్మించిన ద్వారాలు వారి భక్తి శ్రద్ధలకు కళానైపుణ్యమునకు నిదర్శనాలుగా నిలిచి ఉన్నాయి. గర్భగృహ ప్రవేశము తప్పకుండా ద్వారము గుండానే జరుగుతుంది. అంతరాళములున్న చోట వాటికి చక్కటి ద్వారాలున్నాయి. కాని వేములవాడ, నంది మేడారం, రాయికల్, వాల్గొండ, తోటపెల్లి లాంటి దేవాలయాల్లో అంతరాళములకు బదులుగా ఏర్పరచిన అర్ధమంటపములకు ద్వారములు లేవు. వేములవాడ చాళుక్యులు నిర్మించిన భీమేశ్వరాలయము నందు చుట్టూ గోడలు గల ముఖమంటపములోనికి ప్రవేశించుటకు మకరతోరణము, త్రిశాఖలతో గూడిన చక్కటి ద్వారముంది. కాని కళ్యాణిచాళుక్యుల, కాకతీయుల కాలపు గోడలులేని ముఖమంటపములకు ప్రవేశ మంటపాల ద్వారా లోనికి చేరవచ్చు. కాని కళ్యాణి చాళుక్యుల కాలపు చొప్పదండి, బెజ్జెంకి, వేములవాడ రాజరాజేశ్వర దేవాలయములందు చూట్టూ గోడలు గల మంటపాలలోనికి ముఖమంటప ద్వారాల గుండానే ప్రవేశింపవలసి ఉంటుంది. ద్వార బంధముల ప్రధాన లక్షణాలు ఈ క్రింద పేర్కొనబడినాయి.

భువంగమము ద్వారము యొక్క క్రిందిభాగమున నుండు గడప. వేములవాడ చాళుక్యుల

కాలపు దేవాలయములలోని ద్వారముల గడపలు సాదాగా ఉన్నాయి. కాని కళ్యాణిచాళుక్యుల కాకతీయుల కాలపు గడపలు అనేక మలుపులతో గూడిన వర్గములతో శోభాయమానంగా ఉన్నాయి. రాయికల్, నగునూరు, గొడిశాల ఆలయాల గడపలు ఈ కోవకు చెందుతాయి. గడపలను వర్గములతో అలంకరించు సంప్రదాయము కర్ణాటక ప్రాంతపు చాళుక్యుల ద్వారముల నుండి అనుకరింపబడింది.

ద్వారపు పార్శ్వములందు దాదాపు పై రెండు వంతుల భాగము శాఖలతో అలంకరింపబడగా క్రింది ఒక వంతు భాగమందు గల ఫలకములపై ద్వారపాలకులు కనిపిస్తారు. ఈ ద్వారపాలకుల కిరువైపుల సాధారణంగా అందమైన చామరధారిణులు మలచబడినారు. ద్వారపాలకుల ఇట్టి సుందర ఫలకములు వేములవాడ రాజరాజేశ్వర, పాలాస వేణుగోపాల, నంది మేడారం అమరేశ్వర దేవాలయములందు కనిపిస్తాయి. ఇలాంటి ద్వారపాలకుల ఫలకములే నగునూరు, కొత్తపెల్లి, కటుకూరు, గొడిశాల కాకతీయుల కాలపు దేవాలయములందు అగబడుతాయి. కొన్ని దేవాలయాల్లో ద్వారపాలకుల స్థానంలో పూర్ణఘటాలు చెక్కబడినాయి.

ద్వారపార్శ్వపు ఉపరిభాగాలు త్రిశాఖలతో గాని అంతకు మించిన సంఖ్య గల శాఖలతో గాని అలంకరింపబడినాయి. సాధారణంగా కళ్యాణి చాళుక్యుల కాకతీయుల ద్వారములు త్రిశాఖలతో అలంకరింపబడినాయి. ఈ త్రిశాఖలందు మధ్యశాఖ కుడ్యస్తంభ రూపములో ఉంటుంది. వేములవాడ చాళుక్యుల కాలపు ద్వారముల శాఖలకంటె కళ్యాణి చాళుక్యుల కాలపు ద్వారముల శాఖలు ఎక్కువ సంఖ్యలో ఉంటాయి. అంతకంటే మించిన సంఖ్య గల శాఖలు కాకతీయుల ద్వారములందు కనిపిస్తాయి. ఉదాహరణకు కాకతీయుల కాలపు నగునూరు ప్రధాన త్రికూటాలయ మంటప ప్రవేశద్వారము ఐదు, ఆరు శాఖలతో అలంకరింపబడింది. ఈ శాఖల మధ్యన కుడ్యస్తంభముంది. కాకతీయుల దేవాలయాల్లోని అంతరాళద్వారముల కిరువైపుల సాధారణంగా జాలికిటికీలు అలంకారానికే కాకుండా గాలి వెలుతురు ధారాళంగా లోనికి ప్రవేశించుటకై నిలుపబడినాయి. మంథనిలోని గౌతమేశ్వరాలయ తూర్పుదిశలోని అంతరాళద్వారమున కిరువైపుల నున్న జాలి కిటికీలు పద్మాసనములో నున్న జైనుల శిల్పములతో అలరారుచున్నాయి. ఇచటి అంతరాళ ద్వారమున కిరువైపుల చిన్నగూడులున్నాయి.

సాధారణంగా ద్వారపు శాఖలు పద్మలతా శిల్పముల వరుసలతో, గజసింహ ముద్రికల వరుసలతో అలంకరింపబడినాయి. కొన్ని చోట్ల ప్రాకుడు లతావరుసలలో ఏర్పడిన వలయములందు వివిధ రూపములు చెక్కబడినాయి.

ద్వారముపైన నున్న లింటెల్ (Lintel) ను పతంగము లేదా ఊర్ధ్వపట్టిక అంటారు. పతంగము మధ్యన లలాటబింబము లేదా మంగళఫలకముంటుంది. కళ్యాణి చాళుక్య కాకతీయ ద్వారముల లలాటమందు గజలక్ష్మి లేదా గణపతి మలచబడినారు. కొన్ని చోట్ల ద్వారముల పతంగములు లలాట బింబము లేకుండా సాదాగా ఉన్నాయి.

కళ్యాణి చాళుక్యుల కాకతీయుల కాలపు ద్వారముల పతంగములపైన ముందుకు చొచ్చుకొని విస్తరించి ఉన్న చూరు (Projecting Cornice) అర్ధచంద్రాకార గోళములతో, వ్రేలాడు లోలకముల లాంటి శిల్పగోళములతో ఝూరావళి రూపంలో అందంగా ఉంటుంది. ఇది ద్వారమునకు అందము చేకూర్చుటయే గాక ద్వారముపై నున్న వివిధ భాగముల నుండి ద్వారమును వేరు చేస్తుంది. పైన లోతుగా చెక్కబడిన తోరణమునకు, క్రిందనున్న ద్వారమునకు మధ్యలో బహురమ్యంగా అలంకరింపబడిన ఈ చూరు ద్వారమునకు, పై నున్న కట్టడమునకు బలము చేకూరుస్తుంది.

పతంగమునకు పై నున్న తోరణము అంతస్తుల శిఖరములతో (turrets) అలంకరింపబడి ఉంటుంది. గోపురముల లాంటి ఈ చిన్నశిఖరాలు మూడు లేక ఐదు ఉంటాయి. నగునూరు, కొత్తపెల్లి దేవాలయాలందు తోరణములపై దేవతారూపాలు, నాట్యకత్తెలు, మృదంగ వాద్యకారిణులు మలచబడినారు. గొడిశాల, చంద్రవెల్లి దేవాలయాల ద్వార తోరణములందు బోర్లపడుకొని యున్న అపస్మార పురుషుని వీపు పైన నృత్యం చేయుచున్న నటరాజుకు ఒక వైపు విష్ణువు, వినాయకుడు, మరియొక వైపు బ్రహ్మ, కుమారస్వామి అందంగా మలచబడినారు.

వేములవాడ భీమేశ్వరాలయమందు గోడలచే మూయబడిన ముఖమంటప ప్రవేశద్వారము అందంగా మకర తోరణముతో అలంకరింపబడింది. వేములవాడ చాళుక్యుల కాలపు భీమేశ్వర, నగరేశ్వర దేవాలయాల ద్వారాలు ఎక్కువ చెక్కడాలు లేక సాదాగా ఉన్నాయి. కాని వారి తరువాత ఈ ప్రాంతాన్ని పాలించిన కళ్యాణి చాళుక్యుల కాలపు రాయికల్, పొలాస, నంది మేడారం, మల్లన్నపేట మున్నగు దేవాలయాల ద్వారాలు చక్కగా వివిధ శాఖలతో, ద్వారపాలకుల అందమైన శిల్పములతో దర్శనమిస్తాయి. విస్తారమైన చెక్కడములతో, అందమైన శిల్పములతో, అమితంగా నున్న శాఖలతో, ద్వారపాలకులకిరువైపుల చామరధారిణులైన అందమైన భామలతో, ద్వారములు శోభాయమానంగా ఉన్నాయి. ముందుకు విస్తరించిన చూరు, చక్కటి పతంగము, తోరణములతో కాకతీయుల కాలపు శిల్పఔన్నత్యమును ప్రదర్శించు అత్యంత సుందరమైన ద్వారములు ఈ జిల్లాలోని నగునూరు, కొత్తపెల్లి, కటుకూరు, గొడిశాల, మంథని, చంద్రవెల్లి దేవాలయాలందు ప్రత్యేకాకర్షణలుగా ఉన్నాయి.

కటుకూరు, కాశీపేట, గంభీరావుపేట దేవాలయాల ప్రాకార ప్రవేశద్వారములు అలంకారములు లేక సాదాగా ఉన్నాయి. కరీంనగర్ జిల్లాలో కళ్యాణి చాళుక్యుల కాలపు దేవాలయాల ద్వారముల అలంకారములు వారి కాలపు ఉత్తర కర్ణాటక మరియు తెలంగాణ మందలి తదితర దేవాలయాల ద్వారములను పోలి యుండడం గమనార్హం. కాకతీయుల కాలపు ద్వారములు పూర్వపు ద్వారముల వలె నిర్మాణములో ఎక్కువ తేడా లేక పోయినను అమితంగా అలంకారభరితములై సందర్శకులను తన్మయుల జేస్తాయి.

## 7. లోకప్పు మరియు పైకప్పు

వేములవాడ చాళుక్యుల దేవాలయాల లోకప్పు మరియు పైకప్పు కళ్యాణి చాళుక్యుల, కాకతీయుల దేవాలయాలలో వలె గాక భిన్నంగా ఉంది. వేములవాడలోని భీమేశ్వరాలయపు ముఖమంటపములోని నాలుగు మధ్యస్తంభములు వాటి అనుబంధస్తంభాల కంటే అసాధారణ రీతిలో చాలా ఎత్తుగా ఉన్నాయి. తత్ఫలితంగా వంపుతో గూడిన కప్పు (Slopy pent roof) వేయుటకు వీలైంది. ఇలాంటి వంపు లక్షణమున్న పైకప్పు కరీంనగర్ జిల్లాలోని ఏ ఇతర దేవాలయమందు కానరాదు. కొన్ని దేవాలయాలలో కప్పు చదునుగా ఉంది. గుప్తరాజుల కాలపు సాంచీలోని నెంబర్ 17 దేవాలయపు కప్పు చదునుగా వేయబడింది[28]. అదే సంప్రదాయం మధ్యయుగం వరకు కొనసాగింది. ఇలాంటి చదునుగా నుండు కప్పు వేములవాడలోని నగరేశ్వర, కేదారేశ్వర, శనిగరంలోని భీమేశ్వర, మల్లన్నపేట, చిలువాకోదూరు దేవాలయాలందు కనిపిస్తుంది. బెజ్జెంకి, కటుకూరు, తిమ్మాపూర్, గంగాధర దేవాలయాలలోని లోకప్పు చదునుగా నున్నను వాటి ముఖమంటపాలలోని, నాలుగు మధ్య స్తంభములపై నుండు భాగములందు మాత్రం లుపవితాన (కదళికాకరణ) రీతిలో వేయబడిన లోకప్పు కనిపిస్తుంది.

సాధారణంగా కళ్యాణి చాళుక్యుల, కాకతీయుల దేవాలయాల ముఖమంటపాల లోకప్పు స్తంభాల పైనున్న దూలాల వలన తొమ్మిది విభాగాలుగా ఏర్పడుతుంది. ఈ విభాగాలన్నియు చతురస్రాకారంలో ఉంటాయి. వీటిని కోణపట్టాలు, చదరపట్టాలతో అమర్చి చివరకు విరబూసిన పద్మశిల్పముతో గూడిన చదరపు పట్టములతో కప్పినారు. వాస్తుశాస్త్రములందు ఈ అమరికను లుపవితాన లేదా కదలికాకరణ పద్ధతి అంటారు[29]. లుపవితాన పద్ధతి, లోకప్పు చదును లక్షణాన్ని దూరం చేసి చూడటానికి అందంగా ఆనందదాయకంగా ఉంటుంది. కళ్యాణి చాళుక్యుల కాకతీయుల కాలపు రాయికల్, వాల్గొండ, నందిమేడారం, నగునూరు, కొత్తపెల్లి, గొడిశాల దేవాలయాల ముఖమంటపాలలోని లోకప్పు తొమ్మిది విభాగాలందు లుపవితాన రీతిలో అందంగా అగబడుతుంది. ఇదే కాలమునకు చెందిన ఉత్తర భారతదేశపు దేవాలయాల లోకప్పు గూడా లుపవితాన రీతిలో వేయబడింది. జమ్ము, కాశ్మీర్ రాష్ట్రమందు శ్రీనగర్‌కు ఆగ్నేయమున 5 కి.మీ. దూరంలో నున్న పండర్థాన్‌లోని పదవ శతాబ్దమునకు చెందిన శివాలయపు లోకప్పు గూడా లుపవితానరీతిలో ఉంది[30].

మంటపములలోని మధ్య విభాగముల, లోకప్పు గుమ్మటపు ఆకారములో (dome shaped) నుండుట రెండవ పద్ధతి. మంథని గౌతమేశ్వరాలయ ముఖమంటపము మధ్యలో నున్న లోకప్పు అర్ధగోళాకారపు పెద్ద గిన్నె (Bowl) బోర్లించిన రీతిలో నుండి ఒక దానిపై నొకటి గల వలయములు చిన్నవగుచు వర్తులాకారపు శిలలతో కప్పబడి మధ్య నుండి అద్భుతమైన పద్మపు మొగ్గ వ్రేలాడుచున్నది. ఇలాంటి లోకప్పు రాయచూరు జిల్లాలోని ఇట్టగి లేదా ఇత్తగి మహాదేవాలయంలో చూడవచ్చు[31]. అదే కర్ణాటక ప్రాంతంలోని మాగల వేణుగోపాల దేవాలయంలో

గూడా ఇలాంటి గుమ్మటపు కప్పు అగబడుతుంది[32]. మంథనిలోని గౌతమేశ్వర త్రికూటాలయములో ఉత్తర దిశయందున్న అంతరాళపు లోకప్పు గుమ్మటము వలె వలయాకారంలో గాకుండా చతురస్రాకారములో ఒకటి పై నొకటి ఐదు చదరపు వరుసలు అమర్చబడినాయి. ఈ చదరపు వరుసలు పైకి పోవు కొలది చిన్నవగును. చివరకు చదరపు ఫలకముతో లోకప్పు మూయబడింది.

మూడవ రకపు లోకప్పులో మొదట త్రికోణపట్టములు అమర్చబడి వాటిపై మూయబడిన చదరపు ఫలకము మాత్రమే అర్ధగోళాకారపు గిన్నె రూపంలో చెక్కబడి ఒకదానిపైనొకటుండు వలయములు లోలకముల లాంటి శిల్పగోళాలతో అలంకరింపబడి మధ్యలో పద్మపు మొగ్గ వ్రేలాడుతుంది. ఇలాంటి లోకప్పు నగునూరు, గొడిశాల, బెజ్జంకి దేవాలయాలలో అగబడుతుంది. దీనికి భిన్నంగా చంద్రవెల్లి దేవాలయ అంతరాళపు లోకప్పు నందు ఒక దానిపై నొకటి నాలుగు అష్టభుజాకారపు వరుసలు, అవిపైకి పోయిన కొలది చిన్నవగుచు చివరకు విరబూసిన పద్మఫలకముతో మూసి వేయబడింది. ఈ అష్టభుజాకారపు గుమ్మటపు వరుసలు అందంగా వ్రేలాడుచున్న శిల్పగోళములతో ఝూరావళి వలె అలంకరింపబడినాయి.

సాధారణంగా ముఖమంటపమందు మధ్యలో నుండు దూలములు విస్తారమైన శిల్పసంపదతో అలరారుచున్నాయి. దూలముల ప్రక్కలు, క్రింది భాగములు, త్రికోణపట్టాలు మరియు మధ్యన ఉన్న చదరపు ఫలకములోని గుమ్మటపు ఆకారాలు విశేషంగా అలంకరింపబడినాయి. దూలముల లోపటి వైపు ప్రక్కలలో చిన్న చిన్న కుడ్యస్తంభాల చెక్కడాలతో ఏర్పడిన విభాగములందు అందమైన నాట్యకత్తెలు, మృదంగవాద్యకారిణులు, తాళాలు మ్రోగించు సుందరాంగులు, బాకల నూదు భామలు చూడ ముచ్చటగా నున్నారు. పైన తెలిపిన విశేషశిల్ప సంపదనంతయు గాంచుటకు నగునూరులోని ప్రధాన త్రికూటాలయము ఒక చక్కటి ఉదాహరణ.

కరీంనగర్ జిల్లాలోని దేవాలయాల పైకప్పు (roof) సున్నము గులకరాళ్ల మిశ్రమంతో వేయబడింది. నేటికి పైకప్పులన్నియు దృఢంగా ఉండడం విశేషం. పైకప్పు చివరలందు విస్తరించి యున్న చూరు (eave cornice) గోడలను వర్షపు నీటి నుండి కాపాడుతుంది. అంతేగాకుండా దేవాలయ నిర్మాణమునకు అందము చేకూరుస్తుంది[33].

## 8. శిఖరము

గర్భగృహముపై నున్న నిర్మాణమును శిఖరమంటారు. నిజానికి శిఖరమంటే పర్వతపుకొన. హిమాలయాలలో తెల్లని మంచుచే కప్పబడిన కైలాస శిఖరాన్ని పరమశివుని నివాసస్థలంగా భావిస్తారు. హిమాలయాలలో మంచుచే కప్పబడిన శిఖరాలు ధవళకాంతుల మెఱుపును కలిగియున్నట్లుగానే సాధారణంగా దేవాలయాల శిఖరాలు గూడా తళ తళ మెఱసేలాగా తెల్లసున్నముతో వెల్లవేస్తారు[34]. దూరం నుండే ధగ ధగ మెఱుస్తున్న శిఖరాలను వాటి పైనున్న కలశాలను భక్తులు గాంచి దేవాలయాల ఉనికిని గమనించి ఆనందిస్తారు. కరీంనగర్ జిల్లా

దేవాలయాలపై నున్న శిఖరాలు చాపరేఖాకృతి (రేఖానాగరం)లో లేదా మెట్లతో గూడిన పిరమిడ్ (కాదంబ నాగరం) ఆకారంలో రెండే రకాలుగా కనిపిస్తాయి.

చాపరేఖాకృతి శిఖరాలలో చాపము ప్రబలంగా అగబడుతుంది. ఈ చాపరేఖాకృతి శిఖరాలు రాయికల్, వాల్గొండ త్రికూటాలయాలపైన మరియు ధర్మపురి రామలింగేశ్వరాలయము పైన అందంగా అగబడుతాయి. ప్రతి శిఖరము ముందు చాళుక్యుల కళారీతులలో అలంపురం నవ బ్రహ్మ దేవాలయములందు వలె శుకనాసి అంతరాళపు పై భాగాన నిర్మింపబడింది. పొలాసపులస్త్యేశ్వరాలయ మరియు చిలువాకోదూరు దేవాలయ శిఖరాలు గూడా చాపరేఖాకృతిలో ఉన్నాయి. కాని వాటి ముందు శుకనాసములు లేవు.

కరీంనగర్ జిల్లా దేవాలయాలు నాగర రీతిలో చాపరేఖాకృతి కలిగియున్న శిఖరాలు ఒరిస్సా శైలి (Orissan style) కంటే చాళుక్యుల రీతి, శైలి, సంప్రదాయాలకు చాలా దగ్గరగా ఉన్నాయి. పట్టదకల్, ఐహోల్, అలంపురం లోని చాళుక్యుల దేవాలయాల వాటివలె ఇచటి శిఖరాల చాపము యొక్క మలుపు శిఖరము యొక్క అడుగుభాగం నుండే ప్రారంభం అవుతుంది. కాని ఒరిస్సాశైలిలో ఈ చాపము యొక్క మలుపు శిఖరాగ్రభాగము నందు మాత్రమే ఆరంభమవుతుంది. ఈ నాగరశిఖరాలు కలశముతో గూడిన ఆమలకములతో కప్పబడినాయి.

మెట్లతో గూడిన పిరమిడ్ ఆకృతి రెండవ రకపు శిఖరాలు. ఈ పద్ధతి కర్ణాటక మందలి కదంబ వాస్తువిధానం నుండి అనుకరింపబడింది[35]. నగునూరులోని ప్రధాన త్రికూటాలయానికి దక్షిణాన గుట్టప్రక్కన గల శివాలయ శిఖరము చదరపు మెట్లతో పిరమిడ్ ఆకారంలో ఉంది. ఈ మెట్లు పైకి పోయిన కొలది పరిమాణము (Size)లో చిన్నగా ఉంటాయి. మెట్ల నడుమ కాదంబుల ఆలయాల శిఖరాలలో వలె లోపు సందులున్నాయి (Recesses). ఈ మెట్లు అర్ధచంద్రాకార గోళములతో అలంకరింపబడినాయి. ఈ శిఖరానికి ముందు చిన్న శుకనాసి ఉంది. బెజ్జెంకిలోని నరసింహ దేవాలయ శిఖరము గూడా దీనిని బోలి ఉంది. ఇలాంటి శిఖరములు శ్రీశైలమందు గూడా ఉన్నాయి.

చొప్పదండి, రామగుండం దేవాలయాల శిఖరాలు మెట్లతో గూడిన పిరమిడ్ ఆకారంలో ఉన్నాయి. శిఖరానికి నాలుగు వైపుల మధ్యలో ఒక పట్టికతో మెట్లన్నియు కలుపబడినాయి. ఈ పట్టిక క్రింది భాగాన వెడల్పుగా నుండి పైకి పోయిన కొలది వెడల్పు తగ్గుతుంది. వేములవాడ రాజరాజేశ్వర దేవాలయ శిఖరము పునఃనిర్మాణము కంటే ముందుండిన శిఖరము మెట్లతో గూడిన పిరమిడ్ ఆకారంలోనే ఉండేది. ఎలాంటి అలంకారములేని సాదా మెట్లతో గూడిన పిరమిడ్ ఆకారపు శిఖరాలు వేములవాడ నగరేశ్వర, ధర్మపురి పాతనరసింహాలయము, నంది మేడారం అమరేశ్వరాలయం, మంథని గౌతమేశ్వర త్రికూటాలయమందలి పడమటి ఆలయం, తిమ్మాపూర్ పడమటి ఆలయములందు కనిపిస్తాయి. ఇదే రకపు శిఖరాలు విలాసాగర్, ఎల్గేడ్,

కాశీపేట, నంచెర్ల, నీరకుల్ల, కోటిలింగాల, ఆరవెల్లి, పెద్దపెల్లి, సిరిసిల్ల, కరీంనగర్, మున్నగుచోట్ల నున్న దేవాలయములపైన ఉన్నాయి. మెట్లతో గూడిన పిరమిడ్ ఆకారపు శిఖరములపైన చదునుగా నున్న చదరపు ఫలకముంటుంది. దానిపైన కలశము అమర్చబడిఉంటుంది.

కాకతీయుల కాలపు దేవాలయాల శిఖరాలు చాలామట్టుకు శిథిలమైనాయి. కొన్ని చోట్ల అదృశ్యమైనాయి. నగునూరు,కొత్తపెల్లి, కటుకూరులందు కాకతీయుల కాలపు త్రికూటాలయాల శిఖరముల రూపము, రీతి గుర్తు పట్టలేని విధంగా శిథిలమైనాయి.

## ఆధార గ్రంథములు (References)


1. Percy Brown, *Op.cit.*, p.40.
2. Joanna Gottfried Williams, *The Art of Gupta India.* Plates No. 107.125.126.128.149.150,180.201.202.
3. Roy C.Craven, *A Concise History of Indian Art*, p. 131
4. Percy Brown, *Op.cit*, p. 41
5. V.V.Krishna Sastry, *Op.cit.*, p. 144.
6. *Ibid*, p. 143
7. Stella Kramrisch, *The Hindu Temple*, Vol.I, p.4
8. N.V.Mallaya, *Studies in Sanskrit Texts on Temple Architecture*. pp. 28. 29
9. *IAPKD*, Nos. 8 & 11
10. *Ibid*, No. 18, pp. 47-49
11. Abdul Waheed Khan, *An Early Sculpture of Narasimha*, p.1.
12. *IAPKD*. No. 25, pp. 64 - 71
13. M.Rama Rao, *Op.cit*, pp. 17 & 38
14. M.Radhakrishna Sarma, *Op.cit.*, p. 173
15. Ram Raz, *Eassy on the Architecture of the Hindus*. p. 23
16. G.Jouveau Dubreuil, *Dravadian Architecture*, p. 10
17. Percy Brown, *Op.cit.*, p. 205
18. K.R.Srinivasan, "The Pallava Architecture of South India", *Ancient India*, p. 129
19. N.V.Mallaya, *Op.cit.*, p. 176.
20. Stella Kramrisch, *Op.cit.*, Vol.I, p.146.
21. M.Radhakrishna Sarma, *Op.cit.*, pp. 174,175.
22. N.V.Mallaya, *Op.cit.*, p. 166.
23. M. Radhakrishna Sarma, *Op.cit.*, p. 177.
24. *RE*, 1966, No.305, p. 67
25. M.Radhakrishna Sarma, *Op.cit.*, p. 188
26. P.Sreenivasachar, (ed), *Op.cit.*, Plates XXXII to XXXVIII.
27. *EHD*, p. 737
28. Debala Mitra, *Sanchi.*, p.50, Pl. VII.
29. N.V.Mallaya, *Op.cit.*, p. 260.
30. Debala Mitra, *Panderthan, Avantipur and Martand.*, pp. 24,25. P1.IV B.
31. P.Sreenivasachar (ed), *Op.cit.*, P1. XXXVII B
32. Alexr Rea, *Op.cit.*, pp. 11,12, P1. XVII.
33. Percy Brown, *Op.cit.*, p. 146
34. Benjamin Rowland, *The Art and Archietecture of India*, pp. 167-169.
35. S. Gopalakrishna Murthy, *Jain Vestiges in Andhra*. pp. 50,51

ఎనిమిదవ అధ్యాయము

# VIII. జిల్లాలో శిల్ప కళావికాసం

అనాది నుండి తరతరాల భారతీయులు ప్రతిమాశిల్పముల నుండి ఆనందానుభూతిని ఆధ్యాత్మిక స్ఫూర్తిని పొందారు. ఆనాటి శిల్పులెవ్వరు పేరు ప్రతిష్ఠలకై ప్రాకులాడలేదు. భక్తిశ్రద్ధలతో, అంకితభావంతో అద్భుత కళాఖండాలు ముందు తరాలవారికై సృష్టించి తరించారు. అనేక ప్రతిమాశిల్పములందు వారి అకుంఠితదీక్ష, నైపుణ్యము, శిల్పకళా ఔన్నత్యము ప్రస్ఫుటంగా గోచరిస్తాయి.

ఒక పెద్దరాతి ఫలకమును పరికరములు, పనిముట్ల ద్వారా తొలచి అందమైన దేవతా రూపమును సృష్టించుటయే ప్రతిమాశిల్పము. రాతిఫలకము నుండి అనవసరపు భాగమును, ముక్కలను, బిచ్చలను తొలగించి అవసరమున్న భాగములో అందమైన రూపమును సృష్టించుటయే శిల్పుల నైపుణ్యము. సాధారణంగా విగ్రహము, ప్రతిమ పదాలు దేవతామూర్తులకు వర్తిస్తాయి. ప్రతిమాశిల్పము ఏ దైవము కొరకు చెక్కబడిందో ఆ దైవము యొక్క లక్షణాలు, గుణగణాలన్నియు మూర్తీభవించి వాటిని ప్రస్ఫుటంగా ప్రతిబింబింపజేయునదియే ఉత్తమ శిల్పము. తయారైన విగ్రహము వేదోక్తంగా గర్భగృహములో ప్రతిష్ఠింపబడినపుడే దానికి పవిత్రత ఆపాదింపబడుతుంది[1]. దేవతా విగ్రహము నయనానందంగా నుండుటయే గాక ఆధ్యాత్మికంగా ఆత్మోన్నతికి స్ఫూర్తిదాయకంగా ఉండాలి.

కరీంనగర్ జిల్లాలోని దేవాలయాలలో అనేకరకముల ప్రతిమాశిల్పాలు దర్శనమిస్తాయి. జిల్లాలో చాలా మట్టుకు శివాలయాలే ఎక్కువగా ఉన్నాయి. లింగాకారములో నున్న పరమశివుని రూపమే వీటిలోని ప్రధాన ఆరాధ్యదైవం. చిన్నదేవాలయాల్లో కేవలము లింగము, నంది మాత్రమే కనిపిస్తుంటాయి. కొన్ని దేవాలయాలు అపార శిల్పసంపదతో అలరారుతున్నాయి. కాకతీయుల కాలపు దేవాలయాల ఉపపీఠాలు, అధిష్ఠానాలు అనేక వర్గాలతో విరాజిల్లుతున్నాయి. వేములవాడ చాళుక్యుల కాలపు భీమేశ్వరాలయ అధిష్ఠానపు కంఠభాగము అనేక విభాగములుగా విభజింపబడి

వాటిలో విష్ణువు దశావతారాలు, పంచతంత్ర గాథలు, లేడి, గజ, సింహరూపాలు అందంగా మలచబడినాయి. సాధారణంగా దేవాలయాల గోడలు అలంకారములు లేక సాదాగా ఉన్నాయి. కాని వేములవాడ కేదారేశ్వర దేవాలయపు గోడలపై గణపతి, శివుడు, బ్రహ్మ, విష్ణువు, సరస్వతి రూపాలు బహురమ్యంగా మలచబడినాయి. ప్రస్తరము నందు క్షీరసముద్ర మథనము అందంగా చెక్కబడింది. పంచతంత్రంలోని ఇచటి తాబేలు గాథాశిల్పము అలంపురంలోని విష్ణుబ్రహ్మ ఆలయ గోడలపై నున్న దానిని పోలి ఉంది[2].

వేములవాడ భీమేశ్వరాలయ ముఖమంటపములోని నాలుగు ఎత్తైన మధ్యస్తంభాలు చిత్రఖండ రూపంలో అలంకరింపబడినాయి. వాటి ఉపరితలములు అందమైన భామలు, హంసలు పూర్ణ ఘటములు, లతా పత్ర వరుసలు, వివిధ జంతుజాలముతో నిండి ఉన్నాయి. రాయికల్ త్రికూటాలయంలోని ముఖమంటపంలో నాలుగు మధ్యస్తంభములపై కూర్మ,మత్స్య,వరాహ,గజలక్ష్మి, కామధేనువు, హంసలు మున్నగునవి అందంగా చెక్కబడినాయి. బెజ్జంకి నరసింహాలయ ముఖమంటపము లోని నాలుగు మధ్యస్తంభాలు అందమైన, విస్తారమైన శిల్పములతో అలరారుచున్నాయి. స్తంభాల ఉపరితలములు పౌరాణికగాథలు, వివిధ దేవతారూపాలు, సుందర భామామణులతో రమ్యంగా నింపబడినాయి. కాశీపేట దేవాలయ మంటపములోని స్తంభాల ఉపరితలములందు గోపికా వస్త్రాపహరణము, అందమైన నర్తకీమణులు, వేటకత్తెలు, లేడి, గజ, సింహ సుందర రూపాలను చూడవచ్చు. కరీంనగర్ జిల్లాలోని చాలా దేవాలయాలందలి స్తంభాలు అలంకారములు లేక సాదాగా ఉన్నాయి.

కళ్యాణి చాళుక్యుల, కాకతీయులకాలపు దేవాలయాల ద్వారాలు అమితమైన శిల్ప సంపదతో నొప్పారుచున్నాయి. ద్వారపు శాఖల క్రింది భాగమందుగల ఫలకములపై ద్వారపాలకుల కిరువైపుల అందాల భామలు, చామరధారిణులు రమ్యంగా మలచబడినారు. ద్వారముల పై నున్న తోరణాలు అంతస్తుల శిఖర శిల్పములతో అలంకరింపబడినాయి. కొన్ని చోట్ల బోర్లపడుకొనియున్న అపస్మార పురుషుని వీపుపై పరమశివుడు నటరాజ రూపంలో దివ్యంగా నాట్యం చేస్తున్నట్లు చెక్కబడింది. కాకతీయ దేవాలయాల ముఖమంటప దూలములు వాటి ఇరుప్రక్కల మరియు క్రింది భాగములందు అపారమైన శిల్పసంపద గోచరిస్తుంది. దూలములపై దేవతారూపాలు, నాట్యకత్తెలు, మృదంగవాద్యకారిణులు, బాకలనూదు భామలు, లతా పద్మశిల్ప వరుసలు చూపరులను రంజింపజేస్తాయి. కరీంనగర్ మ్యూజియం మరియు పాత శివాలయంలో అనేక శిల్పకళాఖండాలున్నాయి. వేములవాడ భీమేశ్వరాలయంలో, కాళేశ్వరంలోని ముక్తీశ్వరాలయంలో ధర్మపురి రామలింగేశ్వరాలయంలో అనేక ప్రాచీన శిల్పకళా ఖండాలు ప్రోగుచేయబడినాయి. అవే గాకుండా జిల్లాలోని దాదాపు అన్ని దేవాలయాలందు వాటి పరిసరములందు వందలాది శిల్పాలు సందర్శకుల దృష్టినాకర్షిస్తున్నాయి.

## 1. గణపతి

గణపతి జనప్రియుడైన ఆరాధ్యదైవము. సాధారణంగా ఆలయ ద్వారములందే గాక గృహ ప్రవేశ ద్వారపు లలాటమున చెక్కబడిన వినాయకుని రూపం ఉంటుంది. వ్యాపారస్థులు, రచయితలు, విద్యార్థులు ఒక్కరేంటి అందరూ ప్రతిపనిని ఆరంభించడానికి ముందు గణపతిని ఆరాధిస్తారు. గణపతి అపారమైన విజ్ఞతగలవాడు గనుక అతడు దేవతల లేఖకునిగా భావింపబడుతున్నాడు[3]. విఘ్నముల అధిదేవతారూపం విఘ్నేశ్వరుడు. విఘ్నములను కలిగించు, వాటిని తొలగించు అర్హత గల దైవము విఘ్నేశ్వరుడని లింగపురాణం తెలుపుతుంది[4].

ప్రతిచిన్న గ్రామంలో మందిరం ఉన్నను, లేక పోయినను ఎక్కడో ఒక రావి చెట్టు క్రిందైనను, గ్రామాల ప్రవేశమునకు ముందు, కోటల ముందు, శివాలయ గర్భగృహ ప్రవేశద్వారమునకు కుడివైపున లేదా శైవవైష్ణవాలయాలందున్న గూడులందు గణపతి రూపము దర్శనమిస్తుంది. కొన్ని శివాలయాలందు గణపతికి ప్రత్యేక చిన్నమందిరం ఉండటం విశేషం. అలాంటి చిన్న మందిరం ఒకటి ధర్మపురిలోని రామలింగేశ్వరాలయంలో ఉంది. అనేక దేవాలయాలలో ప్రధానదైవము తరువాత స్థానమే గణపతికి ఇవ్వబడింది. కాని పూజలో మాత్రం ప్రథమస్థానంలో ఉంటాడు[5].



నూకపెల్లి గణపతి



తోటపెల్లి గణపతి, మం॥హుస్నాబాద్



ముత్తారం గణపతి

తొలి మరియు మలి మధ్యయుగమునకు జెందిన కూర్చొని యున్న గణపతి విగ్రహాలు భారతదేశమంతటా దర్శనమిస్తాయి. భూమర, దేవ్‌ఘర్ ప్రాంతములందు క్రీ.శ. 400 కు సంబంధించిన గుప్త రాజుల కాలపు గణపతి రూపాలు కనిపిస్తాయని పండితుల అభిప్రాయం[6]. గుప్తుల కాలపు కూర్చొనియున్న తొలి గణపతి చెక్కడం, మధ్యప్రదేశ్‌లోని ఉదయగిరి వద్ద గల చంద్రగుప్త గుహ ముందు భాగమందు కనిపిస్తుంది[7]. ఇది ద్విహస్తములతో నున్న గణపతి. తొండము వామహస్తమందు గల మోదకములపై ఆని ఉంది. గణపతి క్రింది భాగమున వాహనము కానరాదు.

దక్షిణ భారతదేశంలో తొల్దొలుత గణపతి భావనను, రూపమును అందజేసింది అమరావతి శిల్పులు. క్రీ.పూ. రెండవ శతాబ్దమునకు చెందిన ద్విహస్తములతో గూడిన పొట్టిగా నుండు గణపతి రూపము అమరావతిలోని సున్నపు శిలాఫలకముపై చెక్కబడింది[8]. ఇలాంటి ద్విహస్తముల గణపతి చెక్కడములు క్రీ.శ. నాలుగవ శతాబ్దమునకు చెందినవి పెద్దముడియం మరియు మాడుగుల వద్ద ఉన్నాయి[9]. గుంటూరు జిల్లాలోని చేజెర్ల కపోతేశ్వర దేవాలయమందు సున్నపురాయిపై చెక్కబడిన గణపతి క్రీ.శ. ఐదవ శతాబ్దమునకు చెందిందని తెలుస్తుంది[10]. బాదామికి దగ్గరగా నున్న మహాకూట్ విష్ణువు యొక్క పద్మకుండము నందు గల లింగమంటపమునకు సమీపమున క్రీ.శ. ఆఱవ శతాబ్దమునకు చెందిన గణపతి విగ్రహము ద్విహస్తములతో దర్శనమిస్తుంది[11]. మకుటము లేకుండా నిజమైన ఏనుగు తలను బోలిన ద్విహస్తముల గణపతి విగ్రహమొకటి తూర్పు గోదావరి జిల్లా వేంగీదేశమందలి బిక్కవోలు పొలములందు పడి ఉంది. ఇది తొమ్మిదవ శతాబ్దానికి జెందిన పెద్ద వినాయక విగ్రహము. ఇలాంటి విగ్రహాలు విజయవాడ తదితరప్రాంతాలందు గూడా ఉన్నాయి[12].

ప్రాచీనరూపములోనున్న అనేక గణపతి విగ్రహాలు పదవశతాబ్దము మట్టుకు చెక్కబడినవి. కరీంనగర్ జిల్లాలోని అనేక ప్రాంతాలలో కనిపిస్తాయి. సనాతన రూపంలో ఉన్న గణపతులు మకుటము లేకుండా, నిజమైన ఏనుగుతలను బోలి రెండు చేతులతో అగబడుతాయి. కొన్ని ప్రతిమల అడుగుభాగాన మూషిక వాహనముంటుంది. ఏడవ, ఎనిమిదవ శతాబ్దాలకు పూర్వపు విగ్రహాలందు వాహనము కానరాదు. చిన్నపెద్ద ప్రాచీన గణపతి విగ్రహాలు వేములవాడ భీమేశ్వర, నగరేశ్వర, కేదారేశ్వర, చొప్పదండి శంభుని గుడి, పొట్లపల్లి మల్లన్నగుడి, మల్లన్నపేట మల్లన్నగుడి, నందిమేడారం అమరేశ్వరాలయం, కాళేశ్వరంలోని ముక్తీశ్వరాలయ ఆవరణలో, ఎల్గేడ్ చెఱువుప్రక్క శివాలయం, హుస్నాబాద్ మండలంలోని తోటపెల్లి హనుమాన్ దేవాలయ ఆవరణలో, ఎల్కతుర్తి ధోబీవాడ శివాలయం, మల్యాల మండలంలోని నూకపెల్లి ఆంజనేయ దేవాలయం, జగిత్యాల గాంధీనగర్ ప్రభుత్వ పాఠశాల ముందున్న వేదికపై, మున్నగు చోట్ల దర్శనమిస్తాయి. నగునూరు నుండి తెచ్చిన పెద్దగణపతి విగ్రహము మకుటములేకుండా ద్విహస్తములతో కరీంనగర్ మ్యూజియం గేట్‌లోనికి ప్రవేశించగానే చూడవచ్చు. ఇటీవల మానేరు ఒడ్డున నున్న అల్గునూరులో ఒక పెద్ద ద్విహస్తముల గణపతి బయల్పడింది.

10-11వ శతాబ్దాల్లో ఈ ప్రాంతపు గణపతులకు చిన్న కిరీటాలు ధరింపజేయడం ఆరంభమైంది. చిన్న మకుటము ధరించిన రెండు చేతుల గణపతి పెద్ద విగ్రహాలు పొలాస చెఱువు కట్టపై, సిరిసిల్లలోని శివాలయంలోను కనిపిస్తాయి. మకుటధారియైన నాలుగు చేతుల గణపతి పెద్ద విగ్రహాలను ధర్మపురి, ముత్తారం, శనిగరం, జమ్మికుంట దేవాలయాలలో చూడవచ్చు.

దేవాలయాల ద్వారముల లలాటమందు గణపతి చెక్కబడి ఉంటుంది. మంథని గౌతమేశ్వర, చంద్రవెల్లి శివాలయం, గొడిశాల త్రికూటాలయం యొక్క ద్వారముల తోరణములందు

నటరాజుతో పాటు గణపతి గూడా నాట్య భంగిమలో కనిపిస్తాడు. సప్తమాతృకల ఫలకముల చివరలందు ఒక ప్రక్క వినాయకుడు రెండవ ప్రక్క వీరభద్రుడు అగబడుతారు.

## 2. బ్రహ్మ

హిందూదేశ చరిత్ర ప్రాచీనయుగపు తొలికాలములో హిందువులు ఆరాధించు త్రిమూర్తులలో బ్రహ్మ ఒకడుగా ప్రధానపాత్ర వహించినాడు. విష్ణువు నాభి నుండి ఆవిర్భవించిన పద్మము నుండి బ్రహ్మ జన్మించాడని భావిస్తారు. అతడే సృష్టికర్తయని దానిని కాపాడువాడని పేర్కొనబడినాడు. శివకేశవుల ఆరాధన అమితంగా వ్యాప్తిలోనికి రాగానే బ్రహ్మ ప్రాధాన్యత ఆరాధ్యదైవంగా తగ్గింది. అందువలన బ్రహ్మకై ప్రత్యేకంగా నిర్మించిన ఆలయాలు బహు అరుదు. రాజపుత్రస్థానంలోని వసంత్‌ఘడ్‌లో ఇటుకతో నిర్మించిన ఏడవ శతాబ్దపు దేవాలయంలో చతుర్ముఖ బ్రహ్మ ప్రతిష్ఠింపబడినాడు[13]. ఈ శిలాఫలక ప్రతిమలో మూడు ముఖాలు కనిపిస్తున్నాయి. వెనుక భాగమందు ఫలకముండుటచే నాల్గవ ముఖము కానరాదు. ఇతని రెండు చేతులందు అక్షమాల, కమండలం చెక్కబడినాయి. సాధారణంగా బ్రహ్మ ప్రతిమలలో మూడే ముఖాలు కనిపిస్తాయి. వెనుకభాగమందు శిలాఫలకముండుటచే నాల్గవ ముఖము కానరాదు. మధ్యప్రదేశ్‌లోని దుదాహి మరియు ఖజురాహోలందు, కర్ణాటకమందలి హుబ్లీ సమీపాన గల ఉంకల్ నందు బ్రహ్మకై ప్రత్యేకాలయాలున్నాయి[14].

కరీంనగర్ జిల్లాలో బ్రహ్మకై ప్రత్యేకంగా నిర్మించిన దేవాలయాలు కానరావు. కాని ఇచటి వైష్ణవశైవ ఆలయములందు అతని ప్రతిమాశిల్పాలు ఉపదైవంగా దర్శనమిస్తాయి. ధర్మపురిలోని పాత నరసింహదేవాలయ ముఖమంటపంలో ఆరు అడుగుల ఎత్తున్న బ్రహ్మ యొక్క ప్రతిమాశిల్పం చూడ ముచ్చటగా ఉంది. చతుర్బాహువులు, మూడుముఖములు గల ఈ ప్రతిమలో మధ్యముఖానికి మాత్రమే పొడుగైన గడ్డం ఉంది. అతని పైహస్తములందు స్రుకము, వేదములున్నాయి. క్రింది వామహస్తము అక్షమాలతో గూడిన అభయముద్రలో ఉంది. దక్షణహస్తము ఎడమవైపునకు తిరిగి గదపై మోపబడింది. అతనికి కుడివైపున క్రిందిభాగమందు అతని వాహనము హంస చెక్కబడింది. నిలబడియున్న ఇచటి బ్రహ్మ విగ్రహము మహారాష్ట్రమందలి ఠానా జిల్లాలో గల సోపరలోని మధ్యముఖమునకు మాత్రమే పొడువైన గడ్డంను కలిగియున్న బ్రహ్మ ప్రతిమాశిల్పమును బోలియుండుట విశేషం[15].

కరీంనగర్‌లోని పాత శివాలయ ఆవరణలో మూడు అడుగుల ఎత్తున్న బ్రహ్మశిల్పమొకటి మూడు ముఖాలు చతుర్బాహువులతో దర్శనమిస్తుంది. బ్రహ్మ మకుటము, గ్రైవేయకములు, యజ్ఞోపవీతము, కటిబంధము, వనమాల ధరించి ఉన్నాడు. ఈ జిల్లాలో అనేక దేవాలయాలందు బ్రహ్మశిల్పములు కనిపిస్తాయి.

వేములవాడ కేదారేశ్వర దేవాలయ దక్షిణవైపు గోడపైన బ్రహ్మాండమైన బ్రహ్మరూపం

అందంగా చెక్కబడింది. అచటనే భీమేశ్వరాలయ అధిష్ఠానపు కంఠము నందున్న ఒక చట్రములో లింగోద్భవమునకు కుడివైపున క్రిందిభాగమున అంజలి ముద్రలో నిలబడి ఉన్న మూడు తలల బ్రహ్మ, ఎడమవైపున విష్ణువు చెక్కబడినారు. బెజ్జంకి నరసింహదేవాలయ స్తంభము ఉపరితలమందున్న శిల్పములో కూర్చొని ఉన్న శివునికిరువైపుల బ్రహ్మ, విష్ణువు కనిపిస్తారు. మంథనిలోని గౌతమేశ్వరాలయ గోడపై అందమైన బ్రహ్మశిల్పముంది. ఇదే దేవాలయ ద్వారముల తోరణములందు నటరాజుకు ఇరువైపుల నాట్యభంగిమలలో బ్రహ్మ, వినాయకుడు, విష్ణువు, కాళీదేవి అందంగా మలచబడినారు. అదే విధంగా చంద్రవెల్లి శివాలయములోని అంతరాళ ద్వారపుతోరణము నందు మరియు గొడిశాల త్రికూటాలయ ద్వారముల తోరణములందు నటరాజునకు ఒక వైపు బ్రహ్మ, కుమారస్వామి రెండవవైపు వినాయకుడు, విష్ణువు రమ్యంగా మలచబడినారు.

## 3. విష్ణువు

హిందూ మతంలోని ప్రధాన దైవాలైన త్రిమూర్తులలో విష్ణువు పోషకునిగాను రక్షకుని గాను భావింపబడు దైవము. బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు సృష్టిస్థితిలయ కారులుగా జగద్విఖ్యాతము. సాధారణంగా విష్ణువు శిల్పాలు స్థానక, ఆసన, శయన మూడు రూపాలలో ఉంటాయి. కరీంనగర్ జిల్లాలోని దేవాలయములందు వైష్ణవ ప్రతిమలు నరసింహ, కేశవ, అనంతశయన, అనంతపద్మనాభ, బలరామ, వేణుగోపాల, గోవర్ధన కృష్ణ, శ్రీరాముని రూపాలలో కనిపిస్తాయి.

కరీంనగర్ జిల్లాలో విష్ణువుకే అంకితం చేయబడిన ప్రత్యేక దేవాలయాలు తక్కువ. ధర్మపురి, బెజ్జంకి, సుందిల్ల మున్నగు ప్రాంతములలోని నరసింహ దేవాలయాలు, పొలాసలోని వేణుగోపాల, రామగుండం, నంచెర్లలలోని రామాలయములు ప్రత్యేక వైష్ణవాలయాలుగా పేర్కొనవచ్చు. కొన్ని శివాలయాలలో పౌరాణిక గాథల శిల్పములందు విష్ణువు కనిపిస్తాడు. ఉదాహరణకు మంథని గౌతమేశ్వరాలయపు గోడలపైన నరసింహస్వామి హిరణ్యకశపుని ఉదరము చీల్చి ప్రేగులు తీయుచున్న దృశ్యముంది. వేములవాడ, భీమేశ్వరాలయ అధిష్ఠానపు కంఠభాగమందు విష్ణువు దశావతారాలు కనబడుతాయి. శివాలయాలలో వైష్ణవ శిల్పములుండుట వలన శివకేశవులు అభేదమని, రెండు మతముల మధ్య సఖ్యత పెంపొందుననే భావము పూర్వీకులలో ఉండెనని భావింపవచ్చు. కొన్ని సందర్భాలలో త్రిమూర్తులలో బ్రహ్మకు బదులు సూర్యునికి చోటు కలిపించబడింది. రాయికల్ త్రికూటాలయము శివకేశవ సూర్యదేవరలకు అంకితం చేయబడడం దీనికి నిదర్శనం.

విష్ణువుకు సహస్రనామాలున్నాయి. వాటిలో చతుర్వింశతి అనగా ఇరువైనాలుగు నామాలు అత్యంత ప్రధానమైనవి. బ్రాహ్మణులు వారి దైనందిన పూజలో వీటిని పఠిస్తుంటారు.

విష్ణువు యొక్క చతుర్వింశతి రూపాలు మహామండలేశ్వరుడైన గంగాధరుడు అతని రాజధాని నగునూరు నందు ప్రతిష్ఠించెనని ప్రస్తుతము కరీంనగర్ జిల్లా కలెక్టర్ నివాస గృహమందున్న క్రీ.శ. 1171 నగునూరు శాసనము తెలుపుతుంది[16]. కాని నేడు ఆనాటి చతుర్వింశతి విష్ణువు రూపాలుగాని వైష్ణవాలయముగాని కానరావు. కేవలము శిథిలావస్థలో నున్న మంటపమొకటి నగునూరులో రెండు రమ్యమైన ఎత్తైన గరుడ స్తంభాల సమీపంలో నిలిచి ఉంది.

గుంటూరు జిల్లా కొండమోటు వద్ద లభ్యమైన క్రీ.శ. నాలుగవ శతాబ్దమునకు చెందిన పంచవీర ఫలకములో విష్ణువు అవతారమైన నరసింహుడు సింహరూపములో చిత్రీకరింపబడినాడు[17]. తరువాత కాలములో మానవాకృతికి ప్రాధాన్యత పెరిగింది. బాదామిలోను మరియు ఎల్లోరాలో రాష్ట్ర కూటుల కాలపు కేవల, స్థాన నరసింహ రూపాలు కనిపిస్తాయి. మధ్యయుగంలో మానవ శరీరం మరియు సింహపు తలతో నరసింహస్వామి రూపాలు చెక్కబడినాయి. నరసింహ విగ్రహాలు, ధర్మపురి, బెజ్జంకి, సుందిల్ల, వెల్లుల్ల, ఎల్గందల్, నందగిరికోట్ల, నాంపెల్లి, నల్లగొండ, బీర్‌పూర్, దుంపెట, శనిగరం, మేడిపెల్లి మున్నగుచోట్ల గల నరసింహదేవాలయాలలో దర్శనమిస్తాయి.

కరీంనగర్ నుండి వరంగల్‌నకు పోవు రహదారి ప్రక్కన కేశవపట్నం మండలంలోని కొత్తగట్టుపై నున్న పెద్ద గుండ్రాయిపై విష్ణువు మత్స్యరూపంలో లక్ష్మీ సమేతుడై చెక్కబడినాడు. ఇచటి మత్స్యగిరి స్వామి దేవాలయము సుప్రసిద్ధము. కాళేశ్వరంలోని ముక్తీశ్వరాలయం లోపల చుట్టూ ఉన్న నడవ (Corridor)లో 8' అడుగుల పొడువు గల నల్లగ్రానైట్ రాయితో మలచబడిన మత్స్యము విష్ణువు యొక్క మత్స్యావతారంగా పూజలందుకొంటుంది.

వేములవాడ కేదారేశ్వరాలయ ఉత్తరపు గోడపై సమభంగములో నిలిచి యున్న సుందర విష్ణురూపం చెక్కబడింది. నగునూరులో రెండు విష్ణువు విగ్రహాలున్నాయి. ఒకటి శ్రీధరుని రూపంలో ఉంది. రెండవ దాని క్రిందిచేతులు విరిగి పోవుట వలన అది కేశవరూపమో, వాసుదేవరూపమో చెప్పడం కష్టంగా ఉంది. ఈ రెండవ విగ్రహము వెనుకనున్న ప్రభామండలిలో దశావతారాలు చెక్కబడినాయి[18]. విష్ణువు విగ్రహాలు ముత్తారం, అంతకపేట, ఆరవెల్లి మున్నగు ప్రాంతములందున్నాయి. హుస్నాబాద్ మండలంలోని అంతకపేట విష్ణువు యొక్క మకరతోరణముపై దశావతారాలు చెక్కబడినాయి. శిల్పశాస్త్రములందు పేర్కొనబడినట్లుగా రాయికల్ త్రికూటాలయమునకు చెందిన కేశవుని విగ్రహము చతుర్భుజములతో దర్శనమిస్తుంది. పై వామహస్తములో చక్రము, దక్షిణ హస్తములో శంఖము, క్రింది కుడిచేతిలో పద్మము, ఎడమచేతిలో గద శిల్ప శాస్త్రములు నిర్దేశించినట్లుగా మలచబడినాయి.[19]

పడుకొని యున్న విష్ణువురూపాన్ని శయనమూర్తి అంటారు. చుట్టుకొని ఉన్న అనేక పడగలతో గూడిన పెద్దసర్పముపై పడుకొని ఉన్నట్లుగా విష్ణువు చిత్రీకరింపబడుతాడు. ఈ

సర్పమే ఆదిశేషుడు లేదా అనంతుడు. కావున అనంతునిపై శయనించు విష్ణువు అనంతశయనమూర్తిగా దర్శనిమిస్తాడు. అనంత శయనుని నాభి నుండి ఆవిర్భవించుకాడ చివరయందున్న పద్మములో కూర్చొనియున్న బ్రహ్మరూపం ఉంటుంది. అందుకే అనంత పద్మనాభుడనే పేరు గూడా ఉంది. ఈ ప్రతిమలో విష్ణువు పాదముల వద్ద లక్ష్మీదేవి కూర్చొని ఉంటుంది. వేములవాడ రాజరాజేశ్వర దేవాలయ ప్రాంగణములో అనంత పద్మనాభస్వామికై ప్రత్యేక దేవాలయముంది. కోటిలింగాల నుండి తెచ్చిన అందమైన అనంతశయన మూర్తి ప్రస్తుతము కరీంనగర్ మ్యూజియంలో ఉంది. జగిత్యాలకు సమీపమున శ్రీరాంసాగర్ ప్రధానకాలువకు ప్రక్కనున్న రాజారం గుట్టపై గల ఒక గుండ్రాయిపై చెక్కిన శేషశయన రూపం దివ్యంగా ఉంది.

బలరాముని చిహ్నము మరియు ఆయుధము హలము గనుక అతడు హలధరునిగా పిలువబడుతాడు. బలరాముని విగ్రహాలు ధర్మపురి పాత నరసింహస్వామి ముఖమంటపంలో మరియు నంచెర్ల దేవాలయంలో ఉన్నాయి. ధర్మపురికి చెందిన శ్రీ కృష్ణవిగ్రహమొకటి కరీంనగర్ మ్యూజియంలో ఉంది. శ్రీకృష్ణ విగ్రహాలు కోటిలింగాల, అంతకపేట, నంచెర్ల మున్నగు దేవాలయాలలో దర్శనమిస్తాయి.

12, 13 శతాబ్దాల నుండి శ్రీరామచంద్రుని ఆరాధన ఆరంభమైందని చారిత్రకుల అభిప్రాయం. శ్రీరామ దేవాలయాలు నంచెర్ల, రామగుండం, ఇల్లంతకుంట, కాశీపేటలలో ఉన్నాయి. మలచుకొని యున్న ఎడమకాలుపై సీతాదేవితో కూర్చొనియున్న శ్రీరాముని విగ్రహాలు నంచెర్ల, గూడెం, కాశీపేట దేవాలయాల్లో దర్శనమిస్తాయి. వీటిలో శ్రీరాముని దక్షిణాహస్తము అభయముద్రలో నుండగా వామహస్తం సీతాదేవి నడుముచుట్టూ చాచి ఉంటుంది. ఈ విగ్రహముల వెనుకగల మకరతోరణములపై దశావతారాలు చెక్కబడినాయి.

## 4. శివుడు

పరమశివుడు లింగరూపముననూ, వివిధ ఆకృతులలోను పూజింపబడుతున్నాడు. సర్వసాధారణమైంది లింగరూపము. అనాది నుండియే శైవులు మందిరములందు శివలింగమును ప్రతిష్ఠించారు. దేవాలయము చుట్టూ ఆ దైవము యొక్క గాథలు, వివిధ మానవాకృతులు గోడలపై చెక్కబడినాయి. తరువాత కాలంలో వీరశైవులు తమ ఆరాధ్యదైవమైన శివుని ఇతర రూపములలో గాకుండా లింగరూపంలోనే పూజించుటకు ప్రాధాన్యత నొసంగారు[20].

శివుడు మహాలింగరూపమని శక్తి భగస్వరూపిణియని భావిస్తారు[21]. వారి కలయికతో సృష్టి నిర్మాణం జరుగుతుంది. సృష్టి నిర్మాణానికి కారణభూతమైన రెండు ప్రధానాంశములు శివుడు శక్తి, పురుషుడు ప్రకృతి, తండ్రి తల్లి, ఆధునిక శాస్త్రవేత్తల దృష్టిలో శక్తి వస్తువులకు (Energy and matter) ప్రతీకలు లింగము మరియు యోనిరూపంలో ఉన్న పానవట్టము. గత రెండువేల సంవత్సరాల నుండి పితృమాతృత్వములకు ప్రతీకలుగా నున్న పానవట్టముపై నిలిచిన

లింగము యొక్క పూజ జరుగుచునే ఉంది[22]. పానవట్టము ప్రకృతి స్వరూపమని లింగము మహేశ్వరుని రూపమని లింగపురాణము తెలుపుతుంది[23].

ప్రధాన ప్రత్యక్షదైవమైన పరమశివుని నుండియే సర్వము ఆవిర్భవించి లయం అవుతుందను భావన ప్రబలంగా ఉంది. శివుడు శక్తి స్వరూపిణితో కలిసి ఈ విశ్వాన్ని సృష్టించి లయం చేసుకొంటాడు. అవసరాన్ని బట్టి శివుడు వివిధ రూపాలలో అవతరిస్తాడు. త్రిపురాంతక, భైరవ మున్నగు రూపాలలో శివుని విగ్రహాలు కనిపిస్తాయి. కాలాముఖుల రాకతో ఆంధ్రప్రదేశ్ నందు తాంత్రిక లక్షణాలతో శివుని విగ్రహాలు రూపొందినాయి[24].

కరీంనగర్ జిల్లాలో ప్రధాన దేవాలయాలన్నీ శివాలయాలే గనుక వేర్వేరు పరిమాణములలో అనేక శివలింగాలు కనిపిస్తాయి. కాకతీయుల కాలములో భక్తులనేకులు వారి వ్యక్తిగత పేర్లతో శివలింగాలను ప్రతిష్ఠించారు. ఉదాహరణకు కాకతి ప్రతాపరుద్రదేవుని కాలపు తేదీ లేని చిట్టాపూర్ శాసనం బైరిశెట్టి అనునతడు త్రికూటాలయము నిర్మించి అతని పేరట బైరేశ్వర లింగమునొక దానిని ప్రతిష్ఠించినట్లు తెలుపుతుంది[25].

కాళేశ్వరం దేవాలయావరణలో చక్కటి చతుర్ముఖ లింగం ఉంది. లింగంనకు నాల్గు వైపుల మానవాకృతిలో శివుని నాల్గుముఖాలు అందంగా చెక్కబడినాయి. ఈ నాలుగు ముఖాలు ఒకే రీతిలో ఉన్నాయి. రెండు భుజాలతో నున్న ఈ ముఖములు జటామకుటముతో కనిపిస్తాయి. ఇలాంటి చతుర్ముఖ లింగం ఒకటి ఓరుగల్లు కోటలో దర్శనమిస్తుంది. వరంగల్ చతుర్ముఖ లింగ శిల్పమందు నాగహారములుండగా అవి కాళేశ్వర శిల్పమందు కానరావు[26].

రాయికల్ త్రికూటాలయమందు పంచముఖలింగముంది. ఇది చాలా అరుదైన శిల్పం. ఇది మానవాకృతిలో లేదు. ఒకే పానవట్టము పైన నాలుగు మూలలందు నాలుగు లింగాలు, వాటిపైన మధ్యలో ఐదో లింగం ఉంది. ఇలాంటి పంచముఖలింగం కాశీలో తప్ప మరెచట లేదని లోకవాడుక.

లింగోద్భవమూర్తి శివుని వేరొక రూపము. వేములవాడ భీమేశ్వరాలయ అధిష్ఠానపు కంఠము నందు గల ఒక విభాగములో వర్తుల స్తంభాకారంలో నున్న లింగోద్భవమూర్తికి క్రింది భాగమున కుడివైపు బ్రహ్మ ఎడమవైపు విష్ణువు అంజలిముద్రలో కనిపిస్తారు. ఆగమశాస్త్రాలు సూచించురీతిలో ఈ శిల్పం చెక్కబడింది[27].

అందమైన రెండు ఉమామహేశ్వర ప్రతిమాశిల్పములు కరీంనగర్ జిల్లాలో ఒకటి ధర్మపురి నందు రెండవది నగునూరు నందు దర్శనమిస్తాయి. వీటిలో కూర్చొనిఉన్న శివుని ఎడమకాలు అడ్డముగా మలచుకొని, కుడికాలు మోకాలు వద్ద వంగి నిలువుగా ఉన్నాయి. ఉమ శివుని ఎడమవైపు ఒడిలో కూర్చొని ఉంటుంది. శివుని పైచేతులలో త్రిశూలము డమరుకములుండగా క్రింది దక్షిణహస్తము అభయముద్రలోను, వామహస్తము ఉమాదేవి

నడుముచుట్టూ నిలిపిఉంది. దేవి ఉమ గూడా తనకుడి చేతిని శివుని నడుముపై నిలిపి ఎడమచేతిలో ఫలములను కలిగి ఉంది. నగునూరు ఉమామహేశ్వర శిల్పంలో శివునికి కుడివైపున వినాయకుడు గూడా మలచబడినాడు.

గొడిశాల త్రికూటాలయ ద్వారముల తోరణములందు శివుని నటరాజరూపం దివ్యంగా ఉంది. పదిహస్తములతో నటరాజు బోర్లపడుకొని యున్న అపస్మార పురుషుని వీపుపైన ఆనందంగా నాట్యం చేస్తూ కనిపిస్తాడు. అతనికి ఎడమవైపున వినాయకుడు, విష్ణువు కుడివైపున బ్రహ్మ, కుమారస్వామి మలచబడినారు. ఇది కాకతీయ శిల్పుల ఉలి నుండి వెలువడిన అద్భుతశిల్పం. ఇలాంటి నటరాజ శిల్పాలు ఎనిమిది చేతులతో మంథని, చంద్రవెల్లి దేవాలయాల ద్వారముల తోరణములందు దర్శనమిస్తాయి. అలంపురంలోని నటరాజ శిల్పములందు అపస్మార పురుషుడు కానరాడు. కాని కళ్యాణి చాళుక్యుల, కాకతీయుల శిల్పములందు నటరాజు అపస్మారపురుషుని వీపుపై దివ్యంగా నాట్యం చేస్తూ ఉంటాడు.

చాళుక్యుల తొలికాలము నుండియే ఆంధ్రదేశంలో శివుని భయంకర భైరవరూపం ఆరాధింపబడుతుంది. చతుర్బాహువుల భైరవుని పైహస్తాల్లో త్రిశూల దమరుకములు, క్రింది దక్షిణ హస్తంలో ఖడ్గము వామహస్తంలో కపాలము ఉంటాయి. తొలి భైరవ విగ్రహము లందు శునకము కానరాదు. కాని తరువాత కాలపు శిల్పములందు భైరవుని ఎడమచేతి యందున్న ఖండించిన శిరస్సు నుండి రాలుచున్న రక్తపు చుక్కలను ఆస్వాదించుటకై ఎగురుచున్న శునకము కనిపిస్తుంది. భైరవ విగ్రహాలు నగ్నరూపంలో ఉంటాయి. బెజ్జంకి, నగునూరు గుట్టలపై నున్న గుండ్రాళ్లపై చక్కటి భైరవ రూపాలు చెక్కబడినాయి. భైరవ శిల్పమున్న ఎత్తైన శిలాఫలకములు గొడిశాల, శనిగరం, వాల్గొండలందున్నాయి. మధ్యమపరిమాణము గల భైరవ విగ్రహాలు వేములవాడ, జమ్మికుంట, పొలాస, మల్లన్నపేట, చిలువాకోదూరు, కోహెడ, పెద్దపెల్లి, తుమ్మెనాల మొదలగు చోట్ల దర్శనమిస్తాయి.

## 5. సూర్యుడు

వేదాలుస్తుతించు, కండ్ల ముందు కనిపించు ప్రత్యక్ష సనాతన దైవము సూర్యభగవానుడు. అంధత్వ నిర్మూలనకు, కుష్టువ్యాధి నివారణకు అనాదినుండి సౌరపూజ జరుగుతుంది. శ్రీకృష్ణభగవానుని పుత్రులలో ఒకడైన సాంబకుమారుడు సూర్యుని పూజించి కుష్టురోగము నుండి తరించినాడని, అతడే శకద్వీపము నుండి సౌరపూజారులను ఆహ్వానించి సౌరపూజ ప్రవేశపెట్టినాడని పురాణేతిహాసాలతో పాటు 12వ శతాబ్దపు రచనలు పేర్కొంటున్నాయి[28]. క్రీ.పూ. రెండవ శతాబ్దమునకు చెందిన శాతవాహనుల కాలపు సూర్యశిల్పమొకటి భజ గుహలో దర్శనమిస్తుంది. ఇరువైపుల దేవేరులతో గూడిన సూర్యుడు రథాన్ని నడుపుచున్నాడు. ఇది దక్కన్‌లోని తొల్దొలుత సూర్యశిల్పము[29]. ఉత్తర భారతదేశంలో కుషాణులు పూజించిన మానవరూపంలో

ఉన్న సూర్యుడు కాలిజోళ్లు ధరించి ఉన్నాడు. కాని దక్షిణ భారతంలోని తొలిసూర్య శిల్పములందు నగ్నపాదాలే కనిపిస్తాయి. క్రీ.శ. ఏడవశతాబ్దానికి చెందిన సూర్యప్రతిమాశిల్పమొకటి రేణిగుంట సమీపమందున్న గుడిమల్లాం పరశురామేశ్వర దేవాలయంలో ఉంది[30]. ఇందులో నగ్నపాదాలతో రెండు చేతుల సూర్యుడు సమభంగములో నిలబడియున్నాడు. అతని భుజముల వరకు పైకెత్తిన రెండు హస్తములందు పద్మపు మొగ్గలతో కూడిన కాడలున్నాయి.

జమ్మూకాశ్మీర్ రాష్ట్రంలోని అనంత్‌నాగ్‌జిల్లా యందు మతన్ లేదా మార్తాండ్ [31] వద్ద క్రీ.శ.ఎనిమిదవ శతాబ్దానికి చెందిన సూర్య దేవాలయ శిథిలాలు, క్రీ.శ. 13వ శతాబ్దానికి చెందిన ఒరిస్సాలోని కోనార్క్ శిథిల సూర్య దేవాలయము మరియు దేశంలోని తదితర ప్రాంతాల దేవాలయాలను బట్టి మధ్యయుగంలో సౌరపూజ ప్రబలంగా వ్యాప్తి జెందినట్లు తెలుస్తుంది[32]. అత్యంత దక్షిణాదిలో తొలియుగపు సూర్యదేవాలయాలు అరుదు. కాని పాత మద్రాస్ ప్రెసిడెన్సీలోని ఉత్తరభాగమందు క్రీ.శ. 8వ, 9వ శతాబ్దాల కాలమందలి శాసనములందు ఆదిత్యగృహాలు పేర్కొనబడినాయి[33]. గుంటూరు జిల్లాలోని చేజెర్ల కపోతేశ్వరాలయావరణలో సున్నపురాతి పై మలచబడిన సూర్య విగ్రహము ఆంధ్రప్రాంతంలోని తొలిశిల్పము[34]. అలాంటి తొలిశిల్పమే వేరొకటి కడప జిల్లాలోని చిలమకూరు ఆగస్త్యేశ్వరాలయంలో ఉంది[35]. చాళుక్యుల, కాకతీయుల కాలంలో తెలంగాణ మందు సౌరపూజ జనాదరణలో ఉండింది. విశేషించి కరీంనగర్ జిల్లాలో సౌరపూజ ప్రజాదరణలో ఉండెననుటకు ఈ ప్రాంతమందు అనేక చోట్ల లభ్యమైన సూర్యవిగ్రహములే నిదర్శనాలుగా ఉన్నాయి. రెండవ అరికేసరి కాలంలో అతని తంత్రపాలుడైన పెద్దనార్యుడు సూర్యదేవరకై ఆదిత్యగృహము నిర్మించినట్లు వేములవాడ శాసనం తెలుపుతుంది[36]. ప్రస్తుతమీ ఆదిత్యగృహం కానరాదు. కాని వేములవాడలో తొలికాలపు రెండు సూర్యవిగ్రహాలున్నాయి. ఒకటి రాజరాజేశ్వర దేవాలయ ప్రాంగణములో గోపురము ద్వారాలోనికి ప్రవేశించగానే ఎడమవైపు గండదీపస్తంభం చెంత నిలుపబడింది. రెండవది భీమేశ్వరాలయం వరండాలో దర్శనమిస్తుంది. ఈ రెండు ప్రతిమాశిల్పములందు సూర్యుడు ఆగమశాస్త్రములు తెలుపునట్లుగా సమభంగములో నిలబడి అతని రెండు చేతులను భుజముల వరకు పైకెత్తి పద్మపు మొగ్గలతో కూడిన కాడలను పట్టుకొని ఉన్నాడు. నల్గొండ జిల్లాలోని కొలనుపాక మ్యూజియం [37], మహబూబ్‌నగర్ జిల్లాలోని అలంపురం మ్యూజియం [38] లందున్న సూర్య విగ్రహములను ఇచటి సూర్యశిల్పములు బోలి ఉన్నాయి.

కరీంనగర్ జిల్లాలోని శాసనాలందు సూర్యదేవుని ప్రసక్తి ఉంది. కళ్యాణి చాళుక్య చక్రవర్తి ఆహవమల్ల దేవుని కాలపు క్రీ.శ. 992 చొప్పదండి శాసనమందు మార్తాండ దేవర ప్రసక్తి ఉంది[39]. ఇదే చక్రవర్తి కాలపు క్రీ.శ. 995 జమ్మికుంట శాసనము ఆదిత్యగృహమును గూర్చి పేర్కొంటుంది[40]. ఈశాసనము నాగియగావుండు జమ్మికుంట ఆదిత్యగృహమునకు రెండు రాటణాలు మరియు భూదానములొసంగినట్లు తెలుపుతుంది. కాని జమ్మికుంట మరియు

చొప్పదండి గ్రామములందు సూర్యశిల్పములు నేడు కానరావు.

కోరుట్లలోని మహాదేవాలయ మరియు కాలువగడ్డకు పడమట నున్న అంజనేయ ఆలయావరణములందు, రాయికల్, భీమన్నగుడి వద్ద, పొలాస పౌలస్త్యేశ్వరాలయావరణలో, చిలువాకోడూరు దేవాలయ దక్షిణ గర్భగృహమందు, పోత్గల్ వైష్ణవాలయ మంటపమందు మరియు ఎల్కతుర్తి శివాలయం ముందట తొలి రూపములో ఉన్న సూర్యవిగ్రహాలు దర్శనమిస్తాయి. ఈ శిల్పములందు రెండు చేతులు గల సూర్యుడు సమభంగములో నిలబడి చేతులను భుజముల వరకు పైకెత్తి పద్మపు మొగ్గల కాడలను పట్టుకొని ఉన్నాడు. ఈ ప్రతిమాశిల్పాలు ఒకటి నుండి రెండడుగుల ఎత్తు వరకుంటాయి.

మధ్యయుగంలోని త్రికూటాలయాలలోని మూడు గర్భగృహాలను శివుడు, విష్ణువు, సూర్యునికి అంకితం చేయడం సర్వసాధారణం. త్రిమూర్తులలో బ్రహ్మకు బదులు సూర్యుడు స్థానము నాక్రమించాడు. హనుమకొండలోని రుద్రేశ్వర త్రికూటాలయం(వేయిస్తంభాలగుడి) లో వలె రాయికల్ త్రికూటాలయంలోని తూర్పు గర్భగృహం సూర్యునికి అంకితం చేయబడింది.

నగునూరు బస్‌స్టాండ్ మరియు గ్రామము మధ్యలో నున్న ఒక గుండ్రాయిపై తొలి కళారీతులలో సూర్యశిల్పం చెక్కబడింది. అదే నగునూరులో ప్రభుత్వ రహదారి ప్రక్కనున్న శిథిల దేవాలయగోడ బయటి భాగమందు మరొక సూర్యశిల్పము దర్శనమిస్తుంది[41]. మంథనిలోని భిక్షేశ్వరాలయం సమీపంలో గృహ నిర్మాణానికై పునాదులు తీయుచుండగా చక్కటి నల్లరాతి సూర్య విగ్రహం బయల్పడింది[42].

కాళేశ్వరంలో కాకతీయుల శిల్పకళారీతిలో ఆభరణ భారంతో నిగనిగలాడు నునుపైన 4'-6" ఎత్తున్న నల్లసరపురాతి సూర్య విగ్రహము మకరతోరణంతో బహురమ్యంగా ఉంది. పీఠముపైన ఏడుగుర్రాలున్నాయి. కాకతీయుల పాలనానంతరం హరిహర ఆరాధాన పెరిగింది. సౌరపూజ విష్ణు పూజలో అంతర్లీనమైంది. నేడు సూర్యుడు కేవలం ఒక గ్రహంగానే ఆరాధింపబడుతున్నాడు[43].

## 6. దేవి

కరీంనగర్ జిల్లాలో చరిత్ర పూర్వయుగంలోనే శక్తి ఆరాధన జరుగుచుండేది. పెద్దబొంకూరు, ధూళికట్ట త్రవ్వకాలలో ప్రాచీన మాతృదేవతారూపాలు బయల్పడినాయి[44]. ధూళికట్ట త్రవ్వకాల అడుగు పొరలలో క్రీ.పూ. 2వ, 3వ శతాబ్దికి చెందిన కంచు మాతృదేవత శిశువును పట్టుకొని ఉన్న విగ్రహం బయల్పడింది. శిశువుతో గూడిన ఈ తల్లి ప్రతిమ సంతానసాఫల్య దేవతగా ఆరాధింపబడింది[45].

మధ్యయుగం వరకు మాతృదేవతారాధన అమలులో ఉండింది. వేములవాడ

భీమేశ్వరాలయము ముందున్న వేదిక అధిష్ఠానపు కంఠ భాగమందు చిన్న చిన్న గడులలో మాతృదేవతా రూపాలు చెక్కబడినాయి. ఈ దేవతలు కూర్చొని తమ కాళ్లను వెడల్పుగా తెరచిన నగ్నరూపంలో కనిపిస్తారు. జననేంద్రియం స్పష్టంగా అగబడుతుంది. ఇలాంటి రూపాలే కేదారేశ్వరాలయం, బెజ్జంకిలోని నరసింహాలయములందు కనిపిస్తాయి. వీటిని బట్టి ఆనాటి ప్రజలు సంతానసాఫల్య పూజలు చేసేవారని తెలుస్తుంది. ఆంధ్రప్రాంతంలో పిల్లలు లేని తల్లులు నేటికి ఈ మాతృదేవతా పూజలు చేస్తారు.

ఆంధ్రదేశములో బాదామిచాళుక్యుల కాలమందు శక్తి ఆరాధన ప్రాధాన్యత పెరిగింది. వారు సప్తమాతృకలను బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి మరియు చాముండ దేవతలనారాధించారు. అంధకాసురుని వధించుటలో ఈ ఏడుగురు దేవతలు శివునికి సహాయ పడినారని పురాణాలు తెలుపుతున్నాయి. సప్తమాతృకలు ఆత్మజ్ఞానాభివృద్ధికి తోడ్పడునని అజ్ఞానాంధకారమును దూరం చేయునని వేదాంతపరమైన గూడార్థము[46]. అంధకాసురుని రూపమగు అజ్ఞానమనే అంధకారమును దూరం చేయునని ద్యోతకమౌతుంది. సాధారణంగా ఒక పొడుగాటి పెద్ద శిలాఫలకము పై సప్తమాతృకలు చెక్కబడుతాయి. వీరి చివరలందు ఒక వైపు వినాయకుడు రెండో వైపు వీరభద్రుడు ఉంటారు. రూపమందానము ననుసరించి మొదట వీరభద్రుడు, నడుమ ఏడుగురు దేవతలు, చివరకు వినాయకుడుంటారు[47].

కరీంనగర్ జిల్లాలో సప్తమాతృకల ఆరాధన సర్వవ్యాప్తమై ఉండెనని పలుచోట్ల దర్శనమిచ్చు సప్తమాతృకల ఫలకములను బట్టి తెలుస్తుంది. తొలికాలపు ద్విహస్తములతో నున్న సప్తమాతృకల ఫలకమొకటి పొలాస పులస్త్యేశ్వరాలయ మంటపమందుంది. ఈ దేవతల ఆసనముల క్రింద వారి వాహనములు, చిహ్నములు లేవు. తరువాతి కాలపు ఫలకములలో వలె ఇచట చివరలందు వీరభద్రుడు, వినాయకుడు లేరు. ఇది చాలా ప్రాచీనమైన తొలియుగపు సప్తమాతృకాఫలకము. ఎందుకనగా ఇది హైదరాబాద్ స్టేట్ మ్యూజియంలోని ఏలేశ్వరం పెవిలియన్‌లో నున్న బాదామి చాళుక్యుల కాలపు ఫలకమును బోలి ఉంది[48]. ఇదే పొలాసలో ఇటీవల పులస్త్యేశ్వరాలయ ఆవరణమందు త్రవ్వ చుండగా తరువాతి కాలపు నాలుగు చేతులతో నున్న సప్తమాతృకల శిథిల శిలాఫలకమొకటి బయల్పడింది. ఇందు బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి వాహనములతో ఉన్నారు. మిగిలిన ఇరువురు మాతృకల శిథిలఫలకము లభించలేదు.

వీరభద్రుడు, వినాయకులతో గూడిన సప్తమాతృకా శిలాఫలకములు వేములవాడ భీమేశ్వరాలయం, ధర్మపురి రామలింగేశ్వరాలయం, కటుకూరు త్రికూటాలయం మున్నగుచోట్ల దర్శనమిస్తాయి. ఒక చివరలో గణపతి ఉన్న సప్తమాతృకాఫలకములు కరీంనగర్ శివాలయం, వేములవాడ భీమేశ్వరాలయమందు ఉన్నాయి. వీటిలో వేరొక చివరలో వీరభద్రుడు కానరాడు. శిథిలమైన సప్తమాతృకా ఫలకముల ముక్కలు కోరుట్ల, శనిగరం, పొట్లపెల్లి, పొలాస, మల్లన్నపేట,

అల్గునూరు, చిలువాకోదూరు, నంది మేడారం, రాయికల్ మున్నగుచోట్ల గల దేవాలయాలందు పడి ఉన్నాయి.

కరీంనగర్ జిల్లాలో ఆరాధింపబడిన జనప్రియమైన వేరొక దేవత మహిషాసురమర్దని. మహిషాసురునితో పోరాడుతూ వివిధ భంగిమలలో ఈ దేవతా విగ్రహాలు కనిపిస్తాయి. మహిషాసురుడు మానవ, జంతురూపాలలో కనిపిస్తాడు. కొన్ని చోట్ల తెగిన జంతువు తల నుండి మహిషాసురుడు మానవరూపంలో ఆవిర్భవిస్తున్నట్లుగా కనిపిస్తాడు. వేములవాడ భీమేశ్వరాలయ అంతరాళ భాగమందు ఉత్తరదిశలో నున్న కిటికీలో ఎనిమిది భుజాల మహిషాసురమర్దని అందంగా మలచబడింది. శిల్పం రీత్యా ఇది రాష్ట్రకూటుల కాలపు ఎల్లోరా, అలంపురంలలోని విగ్రహాలను పోలి ఉంది[49]. అష్టభుజాల మహిషాసుర మర్దని శిల్పాలు నగునూరు, పొలాస, కరీంనగరములందు కనిపిస్తాయి. చేతులు విరిగిపోయిన విగ్రహాలు వేములవాడ కేదారేశ్వరాలయం, ధర్మపురి రామలింగేశ్వరాలయాలందున్నాయి. శిథిలమైన మహిషాసురమర్దని విగ్రహపు ముక్కలు కోరుట్ల, శనిగరం, రాయికల్, చెల్పూర్‌లందు కనిపిస్తాయి.

కూర్చొని ఉన్న చతుర్భుజముల దేవీ విగ్రహములనేకములు జిల్లా అంతట ఉన్నాయి. పై చేతులలో త్రిశూలము, డమరుకము, క్రింది చేతులలో ఖడ్గము, కపాలము ఉంటాయి. చేతులందున్న చిహ్నములను బట్టి చాముండ దేవత అనిపిస్తుంది. కాని ఈ దేవి ఆసనము క్రింద నక్క లేదా శవము చిహ్నము కానరాదు. కొన్ని చోట్ల దేవీ విగ్రహాలు రెండే చేతులతో ఉన్నాయి. కుడిచేతిలో ఖడ్గము, ఎడమ చేతిలో నెత్తుటి గిన్నె ఉంటుంది. కాకతీయుల కాలంలో ఈ చిహ్నములు గల దేవీ రూపాలు సర్వత్రా ఆరాధింపబడినాయి. ఉత్తర భారతంలో చాముండ దేవత కృశించి చిక్కిపోయిన రూపంలో భయంకరంగా ఉంటుంది. కాని దక్షిణభారతంలో ఈ శిల్పం సాధారణ స్త్రీ రూపంలో ప్రశాంతంగా ఉంటుంది[50]. కరీంనగర్ జిల్లాలో ఈ దేవీ విగ్రహాలు ప్రసన్న ప్రశాంత వదనములతో కనిపిస్తాయి. ఇలాంటి విగ్రహాలు పొలాస, రాయికల్, నగునూరు, ముల్కనూరు, వెల్లుల్ల, ఆరవెల్లి, హుస్నాబాద్ మండలంలోని తోటపెల్లి మున్నగుచోట్ల దర్శనమిస్తాయి.

కరీంనగర్ మ్యూజియం ఆవరణలో చొప్పదండి నుండి తెచ్చిన చతుర్భుజముల చాముండ విగ్రహముంది. పైచేతులందు డమరుకము, ఖట్వాంగము, క్రింది చేతులలో ఖడ్గము, కపాలము ఉన్నాయి. ఆమె మెడలో కపాలముల హారముంది. కరీంనగర్ జిల్లాకు చెందిన చాళుక్యుల కాలపు రెండు పెద్ద చాముండ దేవతా విగ్రహాలు గోల్కొండలోని ఖజానా బిల్డింగ్ మ్యూజియంలో ఉన్నాయి[51].

దక్షిణ భారత విగ్రహాలలో అన్నపూర్ణాదేవి అరుదైన శిల్పం. మానవులకు అన్నమునందించు అన్నపూర్ణ విశ్వేశ్వరుడైన శివుని అర్ధాంగి. కాళేశ్వరంలోని రెండు చేతుల

అన్నపూర్ణాదేవి శిల్పంలో అన్నం వడ్డించడానికి ఎడమ చేతితో వండిన కుండను (ప్రసాదపాత్ర) పట్టుకొని, కుడిచేతిలో నున్న తెడ్డు లేదా గరిటతో అన్నం బయటకు తీస్తున్నట్లుంది. అదే చోట నాలుగు చేతుల అన్నపూర్ణాదేవి చిన్న విగ్రహముంది. పై చేతులలో త్రిశూలము, డమరుకములుండగా క్రింది చేతులతో వండిన కుండను పట్టుకొని దాని నుండి తెడ్డుతో అన్నం బయటకు తీయడానికి సిద్ధంగా ఉంది. ఇది తరువాతి కాలపు విగ్రహం.

నాలుగు చేతులు గల అన్నపూర్ణాదేవి పెద్ద విగ్రహమొకటి పొలాస చెఱువు కట్టపై ఉంది. పెద్దశిలాఫలకముపై చెక్కబడిన ఈ శిల్పం బహురమ్యంగా దర్శనమిస్తుంది. జాబితాపూర్, చెల్పూర్, భూషణ్‌రావుపేటలందు గూడా అన్నపూర్ణ విగ్రహాలున్నాయి.

సురులు, అసురులు అమృతమునకై జరిపిన క్షీరసాగర మథనంలో విష్ణుపత్ని లక్ష్మీదేవి ఆవిర్భవించిందని పురాణాలు తెలుపుతున్నాయి. దేశంలోని ఇతర ప్రాంతములవలె కరీంనగర్ జిల్లాలోని దేవాలయాల ద్వారముల లలాటములందు గజలక్ష్మి చెక్కబడింది. మధ్యయుగపు శిల్పములందు లక్ష్మీదేవి కిరువైపుల ఉన్న ఏనుగులు వాటి తొండముల చివరలందున్న చెంబులతో దేవిపై నీరు పోస్తుంటాయి.

చదువుల తల్లి, బ్రహ్మదేవుని భార్య మాతా సరస్వతి విగ్రహమొకటి నాలుగు చేతులతో కరీంనగర్ పాత శివాలయావరణలో దర్శనమిస్తుంది. పెద్దగా చెక్కబడిన హంసవాహనంపై దేవి స్వారీ చేయుచున్నట్లు దివ్యంగా ఉంది.

మధ్యయుగంలో శక్తి ఆరాధన పెరిగి అనేక దేవీరూపాలు ఆవిర్భవించినాయి. వివిధ ప్రాంతాలలో వేర్వేరు పేర్లతో దేవి ఆరాధింపబడింది. కాకతి, ఏకవీర, గంగమ్మ, పోలేరమ్మ, ఇరుకలమ్మ, ఎల్లమ్మ, నాయకురాలు, మైసమ్మ, పోచమ్మ మున్నగు పేర్లతో శక్తి ఆరాధనప్రధానంగా యాదవ, గొల్ల, కురుమ మున్నగు జాతుల వారిచే ఆంధ్రదేశమంతటా జరుగుతూనే ఉంది[52].

## 7. జైన శిల్పాలు

మధ్యయుగం తొలిదశ నుండే జైనమతము ప్రబలంగా వ్యాప్తిలో ఉంది. ఒక్క కరీంనగర్ జిల్లాలోనే వేములవాడ, గంగాధర, రేపాక, శనిగరం, పొట్లపెల్లి, కోరుట్ల, పొలాస, కాళేశ్వరం, నగునూరు, నాంపెల్లి, ఎల్గేడు, ముల్కనూరు, తంగల్లపెల్లి, కరీంనగర్ మున్నగుచోట్ల అనేక జైన శిల్పాలు మరియు కొన్ని శాసనాలు దర్శనమిస్తాయి[53].

జైనమత ప్రాబల్యము గల ప్రదేశము వేములవాడ. అచటి దేవాలయాలన్నింటిలో దాదాపు ఒక డజన్ జైన తీర్థంకరుల విగ్రహాలున్నాయి. ప్రస్తుతము వేములవాడలో ఐదు పార్శ్వనాథవిగ్రహాలు, మూడు వర్ధమాన, ఒక గోమటేశ్వర ప్రతిమాశిల్పాలు దర్శనమిస్తాయి. ఇంకొక నాలుగు జైన విగ్రహాల క్రింది భాగమున చిహ్నాములు లేనందున అవి ఏ తీర్థంకరులవో

తెలియుట లేదు. ఈ జైన విగ్రహములన్నియు రాష్ట్రకూటుల మరియు కళ్యాణి చాళుక్యుల కాలమునకు చెందినవి[54].

వేములవాడలోని జైన చౌముఖాలు, చౌవ్వీస తీర్థంకరుల ప్రతిమాశిల్పాలు అత్యంత ఆసక్తి కరమైనవి. ఇలాంటి శిల్పములిచట నాలుగుండుట వలన రాష్ట్రకూటుల సామంతులైన వేములవాడ చాళుక్యుల కాలంలో వేములవాడ గొప్ప జైన కేంద్రమై ఉండెనని తెలుస్తుంది. కడప జిల్లాలోని దానవులపాడు చౌముఖము వలె గాకుండా వేములవాడలోని చౌముఖాలు ఎక్కువ ఎత్తు, తక్కువ వెడల్పు కలిగి ఉన్నాయి. ఈ చౌముఖాలను పానవట్టము పై నిలిపి అభిషేకాలకు ఉపయోగించేవారు. జైన చౌముఖములను సర్వతో భద్రప్రతిమలను చెక్కేడి తొలి సంప్రదాయం మధుర, ఎల్లోర తదితర ప్రాంతాలలో ఉండేది[55]. ఈ సంప్రదాయం కరీంనగర్ జిల్లాలో వేములవాడ చాళుక్యుల కాలంలో ప్రవేశపెట్టబడిందని ఇచటి చౌముఖ శిల్పములను బట్టి విదితమవుతుంది.

చౌవీస తీర్థంకరుల ప్రతిమా శిల్పమందు ఒక్కొక్క ప్రక్కలో అరుగురు చొప్పున నాలుగు ప్రక్కలందు 24 గురు తీర్థంకరులు చెక్కబడినారు. ప్రస్తుతమీ చౌముఖాలు భీమేశ్వరాలయ ఆవరణమందు ఉన్నాయి.

గంగాధర సమీపమున బొమ్మలగుట్టపై చదునైన ఉపరితలము గల ఒక పెద్ద గుండ్రాయిపై వృషభుని యక్షిణి చక్రేశ్వరి మరియు ఆద్యంత తీర్థంకరులగు వృషభుడు, వర్ధమానుడు బహురమ్యంగా మలచబడినారు. ఈ శిల్పముల క్రింది భాగమందు క్రీ.శ. 945కు చెందిన శాసనముంది[56].

జైన తీర్థంకరుల ప్రతిమాశిల్పములు పద్మాసనములో ఉంటాయి, నిలబడి ఉంటాయి. కాయోత్సర్గ రీతిలో నిలబడి ఉన్న నగ్న జైన విగ్రహాలలో యౌవ్వనము ఉట్టిపడుతుంది. మోకాళ్లనంటు వరకుండు పొడువైన చేతులు, పొడుగాటి చెవులుంటాయి. గంగాధర, శనిగరం, నాంపెల్లి, నగునూరు లోని చిన్నగుట్టలపై నున్న పెద్ద గుండ్రాళ్లపై నిలబడి ఉన్న జైన విగ్రహాలు చెక్కబడినాయి. కాయోత్సర్గ రీతిలో నిలబడి ఉన్న పార్శ్వనాథ విగ్రహాల వెనుక మెలికలు తిరిగిన సర్పమును చెక్కు సంప్రదాయము క్రీ.శ. తొమ్మిదవ శతాబ్దిలో వేములవాడ శిల్పములందారంభమై కళ్యాణి చాళుక్యుల కాలంలో పటం చెఱువు నందు పరిపూర్ణతను సంతరించుకుంది[57]. పార్శ్వనాథ విగ్రహాలందు తలపై సర్పపు పడగలు ఛత్రరూపంలో అందంగా మలచబడినాయి. పార్శ్వనాథుని విడి ప్రతిమాశిల్పాలు వేములవాడ, కోరుట్ల, కరీంనగర్ నందున్నాయి. పద్మాసనంలో కూర్చొని ధ్యానముద్రలో నున్న తీర్థంకరుల విగ్రహాలు వేములవాడ, పొట్లపెల్లి, పొలాస, ధర్మపురి సమీపాన నున్న నక్కలపేట మున్నగు ప్రదేశములందు కనిపిస్తాయి.

## ఆధార గ్రంథములు

(References)

1. M.L.Nigam, *Sculptural Art of Andhra*, p.1.
2. M.Radha Krishna Sarma, *Op.cit.* p. 129, pl. 131
3. E.B.Havell, *Indian Sculpture and Painting*, p. 66
4. *E.H.I.*, Vol.I, part I, p. 35
5. I.K.Sarma, "A Unique ushnisha from Amaravathi", *JAHRS*, Vol. XXXV, p. 284
6. *Ibid*, p. 281
7. Late Jitendranath Banerjea, *Op.cit*, p. 359, pl.XV, Fig.1
8. C.Sivaramamurthi, *Early Andhra Art and Iconography*, p. 3, Fig.12
9. *Ibid*, Fig. 11&13
10. B.Rajendra Prasad, *Op.cit.*, p. 70
11. Stella Kramrisch, *The Art of India*, p.203, pl.57
12. B.Rajendra Prasad, *Temple Sculpture of A.P.*, p. 15
13. Late Jitendranath Banerjea, *Op.cit.*, pp. 514-518
14. M.RadhaKrishna Sarma, *Op.cit.*, p. 223
15. *EHI*, Vol.II, p. 508, PL.CXLV
16. *IAPKD*, No.25, pp. 64-71
17. Abdul Waheed Khan, *An early sculpture of Narasimha*, 1964, pp. 1&2
18. M.Radha Krishna Sarma, *Op.cit.*, p. 227
19. *EHI*, Vol. I, part I, p. 228
20. Late Jitendranath Banerjea, *Op.cit.*, p.454
21. Vidya Dehejia, *Early stone temples of orissa*, p. 195
22. *EHI*, Vol.II, part I, pp. 69&70
23. Danielou Alain, *Hindu polytheism*, p. 452
24. M.L.Nigam, *Op.cit.*, pp. 38 & 46
25. *IAPKD*, No.38, pp. 106-111
26. S.Gopala Krishna Murthy, *The Sculpture of the Kakatiyas*, Fig. 31&32
27. *EHI*, Vol.II, part I, p. 108
28. G.R.Varma, "Surya - Vishnu worship in Andhra" *JAHRS* Vol.XXIX, parts I & II, pp. 69-72
29. C.Sivaramamurti, *Op.cit.*, p. 2, Plate 3
30. Late Jitendranath Banerjea, *Op.cit*, p. 440
31. Debala Mitra, *Panderthan, Avantipur and Martand.*, A.S.I., pp. 6 & 79. PL. XV A&B.
32. Debala Mitra, *Konark*, p. 6
33. H.D.Bhattacharya, "Religion and philosophy" Chapter XI, *The History and Culture of the Indian People*, Bharatiya Vidya Bhavan, Vol.IV, pp. 334, 335.

34. M.Rama Rao, *Select Andhra Temples*, p. 9
35. B.Rajendra Prasad, *Op.cit.* p.35, Fig. 19
36. తెలంగాణ శాసనములు, No. 21, pp 173-177
37. S.Ramakantham, *Op.cit.*, pp. 14-16
38. M.Radha Krishna Sarma, *Op.cit.*, pp.51,56 plates 99 & 100
39. *IAPKD*, No.8, p. 23
40. *Ibid*. No.9, p. 25
41. M.Radha Krishna Sarma, *Op.cit.*, pp. 131&241
42. T.Vedantam (ed), *Op.cit*, p. 161
43. R.S.Gupte, *Iconography of Hindus, Buddhists and Jains*, p. 52.
44. V.V.Krishna Sastry, *Op.cit.*, pp. 223, 224. plates 93,94,95.
45. *Ibid*, p.223, pl. 82.
46. M.L.Nigam, *Op.cit*, pp.54 & 55
47. Late Jitendranath Banerjea, *Op.cit*, p. 505
48. M.L.Nigam, *Op.cit.*, p. 55
49. B.Rajendra Prasad, *Op.cit.*, p.42
50. M.L.Nigam, *Op.cit.*, p. 56
51. *Ibid*, p. 92
52. B.Rajendra Prasad, *Art of South India*, p. 171
53. *IAPKD*, Nos. 3,4,5,14,17
54. S.Gopala Krishna Murty, *Jain vestiges in Andhra*, p. 44.
55. M.L.Nigam, *Op.cit.*, p. 62
56. *EA*, Vol. II, pp. 21-28
57. M.L.Nigam, *Op.cit.*, p.99

## అనుబంధం

# జిల్లాలోని పర్యాటక కేంద్రాలు

ఉత్తర తెలంగాణాలో గోదావరి నానుకొని దక్షిణంగా ఉన్న కరీంనగర్ జిల్లాలో అనేక పర్యాటక కేంద్రాలున్నాయి. ఈ జిల్లాలోని మానేరు, గోదావరి నదుల తీరములందు అనేక చరిత్రపూర్వయుగపు స్థావరాలున్నాయి. అంతేకాక బౌద్ధ జైన స్థావరాలు, కళాత్మక దేవాలయాలు, కోటలు పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము పర్యాటక రంగానికి అధిక ప్రాధాన్యత నిస్తున్న నేపథ్యంలో 2002 జనవరి నెలలో మూడు రోజుల పాటు కరీంనగర్‌లో శాతవాహన కళోత్సవాలు వైభవోపేతంగా జరిగాయి. అనేక మంది కళాకారులకు వారి ప్రతిభాపాటవములను, కళాకౌశలాలను ప్రదర్శించే అవకాశం లభించింది. 2003 జనవరి నెలలో గూడా ఈ ఉత్సవాలు జిల్లా అంతట మరల నిర్వహించబడినాయి. పర్యాటక కేంద్రాలుగా రూపు దిద్దుకుంటున్న పుణ్యక్షేత్రాలు, తీర్థయాత్రల వివరాలు ఈ క్రింద తెలుపబడినాయి.

త్రిలింగ దేశంగా పిలువబడుచున్న ఆంధ్రదేశంలో శ్రీశైలం, ద్రాక్షారామంలతో పాటు కరీంనగర్ జిల్లాలోని కాళేశ్వరం ఒకటి. గోదావరి, ప్రాణహితల సంగమమందున్న కాళేశ్వరం బహురమ్యమైన తీర్థక్షేత్రం. ఒకే పానవట్టంపై కాళేశ్వరుడు, ముక్తేశ్వరుడు అనే రెండు లింగాలు ఉండటం ఇక్కడి విశేషం. లింగాల నాసికా రంధ్రాల్లో ఎంత నీరు లేదా ఎన్ని పాలు పోసినా అవి సమతలంగా కనిపించడం అద్భుతమైన అంశం. ఈ నీరు లేదా పాలు గోదావరిలో కలుస్తాయని స్థానికుల నమ్మకం. దక్షిణ కాశీగా పిలువబడుచున్న వేములవాడ వేయి సంవత్సరాల సుప్రసిద్ధ శైవక్షేత్రం. మూలవాగు ఉత్తర తీరాన ఈ క్షేత్రం నిలిచి ఉంది. గ్రామం మధ్యలో నున్న చెఱువుపై క్రీ.శ. 1083లో నిర్మింపబడిన శ్రీరాజరాజేశ్వర దేవాలయం పుట్టు వెంట్రుకలు తీయుటకు, కోడెలను సమర్పించుటకు దక్షిణ భారతంలోనే ప్రసిద్ధిగాంచింది. గోదావరి తీరమందున్న ధర్మపురి లక్ష్మీనరసింహక్షేత్రం మరొక పర్యాటకకేంద్రం. ఇచట గోదావరి నది ఉత్తరం నుండి దక్షిణమునకు ప్రవహించుట ప్రత్యేకత. అనాది నుండి వేలసంఖ్యలో భక్తులు పవిత్ర గోదావరి నది స్నానాలు ఆచరిస్తూ ఈ దివ్యక్షేత్రాన్ని సందర్శిస్తున్నారు. కరీంనగర్‌కు ఉత్తరాన 35 కి.మీ. దూరంలో కొండగట్టు దేవస్థానం ఉంది. ప్రకృతి అందచందాల మధ్య గుట్టపై నున్న ఈ దేవాలయం భక్తులను ప్రత్యేకంగా హనుమద్దీక్షాభక్తులను విశేషంగా ఆకర్షిస్తుంది. ఇచట పర్యాటకులకు విశ్రాంతి వసతి గృహాలున్నాయి. గోదావరి తీరమందున్న మంథని వేద పండితులకు అనాదిగా ప్రసిద్ధి చెందింది. ఇచటి గౌతమేశ్వరాలయం, శీలేశ్వర, సిద్ధేశ్వరాలయాలు ఇంకా 20 ఇతర దేవాలయాలన్ని చూడదగినవే. భీందేవరపల్లి మండలంలోని కొత్తకొండ వీరభద్రస్వామి దేవాలయం,

ఓదెల మండల కేంద్రమందున్న మల్లన్న దేవాలయం, ఇల్లంతకుంట సీతారామాలయం జిల్లాలో భక్తులను, పర్యాటకులను ఆకర్షిస్తున్న పుణ్యక్షేత్రాలు.

కరీంనగర్ సమీపమందున్న నగునూరు త్రికూటాలయం శిల్ప సంపదకు కాణాచిగా నిలిచి ఉంది. హుజూరాబాద్‌కు సమీపంలో నున్న గొడిశాలలోని పంచలింగాల ఆలయాలు నేడు నిర్మానుష్య ప్రదేశంలో ఉన్నా చక్కటి వాస్తు శిల్పంతో చుట్టు ప్రక్కల గ్రామాల ప్రజలను ఆకర్షిస్తున్నాయి. బెజ్జంకి గుట్టపై నున్న నరసింహస్వామి దేవాలయ మంటప మధ్య నాలుగు స్తంభములపై చెక్కబడిన సాంఘిక, పౌరాణిక గాథలనేకములు చూపరుల మనస్సును రంజింపజేస్తాయి. మంథనికి సమీపంలో నున్న ఖమ్మంపల్లి హ్యామ్లెట్ చంద్రవెల్లిలో మానేరునది ఒడ్డున నిర్మానుష్య ప్రదేశంలో నున్న శివాలయం అత్యంత శోభాయమానంగా ఉంది. ఇక్కడ మానేరునది ప్రకృతి సోయగాలతో ఆహ్లాదకరంగా ఉంటుంది. మెటుపెల్లి సమీపాన మల్లాపూర్ మండలంలో గోదావరి తీరాన గుట్టబోరుపై నున్న వాల్గొండ త్రికూటాలయం రమణీయమైన ప్రకృతి శోభతో అలరారుచున్న ప్రదేశం. కుటుంబ సమేతంగా విహార విందు భోజనాలకు వాల్గొండ, నీరకుల్ల, చంద్రవెల్లి, కోటిలింగాల లాంటి నదీతీర ప్రదేశాలు మిక్కిలి సౌకర్యంగా ఆనందదాయకంగా ఉంటాయి. ప్రధానంగా నగునూరు, గొడిశాల, చంద్రవెల్లి, మంథని, కొత్తపెల్లి, కటుకూరులందున్న కాకతీయుల కాలపు దేవాలయాలు, శిల్పసంపదను, నాటి శిల్పుల పనితనాన్ని ప్రతిబింబింపజేస్తాయి. మంటపములందలి దూలాల పార్శ్వములు నర్తకీమణులతో, మృదంగ వాద్యకారిణులతో, బాకలనూదు భామలతో, తాళాలను మ్రోగించు తరుణులతో దివ్యంగా మలచబడినాయి. లోకప్పు శిల్పము మిక్కిలి రమణీయము. వేములవాడ సమీపమున మూలవాగు దక్షిణ తీరానన్న నాంపెల్లి, జగిత్యాల సమీపాన గల కొండగట్టు క్షేత్రములందు ఘాట్‌రోడ్ల నిర్మాణం చేపట్టబడింది. ప్రభుత్వము వీటిని చక్కటి పర్యాటక కేంద్రాలుగా మార్చు ప్రయత్నంలో ఉంది. మంథనికి 22 కి.మీ. దూరంలో ఉన్న అడవిసోమనపల్లి వద్ద గల నాలుగు గుహాలయాలు చూడదగ్గవి. ఇవి మానేరు సమీపంలో దట్టమైన అడవీ ప్రాంతంలో ఉన్నాయి.

## చారిత్రకకోటలు

కరీంనగర్ సమీపమందున్న ఎల్గందల్ ఖిలా గిరిదుర్గము. కేశవపట్నం మండలంలోని మొలంగూర్ కోటగూడా గిరిదుర్గము. జగిత్యాల యందు 1747లో ఫ్రెంచి ఇంజనీర్ల సాంకేతిక సహకారంతో నిర్మింపబడిన కోట స్థలదుర్గము. మహదేవ్‌పూర్ అటవీ ప్రాంతపు గుట్టపై నిర్మింపబడిన కాకతీయుల కాలపు ప్రతాపగిరి కోట వనదుర్గము మరియు గిరి దుర్గము. కమాన్‌పూర్ మండలంలో ఉన్న రామగిరి దుర్గము శాతవాహనుల కాలముదని ప్రతీతి. ఇది వనమూలికలకు సుప్రసిద్ధము. ఔరంగజేబు ఇచట బస చేసినప్పుడు ప్రకృతి అందాలకు ముగ్ధుడై ఇది చక్కటి విశ్రాంతి ప్రదేశమని ప్రశంసించాడు. అందుకే దీనిని ఆరాంగిరి (Aramgiri) అని పిలిచాడు. అనేక చదరపు మైళ్లు విస్తరించి ఉన్న రామగిరిదుర్గము పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తుంది.

## విశ్రామ, విలాస పర్యాటక స్థలాలు

మానేర్ నదిపై నిర్మింపబడిన లోయర్ మానేర్‌డ్యామ్ కరీంనగర్ పట్టణ సరిహద్దులో ఉంది. ఈ డ్యామ్‌ప్రక్కనే ఆహ్లాదకరమైన ఉజ్వల పార్క్ అనేక కృత్రిమ కళాఖండాలతో రూపుదిద్దుకుంది. వేలాది మంది ఈ డ్యామ్‌ను, పార్కును సందర్శిస్తూనే ఉన్నారు. సిరిసిల్ల ప్రాంతంలో మానేరునదిపై కట్టబడిన నర్మాల్ ప్రాజెక్ట్ గూడా వినోద విహారస్థలము. శనిగరం గుట్టల మధ్య నున్న స్వాభావిక మైన అనంతసాగర్ చెఱువు దర్శనీయము. శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్ ప్రధానకాలువపై కోరుట్ల సమీపంలో నిర్మింపబడిన సైఫన్ ఆధునిక సాంకేతిక పరిజ్ఞానమునకు ప్రతీక. ఈ కోరుట్లకు ఉత్తరమున 6 కి.మీ. దూరంలో పైడిమడుగు గ్రామమందున్న అతిపెద్ద మర్రి చెట్టు తరతరాల నుండి ఈ ప్రాంతవాసుల దృష్టినాకర్షిస్తుంది. ఈ మర్రిచెట్టు చెన్నై (మద్రాసు) అడయార్ మర్రిచెట్టును పోలి ఉంది. వేలాది మంది ఈ చెట్టు క్రింద విందుభోజనాలు ఏక సమయంలో చేయువీలుంది. చుట్టు ప్రక్కల గ్రామస్థులు శ్రావణమాసంలో వనభోజనమునకై వచ్చి పూజలు జరిపి వంటలు చేసుకుంటారు. కొన్ని ఎకరాల స్థలంలో విస్తరించియున్న ఈ పెద్ద మర్రిచెట్టు క్రింద వేల సంఖ్యలో నున్న జనముతో సభలు, సమావేశాలు జరుపవచ్చు. ప్రకృతి రమణీయతకు, నదీజలాల తళతళ మెరుపులకు, పక్షుల కిలకిలా రావములకు, పచ్చని చెట్లకు ఆలవాలమై ప్రకృతి సోయగాల నడుమ విరాజిల్లుచున్న ఏకాంత ప్రదేశాలైన, గోదావరి తీరాననున్న వాల్గొండ, కాశీపేట, మానేరు ఒడ్డుననున్న చంద్రవెల్లి, నీరకుల్ల ప్రాంతాలు దర్శనీయాలు.

## పర్యావరణ హిత పర్యాటకం

ప్రకృతిలో సమతుల్యాన్ని నిలుపుటకై జనావాసములతో పాటు అడవులుండుట అవశ్యకం. కరీంనగర్ జిల్లాలోని రాఖీ గుట్టలు, శనిగరం మరియు గర్రెపెల్లి, వెమలకుర్తి గుట్టలు, రాయికల్ సమీపమందున్న బోర్నపెల్లి అడవులు, సారంగాపూర్ అటవీ ప్రాంతం పర్యావరణహిత పర్యాటక ప్రదేశాలుగా చెప్పు కోవచ్చు. కరీంనగర్ జిల్లా తూర్పు ప్రాంతమంతయు ప్రధానంగా మంథని, మహదేవ్‌పూర్ అడవులు అనాది నుండి నేటి వరకు సుప్రసిద్ధములు. రామగిరి దుర్గము చుట్టూ దట్టమైన అడవులున్నాయి. ప్రతాపగిరికోట వనదుర్గము. మంథని నుండి కాళేశ్వరం వరకున్న దట్టమైన అడవుల గుండా ప్రయాణం మనోరంజకంగా ఉంటుంది. అటవీశాఖవారు వన సంరక్షణ సమితులను గ్రామాలందు నెలకొలిపి సామూహిక అడవుల పెంపకమునకు దోహదపడుచున్నారు. ఈ జిల్లాలోని గౌరీగుండం జలపాతం రామగిరి దుర్గము సమీపాన ఉంది. సర్వదా నీటినందించు ఈ జలపాతం పర్యాటకులకు కనువిందు చేస్తుంది. సిరిసిల్ల ప్రాంతంలోని కోనరావుపేటకు దగ్గరలో నున్న భీమునిమల్లారెడ్డిపేట ప్రకృతి రామణీయత వర్ణనాతీతం.

## గ్రామీణ పర్యాటకం

భారతదేశపు అందాలన్నీ పల్లె సీమలందే అగబడుతాయి. వ్యవసాయానికి, గ్రామీణ పరిశ్రమలకు, కళలకు వేల సంవత్సరాల నుండి పల్లె సీమలే ఆయువుపట్టుగా నిలిచాయి.

కరీంనగర్ జిల్లాలో గూడా గ్రామీణ ప్రాంతంలో అనేక వింతలు అగబడుతాయి. విసిగి వేసారిన పట్టణ ప్రజలు ఒకింత సేద దీర్చుకోవడానికి సెలవు దినాలలో పల్లె ప్రాంతాలే దర్శనీయస్థలాలు. పట్టణాలలోనున్న నేటి విద్యార్థులు పల్లెలలోని అనేక సంప్రదాయ ప్రక్రియలనెరుగరు. వ్యవసాయానికి పల్లెలలోని ప్రజలు అనేక రీతులలో పొలాలకు నీరందిస్తుంటారు. వ్యవసాయపు బావుల నుండి ఎడ్లు, ఎనుపోతుల సహాయంతో మోట పద్ధతి ద్వారా నీరందిస్తారు. మోటకొట్టేబావులను మోటబావులంటారు. కొన్ని చోట్ల రాట్ పంపులను వాడుతారు. వేయి సంవత్సరాల క్రితం శాసనాల్లో దేవాలయాలకు రాటణములను దానంగా ఇచ్చిన అనేక ఆధారాలున్నాయి. వేములవాడ చాళుక్యుల, కళ్యాణీ చాళుక్యుల శాసనాల్లో వీటి ప్రస్తావన ఉంది. ఆర్థికబలం లేని వారు నేటికీ ఒకే వ్యక్తి ఏతం అను పద్ధతి ద్వారా పొలానికి నీరందిస్తాడు. ఒక పెద్ద వాసము లేదా బొంగు చివరలో తోలు బొక్కెన లేదా ఇనుప బొక్కెన నిలిపి దానిని క్రిందికి పైకి లేపుచూ నీటిని తోడుతుంటాడు. నువ్వుల నుండి నూనె తీయుటకు గానువులుంటాయి. ఈ గానువులందు ధాన్యము నిలిపి దానిని చుట్టూ తింపుటకు ఎడ్లు లేదా ఎనుపోతులు కడుతారు. గానువులను గూడా దేవాలయాలకు దానాలుగా యిచ్చినట్లు చాళుక్యుల శాసనాలు తెలుపుతున్నాయి. ఈ తరం పట్టణ బాలలకు ఏతం, మోట, రాటు, గానువు మున్నగునవన్నియూ వింతలుగానే కనిపిస్తాయి. అందుకే పట్టణాలలోని బాలబాలికలు పల్లెల సిరులను సందర్శించుట అత్యావశ్యకం.

## గ్రామీణ కళలు

వేల సంవత్సరాల నుండి గ్రామీణ ప్రాంతాలలో వెలసిన కళలు నేటి హైటెక్ యుగం వరకు సజీవంగా ఉన్నాయి. వీటిలో వీధినాటకాలు, తోలుబొమ్మలాటలు, ఒగ్గుకథలు, బుఱ్ఱకథలు, హరికథలు, ఎల్లమ్మ కథలు, పాండవుల కథలు నేటికీ పల్లెలలో చెప్పుకోదగిన వినోదప్రక్రియలు. ఉన్నత కుటుంబాలలో నాట్యం, సంగీతంతో పాటు హార్మోనియం, తబలాలాంటి వాద్యాలను వాయించడం గ్రామీణ ప్రాంతాల్లో కనిపిస్తుంది. జానపద గేయాలు నాడు నేడు ప్రజల హృదయాలను చూరగొన్నాయి. పాండవుల జాతివారు కథలు చెబుతుంటారు. బోనాలు తీయు ఆచారం పల్లెలలో ఎక్కువగా ఉంది. సికింద్రాబాద్‌లోని మహంకాళి దేవాలయంలోని బోనాలపండుగ పట్టణ వాసులకు ఆనందదాయకంగా ఉన్నట్లే పరిమిత పరిధిలో పల్లెలందు గూడా బోనాలు దివ్యంగా జరుపుకుంటారు. ఇందులో గొల్ల, కురుమ జాతులవారు విశేషంగా పాల్గొంటారు.

అనాది నుండి ఆడవారి బతుకమ్మ (బ్రతుకమ్మ) పాటలు జనాన్ని విశేషంగా ఆకర్షిస్తూనే ఉన్నాయి. దసరా పండుగకు ముందు దాదాపు పక్షము రోజులు ఈ బతుకమ్మ పాటలు ప్రతి ఇంటిలో, వీధిలో, గ్రామంలో సాయంకాల సమయమందు వినిపిస్తూనే ఉంటాయి. పూలతో చేసిన బతుకమ్మను లేదా వెదురుబద్దలతో రంగు కాగితాలనతికించి తయారు చేసిన బొడ్డెమ్మను

మధ్యలో నిలిపి పదుల, వందల సంఖ్యలో గ్రామీణ స్త్రీలు పాటలతో ఈ ఉత్సవములను నేటికీ బ్రహ్మాండంగా జరుపుతుంటారు. ఒగ్గు కథలు విశేషంగా గొల్ల, కురుమ జాతులను ఆకర్షిస్తాయి. యక్షగానాలు విస్తృతంగా వ్యాప్తిలో ఉన్నాయి. పండుగలందు స్త్రీల బృందములు, పురుషుల గుంపులు వేర్వేరుగా కోలాటపు ఆటలు కర్రకోలలతో ఆడుతుంటారు. ఇలాంటి కోలాటపు శిల్పాలు 12వ శతాబ్దానికి చెందిన బెజ్జంకి నరసింహాలయ స్తంభాల ఉపరితలలాపై దర్శనమిస్తాయి. ఆనాటి కోలాటపు ఆటలు నేటికీ పల్లెలలో, స్త్రీ పురుష సమాజములందు కనిపిస్తాయి. డప్పునృత్యాలు నాడు నేడు సర్వసాధారణం. పల్లెలలో డప్పు వాద్యము గొప్ప వినోదం. అనేక మంది పురుషులు సమూహముగా ఏర్పడి నృత్యం చేయుచూ శృతిలయ బద్దంగా డప్పులు మ్రోగించు ప్రక్రియలు నేటికీ మనోరంజకములు. బ్రాహ్మణ కుటుంబాలలో శాస్త్రీయ సంగీతం, నాట్యం, వాద్యం నేర్చిన స్త్రీలు, పురుషులు అధికంగా కనిపిస్తారు. నేటి రోజులలో పల్లెలందు గూడా కూచిపూడి, ఆంధ్రనాట్యం, శివతాండవం లాంటివి దర్శనమిస్తాయి. బంజారాలలో, హరిజన గిరిజన జాతులలో బంజారా నృత్యం కనిపిస్తుంది. గ్రామాలలో గూడా అనేక సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహింపబడుతాయి. దేవాలయాలందు జరుగు హరికథలకు వందలాది మంది హాజరవుతుంటారు. ప్రత్యేకంగా పురాణ కార్యక్రమములందు ఆడవారు పాల్గొంటారు. ఎల్లమ్మకథలు, బుఱ్ఱకథలు, హరికథలు సర్వత్రా వ్యాపించిఉన్నాయి. చిర్రగోనే (గిల్లిదండ), గోలీలాట, చిరుగుడు (కబడ్డీ), పచ్చీసు, పుంజీతం, తొక్కుడుబిల్ల, కచ్చకాయలాట, చెమ్మచెక్క, దాగుడు మూతలు మున్నగునవి పెట్టుబడిలేని వినోదపు ఆటలు.

రామడుగు శిల్పకళకు కేంద్రం. దేవాలయాల దేవతా శిల్పాలు ఇచటి నుండి వందల, వేల సంఖ్యలో దూరప్రాంతాలకు ఎగుమతి చేయబడుతాయి. కాకతీయుల కాలం నుండి శతాబ్దాల తరబడి రామడుగు శిల్పులు, అచటి శిల్పములు జగిద్విఖ్యాతములు. రామడుగులోని ప్రతి ఇల్లు దాదాపు శిల్పకళాకేంద్రం. దేవతల శిల్పాలేగాక నాయకుల శిల్పాలు గూడా తయారు చేయడంలో ఇచటి శిల్పులు సిద్ధహస్తులు.

కరీంనగర్ జిల్లా వెండి ఫిలిగ్రీ పనికి నైజాం కాలం నుండి ప్రసిద్ధి చెందింది. ఎల్లందల్, జగిత్యాల, కరీంనగర్ ప్రాంతములందు స్వర్ణకారులు వెండి ఫిలిగ్రీ కళకు జీవం పోశారు. వెండి నుండి వెంట్రుక మందం తీగెను లాగి అద్భుతమైన కళాఖండాలను సృష్టిస్తారు. ఫిలిగ్రీ పనితనంతో సృష్టించిన నెమళ్లు, హంసలు, చేపలు, కుంకుమ బరణీలు, పాన్‌దాన్‌లు, అత్తర్‌దాన్‌లు, ఓడలు మున్నగు వస్తువులు ఎన్నెన్నో ఉన్నాయి. భారత ప్రధాని వాజ్‌పేయికి జన్మదిన కానుకగా ఢిల్లీలో బుధవారం తేది 25 డిసెంబర్ 2002 రోజున వెండి తీగెలతో రూపొందించిన భారతమాత ప్రతిమను కరీంనగర్ జిల్లా ఫిలిగ్రీకళాకారులు మురళి, చక్రపాణి బహుకరించడం అభినందనీయం.

పల్లెలు గృహపరిశ్రమలకు, గ్రామీణ పరిశ్రమలకు నిలయాలు. సిరిసిల్ల చేనేత పరిశ్రమకు పేరుగాంచింది. నల్లపరంధాములు లాంటి సిరిసిల్ల చేనేత పారిశ్రామికులు అగ్గిపెట్టెలో దాచదగిన

చీరలు తయారుచేసి ప్రభుత్వ ప్రశంసలు, బహుమానాలందుకున్నారు. మెటుపెల్లి ఖాదీ పరిశ్రమకు, కోరుట్ల బీడి పరిశ్రమకు ప్రసిద్ధి చెందాయి. అర్ధశతాబ్దం క్రింది వరకు కోరుట్లలో తయారు చేయబడిన దొడ్డు కాగితం పాత హైదరాబాద్ రాష్ట్రమంతటా వాడబడింది.

గ్రామీణ ప్రాంతాలలో గంగిరెద్దుల ప్రదర్శన ప్రత్యేక ఆకర్షణ. సంక్రాంతి పండుగ సందర్భంలో గంగిరెద్దుల వాండ్లు ఊరూరా తిరుగుతుంటారు. కోళ్లపందాలు, పొట్టేళ్ల పందాలు, ఎడ్లపందాలు అచ్చటచ్చట నేటికీ జరుగుతుంటాయి. రామగుండం జాతీయ థర్మల్ విద్యుత్ కేంద్రం, గోదావరిఖనిలోని సింగరేణి బొగ్గుగనులు, ఎరువుల కార్మాగారం చూడదగ్గవి.

దేవాలయాలతో పాటు దర్గాలు దర్శనీయములే. 8 శతాబ్దాల నుండి కొలువబడుచున్న బిజిగిరిషరీఫ్ దర్గా కొండల మధ్యన అడవిలో ప్రకృతి శోభలతో విరాజిల్లుతుంది. ప్రతి ఏటా జరుగు ఉరుసునకు వేలాది మంది మహ్మదీయ, హిందూ భక్తులు హాజరవుతుంటారు.

కరీంనగర్ పట్టణమునకు వచ్చే పర్యాటకులు అచటి L.M.D. డ్యామ్, ఉజ్వలపార్క్ సమీపమందున్న ఎల్గందుల ఖిలా, నగునూరు, చొప్పదండి దేవాలయాలు తప్పకుండా దర్శించాలి. జగిత్యాల ప్రాంతానికి వచ్చిన పర్యాటకులు జగిత్యాల కోట, పొలాస, ధర్మపురి, రాయికల్, కొండగట్టు, మల్లన్నపేట దేవాలయాలను దర్శించడం ఆవశ్యకం. కోరుట్ల ప్రాంతంలో సైఫన్, పైడిమడుగు మర్రిచెట్టు మల్లాపూర్, వాల్గొండ దేవాలయాలు దర్శింపదగ్గవి. మంథని ప్రాంతానికి వచ్చిన పర్యాటకులకు రామగిరి కోట, ప్రతాపగిరి దుర్గము, అడవిసోమనపెల్లి గుహాలయాలు, కాళేశ్వరం, జనగాం, చంద్రవెల్లి, కాశీపేటలలోని దేవాలయాలు, సుల్తాన్‌బాద్ సమీపమందున్న ధూళికట్ట బౌద్ధస్థూపం మరియు కదంబాపూర్‌లోని బృహత్ శిలాసమాధులు దర్శనీయములు. సిరిసిల్ల ప్రాంతానికి వచ్చిన పర్యాటకులు వేములవాడ, నాంపెల్లి, నర్మాల్‌ప్రాజెక్ట్, కోనరావుపేట సమీపమున నున్న భీమునిమల్లారెడ్డిపేట ప్రకృతి సోయగాలు తప్పక దర్శించి తీరాలి. హుజూరాబాద్ ప్రాంతమునకు వచ్చిన పర్యాటకులు గొడిశాల, జమ్మికుంట, బిజిగిరిషరీఫ్, ముత్తారం, కొత్తకొండ, కొత్తగట్టు, సర్వాయిపేట మున్నగు ప్రాంతాలు దర్శించాలి.

ఈ విధంగా కరీంనగర్ జిల్లా అనేక ప్రాచీన దేవాలయాలకు, కోటలకు, కళలకు, నదులకు, వాగులకు, వంకలకు, గుట్టలకు, అడవులకు నిలయంగా ఉండి పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తుంది. ఆంధ్రదేశం నుంచే కాక పొరుగు రాష్ట్రాల పర్యాటకులకు కరీంనగర్, వేములవాడ, నాంపెల్లి, కొండగట్టు, ధర్మపురి, కాళేశ్వరం దేవాలయాలు, ఎల్గందల్, రామగిరి, జగిత్యాల, ప్రతాపగిరి దుర్గములు తనివి తీరా సందర్శింపదగిన పర్యాటక కేంద్రాలు. ప్రతిచోట ప్రభుత్వ వసతి గృహాలున్నాయి. విహార విందు భోజనాలకూ, సెలవు దినాలను సద్వినియోగం చేయుటకూ ఇవన్నియూ సానుకూల ప్రదేశాలే. కొద్ది కాలంలోనే కరీంనగర్ జిల్లాలోని అనేక ప్రాంతాలు గొప్పపర్యాటక కేంద్రాలుగా రూపుదిద్దుకుంటాయి అనటంలో సందేహం లేదు.

# సంప్రదించిన గ్రంథములు

## (BIBLIOGRAPHY)


Altekar A.S. : *The Rashtrakutas and Their Times,* Poona, 1954,

Anand, Mulk Raj: *Hindu View of Art,* Asia Publishing House, Bombay, 1957.

–: *Ajanta,* Marg Publications, Bombay, 1971.

Anne-Marie Gaston : *Siva in Dance, Myth and Iconography,* Oxford University Press, Delhi, 1982.

Asha Kalia : *Art of Osian Temples,* Abhinav Publications, New Delhi, 1982.

Avadhani, V.V.S. : *Guide Book to Victoria Jubilee Museum, Vijayawada,* Hyd, 1976.

Bawa, V.K. (ed) : *Aspects of Deccan History,* Institute of Asian studies, Hyd, 1975.

Benjamin, Rowland : *The Art and Architecture of India,* Penguin Books, Baltimore, USA, 1971.

Bhattacharya, B.C. : *The Jaina Iconography,* Motilal Banarsidas, Delhi, 1947.

Bhattacharya, H.D. : 'Religion and Philosophy', *The History and Culture of Indian People,* Chapter XI, Bharatiya Vidya Bhavan, Vol, IV, Bombay.

Brown, Percy : *Indian Architecture* (Fifth edition), Bombay, 1965.

Casale, A. : *A Cultural History of India,* The Macmillan Company of India, Madras, 1973.

Charles, Fabri : *Discovering Indian Sculpture,* New Delhi, 1970.

–: *A History of Indian Dress,* Orient Longmans, 1961.

Cousens Henry : *The Chalukyan Architecture,* Archaeological Survey of India, 1926.

Denielou, Alain : *Hindu Polytheism,* London, 1964.

Dasgupta, S.N. : *Fundamentals of Indian Art,* India, New Delhi, 1978.

Debala Mitra : *Sanchi,* Archaeological Survey of India, New Delhi, 1978.

–: *Panderthan, Avantipur and Martand,* Archaeological Survey of India, New Delhi, 1977.

–: *Konark,* Archaeological Survey of India, New Delhi, 1976

–: *Udayagiri and Khandagiri,* Archaeological Survey of India, New Delhi, 1975.

–: *Ajanta,* Archaeological Survey of India, New Delhi, 1980.

Desai, P.B. : *Select Stone Inscriptions of Andhra Pradesh,* Hyderabad, 1962.

–: *Jainism in South India,* Sholapur, 1957.

Devasthali, G.V. : 'Sanskrit Literature' *The History and Culture of Indian People,* Chapter IX, Bharatiya Vidya Bhavan, Vol. IV, Bombay.

Dipakranjan Das : *Temples of Orissa,* Agamkala Prakashan, Delhi, 1982.

Dubreuil, G.Jouveau : *Iconography of Southern India,* Bharatiya Publishing House, Varanasi, 1978.

–: *Dravadian Architecture,* Madras, 1917.

Fergusson James : *History of Indian and Eastern Architecture* (Second Indian edition) New Delhi, 1972.

Francesco Abbate (ed) : *Indian Art and the Art of Ceylon, Central and South East Asia,* Peerage Books, London, 1972.

Ganguli, D.C. : 'Later Chalukyas and Kalachuris of Kalyana', *The History and Culture of Indian People,* Chapter VI, Bharatiya Vidya Bhavan, Vol. IV, Bombay.

Gopala Krishna Murthy, S. *Jain Vestiges in Andhra,* Hyderabad, 1963.

–: *The Sculpture of the Kakatiyas,* Hyderabad, 1964.

–: *The Art of Lepakshi,* Hyderabad, 1970.

Gopinatha Rao, T.A. : *Elements of Hindu Iconography,* Vol. I (Parts I & II), Vol.II (Parts I & II), Indological Book House, Varanasi, 1971.

Goverdhan Singh, Mian : *Art and Architecture of Himachal Pradesh,* B.R.Publishing Corporation, Delhi, 1983.

Gupte, R.S. : *Iconography of Hindus, Buddhists, and Jains,* Bombay 1972.

–: *The Art and Architecture of Aihole,* Bombay, 1967.

Havell, E.B. : *Indian Architecture through Ages,* Asian Publication Services, New Delhi, 1972.

–: *Indian Sculpture and Painting,* Cosmo Publication, New Delhi, 1980.

–: *A Hand Book of Indian Art,* Indic Academy, Varanasi, 1972.

–: *The Ancient and Medieval Architecture of India* (Reprint), New Delhi, 1972.

Hingorani, R.P. (ed) : *Digambara Jaina Iconography,* Ashutosh Prakashan Sansthan, Varanasi, 1979.

Iswari Prasad : *History of Medieval India,* Allahabad, 1950.

Jha, D.N. : *Studies in Early Indian Economic History,* Delhi, 1980.

Jitendrantath, Banerjea : *The Development of Hindu Iconography,* Delhi, 1974.

Joanna Gottfried Williams : *The Art of Gupta India,* Delhi, 1983.

Karashima, Noboru : *South Indian History and Society,* Oxford University Press, Delhi, 1984.

Kramrisch, Stella : *The Hindu Temple,* two volumes, University of Calcutta, 1946.

–:*The Art of India* (Third edition), The Phaidon Press, London, 1965.

Krishnadeva and Nayal, B.S. : *Guide to Khajuraho Museum,* Archaeological Survey of India, New Delhi, 1980.

Krishna Sastry, V.V. : *The proto and Early Historical Cultures of Andhra Pradesh,* Hyderabad, 1983.

–: 'Terracottas from Peddabankur and Dhulikatta', *The Andhra Pradesh Journal of Archaeology,* Vol.I, Hyderabad, 1979.

–(ed) : *Annual Report of the Department of Archaeology, 1976-1977,* Hyd, 1978.

–(ed) : *Annual Report of the Department of Archaeology and Museums, 1977-1978.*

Lakshimiranjanam, K. : *Spot Lights on Telugu,* Hyderabad, 1968.

Majumdar, R.C. : 'Rise and Fall of the Prathihara Empire', *The History and Culture of Indian People,* Chapter II, Bhartiya Vidya Bhavan, Vol.V, Bombay.

'Saivism', *The History and Culture of Indian People,* chapter XVI, Bharatiya Vidya Bhavan, Vol. V. Bombay.

Mallaya, N.V. : *Studies in Sanskrit Texts on Temple Architecture,* Annamalai University, 1949.

Munn, L. (ed) : *Annual Report of the Archaeological Department of H.E.H. the Nizam's Dominions,* Hyderabad, 1925-1926.

